మొదటి భాగము






# గాంధిమహాత్ముని రచనా సంపుటి



1884-1896



లండన్‌లో విద్యార్థిగా గాంధీజీ

# గాంధీ మహాత్ముని రచనా సంపుటి

## (1884 - 1896)

మొదటి భాగము




డైరక్టర్
ఆంధ్రప్రదేశ ప్రభుత్వ జాతీయ పాఠ్యపుస్తక
ముద్రణాలయము

# జోహార్ !

మహాత్మాగాంధీ ఏదో ఒక జీవితతత్వాన్ని నెలకొల్పడానికి ప్రయత్నించ లేదు. కొత్త ఆదర్శాలనుగాని, మతాలనుగాని రూపొందించదలచుకోలేదు. బహుశా ఆయనకు అటువంటి కోరికాలేదు ; వ్యవధీలేదు. కాని ఆయనకు సత్యాహింసలమీద గాఢమైన విశ్వాసం మాత్రమున్నది. వాటిని ఆచరణలో పెట్టడానికి ఆయన ఎదుర్కోవలసివచ్చిన సమస్యల విశదీకరణమే ఆయన తత్త్వోపదేశాలు.

ఆయన దృష్టికగోచరమైన రాజకీయ సమస్యగాని, సాంఘిక మతైక సమస్యగాని, రైతుకూలీ సమస్యగాని పారిశ్రామిక కార్మిక సమస్యగాని లేదు. సత్యాహింసలు ప్రధానంగా వాటిని ఆయన పరిష్కరిస్తూనే వచ్చాడు. భారత దేశంలో తన భావాల కనుగుణ్యంగా ఆయన తీర్చిదిద్దని జీవితహాంశం ఇండియాలో ఒక్కటి కూడాలేదు. ఆయన ప్రభావం ప్రసరించని దొక్కటీలేదు. ఆహారం, వస్త్ర ధారణం, నిత్యవృత్తులు వంటి చిన్నవిషయాలు మొదలు, అస్పృశ్యత, కులభేదాలు వంటి పెద్దపెద్ద సాంఘిక సమస్యలు వరకూ ఆయన పరిశీలనకొచ్చినవే.

ఆయన అభిప్రాయాలెప్పుడూ నూతనత్వంతో తొణికిసలాడుతున్నట్లుండేవి. సాంప్రదాయాలు, ఆచారాలు వాటినెప్పుడూ బంధించలేదు. అలాగే పెద్దవైనా చిన్నవైనా, సమస్యలను పరిష్కరించే పద్ధతులుకూడా అసాధారణంగానే ఉండేవి. పైపైనచూస్తే అంగీకారయోగ్యంగా కనబడేవికావు. కాని చివరకవే విజయసాధకమయేవి. సహజంగా ఆయన ఏదోఒక పిడివాదం పట్టుకుని వ్రేలాడే స్వభావంకలవాడు కాడు. ఎప్పటికప్పుడే చేస్తూవచ్చిన ప్రయోగాలవల్ల కలిగిన నూతన వికాసాన్ని ఆయన నిరాకరించలేదు. అందుచేతనే ఒకసారి చెప్పేనుకనుక పట్టుదలకోసమైనా దానినే పట్టుకు కూచోవాలనేవాడుకాడు. వాస్తవానికి ఆయన ప్రతిపక్షులు—ఒక్కొక్కసారి ఆయన అనుచరులుకూడా—గాంధీజీ చేతలలో కొన్ని అసమంజసాలను గుర్తించేవారు. ఎవరైనా నచ్చచెప్పితే తనఅభిప్రాయాలను మార్చుకునేందుకు ఆయనెప్పుడూ సంసిద్ధంగా ఉండేవాడు. అందుచేతనే తాను చేసినపనిలో ఏదైనాలోపమున్నదని ఆయనకు నమ్మకంతోచినప్పుడు, వెంటనే తన తప్పును బహిరంగంగా అంగీకరించి సవరించుకోవడానికి సందేహించని మహత్తరమైన నైతికధైర్యాన్ని ప్రదర్శించేవాడు. తన నిర్ణయాలను, చేష్టలను,

నిష్పక్షపాతమైన తాత్త్విక విమర్శకు గురిచేస్తూ ఉండేవాడు. కనుక ఆయన చేష్టలెన్నో ఆయనభక్తులను ముగ్ధులను చేసినవంటే ఆశ్చర్యంలేదు. ఆలాగే విమర్శకులను కలవరపరచినాయన్నా విపరీతంలేదు.

అటువంటి మహనీయుని సరిగా అవగాహన చేసుకోవాలంటే ఆయన ఉపదేశాలను, ఆయన జీవిత విశేషాలను, సమగ్రంగా పరిశీలించడం చాలా అవసరం. ఏదో లీలామాత్రంగా, జీవితంలోని కొన్నిఘట్టాల నక్కడక్కడా తెలుసుకోవడం వల్ల ఆయనను అపార్థంచేసుకోవడం సంభవిస్తుంది. అది పాఠకునికి, ఆ మహనీయునికి కూడా న్యాయంచేసినట్లుకాదు. ఇంత విపులంగా గాంధీజీ రచనలనన్నిటినీ క్రోడీకరించి కూర్చడానికిదే ముఖ్యకారణం. ఈ సంపుటాలు దాదాపు 50 వరకూ ఉంటాయని నాకు చెప్పేరు.

ఇండియా ప్రభుత్వ ప్రచురణశాఖవారు, ఈ సంపుటాలను ప్రచురించడానికి సంకల్పించి, గాంధీజీ జీవితాన్ని, ఉపదేశాలను, తత్త్వాన్ని, విశ్వాసాలను బాగాపరిశీలనగా తెలుసుకోదలచినవారికి, అవసరమైన ప్రాతిపదికను ప్రసాదిస్తున్నారు. కనుక గాంధీజీ తలపెట్టినిపనిని చేయవలసిన బాధ్యత; విద్యార్థులపైనా పరిశీలితర బుద్ధిమంతులమీదా ఉన్నది. ఈ విధంగా ప్రచురణశాఖవారు తమకందిచ్చిన భోగట్టాతో, ఆయన జీవితతత్త్వాన్నిగురించి, ఉపదేశాలనుగురించి, భావాలను గురించి, కార్యక్రమాలనుగురించి, జీవితంలో ఉత్పన్నమవుతుండే అనేకసమస్యలను గురించి వేర్వేరు విభాగాలుగాచేసి చక్కగా సిద్ధాంతనిరూపణం చేయాలి. ఆయన తత్త్వంలో ప్రపంచానికంతకూ సంబంధించిన పెద్దసమస్యలూ, కేవలం వ్యక్తికి పరిమితమైన సమస్యలూ రెండూ ఇమిడి ఉన్నాయి. దాదాపు జీవితమంతా, ఆయన పెద్దవైన రాజకీయ సమస్యలతో కొట్టుమిట్టవుతూనే ఉండవల సొచ్చింది. కాని, ఆయన రచనలలో చాలావరకు సాంఘిక, మతైక, వైజ్ఞానిక, ఆర్థిక, భాషావిషయైక సమస్యలకు సంబంధించినవే.

ఆయన ఉత్తరప్రత్యుత్తరాలు జరిపించడంలో చాలా శ్రద్ధవహించేవాడు. కొంచెం ఆలోచించి బదులువ్రాయవలసిన ఉత్తరాలన్నీ ఆయన స్వయంగా వ్రాసినవే. ఆయనకు వస్తూఉండే ఉత్తరాలలో చాలావరకు వ్యక్తులకు సంబంధించిన విషయాలుగానే ఉండేవి. అయితే ఆయనిచ్చే జవాబులు, ఆలాంటి సమస్యలుగలవారందరికీ, ఉపయోగపడేటట్లుండేవి. జీవితంలో చాలాకాలం ఆయన సంక్షిప్తలేఖకుని సహాయాన్నిగాని, టైపిస్టు సహాయాన్నిగాని తీసుకోలేదు. తానువ్రాయదలచినది స్వహస్తంతోనే వ్రాసేవాడు. ఆలాంటి సహాయం విధిగా

కావలసి వచ్చినపుడుకూడా చాలావరకు స్వంతంగానే వ్రాసేవారు. కొన్ని సందర్భాల్లో కుడిచేతివ్రేళ్లతో కలంపట్టి వ్రాయలేకపోవడంకూడా సంభవించింది. కనుక, పెద్దతనంలో ఎడమచేతితో వ్రాయడమనే నేర్పరితనాన్నికూడా ఆయన అభ్యాసంచేశాడు. నూలువడకడంలోకూడా అలాంటి అభ్యాసాన్నే చేశాడు. వ్యక్తి సంబంధమైన ఉత్తరప్రత్యుత్తరాలు సాగించడానికి ఆయనకాలం చాలా వినియోగపడేది. సాధారణమైనవ్యక్తి, తనజీవితంలోని దైనందిన సమస్యల నెదుర్కోవలసిన వివిధ సమస్యలకు, ఈ విధంగా పరిష్కారమార్గాలను సూచించడం ఆయన ఉపదేశాలలో ముఖ్యమైన విషయం.

జీవితంయొక్క సమగ్రమైన స్వరూపాన్ని అవగాహనచేసుకుని, మానవసేవకు దానిని అంకితంచేసిన మనిషంటూ ఒక్కడుంటే, నిస్సందేహంగా అతడు గాంధీజీ. మహోదాత్తమైన సేవాపరాయణత్వం, తాత్త్వికదృష్టి, ఆయన లక్ష్యాలు. ఆయన చేసే చేష్టలు, చెప్పే ఉపదేశాలు నైతికంగా ఉదాత్తం గానూ, విశేషంగా ఆచరణయోగ్యంగానూ కూడా ఉండేవి. దాదాపు 60 సంవత్సరాల ప్రజాహిత జీవితంలో ఆయనెప్పుడూ కేవలం తాత్కాలిక ప్రయోజనాలకోసం తన అభిప్రాయాలను రూపొందించుకోలేదు. అనగా తాను సాధించదలచిన ఒక న్యాయమైన ఫలితంకోసం, తప్పుమార్గాల నవలంబించలేదు. తాను అవలంబింపదలచిన సాధనాలను ఎన్నుకోవడంలో ఆయన చాలా పట్టుదల చూపించేవాడు. అందుచేత ఒక్కొక్కప్పుడు సాధనం సరియైనది కాకపోతే ఫలసిద్ధికి కూడా ఆయన లక్ష్యపెట్టని స్థితికూడా లేకపోలేదు. ఏమంటే న్యాయమైన లక్ష్యం, వక్రమార్గాలవల్ల సిద్ధించదని ఆయన అభిప్రాయం. తప్పుడు మార్గాలవల్ల సాధించిన ప్రయోజనమేమైనా ఉంటే, అది న్యాయమైన ప్రయో జనంయొక్క వికృతస్వరూపమే అవుతుందని ఆయన భావం.

ఆయన రచనలు, ఉపన్యాసముల యొక్క ఈ సంపుటీకరణం వల్లకలిగే శాశ్వతమైన, నిస్సందేహమైన ప్రయోజనాలనుగురించి ప్రత్యేకంగా చెప్పనక్కర లేదు. ఆరు దశాబ్దాల కాలం అత్యుత్సాహంతో ప్రజాహిత జీవితాన్ని గడపిన మహ నీయుడైన మానవుని మాటలివి. ఒక అపూర్వమైన ఉద్యమాన్ని సృష్టించి, విజయ వంతంగా నడపించిన మహనీయుని మాటలు. అసంఖ్యాకులైన వ్యక్తులను ఉత్తేజితు లనుచేసి వారికి వెలుగు చూపిన మాటలు. ఒక నూతన జీవితవిధానాన్ని ప్రసాదించిన పలుకులు. సాంస్కృతికమైన విలువలకు గణ్యతను తెచ్చిన పలుకులు. ఫలానా కాలానికి ప్రాంతానికి మాత్రమే పనికొచ్చే పలుకులుకావు. అది శాశ్వతంగా ఉండేవాణి. యావత్తు మానవలోకానికి, అన్నియుగాలకూ ఉపయోగపడే వాక్కులు. కనుక ఆ వాణిని భద్రపరచాలనే సంకల్పం సర్వోత్కృష్టమైనసంగతి.

ఆయన విధానంలో ప్రధాన విషయమేమంటే మానవుని యందు మానవుడు అకుంఠితమైన విశ్వాసముంచడం. మానవులందరిలోనూ ఆధ్యాత్మిక సంపత్తి స్వతహాగా ఉంటుందనీ, నైతికభావం సహజంగా ఉంటుందనీ ఆయన విశ్వాసం. స్వాతంత్ర్యం, శాసనాలవల్లనూ, అధికారుల ఉత్తరువులవల్లను సిద్ధించదని ఆయన అభిప్రాయం. వైజ్ఞానిక వికాసంవల్లనూ, యాంత్రికసాధనాల అభివృద్ధివల్లనూ కూడా సిద్ధించదని ఆయనమతం. నిజమైన స్వాతంత్ర్యం సంఘానికి సిద్ధించాలంటే, సంఘాన్నందుకు సంసిద్ధపరచాలి. వ్యక్తులతోటే అటువంటి కార్యక్రమం ఆరంభం కావాలి. భారత జాతీయజీవనం ఎంతకాలమైతే ఆయన లక్ష్యాలననుసరించి, ఆయన అభిప్రాయాల ప్రకారం పెంపొందించబడుతుందో, అంతవరకూ అది ప్రజల నుత్తేజపరుస్తుంది. స్వాతంత్ర్యభారత మాయన ఆశయాల సిద్ధికి కృషిచేస్తూ, క్రమక్రమంగా ఉన్నతమైన సమైక్యతను సాధించినట్లయితే సాంస్కృతిక సరిహద్దులను విస్తీర్ణంచేయగలుగుతుంది. ఒక వెలుగుబాటను చూపించకలుగుతుంది.

కాని ఆయన అభిప్రాయాలను చాలా వాటిని పూర్తిగా అవగాహన చేసుకోవలసిఉన్నది. ఏ సాంఘికవ్యవస్థ యొక్క స్వాతంత్ర్యస్థితినైనా పరీక్ష చేయాలంటే, ఆ సంస్థ క్రియలో తన సభ్యులకిచ్చే స్వేచ్ఛయే ఆధారమని అందరూ అంగీకరిస్తారు. కాని కేంద్రీకృతమైన పారిశ్రామిక, సాంఘిక రాజకీయ సంస్థలలో కొంతవరకు వ్యక్తిస్వాతంత్ర్యము తగ్గిపోతుందనే సంగతి అంతగా గుర్తింపబడడంలేదు. ఈ ఉభయస్థితులకు మధ్యస్థంచేసే విధానమొకటి కనిపెట్టి, దాని నంగీకరించాలి. ఆయన ఆర్థికవిధానాలుసాధారణంగా లేమితో కూడినవి కాకపోయినా, నిష్ఠతోకూడి ఉండడంచేత కొంతకలవరం కలిగిస్తాయి. ఏవిధమైన రంగుశింగారాలు లేకుండా ఉండడంచేత ఆయన ఏర్పరచిన క్రమశిక్షణ కఠినమైన నైతిక నిష్ఠలాగున కనబడుతుంది. అతిపరిమితమైన కొద్ది అవసరాలతో ఆయన మహత్తరమైన పూర్ణజీవితాన్ని గడిపేడు. తనవిశ్వాసాలను ఆయన తన జీవిత విధానంలోనే ఆచరించి చూపించాడు. విశ్వాసం క్రమంగా జీర్ణించిపోతున్న ఈ కాలంలో, అవి నమ్మడానికి వీలులేనంత మహోదారంగా ఉన్నాయి. ఈ దృష్టితోనే ఆయన ఆశ్రమంలోని నివాసుల యొక్క దీక్షలను, నైష్ఠికచర్యలను మనం అవగాహన చేసుకోవాలి. అహింస, సత్యం, నిరపేక్ష, బ్రహ్మచర్యం, త్యాగం, కాయకష్టం, జిహ్వాచాపల్యనిరోధం, నిర్భయత్వం, సర్వమతసహనం, అస్పృశ్యతానివారణ, స్వదేశీ మొదలైన నైష్ఠిక అనుష్ఠాన సూత్రాలు రెండు వేళలా ప్రార్థనాసమయంలో పదేపదే మననంచేయబడుతుండేవి.

ఈ గ్రంథ సంపుటాలలోని గాంధీజీ జీవితమనే మహానదిలో మునకలాడిన వారెవ్వరూ ఆశాభంగం చెందరనే హామీ ఇస్తూ, నేనీ ఉపక్రమణికను ముగిస్తాను. ఏమనగా, ఈ మహానదీగర్భంలో తరగని మహాసంపద గుప్తంగా ఉన్నది. ప్రతివారూ తమశక్తికొలదీ, తమ విశ్వాసంకొలదీ ఎంత తీసుకోగలిగితే అంత తీసుకోవచ్చును.

రాష్ట్రపతి భవనం,
న్యూఢిల్లీ,
జనవరి 16, 1958.

*రాజేంద్ర ప్రసాద్*



ఆయన విధానంలో ప్రధాన విషయమేమంటే మానవుని యందు మానవుడు అకుంఠితమైన విశ్వాసముంచడం. మానవులందరిలోనూ ఆధ్యాత్మిక సంపత్తి స్వతహాగా ఉంటుందనీ, నైతికభావం సహజంగా ఉంటుందనీ ఆయన విశ్వాసం. స్వాతంత్ర్యం, శాసనాలవల్లనూ, అధికారుల ఉత్తరువులవల్లను సిద్ధించదని ఆయన అభిప్రాయం. వైజ్ఞానిక వికాసంవల్లనూ, యాంత్రికసాధనాల అభివృద్ధివల్లనూ కూడా సిద్ధించదని ఆయనమతం. నిజమైన స్వాతంత్ర్యం సంఘానికి సిద్ధించాలంటే, సంఘాన్నందుకు సంసిద్ధపరచాలి. వ్యక్తులతోటే అటువంటి కార్యక్రమం ఆరంభం కావాలి. భారత జాతీయజీవనం ఎంతకాలమైతే ఆయన లక్ష్యాలననుసరించి, ఆయన అభిప్రాయాల ప్రకారం పెంపొందించబడుతుందో, అంతవరకూ అది ప్రజల నుత్తేజపరుస్తుంది. స్వాతంత్ర్యభారత మాయన ఆశయాల సిద్ధికి కృషిచేస్తూ, క్రమక్రమంగా ఉన్నతమైన సమైక్యతను సాధించినట్లయితే సాంస్కృతిక సరిహద్దులను విస్తీర్ణంచేయగలుగుతుంది. ఒక వెలుగుబాటను చూపించకలుగుతుంది.

కాని ఆయన అభిప్రాయాలను చాలా వాటిని పూర్తిగా అవగాహన చేసుకోవలసిఉన్నది. ఏ సాంఘికవ్యవస్థ యొక్క స్వాతంత్ర్యస్థితినైనా పరీక్ష చేయాలంటే, ఆ సంస్థ క్రియలో తన సభ్యులకిచ్చే స్వేచ్ఛయే ఆధారమని అందరూ అంగీకరిస్తారు. కాని కేంద్రీకృతమైన పారిశ్రామిక, సాంఘిక రాజకీయ సంస్థలలో కొంతవరకు వ్యక్తిస్వాతంత్ర్యము తగ్గిపోతుందనే సంగతి అంతగా గుర్తింపబడడంలేదు. ఈ ఉభయస్థితులకు మధ్యస్థంచేసే విధానమొకటి కనిపెట్టి, దాని నంగీకరించాలి. ఆయన ఆర్థికవిధానాలుసాధారణంగా లేమితో కూడినవి కాకపోయినా, నిష్ఠతోకూడి ఉండడంచేత కొంతకలవరం కలిగిస్తాయి. ఏవిధమైన రంగుశింగారాలు లేకుండా ఉండడంచేత ఆయన ఏర్పరచిన క్రమశిక్షణ కఠినమైన నైతిక నిష్ఠలాగున కనబడుతుంది. అతిపరిమితమైన కొద్ది అవసరాలతో ఆయన మహత్తరమైన పూర్ణజీవితాన్ని గడిపేడు. తనవిశ్వాసాలను ఆయన తన జీవిత విధానంలోనే ఆచరించి చూపించాడు. విశ్వాసం క్రమంగా జీర్ణించిపోతున్న ఈ కాలంలో, అవి నమ్మడానికి వీలులేనంత మహోదారంగా ఉన్నాయి. ఈ దృష్టితోనే ఆయన ఆశ్రమంలోని నివాసుల యొక్క దీక్షలను, నైష్ఠికచర్యలను మనం అవగాహన చేసుకోవాలి. అహింస, సత్యం, నిరపేక్ష, బ్రహ్మచర్యం, త్యాగం, కాయకష్టం, జిహ్వాచాపల్యనిరోధం, నిర్భయత్వం, సర్వమతసహనం, అస్పృశ్యతానివారణ, స్వదేశీ మొదలైన నైష్ఠిక అనుష్ఠాన సూత్రాలు రెండు వేళలా ప్రార్థనాసమయంలో పదేపదే మననంచేయబడుతుండేవి.

ఈ గ్రంథ సంపుటాలలోని గాంధీజీ జీవితమనే మహానదిలో మునకలాడిన వారెవ్వరూ ఆశాభంగం చెందరనే హామీ ఇస్తూ, నేనీ ఉపక్రమణికను ముగిస్తాను. ఏమనగా, ఈ మహానదీగర్భంలో తరగని మహాసంపద గుప్తంగా ఉన్నది. ప్రతివారూ తమశక్తికొలదీ, తమ విశ్వాసంకొలదీ ఎంత తీసుకోగలిగితే అంత తీసుకోవచ్చును.

రాష్ట్రపతి భవనం,<br>
న్యూఢిల్లీ,<br>
జనవరి 16, 1958.

రాజేంద్ర ప్రసాద్



# తొలిపలుకు

ఇంకొక నెలరోజులలో గాంధీ స్వర్గస్థుడై పది సంవత్సరాలు కావస్తోంది. అవడం ఆయన పండువయస్సువాడే కాని, పనిచేయడంలో ఇంకా పరిపూర్ణమైన శక్తి ఉత్సాహాలుగలవాడు. ఒక హంతకుని చేతిలో ఆయన హఠాత్తుగా మరణించాడు. ఇండియా దద్దరిల్లింది. ప్రపంచమంతా కన్నీరు కార్చింది. ఆయన కత్యంత సన్నిహితులుగా నుండిన మాలోకొందరకు ఆ దుఃఖం భరింపరానిది. అయినప్పటికీ, బహుశా ఆయనకు సిద్ధించిన మరణం ఆయన మహోదార జీవితానికి అనుగుణ్యమైనదే. ఆయన ఏ మహదాశయంకోసం బ్రతికినన్నాళ్లూ అంకితమైనాడో, మరణించి కూడా దానికే అంకితమైనాడు. వయస్సు మీదపడినకొద్దీ, జరాభారంచేత శరీరమూ మనసూ క్రమంగా కృశించిపోతుంటే మేమెవ్వరమూ ఆయనను చూడ దలచుకోలేదు. కనుక ఆయన జీవించినంత ఘనంగానే మరణించాడు. సుమారు 50 సంవత్సరాలపాటు ఆయన మలచిన ఈ దేశానికాయన తండ్రి. ఆశగొల్పే దేదీప్యమానమైన తార. ఫలసిద్ధినొసంగిన మహనీయుడు.

అసంఖ్యాకములైన ఆయనచర్యలలో కొన్నింటిలో కలసిమెలసి పనిచేసిన మహద్భాగ్యము గలిగిన మాబోంట్లకు, ఆయన మూర్తీభవించిన యువశక్తి, ఆయనను ముదుసలివానిగా ఎన్నడూ భావించము. నవభారత వసంతంయొక్క పటిమకు చిహ్నంగానే భావించుకుంటున్నాం. ఆయనతో స్వయంగా కలిసిమెలిసియుండని ఈ కాలపు యువకులకు ఆయనొక మహా సాంప్రదాయం వంటివాడు. ఆయన పేరుమీద, ఆయనచర్యలగురించి ఎన్నో కథలూ గాథలూ అల్లబడి ఉన్నాయి. బ్రతికున్నప్పుడు ఆయన మహాపురుషుడు. చనిపోయిన పిమ్మట అంతకన్న మహాపురుషుడు.

ఆయనిచ్చిన ఉపన్యాసాలను, రచనలను, ఇండియా ప్రభుత్వం పూర్తిగా సంపుటీకరణం చేస్తున్నందుకు నాకు చాలా సంతోషం. ఆయన మాట్లాడిన మాటలను, వ్రాసిన వ్రాతలను పూర్తిగానూ ప్రమాణంగానూ ఉండేటట్లు ప్రకటించడం చాలా అవసరం. ఆయన కార్యకలాపాలు అసంఖ్యాకములు. వ్రాసిన వ్రాతలు చాలా హెచ్చు. కనుక వీటిని సంపుటిచేయడం ఒక మహాత్కార్యం. బహుశా ఆ పని పూర్తికావడానికి చాలా ఏండ్లు పట్టవచ్చును. కాని మాకోసమే కాకుండా ముందుతరాలవారికోసంకూడా ఈ పనిని చేయడం మా ధర్మం.

ఇటువంటి సేకరణలో కొన్ని ముఖ్యమైనవి, కొన్ని కానివి, కొన్ని యథాలాపంగా వచ్చినవి, అన్నీ కలగాపులగం కావడం సహజం. కాని, ఒక్కొక్కప్పుడు, బాగా ఆలోచించి వ్రాసిన లేక చెప్పిన విషయంకన్న, యథాలాపంగా చెప్పబడిన విషయమే మానవుని మానసిక విశేషాన్ని చాటుతుంది. ఏమైనా వాటిలో కొన్నిమాత్రం ఎన్నుకోవడానికి మనమెవరం ? ఆయనగాథను ఆయననే చెప్పనివ్వండి. ఆయనకు జీవితమంతా రంగు రంగుల నూలుతో నేయబడిన ఒకేఒక వస్త్రంలాంటి సమగ్రమైనది. బ్రిటిష్‌ప్రభుత్వాన్ని సవాలుచేసే తీర్మానం ఆయనకెంత ముఖ్యమైనదో, ఒక పసిబిడ్డకు చెప్పినమాటా, ఒక బాధితుని ఓదార్చిన పలుకూ అంతముఖ్యమైనవే.

ఆయన ఆత్మకు భక్తితో ప్రణామంచేసి, మనమీపనికి పూనుకొందుముగాక. అందువల్ల మనతరంవారికి వెలుగుచూపి, మనకు స్వాతంత్ర్యాన్ని సంపాదించి ఇవ్వడమేకాకుండా, మానవుని మహాపురుషునిగాచేసే సద్గుణాలను మనకు చూపించిన మహాపురుషుని గురించి కొంతవరకైనా ముందుతరాలవారు తెలుసుకోగలుగుతారు. రాబోయేతరాలవారు, ఇటువంటి మహాపురుషుడు ఒకప్పుడు మనభారతభూమిలో చరించి పవిత్రంచేశాడనీ, మన ప్రజలకేకాకుండా యావత్తు మానవలోకానికీ తనప్రేమనూ, సేవనూ ధారపోశాడనీ, ఆశ్చర్యంతో చెప్పుకుంటారు.

నేను దీనిని డార్జిలింగునుంచి వ్రాస్తున్నాను. బ్రహ్మాండమైన కాంచనగంగ అథోగమనంచేస్తోంది. ఈ ఉదయమే ఎవరెస్టుశిఖరదర్శనమైనది. కాంచనగంగ, ఎవరెస్టు పర్వతాల అచంచలమైన బలమూ, అనంతత్వమూ గాంధీజీలో ఉన్నట్లు నాకు తోచింది.

డార్జిలింగు<br>
డిసెంబరు 27, 1957

జవహర్లాలు నెహ్రూ

# పీఠిక

భారత స్వాతంత్ర్య నిర్మాతయైన మహాత్మాగాంధీయొక్క ఋణం తీర్చుకోడానికి మాత్రమేకాకుండా, ఆయన పలికిన పలుకులను, వ్రాసిన వ్రాతలను, ఉత్తరములను సేకరించి, ముందుతరములవారి ఉపయోగంకోసం ప్రచురించడం చాలా అవసరమనే దృఢవిశ్వాసంతోనే ఇండియా ప్రభుత్వమువారు గాంధీజీ రచనల నన్నిటిని ప్రచురించే ఈ కార్యక్రమాన్ని సంకల్పించారు.

సంవత్సరాల తరబడి, ఏరోజుకారోజు గాంధీజీ చెప్పిన మాటలను, వ్రాసిన వ్రాతలను సంకలనంచేసి వరుసగా ప్రకటించదలచినాము. 50 సంవత్సరాలకుపైగా ఆయన తన కృషినిప్రారంభించాడు. ఆ కృషియొక్క ప్రభావం తన దేశంమీదనే కాకుండా యావత్ప్రపంచంమీదా ప్రసరించింది. వివిధములైన జీవిత సమస్యలను గురించి ఆయనంతగా యోచనచేసిన మనుష్యులెందరో లేరు. ఆయన ఈ భూమిమీద జీవించియున్నప్పుడు, తాను నమ్మినదానిని ఆచరణలో పెడుతుండగా ప్రత్యక్షంగా చూచినవారు, అమూల్యమైన ఆయన ఉపదేశాలను, పరిశుద్ధమైన స్థితిలో, సంపూర్ణంగా ముందుతరములవారికి అందచేయవలసిన విధి ఉన్నది.

1884 మొదలు 1948 సంవత్సరం వరకు దాదాపు 60 సంవత్సరాలపాటు ప్రజాహిత జీవితంలో గాంధీజీ ఉత్తరాలు, వ్యాసాలు వ్రాశారు. ఉపన్యాసములు నిచ్చారు. ప్రపంచంలో అనేక దేశాలలో అవి చెల్లాచెదురుగా ఉన్నాయి. ముఖ్యంగా ఇండియా, ఇంగ్లండు, దక్షిణ ఆఫ్రికాలలో అవి ఉన్నాయి.

ఆయన జీవించి ఉండగా ప్రచురణమైన కొద్ది పుస్తకాల్లో మాత్రమే కాకుండా అనేకమైన దుమ్ముపట్టిన దస్తరాల్లోనూ, గవర్నమెంటు రికార్డుల్లోనూ ప్రభుత్వ నివేదికల్లోనూ, ఇంగ్లీషు, గుజరాతీ, హిందీ పత్రికల్లోనూ కూడా ఈ రచనలు ఉన్నాయి. గొప్పవారు చిన్నవారు, పేదలు ధనికులు, ఆ జాతివారు ఈ జాతివారు అనే తారతమ్యం లేకుండా ప్రపంచమందన్ని దేశాలవారికీ ఆయన అసంఖ్యాకంగా ఉత్తరాలు వ్రాశారు. అవి అంతరించిపోకపూర్వమే వాని నన్నిటినీ సేకరించి పదిలపరచడం చాలా అవసరం.

ఇదివరకే ఆయన రచనలను సేకరించిన ప్రచురణలు అనేకంగా ఉన్నాయి. ముఖ్యంగా, గాంధీజీ స్వయంగానే ఏర్పాటుచేసిన ట్రస్టుననుసరించి, అహమ్మదాబాదులోని నవజీవన్ పబ్లిషింగ్ హౌస్ వారు చాలావరకు

ప్రచురించారు. ఈ ప్రచురణలు చాలా అమూల్యమైనవే. కాని అవి చాలావరకు ఆయన ఇండియాలో సాగించిన కార్యక్రమాలకు మాత్రమే సంబంధించి ఉన్నాయి. ఆయన స్వయంగా నడిపిన *నవజీవన్, యంగిండియా, హరిజన్* వగైరా పత్రికలలోనుంచి ప్రధానంగా అవి సేకరింపబడ్డాయి. అంతేకాకుండా అవి విషయ ప్రధానంగా సంకలనంచేయబడి ఉండడంచేత, కొన్నిచోట్ల ఒక రచనలో నుండియో, లేక ఉపన్యాసంనుంచో కేవలం ఆ విషయానికి సంబంధించిన భాగాలు మాత్రమే ఉల్లేఖింపబడి మిగిలినవి వదలివేయబడినాయి.

ఉత్తరాలకు సంబంధించినంతవరకు, గాంధీ స్మారకనిధివారు వాటిని దొరకినంతమట్టుకు సేకరించి ఫోటోగ్రాఫులు తీసి ఉంచారు. కాని వాటిని ప్రకటించలేదు. నిధివారు సేకరించిన ఉత్తరాలు కొన్నివేలుదాకా ఉన్నాయి. కాని ఇంకా చాలా ఉత్తరాలను సేకరించి, ప్రచురణ చేయవలసి ఉన్నది.

గాంధీజీ రచనలను, ఉపన్యాసములను, ఉత్తరములను, సంపూర్ణంగా ఎక్కడదొరికినా వాటిని సేకరించడానికిగాని, కాలానుక్రమణికగా వాటిని సంపూర్ణంగా ప్రకటించడానికిగాని ఇంతవరకూ ప్రయత్నం జరుగలేదు. ఈ పని చేయడానికి వ్యక్తులకుగాని, ప్రైవేటు సంస్థలకుగాని సాధ్యంకాదు. అందుచేత ఇండియా ప్రభుత్వమే ఈ పనికి పూనుకున్నది.

గాంధీజీ దక్షిణాఫ్రికాలో ఉన్న తొలిరోజులలో కూడా ఆయన వ్రాతలు, ఉపన్యాసాలు, ఉత్తరాలు చాలా విశేషంగానే ఉన్నాయి. ఆ కాలానికి సంబంధించిన గ్రంథమే 12 సంపుటాలు దాకా కావచ్చును. మొత్తం గ్రంథం ఎంత ఉంటుందని ఆలోచిస్తే ఆయన ప్రజాహిత జీవితం ఎన్ని సంవత్సరాలున్నదో అన్ని సంపుటాలు,—నాలుగువందల పేజీలుగలవి—అవుతాయని అంచనావేయ వలసివస్తుంది.

అంతేకాకుండా ఆయన వాణి ఒక్కభాషకు మాత్రమే సంబంధించి ఉండలేదు. ఆయన—గుజరాతీ, ఇంగ్లీషు, హిందీ—మూడు భాషల్లో మాట్లాడేడు. వ్రాశాడు. కనుక, ఆయన గుజరాతీ, హిందీ వాణిని నిర్దుష్టంగా ఇంగ్లీషులోకి అనువదించడం, గుజరాతీ ఇంగ్లీషులోని వాక్కును సరియైన హిందీలోనికి అనువదించడం అనే బాధ్యత కూడా సంపాదకులమీదనే పడింది. హిందీ, ఇంగ్లీషు భాషల్లోనే ఈ సంపుటాలు ప్రచురింపబడుతున్నాయి. పైగా ఆయన జీవితంలో ప్రారంభదశకు సంబంధించిన రికార్డు పైదేశాల్లోనే ఉన్నది. ముఖ్యంగా లండన్‌లోని కలోనియల్ ఆఫీసు రికార్డుల్లోనూ, దక్షిణాఫ్రికాలోనూ ఉన్నది. అందుచేత ఆ కాలానికి సంబంధించిన భోగట్టాను సేకరించడం చాలా కష్టమైన పని. ఆ కాలంలో అధికారులకు గాంధీజీ వ్రాసిన ఉత్తరాలే కాకుండా ఆయన

*'ఇండియన్ ఒపీనియన్'* పత్రికలో చాలా వ్రాస్తూఉండేవాడు. *యంగిండియా, నవజీవన్, హరిజన్* పత్రికలలోవలె కాకుండా, ఆయన *ఇండియన్ ఒపీనియన్‌*లో వ్రాసిన వ్యాసాల క్రింద సంతకాలులేవు. గాంధీజీ వ్రాసిన వ్యాసాలను గుర్తుపట్టి వాటిని ధృవపర్చడంలో, *ఇండియన్ ఒపీనియన్* పత్రిక నిర్వహణలోనే కాకుండా, దక్షిణాఫ్రికాలో గాంధీజీ కార్యక్రమాల్లో చేదోడువాదోడుగా నుండిన శ్రీయుతులు హెచ్. యస్. యల్. పోలక్, చగన్‌లాల్ గాంధీగార్లు ఈ సంపాదకులకు అమోఘంగా తోడ్పడ్డారు.

ఈ పనికి పరిపూర్తి అంటూలేదు. ముందుముందు జరుపబడే పరిశోధనలలో ఇప్పుడు దొరకని కాగితాలెన్నో దొరకవచ్చును. పరిపూర్ణతకోసం ఆగడం వాంఛనీయంకాదు. ఈ గ్రంథాన్ని ఇంకా వృద్ధిచేసేపనిని ముందువారికి వదలివేయాలి. ప్రస్తుతం దొరికినన్ని ఆధారాలను సేకరించి, వాటిని సరిగా ధృవపరచి వాటి పూర్వాపరసందర్భాలను పాఠకులు తెలుసుకునేటందుకు వీలైన వివరాలను చేర్చి ప్రచురించడానికిమాత్రమే సర్వవిధములైన ప్రయత్నాలూ జరుగుతున్నాయి. ఈ సంపుటంలో చేర్చడానికి వీలైన విషయాలు ఆలస్యంగా లభ్యమైతే, వాటిని వేరే గ్రంథంలో చేరుద్దామనుకుంటున్నాం.

కాలానుక్రమణంగా ఇందులోని విషయాలన్నీ కూర్చబడ్డాయని లోగడ ఉదహరించాము. ఫలానా తేదీని వ్రాసిన వ్యాసంగాని, ఉత్తరంగాని, ఇచ్చిన ఉపన్యాసంగాని ఒకేచోట కూర్చబడినాయి. లభ్యమైన విషయాలనన్నిటినీ, విషయాలవారీగా విభజించి ప్రకటించినట్లయితే కొంత కృతకంగా ఉంటుంది కనుక, అంతకన్న ఈ పద్ధతే నయమని నిర్ణయించుకున్నాము. ఒకే విషయం మీద గాంధీ దాదాపు ఒకే సమయంలో వ్యాసాలు వ్రాస్తూవచ్చాడు. ఉపన్యాసా లిస్తూవచ్చాడు. ఉత్తరాలు వ్రాస్తూవచ్చాడు. ఆయన జీవితంలో ప అరకాఅర వేరుగా లేదు. జీవితమంతా ఒకటే సమగ్రమైనది. ఆయన అభిప్రాయాలు వ్రాసినప్పుడొక విధంగానూ, ఉపన్యాసాల్లో ఇంకొకవిధంగానూ, ఉత్తరాల్లో మరో విధంగానూ, ఉండడమనేదిలేదు. అన్నీ ఒకేవిధంగా ఉండేవి. కనుక ఈ అభిప్రాయాలన్నీ ఒకే సంపుటంలో కాలానుక్రమణంగా ప్రక్క ప్రక్కనే ఉండేటట్లయితే, పాఠకుడు, గాంధీజీ మనస్సెల్లా పనిచేస్తుండేదో, అనేక సమస్యలుత్పన్నమైనప్పుడు, ఎప్పటికప్పుడాయన వాటి నెట్లా పరిష్కారంచేసేవారో పూర్తిగాతెలుసుకోగలుగుతాడు. అందువల్ల ఈ సంపుటాలు గాంధీజీ మనస్సుయొక్క మహాత్మ్యాన్ని చక్కగా తేటపరుపకలవు. ప్రజలందరికీ సంబంధించిన మహత్తర సమస్యలను పరిశీలించేటప్పుడు కూడా ఆయన వ్యక్తులకు సంబంధించిన విషయాలను దృష్టిలోనుంచుకుని వ్యవహరించేవాడు. ప్రజాసమస్యలకు సంబంధించిన విషయములతోపాటు, ఆయన వ్యక్తులకు వ్రాసిన ఉత్తరాలను కూడా

ప్రచురించడంవలన, ఆ మహావ్యక్తియొక్క సమగ్రస్వరూపం బాగా ప్రస్ఫుటమవుతుంది. ఉత్తరాలన్నిటినీ వేరుగా ప్రచురించడంకంటె, ఇలా ప్రచురించడం వల్లనే ఆయన సమగ్రవ్యక్తిత్వం ఎక్కువ విస్పష్టంగా ప్రతిఫలిస్తుంది.

సాధ్యమైనంతవరకు గాంధిజీ వాణిని యథాతథంగా ప్రచురించడమే ఈ సంపుటముల లక్ష్యంకావడంచేత, ఆయనవని నిర్దుష్టంగా ధృవపడని ఉపన్యాసాలను, సంభాషణలను, మేము ప్రచురించలేదు. ఆయన చెప్పినట్లు చెప్పబడిన ప్రకటనలను తీసివేసినాము. కాని ఉపన్యాసాల విషయంలో పత్రికలలోని నివేదికలను, నిస్సంకోచములని ధృవపడినపుడు, ఇతరత్రా ఆయన నోటినుండివచ్చిన మాటలు లభ్యంకానపుడు, అందువల్ల మరెక్కడా దొరకని భోగట్టా లభించినపుడు మాత్రం వాటిని ఉపయోగించాము. గాంధీజీ లాయరుగా నున్నప్పుడు, వృత్తిధర్మంలో వ్రాసిన వ్రాతలను ఇందులో చేర్చలేదు. మామూలు కాగితాలు అనగా జీవితచరిత్రకు సంబంధించని వాటినికూడా చేర్చలేదు. రహస్యమైన ఉత్తరాలను, బ్రతికున్న వ్యక్తులకు కష్టంకలిగించేవాటిని కూడావదలిపెట్టేము.

హిందీ గుజరాతీలనుంచి ఇంగ్లీషులోకి తర్జుమాచేసేవారిని, ఇంగ్లీషు, గుజరాతీలనుండి హిందీలోకి తర్జుమాచేసేవారిని బాగా అనుభవజ్ఞులైనవారి నుండి ఎన్నుకున్నాం. భాషాంతరీకరణం నడక సాఫీగానూ, ఒకేవిధంగానూ ఉండడానికి సాధ్యమైనంతవరకు ఒక్కొక్క సంపుటాన్ని ఒక్కొక్కరిచేతనే చేయిస్తున్నాం.

విషయాలను గ్రహించేటప్పుడు మూలాన్ని యథాతథంగా అనుసరించడానికే ప్రయత్నించాం. తేలికగా పట్టుబడే అచ్చుతప్పులను సవరించాం. మూలంలో సంగ్రహంగా వ్రాయబడిన మాటలవర్ణక్రమాన్ని పూర్తిగా గ్రహించాం.

రచనయొక్క తేదీని ప్రకటించినపుడు, పత్రికలలోని వ్యాసాలను మినహాయించి, మిగిలినవాటిలో కుడిచేతివైపు మొదట్లోనే మామూలు ఉత్తరాల్లో వేసేవిధంగానే ప్రచురించాం. మూలంలో కొన్నిచోట్ల తేదీ క్రింద వేసినప్పటికీ మేము ఈవిధంగా సవరించాం. మూలంలో తేదీలేనపుడు, ఉజ్జాయింపుగా తేదీని బ్రాకెట్లోవేశాం. అవసరమని తోచినచోట్ల అందుకుగల కారణాలనుకూడా ప్రమాణంగా పొందుపరిచాం. ప్రచురణలకు మాత్రం తేదీ ఆఖరున ఇచ్చాం. వ్యక్తులకు వ్రాసిన ఉత్తరాల విషయంలో వారిపేర్లను సాధారణంగా పైననే ఉంచాం. మూలం ఎక్కడనుంచి సేకరింపబడినదో ఆఖరున ఉదహరింపబడింది. పేర్లవర్ణక్రమం మూలంలో ఏ విధంగా ఉన్నదో ఆ విధంగానే ఉంచబడింది.

మూలానికి ఉపోద్ఘాతంగా చదరపుబ్రాకెట్లలోని విషయాలను సంపాదకులు రచించారు. గుండ్రటి బ్రాకెట్లలోని సంగతులు మూలంలోనివే. అసలులో గాంధీజీ

ఇతరుల రచనలను ఉల్లేఖించినపుడుగాని తనవే తిరుగ రచించినపుడుగాని చిన్న టైపులో మార్జినువదలి ప్రచురించాం. ఫుట్‌నోట్సును తగ్గించడంకోసం వ్యక్తులు, స్థలాలు, చట్టాలు, వగైరా విషయాలనుగురించిన వివరాలను ఆఖరున వ్రాశాం. ప్రతి సంపుటంలోనూ, ఆ కాలానికి సంబంధించిన కాలక్రమణిక ప్రచురింపబడింది. ఆధారాలనుగురించిన వివరణంకూడా చేర్చబడింది.

1956 సంవత్సరం, ఫిబ్రవరి నెలలో ఈ ప్రయత్నం ప్రారంభింపబడింది. అప్పట్లో ఇండియా ప్రభుత్వానికి ఇన్‌ఫర్‌మేషన్ అండ్ బ్రాడ్‌కాస్టింగు శాఖకు కార్యదర్శిగా నుండిన శ్రీ పి. యం. లాడ్ దీనిని ప్రారంభించారు. 1957 సంవత్సరం మార్చి నెలలో ఆయన అకాలమృత్యువు వాతపడకముందే ఈ కార్యక్రమానికి పునాదులు వేయడానికి చాలా సహాయపడ్డారు. ఈ సంపుటాల ప్రచురణ కార్యక్రమమంతకూ ఒక సలహాసంఘ మేర్పడినది. దానిలో మొదట్లో సభ్యులు: శ్రీ మొరార్జీదేశాయి (చెయిర్‌మన్), శ్రీ కాకా కలేల్కర్, శ్రీ దేవదాస్ గాంధీ, శ్రీ ప్యారేలాల్‌నయ్యర్, శ్రీ మగన్‌భాయి పి. దేశాయి, శ్రీ జి. రామచంద్రన్, శ్రీ శీమన్నారాయణ్, శ్రీ జీవంజీ డి. దేశాయి, శ్రీ పి. యం. లాడ్. గాంధీజీ జీవితంతో సన్నిహితులుగా ఉండినవారి అనుభవాన్ని, సలహాను ఈ పనికి పొందేటందుకే ఈ సలహాసంఘం పర్పాటు చేయబడింది.

విషయాలనుసేకరించి వాటిని సంపుటాలుగా విభజించే పనినంతా సాగించడానికి, శ్రీ భరతన్ కుమారప్పగారు ప్రధానసంపాదకులుగా నియమింపబడ్డారు. తర్వాత ఆయన పై సలహాసంఘంలో సభ్యులుకూడా అయినారు. 1957 సంవత్సరం జూన్ నెలలో ఆయన మరణించేవరకూ, చాలా శ్రద్ధాసక్తులతో ఈ పనిని నిర్వహించారు. ఆయన చనిపోయిన అనంతరం, మొదటి సంపుటం అచ్చు ప్రారంభమవుతుందనగా, సలహాసంఘంవారు, శ్రీ జయరామదాస్ దౌలత్‌రామ్‌గారిని ప్రధానసంపాదకులుగా ఆహ్వానించారు. ఆయనను సలహాసంఘంలో సభ్యులుగాకూడా నియమించారు.

ప్రధానసంపాదకులకు సహాయకులుగా రచనలకు శ్రీ యు. ఆర్. రావుగారు, ఉపన్యాసాలకు శ్రీ ఆర్. కె. ప్రభుగారు, ఉత్తరాలకు శ్రీ పి. జి. దేశపాండేగారు, హిందీకి శ్రీ దీక్షిత్‌గారు, గుజరాతీకి శ్రీ యం. కె. దేశాయి, శ్రీ రతిలాల్ మెహతాగారు నియమితులైనారు.

---

# మొదటి సంపుటానికి ఉపోద్ఘాతం

గాంధీజీ చిన్ననాటి జీవితానికి సంబంధించిన ఈ సంపుటం తీసుకు రావడం సంపాదకులకు చాలా కష్టమనిపించింది. చిన్ననాటి జీవితంలో రెండో భాగంలో, గాంధీజీ ఎక్కువగా కార్యకలాపాలు సాగించిన కాలంలో ఆయన చాలావరకు విదేశాలలోనే ఉన్నాడు. కనుక అందుకు సంబంధించిన అసలు కాగితాలు, విశేషంగా ఆయన విద్యార్థిగా ఉండిన ఇంగ్లండులోనూ, ఆదిలో లాయరు వృత్తిసాగించిన దక్షిణ ఆఫ్రికాలోనే లభ్యమైనాయి.

మా అదృష్టంకొద్దీ, ఆ కాలానికి సంబంధించిన రికార్డులను కొన్నిటిని గాంధీజీ భద్రపరచి ఇండియాకు తీసుకొచ్చాడు. ఇందులో ఆయన వ్రాసిన ఉత్తరాలకు నకళ్ళు సకృతుగా ఉన్నవి. ఆయన స్వదస్తూరితో వ్రాసిన ఉత్తరాలకు అర్జీలకు ముసాయిదాలున్నాయి. సైక్లోస్టైలు చేసినవి కొన్ని, అచ్చువికొన్ని, ఆయన ప్రచురించిన కరపత్రాలు, పిటీషనులు ఉన్నాయి. ద. ఆఫ్రికా వార్తాపత్రికల లోని కత్తిరింపులు, ఆయన పిటీషనులు, ఉత్తరాలు, వగైరాలు ప్రకటింపబడిన ప్రభుత్వప్రచురణలు (బ్లూబుక్కులు) కూడా ఉన్నాయి.

అయితే, గాంధీజీ తాను వ్రాసినవాటినన్నిటిని జాగ్రత్త పెట్టలేదు. హిందూమతం యొక్క ప్రధాన సిద్ధాంతాలనుగురించి ఆయన తయారుచేసిన ఒక పత్రాన్నిగురించి, 'ద. ఆఫ్రికాలో సత్యాగ్రహం' అని ఆయన వ్రాసిన పుస్తకంలో (1950 సం. పే. 242) ఈ విధంగా వ్రాశాడు: ''అలాంటి కాగితాలను అనేకమైన వాటిని నాజీవితంలో తగులబెట్టేశాను. కొన్నిటిని పారవేశాను. నాకార్యకలాపాలు విస్తృతమవడంచేత అలాంటి వాటినన్నిటిని జాగ్రత్త పెట్ట నక్కరలేదనుకున్నాను. అందుకు నేనేమీ విచారించడంలేదు. వాటినన్నిటిని భద్రపరచాలంటే చాలా వ్యయప్రయాసలకు లోనుకావలసి వచ్చేది. వాటికొరకు పెట్టెలు, బీరువాలు ఉంచుకోవలసివచ్చేది. పేదరికపు దీక్షవహించిన నాకు అలాంటి బాదరబందీ చాలా చికాకుకు కారణమవుతుంది.''

లండన్‌లోను, ద. ఆఫ్రికాలోను ఉన్న ప్రభుత్వపు రికార్డులను ఇతర కాగితాలను సేకరించడానికి పరిశోధకులు మా తరఫున కృషిచేస్తూనే ఉన్నారు. గాంధీజీ ద. ఆఫ్రికానుండి స్వయంగాతెచ్చిన కాగితాలకు ఇవి తోడైనాయి.

ద. ఆఫ్రికానుండి సేకరింపబడిన కాగితాల్లో, గాంధీజీ భారతీయుల తరఫున దాఖలుచేసిన అర్జీలు, విన్నపాలు చాలా ఉన్నాయి. వాటిలో ఆయన సంతకంచేయలేదు. నేటాలు ఇండియన్ కాంగ్రెస్ కార్యనిర్వాహకులో, ట్రాన్సువాల్ బ్రిటిష్ ఇండియన్ అసోసియేషన్ కార్యనిర్వాహకులో, భారతీయ నివాసుల ప్రతినిధులో, అందులో సంతకాలు చేశారు. 25-9-1895 తేదీని ఆయన వ్రాసిన ఉత్తరం (ఆ ఉత్తరం ఈ సంపుటం 301 వ పేజీలో ప్రకటింపబడింది) వల్లనే, ఆ అర్జీలను గాంధీజీయే ముసాయిదాలను తయారుచేసినట్లు స్పష్టపడుతోంది. "చాలా అర్జీల ముసాయిదాలను తయారుచేసిన బాధ్యతనాదే" అని గాంధీజీ అందులో అంగీకరించాడు. 1894 సం. రం. జూలై నెలలో రిప్పన్ ప్రభువుకు పంపిన పిటీషనులో ఆయన సంతకం లేదుకాని ఇతరుల సంతకాలున్నాయి. దాని విషయంలో ఆయన ఆత్మకథ లో (1956 సం. ప్రచురణ—ఇంగ్లీషు—పే. 142) ఈ విధంగా వ్రాశాడు. "ఈ పిటీషను తయారుచేయడానికి నేను చాలా శ్రమపడ్డాను. ఆ విషయాన్నిగురించి లభ్యమైన గ్రంథాలన్నిటినీ చదివేను."

1894 సం. రం. నుండి కొద్ది సంవత్సరాలపాటు గాంధీజీ నేటాలులో నివసించాడు. అయినప్పటికీ ఇటీవల ట్రాన్సువాలు అని పిలువబడుతున్న ద. ఆఫ్రికా రిపబ్లిక్ నుండి వెలువడిన కొన్ని అర్జీలను కూడా ఈ సంపుటంలోనే ప్రచురించడం జరిగింది. అందుకు కారణమేమంటే 1893—94 సం. రం. లో ఆయన ట్రాన్సువాలు ముఖ్యపట్టణమైన ప్రిటోరియాలో ఉంటూ, అక్కడున్న భారతీయులనూ, వారి సమస్యలనూ బాగా అవగాహన చేసుకున్నాడు. ఆయన స్వీయచరిత్ర లో ఒకచోట (127 పే.) 'ఇప్పుడు ప్రిటోరియాలో నేనెరుగనివారు లేరు. వారి పరిస్థితులు నాకు తెలియనివి లేవు' అని వ్రాశాడు. 'భారతీయ నివాసుల కష్టనిష్ఠురాలను గురించి ఆయా అధికారులకు విన్నపములను పంపడానికీ, అందుకొరకు సాధ్యమైనంతకాలాన్ని వినియోగించడానికి నేను సిద్ధపడ్డాను' అని వ్రాస్తూ అందునిమిత్తమై తానొక సంఘాన్ని కూడా స్థాపించినట్లు 126 పేజీలో వ్రాశాడు. తదనంతరం ఆయన నేటాలులో పనిచేసినప్పటికీ, ట్రాన్సువాలు భారతీయులు, తమవిన్నపాలనుఆయననేతయారుచేసిపెట్టమనికోరియుండవచ్చును. ఆయన నేటాలులో ఉన్నా, ట్రాన్సువాలులో ఉన్నా, దక్షిణాఫ్రికాలోని భారతీయుల విషయంలో ఆయనెంతో శ్రద్ధతీసుకున్నాడు. ద. ఆఫ్రికాలో ఆరెంజిఫ్రీస్టేటు, కేప్ కాలనీ వంటి ఇతర ప్రాంతాలలోని భారతీయులను గురించి కూడా నిరంతరం వ్రాస్తూనే ఉండేవారు. అక్కడాయన ఉండకపోయినా రొడీషియా భారతీయులను గురించి కూడా వ్రాస్తూ ఉండేవాడు.

అయినప్పటికి అధికారులకు పంపబడిన పిటీషనులన్నీ గాంధీజీ తయారు చేసినవి కావు. గాంధీజీ ద. ఆఫ్రికాకు చేరడానికి ముందే కొన్ని దాఖలుచేయ బడినాయి. వాటిని యూరోపియను న్యాయవాదులు వృత్తిధర్మంలో తయారు చేశారు. కాని గాంధీజీ దక్షిణాఫ్రికాలో ప్రవేశించి, భారతీయ సమస్యలపట్ల శ్రద్ధవహించడం మొదలెట్టినప్పటినుంచీ, భారతీయులు తప్పకుండా తమవిజ్ఞప్తుల నన్నిటినీ వారిచేతనే వ్రాయించుకున్నారు.

1904 సంవత్సరం నుంచి గాంధీజీతో కలసి ద. ఆఫ్రికాలో పనిచేసిన శ్రీ ఛగన్‌లాల్‌గాంధీ, పోలక్‌గార్లుకూడా ఈ విధంగానే అభిప్రాయపడ్డారు.

గాంధీజీ సంతకం లేకపోయినా మరిరెండు డాక్యుమెంట్లను ఇందులో చేర్చడం జరిగింది. నేటాలు ఇండియన్ కాంగ్రెస్ నిబంధనలు, దాని ప్రథమనివేదిక. గాంధీజీ దానికి ప్రథమకార్యదర్శి. గాంధీజీ స్వహస్తంతో వ్రాసిన నిబంధనల ముసాయిదా దొరికింది.

లభ్యమైన సాక్ష్యసంపత్తినిబట్టి, జూన్ 1894లో ఆయన మొదటి పిటీషన్‌ను వ్రాసినట్లు తేల్తోంది. అప్పటినుంచి విసుగువిరామాలు లేకుండా పిటీషనులను పరంపరగా తయారుచేసినట్లు కనుబడుతుంది. అన్యాయాలను తొలగించడానికి, ఉన్న నిజానిజాలన్నిటినీ ప్రకటించి, న్యాయం దయచేయించమని ఎదుటివారి అంతరాత్మకు హెచ్చరికచేయడమే అప్పట్లో ఆయన పద్ధతి. 12 సంవత్సరాలపాటు ఈ పద్ధతిని బాగాప్రయోగం చేసిన తరువాతనే, అధికారులు సబబుగా చేయబడిన హెచ్చరికలను పెడచెవినిపెడితేనే, ఏదో ఒకవిధమైన ప్రత్యక్షచర్యను అనగా సత్యాగ్రహాన్ని సాగించాలనే నిశ్చయానికొచ్చాడు.

ఈ సంపుటంలోని సంగతులు జరిగినపుడు గాంధీజీ వయస్సు 20-30 మధ్యనే ఉన్నదనే సంగతిని పాఠకులు గుర్తుంచుకోవాలి. ఆయన ఆనాటి ఉపన్యాసాల్లోనూ, వ్రాతల్లోనూ, ఆశ్చర్యకరమైన నిగ్రహం, నిదానం, సత్యదీక్ష, ప్రత్యర్థిచెప్పిన విషయాలపట్ల గౌరవం, మొదలైన లక్షణాలన్నీ కనుబడుతున్నాయి. జీవితకాలమంతా ఆ లక్షణాలన్నీ అట్లే ఉన్నాయి.

ద. ఆఫ్రికా రాజ్యాంగవిధానాన్నిగురించిననోటు, అక్కడి సంఘటనల కాలానుక్రమణిక, ద. ఆఫ్రికా సంగ్రహచరిత్ర, నేటాలు, ద. ఆఫ్రికా పటాలు రెండూ, ఇందులో చేర్చబడినాయి. ద. ఆఫ్రికాలో 1893 మొ. 1914 వరకు, గాంధీజీ చేసినపనిని స్థూలంగా అవగాహన చేసుకోవడానికవి తోడ్పడగలవు.

గాంధీజి జీవితాన్ని సంగ్రహంగా తెలియచెప్పడం ఈ సంపుటాల అభిప్రాయం కాదు. అయినప్పటికీ గాంధీజీ జీవితంలోనిఘట్టాలను తెలుసుకునేందుకు ఆయన పుట్టినప్పటినుంచీ, ఈ సంపుటంలో పొందుపరువబడిన ఆఖరు సంఘటన వరకూ కాలానుక్రమణిక ఇవ్వబడింది.

ఈ సంపుటంలోని విషయాలను సేకరించడంలో మాకు సహాయపడిన న్యూఢిల్లీలోని గాంధీస్మారకనిధివారికెంతో కృతజ్ఞులం. వారి గ్రంథాలయాన్ని, మ్యూజియమును మమ్ములను వారు స్వేచ్ఛగా ఉపయోగించుకోనిచ్చారు. అందులో గాంధీజీ వ్రాసిన ఉత్తరాలు, ప్రచురణకాని డాక్యుమెంట్లు, పుస్తకాలు, ఫోటోలు ఎన్నో అమూల్యమైనవి ఉన్నాయి. అహమ్మదాబాదులోని సబర్మతీ ఆశ్రమం వారికి, మెమోరియలు ట్రస్టువారికికూడా మేము విశేషంగా ఋణపడున్నాం. వారు జాగ్రత్త పెట్టిన ద. ఆఫ్రికా పత్రికలలోని భాగాలను, ప్రభుత్వ ప్రచురణలను, గాంధీజీ దక్షిణాఫ్రికాలో ఉండగా వ్రాసిన ఉత్తరాలను మమ్ములను ఉపయోగించు కోనిచ్చారు.

లండన్‌లోని కలోనియల్ ఆఫీసువారున్నూ, బ్రిటిష్ మ్యూజియం వారున్నూ, లండన్‌లోని శాకాహారసంఘంవారున్నూ, తమగ్రంథ సంగ్రహాలను, రికార్డులను మా లండన్ పరిశోధకుని ఉపయోగించుకోనిచ్చారు. వారికందరకూ కూడా మేము కృతజ్ఞత తెలుపవలసియున్నది.

కలకత్తాలోని నేషనల్ లైబ్రరీవారున్నూ, కలకత్తా, బొంబాయి, మద్రాసు నగరాల్లోఉన్న వార్తా పత్రికలవారున్నూ, ఈ గ్రంథంలోని విషయాలను సేకరించడానికి మాకు చాలా సహాయపడ్డారు. అందుకు వారికి మా కృతజ్ఞత.

అహమ్మదాబాదులోని గుజరాత్ విద్యాపీఠం, ఢిల్లీలోని ఎ. ఐ. సి. సి. లైబ్రరీ, ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ వరల్డు అఫైర్సువారు, ఢిల్లీ విశ్వవిద్యాలయం తాలూకు ఆఫ్రికాశాఖవారు, యుసిస్ (అమెరికా) వారి ఢిల్లీ, బొంబాయి శాఖల గ్రంథాలయాలు, బొంబాయి విశ్వవిద్యాలయం, ఏషియాటిక్ సొసైటీల గ్రంథాలయ శాఖలవారున్నూ, మాకు చాలాతోడ్పడ్డారు. అందుకు వారందరికీ కృతజ్ఞులం.

ఇందులో ప్రచురించిన ఒకఫోటోగ్రాఫును మాకు 'మహాత్మా' ప్రచురణకర్తలు ఇచ్చారు. ఫోటోస్టాటులన్నిటినీ గాంధీ స్మారకనిధి వారిచ్చారు. వారికి మేము బహుధా ఋణపడిఉన్నాము.

---

# ద. ఆఫ్రికా భారతీయ సమస్య

## చారిత్రక సమీక్ష

1893 సం. రం. లో గాంధీజీ ద. ఆఫ్రికాలో ప్రవేశించేటప్పటికి అది నాలుగు కాలనీలు కలసిఉన్న దేశం. నేటాలు, కేవ్, ట్రాన్సువాలు, ఆరెంజి ఫ్రీస్టేటు. వింతకథలుగా చెప్పుకోబడుతుండే భారతదేశానికి రావాలని ప్రయత్నిస్తుంటే, అప్రయత్నంగా ఈ దక్షిణాఫ్రికాను కనుగొన్న యూరోపియనుల సంతతివారు ఈ కాలనీలపై యాజమాన్యమును వహిస్తూ ఉండేవారు. వారందులో స్థావరం ఏర్పాటు చేసుకున్నారు. మొదట్లో అయితే దానిని ప్రాగ్దేశాలకు పోవడానికి మధ్యమకాంగా భావించారు కాని, తరువాత దానిని శాశ్వత నివాసంగానే చేసుకున్నారు.

1893 సం. రం. లో ఆ దేశంలో ప్రాముఖ్యస్థానంలో ఉండినవారు డచ్చివారు (బోయర్లు), బ్రిటిష్‌వారు. డచ్చివారు ట్రాన్సువాలు, ఆరెంజి ఫ్రీస్టేటుల్లోనూ, బ్రిటిష్‌వారు నేటాల్, కేపు ప్రాంతాల్లోనూ అధికులుగా ఉండేవారు. బ్రిటిష్‌వారు రంగంలోదిగి 1806 లో కేపును, 1843 లో నేటాలునూ, డచ్చివారి దగ్గరనుండి స్వాధీనంచేసుకునేవరకూ, దాదాపు 200 సంవత్సరాలవరకూ, డచ్చివారే నిరభ్యంతరంగా రాజ్యాధికారాన్ని చలాయించారు. ఆపైని డచ్చివారు చాలామంది దేశంలోకి చొచ్చుకెళ్ళి ట్రాన్సువాలును, ఆరెంజి ఫ్రీస్టేటును స్వాధీనం చేసుకున్నారు. అయినప్పటికీ బ్రిటిష్‌వారు డచ్చిప్రాంతాల్లోనూ, డచ్చివారు బ్రిటిష్‌ప్రాంతాల్లోనూకూడా స్థిరపడ్డారు.

ఈ ఉభయులకూ నిరంతరం సంఘర్షణగానే ఉండేది. చివరకు (1899 మొదలు 1902 వరకూ) బోయరుయుద్ధం జరిగేవరకూ ఒకరిపై నొకరు ఆధిక్యతను సంపాదించటానికి సంఘర్షణపడుతూనే వచ్చారు. బోయరు యుద్ధం ఫలితంగా దక్షిణాఫ్రికా యావత్తూ బ్రిటిష్‌సామ్రాజ్యంలో ఒక భాగమైపోయింది. డచ్చిరాజ్యభాగాల్లోని బ్రిటిష్ నివాసులకూ, భారతీయనివాసులకూ వారికి న్యాయంగా రావలసిన హక్కులను సంపాదించడానికే ఈ యుద్ధాన్ని సాగించామని బ్రిటిష్‌వారు చెపుతూవచ్చారు.

గాంధీజీ దక్షిణాఫ్రికాలో ప్రవేశించేసరికి ఈ నాలుగు కాలనీలు ఒకదాని కొకటి సంబంధం లేకుండా, ఎవరి విధానాలను వారే అనుసరిస్తుండేవారు.

లండన్‌లోని బ్రిటిష్ ప్రభుత్వంవారు, తమ ప్రజల హక్కులను సంరక్షించుకొనే నిమిత్తం ఈ కాలనీలలో ఏజంట్లను నియమిస్తుండేవారు. తద్వారా కొంతవరకు వారి పరిపాలనావిధానాలను అదుపులో ఉంచేవారు. కాని తర్వాత అనగా 1910 సం. రం. లో ఈ నాలుగు కాలనీలు ఏకమై, బ్రిటిష్ ఛాపుటాక్రింద ద. ఆఫ్రికా యూనియను ప్రభుత్వమంటూ ఏర్పడి, స్వపరిపాలనారాష్ట్రమైన పిమ్మట లండన్ ప్రభుత్వం జోక్యం కలిగించుకోవడం మానేసింది. ద. ఆఫ్రికాకు పూర్తిగా డొమినియను స్టేటసు లభించింది కనుకనూ, బ్రిటిష్ కామనువెల్తులో స్వపరిపాలనారాష్ట్రం కావడంచేత తమ ఇచ్ఛవచ్చినట్లు పరిపాలించుకునే హక్కు వారికుంది కనుకనూ, బ్రిటిష్‌పౌరుల విషయంలోనే కాకుండా ఆ దేశవ్యవహారాల్లోనే సామ్రాజ్యప్రభుత్వంవారు జోక్యంచేసుకోవడం మానుకున్నారు. ఆసియావాసులైన బ్రిటిష్‌పౌరులకుగల ఇబ్బందులను తొలగించేబాధ్యత ద. ఆఫ్రికా యూనియను గవర్నరు జనరల్‌మీద, ఆయన కౌన్సిలు మీదపడింది. దక్షిణాఫ్రికా ప్రభుత్వంమీద బ్రిటిష్‌ప్రభుత్వంవారి ప్రభావం శూన్యమైంది. గాంధీజీ దక్షిణాఫ్రికాలో ఉన్న రోజులలో చాలాకాలంవరకు ఈ విధంగా లేదు.

దక్షిణాఫ్రికాలో వ్యవసాయాన్ని అభివృద్ధిచేయడానికీ, ఖనిజసంపదను పైకితీయడానికీ, శ్వేతజాతులవారికి భారతీయకూలీల సహాయం విధిగా కావాలి. ఆఫ్రికాదేశీయులకు నిలకడలేని కారణంచేత వారు కూలీలుగా పనికిరారని వారి అభిప్రాయం. ఆఫ్రికావాసులు, వారిభూమిమీదవచ్చిన ఆదాయంతో సంతృప్తి పడుతుండేవారు. కనుక కూలికి పనిచేయాలనే కుతూహలం వారికుండేదికాదు. కనుక బ్రిటిష్‌వలసరాజ్యాలవారు, భారతీయకూలీలను కంట్రాక్టు పద్ధతిమీద ద. ఆఫ్రికాకుపంపడానికి ఇండియాలోని బ్రిటిష్‌పరిపాలకులతో తగిన ఏర్పాట్లను చేసుకున్నారు. అలాంటి కంట్రాక్టుకూలీల మొదటిజట్టు 1860 సంవత్సరంలో దక్షిణాఫ్రికాలో ప్రవేశించింది. కంట్రాక్టు కాలపరిమితి ముగియడంతోనే వారి కిష్టమైతే మరొక 5 సంవత్సరాలపాటు తిరిగి కూలీలుగా కంట్రాక్టులో చేరవచ్చును. లేకపోతే ఇండియాకు వెళ్ళిపోవచ్చును. అదీ కాకపోతే వారు తిరుగు ప్రయాణానికయ్యే ఖర్చుకు ఎంతభూమి లభిస్తుందో అంత భూమిని వారికి కేటాయిస్తారు. ఆ భూమిలోవారు స్థిరపడి సేద్యం చేసుకోవచ్చును.

ఈ కూలీలు సాధారణంగా భారతదేశంలో నిరుపేదలైనవారు. వారికి ఆరోగ్యవిధులంతగా తెలియవు. అనేక విధాలుగా వారు వెనుకబడ్డవారని చెప్పాలి. అచిరకాలంలోనే వారి జీవితావసరాలను సమకూర్చడానికి భారతీయవర్తకులు కూడా అక్కడ ప్రవేశించారు. దానితో దక్షిణాఫ్రికాలో భారతీయ జనాభా పెరగడం ప్రారంభమైనది.

1869 సంవత్సరంలో ఇంకా కూలీలను ఎగుమతిచేయవలసి వచ్చినపుడు, ఇండియాగవర్న మెంటు వారొక్కవిషయాన్ని స్పష్టంచేశారు. కూలీకంట్రాక్టు యొక్క కాలపరిమితి అయిపోవడంతోనే వారు దేశంలోని సాధారణ చట్టాల ననుసరించి జీవించడానికి వీలుండాలనీ, వారిమీద శాసనసంబంధమైనటువంటికాని, పరిపాలనకు సంబంధించికాని ఏవిధమైన నిర్బంధాలూ ఉండకూడదనీ స్పష్టంగా చెప్పడం జరిగింది. ఆ కూలీలు కావాలని కోరిన నేటాలు ప్రభుత్వం అందు కంగీక రించింది. అంతేకాకుండా 1875 సంవత్సరంలో లండన్‌లోని ప్రభుత్వం ఆ విషయాన్నే స్థిరపరిచింది. అదల్లా ఉండగా బ్రిటిష్‌రాణీగారు 1858 సంవత్సరంలో చేసిన ప్రకటనలో 'మన ఇతరదేశాల ప్రజలకువలెనే భారతీయులకుకూడా సమానహక్కు లుంటాయని' ఉద్ఘాటిస్తూ హామీ ఇచ్చింది.

కాని, ఆదినుంచీ డచ్చివారు మాత్రం ద. ఆఫ్రికాలో భారతీయులు ఉండడానికి వ్యతిరేకంగానే ఉంటూవచ్చారు. ఆసియానుంచి (చైనా నుంచి కూడా) తీసుకురాబడిన కూలీలను ఒక నిర్ణీతమైన కాలంవరకూ మాత్రమే ఉంచాలనీ, ఆపైని వారిదేశాలకు పంపేయాలనీ వారి కోరిక. వారి కాలనీలలో కొన్ని నిర్ణీతప్రదేశాల్లో మాత్రం నల్లవారైన ఆఫ్రికనులను ఉంచి, మిగతాఅంతటినీ శ్వేతజాతుల కాణాచిగానే ఉంచాలని వారి అభిలాష.

స్థానికులైన బ్రిటిష్‌వారి అభిప్రాయం కూడా అంతే. భారతీయ వర్తకులు వర్తకంలోను, వ్యవసాయంలోనూ బ్రిటిష్ వర్తకులకు, తదితర యూరోపియను వర్తకులకు జాగాపోటీగా ఉన్నారని వారు గ్రహించారు. భారతీయ వ్యవసాయకులు కొత్త రకాలైన కాయలను, పండ్లను చౌకగానూ విస్తారంగానూ పండించడం మొదలుపెట్టి, శ్వేతరైతుల సరుకులకువచ్చే అయివేజులను తగ్గించారు. భారతీయవర్తకులు చౌకగా జీవించగలిగేవారు. హంగులకోసం, ఆర్భాటంకోసం, నౌఖరుచౌకరులకోసం చాలా తక్కువగా ఖర్చు పెట్టుకునేవారు. అందుచేత బ్రిటిష్, డచ్ వర్తకులకన్న చౌకగా సరకులను అమ్మగలిగేవారు. కనుక భారతీయులను స్వేచ్ఛగా దేశంలోనికి రానిచ్చినట్లయితే వారు వ్యవసాయంలోనూ వ్యాపారంలోనూ, తెల్లవారిని తుడిచిపెట్టేస్తారేమోనని వారి భయం.

అందువల్లనే భారతీయులమీద అనేకమైన ఆంక్షలను విధించడం ప్రారంభంచేశారు. డచ్చి ప్రజాస్వామికమైన ట్రాన్సువాలులో 1885 సంవత్సరం మూడవనెంబరు చట్టం ఇందుకు మొదటిది. ఆసియావాసులకు డచ్చి పౌర సత్త్వపు హక్కులుండవని సదరుచట్టం శాసించింది. పారిశుద్ధ్యకారణాలవల్ల,

భారతీయులు వారికి ప్రత్యేకింపబడిన ప్రాంతాల్లోనే నివసించాలని ఆ చట్టం శాసించింది. వారు కొన్ని నిర్ణీత ప్రాంతాల్లోతప్ప స్థిరాస్తులను సంపాదించుకో కూడదనీ, వ్యాపారం నిమిత్తం వచ్చేవారు రుసుములుచెల్లించి లైసన్సులుపొంది రిజిష్టరీచేయించుకోవాలనీ శాసించింది.

అయితే ఈ శాసనం 1884 సం. రం. లండన్ సమావేశం (కన్వెన్షన్) యొక్క 14 వ నిర్ణయానికి పూర్తిగా విరుద్ధం. ఆ నిర్ణయం ట్రాన్సువాలు రిపబ్లిక్ కున్నూ, రాణీగారికిన్నీ మధ్య జరిగింది. ఆఫ్రికాలోని ఆదిమవాసులు తప్ప, మిగిలిన వారందరికీ ట్రాన్సువాలు దేశంలోనికి స్వేచ్ఛగా రావడానికి, సంచారంచేయడానికి, నివసించడానికి, స్థిరాస్థిని సంపాదించుకోవడానికి, రిపబ్లిక్ లోని ఏప్రాంతంలోనైనా వ్యాపారంచేసుకోవడానికి, డచ్చి పౌరులకు విధింపబడే పన్నులు తప్ప మరేవిధమైన అదనపుపన్నులను వారిమీద విధించకుండా ఉండడానికి, ఆ నిర్ణయంయొక్క సారాంశము. ట్రాన్సువాలులోని బ్రిటిష్ హైకమీషనరు, కాలనీలోని బ్రిటిష్పౌరుల హక్కులను సంరక్షించడానికేర్పడ్డాడు. కాని ట్రాన్సు వాలులోని డచ్చి, బ్రిటిష్ శ్వేతజాతులవారు ఆసియావాసులు కాలనీని ముంచెత్తే స్తున్నారని సాగించిన ఆందోళన ఫలితంగా, హైకమీషనరు ఆ చట్టాన్ని అడ్డవద్దని లండన్లోని బ్రిటిష్ప్రభుత్వానికి సలహా ఇచ్చాడు. అందుమీదట భారతీయులకు ప్రతికూలంగా తలపెట్టబడిన ఈ శాసనానికి లండన్ గవర్నమెంటు అభ్యంతరం చెప్పలేదు.

భారతీయులకు ఇతర బ్రిటిష్పౌరులతో సమానమైన హక్కులుంటాయని చేయబడిన పూర్వప్రకటనలకు భిన్నంగా ఎప్పుడైతే సామ్రాజ్యప్రభుత్వం తన విధానాన్ని వెనక్కిత్రిప్పిందో, అప్పుడే డచ్చి ట్రాన్సువాల్ లోనూ, బ్రిటిష్ నేటాల్ లోనూ కూడా భారతీయులను కేటాయించే శాసనాలు శరపరంపరగా బయల్దేరినాయి. సామ్రాజ్యప్రభుత్వానికి బ్రిటిష్, డచ్చి రాజ్యాలలోని తన పౌరులను సంరక్షించుకునే అధికారాలు పూర్తిగా ఉన్నప్పుడే ఇలాజరిగింది.

ద. ఆఫ్రికా అంతటా భారతీయులమీద జాతిద్వేషం, రైళ్లల్లోనూ, బస్సుల్లోనూ, స్కూళ్లల్లోనూ, హోటళ్లలోనూ అపారంగా పెరిగిపోయింది. పర్మిటులేకుండా భారతీయులను ఒక కాలనీలోనుంచి మరొక కాలనీలోనికి పోనివ్వలేదు. భారతీయులసంఖ్య హెచ్చుగానున్న బ్రిటిష్కాలనీ అయిన నేటాలులో, భారతీయులకు ఓటింగుహక్కులు రద్దుచేసి, వారికి రాజకీయ హక్కులను తొలగించి, న్యూనతపరచడానికి 1894 సం. రం. లో ఒక చట్టాన్ని ఆమోదించడానికి కూడా సిద్ధపడ్డారు.

గాంధీజీ 1893 సం. రం. మేనెలలో న్యాయవాదిగా వృత్తిధర్మంలో ద. ఆఫ్రికాలో ప్రవేశించాడు. న్యాయవాది వృత్తికి సంబంధించిన పని అయిపో వడంతోనే, గాంధీజీ 1894 సం. రం. లో వెళ్లిపోదలచుకున్నాడు. కాని ఈలోగా ఈ బిల్లుకు సంబంధించిన భోగట్టాను ఆయన పత్రికల్లో చూచాడు. తనతోటి అమాయికజనానికి, ఆ బిల్లువల్ల కలిగే ప్రతిబంధకాలేమిటో గాంధీజీ విపులంగా చెప్పేసరికి, వారంతా ఆయనను అక్కడేఉండిపోయి తమకుసహాయంచేయమని కోరేరు. ఇందుకూ, దక్షిణాఫ్రికాలోని భారతీయుల ఇతర కష్టములను నివారించడానికీ, ఆయనక్కడే 21 సంవత్సరములు అనగా 1914 వరకూ ఉండి పోవలసివచ్చింది.



# ఆంధ్ర ప్రదేశ ప్రభుత్వ విజ్ఞప్తి

భారతస్వాతంత్ర్యప్రదాత, మహాత్మాగాంధీజీ రచనలన్నిటిని సేకరిస్తున్న కేంద్రప్రభుత్వంవారు ఆయనవాణిని తెలుగులో ప్రచురించమని ఆంధ్రప్రదేశ ప్రభుత్వమును హెచ్చరించిన వెంటనే మేము సంతోషముతో అంగీకరించినాము. గాంధీజీ వాణిని సరళమైన భాషలో అనువదించి, ప్రచురించి ఆంధ్రప్రజల కందుబాటులో నుంచుట మా ధర్మమని భావించి ఈ పనికి పూనుకున్నాము. ఈ కార్యభారమును వహించి సాధ్యమైనంత త్వరలో మొదటి సంపుటమును అనువదించి, ప్రచురణకు తోడ్పడిన శ్రీ క్రొవ్విడి లింగరాజుగారు ప్రశంసార్హులు.

ఆంధ్రలోకము ఈ సంపుటమును శ్రద్ధగా పఠించి, మనదేశ ప్రజలందరికి పితృసమానుడైన బాపూజీ ఉపదేశములను గ్రహించి ఆచరించగలరని ఆశిస్తున్నాము. ఈ ప్రథమసంపుటములో ప్రధానముగా ఆయన బాల్యమునకు, దక్షిణ ఆఫ్రికా కార్యకలాపమునకు సంబంధించిన విశేషములు ఉన్నవి. ఆనాటి ఆయన అనుభవములు భారతస్వాతంత్ర్యోద్యమమును తీర్చిదిద్దుట కెట్లుపయోగ పడినవో ఈ గ్రంథమున స్పష్టపడుచున్నది. త్వరలో రెండు మూడు సంపుటములను కూడ అందచేయగలమని ఆశిస్తున్నాము. ఆంధ్ర ప్రజలీ గ్రంథములను పఠించి తరించగలరని నమ్ముచున్నాము.

డి. సంజీవయ్య,<br>(ముఖ్యమంత్రి)

యస్. బి. పి. పట్టాభిరామారావు,<br>(విద్యామంత్రి)

ఆంధ్ర ప్రదేశ ప్రభుత్వం.

---

# అనువాదకుని మనవి

గాంధీజీ వాణిని తెలుగులో అనువదించుటకు నాకు సావకాశమిచ్చిన ఆంధ్ర ప్రభుత్వమునకు నేను కృతజ్ఞుడను. గాంధీజీ రచనలు పైకి బహుతేలికగా నున్నట్లు కనబడును కాని ఎంతో భావగర్భితములైయుండుట అందరెరిగిన విషయమే. స్వర్గీయ మోతీలాలు నెహ్రూ చెప్పినట్లు ఆయన వాణి హృదయంలో నుంచి వెలువడుతుంది. ఎదుటివారి హృదయంలో చొచ్చుకుంటుంది. అట్టి భాషను నాశక్తికొలది సామాన్యులకు సుబోధకంగా ఉండేటట్లు వ్రాయడానికి ప్రయత్నించాను. అసలు విషయానికి భంగంకలిగించకుండా స్వేచ్ఛగా అనువదించాలని ప్రయత్నించాను. మంచిచెడ్డలు నిర్ణయించవలసినవారు సహృదయులైన ఆంధ్రపాఠకులు.

క్రొవ్విడి లింగరాజు
(అనువాదకుడు)

---

# విషయానుక్రమణిక

విషయము | పుట

---

## చిత్రపటములు



## దేశపటములు



---

# 1. తండ్రికి కొడుకు వ్రాసిన లేఖ

*ఈ ఉత్తరం గాంధీజీ వ్రాసిన ఉత్తరములలో బాగాపురాతనమైనది. అసలు లేఖ లభ్యంకానందున ఆయన ఆత్మకథలో వ్రాసినట్లుగానే ఆ ఉదంతం ఇచట ఉల్లేఖింపబడినది. ఆయన 15 సంవత్సరముల ప్రాయమువాడై యుండగా, అన్నగారి ముంజేతికంకణాన్నుంచి, ఒక పిసరు బంగారాన్ని కైంకర్యంచేసి అన్నగారుచేసిన ఋణాన్ని తీర్చినాడు. కాని తానుచేసిన కార్యానికి చాల సిగ్గుపడి ఖిన్నుడైనాడు. తండ్రికి యావద్విషయాన్ని చెప్పివేయాలని నిశ్చయించుకున్నాడు. తండ్రి కన్నీటిధారలతో కొడుకు పశ్చాత్తాపాన్ని అంగీకరించాడు. ఈ సంఘటన ఆయన మనస్సులో శాశ్వతంగా హత్తుకుపోయింది. అహింసా ప్రభావాని కదొక గొప్ప నిదర్శనమని ఆయనే వ్రాసినారు.*

[క్రీ. శ. 1884 సం. రం.]

ఒక చిన్న కాగితంముక్కమీద వ్రాసి నేనే స్వయంగా ఆయన చేతికిచ్చితిని. నా అపరాధము నంగీకరించడమే కాకుండ, అందుకుతగిన శిక్ష విధింపమని కోరితిని. నా అపరాధమునకు తాను శిక్ష విధించుకోవద్దనికూడా కోరితిని. ఇక ముందెప్పుడు కూడా దొంగతనం చేయనని శపథము తీసుకొంటిని.

['*గాంధీజీ ఆత్మకథ*' 1956 సం. రం. ప్రచురణ ఇంగ్లీషు ఎడిషన్—పుట 27.]



# 2. రాజకోటలోని ఆల్‌ఫ్రెడ్ హైస్కూలులో

*గాంధీజీ బారిష్టరు పరీక్షకు ఇంగ్లండు వెళ్ళేసందర్భములో తోటివిద్యార్థులు ఏర్పాటుచేసిన వీడ్కోలుసమావేశములో ఆయన చేసిన ప్రసంగమే బహుశా ఆయన ఉపన్యాసములలో మొదటిదని చెప్పవచ్చును. ఆయన ఆత్మకథలో 'నా కృతజ్ఞతను తెలుపుతూ నే నేవో కొన్నిమాటలు వ్రాసుకువెళ్ళేను. కాని వాటిని చదువబోయేసరికి నా శరీరమంతా ఏలా వణికిపోయిందో, తల గిర్రుమని ఏలా తిరిగిందో జ్ఞాపక మొస్తున్నది.' అని వ్రాశారు. (పే. 39) అప్పటికి ఆయన వయస్సు 18. ఆయన చెప్పిన మాటలు పత్రికలలో ఇలాప్రచురింపబడినవి.*

[జులై 4, 1888.]

మీలో కొందరు నన్ను అనుసరిస్తారనీ, ఇంగ్లాండునుంచి తిరిగి వచ్చిన పిమ్మట భారతదేశంలో గొప్పగొప్ప సంస్కరణలకోసం మీరు పాటుబడతారనీ నేను ఆశిస్తున్నాను.

[గుజరాతీనుండి *'కథియావార్ టైమ్సు'*—12-7-1888 తేదీ.]



# 3. లక్ష్మీదాస్ గాంధీకి వ్రాసిన ఉత్తరం

లండన్,
9 నవంబరు 1888,
శుక్రవారం.

పూజ్య సోదరా,

కడచిన రెండుమూడు వారాలనుంచి నీ దగ్గరనుంచి ఉత్తరం రాకపోవడం నాకు చాలావిచారంగా ఉన్నది. నేను వ్రాయకపోవడమే నీ మౌనానికి కారణమనుకుంటాను. కాని, నేను లండన్ చేరకముందు నీకు ఉత్తరం వెయ్యడం అసంభవం. ఆకారణం చేత నువ్వు నాకు వ్రాయకపోవడం చాలా ఆశ్చర్యమే. ఇంటినుండి చాలా దూరంగా ఉన్నాను. మనం కలుసుకోవడం ఈ ఉత్తరాల ద్వారానే. కనుక ఉత్తరాలు రాకపోతే నేను చాలాదిగులు పడతాను. కనుక దయచేసి ప్రతివారం ఒక పోస్టుకార్డు విధిగా వ్రాయి. నా చిరునామా నీకు తెలియకపోతే నేను విచార పడుండేవాడిని కాను. కాని రెండు ఉత్తరాలు వ్రాసినపిమ్మట వ్రాయకపోతేనే నాకు విచారం కలుగుతున్నది. క్రిందటి మంగళవారంనాడు "ఇన్నర్ టెంపుల్"లో చేరినాను. ప్రస్తుతం ఇక్కడ చలి బాగా గజగజలాడిస్తున్నది. కాని ఇలాంటి చిరాకైన వాతావరణం ఎంతోకాలం ఉండదు. ఇంతచలిగా ఉన్నప్పటికీ, నాకు మాంసాహారం, సారా అవసరమేమీ కలుగడం లేదు. అందుచేత నామనస్సు కెంతో సంతోషం, తృప్తి కలుగు తున్నది. ఇప్పుడు నా ఆరోగ్యం చాలాబాగుంటున్నది. అమ్మకు, వదినకు నా నమస్కారములు.

[డి. జి. టెండుల్కర్ : మహాత్మా మొదటి భాగం. —గుజరాతీ ఉత్తరం ఫోటో నుండి]

# 4. లండన్‌లో దినచర్య

*[తనకు సహచరుడు, బంధువునైన ఛగన్‌లాల్ గాంధీ 1909 సంవత్స రంలో ప్రప్రథమంగా లండన్ ప్రయాణమయేటప్పుడు, ఆయన తెలుసుకుంటే ఎందుకైనా మంచిదని గాంధీజీ లండన్‌లో తన దినచర్యను తెలియచేశాడు.*

*డైరీ సుమారు 120 పుటల గ్రంథమైనది. దానిని 1920 వ సంవత్స రంలో శ్రీ ఛగన్‌లాల్ దేశాయి, శ్రీ మహదేవ దేశాయికిచ్చారు. అలా యిచ్చేముందు సుమారు 20 పేజీల గ్రంథాన్ని ఒక నోటు పుస్తకంలో తూచా తప్పకుండా వ్రాసు కున్నారు. దానినే యిచట ప్రచురిస్తున్నాము. మిగతా నూరు పేజీలు వరుసగా వ్రాయబడిన సమాచారం కాదు. 1888 మొదలు 1891 వరకూ, లండన్‌లో ఉన్నప్పుడు అప్పుడప్పుడు జరిగిన సంఘటనలు మాత్రమే.*

*అసలు మాతృక ఎక్కడా దొరుకలేదు. ఛగన్‌లాల్ వ్రాసుకున్న నకలు నుండే ఈ ప్రచురణ చేస్తున్నాం. సంపాదకులు వ్రాతలో స్ఖాలిత్యాలను మాత్రమే సవరించారు. ఎక్కడైనా ఒకమాట లోపిస్తే దానిని పూరించారు. చదువుకునేందుకు సుగమంగా ఉండేటట్లుగా పేరాలుగా విభజించారు.*

*గాంధీజీ 19 ఏండ్ల వయస్సువాడై ఉండగా ఈ దినచర్యను ఇంగ్లీషులో వ్రాశారు. అప్పటి కాయన ఇంగ్లీషు భాష ఇంకా వికసిస్తుండేస్థితిలో ఉన్నది.]*

లండన్,
నవంబరు 12 వ తేదీ 1888.

లండన్‌కు వెళ్ళాలనే అభిప్రాయం ఎందుకు కలిగింది ? దాదాపు ఏప్రిల్ మాసాంతంలో జరిగిన సంఘటన. చదువుకొనేనిమిత్తం లండన్ వెళ్లాలనేభావం కలిగేముందు ఆ నగరం ఎల్లా ఉంటుందో చూచి తెలుసు కోవాలనే అభిలాష గుంభనగా నా మనస్సులో ప్రవేశించింది. నేను

భావనగరులో కాలేజీలో చదువుకొనేటప్పుడు జయశంకర్ బూచ్‌తో కులాసాగా మాట్లాడడం తటస్థించింది. ఆ కబుర్లలో ఆయన నా స్వస్థలం కూడా సౌరత్ కనుక, జునాగడ్ సంస్థానంవారికి లండన్‌లో చదువుకొనే నిమిత్తం ఉపకారవేతన మిప్పించమని నన్ను విజ్ఞప్తి పంపుకోమని సలహా నిచ్చారు. ఆవేళ ఆయనకేమి జవాబిచ్చానో నాకు బాగా స్ఫుటంగా జ్ఞాపకంలేదు. బహుశా అలాంటి ఉపకారవేతనం రావడం అసంభవ మని భావించాననుకుంటాను. ఆనాటినుంచీ లండన్ వెళ్ళాలనే భావం నా మనసుకు పట్టింది. ఆ భావసిద్ధికోసం మార్గాల నన్వేషిస్తూనే ఉన్నాను.

1888 సంవత్సరం ఏప్రిల్ 13 వ తేదీని భావనగరం వదలి సెలవలు కులాసాగా గడపడానికి రాజకోట చేరేను. 15 రోజులైనాక, నేనూ మా అన్నయ్యా 'పత్వారి'ని చూడడానికెళ్ళేము. తిరిగివచ్చాక 'మావ్‌జీ జోషి (గాంధీ కుటుంబానికి అప్తుడు, సలహాదారుడు) ని చూచివద్దాం, అన్నాడు, మా అన్నయ్య. ఆలాగే వెళ్ళేము. మావ్‌జీ జోషి యథా ప్రకారంగా క్షేమసమాచారాలడిగేడు. భావనగరంలో నా చదువును గురించి కొన్ని ప్రశ్నలడిగేడు. నేను మొదటి సంవత్సరంలో పరీక్ష ప్యాసయే సావకాశమేమీ లేదనిచెప్పేను. ఆ చదువు చాలా కఠినంగా ఉందని చెప్పేను. ఆ మాటమీద, నన్ను సాధ్యమైనంత త్వరలో బారిష్టరు చదువుకోసం లండన్ పంపమని మా అన్నయ్యకు సలహా ఇచ్చాడు. 5 వేల రూపాయలు మాత్రమే ఖర్చు అవుతుందన్నాడు. "ఏదో కొంత మినప్పప్పు పట్టుకెళ్ళి, అన్నం వండుకుంటే మతసంబంధమైన అభ్యంతరం ఏమీ ఉండదు. ఈ సంగతి ఎవరితోనూ చెప్పవద్దు. ఏదో ఒక ఉపకారవేత నాన్ని సంపాదించండి. పోర్బందర్, జునాగడ్ సంస్థానాలకు దరఖాస్తులు పంపండి. కేవల్‌రామ్‌ను చూడండి (కేవలరామ్ కథియావార్‌లో పెద్ద ప్లీడరు). మీ కేవిధంగానూ ధనసహాయం లభించకపోతే, మీ దగ్గర సొమ్ము లేకపోతే మీ కుర్చీలు, బల్లలు వగైరా సామాగ్రిని అమ్మండి. ఏదో విధంగా మోహన్‌దాసును మాత్రం లండన్ పంపించండి. స్వర్గీయులైన మీ తండ్రిగారి కీర్తిని నిలబెట్టడానికి అదొక్కటే మార్గం" అన్నాడు. మా కుటుంబములోనివారందరికీ మావ్‌జీ జోషీగారి మాటంటే చాలాగురి. మా అన్నయ్య స్వభావం చాలా ఆషామాషీ. వెంటనే నన్ను లండన్ పంపుతానని వాగ్దానం చేశాడు. నా ప్రయత్నాని కిదే తరుణం.

మా అన్నయ్య ఈ సంగతి రహస్యంగా ఉంచుతానని వాగ్దానం చేశాడు కాని, ఆ రోజుననే కుశాల్‌భాయితో చెప్పేడు (కుశాల్‌భాయి దక్షిణ ఆఫ్రికాలో గాంధీజీతో పనిచేసిన మగన్‌లాల్, చగన్‌లాల్‌గార్ల తండ్రి. ఆయనకు పినతండ్రి కుమారుడు). మతం జాగ్రత్తగా కాపాడు కుంటే బాగానే ఉంటుందని ఆయన అంగీకరించాడు. ఆ రోజుననే మేఘ్‌జీభాయి (మరొక పినతండ్రి కొడుకు) తోకూడా చెప్పడమైనది. ఆయన పరిపూర్ణంగా అంగీకరించి రు. 5,000 లు నాకివ్వడానికి సంసిద్ధు డైనాడు. ఈ సంగతి పూజ్యురాలైన మా అమ్మగారికి చెప్పడంతోనే ఆమె, నా అమాయకత్వానికి మందలించింది. తీరా సమయమొచ్చే టప్పటికి ఆయన దగ్గరనుంచి ఏమీ డబ్బురాదని ఆమె అభిప్రాయం.

ఆరోజునే నేను కేవలరామ్‌భాయీ దగ్గర కెళ్ళవలసి ఉండుటచేత ఆయనను కలుసుకున్నాను. ఆయనతో జరిగిన సంభాషణ నాకేమీ తృప్తికరంగాలేదు. నా లక్ష్యాన్ని ఆయన అంగీకరించాడు. కాని, 'నువ్వు పదివేలైనా కనీసం ఖర్చు చేయాల'న్నాడు. నా పాలిటి అదొక పెద్ద దెబ్బలాతోచింది. "నీకేమైనా మతాచారాలుంటే, వదులు కోవాలి. నువ్వు మాంసం తినాలి. సారా త్రాగాలి. అవి లేకుండా బ్రతకలేవు. నువ్వు ఎక్కువ ఖర్చుచేసిన కొద్దీ ఎక్కువ తెలివైనవాడ వవుతావు. అది చాలా ముఖ్యమైన సంగతి. నేను దాపరికం లేకుండా నిర్మోగమాటంగా మాట్లాడుతున్నాను. కోపం తెచ్చుకోకు. చూడు! నువ్వింకా చాలా చిన్నవాడివి. లండన్‌లో చాలా ఆకర్షణలున్నాయి. నువ్వు ఆ ఉచ్చుల్లోపడే సావకాశాలు చాలా ఉన్నాయి" అన్నాడు. ఈ సంభాషణవల్ల నాకు కొంత నిస్పృహ కలిగింది. కాని నాకొక సంకల్పం కలిగిన తర్వాత దానినంతతేలికగా వదలిపెట్టే స్వభావం కలవాడనుకాను. కేవల్‌రామ్‌భాయీ నాకు గులాంమహమ్మద్‌మున్షీ ఉదాహరణను చెప్పేడు. ఉపకారవేతన మేదైనా సంపాదించడానికి మీరేమైనా సహాయం చేయగలరా అని అడిగినాను. చెయ్యలేనన్నాడు. అది తప్ప మరేసహాయమైనా సంతోషంతో చేస్తానన్నాడు. ఈ సంగ తంతా మా అన్నయ్యతో చెప్పేను.

తర్వాత, ప్రేమస్వరూపురాలైన మా అమ్మగారి అనుజ్ఞను పొందే పని నామీద పడింది. ఆ పని అంత కష్టమైనదిగా నేను భావించలేదు. ఒకటిరెండు రోజులైన పిమ్మట నేనూ మా అన్నయ్యాకలసి కేవల్‌రామ్‌ను

చూడడాని కెళ్ళేము. ఆయన చాలా పనితొందరమీద ఉన్నప్పటికీ మాతోమాట్లాడేడు. ఒకటిరెండు రోజులక్రితం నేను మాట్లాడిన సంగతులే తిరిగి ప్రస్తావించాము. నన్ను పోర్బందరు పంపమని మా అన్నయ్యకు సలహా ఇచ్చాడు. మా అన్నయ్య అంగీకరించాడు. మేము ఇంటికి తిరిగొచ్చేశాము. నేను మా అమ్మతో ఈ విషయమై ఛలోక్తిగా ప్రస్తావన చేయడం ప్రారంభించాను. వేళాకోళం నిజమైనది. ఒకానొక రోజున నా పోర్బందర్ ప్రయాణం నిశ్చితమైనది.

రెండుమూడుసార్లు నేను ప్రయాణానికి సిద్ధపడ్డాను కాని, ఏదో ఒక అడ్డంకు సంభవిస్తూవచ్చింది. ఒకసారి నేను జవేర్‌చంద్‌తో కలిసి వెళ్లడానికి స్థిరపరచుకున్నాను. తీరా బయలుదేరేసమయాని కొకగంట ముందు ఒకపెద్ద ప్రమాదం జరిగింది. నాస్నేహితుడైన షేక్‌మెహతాబ్ (గాంధీజీ బాల్యస్నేహితుడు. అతనిని మంచిదారిలో పెట్టడానికి గాంధీజీ 7 సంవత్సరాలు కృషిచేసి విఫలుడైనాడు) తో నేనెప్పుడూ తగాదాలు పడుతుండేవాడిని. నేను ప్రయాణమయ్యేరోజున ఈ తగాదాలను గురించిన ఆలోచనలలో నిమగ్నుడనైనాను. ఆ రాత్రి గానసభ జరిగింది. కాని నేను బాగా ఆనందించలేకపోయాను. రాత్రి పదిన్నరగంటలకు గానసభ ముగిసింది. మేమందరం మేఘ్‌జీభాయ్‌ని, రామీని చూడదలచి బయలుదేరినాము. దారిలో లండన్‌ను గురించిన పిచ్చిఆలోచనలొకవైపు నుంచీ, షేక్‌మెహతాబ్‌ను గురించిన ఆలోచన యింకొకవైపునుంచీ నాతలంతా ముంచెత్తినవి. ఈ ఆలోచనలలో నిమగ్నుడనై ఉండి, నాకు తెలియకుండానే ఎదుటనున్న బండికి గుద్దుకున్నాను. నాకు ఒక మాదిరి దెబ్బతగిలింది. అయినప్పటికీ ఇతరుల సహాయాన్ని అపేక్షించకుండానే నడిచాను. నాతల బాగా దిమ్మెత్తిపోయిందనుకుంటాను. అలాగే మేఘ్‌జీభాయి ఇంట్లో ప్రవేశించాం. అక్కడ ఒక రాతికి గుద్దుకుని మళ్లీ దెబ్బ తగిలించుకున్నాను. నాకు పూర్తిగా స్పృహ తప్పిపోయింది. ఆ తర్వాత ఏమైనదో నాకు తెలియదు. కాని కొన్ని అడుగులు వేసిన పిమ్మట చాపచుట్టగా నేలమీద పడ్డానని వాళ్లు చెప్పేరు. అయిదు నిముషాలవరకూ నాకు స్పృహ రాలేదు. నేను చచ్చిపోయాననుకున్నారు. కాని అదృష్టవశాత్తూ నేను పడిననేల చాలాచదునైనది. నాకు స్పృహ వచ్చింది. అంతా సంతోషించారు. ఇంతలో మా అమ్మకు కబురు వెళ్లింది. ఆమెవచ్చి నన్నుచూచి చాలా విచారించింది. ఇందువల్ల

నా ప్రయాణం ఆగింది. నాశరీరంలో బాగానే ఉన్నదని నేను చెప్పినా వాళ్లెవ్వరూ నా ప్రయాణాని కంగీకరించలేదు. ధైర్యస్థురాలైన మా అమ్మగారు, లోకులేమంటారో అని సందేహించిందికాని, నన్ను పంపడాని కంగీకరించేదనే తర్వాత నాకు తెలిసింది. చివరకు కొన్ని రోజులైన పిమ్మట రాజకోటను వదలి పోర్బందరు వెళ్లడానికి నాకు అనుమతి లభించింది. దారిలోకూడ నేననేక కష్టాలనెదుర్కోవలసివచ్చింది.

చివరకు నేను పోర్బందరు చేరుకొన్నాను. అందరూ సంతోషించారు. ఇంటికి తీసుకెళ్లడానికి లాల్ భాయ్, కర్సన్ దాస్ (గాంధీజీ పినతండ్రి కొడుకు, పెద్దన్న) గార్లు ఖడీ వంతెన దగ్గర కెదురొచ్చారు. నేను పోర్బందరులో చేయవలసిన పనులు మూడు. మా బాబయ్యగారి దగ్గరనుండి అనుమతిపొందడం ఒకటి. ఏమైనా ధనసహాయం చేయమని, 'లీలీ' (పోర్బందరు రాజు మైనరైనందున ఆసంస్థానాన్ని పరిపాలిస్తున్న బ్రిటిష్ ఏజంటు) గారికి దరఖాస్తుపెట్టడం రెండు. సంస్థానంవారివల్ల ఉపకారవేతనం లభించకపోతే పరమానందభాయి (గాంధీజీ పినతండ్రి కుమార్డు) ని ధనసహాయం చేయమని కోరడం మూడు. మొదట మా బాబయ్యగారి దగ్గరకెళ్లి నేను లండన్ వెళ్లడం మీ కిష్టమా కాదా అని అడిగేను. అందుమీద ఆయన సహజంగా లండన్ వెడితే వచ్చే లాభాలను వివరించమని అడిగేడు. నా చేతనైనంతవరకూ విశదీకరించాను. "ఈ కాలపువాళ్ళు అందుకు చాలా ఇష్టపడేమాట వాస్తవమే. కాని నామట్టుకు నాకిష్టంలేదు. అయినప్పటికీ తర్వాత ఆలోచిద్దాం" అన్నాడు ఆయన. ఆయన జవాబుకు నాకేమీ ఆశాభంగం కలుగలేదు. అంతర్యంలో ఆయన కిష్టమేనని తెలుసుకుని సంతృప్తిపడ్డాను. తర్వాత ఆయన చర్యలను బట్టి నేనూహించినది సరియైనదేనని నిర్ధారణైనది.

నా దురదృష్టంకొలదీ, లీలీగారు పోర్బందరులో లేరు. కష్టాలు పరంపరగా గాని రావనేమాట చాలాసత్యం. ఆయన జిల్లాలోనుంచి తిరిగి రావడంతోనే శలవుమీద వెళ్లనున్నారు. వచ్చే ఆదివారందాకా ఆయనకోసం ఆగమని బాబయ్యగారు సలహా ఇచ్చారు. అప్పటికి ఆయన తిరిగిరాకపోతే ఆయనెక్కడుంటే అక్కడికే నన్ను పంపుతామన్నారు. కాని ఆయన ఆదివారానికి జిల్లానుంచి తిరిగివచ్చారని వ్రాయడానికి చాలాసంతోషిస్తున్నాను. సోమవారంనాడు ఆయనను




పోర్బందరులో గాంధీజీ జన్మించిన ఇల్లు.



గాంధీజీ విద్యనభ్యసించిన, రాజకోటలోని ఆల్ఫ్రెడ్ ఉన్నత పాఠశాల.

చూడడానికి నిశ్చయమైనది. ఆ ప్రకారమే చూచాను. నాజీవితంలో ఒక ఆంగ్లేయునితో సంభాషించడం అదే మొదటిసారి. అంతకుముందు వాళ్ల ఎదుటికెళ్లడానికే నాకు ధైర్యం చాలేదికాదు. కాని లండన్ వెళ్లాలనే ఉబలాటం నాకు ఆ ధైర్యాన్ని కలిగించింది. నేను గుజరాతీలో కొద్దిగా సంభాషణ చేశాను. ఆయన చాలా తొందరలో ఉన్నారు. మేడ మెట్లెక్కుతూ నాతో మాట్లాడేరు. పోర్బందరు చాలా బీదసంస్థానమనీ, కనుక నాకేమీ సహాయం చేయజాలదనీ చెప్పేరు. అయినప్పటికీ ముందుగా భారతదేశంలో పట్టభద్రుడైన పిమ్మట ఏమైనా నాకు సహాయం చేయగలుగుతానేమో చూస్తానన్నారు. ఆయన జవాబు నాకు చాలా ఆశాభంగం కలిగించింది. ఆయన అటువంటి జవాబిస్తాడని నేను అనుకోలేదు.

ఇక, పరమానందభాయిని ౫ వేలరూపాయ లిమ్మని అడుగక తప్పిందికాదు. నా లండన్ ప్రయాణానికి మా బాబయ్యగా రంగీకరిస్తే ఆయన సంతోషంతో ఇస్తానన్నారు. ఈ పని కాస్తంత కష్టమైనదే ననుకున్నాను. కాని ఏమైనాసరే బాబయ్యగారి అంగీకారం పొందడానికి నిశ్చయించుకున్నాను. ఆయనేదో తొందరపనిలో ఉండగా దగ్గరకెళ్లి "బాబయ్యగారూ! నేను లండన్ వెళ్లేవిషయంలో మీ అభిప్రాయమేమిటో చెప్పండి. ఇప్పుడు మీ దగ్గరకురావడంలో నా అభిప్రాయం మీ అంగీకారాన్ని పొందడమే" అన్నాను. "నేను అందు కంగీకరించలేను. నేను యాత్రకెడుతున్నానని నీకు తెలియదా! అలాంటప్పుడు లండన్ వెళ్లడం నాకిష్టమేనని చెప్పడం నాకు నామోషీకాదూ? అయినప్పటికీ మీ అమ్మ, మీ అన్నయ్య ఇష్టపడితే నేనేమీ అభ్యంతరం పెట్టను" అని జవాబు చెప్పేరు. "నేను లండన్ వెళ్లడానికి మీరభ్యంతర పెట్టే టట్లయితే, పరమానందభాయీ నాకు ధన సహాయం చేయకుండా చేస్తున్నారని మీకు తెలియడం లేదు" అని నేనన్నాను. నేనా మాటనడంతోటే ఆయన చాలా కోపంతెచ్చుకొని "అలాగా! ఓరి నాయనా, ఆయన అలా ఎందుకంటున్నాడో నీకు తెలియడం లేదు. నీ ప్రయాణానికి నే నంగీకరించనని ఆయనెరుగును. అందుచేత ఈ వంక పెట్టేడు. నిజమేమిటంటే, ఆయనెపుడూ నీకేమీ సహాయం చేయడు. ఆయనచేస్తే నేనేమీ అభ్యంతరపెట్టను" అన్నారు. మాసంభాషణ ఆ విధంగా ముగిసింది. అప్పుడు నేను చాలా సంతోషంతో పరమానంద

భాయ్ దగ్గరకు పరుగెత్తుకెళ్లి నాకూ మా బాబయ్యకూ జరిగిన సంభాషణంతా పూసగుచ్చినట్లు యథాతథంగా చెప్పేను. అదంతా విన్నాక ఆయనకూ చాలా కోపం వచ్చింది. కాని 5 వేలరూపాయ లివ్వడానికి వాగ్దానం చేశాడు. ఆయన వాగ్దానంచేయడంతోనే, అందులోనూ ఆయన కుమారుని మీద ప్రమాణంచేసి చెప్పడంతో నేను పరమానందభరితుడనైనాను. ఇక అప్పటినుంచి, నేను లండన్ వెళ్లడం తథ్యమనుకున్నాను. పిమ్మట పోర్బందరులో కొన్నినాళ్లున్నాను. నేను ఉన్నకొద్దీ ఆయన వాగ్దానం మరింతగా బలపడింది.

ఇదిల్లా ఉండగా నాపరోక్షంలో రాజకోటలో మరొక్కసంగతి జరిగింది. బహుటక్కరియైన నా స్నేహితుడు షేక్ మెహతాబ్, మేఘజీ భాయికి ఆయన చేసిన వాగ్దానాన్ని జ్ఞాపకంచేస్తూ, నాకు 5,000 రూపాయలు అవసరంగా కావలసియున్నవని, నాసంతకంపెట్టి ఒక దొంగ (ఫోర్జరీ) ఉత్తరం వ్రాశాడు. ఆ ఉత్తరం ఆయనకు చూప బడింది. అది నేను వ్రాసినట్లుగానే చలామణి అయింది. అంతటితో ఆయనరోషం తెచ్చుకుని, నాకు 5 వేల రూపాయలివ్వటానికి దైవసాక్షిగా వాగ్దానంచేశాడు. నేను రాజకోట చేరేవరకు ఈ విషయాన్ని నాకుచెప్పలేదు.

ఇక పోర్బందరు సంగతులకొద్దాం. చివరకు నా ప్రయాణానికొక ముహూర్తం నిర్ణయింపబడింది. నా బంధువులందరి వద్దనూ సెలవు పుచ్చుకొని, మా అన్నగారైన కర్మన్‌దాస్‌తోనూ, పరమలుబ్ధుడైన మేఘజీ భాయి తండ్రితోనూ కలసి రాజకోటకు ప్రయాణమైనాము. రాజకోట వెళ్లడానికి ముందు, కుర్చీలు బల్లలు వగైరాలు అమ్మివేయ డానికీ, అక్కడి మకామును ఎత్తివేయడానికీ భవనగర్ వెళ్లేను. ఆ పనంతా ఒక్కరోజులో పూర్తిచేసుకుని, పిమ్మట అక్కడి ఇరుగు పొరుగు స్నేహితులందరనూ ముఖ్యంగా దయార్ద్రహృదయంగల మా ఇంటి యజమానురాలిని బహువిచారంతో వదలి పెట్టగలిగేను. వారి ఆదరణను, అనూపరామ్ వగైరాల దయను ఎన్నటికీ మరువజాలను. ఇదంతా అయిన పిమ్మట రాజకోట చేరేను.

మూడు సంవత్సరాలపాటు విదేశ నివాసమునకు పోయేముందు నేను కలనల్‌వాట్సన్ (రాజకోటలో ఉండే కథియావార్ పొలిటికల్ ఏజంటు) ను చూడవలసి ఉండెను. 1888 జూన్ 19 వ తేదీనాటికి

ఆయన రాజకోటకు రాగలడు. నేను మే నెలారంభానికే రాజకోట చేరడంచేత అందాకా వేచిఉండడం చాలాకాలమనే అనిపించింది. కాని గత్యంతరం లేదు. కలనల్ వాట్సన్‌వల్ల బాగా ఉపకారం జరుగుతుందని మా అన్నగారు ఆశపెట్టుకున్నారు. ఆరోజులు నిజంగా చాలాకష్టమైనవి. రాత్రులు బాగా నిద్రపట్టేదికాదు. కలలు చాలా బాధపెడుతుండేవి. కొందరు లండన్ వెళ్లవద్దని దిగజారుస్తుండేవారు. మరికొందరు వెళ్లమని సలహా ఇస్తుండేవారు. ఒక్కొక్కప్పుడు మా అమ్మగారుకూడా వెళ్ల వద్దనేది. అంతకన్న ఆశ్చర్యమేమంటే మా అన్నయ్యకూడా తరుచుగా తన అభిప్రాయాన్ని మార్చుకుంటూ ఉండేవాడు. కనుక నేను బహుసందిగ్ధావస్థలో ఉండేవాడిని. కాని, నేనొక పనిని ప్రారంభించిన పిమ్మట మధ్యలో వదలిపెట్టనని వారందరికీ తెలుసును. కనుక మాట్లాడ కుండా ఊరుకునేవారు. అప్పుడే, మేఘజీభాయి చేసిన వాగ్దానాన్ని గురించి ఆయన మనసులోని అభిప్రాయమేమిటో నన్ను తెలుసుకో మన్నాడు, మా అన్నయ్య. దాని పర్యవసానం చాలా ఆశాభంగం కలిగించింది. అప్పటినుంచీ ఆయన నా యెడల శత్రుత్వాన్ని వహించాడు. ప్రతివాళ్ల ఎదుటా నన్ను గురించి చాలా చెడ్డగా మాట్లాడుతూ వచ్చాడు. నేను మాత్రం వాటిని లక్ష్యపెట్టలేదు. ప్రేమస్వరూపురాలైన మా అమ్మగారికి మాత్రం ఆయన మీద చాలా కోపం వచ్చేది. అప్పుడప్పుడు కటకటపడుతూ ఉండేది. కాని నేను ఆవిడను తేలికగా ఓదార్చేవాడిని. మా అమ్మ, అత్యంత ప్రేమాస్పదురాలైన మా అమ్మ, నాకోసం కన్నీరు కారుస్తుంటే, నేనామె నోదార్చి కడుపుబ్బ నవ్వించగలిగిన సంతృప్తి నాకుండేది. చివరకు కలనల్ వాట్సన్ వచ్చాడు. నేనాయన దర్శనం చేశాను. 'నేనాసంగతి ఆలోచిస్తాను' అన్నాడు కాని నాకేవిధమైన సహాయం లభించలేదు. చాలా కష్టంమీద ఒక చిన్న పరిచయపత్రాన్ని మాత్రమే ఆయనవద్ద నుంచి సంపాదించగలిగానని చెప్పవలసివచ్చినందుకు నాకు చాలా కించగలుగుతోంది. దానినిచ్చేటప్పుడు చాలా పుల్లవిరుపుగా, దీని విలువ ఒక లక్షరూపాయలన్నాడు. ఇప్పుడు అదంతా తలుచుకుంటే నాకు నవ్వొస్తోంది.

నా ప్రయాణ ముహూర్తం నిర్ణయమైనది. మొదట ఆగస్టు 4 వ తేదీ స్థిరపరుపబడింది. కాని వ్యవహారం ఒడుదుడుకులలో పడింది. నేనింగ్లండు వెడుతున్నట్లు పత్రికలలో పడింది. నాప్రయాణాన్ని గురించి

మా అన్నయ్యను ఎవరోఒకరు అడుగుతూనే ఉండేవాళ్లు. ఆయన నా ప్రయాణ సంకల్పాన్ని విరమించుకోమన్నాడు. కాని నేనంగీకరించలేదు. అప్పుడాయన రాజకోట సంస్థానాధీశులైన ఠాకూర్ సాహేబ్ దర్శనంచేసి నాకేమైనా ధన సహాయం చేయమని కోరేడు. కాని ఆయన దగ్గరనుంచి ఏమీ సహాయం లభించలేదు. నేను ఆఖరుసారిగా ఠాకూర్ సాహేబ్ గారిని, కలనల్ వాట్సన్ గారినీ సందర్శించాను. ఠాకూరు సాహేబు గారి వద్దనుంచి ఒక ఛాయాపటాన్ని, వాట్సన్‌గారి దగ్గరనుంచి పరిచయపత్రాన్ని పొందేను. వారి ఎదుట నేను పుష్కలంగా ముఖస్తుతి చేయడం నాకే చాలా చిరాకు, ఆగ్రహం కలిగించినదని ఇక్కడ వ్రాయక తప్పదు. అమాయకుడైన నా ప్రియసోదరుని మూలమునగాని, లేకపోతే అలాంటి ముఖస్తుతి చేసేవాడిని కాను. చివరకి, పదవ ఆగష్టునాడు మా అన్నయ్యా, షేక్ మెహతాబ్, నాతూభాయ్ కుశాల్‌భాయ్, నేనూ ప్రయాణమైనాము.

నేను రాజకోటనుండి బొంబాయి వెళ్లేను. ఆవేళ శుక్రవారం రాత్రి. మా బడిలోని పిల్లలందరూ నాకు వీడ్కోలుపత్రాన్ని సమర్పించారు. ఆ పత్రానికి సమాధానం చెప్పడానికి ప్రారంభించేసరికి నా మనస్సేదో ఆందోళనలో పడింది. నేను చెప్పవలసిన మాటలు సగంచెప్పేసరికి ఒళ్లంతా వణకడం మొదలెట్టింది. భారతదేశానికి తిరిగి వచ్చాక ఇలాంటిపని చేయనని ఆశిస్తున్నాను.

ఆ రాత్రి చాలామందివచ్చి వీడ్కోలు చెప్పేరు. కేవల్‌రామ్, ఛగన్‌లాల్ (పట్వారీ), వ్రజలాల్, హరిశంకర్, అములక్ మాణెక్‌చంద్, లతీబ్ పోపత్, ఖంజీ, ఖింజీ, రాంజీ, దామోదర్, మేఘజీ, రాంజీ కాళిదాస్, నారాయణజీ, రంచోడ్‌దాస్, మణిలాల్ మొదలైనవారంతా ఆ వచ్చినవారిలో ఉన్నారు. జటాశంకర్ విశ్వనాథ్‌ను తదితరులను కూడా కలుపుకో వచ్చును. మొదటి స్టేషన్ గొండాల్. అక్కడ డాక్టర్ భావ్ కలుసు కున్నాడు. కపూర్‌భాయ్‌ను మాలో కలుపుకున్నాం. నాతూభాయ్ జేట్‌పూరువరకు వచ్చాడు. ధోలా స్టేషన్‌లో ఉస్మాన్ భాయి కలుసుకుని వఢ్వాన్‌దాకా వచ్చాడు. ధోలా స్టేషన్‌లో నారాయణదాస్, ప్రాణ్ శంకర్, నర్ భేరామ్, ఆనందరాయ్, వ్రజలాలు కలుసుకొని వీడ్కోలు చెప్పేరు.

21 వ తారీఖున నేను బొంబాయి వదలిపెట్టవలసి ఉండెను. బొంబాయిలో నేను నిగ్రహించుకోవలసిన కష్టాలు వర్ణనాతీతం. నా కులస్థులు, ఇకముందు కెళ్లకుండా ఎన్ని ప్రయత్నాలు చేయాలో అన్నీ చేశారు. కొంచెమించుగా అందరూ నాకు వ్యతిరేకులే. చివరకి మా అన్న కుశాల్ భాయ్, పత్వారీ కూడా వెళ్లవద్దనే సలహా ఇచ్చారు. నేను వాళ్ల సలహాలను వినదలచుకోలేదు. సముద్రవాతావరణం బాగాలేదనే వంకను నా ప్రయాణం వాయిదాపడింది. మా అన్నయ్య, తదితరులు నన్ను వదలి వెళ్లిపోయారు. 4 వ సెప్టెంబరు రోజున హఠాత్తుగా ప్రయాణం సాగింది. ఈసారి జగన్మోహన్‌దాస్, దామోదరదాస్, బేచార్‌దాస్ గార్లకు నేను చాలాకృతజ్ఞుడను. సహజంగా, శ్యామల్‌జీకి కూడా చాలా ఋణపడున్నాను. రంచోడ్‌లాల్ (రంచోడ్‌లాల్ పట్వారీ గాంధీజీకి చాలా ఆంతర్యంలోనివాడు. గాంధీజీతో ఉత్తరప్రత్యుత్తరాలు జరుపుతూ ఉండేవాడు. పత్వారీ తండ్రి గాంధీజీ ఇంగ్లండు ప్రయాణానికి ధన సహాయంచేశాడు) కు నేనెంత ఋణగ్రస్థుడనో నాకేతెలియదు. మా మూలు కృతజ్ఞతకన్న చాలా అతీతమైన విషయం. శ్రీయుతులు జగమోహన్‌దాస్, మాన్‌శంకర్, బేచార్‌దాస్, నారాయణదాస్ పట్వారీ, ద్వారకదాస్, పోపత్‌లాల్, కాశీదాస్, రంచోడ్‌లాల్, మోడీ, ఠాకూర్, రవిశంకర్, ఫిరోజ్‌షా రతన్‌షా, శ్యామల్‌జీ మొదలైనవారు కొందరు, నేను 'క్లైడ్' స్టీమరు నెక్కేవరకు వచ్చి సాగనంపేరు. వారిలో పట్వారీ 5 రూపాయలిచ్చాడు. శ్యామల్జీకూడా అంతే ఇచ్చాడు. మోడీ రెండు, కృష్ణదాస్ ఒకటి, నారాయణ్‌దాస్ రెండు ఇచ్చారు. మరి కొందరుకూడా ఇచ్చారు కాని నాకు జ్ఞాపకం లేదు. శ్రీ మాన్‌శంకర్ ఒక వెండి గొలుసిచ్చాడు. పిమ్మట అందరూ మూడేళ్లు సుఖంగా గడిపి రమ్మని వీడ్కోలు చెప్పి వెళ్లిపోయారు. నేను ముగించేముందు ఒక్క విషయం వ్రాయక తప్పదు. మరెవ్వరైనా నేనుండిన పరిస్థితులలోనే ఉన్నట్లయితే, ఇంగ్లండు దర్శనం చేయగలిగేవారు కాదు. నేను ఎదుర్కొన్న కష్టాలవల్లనే నాకు ఇంగ్లండు మామూలుకన్న ఎక్కువ ఆప్యాయమైనది.

**4 వ సెప్టెంబరు 1888 :** సముద్రయానము. ఓడ లంగరెత్తేసరికి సాయంకాలము 5 గంటలైనది. సముద్రప్రయాణమంటే నాకు చాలా ఆత్రతగా ఉండేది. అదృష్టవశాత్తు నాకు ప్రయాణం సరిపడింది.

సముద్రంమీద ప్రయాణం చేస్తున్నంతకాలం నాకేమీ సముద్రపు సుస్తీ చేయలేదు. డోకు వెళ్ళలేదు. నాజీవితంలో స్టీమరులో సముద్రముమీద ప్రయాణంచేయడం ఇదే మొదటిసారి. ప్రయాణంలో నేను చాలా ఆనందం పొందేను. సాయంకాలం 6 గంటలకు భోజనానికి గంట కొొట్టేరు. స్టూవర్డు (సరంగు) వచ్చి భోజనాలబల్లదగ్గరకు రమ్మనమని చెప్పేడు. నేను వెళ్లలేదు. కూడాతెచ్చుకున్న పదార్థాలను పుచ్చుకున్నాను. మొదటి రాత్రి పరిచయంతోనే శ్రీముజుందారు నాతో చాలా చనువుగా ప్రవర్తించడం నాకు చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది. చిరకాలంనుంచి స్నేహమున్నట్లుగా ఆయననాతో మాట్లాడేడు. ఆయనకు నల్లకోటులేదు. కనుక నాకోటు ఆయన కిచ్చాను. దానిని ధరించి ఆయన భోజనాల బల్లదగ్గరకెళ్లేడు. ఆ రాత్రినుంచి నాకాయనయడల ప్రీతి జనించింది. ఆయన తాళంచెవులు నాచేతికిచ్చాడు. ఆ రాత్రినుంచీ ఆయనను పెద్దన్నగారిలా భావించుకొనడం మొదలు పెట్టేను. ఏడెన్ వరకూ మహారాష్ట్రుడైన ఒక డాక్టరుగారు కూడా మాతోవున్నారు. మొత్తంమీద ఆయనకూడా మంచివాడిలాగే కనుపించాడు. అలా రెండు రోజులవరకూ నాదగ్గరున్న మిఠాయిలను, పండ్లను తిని కాలక్షేపం చేశాను. తర్వాత, ముజుందారు ఓడమీదనున్న కొందరు కుర్రవాళ్లతో ఆహారం తయారుచేసి పెట్టడానికొక ఏర్పాటు చేశాడు. అలాంటి ఏర్పాటు నేను చేయగలిగి ఉండేవాడినికాను. మేము సెలూన్ ప్రయాణీకులం. అబ్దుల్ మజీద్ అనే ఆయన మొదటితరగతి ప్రయాణీకుడు. ఆ పిల్లవాడు తయారుచేసిన ఆహారాన్ని ఆనందంతో భోజనం చేశాం.

ఇక స్టీమరునుగురించి: స్టీమరు ఏర్పాట్లు నాకు బాగానచ్చినవి. గదుల్లోకాని, సెలూన్‌లలోకాని కూర్చున్నప్పుడు అవి ఓడలోని భాగాలనే మాటయే మరచిపోతాము. ఒక్కొక్కప్పుడు ఓడ చలనముకూడా మనకు తెలియదు. ఓడలోని పనివాళ్లయొక్క నావికులయొక్క చాక చక్యము చాలామెచ్చుకోదగినది. స్టీమరులో సంగీతసాధనాలు కూడా ఉండినవి. అప్పుడప్పుడు నేను పియానోమీద వాయిస్తూవచ్చాను. పేక, చదురంగం, డ్రాఫ్టులు వగైరా ఆటలుకూడా ఉండినవి. యూరోపియను ప్రయాణీకులు రాత్రివేళలలో ఏవో ఆటలాడుతుండేవారు. ప్రయాణీకులకు వసారాలు చాలా విశ్రాంతిదాయకములు. గదుల్లో కూచుని కూచుని ప్రాణం విసుగుతుంది. వసారాల్లో స్వచ్ఛమైన గాలిని పీల్చవచ్చును. తోటి

ప్రయాణీకులతో కలసిమెలసి తిరుగుతూ, తగినంత సమర్థతా, ధైర్యం ఉంటే వారితో సంభాషణలు సాగించవచ్చును. ఆకాశం తెరపిగా ఉంటే సముద్రం చూడడానికి కన్నులపండుగగా ఉంటుంది. ఒక వెన్నెలరాత్రి నేను సముద్రాన్ని చూస్తూకూచున్నాను. నీటిలోచంద్రుని ప్రతిబింబమును చూడకలిగేను. కెరటాలవల్ల చంద్రుడు అటూ ఇటూ ఊగుతున్నాడా అనిపించింది. ఒక చీకటిరాత్రివేళ ఆకాశం తెరపిగా ఉండి నీళ్లలో నక్షత్రాలు ప్రతిబింబించాయి. ఆసమయంలో ఎటుచూచినా బహుసుందర మైన దృశ్యమే. మొదట్లో అదేమిటో ఊహించుకోలేక పోయాను. అవన్నీ విరజల్లిన వజ్రాల్లా కనుపించాయి. వజ్రాలు నీట్రిలో తేలవని నేనెరుగుదును. అప్పుడు రాత్రిళ్లుమాత్రమే కనుపించే పురుగులేమో ననుకున్నాను. ఈ లాంటి ఆలోచనాపరంపరలోపడి ఆకాశంకేసి చూచాను. వెంటనే అవి నీటిలో ప్రతిబింబించే నక్షత్రాలు కదాయని తెలుసుకున్నాను. నా అవి వేకానికి నేనే నవ్వుకున్నాను. నక్షత్రాల ప్రతిబింబాలు బాణాసంచాను జ్ఞప్తికి తెస్తుంటాయి. నీ బంగళా మేడమీద నిలబడి నీ ఎదుట కాలుస్తున్న బాణాసంచాను చూస్తున్నావని ఊహించుకో. నేను తరుచుగా ఆలాంటి దృశ్యాన్ని ఆనందించాను.

కొన్ని రోజులువరకూ నేను తోడి ప్రయాణీకులతో ఒక్కమాటైనా మాట్లాడలేదు. ప్రతిరోజూ ఉదయం 8 గంటలకు లేస్తూ ఉండేవాడిని. దంతధావనం చేసి కాలకృత్యాలు తీర్చుకొని స్నానంచేసేవాడిని. ఇంగ్లీషు వాళ్ల పాయిఖానాలు భారతీయ ప్రయాణీకులకు చాలా వికృతంగా ఉంటవి. అక్కడ నీళ్లుండవు. అందుచేత కాగితం ఉపయోగించక తప్పదు.

5 రోజులపాటు సుఖంగా సముద్రయానంచేసి ఏడెన్ చేరుకున్నాం. ఇన్నాళ్లు ఒక బూభాగంకాని, కొండగాని మాకంటబడలేదు. మాకందరకూ విసుగుపుట్టి, భూమి ఎప్పుడు కంటబడుతుందా అని ఆత్రతగా ఉన్నాం. చిట్టచివరకు ఆరవరోజున ఉదయానికి భూదర్శనమైంది. అందరిముఖాలూ వికసించాయి. సుమారు 11 గంటలకు స్టీమరు ఏడెన్‌లో లంగరేసింది. చిన్నచిన్న పడవలలో కొందరు పిల్లవాళ్లు వచ్చారు. వాళ్లు గజఈతగాళ్లు. కొందరు యూరోపియనులు నీళ్లల్లో డబ్బు పడేశారు. ఆ పిల్లవాళ్లు నీళ్లల్లో నికి లోతుగా మునిగి ఆ డబ్బును తీసికొనేవారు. నేనుకూడా ఆలాచేయ గలిగితే బాగుండుననిపించింది. అది చాలా చక్కని దృశ్యం. ఆ దృశ్యాన్ని

ఒక అరగంట చూచినపిమ్మట ఏడెన్ చూడడానికెళ్లేము. నీళ్లల్లో మునిగి పిల్లలు డబ్బులు తీస్తుంటే ఊరికే మేము చూశాం కాని ఒక పైసాకూడా వేయలేదు. ఆ రోజునుంచీ కూడా ఇంగ్లండులో అయ్యే ఖర్చు ఏలా ఉంటుందో అనుభవించడం ప్రారంభించాము. మేము ముగ్గురము కలసి పడవకేవు రెండురూపాయ లివ్వవలసి వచ్చింది. తీరం ఒక మైలులోపు. 15 నిముషాలలో చేరుకున్నాం. అక్కడ ఒక బండి అద్దెకు పుచ్చుకున్నాం. ఏడెన్‌లో చూడదగిన దొక్క మంచినీటి నిర్మాణమే. దానినే చూడాలను కున్నాం. కాని దురదృష్టవశాత్తూ టైము చాలకపోవడంచేత అక్కడికెళ్ల లేక పోయాము. ఏడెన్ క్యాంపు చూశాం. అది బాగానే ఉంది. భవనాలు బాగున్నాయి. అవి ఎక్కువగా దుకాణాలు. బహుశా రాజకోటలోని బంగాళాలలాగునే ఉంటాయి. ముఖ్యంగా పొలిటికల్ ఏజంటు కొత్త బంగాళాలా ఉంటుంది. అక్కడ మంచినీళ్ల నుయ్యికాని మరొక జలా ధారం కాని నాకు కనబడలేదు. బహుశా చెరువులే మంచినీటి వనరు లను కుంటాను. ఎండ వేడిమి చాలా ఎక్కువగా ఉండినది. నాశరీరమంతా చెమటతో తడిసిపోయింది. ఎఱ్ఱసముద్రానికి దగ్గరవడమే అందుకు కారణం. ఒక చెట్టుగాని ఆఖరుకు ఆకుపచ్చని మొక్కగాని ఎక్కడా కనుబడకపోవడం నాకుచాలా ఆశ్చర్యమైంది. గాడిదలమీద, కంచర గాడిదలమీద మనుష్యులు స్వారి చేస్తుంటారు. ఇష్టమైతే మనంకూడా కంచరగాడిదలను అద్దెకు పుచ్చుకోవచ్చును. క్యాంపు (మకాం) కొండ మీద ఉన్నది. నేను తిరిగివచ్చేటప్పుడు పైన వ్రాసిన బాలురను గురించి పడవవాళ్లను వాకబుచేశాను. ఆ పిల్లలకు ఒక్కొక్కపుడు చాలా ప్రమాదాలు సంభవిస్తుంటాయనీ, సముద్రంలోని పెద్ద జంతువులు వాళ్ల చేతులూ కాళ్లూ కొరికేస్తుంటాయనీ చెప్పేరు. కాని వాళ్లు చాలా పేద వాళ్లవడంచేత మనం కూర్చోడానికి సాహసించలేని చిన్న పడవలలో ఎక్కుతారు. మేము బండి కిరాయి క్రింద తలొక రూపాయ ఇచ్చుకో వలసి వచ్చింది. 12 గంటలకు స్టీమరులంగరెత్తేశారు. ఏడెన్ వదిలిపెట్టేం. కాని ఆరోజునుంచి రోజూ ఎప్పుడో ఒక్కపుడు భూమి కనబడుతూనే ఉండేది.

సాయంకాల మయ్యేసరికి ఎఱ్ఱసముద్రంలో ప్రవేశించాము. ఎండ వేడిమి అందుకుంది. కాని బొంబాయిలో కొందరు వర్ణించినంత నిప్పులు చెరిగేటట్లు లేదు. గదుల్లో కూచుంటే దుర్భరంగానే ఉన్నది. ఎండలో

కూర్చోడం సాధ్యంకాదు. కాని కొద్ది నిముషాలపాటు కూడా గదుల్లో కూర్చోబుద్ధివెయ్యదు. వసారా (డెక్) లో కొస్తే ఆనందమును కలిగించే స్వచ్ఛమైనవాయువును ఆస్వాదించవచ్చును. నామట్టు కంతే చేశాను. ప్రయాణీకులందరూ చాలావరకు వసారాలోనే నిద్రపోయేవారు. నేనూ అంతేచేశాను. ఉదయభానుని వేడిమిని కూడా భరించడం కష్టం. కనుక డెక్‌మీద ఉంటే సర్వదా క్షేమం. ఇలాంటి తీక్షణమైన వేడిమి సాధారణంగా మూడు రోజులు తగులుతుంది. నాల్గవ రోజు రాత్రి సూయజ్ కాల్వలో ప్రవేశించాము. చాలాదూరం నుంచీ సూయజ్ దీపాలు కనుబడుతుంటాయి. ఎర్రసముద్రం కొన్నిచోట్ల వెడల్పుగానూ, కొన్నిచోట్ల మరీ సన్నంగానూ ఉంటుంది. రెండు వైపులా భూమి కనుబడేటంత సన్నంగా ఉంటుంది.

సూయజ్‌లో ప్రవేశించడానికి ముందు, "హెల్సుగేటు" దాటేము. హెల్సుగేటు, రెండువైపులా కొండలున్న చాలా సన్నని కాల్వ. అక్కడ చాలా ఓడలు పగిలిపోవడంచేత దానికాపేరొచ్చినది. ఎర్రసముద్రంలో మేమొక మునిగిపోయిన ఓడను చూచాం. సూయజ్‌లో అరగంట సేపున్నాం. ఇకముందునుంచి చాలా చలిగా ఉంటుందని అన్నారు. ఏడెన్ వదలిపెట్టిన తర్వాత మద్యపానం చేయ వలసి వస్తుందని కొందరన్నారు. కాని అది శుద్ధ అబద్ధం. తోడి ప్రయాణీకులతో కొంచెం కొంచెం సంభాషణచేయడం మొదలుపెట్టేను. ఏడెన్ దాటిన పిమ్మట, మాంసాహారం అవసరముంటుందన్నారు వాళ్లు. కాని ఆమాట సరికాదు. నా జీవితంలో ప్రప్రథమంగా ఓడ ముందర ఎలెక్ట్రిక్ దీపాన్ని చూచాను. అది వెన్నెలలా కనుబడింది. ఓడ ముందలిభాగం చాలా అందంగా కనుబడింది. వేరొక స్థలంలోనుంచి చూస్తే అది మరీబాగా కనుబడుతుందనుకుంటాను. మన శరీరం యొక్క అందాన్ని మనం బాగా చూచి ఆనందించలేనట్లే. సూయజ్ కాల్వ నిర్మాణాన్ని నేను అవగాహన చేసుకోలేకపోతున్నాను. నిజంగా అది చాలా అద్భుతంగా మాత్రమున్నది. దానిని సృష్టిచేసిన మనిషి యొక్క మేధాసంపత్తి ఎంతటిదో ఆలోచించలేకున్నాను. ఆయన ఎల్లా నిర్మించాడో నాకు తెలియడంలేదు. ఆయన ప్రకృతితో పోటీ చేశాడని చెప్పడం సబబు. రెండు సముద్రాలను కూర్చడం తేలికైన విషయంకాదు. కాల్వలోనుంచి తడవకొక్క ఓడ మాత్రమే పోతుంది.

ఆ ఓడ నడపడంలో చాలా చాకచక్యముండాలి. ఓడ చాలా నెమ్మదిగా సాగుతుంది. నడుస్తున్నట్లే మనకు తెలియదు. కాల్వలో నీళ్లు చాలా మురికిగా ఉంటవి. దాని లోతెంతో మరచిపోయాను. రామ్‌నాథ్ దగ్గర ఆజీనది (రాజకోట దగ్గర ఒకనది) ఎంత వెడల్పో అంతే వెడల్పుంటుంది. ఇరుప్రక్కలా మనుష్యులు నడుస్తూ ఉంటారు. కాల్వకు దగ్గరగానున్న భూమి చవిటిపర్ర. కాల్వ ఫ్రెంచి వారిది. ఇస్మాలియా దగ్గరనుంచి మరొకడొచ్చి ఓడను నడుపుతాడు. కాల్వలో నుంచి వెళ్లే ప్రతి ఓడనుంచీ ఫ్రెంచివారు కొంతరుసుమును వసూలు చేస్తారు. ఇందువల్ల వారికి ఆదాయం హెచ్చుగానే వస్తుందనుకుంటాను. ఓడ ముందునున్న పెద్ద ఎలెక్ట్రిక్ దీపంతోపాటు కాలువకు ఇరువైపుల 20 అడుగుల కొకటి చొప్పున దీపాలు వెలుగుతుంటాయి. ఆ దీపాలనేక రంగులవి. ఈ దీపాల మధ్యనుంచి ఓడ నడవాలి. కాలవదాటడానికి సుమారు 24 గంటలు పడుతుంది. ఆ దృశ్యంయొక్క అందాన్ని వర్ణించడం నా తరం కాదు. చూస్తేతప్ప ఆ ఆనందాన్ని అనుభవించడం కష్టం. కాలువకు చివరనున్నది పోర్టుసెడ్. పోర్టుసెడ్ ఉనికి కంతా కారణం సూయజ్ కాలువ. సాయంకాలం అక్కడ లంగరేసుకున్నాం. అక్కడ ఓడ ఒకగంట మాత్రమే ఆగుతుంది. కాని పోర్డుసెడ్ చూడ డానికి ఒక గంట చాలును. అక్కడ చలామణి ఇంగ్లీషు నాణెములు. భారత నాణెముల కక్కడ చలామణీ లేదు. ఒడ్డుకు వెళ్లడానికి పడవ కిరాయి ఆరు పెన్నీలు. పెన్నీ విలువ ఒక అణా. పోర్టుసెడ్‌లోని భవన నిర్మాణమంతా ఫ్రెంచి పద్ధతి. ఇక్కడ చూస్తే ఫ్రెంచివారి జీవితమెట్లుంటుందో కొంచెం తెలుస్తుంది. అక్కడ మేము కొన్ని కాఫీహోటళ్లను చూచాం. మొదట నేను అదొక నాటకశాల అని అభిప్రాయపడ్డాను. కాని అదొక కాఫీశాల తప్ప మరేమీకాదు. ఒక వైపున కాఫీ, టీ, సోడా మొదలైన పానీయాలు పుచ్చుకోవచ్చును. రెండోవైపున సంగీతం వినవచ్చును. అక్కడ కొందరు స్త్రీలు ఫిడేలు వాయిద్యం సాగిస్తున్నారు. 'కేఫ్' అని పిలువబడే ఈ పానశాలల్లో లెమనెడ్ సీసా ఖరీదు 12 పెన్నీలు. అదే బొంబాయిలో పెన్నీ కన్న తక్కువకు లభిస్తుంది. కొనుక్కోడానికొచ్చిన వాళ్లకు సంగీతం ఉచిత మంటారు. కాని అదీ నిజంకాదు. సంగీతవాయిద్యం ముగియడంతోనే ఒక స్త్రీ చేతిరుమాలు పరచిన పళ్లెమును చేత్తో పుచ్చుకొని ప్రతివాళ్ల

దగ్గరకూ వస్తుంది. అనగా, నువ్వు ఆమెకేదో ఇవ్వాలన్న మాట. ఇవ్వక తప్పదుకూడాను. మేమాహోటలుకుపోయి ఆ స్త్రీకి 6 పెన్నీలు ఇచ్చాం. పోర్టుసెడ్, విలాసానికి స్థావరమే తప్ప మరేమీలేదు. అక్కడ స్త్రీలూ పురుషులూకూడ చాలా జీత్తులమారులు. ద్విభాషి నీకు దారిచూపించ డానికి వెంటాడిస్తాడు. అతని అవసరంలేదని ధైర్యంగా చెప్పాలి. పోర్టుసెడ్ పట్టుమని రాజకోటలో ఒక పరా (గుజరాతీలో పేట) అంత పెద్దదిగా కూడా ఉండదు. మా తోడిప్రయాణీకులలో మిస్టర్ జఫ్రీస్ అనే ఆయన నాయెడల చాలా దయగా ఉంటూవచ్చాడు. ఆయనెప్పుడూ భోజనాలబల్ల దగ్గరకొచ్చి ఏదైనా తీసుకోమనేవాడు కాని నేను వెళ్లలేదు. బ్రిండిసీ దాటిన తర్వాత చలి బాగా వేస్తుందని ఆయన చెప్పేడు. కాని అలాలేదు. మూడురోజులైనాక రాత్రివేళ బ్రిండిసీ చేరేము. బ్రిండిసీ హార్బరు చాలా అందంగా ఉంటుంది. స్టీమరు తీరానికి అంటి చేరుతుంది. అమారుగా ఉండే ఒక నిచ్చెనమీద నుంచి సరాసరి తీరానికి దిగడమే. చీకటిగా ఉండటంచేత బ్రిండిసీ అంతగా చూడలేకపోయాను. అక్కడంతా ఇటాలియను భాష మాట్లాడుతారు. బ్రిండిసీ రోడ్లమీద రాళ్లు పరచి ఉంటాయి. వీధులు ఏటవాలుగా ఉంటాయి. అవి కూడా రాతి చపటాలే. దీపాలకు గ్యాసు ఉపయోగిస్తారు. మేము బ్రిండిసీ స్టేషన్ చూచాం. అది బి. బి. సి. ఐ. రైల్వే స్టేషనులంత అందంగాలేదు. కాని రైలుడబ్బాలు మాత్రం మనవాటికన్న చాలా పెద్దవి. రవాణా బాగానే ఉన్నది. బ్రిండిసీలో దిగడంతోనే, నువ్వు నల్లవాడివైతే, ఒక మనిషివచ్చి 'సార్ పద్నాలుగేళ్ల అందమైన అమ్మాయి ఉంది. నాతో రండయ్యా, నేను తీసుకెడతాను. రేటేమీ అంత హెచ్చుకాదు' అని అడుగుతుంటాడు. చటుక్కున నీకు కంగారు పుడుతుంది. కాని చాలా నిదానంగా ఉండి ధైర్యంగా 'అమ్మాయి నాకక్కరలేదనీ, తక్షణం పొమ్మ'నీ జవాబు చెప్పాలి. అలా చెపితేనే నీకు క్షేమం. నీ వింకా చిక్కులో పడితే వేంటనే దగ్గరగా ఉన్న పోలీసుతో చెప్పాలి. లేకపోతే ఎదుట విధిగా కనబడే పెద్దభవనంలో ప్రవేశించాలి. కాని లోపలికి ప్రవేశించేముందు భవనంమీద పేరు చదువుకుని అందులో అందరికీ ప్రవేశం ఉన్నదో లేదో నిశ్చయం చూచుకోవాలి. ఆ సంగతి చటుక్కున తెలుసుకోవచ్చును. అక్కడుండే కాపలామనిషికి నీ ఇబ్బంది ఏమిటో చెప్పితే ఆతడు నీవేమి చెయ్యాలో మార్గం చెపుతాడు.

నీకింకా ధైర్యముంటే నిన్నే చీఫ్ ఆఫీసరు (ప్రధానోద్యోగి) దగ్గరకు తీసుకువెళ్లమని అడిగి ఆయనతోనే విషయమంతాచెప్పు. పెద్ద భవనమంటే అది థామస్‌కుక్ వారిదో, హెన్రీ కింగు వారిదో లేక మరొక ఏజంట్లదో అయిఉంటుందని నా అభిప్రాయం. వాళ్లు నీ క్షేమం కని పెడతారు. అలాంటప్పుడు లోభత్వం చెయ్యకు. పోర్టరుకు (కాపలా దారునికి) తృణమో పణమో చేతిలోపెట్టు. కాని ఇదంతా నీవు నిజంగా ప్రమాదంలో ఉన్నావనుకుంటే జరుపవలసిన చర్య. కాని ఇలాంటి పెద్ద భవనాలు సముద్రతీరాన్నే నీకుకనబడతవి. తీరానికి దూరంగా ఇలాంటిచిక్కు సంభవిస్తే పోలీసును పట్టుకోవలసిందే. ఆ పని జరుగకపోతే నీ అంతరాత్మయే సర్వాధికారి. మేము తెల్లవారగనే బ్రిండిసీ వదలిపెట్టేం.

దాదాపు 3 రోజులు అనంతరం మాల్టా చేరేం. మధ్యాహ్నం రెండు గంటలకు ఓడ లంగరుదింపేం. నాలుగు గంటలదాకా ఓడ అక్కడ ఆగుతుంది. మిస్టర్ అబ్దుల్ మజీదు కూడా మాతో రావలసి ఉండినది. కాని ఏకారణం చేతనో ఆయన చాలా ఆలస్యం చేశాడు. వెళ్లడానికి నేను చాలా తొందరపడ్డాను. "మజీద్‌కోసం ఆగకుండా మనం వెళ్లిపోదామా" అన్నాడు ముజుందారు. "మీ ఇష్టం. నా అభ్యంతర మేమీలేదన్నాను" అంతట మే ముభయులమే బయటకెళ్లేం. తిరిగి వచ్చిన పిమ్మట అబ్దుల్‌మజీద్ మమ్మల్ని చూచి తనురాకుండా వెళ్లిపోవడం చాలా విచారకరమని అన్నాడు. అంతట ముజుందార్ 'గాంధీయే చాలా తొందరపడ్డాడు. నీకోసం ఆగవద్దని ఆయనే అన్నాడు' అని చెప్పేడు. ముజుందార్ ఈ ప్రవర్తన నాకెంతో కష్టం కలిగించింది. ఆ ఆరోపణను కాదనడానికి నే నేమీ ప్రయత్నం చేయలేదు. మౌనంగా అంగీకరించాను. "(శ్రీ) ముజుందారు మీకోసం నిజంగా ఆగదలచినట్లయితే నామాట వినకుండానే ఉండవలసినది" అని నేను అబ్దుల్‌మజీద్‌తో చూచాయగా చెప్పిఉన్నట్లయితే నామీద మోపబడిన ఆరోపణ పోయి ఉండేదే. నాకీ విషయంలో ఏమీ బాధ్యతలేదని అబ్దుల్‌మజీద్‌ను నమ్మించ డాని కంతమాత్రం చాలుననుకుంటాను. కాని ఆ సమయంలో అలాంటి దేమీ నేను చేయదలచుకోలేదు. కాని ఆనాటినుంచీ ముజుందారును గురించి నాకు చాలా చెడ్డ అభిప్రాయం కలిగింది. నిజమైన గౌరవభావం పోయింది. అంతే కాకుండా మరి రెండు మూడు సంఘటనలు జరుగడం చేత ముజుందార్ యడల ఇష్టం రోజుకురోజూ తగ్గిపోయింది.

మాల్టా చాలా విశేషమైన స్థలం. అక్కడ చూడదగిన సంగతులు చాలా ఉన్నాయి. కాని సమయం చాలదు. ముందు చెప్పినట్లు, నేనూ మిస్టర్ ముజుందారు తీరానికి వెళ్లేము. అక్కడ మాకొక మోసగాడు తటస్థపడ్డాడు. అందువల్ల చాలా నష్టపడవలసి వచ్చింది. పడవ నెంబరు తీసుకున్నాం. పట్టణం చూడడానికి ఒక బండి అద్దెకు తీసుకున్నాం. ఆ మోస గాడు మాతోనే ఉన్నాడు. ఒక అరగంట బండిలో ప్రయాణంచేసి, సెంట్‌జాన్ చర్చి దగ్గర చేరేం. ఆ చర్చి చాలా అందంగా కట్టబడింది. అక్కడ ప్రముఖులైనవారి అస్థిపంజరాలను చూచాం. అవి చాలా కాలం నాటివి. మాకు చర్చి అంతా చూపించిన స్నేహితునికి ఒక షిల్లింగు ఇచ్చాం. చర్చి కెదురుగుండా సెంట్‌జాన్ శిలావిగ్రహముఉన్నది. అక్కడ నుంచి పట్టణానికి బండి సాగించాం. రోడ్లన్నీ చపటా చేయబడున్నాయి. ఆ ద్వీపమంతా చాలా సుందరంగా ఉన్నది. పెద్దపెద్ద భవనాలు చాలా ఉన్నాయి. ఆయుధాగారం చూడడానికి వెళ్లేం. ఆ హాలు చాలాశృంగారంగా అలంక రింపబడింది. అక్కడ చాలా పురాతనమైన రంగుల చిత్రాలను చూచాం. అవి నిజంగా కుంచెతో వ్రాయబడినవి కావు. కుట్టబడినవి. కాని కొత్త వాళ్లకు ఎవరో చెపితేకాని ఆ సంగతి తెలియదు. హాలులో పూర్వకాలపు వీరాధివీరుల ఆయుధాలున్నాయి. అవన్నీ చూచితీరవలసినవే. ఎక్కడా వ్రాసిపెట్టకపోవడంచేత నాకవన్నీ జ్ఞాపకంలేవు. 30 పౌనుల బరువుగల శిరోరక్ష (Helmet) ఉన్నది. నెపోలియన్ బోనపార్టీ బండి చాలా బాగుంది. ఆ హాలంతా చూపించిన దర్శకునకు 6 పెన్నీలు ఇనాం ఇచ్చి తిరిగి వచ్చేశాం. చర్చిని, ఆయుధాగారాన్ని చూచేటప్పుడు గౌరవ సూచకంగా మాటోపీలను తీసివేయవలసి వచ్చింది. అనంతరం మమ్మిలను వెంటాడించిన మోసగాని దుకాణానికెళ్లేం. అతడు ఏదోసరుకును మామీద రుద్దుదామని ప్రయత్నించాడు. మేమేమీ కొనలేదు. ఆఖరుకు, ముజుందారు మాల్టా దృశ్యాల ఫోటోగ్రాఫులను షి. 2/6 పెన్నీలకు కొన్నాడు. అక్కడ ఆ మోసగాడు తప్పుకుని మాకొక ద్విభాషిని వప్ప చెప్పినాడు. ఆ ద్విభాషి చాలా మంచివాడు. అక్కడ నారింజతోటల్లోకి బండి పట్టించాడు. తోటను చూచాం. ఆ తోటలు నాకు నచ్చలేదు. ఆ తోటలకన్న రాజకోటలోని మన పబ్లిక్‌పార్కు నాకు బాగా నచ్చింది. నాకు అక్కడ చూడదగిన విశేషమేమైనా ఉన్నాదా అంటే, చిన్న జలాశ యంలో వుంచబడిన బంగారురంగు, ఎర్ర రంగు చేపలు. అక్కడ నుంచి

పట్టణానికొచ్చి హోటలుకెళ్లేం. ముజుందారు కొంచెం బంగాళాదుంప లను, టీని పుచ్చుకున్నాడు. మేమొచ్చేదారిలో ఒక భారతీయుడు కన బడ్డాడు. ముజుందారు చాలా ధైర్యస్థుడవడంచేత ఆ భారతీయునితో మాట్లాడేడు. మాట్లాడగా మాట్లాడగా ఆయన మాల్టాలో ఉండే ఒక షాపు యజమాని సోదరుడని తేలింది. వెంటనే మేము దుకాణానికెళ్లేం. ముజుందారు షాపుయజమానితో బాతాఖానీ సాగించేడు. ఆ షాపులో ఏవోకొన్ని వస్తువులు ఖరీదుచేసి రెండు గంటలు కాలక్షేపంచేశాం. అందు చేత మాల్టాను అంతగా చూడలేకపోయాం. మరొక చర్చిని చూచాం. అది కూడా చాలా అందంగా చూడముచ్చటగా ఉన్నది. సంగీతశాలను (ఆపెరా) చూడాలనుకున్నాం కాని అందుకు సావకాశం లేకపోయింది. మాకు తటస్థపడిన పెద్దమనిషి దగ్గర శెలవు తీసుకున్నాం. ఆయన లండన్‌లో నున్న తన సోదరునికిమ్మని ముజుందారుకొక కార్డు ఇచ్చాడు. మేము తిరిగొచ్చే సరికి మొదటి మోసగాడు, సాయంకాలం 6 గంటలకు మళ్లీ మమ్మల్నికలసి మాతోవచ్చాడు. మేము తీరానికిచేరి ఆ మోసగానికీ, మంచివాడైన ద్విభాషికీ కొంత ముట్టచెప్పేం. పడవవాడితో కిరాయిని గురించి పేచీపడ్డాం. పర్యవసానం నిస్సందేహంగా పడవవానికే అను కూలమైనది. ఇక్కడ మాకు చాలా మోసం జరిగింది.

స్టీమరు 'క్లైడ్' సాయంకాలం 7 గంటలకు రేవు వదలిపెట్టింది. మూడు రోజులు ప్రయాణంసాగించి అర్థరాత్రి 12 గంటలకు జిబ్రాల్టర్ చేరింది. రాత్రిఅంతా ఓడక్కడే ఉంది. నాకు జిబ్రాల్టరు చూడాలని చాలా అభిలాష. అందుచేత ఉదయం పెందలకడేలేచి ముజుందారును లేపి నాతో తీరానికొస్తావా రావా అని అడిగేను. ఆయన వస్తానన్నాడు. అంతట మిస్టర్ మజీద్‌ను కూడా లేపేను. మేము ముగ్గురమూ ఒడ్డుకెళ్లేం. మాకున్న సావకాశం గంటన్నర మాత్రమే. అప్పుడప్పుడే తెల్లవారుతూ ఉండడంచేత ఇంకా తలుపులన్నీ మూసే ఉన్నాయి. జిబ్రాల్టరు స్వతంత్ర రేవుపట్టణమవడంచేత పుగాకుసామాగ్రి చాలాచౌక అని చెప్పేరు. జిబ్రాల్టరు ఒక కొండమీద కట్టబడింది. ఆ కొండకొనమీద కోట ఉన్నది. కాని దానిని మేము చూడజాలకపోవడం చాలా విచారకరమైన సంగతి. ఇండ్లు బారులుతీరి ఉన్నాయి. మొదటిశ్రేణినుండి రెండోశ్రేణికి వెళ్ల డానికి కొన్ని మెట్లెక్కక తప్పదు. అది నాకు చాలా నచ్చింది. ఆ నిర్మాణం

బహు అందంగా ఉన్నది. రోడ్లు చపటా చేయబడున్నాయి. వ్యవధిలేక పోవడంచేత వెంటనే తిరిగి రావలసివచ్చింది. రాత్రి 8-30 గంటలకు స్టీమరు లంగరెత్తింది.

3 రోజుల అనంతరం రాత్రి 11 గంటలకు మేము 'ప్లిమత్' చేరుకున్నాం. చలికది సరియైనకాలము. ప్రతిప్రయాణీకుడు, మాంసం తిని సారా త్రాగకపోతే మేము చచ్చిపోతామని చెప్పేరు. కాని మాకలాంటి దేమీ జరుగలేదు. నిజానికి చలి చాలా తీవ్రంగానే ఉన్నది. తుఫాను సంగతి కూడా చెపుతూవచ్చారు కాని అలాంటిదేమీ కనబడలేదు. నిజానికి దానిని చూడాలనికూడా నేనుబలాటపడ్డాను. కాని చూడలేకపోయాను. రాత్రి అవడంచేత 'ప్లిమత్' మాకేమీ అగుపడలేదు. అక్కడ మంచు చాలా దట్టంగా పట్టింది. చిట్టచివరకు ఓడ లండన్‌కు ప్రయాణమైంది. 24 గంటలలో లండన్ చేరేము. స్టీమరును వదలిపెట్టి టిల్‌బరీ స్టేషన్ గుండా విక్టోరియా హోటల్‌కు, 1888 సంవత్సరం అక్టోబరు 28 తేదీని సాయంకాలం 4 గంటలకు చేరుకున్నాము.

**28 అక్టోబరు 1888 ఆదివారం మొదలు 28 నవంబరు శుక్రవారం వరకూ:** మిస్టర్ ముజుందార్, అబ్దుల్ మజీద్, నేనూ విక్టోరియా హోటలుచేరేము. మిస్టర్ అబ్దుల్ మజీద్, విక్టోరియా హోటలు పోర్టరుతో బండి వానికి సరియైన కిరాయి ఇచ్చివేయమని బహుదర్జాగా చెప్పేడు. అబ్దుల్ మజీద్ తన్నుగురించితానే ఘనంగా భావించుకుంటూ ఉండేవాడు. కాని నిజం చెప్పాలంటే, ఆయన ధరించిన దుస్తులు ఆ పోర్టరు దుస్తులకన్న అధ్వాన్నంగా ఉన్నాయని వ్రాయకతప్పదు. ఆయన తన సామానులను జాగ్రత్తపెట్టుకోవాలని కూడా ఆలోచించలేదు. చిరకాలంగా లండన్‌లో నివాసం చేస్తున్నవాడిలాగే హోటల్లో ప్రవేశించాడు. హోటలు యొక్క సౌందర్యం చూస్తుంటే నాకళ్లు మిఱుమిట్లు గొల్పినాయి. అలాంటి విలాసం నాజీవితంలో నేనెన్నడూ చూడలేదు. నామిత్రులిద్దరి వెంటా మౌనంగా నడుస్తుండడమే నాపని. భవనమంతటా విద్యుద్దీపాలే. మమ్మల్నొక గదిలో ప్రవేశపెట్టేరు. మిస్టర్ మజీద్ అందులో చటుక్కున ప్రవేశించాడు. వెంటనే మేనేజరు రెండవ అంతస్థు అంగీకారమా కాదా అని అడిగేడు. రోజువారీ అద్దె ఎంతో అడగడం దర్జాకులోటని అనాలోచితంగానే మిస్టర్ మజీద్ అంగీకరించాడు. తక్షణమే మేనేజరు రోజుకు

6 షిల్లింగులకు బిల్లు ఇచ్చాడు. కూడా ఒక కుర్రవాడిని పంపేడు. ఇంత సేపూ నాలోనేను నవ్వుకుంటున్నాను. మేము లిఫ్టుమీదుగా రెండో అంతస్థుకు పోవలసియుండెను. అదేమిటో నాకు తెలియదు. మాతో వచ్చిన కుర్రవాడు ఒక మీట నొక్కేడు. మొదట నేనది తలుపు తాళంకప్ప అనుకున్నాను. అది గంట అనీ, లిఫ్టును తీసుకురమ్మని చెప్పడానికే అతను గంట కొట్టినాడనీ పిమ్మట నాకు తెలిసింది. తలుపులు తెరువబడ్డాయి. కొంతసేపు కూచునేందుకు అదొక గదియని నేననుకున్నాను. కాని రెండవ అంతస్థుమీదికి ఎక్కిపోవడం చూచి నేను విస్తుపోయాను.

[అసంపూర్ణం]



# 5. మిస్టర్ లీలీకి వ్రాసిన ఉత్తరం

లండన్,
డిసెంబరు, 1888

అయ్యా,

నేను లోగడ మీదర్శనం చేసినపుడు ఇచ్చిన కాగితాన్ని చూస్తే నేనెవరినో మీకు గుర్తుకొస్తాను. ఆ కాగితాన్ని మీరు జాగ్రత్త పెడతామని చెప్పినారు.

అప్పుడు, నేను ఇంగ్లండు వెళ్లడానికి కొంచెం ధన సహాయం చేయమని మిమ్మల్ని కోరియున్నాను. కాని దురదృష్ట వశాత్తూ మీరు దేశం వెళ్లిపోయేతొందరలో ఉన్నారు. అందుచేత నేను చెప్పదలచినదంతా చెప్పడానికి తగినంత సావకాశం లేకపోయింది.

అప్పట్లో నేను ఇంగ్లండు వెళ్లాలని చాలా తొందరపడు తుంటిని. కనుక నాదగ్గర ఎంత తక్కువ సొమ్మంటే అంతతోటే 4 వ సెప్టెంబరు తేదీని భారతదేశాన్ని వదలిపెట్టేను. మా తండ్రి గారు, మా ముగ్గురు సోదరులకు వదలిపెట్టిన సొత్తు బహుతక్కువ. అయినప్పటికీ మా అన్నగారు అతిప్రయాసమీద నాకివ్వగలిగిన 666 పౌనులూ, మూడు సంవత్సరాలు లండన్‌లో నివసించడానికి సరిపోతవనే నమ్మకంతో, ఇంగ్లండులో న్యాయశాస్త్రాన్ని అభ్యసించడానికి భారతదేశాన్ని విడచివచ్చాను. ఇండియాలో ఉన్నప్పుడు లండన్ నివాసము, ఆ విద్యాభ్యాసము, చాలా ధనవ్యయ కారణ మని నాకు తెలుసును. ఇప్పుడు రెండు మాసాలుపాటు లండన్ అనుభవంవల్ల, ఇండియాలో ఉన్నప్పుడనుకున్న దానికంటె ఖర్చు ఎక్కువని తెలుసుకున్నాను.

ఇక్కడ నేను సుఖంగా జీవించడానికీ, చక్కటి విద్యను సంపాదించడానికీ మరొక 400 పౌనులు కావలసి ఉంటుంది. నేను పోర్బందరు వాసిని. అందుచేత నేను ఆ ఒక్కచోటనుండే సహాయాన్ని ఆశించవలసినవాడను.

పూర్వపు రాణావారి పరిపాలనలో విద్యకంతగా ప్రోత్సాహం లభించలేదు. ఇంగ్లీషు పరిపాలనలో విద్యకెక్కువ ప్రోత్సాహం లభిస్తుందని ఆశించడం సహజం. అలాంటి ప్రోత్సాహంవల్ల సదుపాయం పొందగలిగేవారిలో నేనొకడను.

కనుక, దయచేసి నాకు కొంత ధనసహాయంచేసి నాకృతజ్ఞతకు పాత్రులు కాగలరని ఆశిస్తున్నాను.

మా అన్నగారైన లక్ష్మీదాస్ గాంధీని ఆ సహాయాన్ని అందుకోమని కోరుతూ, అవసరమైతే మిమ్ములను స్వయంగా చూడమని ఒక ఉత్తరంకూడా పంపుతున్నాను.

నా కోరిక మీరు మన్నించగలరని ఆశిస్తున్నాను.

గౌరవ పురస్సరముగా,

ఇట్లు తమ విధేయుడు,
*మో. క. గాంధీ.*

(లీలీకి పంపవలసిన ఉత్తరం ముసాయిదా అన్నగారైన లక్ష్మీదాస్ అంగీకారమునకు గాంధీజీ వ్రాసినది.)

మూడువారాల క్రిందట ఈ ముసాయిదాను తయారుచేసి దానిని గురించి ఆలోచిస్తున్నాను. ఆయన జవాబు వ్రాయడని నేను అనుకుంటున్నా. కనుక దానినిగురించి ఆలోచించేటందుకే ఆ ముసాయిదాను నీకు పంపుతున్నాను. బొత్తుగా బేసబబుగా ఉంటుందనే కారణంచేత నేను అంత మొత్తం కావాలని అడుగలేదు. అంతేకాకుండా కేవలం అంత మొత్తానికీ తనమీదనే ఆధారపడుంటే, ఆ విషయమేదో ఇదమిద్ధమని తేల్చుకోకుండా ఇంగ్లండువెళ్లి ఉండేవాడే కాడని ఆయన అనుకోవచ్చును. ఇక్కడికి వచ్చిన పిమ్మట, ఇంకా అధనంగా డబ్బుకావాలని తెలుసుకొని, అదనంగా కావలసిన మొత్తం మాత్రమే కోరేను. నే నేవిధమైన షరతులకు లోనుకాలేదు. అలాంటి అవసరంలేదనుకున్నాను. అంతేకాకుండా నాకయ్యే ఖర్చులో ఒక భాగానికే నేను తాకట్టుపోవడం మంచిదికాదేమో ననుకున్నాను. అదీకాకుండా................

[ మహాత్మ వాల్యూం 1 — ఫోటోస్టాటునుండి ]

# 6. కలనల్ జె. డబ్ల్యు. వాట్సన్

డిసెంబరు, 1888

కలనల్ జె. డబ్ల్యు. వాట్సన్,
పొలిటికల్ ఏజంటు,
కథియావార్.

అయ్యా,

నేను ఈ దేశంలో దిగి దాదాపు ఆరు ఏడు వారాలైంది. ఇప్పటికి నేను సుఖంగా కుదుటబడి సుమారుగా విద్యాభ్యాసం ప్రారంభించాను. న్యాయవిద్యా సముపార్జనకోసం నేను ఇన్నర్ టెంపుల్‌లో చేరేను.

ఇంగ్లీషు జీవితం చాలా ఖర్చు సంగతని మీకు బాగా తెలుసును. నాకు కలిగిన కొద్ది అనుభవంవల్ల, నేను ఇండియాలో ఉన్నప్పుడు అనుకున్నదానికంటె చాలా హెచ్చని తెలుసుకోగలిగేను. నాకున్న రాబడులు చాలా క్లుప్తమని మీ రెరుగుదురు. పైనుంచి కొంచెం సహాయం జరుగకపోతే, మూడు సంవత్సరాలు ఈ విద్యను నేను సంతృప్తికరంగా పరిపూర్తిచేయలేననుకుంటాను. మీరు మానాయనగారికి చాలా స్నేహితులుగా నుండి, ఆయన విషయంలో చాలా శ్రద్ధచూపడం జ్ఞాపకం చేసుకున్నపుడు, ఆయన కొడుకునైన నాయెడలకూడా అలాంటి ఆప్యాయత చూపిస్తారనడాని కేమీ సంశయించడంలేదు. ఈ దేశంలో నా చదువు పూర్తిచేసుకోడానికి తగినంతగా నాకు పుష్కలమైన సహాయాన్ని లభింపచేస్తారని విశ్వసిస్తున్నాను. తద్వారా మీరు నాకొక మహోపకారాన్ని చేసిన వారవుతున్నారు.

కొద్దిరోజుల క్రిందట నేను డాక్టర్ బట్లరుగారి దర్శనం చేశాను. ఆయన నాపట్ల చాలా దయచూపించినారు. తాను చేయగలిగిన సహాయమంతా చేస్తామని వాగ్దానం చేశారు.

ఇంతవరకు వాతావరణం ఏమీ తీవ్రంగా లేదు. నేను కులాసాగానే ఉన్నాను.

గౌరవ పురస్సరముగా

ఇట్లు
విధేయుడు,
*మో. క. గాంధి.*

[మహాత్మా వాల్యూం 1, ఫోటోస్టాటు నుండి.]

# 7. భారతీయ శాకాహారులు

*ఇవి 'ది విజిటేరియన్' అనే పత్రికలో గాంధీజీ వ్రాసిన వ్యాసములు. బహుశా ఇవే ఆయన తొలుతగా వ్రాసిన వ్యాసములు కావచ్చును.*

## 1

భారతదేశము అనేక కులమతములకు చెందిన 25 మిలియనుల జనాభాగల దేశము (250 కు బదులు పొరబాటుగా వ్రాసినట్లు స్పష్టమవు తున్నది). ఇండియాలో ఎప్పుడూ కాలు పెట్టని ఆంగ్లేయులూ ఇండియాకు సంబంధించిన విషయాలలో ఏమీ శ్రద్ధవహించనివారూ, సాధారణంగా భారతీయులంతా పుట్టుకతోనే శాకాహారు లనుకుంటారు. ఇది కొంత వరకే నిజము. భారతీయులు ముఖ్యంగా మూడు భాగాలు. వారెవ్వరంటే హిందువులు, మహమ్మదీయులు, పార్సీలు.

హిందువులు మరల నాలుగు ముఖ్యవర్ణములుగా విభజింపబడ్డారు. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు. వీరిలో చెప్పవలసొస్తే బ్రాహ్మణులు, వైశ్యులు మాత్రమే శాకాహారులు. కాని వాస్తవంలో భారతీయులంతా కూరగాయల భక్షకులే. కొందరు స్వచ్ఛందంగాను, మరి కొందరు తప్పనిసరిగానూ శాకాహారులు. రెండవవర్గమువారు మాంసాహారమును తీసుకోడాని కిష్టపడతారుగాని, వారికి మాంసము కొనుటకు శక్తి చాలదు. ఇండియాలో రోజుకి 1 కానీ (1/3 పెన్నీ) తో జీవించ వలసినవాళ్లు వేలకొద్దీ ఉండడమే ఇందుకు నిదర్శనము. వీళ్లు రొట్టీ, చాలా పన్నును భరిస్తున్న ఉప్పుతోనూ జీవిస్తారు. ఇండియావంటి దరిద్ర దేశంలోనైనా, ఒక పెన్నీతో తినదగిన మాంసం లభించడం కష్టం; అసంభవమనే చెప్పాలి.

ఇండియాలో శాకాహారు లెవ్వరనే విషయం తేలిపోయిన పిమ్మట వారవలంబించే శాకాహారవిధానం ఏమిటనే ప్రశ్న ఉదయిస్తుంది. భారతీయ శాకాహారవిధానంలో వి. ఇ. యం. అనగా పయఃపాన నిషేధం లేదు. భారతీయులు అనగా భారత శాకాహారులు చేపలు,

మాంసం, కోళ్లతోపాటు గ్రుడ్లను కూడా తినరు. గ్రుడ్లను తినడంవల్ల కూడా ప్రాణహింస జరుగుతోందని వారివాదం. ఏమంటే గ్రుడ్డును కదపకుండా ఉంచితే అదే పిల్ల అవుతుంది కనుక. ఇక్కడి అతివాద శాకాహారులువలె కాక, వారు పాలు, వెన్నలను నిషేధించరు. అంతే కాకుండా పక్షానికొకసారి అగ్రవర్ణముల వారందరూ అవలంబించే ఉపవాసదీక్షా దినములలో కూడా స్వీకరించదగినంత పవిత్ర మైనవిగా వాటిని భావిస్తారు. ఆవుపాలను పితుక్కోవడంలో గోహత్యలేదని వారి వాదన. ఆవుల పాలు పితుకడంమీద కవిత్వం చెప్పబడింది. చిత్రములు వ్రాయబడినాయి. అందుచేత పాలు పితుకడమంటే గోహత్యలాగున మనస్సు చివుక్కుమనిపించదు. హిందువులకు గోవు పూజార్హమైన జంతువని చెప్పకతప్పదు. గోవులను మాంసంకోసం చంపడానికి విదేశాలకు పంపే ప్రయత్నాలను నిరోధించడానికి ఒక ఉద్యమం కూడా ప్రారంభమై త్వరత్వరగా వృద్ధిపొందుతోంది.

['ది వెజిటేరియన్' 7-2-1891.]

## 2

భారతీయ శాకాహారుల భోజనపదార్థములు వారు నివసించే ప్రాంతాలను బట్టి మారుతూ ఉంటాయి. వంగ రాష్ట్రంలో ప్రధానమైన ఆహారం వరి బియ్యం. బొంబాయి ప్రెసిడెన్సీలో గోధుమ.

సాధారణంగా భారతీయులంతా, ముఖ్యంగా హిందూ అగ్ర వర్ణములకు చెందిన పెద్దవారందరూ, రోజుకు రెండుసార్లు భోజనం చేస్తారు. మధ్య దాహమైనప్పుడు ఒకటి రెండు గ్లాసులు మంచినీళ్లు పుచ్చుకుంటారు. మొదటిసారి భోజనం రమారమి ఉదయం 10 గంటలకు చేస్తుంటారు. అది ఇంగ్లీషువారి డిన్నరు (మధ్యాహ్న భోజనం) లాంటిది. రెండవ భోజనం రాత్రి 8 గంటలు సుమారుకు చేస్తారు. పేరుకు అది ఇంగ్లీషువారి 'సప్పర్' లాంటిది. కాని నిజానికది పుష్కలంగానే ఉంటుంది. భారతీయులు సాధారణంగా ఉదయం ఆరుగంటలకే నిద్రలేస్తారు. కొందరు నాలుగైదు గంటలకే లేస్తారు కూడా. అందుచేత ముఖ్యంగా అవసరమని తోచే ప్రాతఃకాలభోజనం కాని, మిట్ట మధ్యాహ్నభోజనం కాని లేనట్లే కనుబడుతుంది. మొదటి భోజనం చేసిన పిమ్మట మరల 9 గంటలవరకూ ఏమీ తినకుండా వారెలా ఉంటారా అని చదువరులకు ఆశ్చర్యం కలుగవచ్చును.

దీనికి రెండు విధాలుగా సమాధానం చెప్పవచ్చును. మొదటిది, స్వభావానికి తుల్యమనగలిగిన అలవాటు. మతాదేశమువలన కొందరూ, ఆచార నిర్బంధము వలన మిగిలినవారూ రోజుకు రెండు భోజనములు మించి చెయ్యరు. రెండవది భారతదేశ వాతావరణం. ఏ కొద్ది ప్రాంతాల్లోనో తప్ప వేడి చాలా హెచ్చు. ఈ అలవాటు కదొక కారణం. ఏమంటే, ఇంగ్లండులో కూడా శీత కాలంలో కావలసినంత ఆహారం, వేసవిలో అక్కరలేనట్లు కను బడుతుంది. ఇంగ్లీషువారివలె భారతీయులు ఏవంటకాని కా వంటకమును వేరుగా భుజింపరు. చాలా పదార్థాలను కలుపుతారు. ఆహారవస్తువుల నన్నిటినికలిపి కదంబంచేయడం హిందువులలో కొందరి మతాచారం. ప్రతి వంటకానికీ చాలా తయారీఉన్నది. ఉడకబెట్టిన కాయగూరలను ఆలాగేతినడం వారి పద్ధతికాదు. మిరియం, ఉప్పు, లవంగాలు, పసుపు, ఆవగింజలు, మొదలైన అనేకవస్తువులతో మసాలా వేస్తారు. మందుల్లో వాడేవి తప్ప వాటికి ఇంగ్లీషుపేర్లుకూడా దొరకడం దుర్లభం.

మొదటిసారి భోజనంలో సాధారణంగా రొట్టెలు, (వాటిని గురించి ఇంకా ముందు వ్రాస్తాను) బఠాణీలు, చిక్కుళ్లు వగైరా పప్పుదినుసు ఒకటి, కలగూరగానో విడిగానో వండిన రెండు మూడు ఆకుకూరలు, పప్పు బియ్యం కలిపి నీళ్లతో ఉడికించి పోపుపెట్టిన పులగం, ఉంటాయి. ఆ తరువాత కొందరు పాలుఅన్నం తింటారు. కొందరు పాలు మాత్రమే త్రాగుతారు; మరికొందరు పెరుగు ఇంకాకొందరు—ముఖ్యంగా వేసంగిలో—తేటమజ్జిగ పుచ్చుకుంటారు.

రెండవ భోజనం అనగా రాత్రిభోజనంలో, మొదటి భోజనంలో వలెనే అన్నీ ఉంటాయి. కాని కొంచెం తక్కువ తింటారు. కూరగాయలు అంతగా ఉండవు. ఈ భోజనంలో పాలెక్కువగా ఉపయోగిస్తారు. భారతీయులందరూ, అన్నిప్రాంతాలవారూ విధిగా ఇదేరకం భోజనం చేయరని పాఠకులకు జ్ఞాపకంచేయవలసిఉంటుంది. ఏమనగా, ఉదాహరణకు పైన వివరించిన భోజనంనమూనాలో మిఠాయిలసంగతి చెప్పలేదు. కాని ధనికవర్గాల వారు వారాని కొకసారైనా విధిగా వాటిని వినియోగిస్తారు. అంతేకాకుండా నేను ఇంతకుముందు చెప్పినట్లే బొంబాయి రాష్ట్రంలో బియ్యం కన్న గోధుమలెక్కువగాను, వంగ రాష్ట్రంలో గోధుమలకన్న బియ్యం ఎక్కువగానూ వాడతారు. పాటకపు జనం తినే ఆహారమునకు పైన చెప్పినదానికి సంబంధంలేకపోవడం

మరొక విషయం. ఇవి మినహా అది సాధారణ భోజనమని చెప్పవచ్చును. భోజనాల తరహాలన్నీ చెప్పవలసొస్తే చాలా గ్రంథమవుతుంది. అందువల్ల వ్యాసముల విశిష్టత తగ్గుతుంది.

వంటకాలలో, వెన్న లేక నెయ్యిని ఇంగ్లండు ఐరోపాలలో కన్న భారతదేశంలో ఎక్కువగా వాడుతారు. పట్టభద్రులైన వైద్యుల అభిప్రాయ ప్రకారం, ఎక్కువ వెన్నను ఉపయోగించడంవల్ల అంత విశేషంలేకపోయినా, ఇంగ్లండువంటి శీతలప్రదేశంలో అపాయకర మైనట్లు, ఇండియా వంటి ఉష్ణ ప్రదేశంలో అదేమీ అపాయం చేయదు.

పైన పేర్కొనబడిన భోజన నమూనాలో చాలా ముఖ్యమైన పండ్లు ఎందుకు లోపించినవా అని తోచవచ్చును. భారతీయులకు పండ్ల యొక్క ఆహారవిలువలు తెలియకపోవడం, పేదజనానికి పండ్లను కొనుక్కునేశక్తి లేకపోవడం, పెద్దపెద్ద పట్టణాలలో తప్ప మంచిపండ్లు దొరుకకపోవడం, మొదలైనవి అనేక కారణాల్లో కొన్ని కారణాలు. వాస్తవానికి అక్కడ అన్ని వర్గాలవారూ ఉపయోగించే కొన్ని పండ్లు ఇక్కడ కనబడవు. కాని అక్కడ పండ్లను ఆహారంగా కాకుండా చిరు తిండిగానే వాడతారు. రసాయనికంగా వాటి విలువ వారికి తెలియదు. కారణమేమంటే ఆ విధమైన పరిశీలన చేయాలనే జిజ్ఞాసవారికిలేదు.

['*ది వెజిటేరియన్*' 14-2-1891.]

## 3

వెనుకటి వ్యాసంలో రొట్టెలుగురించి ముందు ఇంకా వ్రాస్తానని చెప్పేను. ఈ రొట్టెలు సామాన్యంగా గోధుమపిండితో చేస్తారు. గోధుమలను ముందుగా తిరుగలిలో పోసి పిండిచేస్తారు. (గోధుమలను పిండిచేయడానికి తిరుగలి ఒక సూక్ష్మమైన సాధనము. దానికి ఏవిధమైన యాంత్రికశక్తీ అక్కరలేదు). ఇలా విసరిన పిండిని కొంచెం పెద్దకన్నాలుగల జల్లెడలోపోసి జల్లిస్తారు. అందువల్ల బాగాముతుకగా ఉండేపొట్టు వేరయిపోతుంది. నిజానికి పేదజనం ఇలా జల్లించడంకూడా చేయరు. అందువల్ల ఇక్కడ సాధారణంగా శాకాహారులు, ఎక్కువ నిరసింపబడే తెల్లటిరొట్టెను తయారుచేయడంలో ఉపయోగించే పిండి వంటిది కాకపోయినా, దానికన్న ఇది చాలా శ్రేష్టమైనది. అందులో

కొంత నేతిని—అనగా వెన్న కాచి వడబోసిన దానిని—పౌను పిండికి ఒక చిన్న చెంచాడు చొప్పున కలుపుతారు. దానిలో తగినంత నీరు పోసి బాగాకలిపి ఘట్టిగా ఒకముద్ద అయేవరకు మర్దిస్తారు. ఆ పిమ్మట ముద్దనంతా చిన్నచిన్న ఉండలు చేస్తారు. ఆ ఉండలను గుండ్రంగా పల్చగా ఆరంగుళాలు వెడల్పున అప్పడాలుగా అందుకోసం ప్రత్యేకంగా చేయబడిన ఒక గుండ్రని కర్రతో వత్తుతారు. ప్రతి అప్పడాన్ని ఒక పెనం మీద విడివిడిగా చక్కగా కాలుస్తారు. ఒక్కొక్కరొట్టె కాల్చడానికి 5 లేక 7 నిముషాలవుతుంది. ఆ రొట్టెలను వేడిగా ఉన్నప్పుడు వెన్నతో కలిపి తింటారు. అది చాలాచక్కని పరిమళంగా ఉంటుంది. చల్లారిన పిమ్మట కూడా తినవచ్చును. నిజానికి చల్లారిన పిమ్మటే తింటారు. సాధారణంగా ఇంగ్లీషువారికి మాంసం ఎలాంటిదో, భారతీయుల కీరొట్టె అలాంటిది. శాకాహారికైనా మాంసాహారికైనా అంతే. ఇండియాలో మాంసాహారు లైనప్పటికీ దానిని అత్యంత ప్రధానమైనదానినిగా భావించరని ఈరచయిత అభిప్రాయం. కాని మాంసవంటకములు, రొట్టెలు తినడానికి సాధనంగానే వినియోగిస్తారు. ధనికులైన భారతీయ శాకాహారుల భోజనం స్థూలంగా మాత్రం ఇలా ఉంటుంది. ఇప్పుడు మరొక ప్రశ్న అడుగవచ్చును. 'బ్రిటిష్ పరిపాలన భారతీయుల ఆచారవ్యవహారాలలో ఏమీ మార్పు తీసుకు రాలేదా ? అన్నప్రశ్నకు ఆహారపానీయాలకు సంబంధించినంతవరకు వచ్చింది, లేదు అని చెప్పాలి. లేదని ఎందుకు చెప్పాలంటే, సాధారణ జన సామాన్యం వాళ్లు తినే ఆహారపదార్థాలను, వేళలను మార్చుకోలేదుకనుక. అవునని ఎందుకు చెప్పాలంటే, కాస్తంత ఇంగ్లీషు భాషతో సంపర్కం కలిగినవారు సకృతుగా ఇంగ్లీషుభావాలను స్వీకరించారు. ఈ మార్పయినా బాగా ప్రస్ఫుటంగా కనుబడదు. మార్పు మంచికొచ్చిందో చెడ్డకొచ్చిందో చదువరులే గ్రహించుకోవాలి.

ఆఖరున చెప్పబడినవర్గంవారు (ఇంగ్లీషు సాంప్రదాయంలోనివారు) ప్రాతఃకాల భోజనాని కలవాటు పడినవారు. సాధారణంగా అది ఒకటి రెండు కప్పులు టీ. ఇప్పుడు పానీయముల సంగతి యోచిద్దాం. బ్రిటిష్ పరిపాలనా ఫలితంగా, విద్యావంతులనుకునేవారి టీ, కాఫీల పానీయాభ్యాసం గురించి మనమంతగా విచారణ చేయనక్కరలేదు. టీ, కాఫీల త్రాగుడు వలన కొంత అదనపు ధనవ్యయమూ, బాగా ఎక్కువగా సేవిస్తే శరీరాన్ని నీరస పరచడమూ తప్ప అంతకన్న ప్రమాదమేమీలేదు. కాని బ్రిటిష్ పరి

పాలనవల్ల బాగా అనుభవంలోనికొచ్చినచెడుగు, ఏదోవిధమైన నిషాపదార్థ ముల త్రాగుడు. అది మానవుల పాలిటి శత్రువు. నాగరికతకు వేరుపురుగు. మహమ్మదీయుడు అతని మతం ప్రకారం సారాసీసాను ముట్టుకుంటే అప విత్రుడవుతాడు. హిందూమతం మధుసేవను ఏ సందర్భంలో కూడా అంగీ కరించలేదు. అయినప్పటికీ ఈ తెచ్చిపెట్టుకున్న త్రాగుడు దురభ్యాసం భారతదేశం నలుమూలలా వ్యాపించిందంటే ఎంత ప్రమాదం తెచ్చి పెట్టిందో గ్రహించవచ్చును. కాని ఈ వ్యసనమైన మద్యపానమును నిషే ధించడానికి బదులు, ప్రభుత్వం వ్యాప్తిచేయడానికి తోడ్పడుతోంది! ఇక్కడ వలెనే అక్కడకూడా దీనివలన ఎక్కువ బాధపడేవారు పేదజనం. పేదజనులు తాముసంపాదించే కొద్దిడబ్బులతో పుష్టియైన ఆహారాన్ని తదితర అవసరాలను కొనుక్కోడానికి బదులు, సారా కొనుక్కుం టున్నారు. ఆ నిర్భాగ్యుడైన పేదవాడు తనుకుటుంబాన్ని పస్తు పడుకో బెడుతున్నాడు. అంటే తనబిడ్డల్ని పోషించవలసిన పవిత్రధర్మాన్ని అతిక్ర మించి, దరిద్రావస్థకులోనై, అకాలమరణం సంభవించేవరకు త్రాగేస్తు న్నాడు. ఈ సందర్భంలో 'బారో' కు మాజీ ప్రతినిధియైన మిస్టర్ కెయిన్, ఈ దురభ్యాసం వ్యాప్తిచెందకుండా నిర్భయంగా దానిపై అద్భుతమైన దండయాత్ర సాగిస్తున్నందుకు మిక్కిలి అభినందనీయుడు. కాని ఎంత శక్తి వంతుడైనా ఒక్కనిశక్తి, సానుభూతిరహితమై, స్తబ్ధతగల ప్రభుత్వాన్నెట్లు ఎదుర్కొనగలదు!

[ *'ది వెజిటేరియన్'* 21-2-1891]

## 4

భారతదేశంలో శాకాహారులంటే ఎవ్వరో, సాధారణంగా వాళ్లేమి తింటారో తెలుసుకున్నాక, శాకాహారులైన హిందువులు బలహీనంగా ఉంటారని కొందరు చెప్పే మాటలెంత నిరాధారమైనవో, అసమంజస మైనవో చదువరులే గ్రహింపగలరు.

భారతీయ శాకాహారులను గురించి వారు చాలాబలహీనంగా ఉంటారనీ, అందుచేత శాకాహారం దేహపుష్టికి అనుగుణ్యంకాదనీ తరుచు చెపుతూ ఉంటారు.

ఇప్పుడు సాధారణంగా భారతదేశంలో శాకాహారులు, మాంసాహారులకన్న అధికంగా కాకపోయినా సమానంగానైనా బలవంతులనీ, ఆమాటకొస్తే ఆంగ్లమాంసాహారులకన్న కూడా బలవంతులనీ, బలహీన తంటూ ఎక్కడైనా ఉంటే అది మాంసాహారం తినకపోవడంవల్ల కాక తదితర కారణాలవల్లనేననీ ఋజువు చేయగలిగితే పై వాదన నిరాధారమని తేలిపోతుంది.

హిందువులు సర్వసాధారణంగా బలహీనులనే ప్రసిద్ధిని తొలుతగా అంగీకరింపక తప్పదు. కాని పక్షపాతంలేని మాంసాహారి ఎవ్వరైనాసరే భారతదేశాన్నిగురించీ, ప్రజలనుగురించీ ఏకొద్దిపాటి ఎరుగున్నవాడైనా భారతీయుల శారీరక బలహీనతకు కారణాలనేకం ఉన్నాయని అంగీకరిస్తారు. చిన్న పిల్లలకు పెళ్లిళ్లుచేయడంవల్ల కలిగే అనర్థాలు ముఖ్య కారణం. అదొక్కటే కారణం కాకపోయినా ముఖ్యకారణాల్లో ఒక్కటి. సాధారణంగా పిల్లలకు తొమ్మిదేళ్ళు వచ్చేటప్పటికే వివాహబంధనాలను కట్టిపెడతారు. చాలామంది కింకా చిన్నవయస్సులోనే పెళ్లిళ్లు అయిపోతవి. కొన్ని సందర్భాల్లో ఇంకాపుట్టకముందుకూడ వివాహనిశ్చయాలు జరిగిపోతాయి. ఒక స్త్రీ తనకు మగపిల్లవాడుపుడితే ఫలానావారి పిల్లను తనకొడుక్కి పెండ్లిచేస్తాననీ, ఆడపిల్లపుడితే మరొకరి అబ్బాయికి ఇస్తాననీ వాగ్దానం చేస్తుంది. అలాగే ఇతర స్త్రీలుకూడాను. అయితే 11, 12 ఏండ్లు వచ్చేదాకా సంయోగం జరుగనిమాట నిజమే. 12 ఏండ్ల భార్యకు 16, 17 ఏండ్ల పురుషుని వల్ల సంతానం కలిగిన ఉదాహరణలున్నాయి. ఈలాంటి వివాహాలు ఎంతటి బలయుతమైన శరీరాలను మాత్రం లొంగదీయవు?

ఆలాంటి వివాహాలవల్ల కలిగే సంతానం ఎంత బలహీనంగా ఉంటుందో యోచించండి. ఆలాంటి దంపతులు ఎంతటి కష్టాలను భరించాలో చూడండి. పదకొండేండ్ల పిల్లవానికి దాదాపు అంతేవయస్సుగల పిల్లను పెళ్లి చేశారనుకోండి. భర్తగాచేయవలసిన పనేమిటో తెలియకూడని, తెలియని కాలంలో అతనికొక భార్యను అంటగట్టడం జరుగుతోంది. అతడింకా బడికెడుతూనే ఉంటాడు. బడిలో జరిగే ప్రాణంవిసిగే తంతుతోపాటు, ఇంట్లో పసిపిల్లయైన భార్యనుకూడా సంబాళించుకోవాలి. ఆమె పోషణభారాన్ని అతడు వహించనక్కర లేదనుకోండి. ఏమంటే సాధారణంగా హిందూదేశంలో, పెండ్లినాటికి, కొడుకు తల్లితండ్రులతో—పేచీలు

పడితేతప్ప—విధిగా వేరు కాపురముండ నవసరంలేదు. కాని ఆ పోషణమినహా అన్నిపనులూ చేసితీరాలి. ఆ తర్వాత ఆరేండ్లకు కొడుకుపుడతాడు. అప్పటికింకా ఆయన చదువు పూర్తిచేసి ఉండడు. అయినప్పటికీ తనను, భార్యను, బిడ్డను పోషించుకోవాలని తాపత్రయ పడితీరాలి. ఏమంటే తన జీవితమంతా తండ్రిచాటున గడపగలమనుకోలేదు. ఒకవేళ ఆలాగడుపుతాడనుకున్నా అధమం తనభార్యాబిడ్డల పోషణకు ఏకొంచెమో ఇచ్చుకోకతప్పదు. తన ఈ ధర్మంసంగతి గమనానికొస్తే మనస్సు తరుక్కుపోయి ఆరోగ్యం చెడిపోదూ? ఉక్కుగుండులాంటి శరీరారోగ్యం కూడా తుత్తునియలైపోదని ఎవరైనా చెప్పడానికి సాహసించగలరా? కాని పై ఉదాహరణలోని పిల్లవాడు మాంసం తిన్నయెడల ఇంకా బలంగా ఉండేవాడని వాదించవచ్చును. ఆ వాదనకొక్కటే జవాబు కనబడుతుంది. క్షత్రియరాజులు మాంసాహారులైనాకూడా వ్యభిచారంవల్ల చాలా శారీరకంగా నీరసులైన వారుండడమే అందుకు నిదర్శనం.

ఇతరత్రా ఏవిధమైన ప్రతిబంధకాలూ లేకపోతే శాకాహారు లెంత బలంగా ఉండగలుగుతారో అనే నిదర్శనం చూడాలంటే, హిందూదేశంలోని గొల్లవారిలో కనబడుతుంది. పశువులకాపరులు మంచి భారీగా, చక్కని అంగసౌష్టవంకలవారు. అతగాడు దుడ్డుకర్రను చేపట్టేడంటే, కత్తి చేతబట్టిన సాధారణ యురోపియనుకు అవలీలగా జవాబు చెపుతాడు. గొల్లలు దుడ్డుకర్రతో పులులనూ, సింహాలనూ కూడా చంపిన ఘట్టాలు, పారద్రోలిన సంఘటనలుకూడా ఉన్నవి. "మనుష్యులు సహజమైన మోటు పరిస్థితులలో నివసిస్తూ ఉండడమే ఇందుకు కారణం. ప్రస్తుతం విశేషంగా కృతకపరిస్థితులలోనున్న సంఘంలో మనిషికి కేవలం క్యాబేజీ, బఠాణీలుకాక మరేదైనా కావలసి ఉంటుంది. మీ గొల్లలకు వివేకం తక్కువ. అతడేమీ పుస్తకాలు చదువడు" అని ఒకనాడొక మిత్రుడన్నాడు. అప్పటికీ ఇప్పటికీ దానికొక్కటే జవాబు. కాయగూరలు తినే గొల్ల, మాంసాహారం తినే గొల్లకన్న అధికుడు కాకపోయినా తక్కువమాత్రం కాడు. ఒకే వర్గానికి చెందిన శాకాహారికి, మాంసాహారికి అదే తారతమ్యం. ఉభయులనూ శారీరకబలం విషయంలోనే పోలుస్తున్నాం కాని శరీరబలంతోపాటు బుద్ధిబలాన్నికూడా కలపడంలేదు. ఏమంటే ప్రస్తుతానికి కేవలం శాకాహారంవల్లమాత్రమే భారతీయ శాకాహారులు బలహీనంగా ఉన్నారన్నమాట సరియైనది కాదని ఋజువుచేయడానికే నా ప్రయత్నం.

నీ చిత్తమొచ్చిన ఆహారం తినవచ్చును కాని, ఎక్కడో అపురూపంగా తప్ప, బుద్ధిబలం శరీరబలంకలసి ఉండడం అసంభవంలా కనుబడుతుంది. నష్ట పరిహార న్యాయాన్ననుసరించి, బుద్ధిబలం కూడివస్తే శరీరబలం తగ్గిపోవాలి. శాంసను గ్లాడ్‌స్టన్ కాజాలడు. ప్రస్తుతం సంఘమున్న స్థితిగతులలో కాయగూరల స్థానంలో మరొకటేదో ఉండాలనే వాదనను మాటవరుసకి అంగీకరిద్దామన్నా, ఆ పదార్థం మాంసమేనని నిర్ధారణగా ఋజువైనదా ?

ఉదాహరణకి, ఇండియాలో వీరుల వర్గానికి చెందిన క్షత్రియుల సంగతెత్తుకోండి. నిస్సందేహంగా వారంతా మాంసాహారులు. కాని వారిలో కత్తిపట్టిన వారెంత కొద్దిమంది! కాని జాతిమొత్తంమీద, వారు బలహీనులని నే నెన్నటికి చెప్పను. పృథు, భీముడు మొదలైన వారి పేర్లు జ్ఞాపకమున్నంతవరకు—ఇంకా వారిపూర్వుల సంగతట్లుండ నివ్వండి—క్షత్రియజాతి బలహీనమైనదని నమ్మేవాడు శుద్ధ అవివేకి. కాని వాళ్లు ఇప్పుడు తీసికట్టులో పడ్డారన్న సంగతి విచారకరమైన సత్యం. ఇతరుల మాటటుండగా నిజంగా వీరులనదగిన ప్రజలు పశ్చిమోత్తర ప్రాంతీయులైన భయ్యాలు. వాళ్లు గోధుమలు, పప్పులు, ఆకుకూరలు తిని జీవిస్తారు. వాళ్ళు శాంతి సంరక్షకులు. దేశీయసైన్యాల్లో ఎక్కువగా వారినే నియమిస్తూ ఉంటారు.

పైన ఉదహరించిన సరియైన సంగతులనుబట్టి, శాకాహార భోజనం వల్ల ఏమీ అనర్థం లేకపోవడమే కాకుండా, శరీరానికి బలవర్ధకమని కూడా సుళువుగా తెలుసుకోనవచ్చును. హిందువుల బలహీనతకు శాకాహారం కారణమనడం కేవలం అపోహ.

[*'ది వెజిటేరియన్'* 28-2-1891.]

## 5

గతవ్యాసంలో, హిందూశాకాహారుల బలహీనతకు కారణం వారి ఆహారంవలనకాదనీ ఇతర కారణాలవలన కావచ్చుననీ, శాకాహారులైన గొల్లలు, మాంసాహారులంతటి శరీరబలం కలవారనీ తెలుసుకున్నాం. శాకాహారులలోకల్లా గొల్ల మంచి ఉదాహరణ కనుక అతని జీవిత విధానాన్ని పరిశీలించడం మనకు శ్రేయస్కరం. కాని ఇకముందు చెప్పే విషయాలు గొల్లలందరికీ సర్వేసర్వత్రా వర్తించవని మాత్రం చదువరులకు

ముందు చెప్పవలసుంటుంది. హిందూదేశంలో ఒక ప్రాంతంలో ఉండే గొల్లవారికే ఇది వర్తిస్తుంది. స్కాట్లండు ప్రజల అలవాట్లకు ఇంగ్లండు ప్రజల అలవాట్లకు భేదములున్నట్లే, ఇండియాలో ఒక ప్రాంతంలో ఉండే వారి అలవాట్లకూ మరొక ప్రాంతంలోని వారి అలవాట్లకూ భేదాలున్నాయి.

భారతీయ పశువులకాపరి (గొల్ల) సాధారణంగా ఉదయం 5 గంటలకు నిద్రలేస్తాడు. అతడు కాస్తంత భగవద్భక్తుడైతే ముందు చేసేపని దైవప్రార్థన. తరువాత పండ్లు తోముకొని, ముఖం కడుక్కొని, కాలకృత్యాలు తీర్చుకుంటాడు. ఈ సందర్భంలో పండ్లు తోముకోడానికి అతడుపయోగించే కుంచెను గురించి కొంచెం చెప్పనివ్వండి. ముళ్లతో ఉండే తుమ్మచెట్టుపుల్లయే అతడి కుంచె. ఒక సన్నని కొమ్మను అడుగు పొడుగున ముక్కలుచేస్తాడు. ముళ్లన్నీ తీసేస్తాడు. ఆ ముక్కనొక చివర పండ్లు తోముకోడానికి వీలుగాఉండేటంత మెత్తని కుంచెలాగయే వరకూ పండ్లతో నములుతాడు. ఆ విధంగా ఏరోజు కారోజే ఒక కొత్త కుంచె నింట్లో తయారుచేసుకుంటాడు. చక్కగా పండ్లు ముత్యాలులాగున తెల్లగా ఉండేవరకూ ఆ కుంచెతో తోముతాడు. ఆ పిమ్మట ఆ పుల్లను చీల్చి ఆ బద్దనువంచి నాలుక గీసుకుంటాడు. బహుశా ఈ విధంగా పండ్లు తోముకోవడంవల్లనే భారతీయుల పండ్లు సాధారణంగా గట్టిగానూ అందంగానూ ఉండడానికి కారణం. అతడేమీ దంతచూర్ణాలను వాడడని వేరే చెప్పనక్కరలేదు. పలుతోముపుల్లను నమలడానికి తగినంత దంత బలంలేని వృద్ధులు ఒక చిన్నసుత్తిని ఉపయోగిస్తారు. మొత్తం ఈ పనంతా 20, 25 నిముషాలకన్న ఎక్కువ పట్టదు.

మళ్లీ గొల్ల దినచర్య కొద్దాం. పళ్ళు తోముకున్న తరువాత దళసరిగాఉండే రొట్టెను (ఆ రొట్టెను సాధారణంగా జొన్నతోనో గంటెలుతోనో చేస్తారు; గోధుమకు బదులు గానో, దానికి తోడుగానో ఉపయోగిస్తారు.) నెయ్యి, బెల్లం కలిపి తింటాడు. ఉదయం 8, 9 గంటలకు తనవద్దీలో ఉన్న దూడలను మేపడానికి బీట్లోకి తోలుకెడతాడు. పచ్చగడ్డిబీడు సామాన్యంగా ఊరికి రెండు మూడు మైళ్లదూరంలో ఉంటుంది. అది కొండలు, గుట్టలతో ఉండి ఆకుపచ్చగా పచ్చని తివాచీ పరచినట్లుంటుంది. అందుచేత ప్రకృతి దృశ్యాలమధ్య పరిశుభ్రమైన వాయువును ఆనందించే అదృష్టం మాతనికి కలుగుతుంది. దూడలు

స్వేచ్ఛగా మేస్తూ తిరుగుతుంటే, అతడు హాయిగా పాడుకుంటూనో, భార్యతోనో సోదరునితోనో లేక మరో బంధువుతోనో మాటా మంతీ చెప్పుకుంటూనో, కాలక్షేపంచేస్తుంటాడు. సుమారు 12 గంటలకు తనతో కూడా ఎప్పుడూఉండే మధ్యాహ్నభోజనం చేస్తాడు. అందులో ఎప్పుడూ తయారుగా ఉండే రొట్టెలు, నెయ్యి, ఒక కాయకూర, ఏదో పప్పు, అదనంగానో దానికి బదులో ఊరుగాయ, అప్పుడే పితికిన ఆవుపాలు ఉంటాయి. తర్వాత సాధారణంగా రెండు మూడు గంటల వేళ ఏ చల్లనిచెట్టునీడనో అర్ధగంటసేపు ఒక కునుకు తీస్తాడు. ఆ కాస్త నిద్రా మందు ఎండవల్ల కలిగిన వేడిమి బాధను పోగొట్టి విశ్రాంతినిస్తుంది. ఆరు గంటలకు ఇంటికి మళ్లుతాడు. 7 గంటలకు వేడివేడి రొట్టెలను పప్పు కాయగూరలతోనూ తినేసి, ఇంత పాలూఅన్నంతోనో, మజ్జిగా అన్నంతోనో భోజనం పూర్తిచేస్తాడు. ఆ పిమ్మట ఏదో ఇంటిగొడవలు చూచుకుని, అంటే సర్వసాధారణంగా కుటుంబంతో పిచ్చాపాడీ మాట్లాడుకుని, రాత్రి 10 గంటలయ్యేసరికి పండుకుంటాడు. ఆరు బయటనో, లేక జనసమ్మర్దం కలిగిన గుడిసెలోనో నిద్రపోతాడు. శీతకాలంలోనూ, వర్షాకాలంలోనూ అతడు గుడిసెలో చేరుతుంటాడు. ఈ గుడిసెలు కిటికీలు వగైరాలేమీ లేకుండా చూడడానికైతే చాలా దుర్భరంగా కనుబడతాయి కాని గాలి ఎంతమాత్రంచొరని గుంజారాలు కావన్న సంగతి గుర్తించాలి. ఆ గుడిసెలు శుద్ధ మోటుగా నిర్మింపబడడం చేత సాధారణంగా వాటి తలుపులు దొంగలు దూరకుండా ఆపగలవుకాని, ఎండ వేడిమిని గాలివిసరులను ఆపలేవు. ఈ గుడిసెలను ఇంకా బాగా నిర్మాణం చేయడానికి చాలా సావకాశం ఉన్నదని మాత్రం చెప్పకతప్పదు.

కొంచెం కలిగిఉన్న గొల్లవారి జీవితం ఇలా ఉంటుందన్నమాట. అనేక విధాలుగా అతని జీవితవిధానం చాలా ఆదర్శమైనది. అతని అలవాట్లు విధిగా చాలా క్రమబద్ధంగా ఉంటాయి. నిత్యం చాలాసేపు బయటనే ఉండి పరిశుభ్రమైన గాలిని పీలుస్తాడు. తగినంతగా దేహపరిశ్రమచేస్తాడు. చక్కని పుష్టికరమైన ఆహారాన్ని తింటాడు. అన్నిటికన్నా ముఖ్యమైన దేమంటే శరీరాన్ని సాధారణంగా అలసటపెట్టి శోషింపచేసే చీకూ చింతా ఏమీ పట్టించుకోడు.

['ది వెజిటేరియన్' 7-3-1891.]

## 6

ఆతని జీవితవిధానంలో తప్పుపట్టకలిగినదల్లా, స్నానం సకృతుగా చేయడమే. ఉష్ణప్రదేశాల్లో స్నానాలు చాలా ఉపయోగమైనవి. బ్రాహ్మణుడు రోజూ రెండుసార్లు, వైశ్యుడు రోజుకొకసారి స్నానం చేస్తే, గొల్లడు వారానికొక్కమారే స్నానం చేస్తాడు. ఈ సందర్భంలో భారతీయులు స్నానం ఎల్లాచేస్తారో వివరిస్తాను. సాధారణంగా తన ఊరికి దగ్గరలో ప్రవహిస్తున్న నదిలో మునిగి స్నానం చేస్తాడు. నదికి వెళ్లడానికి బద్ధకించో, అందులో మునిగిపోతానని భయపడితేనో, లేకతన ఊరిదగ్గర ప్రవాహమంటూ లేకపోతేనో, ఇంటి దగ్గర స్నానం చేస్తాడు. మునిగి స్నానంచేసే తొట్టె అంటూ ఉండదు. తన ఎదుట నుంచబడిన బిందెలో నుంచి చెంబుతో నీళ్లు ముంచుకుని ఒంటిమీద పోసుకుంటాడు. ఏమంటే, నిలవనీటిలో శరీరాన్ని ఒక్కసారి ముంచితే అది కలుషితమైపోతుందనీ, మరింక ఉపయోగానికి పనికిరాదనీ అతని విశ్వాసం. అందుచేతనే అతడు చేతులనుకూడా (బేసిన్) మూకుడులో కడుగడు. ఎవరైనా చేతులమీద నీళ్లుపోయాలి. లేకపోతే చెంబు మోచేతులతో నొక్కిపట్టి స్వయంగా పోసుకోవలసినదే.

అసలు విషయానికొద్దాం. తక్కువగా స్నానాలు చేయడంవల్ల అతడి ఆరోగ్యమేమీ అంతగా పాడైనట్లు కనుపించదు. కాని బ్రాహ్మణుడొక్కసారైనా స్నానంచేయకపోతే చాలా కటకట పడిపోతాడు. కొంతకాలం అలా స్నానంచేయకుండా ఉంటే శీఘ్రంగా జబ్బుపడిపోతాడు.

వేరేకారణాలేమీ కనుబడకపోవడంచేత కేవలం అలవాటుకే అంటగట్టవలసిన విషయాలలో ఇదొకటనుకుంటాను. పాకీపనివాడు తన వృత్తిని చేస్తూనే చక్కగా ఆరోగ్యం కాపాడుకుంటాడు. మరొకడెవ్వరైనా ఇతరుడు ఆపని చేయబోతే చచ్చినంత పనవుతుంది. బహుసున్నితంగా పెరిగిన ప్రభువెవ్వరైనా ఈస్టెండు కూలివాడు చేసేపనిని చెయ్యబోతే చావుకు సిద్ధమవుతాడు

ఈ సందర్భంలో సరిగా సరిపోయే ఒక పిట్టకథను చెప్తాను. ఒకానొక రాజు పందుంపుల్లలమ్మే స్త్రీని మోహించాడు. ఆమె అందానికి సాక్షాత్తూ రంభా ఊర్వశీ అనుకోండి. ఆమెను రాజుగారి కోటలో పెట్టడానికి ఆజ్ఞ అయిపోయిందని వేరేచెప్ప నక్కరలేదు. వాస్తవానికి ఆమెను వైభవంలో

ముంచెత్తేశారు. ఉత్తమోత్తమమైన ఆహారం, బట్టలూ ఒకటన్నమాటేమిటీ, సమస్తమైన మంచిపదార్థాలూ ఆమెకు లభించాయి. కాని పాపం! ఆమెకు ఈ విలాసం పెరిగినకొద్దీ ఆరోగ్యం చెడిపోవడం ప్రారంభించింది. అసంఖ్యాకులైన వైద్యులు ఆమెకు చికిత్సలు చేశారు. కాని ఎంతో నియమంగా ఇవ్వబడిన మందులేమీ పనిచేయలేదు. ఇంతలో ఒక కుశాగ్రబుద్ధియైన వైద్యుడు ఈ రుగ్మతయొక్క అసలుకారణాన్ని గ్రహించాడు. ఆమెకు దెయ్యాలు పట్టినవన్నాడు. వాటిని తృప్తిపరచడానికి, కొన్ని చద్దిరొట్టెలు, పండ్లు ఆమె ఉండే గదులన్నిటిలో పెట్టి ఉంచమన్నాడు. ఆమె కెన్నిగదులున్నాయో అన్నిరోజుల్లో దెయ్యాలు వదలిపోతాయనీ వాటితోపాటు రోగంకూడా వదలిపోతుందనీ చెప్పేడు. సరిగా అలాగే జరిగింది. పాపం ఆ రొట్టెలను రాణీ ఆరగించినదని వేరే చెప్పక్కరలేదుగదా! కనుక, అలవాటు మనుష్యుల నెట్లా బాధిస్తుందో ఈ కథ చాటుతోంది. కనుక స్నానాలు తక్కువగాచేయడం వల్ల గొల్లల కేమీ జబ్బులేదనుకుంటాను.

ఇలాంటి జీవితపంథా ననుసరించడంవల్ల కలిగే ఫలితాలేమిటో క్రిందటి వ్యాసంలోనే పొందుపరిచాను. కనుక శాకాహారియైన గొల్ల శారీరకంగా బలిష్టుడే. అతడు దీర్ఘాయువుకూడా. 1888 సంవత్సరం నాటికి నూరు సంవత్సరాలుదాటిన గొల్ల ముసలమ్మను నే నెరుగుదును. నేను ఆఖరున చూచేసరికి ఆమెకు కనుదృష్టి చక్కగా ఉన్నది. జ్ఞాపక శక్తి బాగాఉన్నది. ఆమె చిన్ననాటి సంగతులనెన్నింటినో జ్ఞప్తికి తెచ్చుకొని పూసగుచ్చినట్లు చెప్పగలిగింది. చేతికర్ర ఊతంతో నడిచేది. ఆమె ఇంకా జీవించే ఉందనుకుంటాను.

అంతేకాకుండా గొల్లని శరీరం సమంగా, చూడడానికి సొగసుగా, ఉంటుంది. వారిలో అంగవైకల్యం చాలా అరుదు. అతడు పెద్దపులి లాగున చూడడానికి భయంకరంగా ఉండకపోయినా, బలంగానూ ధైర్యంగానూ ఉంటాడు. మేకపిల్లలాగున నమ్రతగానూ ఉంటాడు. భీతిగొల్పకుండానే అతని ఉన్నతి గంభీరంగా ఉంటుంది. మొత్తంమీద భారతదేశపు గొల్ల శాకాహారులలోకల్లా చక్కని నమూనా. శరీర బలానికి సంబంధించినంతవరకు అతడు ఏ మాంసాహారికీ తీసిపోడు.

['ది వెజిటేరియన్' 14-3-1891.]

# 8. కొన్ని భారతీయ పండుగలు

## 1

ఈ ఈస్టర్ పండుగ సమయంలో, ఈ కాలంలోవచ్చే కొన్ని భారతీయ పండుగలు గురించి వ్రాయడానికి కుతూహలంగా ఉన్నది. కాని ఇప్పటి శలవలు, అంత ముఖ్యమైనవి కావు. దీపావళి శలవలు వాటి కన్న చాలాముఖ్యమైనవీ, బ్రహ్మాండమైనవీ అవడంచేత వాటికే అగ్రస్థాన మివ్వడం న్యాయం.

హిందూ క్రిస్మస్ అనదగిన దీపావళి హిందువుల సంవత్సరాంతానికి వస్తుంది—అనగా నవంబరు నెలలో. సాంఘికంగానూ, మత విషయికంగానూ కూడా అది పండుగే. అది నెలరోజులపాటు ఉంటుంది. అశ్వినిమాస పాడ్యమి (హిందు పంచాంగంలో ఆఖరునెల) తో పండుగ ప్రారంభమౌతుంది. ఆనాడు పిల్లలు బాణాసంచాకాల్చడానికి ప్రారంభిస్తారు. మొదటి 9 రోజులు నవరాత్రులంటారు. (తొమ్మిది రాత్రుళ్ళు). ఈ రోజుల్లో ముఖ్యమైన విశేషం గర్బాలు అనగా భజనలు. 20, 30 మంది ఇంకా ఎక్కువ మందికూడా ఒకచోటచేరి, మధ్యనొక అందంగా చేయబడిన పెద్ద దీపపు సెమ్మెనుపెట్టి, చుట్టూ కడియం కడతారు. మధ్య ఒకడు కూచుని చిడతలుచేత్తోపుచ్చుకుని అందరికీ ఇష్టమైన పదం పాడుతుంటాడు. చుట్టూ ఉన్న వాళ్ళు చేతుల్తో తాళంవేస్తూ ఆ పదాన్నే మళ్లీ పాడుతుంటారు. ఆ పదా లందుకుంటూ సెమ్మెచుట్టు తిరుగుతుంటారు. నడుంవంచి అడుగు లేస్తుంటారు. తరుచుగా ఈ భజన చాలా వినసొంపుగా ఉంటుంది.

ఈ భజనల్లో ఆడపిల్లలు పాల్గొనరు. పెద్దవాళ్ళసంగతి చెప్పనే అక్కరలేదు. కాని మగవాళ్ళు లేకుండా వాళ్ళ భజనలు వాళ్ళు వేరుగా చేసుకుంటూనే ఉంటారు. కొన్ని కుటుంబాల్లో నక్తాలు (అంటే ఒంటిపూట భోజనం) చేసే ఆచారంకూడా కలదు. కుటుంబానికొక్కరు అలా ఏకభుక్తం చేస్తే చాలును. ఈ నక్తాలు చేసేవారు సాయంకాలం ఒక్కమాటే భోజనం చేస్తారు. అంతేకాదు. ఆ భోజనంలో అన్నం, పప్పు వగైరాలు తినకూడదు. పాలు, పండ్లు, బంగాళదుంపలు వగైరా దుంపకూరలు మాత్రమే తినాలి.

ఆశ్వయుజమాసం పదవరోజును దసహరా అంటారు. ఆ రోజున స్నేహితులంతా ఒకరినొకరు కలుసుకొని విందులారగింపచేస్తారు. ఆ రోజున స్నేహితులకు, ముఖ్యంగా అభిమానులకు, యజమానులకు, మిఠాయిలను ఉపాయనంగా పంపడం ఒక ఆచారం. ఒక్క దసరా రోజున తప్ప మిగిలిన రోజుల్లో వినోదాలన్నీ రాత్రివేళ జరుగుతుంటాయి. పగలు ఎవరి పనులు వాళ్ళు చూచుకుంటారు. దసరా వెళ్లిన పిమ్మట పదిహేనురోజుల పాటంతా ప్రశాంతంగా ఉంటుంది. ఆడవాళ్ళుమాత్రం రాబోయే పండుగనాటికి మిఠాయిలు, అరిసెలు, అప్పాలు, వగైరా వంటకాలను తయారుచేయడంలో నిమగ్నులై ఉంటారు. ఏమంటే ఇండియాలో ఎంత పెద్దయింటి స్త్రీలైనా వంటచేయటానికి సంకోచించరు. నిజానికి, అది విధిగా ప్రతి స్త్రీ నేర్చుకుతీరవలసిన విద్య.

ఈ విధంగా విందులతోటీ, వినోదాలతోటీ రాత్రిళ్లు కాలక్షేపం చేస్తూ బహుళ ౧౩ దాకా గడుపుతారు. (భారత దేశంలో ప్రతినెలా కృష్ణపక్షమనీ శుక్లపక్షమనీ విభజింపబడుతుంది. పౌర్ణమి వెళ్లడంతో కృష్ణపక్షం, అమావాస్య వెళ్లడంతో శుక్లపక్షం ప్రారంభమవుతుంది.) త్రయోదశినుంచీ తరువాత మూడురోజులూ ఆనందవిలాసాల్లో గడచిపోతాయి. ఆ పదమూడవ రోజును ధనత్రయోదశి అంటారు. అనగా ఆరోజు ప్రత్యేకంగా ధనానికి అధిష్ఠాన దేవతైన లక్ష్మిని ఆరాధిస్తారు. ధనికులైనవారు, వివిధములైన ఆభరణాలను, రత్నాలను, నాణెములను సేకరించి జాగ్రత్తగా ఒక పెట్టెలో పెడతారు. వీటిని పూజచేయడానికి తప్ప మరెందుకూ వినియోగించరు. ప్రతి సంవత్సరం ఉన్నదాని కేదో మరికొంత కలుపుతారు. ఏ కొద్దిమందో తప్ప మనస్సులో ధనం కావాలని కోరనివారెవరు? అంటే ధనాన్ని ఆరాధించనివారెవ్వరు? కనుక ఆలా సేకరించబడిన ఆభరణాలు వగైరాలను నీళ్లతోనూ, పాలతోను కడిగి వాటిని పువ్వులతోను, కుంకుమతోనూ అలంకరించి పూజిస్తారు.

పధ్నాలుగోరోజును కాళీచతుర్దశి అంటారు. ఆ రోజున తెల్లవారు జామునే నిద్రలేస్తారు. ఎంతటి బద్ధకస్థులైనా ఆవేళ చక్కగా స్నానం చేసితీరాలి. శీతాకాలమైనా, స్నానం చెయ్యమని తల్లి చిన్నపిల్లలను సైతం నిర్బంధిస్తుంది. కాళీచతుర్దశినాటి రాత్రి స్మశానాల్లో భూత ప్రేత

పిశాచగణాలు సంచారం చేస్తుంటాయని విశ్వసించేవారు బయట కెడితే ఎక్కడైనా ఏ భూతమైనా కనుబడుతుందేమోనని పిరికితనంచేత ఇళ్ళల్లోనుంచి కదలరు.

['ది వెజిటేరియన్' 28-3-1891.]

## 2

ఓహో! ఈరోజు 15వ నాటి ఉదయం. అసలు దీపావళి. దీపావళి రోజునే అసలైన బాణసంచాను కాలుస్తారు. ఆ రోజున ఎవ్వరూ తమడబ్బును వదలిపెట్టడాని కంగీకరించరు. ఆ నాడు ఎవరిదగ్గరా అప్పుపుచ్చుకోరు ఇవ్వరు కావలసిన వస్తువుల ఖరీదు క్రితంరోజునే పూర్తి అయినట్లు లెఖ్ఖ.

రాజబాటలో ఒకమూల మీరు నిలబడ్డారనుకోండి. క్రొత్తగా కుట్టించుకున్న తెల్లని సల్లడం, అంగీతొడుక్కుని, పొడుగ్గా ఎదిగిన గడ్డాన్ని పాయదీసి పైకెత్తి తలపాగాలో కలిపిచుట్టి, కూనిరాగాలు పాడుకుంటూ, కదంతొక్కుతూవచ్చే ఆ గొల్లబోయడ్ని చూడండి. అతని వెంట ఆవులమంద. వాటి కొమ్ములు ఎర్రరంగు ఆకుపచ్చరంగులతోను, కొమ్ములచివర వెండి తొడుగులుతోనూ అలంకరింపబడ్డాయి. ఆ వెంటనే ఆడపిల్లల సమూహం వస్తోంది. వాళ్ళనెత్తినున్న చుట్టుకుదుర్లమీద చిన్న చిన్న కుండలున్నాయి. అందులో ఏమున్నదాయని మీ కాశ్చర్యం కలుగవచ్చును. పడుచులు తమ నెత్తినున్న కుండలలోనుంచి పాలను ఒయ్యారంగా చిలకరించడంతో ఆ సందేహం నివృత్తి అవుతుంది. తర్వాత, ఆ వచ్చే పెద్దమనిషిని, ఆయన తెల్లటి మీసాలు, తెల్లని పెద్దతలపాగా, తలపాగాలో పొడుగాటి రెల్లుకలం చూడండి. ఆయన నడుముకొక నిడుపైన రుమాలు చుట్టేడు ఆ చుట్టులోనే వెండిసిరాబుడ్డి నొకదానిని అమర్చేడు. ఆతడొక్క వడ్డీవ్యాపారస్థుడని తెలుసుకో ఈ విధంగా రకరకాల మనుష్యులు తాపీగా సంతోషంతో పోతూఉండడం చూడగలుగుతారు.

ఇక రాత్రిసంగతి. వీధులన్నీ దీపాలవెలుగుతో కళ్లు మిరుమిట్లు కొలుపుతవి కాని రీజంటువీధినిగాని, ఆక్సుఫర్డువీధినిగాని చూడనివాళ్లకు మాత్రమే ఆలాంటి ఆశ్చర్యం: ఎక్కడో బొంబాయివంటి పెద్దపట్నాల్లో తప్ప, ఇక్కడ క్రిస్టల్ రాజభవనంలాంటి దీపాలంకరణంతో వాటిని పోల్చడానికి వీలులేదు. పురుషులు, స్త్రీలు, పిల్లలు ప్రశస్తమైన వస్త్రాలను

ధరిస్తారు. సాధారణంగా ఆ దుస్తులు అనేక విధములైన రంగు లవడం చేత ఇంద్రధనస్సులా ఆనందాన్ని కలిగిస్తాయి. ఆ రోజున విద్యల కధిష్ఠాన దేవతయైన సరస్వతి నారాధిస్తారు. వ్యాపారస్తులు కొత్త చిఠా పుస్తకాలను పెట్టి మొదటి పద్దు వ్రాస్తారు. సర్వవ్యాపియైన పురోహిత బ్రాహ్మణుడు ఏవో మంత్రాలు చదివి దేవతల నావాహనిస్తాడు. పూజ ఆఖరైన పిమ్మట ఎంతో తొందరపాటుతో వేచియుండే పిల్లలు బాణాసంచాలను ముట్టించడం ప్రారంభిస్తారు. సాధారణంగా ఈ ఆరాధన ఒకే సమయానికి జరుగుతుంది. కనుక వీధుల్లో బాణసంచా ధమధమధ్వానాలు చెవులు తడికెలుకట్టేటట్లు చేస్తాయి. ఆ పిమ్మట కాస్తంత దైవభక్తి గలవారు దేవాలయాలకు పోతారు. అక్కడకూడా కేలింతాలు, ఆనందోత్సవం తప్ప మరేమీ ఉండదు. ఎక్కడచూచినా కళ్లుమిరుమిట్లు గొలిపే దీపాలంకరణము తప్ప మరేమీ ఉండదు.

మరుసటిరోజున అనగా నూతన సంవత్సరాదినాడు బంధుమిత్రుల వద్దకెళ్లి వాళ్ళనుచూడడం, వాళ్లు యింటికొచ్చినప్పుడు ఆహ్వానించడమే పని. ఈ రోజున పొయ్యిలో నిప్పంటించడం ఉండదు. అదివరకే తయారైన చల్లులనే ఆరగిస్తారు. ఆ రోజున ఎంత తిండిపోతులైనా లోటు రాదు. ఎంతతిన్నా ఎన్నిసార్లుతిన్నా తరగనంత ఆహారం ఉంటుంది. ధనికులైనవారు అన్నిరకాల కాయగూరలను, ధాన్యాలను, పప్పుదినుసులను కొని వండుకుని ఉగాదినాడు అన్నిటినీ రుచిచూస్తారు.

సంవత్సరాది వెళ్లిన మర్నాడు. వెనుకటి రోజులతో పోలిస్తే ప్రశాంతంగా ఉంటుంది. మళ్ళీ పొయ్యి రాజేస్తారు. అంతకుముందు బాగా తుష్టిగా భోజనం చేసినమీదట కొంచెం తేలికగా భోజనాలు చేస్తారు. ఎవరో అల్లరిసజ్జు పిల్లకాయలు తప్ప మరెవ్వరూ బాణసంచా కాల్చరు. దీపాలంకరణంకూడా తక్కువగానే ఉంటుంది. రెండవ రోజుతో దీపావళి శలవలు ముగిసినట్లే.

ఈ వేడుక దినములు, సంఘంమీద ఏలాంటి ఫలితాలను కలిగిస్తున్నాయో, అనుకోకుండానే జనం ఏలాంటి మంచిపనులు చేస్తుంటారో చూద్దాం. సాధారణంగా కుటుంబానికి చెందినవారంతా శలవలకు తమ స్వగృహానికి చేరుకుంటారు. గత సంవత్సరమంతా వ్యాపారంకోసం బయటకుపోయిన యజమాని భార్య దగ్గరకొస్తాడు. తన పిల్లలదగ్గరుండా

లని తండ్రి ఎంతదూరాన్నున్నా ఇల్లు చేరుకుంటాడు. ఇతరచోట్ల చదువుకుంటున్న పిల్లలు ఇంటికి చేరతారు. అందుచేత సాధారణంగా కుటుంబములోని వారందరి కలయికా సంభవిస్తుంది. చాలినవారందరు కొత్తబట్టలు ధరిస్తారు. ధనికవర్గాలవారు ఈ పండుగకని ప్రత్యేకంగా ఆభరణాలుకూడా చేయించుకుంటారు. చిరకాలంనాటి కుటుంబ కల హాలుకూడా ఆనాటికి సర్దుకుంటారు. అథవా సర్దుబాటు చేసుకోవడానికి తీవ్రమైన ప్రయత్నమైనా చేస్తారు. ఏ దేవదారు పెట్టెలోనో పడుండిన పాతకుర్చీలు, బల్లలు బయటికితీసి బూజులుదులిపి తత్కాలంగా నైనా గృహాలంకరణం చేస్తారు. వీలైనంతమట్టుకు పాతబాకీలుంటే తీరుస్తారు. క్రొత్త సంవత్సరానికి ప్రతివారూ ఏదో కొత్త వస్తువును కొని తీరాలి. సాధారణంగా ఏదో ఒక చెంబో, గిన్నో అవుతూ ఉంటుంది. ధారాళంగా దానధర్మాలు చేస్తారు. ప్రార్థనలు చేయాలనీ, రోజూ దేవాలయాని కెళ్లాలనీ అంత పట్టింపులేనివారంతా కూడా ఈ పండుగ రోజులలో ఆ రెండుపనులూ చేస్తారు.

ఈ పండుగ శెలవల్లో ఒకళ్ళతో ఒకళ్ళు తగాదాలు పడరు. సాధారణంగా క్రింది తరగతులవారిలో అలవాటుగా జరుగుతుండే తిట్లాటలుండవు. ఒక్కమాటలో చెప్పాలంటే అంతా శాంతంగానూ, ఆనందంగానూ ఉంటుంది. జీవితం భారంగా ఉండడానికి బదులు బహు ఆనందంగా ఉంటుంది. ఈలాంటి పండుగలవలన ముందుముందు అనేక సత్ఫలితాలూ, మంచీ కలుగుతుందని సులభంగా గ్రహించవచ్చును. కాని కొందరు ఈ వేడుకలు పురాణకాలంనాటి చాదస్తాలని త్రోసేస్తుంటారు. నిజానికివి మానవజీవితానికెంతో శ్రేయస్సు నిచ్చేవి. లక్షలాది పాటకపు జనాల జీవితాలలోనుంచి విసుగును, ప్రయాసను తొలగిస్తాయి.

దీపావళి శెలవులు భారతదేశమంతటా ఉన్నా, వివిధ ప్రాంతాలలో వివిధరీతులుగా ఆచరణచేస్తూ ఉంటారు. అంతేకాకుండా హిందువుల పండుగల్లోకల్లా గొప్పదైన ఈ పండుగను గురించి ఈ వర్ణన చాలా అసమగ్రమైనది. అంతేకాదు. ఈ పర్వదినాలు దుర్వినియోగం కావడం లేదనడానికి వీలులేదు. అన్ని వ్యవహారాల మాదిరిగానే, ఈ పండుగల్లో కూడా కొంత చెడుగుండవచ్చును. ఉందే అనుకుందాం. దాని నల్లా వదిలేద్దాం. నిస్సందేహంగా వాటివల్ల చెడుగుకన్న మంచే చాలాహెచ్చు.
[ 'ది వెజిటేరియన్' 4–4–1891.]

## 3

దీపావళి పండుగకు తర్వాత ముఖ్యమైన పండుగ హోళీ. మార్చి 28వ తేదీ 'వెజిటేరియన్' పత్రికలో దానిని గురించి ప్రస్తావనచేయ బడింది.

హోళీ పండుగలు సాధారణంగా ఈస్టరు రోజుల్లో వస్తాయని గుర్తించుకోవాలి. హిందూ పంచాంగం ప్రకారం ౯వ మాసమైన ఫాల్గుణ శుద్ధ పౌర్ణమినాడు హోళీ పండుగ. (గుజరాతీయులకు ఉగాది కార్తీక మాసం—అనువాదకుడు). అది వసంతకాల ప్రారంభం. చెట్లన్నీ మొగ్గలు తొడుగుతుంటాయి. చలికాలపు దుస్తులకు స్వస్తిచెప్పబడుతుంది. పలచని దుస్తులను ధరించడం నాగరిక చిహ్నము. దేవాలయాల్లో అడుగెడితే, వసంతం వచ్చిందని మరింత స్పష్టంగా కనబడుతుంది. (దేవాలయంలో ప్రవేశించాలంటే విధిగా హిందువుడై ఉండాలి.) దేవాలయ ప్రాంగణంలో కాలెట్టడంతోనే అనేకరకాల చక్కని పూవుల సౌరభం తప్ప మరోవాసనేమీ ఉండదు. భక్తులు దేవాలయ సోపానాల మీద కూచుని స్వామికి (ఠాకూరుజీ) దండలు గ్రుచ్చుతూ ఉంటారు. ఆ పుష్పములలో గులాబీ, మొగలి, మల్లి, జాజి, వగైరాలుంటాయి. సాక్షాత్ స్వామి దర్శనానికి ఆలయం తలుపులు తెరిచేసరికి స్వాదైన సువాసనా వీచికలు నిన్నానందింప చేస్తాయి. స్వామి పలచని లేతరంగు దుస్తులను ధరిస్తాడు. పాదాలమీద పువ్వులకుప్పలు, మెడలో పూలహారాలు ఆయనను కప్పివేయడంచేత నీకు దర్శనమే బాగుగాకాదు. స్వామిని ఉయ్యాలలో ఊపుతారు. ఆ ఉయ్యాల లకు పచ్చని తోరణాలుకట్టి వాటిమీద పన్నీరు చల్లుతారు.

దేవాలయం వెలుపల నీకు కనుపించే దృశ్యం ఏ మంత మంచిది కాదు. హోళీ పండుగకు ముందు పదిహేనురోజులనుంచీ అక్కడ బూతుభాష తప్ప మరొకటి చెవినిపడదు. చిన్న గ్రామాలలో స్త్రీలు బయటకొస్తే వారిమీద మట్టినీళ్లు చల్లేస్తుంటారు. వాళ్లను "బూతుమాట లాడతారు. ఏ విధమైన పిన్నా పెద్దా తారతమ్యాలు లేకుండా మగవారిని కూడా ఆలాగే చేస్తుంటారు. జనం చిన్నచిన్న ముఠాలుగా చేర్తారు. బూతులు తిట్టుకోవడంలోనూ, అసభ్యమైన పాటలు పాడడంలోనూ ఒక రితోనొకరు పోటీపడతారు. ఒక్క స్త్రీలు మినహా, పిన్నలూ పెద్దలూ కూడా వికారమును కల్గించే ఈ పందెములలో పాల్గొంటారు.

ఈ పర్వకాలంలో ఇట్టిఅసభ్యభాష నుపయోగించడం తప్పని కూడా వారు సంకోచపడరు. ప్రజలింకా మూర్ఖపుస్థితిలోనున్న కొన్ని చోట్ల, ఒకరిమీద ఒకరు నానాపదార్థాలు విసురుకుంటారు. గుడ్డలమీద అసభ్యపు వ్రాతలన్నీ వ్రాస్తారు. తెల్లనిదుస్తులుధరించి వీధిలోకెడితే ఒళ్ళంతా బురదకొట్టుకొని రావలసిందే. హోళీపండుగ రోజున ఈ విలాసం చరమస్థితి కొస్తుంది. నీవింట్లో కూచున్నా, బయటకొచ్చినా అసభ్యపు మాటలతో నీ చెవులు గింగురుమంటూనే ఉంటాయి. ఏ స్నేహితుడినైనా చూడడానికెడితే ఆయాసందర్భాలనుబట్టి దుర్గంధ జలంతోనో, సుగంధ జలంతోనో నిన్ను ముంచెత్తెయ్యడం తథ్యం.

సాయంత్రం దుంగలతోనో, పిడకలతోనో పెద్దమంట చేస్తారు. ఈ దాలి తరచు ఇరువై అడుగుల ఎత్తువరకూ కూడా పేరుస్తారు. కర్ర దుంగలు బాగాలావుపాటి వవడంచేత సాధారణంగా 7, 8 రోజులవరకూ కూడా మంట చల్లారదు. మరుచటి రోజున ఆ మంటలదగ్గర నీళ్లుకాగ బెట్టుకొని వాటితో అభ్యంగనస్నానం చేస్తారు.

ఇంతవరకు హోళీ పండుగ నెట్లా దుర్వినియోగం చేస్తారో వివరించాను. విద్యావ్యాప్తివల్లను, నాగరికతా వ్యాప్తివల్లను, ఇలాంటి దృశ్యాలు; కొంచెం నెమ్మదిగానైనా, నిశ్చయంగా అంతర్థానమవుతున్నా యని మాత్రం చెప్పగలుగుతున్నందుకు చాలా సంతోషం. కాని ధనికులైనవారూ, సంస్కారం కలిగినవారూ ఈ పండుగలను చాలా సభ్యతతో జరుపుకుంటున్నారు. బురదనీళ్లకు బదులు రంగునీళ్లూ, సువాసనద్రవ్యాలు కలిపిన నీళ్లూ వాడుతున్నారు. సాధారణంగా కాషాయి రంగునీళ్లు ఎక్కువగా వాడతారు. కాషాయివర్ణంగల ఎండిపోయిన 'కేశుదా' పువ్వులను నీళ్లల్లో మరగబెట్టి ఈ కషాయాన్ని తయారుచేస్తారు. స్తోమతుగలవారు పన్నీటినికూడా ఉపయోగిస్తారు. బంధుమిత్రులు ఒకరినొకరు కలుసుకొని విందులారగిస్తూ వసంతకాలాన్ని ఆనందంగా వెళ్లబుచ్చుతారు.

చాలా విషయాల్లో దీపావళి పండుగ కెలవలకూ ఈ హోళీ పండుగ కెలవలకూ భేదం ఎక్కువగా ప్రస్ఫుటమవుతుంది. దీపావళి పర్వములు వర్షా కాలం ఆఖరుకావడంతోనే ప్రారంభమవుతవి. ఉపవాసాలకాలమైన వెంటనే రావడంచేత దీపావళి పండుగల్లో విందుభోజనాలు ఎక్కువ అహ్లాదకరంగా ఉంటవి. హోళీ పండుగ శీతకాలం వెళ్లేక వస్తుంది. శీతకాలం

బాగా పుష్టియైన ఆహారం తినేసమయం. హోళీ రావడంతోనే ఆ పదార్థాల ఆరగింపు మానేస్తారు. దీపావళి పండుగల్లో పవిత్రమైన పాటలను విన్నాక హోళీ పండుగల్లో అసభ్యమైన మాటలు వింటాం. దీపావళి పండుగలకు శీతకాలపు దుస్తులను ధరించడం ప్రారంభిస్తారు. హోళీ పండుగలకు వాటిని తీసిపారేస్తారు. దీపావళి పండుగ ఆశ్వియుజ బహుళ అమావాస్యనాడు. చీకటిరాత్రి కనుక ఎక్కువగా దీపాలంకరణం జరుగుతుంది. హోళీ, పౌర్ణమి నాడు వస్తుందికనుక దీపాలంకరణం ప్రసక్తే ఉండదు.

[ *'ది వెజిటేరియన్'* 25-4-1891.]



# 9. భారతదేశపు ఆహారము

['వెజిటేరియన్' పత్రికలో 1891 సంవత్సరం, మేనెల 6వ తేదీని ఇలా ప్రచురింపబడినది :

*"మే 2వ తేది, శనివారం, బ్లూమ్స్‌బరీహాల్ హార్ట్‌స్ట్రీట్, బ్లూమ్స్‌బరీ...... ...మిసెస్ హారిసన్ అనంతరం మో. క. గాంధీ (బొంబాయి ప్రెసిడెన్సీ బ్రాహ్మణుడు) మాట్లాడేడు. తనకుముందు మాట్లాడిన ఆమెను అభినందించి ఎన్నో క్షమార్పణలు చేసు కుంటూ 'భారతదేశపు ఆహారము' అనేవ్యాసాన్ని చదువడం ప్రారంభించాడు". ఆదిలో కొంచెం బెదురుతూ వచ్చాడు." ఈ క్రింద ప్రచురింపబడిన పాఠం, పోర్ట్స్‌మత్ వెజి టేరియన్ సొసైటీవారి ముందు రెండోసారి చదువబడింది. 1891 సంవత్సరం జూన్ 1వ తేదీని 'వెజిటేరియన్ మెస్సెంజర్' పత్రికలో ప్రచురింపబడింది.]*

నేను అసలు ఉపన్యాసవిషయానికి వచ్చేముందు ఈ పనికి పూనుకునేందుకు నాకుగల అర్హతలేమిటో చెప్పదలచుకున్నాను. హిందూ దేశచరిత్రను వ్రాసిన మిల్, బహుచక్కగా వ్రాసిన ఉపోద్ఘాతంలో, తాను ఎన్నడూ ఇండియాకెళ్లక పోయినా, భారతీయ భాషలేమీ తనకు రాకపోయినా, తానెందుకు ఆ దేశచరిత్రను వ్రాయడానికి అర్హుడైనాడో వ్రాసుకున్నాడు. ఆయన పద్ధతి ననుసరించినందుకు నేనుకూడా ఆ పనే చేస్తున్నాను. ఏ పనికైనా తనకుండే అర్హతలను గురించి ఒక ఉపన్యాసకుడు గాని, రచయితగాని ప్రస్తావించడం ప్రారంభించాడంటే, ఒక విధంగా తన అనర్హతలను అంగీకరించడమే. 'భారతదేశపు ఆహారము'ను గురించి మాట్లాడడానికి నాకర్హతలేదని నేనంగీకరిస్తాను. నేనే ఈ పనిచేయ డానికి సర్వవిధాలా అర్హుడననే భావంతో నేనిందుకు పూనుకొనలేదు. నాకూ మీకూ కూడా అత్యంత ఆప్యాయమైన ఈ ఉద్యమానికి కొంత సేవ చేయగలుగుతున్నాననే భావంతోనే ఇందుకుపక్రమించాను. నాకు బొంబాయి ప్రెసిడెన్సీతోగల అనుభవాలననుసరించే ఈ విషయాలు చెపు తున్నాను. భారతదేశము 285 మిలియనుల జనాభా (28.5 కోట్లు) గల బహువిస్తీర్ణమైన దేశమని మీరెరుగుదురు. రష్యామినహా యూరోపు ఖండ మెంత ఉన్నదో భారతదేశమంత ఉన్నది. అందుచేత విధిగా ప్రజల ఆచారవ్యవహారాలలో అనేక భేదములున్నవి. ముందు ముందు నేను

చెప్పినదానికి భిన్నంగా మీరేమైనా విన్నట్లైతే, పైవిషయాన్ని జ్ఞప్తికి తెచ్చుకోవలసినదని కోరుతున్నాను. కాని సాధారణంగా నే చెప్పేవిషయాలు దేశానికంతకూ వర్తిస్తాయి.

నేను చెప్పేసంగతులను మూడుభాగాలుగా విభజిస్తాను. ఆదిలో ఉపోద్ఘాతంక్రింద, ఈ ఆహారములను తినే మనుష్యులను గురించి ప్రస్తావిస్తాను. ఆ పిమ్మట ఆహారములను వివరిస్తాను. ఆ తర్వాత వాటి ఉపయోగము వగైరా చెప్తాను.

సాధారణంగా హిందూదేశంలో ఉండేవారంతా శాకాహారులే వని చాలామంది అనుకుంటారు. కాని ఇది నిజంకాదు. వాస్తవానికి హిందువులంతాకూడా శాకాహారులుకారు. కాని భారతదేశంలో అధిక సంఖ్యాకులు శాకాహారులనడం వాస్తవం. కొందరు మతవిశ్వాసంవల్ల శాకాహారులు. మిగిలినవారు మాంసాన్ని కొనుక్కోలేక కూరగాయలను తింటున్నారు. భారతదేశంలో రోజుకొకడబ్బుతో—అనగా పెన్నీలో మూడోవంతుతో—జీవనం గడిపేవారు, కొన్ని లక్షలమంది ఉన్నారంటే, మీకు నే చెప్పేసంగతి అర్థమవుతుంది. ఇండియావంటి బీదదేశంలోకూడా ఆ సొమ్ముకు తినదగిన మాంసం దొరుకదు. ఈ పేదప్రజలు రోజుకొక సారే భోజనం చేస్తారు. అందులో వారు తినేది చద్దిరొట్టె, ఉప్పు మాత్రమే ఉంటుంది. ఆ ఉప్పుమీద పన్ను చాలా హెచ్చు. కాని భారతీయ శాకాహారులకు మాంసాహారులకూ, ఇంగ్లీషు శాఖాహారులకు మాంసాహారులకూ చాలాతేడా ఉన్నది. ఇంగ్లీషు మాంసాహారులులాగ, భారత మాంసాహారులు మాంసంతినకపోతే చచ్చిపోతామనుకోరు. నాకు తెలిసినంతవరకు, భారతదేశంలోని మాంసాహారులు దాని నత్యంత అవసరమైన దానిగా భావించరు. కేవలం భోగవస్తువుగానే భావిస్తారు. రొట్టెదొరికితే (బ్రెడ్‌ను అక్కడ రొట్టె అంటారు) మాంసం లేకపోయినా కాలక్షేపం చేసేస్తారు. ఇంగ్లీషు మాంసాహారి సంగతి చూడండి. మాంసం ఉండితీరాలంటాడు. అతనికి మాంసం తినడానికి రొట్టె సహాయపడుతుంది. కాని భారత మాంసాహారికి రొట్టెతినడానికి మాంసం ఉపయోగపడుతుంది.

ఆహారతత్త్వం గురించి ఈ మధ్యనే నేనొక ఆంగ్లేయ స్త్రీతో మాట్లాడడం తటస్థించింది. ఆమెకూడా శాకాహారిగా ఏ విధంగా మారవచ్చునో నేను వివరంగాచెపుతుంటే ఆమె ఆశ్చర్యపడి ఇలా అన్నది: 'మీరేమి

చెపితే చెప్పండి. నాకు మాంసం ఉండితీరాలి. నాకది చాలా ఇష్టం. అది లేకుండా నేను బ్రతుకలేననుట తథ్యం'. 'మిమ్ములను కేవలం శాకాహారం మీదనే జీవించమని బలవంతం చేస్తే ఏమి చేస్తారు' అని నేనడిగేను. "ఓ! అలా మాట్లాడకండి. నన్నెవ్వరూ అలా బలవంతపెట్టలేరు. అలా బలవంతం చేస్తే నేను చాలా బాధపడిపోతాను" అన్నది ఆమె. అలా అన్నందు కెవ్వరూ ఆమెను అధిక్షేపించలేరు. ప్రస్తుతం సంఘమే ఆ స్థితిలో నున్నది. ఏ మాంసాహారికైనా దానిని చాలా ప్రయాసమీదతప్ప వదలడం సాధ్యంకాదు.

అదే విధంగా భారతీయ శాఖాహారికీ, ఇంగ్లీషుశాఖాహారికీ చాలా తేడా ఉన్నది. భారతీయశాఖాహారి, ప్రాణహింసతో కూడిన ఏ పదార్థాన్నీ ముట్టుకోడు. ముందు ప్రాణంవచ్చే దానిని కూడా తినడు. కనుకనే గ్రుడ్లనుకూడా అతడు భుజించడు. గ్రుడ్డునుతింటే ముందు కాబోయే ప్రాణాన్ని తీస్తున్నానని అతని అభిప్రాయం. (నేను నెలాపదిహేను రోజులనుంచి గ్రుడ్లను తింటున్నందుకు విచారిస్తున్నాను.) కాని పాలను, వెన్నను తినడానికి మాత్రం అతడు సంకోచించడు. ప్రతి పక్షమూ ఫలహారపురోజునకూడా (ఏకాదశినాడు) అతడు ఈ జంతు సంబంధమైన వస్తువులను స్వీకరిస్తాడు. ఆ రోజున గోధుమలు, బియ్యం నిషేధం. కాని కావలసినన్ని పాలను, వెన్నను తినవచ్చును. ఇక్కడి శాకాహారులు కొందరు వెన్ననూ పాలనూకూడా ముట్టరు. కొందరు వంటలేకుండానే చేసుకున్నారు. కొందరు పండ్లు, పప్పుగింజలమీదనే జీవిస్తుంటారు.

ఇక మా ఆహారపదార్థములను విశదీకరిస్తాను. నేనసలు మాంసాహారమును గురించి చెప్పనేచెప్పను. ఏమంటే అవి ఉపయోగింపబడినా, అవే ప్రధానాహారముకాదు. ఇండియా ప్రధానంగా వ్యవసాయదేశం. అందులోనూ చాలావిశాలమైనది. కనుక ఇక్కడ ఉత్పత్తి ఆయే ఆహారాలు అనేకరకాలు. అసంఖ్యాకములు. క్రీ. శ. 1746 నుండి భారతదేశంలో బ్రిటిష్‌రాజ్యం పునాదులు పడినా, 1746 సం. రం. కు పూర్వంకూడా ఇంగ్లీషువారికి భారతదేశం సంగతి తెలిసినా, ఇంగ్లండులో భారతదేశపు ఆహారపదార్థాలగురించి ఇంత బొత్తుగా తెలియకపోవడం, విచారకరమైన విషయం. అయితే అందుకు కారణమేమంత నిగూఢంకాదు. ఇండియాకు

వెళ్ళిన ఇంగ్లీషువారంతా తమ పద్ధతినే జీవిస్తుంటారు. ఇంగ్లండులో దొరికే పదార్థాలను అక్కడి మాదిరిగానే వండించుకుంటారు. ఈ సంగతులన్నిటికీ కారణాలను తెలుసుకోవడం నా పనికాదు. కేవలం సరదానిమిత్తమైనా భారతప్రజల ఆచారవ్యవహారములను వారు తెలుసుకోవడానికి ప్రయత్నిస్తారనుకోవడం సహజం. కాని వారలాంటి దేమీ చేయలేదు. కనుకనే భారతీయ ఆహారమునుగురించి తెలుసుకునే సావకాశం ఆంగ్లో—హైందవులకు తప్పిపోయింది. ఆహార పదార్థాలసంగతి కొద్దాం. ఇక్కడ ప్రజలకు తెలియనన్ని ధాన్యాలరకాలు భారతదేశంలో పండుతున్నాయి.

ఇక్కడివలెనే అక్కడకూడా గోధుమ ప్రధానమైనధాన్యం. ఆ తర్వాత గంటెలు (ఆంగ్లో ఇండియనులు దానిని మిలెట్ అంటారు), జొన్న, బియ్యం, వగైరాలొస్తాయి. ఇవన్నీ రొట్టె ధాన్యాలు. అనగా వీటినే రొట్టెలు చేయడానికి ముఖ్యంగా ఉపయోగించుకుంటారు. సాధారణంగా గోధుమ నెక్కువగా ఉపయోగిస్తారు. కాని అది మిగతా వాటికన్న ఖరీదెక్కువవడంచేత దానిస్థానే పేదప్రజలుగంటెలను,జొన్నను వినియోగిస్తారు. దక్షిణ రాష్ట్రాల్లోనూ, ఉత్తర రాష్ట్రాల్లోనూకూడా ఇదే ఆచారం. సర్ డబ్ల్యు. డబ్ల్యు. హంటర్ తన భారతదేశ చరిత్రలో దక్షిణాది రాష్ట్రాలనుగురించి ఈ విధంగా వ్రాశాడు. 'సామాన్యజనములు జొన్న, గంటి, చోళ్లు మొదలైన చిన్న ధాన్యాలను తింటారు.' ఉత్తర ప్రాంతాన్నిగురించి 'ఆఖరు రెండుధాన్యాలు అనగా, జొన్న, గంటి పేదప్రజల ఆహారము. వరి, నీటిసాగుప్రాంతాల్లోనే పైరు చేయబడు తుంది. ధనికులు మాత్రమే దానిని తింటారు' అని వ్రాశాడు. జొన్నను రుచిచూడనివాళ్లుకూడా చాలామంది ఉన్నారు. జొన్న పేద వాళ్ళ ఆహారమవడంచేత, అది చాలా గౌరవంగా చూడబడుతుంది. పేదవాళ్ళు శెలవు తీసుకొని వెళ్లిపోయేటప్పుడు 'జోహార్' అంటారు. దానికి సరిగా అర్థంచెపితే 'నీకు జొన్నకు లోపంలేకుండా ఉండుగాక' అని భావమనుకుంటాను. (గాంధీజీ ఇక్కడ జవార్ కూ జోహారుకు తడబడినట్లు కనుబడుతుంది.) బియ్యంకూడా రొట్టెచేయడానికి ఉప యోగపడుతుంది. ముఖ్యంగా బెంగాలులో బెంగాలీలు, గోధుమకన్న బియ్యాన్నే ఎక్కువగా వాడుకచేస్తారు. ఇతర ప్రాంతాల్లో బియ్యాన్ని రొట్టెచేయడానికి వాడరు. వాడినా బహు అరుదు. శనగలు రొట్టెకు

ఉపయోగిస్తారు. గోధుమతో కలిపి కొందరూ, కలుపకుండా కొందరూ ఉపయోగం చేస్తారు. ఆకారంలోను, రుచిలోను శనగలు, బఠానీలను పోలి ఉంటాయి. తరువాత పప్పు లేక పులుసుచేసే పప్పుధాన్యాల సంగతికొద్దాం శనగలు, బఠాణీలు, కందులు, బొబ్బర్లు, మినుములు, పెసలు వగైరా పప్పులతో పప్పుకట్లు తయారుచేస్తారు. వీటన్నిటిలోనూ కందిపప్పు జనామోదం విషయంలో, అగ్రస్థానాన్ని వహిస్తుందనుకుంటాను. ఈ పదార్థాలు రెండూ ఎండిన తర్వాత ఉపయోగిస్తారు. ఇక పచ్చి కూరగాయల సంగతికొద్దాం. కూరగాయలపేర్లన్నీ చెప్పడం అనవసరం. అవి అసంఖ్యాకంగా ఉన్నాయి. కొన్ని నాకూ తెలియదు. భారతదేశంలో భూమి చాలా సారవంతమైనది. ఏ రకం కూరగాయలు పైరుచేయాలన్నా చేయవచ్చును. వ్యవసాయశాస్త్రజ్ఞానముంటే భారత భూమిలో ప్రపంచంలో ఉండే ఏ కూరనైనా, కాయనైనా పండించవచ్చును.

ఇక మిగిలినవి పండ్లూ, పప్పులు. (వేరుశనగ, బాదం, పిస్తా వగైరా) భారత దేశంలో పండ్లయొక్క విలువ బాగా గుర్తింపబడలేదని చెప్పవలసినందుకు నేను చాలా విచారిస్తున్నాను. వాటిని పుష్కలంగా వాడుతారు కాని వాటిని విలాసంకొరకే భుజిస్తారు. జిహ్వాకు రుచిగా ఉంటాయనే తింటారు. కాని ఆరోగ్యంకోసం కాదు. కనుక నారింజలు, పీమరేగుపండ్లు మొదలైన విలువైన పండ్లు పుష్కలంగా మాకు లభించవు. అవి ధనికులకుమాత్రమే లభ్యమవుతాయి. కాని ఏ ఋతువులో ఆ ఋతువుకు సంబంధించిన దేశవాళీఫలాలు, ఎండపెట్టిన పళ్ళూ, కావలసినన్ని దొరుకుతాయి. అన్నిచోట్లవలెనే ఇండియాలోకూడా వేసవి, పండ్లకు మంచికాలం. ఈ కాలపు పండ్లలో ముఖ్యాతిముఖ్యమైనది మామిడిపండు. అంతకన్న రుచికరమైన పండును నే నింతవరకు రుచి చూడలేదు. కొందరు అనాసపండుకు అగ్రస్థానమిస్తారు. మామిడి పండును రుచిచూచినవారిలో అత్యధిక సంఖ్యాకులు తమ వోటును మామిడిపండుకే ఇస్తారు. అది వేసవికాలంలో మూడు మాసాలు మాత్రమే ఉంటుంది. అప్పుడది చౌకగా లభిస్తుంది. కనుక ధనికులూ పేదలూ కూడా వాటిని బాగాతింటారు. వాటికాలంలో కొందరు మామిడి పళ్ళను తినే జీవిస్తుంటారనికూడా నేను విన్నాను. కాని దురదృష్టవశాత్తూ, మామిడిపండు చాలాకాలం నిలవ ఉండదు. రుచికది 'పీచ్' లా ఉంటుంది. లోపల టెంక ఉంటుంది. సామాన్యంగా అది చిన్న

పుచ్చకాయంత ఉంటుంది. ఇక పుచ్చకాయ సంగతి చెప్తాను. వేసంకాలంలో అవి పుష్కలంగా ఉంటాయి. ఇక్కడ దొరికే వాటికన్న మా పుచ్చకాయలు చాలా బాగా ఉంటాయి. ఇక అంతగా పండ్ల పేర్లుచెప్పి మిమ్మల్ని విసిగించదలచుకోలేదు. ఇండియాలో అన్ని కాలాల్లోనూ ఆ కాలానికి తగినట్లు కొన్ని రకాల పండ్లు తయారవుతాయనీ, కాని అవి నిలవ ఉండవనీ చెపితే చాలును. ఆ కాలాల్లో ఈ పండ్లు బీదలకుకూడా అందుబాటులో ఉంటాయి. కాని వాళ్ళు దానిని భోజనంగా తినరు. సాధారణంగా పండ్లవలన జ్వరం, అతిసారం మొదలైన జబ్బులు చేస్తాయని మా నమ్మకం. వేసవిలో కలరా భయమున్నప్పుడు అధికారులు పుచ్చకాయలు వగైరా పండ్లను తినకుండా నిషేధిస్తారు. చాలా సందర్భాల్లో అది న్యాయం కూడాను. ఎండు ఫలాల విషయంలో, ఇక్కడ లభ్యమయ్యే అన్నిరకాల పండ్లూ అక్కడా దొరుకుతాయి. పప్పులు (నట్సు) విషయంలో మీకు ఇక్కడ దొరుకనివి మాకు చాలా దొరుకుతాయి. అయితే ఇక్కడ దొరికేవి కొన్ని మాకు దొరుకవు. కాని వీటిని ఇండియాలో ఆహారంగా ఉపయోగించరు. కనుక సరిగా చెప్పాలంటే వాటిని 'భారతదేశంలోని ఆహారదినుసులు' లో భాగంగా చెప్పడానికి వీలులేదు. ఆఖరు విషయాన్ని గురించి చెప్పడానికిముందు, ఆహారదినుసులను నేను నాల్గు భాగాలుగా విభజించిన విషయాన్ని జ్ఞాపకముంచుకోవలెనని కోరుతున్నాను. మొదటిది రొట్టెచేసుకునేందుకు కాయధాన్యాలు, గోధుమ, జొన్న వగైరాలు. రెండవది పప్పుధాన్యాలు—అనగా పులుసూ, పప్పు వండుకునే పప్పుదినుసులు. మూడు పచ్చికూరగాయలు. నాల్గు పండ్లు. అయిదు నట్సు అనగా వేరుశనగ, బాదం వగైరా.

వివిధములైన ఈ ఆహారదినుసులనన్నిటినీ వండుకునే పద్ధతులను నేను మీకు చెప్పబోవడం లేదు. అది నాశక్తి కతీతమైన విషయం. సాధారణంగా వాటినెల్లా ఉపయోగిస్తారో మాత్రం చెప్తాను. ఆహార వస్తువులతో రోగనివారణచేయడం, రోగాలు రాకుండా ఆపుచేయడం ఇంగ్లండులో ఇటీవలనే కనిపెట్టబడ్డాయి. అనాదినుండీ ఇండియాలో ఈ విజ్ఞానం అమలులోనే ఉంది. ఆయుర్వేద వైద్యులు మందులు వాడుతారు. కాని మందుల అనుపానాలమీదా, పథ్యంమీదా వారెక్కువ లక్ష్యముంచుతారు. కొన్ని సందర్భాల్లో ఉప్పు తినద్దంటారు. మరికొన్ని సందర్భాల్లో పులుపును నిషేధిస్తారు. అలాగే అన్ని ఆహారదినుసులకూ

ఏదో ఒక వైద్యపు విలువ ఉంటుంది. రొట్టె చేసుకొనే కాయధాన్యం మా ఆహారంలో ప్రధానమైనది. మీకు తెలియడంకోసం పిండితో చేసిన వంటకాన్ని 'బ్రెడ్' అంటున్నాను. నిజానికి దానిని 'కేక్' అనాలి. ఈ రొట్టెను చేసే విధానమంతా నేను వివరించదలచుకోలేదు. కాని పైపొట్టును పారేయరని మాత్రమే చెపుతాను. ఈ రొట్టెలెప్పుడూ తాజాగా తయారవుతాయి. వేడి వేడిగా నెయ్యి రాసుకుని తింటారు. ఇంగ్లీషువారికి మాంసమెటువంటిదో భారతీయులకు రొట్టెలటువంటివి. ఒకమనిషి ఎంత ఆహారం తీసుకుంటాడనే కొలత సాధారణంగా ఆతడు తినే రొట్టెలనుబట్టి లెక్కచేస్తారు. పప్పులు, కాయకూరలు, లెక్కకురావు. పప్పులేకుండా, కూరలులేకుండా భోజనం చేయవచ్చును. కాని రొట్టెలు లేనిదే భోజన మనిపించుకోదు. రకరకాల ధాన్యాల పిండితో రకరకాల భక్ష్యాలను తయారుచేస్తారు. కాని నిజానికి అవి రొట్టెల యొక్క రూపాంతరాలే.

పులుసూకట్లూ వగైరా తయారుచేయడానికి బఠాణీలను కాని, కందిపప్పు వగైరా బేడలనుకాని నీళ్లల్లో ఉడకబెడతారు. ఆపైన దాని కనేకరకాల మసాలాదినుసులు చేర్చడంతోనే అది చాలా రుచ్యమైన భోజ్యమవుతుంది. ఈ పదార్థాన్ని తయారుచేయడంలో వంటచాకచక్యం చాలా కనుపర్చవచ్చును. బఠాణీలను ఉప్పు, మిరియాలు, పసుపు, లవంగాలు, దాల్చినచక్క వగైరా మసాలాలతో కలపడం నేనెరుగుదును. రొట్టెలు తినడానికి సాధనంగానే పప్పు ఉపయోగిస్తుంది. పప్పులు చాలాతినడం శరీరాని కంత మంచిది కాదంటారు. ఈ సందర్భంలోనే బియ్యాన్నిగురించి ఒకమాట చెప్పాలి. బెంగాలులో రొట్టెలుచేయడానికి బియ్యం ఉపయోగిస్తారని ఈ వరకే చెప్పేను. బెంగాలీలు తరుచుగా బాధపడుతుండే అతిమూత్రవ్యాధి కిదే కారణమని కొందరు వైద్యులు కనిపెట్టేరు. వరిబియ్యం పుష్టికరమైనదని ఇండియాలో ఎవ్వరూ అనరు. అది ధనికుల ఆహారం. అనగా కష్టించి పనిచేయనివారి ఆహారమన్న మాట. శ్రమజీవులు ఎప్పుడోకాని వరిబియ్యం వాడుకచేయరు. వైద్యులు జబ్బుగా ఉన్నవారికి వరిఅన్నం పెట్టిస్తారు. నేను జ్వరంతో ఒకసారి బాధపడ్డాను. (డాక్టర్ అలిసన్ చెప్పినట్లు ఆరోగ్య విధుల నతిక్రమించడంవల్లనే.) అప్పుడు నాకు అన్నమూ (**Mug water**) పెసర పప్పు నీళ్లూ పథ్యంగా పెట్టేరు. నాజ్వరం అద్భుతంగా తగ్గిపోయింది.

ఇక పచ్చికూరలు, కాయలు సంగతికొద్దాం. వీటినికూడా పప్పులు లాగే తయారుచేస్తారు. కూరగాయల వంటకంలో నూనె, వెన్న చాలా ప్రధానంగా కావలసి ఉంటాయి. తరుచుగా శనగపిండికూడా అందులో కలుపుతారు. కేవలం ఉడకబెట్టిన కూరగాయలను తినరు. ఇండియాలో నేను ఉడకబెట్టిన బంగాళాదుంపను చూడలేదు. తరుచు అనేక రకాలైన కూరగాయలనుకలిపి వండుతారు. పసందుగా కూరగాయలను వండడంలో ఇండియా, ఫ్రాన్సును అవలీలగా మించుతుంది. వాటికికూడా అసలైన ఉపయోగం పప్పులు మాదిరే. భోజనావసరాల్లో అవి పప్పులు తర్వాతనే. కూరగాయలు, కొంచెమెచ్చుతగ్గుగా భోగవస్తువుల క్రిందనే లెక్క. అవి జబ్బులకు కారణమనిగూడా సాధారణంగా ఒక నమ్మకం. పేదవాళ్లు వారానికొకసారో రెండుసార్లో మాత్రమే ఒక కాయకూరల వంటకాన్ని తింటారు. కొన్ని కూరగాయలు వైద్యవిషయంగా చాలా విలువైనవి. 'తాండల్జా' కొయ్యతోటకూరఅనే ఒకకూర ఉన్నది. రుచికది 'స్పైనాక్' (బచ్చలి) లా ఉంటుంది. మిరపకాయలకారం ఎక్కువగా ఉపయోగించి నేత్ర దృష్టిని చెడగొట్టుకున్నవారికిది ఔషధంగా వైద్యులు పురమాయిస్తారు.

తర్వాత పండ్లు. వాటిని ముఖ్యంగా ఫలాహారం రోజున ఉపయోగిస్తారు. కాని ఇతరరోజుల్లో వాడడమంటూఉంటే భోజనానంతరం సకృతుగా వాడుతారు. జనం అప్పుడప్పుడు మాత్రమే పళ్లు తింటారు. మామిడిపళ్లకాలంలో మాత్రం మామిడిపళ్ల రసాన్ని బాగా సేవిస్తారు. రొట్టెలతోను, అన్నంతోను దానిని ఆరగిస్తారు. పండినపళ్లను మేమెప్పుడూ ఉడకపెట్టం. పుల్లగా ఉండేపచ్చి మామిడికాయలను ఊరుగాయగా నిల్వచేస్తాం. వైద్య దృష్ట్యా చూస్తే, తాజాపండ్లు కొంచెం పుల్లగా ఉండడంచేత వాటిని తింటే జ్వర మొస్తుందని అంటారు. ఎండపెట్టిన పండ్లను పిల్లలు బాగా తింటారు. ఎండు ఖర్జూరపుకాయలను గురించి కొంచెం తెలుసుకోవడం మంచిది. అవి చాలా బలవర్ధకమైనవని అంటారు. కనుక మేము బాగా పుష్టినిచ్చే లేహ్యాదులైన ఆహారాన్ని సేవించే చలికాలంలో వాటిని పాలతోనూ ఇంకా అనేక వస్తువులతోనూ చేర్చి, రోజుకొక ఔన్సుచొప్పున తింటాం.

ఆఖరువి పప్పులు (నట్సు). ఇంగ్లీషువారి ఆహారంలో మిఠాయి వంటివి పప్పులు. పిల్లలు పంచదారపాకంపట్టిన ఈ పప్పులను చాలా తింటూ ఉంటారు. ఫలహారం రోజునకూడా వాటిని విస్తారంగా

ఉపయోగిస్తారు. వాటిని వెన్నలో వేయిస్తాం. పాలల్లో ఉడకబెడతాము. బాదం పలుకులు మెదడుకు చాలా మంచిదనిచెప్తారు. కొబ్బరినుపయోగించే పద్ధతుల్లో ఒకటిమాత్రం చెపుతాను. కొబ్బరిని బాగాతురిమి దానిలో నెయ్యి, పంచదార కలుపుతాం. అది చాలా రుచిగా ఉంటుంది. మీలో కొందరు ఇంటివద్ద ఈ కొబ్బరిఉండలను తయారుచేసి చూస్తారనుకుంటాను. సోదర సోదరీమణులారా! భారతీయ ఆహారపదార్థాలను గురించి ఒక వర్ణన—ఒక అసంపూర్ణమైన వర్ణన—నిచ్చాను. వాటిని గురించి తెలుసుకోవాలనే అభిలాష మీకు కలుగుతుందనీ, అందువల్ల మీకు లాభం కలుగుతుందనీ ఆశిస్తున్నాను. ముగించే ముందు ఇంగ్లాండులోని మాంసాహారపు అలవాట్లకూ, ధాన్యాలను తినే భారతీయాహార అభ్యాసములకూ ఉండే భేదాలు తొలగిపోయే రోజులు రాగలవని ఆశిస్తున్నాను. వాటితోపాటు రెండు దేశాలకూ ఉండవలసిన అన్యోన్యతకూ, సానుభూతికీ కొన్ని తావుల్లో అడ్డొస్తున్న భేదాలుకూడా తొలగిపోతాయని నమ్ముతున్నాను. భవిష్యత్తులో అభ్యాసాల సమన్వయానికే కాకుండా హృదయాల సమైక్యతకు కూడా పాటుపడగలమని ఆశిస్తున్నాను.

[*ది వెజిటేరియన్ మెస్సింజరు*, 1—6—1891]



# 10. లండన్‌లోని జంతు హింసానివారణ సంఘం వారికిచ్చిన ఉపన్యాసం

*అప్పర్ నార్ ఉడ్* లోగడ చేయబడిన ఏర్పాటు ప్రకారం జంతు హింసానివారణ సంఘానికి మేక్ డూగల్ సతి, మిస్ సీకూంబ్ ఆధ్వర్యాన ఉపన్యాసం ఇవ్వవలసియుండెను. కాని ఆమెకు సుస్తీచేయడంవల్ల ఇండియా దేశంనుంచి వచ్చిన హిందువుడు మిస్టర్ గాంధీని ఉపన్యసించమని కోరగా ఆయన అంగీకరించారు. జీవకారుణ్యదృష్టితో గాంధీ పావుగంటకాలం శాకాహారాన్ని గురించి ఉపన్యసించారు. జంతు హింసానివారణ సంఘంవారు తాముచెప్పిన ప్రకారం ఆచరణచేయాలంటే విధిగా శాకాహారులైఉండాలన్నారు. షేక్స్పియర్ నుంచి కొన్నిభాగాలు చదివి ఉపన్యాసం ముగించారు.

[*'ది వెజిటేరియన్'* 6-6-1891.]



## 11. హాల్‌బరన్‌లో వీడ్కోలు విందు

అవడమైతే వీడ్కోలు విందే కాని ఎవరి ముఖంమీదా విచారం కనుబడలేదు. మిస్టర్ గాంధీ ఇండియా వెళ్ళిపోతున్నా, శాకాహారం కోసం ఇంకా ఎక్కువగా ప్రచారం చేయగలిగే చోటికెడుతున్నాడు. అంతే కాకుండా లా చదువు విజయవంతంగా ముగించుకొని వెళ్ళిపోతున్నాడు కావున విచారించడానికి బదులు అభినందించాలి..........

విందు ముగిసిన పిమ్మట మిస్టర్ గాంధీ కొంచెం కొంచెం భిడియపడుతూ చక్కని ఉపన్యాసం ఇచ్చాడు. అతిథులందరికీ స్వాగతం చెపుతూ ఇంగ్లండులో మాంసాహార విసర్జన హెచ్చవుతున్నందుకు సంతోషాన్ని వెలిబుచ్చాడు. లండన్ వెజిటేరియన్ సొసైటీతో తనకు సంబంధం ఏలా కలిగిందో వివరించి, *వెజిటేరియన్* పత్రిక సంపాదకుడైన డాక్టర్ జోసయా ఓల్డు ఫీల్డును గురించి మనసుకరిగేటట్లు మాట్లాడేడు. ఆయన తనకుచేసిన మహోపకారాన్ని ప్రశంసించాడు.

ముందు జరుగబోయే ఫెడరల్ యూనియను కాంగ్రెస్ ఇండియాలో జరుగగలదని ఆశిస్తున్నానని చెప్పేడు.
[*'ది వెజిటేరియన్'* 13-6-1891.]



# 12. గాంధీజీ ఎందుకు ఇంగ్లండు వెళ్ళేడు?

*ఇంగ్లండు వెళ్ళదలచుకున్న హిందువుల యిబ్బందులను ఇంగ్లీషు వారికి తెలియచెప్పడానికి, అలాంటి ఇబ్బందులను ఎలా తొలగించుకోవాలో హిందువులకు చెప్పడానికి 'వెజిటేరియన్' పత్రిక ప్రతినిధి గాంధీజీని ఆ విషయాలమీద ప్రశ్నలువేసి విపులంగా జవాబులివ్వమన్నాడు. ఆ ప్రశ్నోత్తరాలు ఈ క్రింద పొందుపరుపబడినవి.*

## 1

ప్రశ్న:—ఇంగ్లండు రావాలనీ, న్యాయవాదివృత్తిని స్వీకరించాలనీ అభిప్రాయం గాంధిజీకి ఎందుకు కలిగిందన్నది మొదటి ప్రశ్న.

జవాబు:—ఒక్కమాటలో చెప్పాలంటే, కాంక్ష. నేను బొంబాయి విశ్వవిద్యాలయంలో 1887 సంవత్సరంలో మెట్రిక్యులేషన్ ప్యాసయినాను. బొంబాయి విశ్వవిద్యాలయంలో పట్టభద్రుడై తే తప్ప, సంఘంలో ఏ విధమైన ప్రతిష్ఠ ఉండదు కాబట్టి, భవనగరు కాలేజీలో చేరేను. డిగ్రీ లేకుండా ఏదైనా ఉద్యోగం సంపాదించుకోవాలంటే చాలాకష్టం. ఎంతో పెద్ద పలుకుబడిఉంటే కాని సాధ్యంకాదు. అందులోనూ కొంచెంజీతం హెచ్చుగా ఉండి గౌరవప్రదమైన ఉద్యోగం కావాలంటే మరీ అసంభవం. కాని బి. ఎ. డిగ్రీ పొందటానికి అధమం మూడేళ్ళయినా పడుతుంది. అదీకాకుండా నేను తరుచు తలనొప్పితోనూ, ముక్కువెంట రక్తం కారడంతోనూ బాధపడుతుండేవాడిని. ఈ జబ్బుకు ఉష్ణవాతావరణం కారణమనేవారు. తీరాచేస్తే, పట్టభద్రుడైనంత మాత్రాన నాకు పెద్ద ఆదాయం వచ్చేదేమీ కనుబడలేదు. ఈ విషయాలను గురించి నేనదేపనిగా ఆలోచిస్తుండగా, మానాయనగారి పాత స్నేహితులొకరు చూడటానికొచ్చి, ఇంగ్లండుపోయి బారిష్టరు పట్టా తెచ్చుకోమని నాకు సలహా ఇచ్చారు. అదివరకే నామనస్సులో ఉన్న ఈ కోరికను ఆయన బాగారగిల్చేడు. "నేను ఇంగ్లండు వెళ్ళడమే తటస్థిస్తే, నేనెంతో గొప్ప పదవనుకున్న బారిష్టరు

కావడమేకాకుండా, సంస్కృతీకేంద్రము, కవులకు తత్త్వజ్ఞులకు నిలయము, అయిన ఇంగ్లండును చూడగలుగుతాను" అని నాలో నేనే ఆలోచించుకుంటూ ఉండేవాడిని. ఆయనకు మా కుటుంబ పెద్దలలో చాలా పలుకుబడి ఉండేది. కనుక నన్ను ఇంగ్లండు పంపడానికి ఆయన చాలా ప్రోత్సాహపరచి కృతకృత్యుడైనాడు.

నేను ఇంగ్లండు రావడానికుండే కారణాలు టూకీగా చెప్పేను. కాని ఇవి నా ప్రస్తుతాభిప్రాయాలు మాత్రం కావు.

ప్రశ్న:—అయితే, మీరు ఎన్నో ఆశలు పెట్టుకున్నందుకు మీ స్నేహితులంతా సంతోషించారే ?

జవాబు:—అంతా కాదు. స్నేహితుల్లోనూ రకరకాలున్నారు. నా సమ వయస్కులైన కొందరు స్నేహితులు నేను ఇంగ్లండు వెళు తున్నందుకు చాలా సంతోషించారు. కొందరు స్నేహితులు, సరిగా చెప్పాలంటే శ్రేయోభిలాషులూ, పెద్ద వయస్సువారూ, నేను ఇంగ్లండు వెళ్ళి పాడైపోతాననీ, కుటుంబానికి అగౌరవం తెస్తాననీ మనసారావిశ్వసించారు. తదితరులు కొందరు కేవలం అసూయవల్ల ప్రతికూలభావం దాల్చేరు. బాగా పుష్కలంగా డబ్బు సంపాదిస్తున్న బారిష్టర్లను వాళ్ళు చూచారు. నేను కూడా అంతవాడినైపోతానేమోనని వారి భీతి. మరికొందరు నేను చాలా చిన్నవాడిననీ (ఇప్పుడు నా వయస్సు 22) ఆ శీతోష్ణస్థితికి తట్టుకోలేననీ అనుకున్నారు. క్లుప్తంగా చెప్పాలంటే, నేను లండను వెళ్ళడానికి అనుకూలంగానూ, ప్రతికూలంగానూకూడా ఏ ఇద్దరూ ఒకేకారణాన్ని చెప్పలేదు.

ప్రశ్న:—మీ అభిప్రాయాన్ని కొనసాగించుకోవడానికి మీరలా ప్రారంభిం చారు ? దయచేసి మీ కష్టాలేమిటో, వాటిని మీరెల్లా ఎదుర్కొ న్నారో శలవియ్యండి.

జవాబు:—నే నెదుర్కోవలసిన కష్టాలన్నీ చెప్పడానికి ప్రయత్నిస్తే, మీ పేపరులో ఉండే చోటంతా సరిపోతుంది. ఇది విషాదభూయిష్ట మైన కష్టగాథ. నా కష్టాలు రావణాసురుని తలకాయలతో పోల్చవచ్చును. (రావణాసురుడు, హిందూపురాణంలో రెండవ

్దైన రామాయణంలో రామునితో పోరాడి ఓడిన రాక్షసుడు) అతని కనేక తలలు. ఒక దానిని నరుకడంతోనే ఆ స్థానే మరొకటి పుట్టుకొచ్చేది. నా కష్టాలు ముఖ్యంగా నాల్గువిధాలు. అవే మంటే డబ్బు, పెద్దల అంగీకారము, బంధువులతో ఎడబాటు, కులసంబంధమైన నిషేధాలు.

మొదటిది డబ్బుసంగతి. మా నాయనగారు అనేక స్వతంత్రరాజ్యాలకు ప్రధానమంత్రిగా ఉండినా, ఆయనెన్నడూ డబ్బును నిలవచేయలేదు. ఆయన సంపాదించినదంతా దాన ధర్మాలకు, పిల్లల చదువుసంధ్యలకు, పెళ్ళిళ్ళకూ ఖర్చు పెట్టేశాడు. రొఖ్ఖమేమీ నిలవచేయలేదు. డబ్బు నిలవచేసి పిల్లల కెందుకివ్వ లేదని మేమడిగితే, తన సంతానమే తన ధనమనీ డబ్బు సంపా దించి వాళ్ళకిస్తే వాళ్ళను పాడుచేసిన వాడినవుతాననీ చెప్పేవారు. కనుక డబ్బు విషయమేమీ తక్కువైన కష్టంకాదు. కొన్ని రాజ్యాలవారి (స్కాలర్ షిప్పులు) విద్యావేతనాలకోసం ప్రయత్నిం చాను కాని లాభం లేకపోయింది. పట్టభద్రుడనై నా ప్రతిభను కనుపరచి పిమ్మట అలాంటి ఆశపెట్టుకోమని ఒకరు చెప్పేరు. ఆ చెప్పినాయనమాట నిజమేనని అనుభవంవల్లనే తెలిసింది. కాని ఏ విధమైన నిస్పృహ చెందకుండా, ఉన్న డబ్బంతటిని, నా ఇంగ్లండు చదువుమీద పెట్టమని మా పెద్దన్నగారిని కోరేను.

ఈ సందర్భంలో భారతదేశంలోని కుటుంబ పద్ధతిని గురించి కొంచెం చెప్పక తప్పదు. ఇంగ్లండులోమాదిరి కాకుండా ఆ దేశంలో మగపిల్లలు ఎల్లకాలమున్నూ, ఆడపిల్లలు పెళ్లి అయ్యే వరకున్నూ, తలిదండ్రులతో కలసే ఉంటారు. వారేమి సంపాదిం చినా తండ్రికే చేరుతుంది. వారేమి నష్టపోయినా తండ్రికే నష్టం. అయితే కొన్ని అసాధారణ పరిస్థితులలో, అనగా పెద్ద దెబ్బలాట సంభవించినప్పుడు మగపిల్లలు వేరు కాపురాలు పెట్టుకోకుండా పోరు. కాని ఇవి చాలా అరుదు. ధర్మశాస్త్రభాషలో మేన్ ఇలా వ్రాశాడు. "పశ్చిమదేశాలలో సాధారణ పద్ధతివ్యక్తికే ఆస్థి. ప్రాక్దేశాలలో ఆచారం కుటుంబానికి ఆస్థి." కనుక, నాకు స్వంత ఆస్థి అనేదేమీలేదు. అంతా మా అన్నగారి యాజమాన్యం క్రిందనే ఉండినది. మేమంతా కలిసే ఉండేవాళ్లం.

మరల డబ్బుసంగతికొద్దాం. మా నాయనగారిచ్చిన దేమైనా ఉంటే అది మా అన్నగారి చేతుల్లోనే ఉంది. ఆయన అంగీకరిస్తేనే అది నాకు లభ్యమవుతుంది. పైగా అది చాలదు. కనుక ఉన్నదంతా నా చదువుకు పెట్టుబడి పెట్టుమని అడిగేను. ఈ దేశంలో ఏ సోదరుడైనా ఆ పని చేస్తాడాఅని మిమ్మల్ని అడుగుతున్నాను. ఇండియాలోకూడా అటువంటి సోదరులు చాలా అరుదు. ప్రాశ్చాత్య అభిప్రాయాలను జీర్ణం చేసుకుని నేను సోదరభావాని కనర్హుడనవుతాననీ, నేను సజీవంగా తిరిగి వస్తేనే ఆ డబ్బు తిరిగి వస్తుందనీ, ఆ విషయం చాలాసంశయాస్పద మైన విషయమనీ ఆయనకు కొందరు చెప్పేరు. సదుద్దేశ్యం తోనూ, సబబుగానూ చెప్పబడిన ఈ మాటలన్నిటికీ ఆయన పెడ చెవి పెట్టేడు. నా కోరికను అంగీకరించడానికి ఆయన ఒక్క షరతుమాత్రం పెట్టేడు. అదేమంటే మా అమ్మగారి అంగీకారాన్నీ, మా పినతండ్రిగారి అంగీకారాన్నీ నేను పొందాలన్నాడు. నా సోదరునివంటి సోదరులు చాలామందికి లభించుగాక ! అప్పుడు నేను ఆ పనికి ఉపక్రమించాను. అదేమీ తక్కువ కష్టమైనపని కాదు. అదృష్టవశాత్తూ నా తల్లిగారికి నేనంటే చాలా గారాబం. ఆవిడకు నా మీద విశ్వాసం హెచ్చు. కనుక ఆమె ఛాందసాభిప్రాయాలను పోగొట్ట కలిగేను. కాని మూడు సంవత్సరాలు నన్ను విడిచిపెట్టి ఉండేవిషయంలో ఆమె అంగీకారాన్ని పొందడం ఎట్లా ? కాని ఎలాగో ఒకలాగున, ఇంగ్లండు వెళ్ళడంవల్ల కలిగే లాభాలను అతిశయంగా వివరించి, అతికష్టంమీద నా కోరికకు ఆమె అంగీకారాన్ని పొందేను. ఇక మా పినతండ్రిగారిసంగతి. ఆయన అప్పట్లో కాశీ వగైరా యాత్రలు పోవడానికి సిద్ధంగా ఉన్నాడు. మూడురోజులపాటు బ్రతిమాలి వాదించిన పిమ్మట ఆయన ఇలా అన్నాడు.

"నేను యాత్రకెడుతున్నాను. నీవు చెప్పేది సరియైనదే కావచ్చును. కాని అపవిత్రమైన నీ కోరికకు నేను బుద్ధిపూర్వకంగా సరి' అనడం ఎట్లు? కాని నేను చెప్పగలిగినదింతే. మీ అమ్మగారికభ్యంతరం లేకపోతే నా కందులో కలుగజేసుకునే హక్కులేదు."

ఇది అంగీకారంగానే అన్వయం చేయబడింది. కాని నేను సంతృప్తిపరుపవలసినవారు వీరిద్దరేకారు. ఇండియాలో ఎంత దూరపు బంధువులైనాసరే, ఇతరుల వ్యవహారాల్లో వేలుపెట్టేహక్కు తమకుందనుకుంటారు. కాని వారిద్దరి అంగీకారం పొందిన వెంటనే, (నిజానికి మరేమీలేదు) డబ్బుకు సంబంధించిన కష్టాలన్నీ విడిపోయాయి.

ఇక రెండవ విధమైన కష్టానికొద్దాం. ఆ విషయం కొంత వరకు పైన చర్చించాను. బహుశా నాకు పెళ్లి అయినదని చెపితే మీకు ఆశ్చర్యం కలుగుతుందనుకుంటాను. (నాకు 12 సంవత్సరముల వయస్సులో పెండ్లయింది.) కనుక నాభార్య తలితండ్రులు, వారి కూతురుకోసమైనా ఈ విషయంలో కలుగచేసుకోవడానికి తమకు హక్కుందనుకుంటే వారితప్పేమీలేదు. ఆమెనెవరు కనిపెడతారు? ఈ మూడు సంవత్సరాలు ఆమెకు కాలక్షేపం ఏలాగు? ఆమెను మా అన్నగారి పాలనలో ఉంచడానికే నిశ్చయమైనది. పాపం అన్నయ్య! అప్పుడు నాకుండిన అభిప్రాయాలనుబట్టి మా అత్త మామల సహేతుకమైన భీతినీ, వారిసణుగుడునూ నేను గమనించే వాడినేకాను. కాని వారికి కష్టంకలిగితే అది మా అమ్మగారిమీదా అన్నయ్యమీదా పడుతుందికదా! కనుక కొన్ని రాత్రులు పాటు మామామగారితో కూచుని ఆయనచెప్పే అభ్యంతరాలన్నిటికీ జవాబులు చెప్పవలసివచ్చిందంటే అదేమీ తేలికైన పనికాదు. 'ఓర్మి, పట్టుదల ఉంటే కొండలను పిండి కొట్టవచ్చును' అనే సామెత అప్పుడు నాకు బాగా తెలిసింది. అందుచేత వదలిపెట్టలేదు.

డబ్బు, పెద్దల అనుమతి లభించిన పిమ్మట, 'నా బంధువులను ఆప్తులను, అందరిని విడచిపెట్టి ఉండడం ఏలాగు?' అనే విషయాన్ని గురించి నాలో నేనే ఆలోచించుకున్నాను. ఇండియాలో ఎడబాటంటే కొంత బాధపడతాము. నేను కొద్ది రోజుల పాటు ఎక్కడికైనా వెళ్లవలసి వచ్చినపుడు కూడా మా అమ్మ కళ్లల్లో నీరు పెట్టుకుంటుంది. అలాంటప్పుడు హృదయ విదారకమైన ఆ ఎడబాటు దృశ్యాన్ని చూడడం ఎట్లు? నామనస్సు పడ్డ క్షోభనంతా వర్ణించడానికి నాతరంకాదు. నేను శెలవుతీసుకోవలసిన సమయం సమీపించినకొద్దీ నామనోనిబ్బరం తగ్గిపోయింది. కాని ఈ

సంగతి నాకు అత్యంత ఆప్తులైన మిత్రులతో కూడా చెప్పకుండా గుంభనగా మాత్రం ఉంచగలిగేను. నిద్రావస్థలోనూ, జాగ్రదావస్థలోనూ, అన్నపానాదులు సేవించేటప్పుడూ, నడుస్తున్నా, పరిగెత్తుతున్నా, చదువుతున్నా, ఇంగ్లండును గురించి ఆలోచిస్తూ కలలుకంటూ ఉండేవాడిని. ఆ శుభముహూర్తంలో ఏమి చేస్తానా అని ఊహించుకుంటూ ఉండేవాడిని. ఆఖరు కాసమయం వచ్చింది. ఒక ప్రక్కన మాఅమ్మ నీళ్లు కారుతున్న కండ్లను చేతుల్తో కప్పుకుని ఉన్నది. కాని వెక్కి వెక్కి వస్తున్న ఏడుపు వినబడుతూనే ఉన్నది. మరొక ప్రక్కన 50 మంది స్నేహితులున్నారు. 'నేను ఏడిస్తేశుద్ధ బలహీనుడనని వాళ్లనుకుంటారేమో; ఏడిస్తే వాళ్లు నన్ను ఇంగ్లండు వెళ్లనివ్వరేమో' అని నాలోనే ననుకున్నాను. కనుక నేను నాగుండె పగులుతున్నా ఏడవలేదు. ఆఖరుకు నాభార్యతో చెప్పవలసిన ఘట్టం వచ్చింది. అదేమంత తేలికైనపనికాదు. స్నేహితులందరిముందరా ఆమెను చూడడంగాని, ఆమెతో మాట్లాడడంగాని ఆచారానికి విరుద్ధం. కనుక ఆమెను వేరేగదిలో కలుసుకున్నాను. అంతకుముందే ఆమె ఏడ్వడం ప్రారంభించింది. ఆమె ఎదుట కొంచెంసేపు రాతి విగ్రహంలా నిలబడ్డాను. తర్వాత ఆమెను ముద్దుపెట్టుకున్నాను. ఆమె 'వెళ్లద్దు' అన్నది. ఆ తర్వాత ఏమిజరిగినదీ నేను వివరించనక్కరలేదు. ఇదైనంత మాత్రాన నా ఇబ్బందులన్నీ ఆఖరుకాలేదు. అప్పుడే ప్రారంభమైనాయి. రాజకోటలో—నేను చదువుకున్న చోటు—మా అమ్మగారి దగ్గరనుంచీ, భార్యదగ్గరనుంచీ శెలవు తీసుకోవడంతో సగంపని మాత్ర మేఅయింది. మాఅన్నయ్య, స్నేహితులు బొంబాయిదాకావచ్చి నన్ను దిగబెట్టేరు. అక్కడ జరిగిన దృశ్యంకూడా ఏమంత తక్కువ బాధాకరంగాలేదు.

బొంబాయిలోని మాకులస్థులతో వచ్చినపేచీలు చెప్పనలవి కాదు. వాళ్లందరూ ముఖ్యంగా బొంబాయిలోనే నివసిస్తుంటారు. రాజకోటలో ఇటువంటి ప్రాతికూల్యతను, చెప్పుకోదగినంతగా ఎదుర్కొనవలసిన నక్కరలేకపోయింది. నాదురదృష్టంకొద్దీ నేను మావాళ్ళంతా నివసించేచోటనే, బొంబాయికి ఆయువుపట్టైన చోట ఉండవలసివచ్చింది. కనుక వాళ్ళంతా నన్ను నాల్గుమూలల నుంచీ ముట్టడించారు. నేను బయటకొస్తే ఎవరో ఒకరు నన్ను వ్రేలుపెట్టి చూపిస్తూనే ఉండేవారు. ఒకసారి నేను టౌనుహాలు

ముందరనుంచి పోతుంటే కొంతమంది నన్ను చుట్టుముట్టేసి హేళనచేయడం ప్రారంభించారు. పాపం! మా అన్నయ్య మాట్లాడకుండా ఈ దృశ్యాన్ని చూస్తూ ఉండవలసి వచ్చింది. ముఖ్యమైన కులపెద్దలంతాకలసి, భారీఎత్తున కులస్థులసభ నొకదానిని జరిపించడంతో వ్యవహారం ముదిరి కొండెక్కొచ్చింది. కులానికి చెందిన ప్రతి సభ్యుడూ విధిగా సభకురావాలనీ, రాకపోతే 5 అణాలు జరిమానా విధింపబడుతుందనీ నోటీసివ్వబడింది. ఈ చర్యతీసుకోడానికి నిశ్చయించేముందు చాలామంది ముఠాముఠాలుగా నాదగ్గరకొచ్చి నన్ను బాధించారు కాని, నేనేమీ లొంగలేదు. ఈ కులస్థులసభలో నన్ను మధ్య కూచోపెట్టేరు. పటేళ్ళు అనగా కులపెద్దలు మా తండ్రిగారితో తమకుండిన సంబంధబాంధవ్యాలన్నిటినీ యాకరువుపెట్టి, నన్ను మందలించడం ప్రారంభించారు. ఇది నాకు అపూర్వమైన అనుభవమని ఈ సందర్భంలో చెప్పక తప్పదు. నాకు పదిమందిలో మెలగడం అంతగా అలవాటులేదు. అందుచేత వాళ్లు బలవంతంగా నన్ను వెల్లడిలో కీడ్చుకొచ్చారని చెప్పాలి. నాకు సహజంగా భిడియం ఎక్కువవడంచేత నా స్థితి మరింత ప్రమాదములో పడింది. నన్ను మందలించినందువలన ప్రయోజనంలేదని తెలుసుకొని పెద్ద పటేలు ఈ విధంగా నాతో చెప్పేడు. "మేము మీ నాయనగారి స్నేహితులవడంచేత నిన్ను గురించి మేమింతగా పట్టించుకుంటున్నాము. కుల పెద్దలైన మాకు ఎటువంటి శక్తి ఉన్నదో నీకు తెలుసును. ఇంగ్లండులో నువ్వు మాంసంతిని, సారా త్రాగవలసి ఉంటుందని మాకు రూఢిగా తెలిసింది. పైగా నువ్వు సముద్రాలు దాటి వెళ్లాలి. ఇదంతా మనకులకట్టుబాట్లకు విరుద్ధమని నువ్వు తెలుసుకోవాలి. కనుక నీ నిర్ణయాన్ని పునరాలోచన చేసుకోమని ఇందుమూలంగా మేము శాసిస్తున్నాం. అలా మార్చుకోకపోతే నిన్ను మేము కఠినంగా శిక్షించవలసి వస్తుంది. దీనికేమంటావు?"

నేను వారికీవిధంగా జవాబు చెప్పేను. "మీరుచేసిన హెచ్చరికలకు అనేక వందనాలు. నేను నానిర్ణయాన్ని మార్చుకోలేనందుకు చాలా విచారిస్తున్నాను. నేను ఇంగ్లండును గురించి తెలుసుకున్న సంగతులు, మీరుచెపుతున్నదానికి చాలా

వ్యతిరేకంగా ఉన్నాయి. అక్కడ ప్రతివాళ్లూ మాంసం తిననక్కర లేదు. మద్యపదార్థాలను సేవించ నక్కరలేదు. సముద్రాలు దాటడం విషయంలో, మన సోదరులు ఏడెన్‌దాకా వెళ్ళడానికి వీలైతే, నేను ఇంగ్లండు వెళ్ళడానికి అభ్యంతరమేమిటి ? ఈ అభ్యం తరాలన్నిటికీ మూలకారణం ఈర్ష్య అని నాకు రూఢి అయింది."

పెద్ద పటేలుకు బాగా కోపం వచ్చింది. "అయితే సరే. నువ్వు నీ తండ్రికి పుత్రుడవుకావు" అని నాతో చెప్పి, సభవారికేసి తిరిగి ఇలా చెప్పేడు. "ఈ పిల్లవానికి మతిపోయింది. కనుక ఈతనితో ఏ విధమైన సంబంధమూ పెట్టుకోకూడదని అందరినీ శాసిస్తున్నాము. ఎవరైనా ఆతనికి ఏ విధంగానైనా సహాయపడినా, ఆతనిని సాగనంపడానికెళ్లినా వారిని కులంలోనుంచి వెలివేస్తాం. ఈ పిల్ల వాడు తిరిగిరావడమంటూ జరిగితే, అతనిని కులంలో కలుపుకోము."

ఈ మాటలు సభలో అందరికీకూడా గుండు దెబ్బల్లా తగి లేయి. ఎటువంటి కష్టాలొచ్చినా నాకు మద్దతునిచ్చిన కొద్దిమంది కూడా నన్ను ఏకాకిగా వదిలేశారు. ఈ చంటిపిల్లల బెదరింపుకు సరియైన జవాబిద్దామని ఆలోచించాను. కాని మా అన్న వారించాడు. ఈ విధంగా అగ్నిపరీక్షలోనుంచి బయటపడ్డాను. కాని నాస్థితి ఇదివరకుకన్న చాలా అధ్వాన్నమైనది. ఒక క్షణం పాటైనా, మాఅన్నకూడా కొంచెం ఊగిసలాడి తటపటా యించాడు. నాకు ధనసహాయంచేస్తే, ధనం పోవడమే కాకుండా కులంలో వెలికూడా సిద్ధిస్తుందని అయనకు హెచ్చరిక చేశారు. నాతో అయనేమీ స్వయంగా చెప్పలేదు. కాని నానిర్ణయాన్ని పునరాలోచించమనీ, అథవా కులంవాళ్ళ ఆగ్రహం చల్లారేవరకూ ప్రయాణం వాయిదా అయినా వేయమని నాకు నచ్చచెప్ప వలసినదిగా ఆయన స్నేహితులకు పురమాయించాడు. నాదగ్గర నుంచి రాగలిగిన జవాబొక్కటే వచ్చింది. అంతటినుంచి ఆయ నెంతమాత్రమూ చలించలేదు. నిజానికి ఆయన నెవ్వరూ కులం నుండి వెలివెయ్యనూలేదు. కాని అంతటితో అది ఆఖరుకాలేదు. కులంవాళ్ళ కుట్రలు సాగుతూనే వచ్చాయి. ఈసారి వాళ్ళ కుట్రలు ఫలించాయా అనుకునేదాకా వచ్చింది. ఏమంటే నా ప్రయాణాన్ని ఒక పక్షం వాయిదా వేయించగలిగేరు. అది ఈ

విధంగా జరిగింది. మేమొక ఓడలకంపెనీ కెప్టెనును చూడడానికి వెళ్ళేం. ఆగష్టు నెలలో సముద్రం తుపాను వాతావరణంలో ఉంటుందనీ, కనుక అప్పుడు సముద్రప్రయాణం పెట్టుకోవడం తెలివైన పనికాదనీ ఆయనచేత చెప్పించారు. ఇదితప్ప మా అన్న మరి దేన్నైనా అంగీకరిస్తాడు. నేను ప్రప్రథమంగా సముద్రయానం చేస్తున్నాను కనుక, నేను సముద్రయానానికి తట్టుకోగలనో లేదో తెలియదుకనుక, నాకు గత్యంతరం లేకపోయింది. నాకిష్టంలేక పోయినా ప్రయాణానికి వాయిదా వేసుకోవలసి వచ్చింది. ఈ కట్టుకొచ్చిన నిర్మాణమంతా కూలిపోతుందేమో ననుకున్నాను. సమయం వచ్చినపుడు ప్రయాణానికి కావలసినసొమ్ము నాకివ్వమని మా అన్న ఒక స్నేహితునికి ఉత్తరం వ్రాసి ఇచ్చి, తాను వెళ్లి పోయాడు. నన్ను ఆయనవిడచి వెళ్లేటప్పుడు లోగడ విశదీకరించిన సంఘటనే జరిగింది. ప్రయాణపుటిక్కట్టు కొనుక్కోడానికి చేతిలో డబ్బులేకుండానే, నేను ఒంటరిగా బొంబాయిలో ఉండిపోవలసి వచ్చింది. నేను కాచుకుని కూచున్న ప్రతిగంటా ఒక సంవత్సరంలా తోచింది. ఈలోగా మరొక భారతీయ పెద్దమనిషి (ముజుందారు) ఇంగ్లండుకు పోతున్నాడని తెలిసింది. ఈ వార్త నాకు దేవుడిదగ్గర నుంచి వచ్చినట్లైంది. ఈసారి నన్ను పోనిస్తారనుకున్నాను. మా అన్న ఇచ్చిన ఉత్తరం పట్టుకెళ్లి చూపించేసరికి ఆయన డబ్బు ఇవ్వన న్నాడు. 24 గంటలలో నేను ప్రయాణపు ఏర్పాట్లన్నీ చేసుకోవలసి వచ్చింది. నేనుచాలా భయంకరమైన ఆందోళనలోపడ్డాను. డబ్బు లేకపోతే రెక్కలులేని పక్షినైపోయాను. నేనెల్లకాలం కృతజ్ఞుడనుగా ఉండవలసిన ఒక స్నేహితుడు నా కడ్డుపడి ఓడ ప్రయాణానికి కావలసిన డబ్బిచ్చాడు. దానితో టిక్కెట్టు కొనుక్కుని, మా అన్నకు టెలిగ్రాం ఇచ్చి, 1888 సంవత్సరం సెప్టెంబరు 4వ తేదీని ఇంగ్లండుకు ఓడ ఎక్కేను. 5 నెలలపాటు నే ననుభవించిన ముఖ్యమైన ఇబ్బందులు అవి. నేనప్పట్లో చాలా ఆత్రతపడ్డాను. యమయాతనకు లోనైనాను. ఒకప్పుడు ఆశకలిగేది. మరొకప్పుడు నిస్పృహ తోచేది. ఏమైనా ప్రయత్నలోపంచేయకుండా నాలక్ష్యాన్ని సిద్ధింప చేయడానికి భగవంతునిమీద భారంవేసి కాలక్షేపం చేశాను.

['ది వెజిటేరియన్' 13-6-1891.]

## 2

ప్రశ్న :—ఇంగ్లండు చేరడంతోనే, మాంసాహారం సమస్య మీకు ఎదురైనది కదా ? దానిని మీరెట్లు పరిష్కరించారు ?

జవాబు :—అయాచితంగా ఇచ్చిన సలహాలతో నన్ను ముంచెత్తేశారు. సదుద్దేశం కలవారైనా, విషయం తెలియనివారు చాలామంది, వారి అభిప్రాయాలను నాకిష్టం లేకపోయినా నాచెవుల్లో నూరిపోశారు. అందులో చాలా మంది చలిదేశంలో మాంసంతినకుండా ఉండడం సాధ్యంకాదన్నారు. నాకు క్షయవ్యాధి వస్తుందన్నారు. మిస్టర్ జడ్‌కు, చెప్పినమాట వినకపోయినందువల్లనే ఇంగ్లండులో క్షయ అంటుకుందనిచెప్పేరు. చలితో ఒళ్లంతా మొద్దుబారిపోతుందన్నారు. ఒకాయన నాతో కూడా 8 సీసాల విస్కీని పట్టుకెళ్లమని కూడా సలహా ఇచ్చాడు. ఏడెన్ దాటిన తర్వాత దాని అవసరం కనుబడుతుందన్నాడు. మరొకడు, తన స్నేహితుడు ఇంగ్లండులో పొగత్రాగక తప్పిందికాదనీ, కనుక నన్ను కూడా పొగత్రాగమనీ చెప్పేడు. ఇంగ్లండులో ఉండివచ్చిన వైద్యులు కూడా ఆమాటే చెప్పేరు. ఏమైనాసరే నేనింగ్లడురాదలచినాను కనుక, వాటి నన్నిటిని దరిచేర్చకుండా సర్వవిధాలుగా ప్రయత్నిస్తానన్నాను. వాటిని ఉపయోగించడం అత్యంత అవసరమైతే ఏమిచెయ్యాలో నాకే తెలియలేదు. మాంసం అంటే అప్పట్లో నాకు ఇప్పుడున్నంత అసహ్యంలేదు. ఆరు ఏడుసారులు స్నేహితుల ప్రోద్బలంవలన మాంసం తినడంకూడా జరిగింది. స్టీమరులో నాఅభిప్రాయాలు మారడం ప్రారంభమైనాయి. ఎటువంటి పరిస్థితుల్లో కూడా మాంసంతినకూడ దనుకున్నాను. నేను ప్రయాణమై రావడానికి అంగీకరించే ముందు, మా అమ్మగారు నాదగ్గర మాంసం తిననని వాగ్దానం పుచ్చుకున్నది. ఆ వాగ్దానాన్ని చెల్లించుకోవడానికైనా నేను మాంసాన్ని ముట్టుకో కూడదనుకున్నాను. స్టీమరులోని తోడి ప్రయాణీకులు మమ్మల్ని (అనగా నన్ను, నాతోఉన్న స్నేహితుని) కొంచెం తినిచూడమన్నారు.

ఏడెన్ దాటిన పిమ్మట దాని అవసరం తెలుస్తుందని వారు చెప్పేరు. అది నిజంకాదని తెలిశాక, ఎర్రసముద్రం దాటేక దానిని తినవలసొస్తుందని అన్నారు. అది కూడా అబద్ధమని

తేలిన పిమ్మట తోడిప్రయాణీకు డొకాయన ఇలా అన్నాడు. "వాతావరణం అంత ప్రమాదంగాలేదు. బే ఆఫ్ బిస్కేదగ్గర ప్రాణంపోగొట్టుకోవాలా లేక మాంసం తిని విస్కీ త్రాగాలా అన్న సమస్య ఉత్పన్నమవుతుంది" అన్నాడు. ఆ ప్రమాదం కూడా సుఖంగానే గడచిపోయింది. లండన్‌లో కూడా నేన లాంటి హెచ్చరికలనే వినవలసివచ్చింది. కొన్ని నెలలపాటు నాకసలు శాకాహారి అంటూ ఎవ్వరూ కనుబడనేలేదు. శాకాహారం దేహపోషణకు సరిపోతుందని ఒక మిత్రునితో చర్చచేస్తూ కొన్ని రోజులు గడిపేను. కాని అప్పట్లో శాకాహారానికి అనుకూలంగా నాకు జీవకారుణ్యం తప్ప మరొకవాదన తెలియదు. ఆ చర్చల్లో ఆ మిత్రుడు జీవకారుణ్యాన్ని గురించి అతి అవహేళనగా మాట్లాడు తుంటే నాకు చాలాకష్టంగా ఉండేది. ఆఖరుకు 'నేను చచ్చిపోనైనా చచ్చిపోతాను కాని, మా అమ్మ కిచ్చినవాగ్దానానికి భంగం కలిగించను' అని చెప్పేసరికి ఆయన నోరుమూతపడింది. "ఓహో! .........కుర్రతనం. కేవలం చాదస్తం. ఇక్కడకొచ్చికూడా ఇలాంటి వెర్రినమ్మకాలు పెట్టుకుని కూచుంటే నేను నీకేమీ సహాయం చేయ లేను. నీవసలు ఇంగ్లండురాకుండాఉంటేనే బాగుండేది." అన్నాడు.

మరల ఆయన ఆ విషయమై అంతగా ప్రస్తావన చేయలేదు. బహుశా ఒక్కసారి చేశాడనుకుంటాను. కాని అప్పటినుంచి ఇంచుమించు నన్నొక మూర్ఖునిగా భావించాడు. ఒకసారి ఎప్పుడో నేను 'పోరిజ్ బౌల్' అనే శాకాహార భోజనశాల ప్రక్కనుండి వెళ్లినట్లు జ్ఞాపకం. అదెక్కడున్నదో చూపించ మని ఒక పెద్దమనిషిని కోరేను. అక్కడికెళ్ళేలోగా 'సెంట్రల్ రెస్టోరెంటు' కనుబడింది. అందులో కెళ్లి ప్రప్రథమంగా 'పోరిజ్' (జావ) పుచ్చుకున్నాను. మొదట్లో నాకదంతగా రుచించలేదు. దానితరువాత పుచ్చుకున్న 'పై' (సామోసా) బాగుంది. అక్కడే నేను ప్రప్రథమంగా కొన్ని శాకాహారాన్నిగురించిన పుస్తకాలు కొన్నాను. హెచ్. యస్. సాల్టు వ్రాసిన ('ప్లీ ఫర్ వెజిటేరియా నిజం') శాకాహారం మెందుకు తినాలి అనే పుస్తకం అందులో ఒకటి. దానిని చదివిన తర్వాతనే శాకాహారమును ఒక సిద్ధాం తంగా నేను స్వీకరించాను.

అంతవరకూ, భౌతిక శాస్త్రరీత్యా మాంసాహారం ఉత్తమమైనదని అనుకున్నాను. అంతేకాకుండా మాంచెస్టరులో శాకాహార సంఘ మొకటున్నదని అక్కడే నాకు తెలిసింది. కాని నేనా విషయంలో అంత ప్రత్యేకమైన శ్రద్ధవహించలేదు. అప్పుడప్పుడు ('వెజిటేరియన్ మెస్సెంజర్') *'శాకాహార సందేశకుడు'* అనే పత్రికను చదువుతూవచ్చాను. అంతే. *'ది వెజిటేరియన్'* సంగతి నాకు తెలిసి ఒకటిన్నర సంవత్సరాలైంది. అంతర్జాతీయ శాకాహార మహాసభ (ఇంటర్నేషనల్ వెజిటేరియన్ కాంగ్రెసు) జరిగినప్పుడే నాకు * యల్. వి. యస్. సంగతి తెలిసింది. కాంగ్రెస్ జరుగుతోందని మిస్టర్ జోసయ్యా ఓల్డ్‌ఫీల్డు దయవల్ల నాకు తెలిసింది. ఒక మిత్రునిద్వారా ఆయనకు నాసంగతి తెలిసి, నన్ను మహాసభకు రావలసినదని ఆహ్వానించాడు. తుదిపలుకుగా నేనొక సంగతి చెప్పకతప్పదు. ఇంగ్లండులో నే నున్న దాదాపు 3 సంవత్సరాల్లోనూ నే ననేక పనులను అసంపూర్తిగా వదలిపెట్టేను. చేయకుండా ఉంటే మంచిదనిపించే పనులను కొన్నిటిని చేశాను. అయినప్పటికీ మాంసం తినకుండా, మద్యాన్ని త్రాగకుండా ఇంటికెడుతున్నాననే ఒక్క సంతృప్తితో మాత్రం వెడుతున్నాను. ఇంగ్లండులో చాలామంది శాకాహారులున్నారనే సంగతి కూడా స్వానుభవంవల్ల తెలుసుకున్నాను.

[*'ది వెజిటేరియన్'* 20-6-1891.]

---

* లండన్ వెజిటేరియన్ సొసైటీ

# 13. న్యాయవాదిగా చేరడానికి దరఖాస్తు

బొంబాయి,

నవంబరు 16, 1891

బొంబాయి హైకోర్టు రిజిస్ట్రారువారికి,

బొంబాయి.

అయ్యా,

హైకోర్టులో న్యాయవాదిగా చేరవలెనని నేను అభిలాష పడుతున్నాను. గత జూన్ మాసంలో ఇంగ్లండులో ప్లీడరు పట్టాను పొందియున్నాను. నేను ఇన్నర్ టెంపుల్‌లో 12 టరములు చదివినాను. బొంబాయి ప్రెసిడెన్సీలో న్యాయ వాద వృత్తిని అవలంబించ దలచుకున్నాను.

నా బారిష్టరీ పట్టాను దాఖలు చేసుకొనుచున్నాను. నా ప్రవర్తనగురించీ, సమర్థతగురించీ, ఇంగ్లండులోని న్యాయమూర్తి దగ్గరనుంచి యోగ్యతాపత్రాన్ని నేను సంపాదించలేదు. బొంబాయి హైకోర్టులో నున్న (రూల్సు) నిబంధనలు నేను ఎరుగక పోవడమే ఇందుకు కారణం. అయినప్పటికీ ఇంగ్లండులోని సుప్రీంకోర్టులో న్యాయవాదిగానున్న డబ్ల్యు. డి. ఎడ్వర్డ్సుగారిచ్చిన యోగ్యతాపత్రాన్ని నేను నివేదించగలను. బారిష్టరీ ఆఖరు సంవత్సరం పఠనీయగ్రంథమైన * 'భూమి ఆస్తికి సంబంధించిన చట్టక్రోడీకరణము'ను రచించినది ఆయనే.

ఇట్లు విధేయుడు,

మో. క. గాంధీ.

['మహాత్మా' వాల్యూం 1 ఫోటోస్టాటు నుండి ]

---

* కంపెండియం ఆఫ్ ది లా ఆఫ్ ప్రాపర్టీ ఇన్ లాండ్.

# 14. స్వదేశానికి తిరుగు ప్రయాణం

## 1

ఇంగ్లండులో మూడు సంవత్సరాల నివాసానంతరం 12 జూన్ 1891 సంవత్సరం తేదీని నేను బొంబాయికి ప్రయాణమైనాను. ఆరోజు చాలా అందంగా ఉండినది. సూర్యుడు తేజోవంతంగా ప్రకాశిస్తున్నాడు. చలిగాలి సోకకుండా ఓవరుకోటు వేసుకోవలసిన అగత్యం లేకపోయింది.

గం. 11-45 నిమిషములకు లివర్పూల్ స్ట్రీటు స్టేషనునుంచి రేవుకు జనాన్ని చేరవేసేందుకు ఎక్స్ప్రెస్ రైలు బయలుదేరింది.

పి. అండ్. ఓ. కంపెనీవారి తాలూకు ఓడ 'ఓషియానా'లో అడుగు పెట్టేవరకూ నాకు ఇండియా వెళ్ళిపోతున్నాననే స్పృహ కలుగనేలేదు. లండన్ నగరమన్నా, లండన్ పరిసరాలన్నా నాకంత అభిమాన మేర్పడింది. నిజానికి లండన్ ఎవరినాకర్షించదు? లండన్‌లోని విద్యాలయాలు, వినోదశాలలు, వస్తుప్రదర్శనాలయాలు, నాటకశాలలు, అపారమైన వాణిజ్యవ్యాపారము, విహారారామాలు, శాకాహార భోజనశాలలు, సహజంగా విద్యార్థులను, యాత్రికులను, వ్యాపారస్థులను, 'పిచ్చినమ్మకా'లవారినీ, అందరినీ ఆకర్షిస్తాయి. (సాధారణంగా శాకాహారవాదులను ప్రతిపక్షులు పిచ్చినమ్మకాలవారనే అంటుంటారు.) కనుక ఎంతో విచారంతోనే ఆప్యాయమైన లండన్ నగరాన్ని వదలిపెట్టేను. కాని చాలాకాలమైన తర్వాత ఇండియాలో బంధుమిత్రులను చూడగలుగుతున్నాననే ఆనందం కలుగకపోలేదు.

'ఓషియానా' ఆస్ట్రేలియను స్టీమరు. ఆ కంపెనీ తాలూకు పెద్ద నావలలో ఒకటి. 6,188 టన్నుల భారంగలది. 1,200 హార్సుపవరుగలది. సముద్రంలో తేలి ఆడుతున్న ద్వీపంలాంటి ఈ స్టీమరులో కాలుపెట్టడంతోనే మంచి ఉషారిచ్చే టీ అందరం సేవించాము. (ప్రయాణీకులు, స్నేహితులుకూడా కలిసే) ఆ టీ ఉచితంగానే ఇవ్వబడిందని చెప్పకతప్పదు. ఆ సమయంలో అంతా ప్రయాణీకులే అని అపోహపడడం చాలాసులభం.

వారు చాలామంది అంత సావకాశంగానే టీ సేవించారు. త్వరలో ఓడ లంగరెత్తుతోందని గంటవాయించేసరికి పైజనమంతా ఖాళీచేశారు. హార్బరులోనుంచి ఓడ కదుల్తుంటే ప్రయాణీకులూ వారి స్నేహితులూ కూడా జేబురుమాళ్ళు ఊపుకున్నారు.

బొంబాయివెళ్లే ప్రయాణీకులు ఏడెన్‌దగ్గర 'అస్సామ్' అనే మరొక ఓడలోకి మారవలసివచ్చింది. ఈ సందర్భంలో 'ఓషియానా' కు ఈ ఓడకు గల తారతమ్యం తెలియపరచడం మంచిది. 'ఓషియానా'లో పరిశుభ్రంగా ఉండి, మాట వినిపించుకొనే మర్యాదస్థులైన (వెయిటర్లు) నౌఖర్లుంటారు. 'అస్సాం' ఓడమీద పోర్చుగీసు వెయిటర్లుంటారు. వాళ్ళు రాణీగారింగ్లీషు భాషను ఖూనీచేశారు. పరిశుభ్రతకు వ్యతిరేకులు. మాట వినిపించుకోరు. మందకొడిగా పనిచేస్తారు. పైగా ఈ రెండు ఓడల్లో సప్లయిచేసే భోజనపదార్థాల విషయంలోకూడా చాలాతేడాఉంది. 'అస్సామ్' ఓడలో, ప్రయాణీకులందరూ సణుగుకోవడంవల్ల అది స్పష్టంగా తెలిసింది. ఇంతేకాదు. 'ఓషియానా' లో వసతికూడా 'అస్సాం'లో కన్న చాలా బాగుంది. అయితే దీనికి కంపెనీవారు చేయగలిగిన దేమీలేదు. 'ఓషియానా' బాగుందని 'అస్సామ్'ను పూర్తిగా తీసెయ్యలేరుకదా !

కేవలశాకాహారులు ఓడలో ఏ విధంగా కాలక్షేపం చేశారనేది చాలా ఉచితమైన ప్రశ్న.

నాతోసహా ఇద్దరే శాకాహారులం. మేమిద్దరమూకూడా మరేమీ మంచిపదార్థాలు దొరకకపోతే, నీటిలోఉడికించిన బంగాళాదుంపలు, కేబేజీ, వెన్న, వీటితో కాలక్షేపం చేయడానికి సంసిద్ధమై పోయాము. కాని మేమంతదాకా పోనక్కరలేకుండానే సరిపోయింది. మొగమాటస్థుడైన భోజనశాలాధిపతి మాకు కాయగూరలు, అన్నం, పండ్లమురబ్బాలు, తాజాపండ్లు, వగైరాలు 1వ తరగతి భోజనశాలలోనుంచి, సప్లయిచేశాడు. అన్నిటికన్నా ముఖ్యంగా నూకరొట్టె సప్లయిచేశాడు. కనుక మాకు కావలసినవన్నీ లభ్యమయ్యాయి. ప్యాసెంజర్లకు కావలసినంత మంచి ఆహారాన్ని సప్లయిచేయడంలో వారు చాలా ఉదారతను కనుపరిచారు. నామట్టుకు, వాళ్ళు కొంచెం ఎక్కువగా చేశారేమోననిపించింది.

రెండవ తరగతి ప్రయాణీకుల భోజన వివరాలను విశదీకరించడం చాలాఅవసరం. ప్రొద్దున్నే లేవడంతోనే ప్రతి ప్రయాణీకునికి ఒకటి రెండు కప్పులు టీ, కాసిని బిస్కట్లూ ఇస్తారు. దానితో ప్రారంభం. ఉదయం 8—30 గంటలకు ప్రథమ భోజనానికి గంట కొట్టడంతోనే ప్రయాణీకులందరూ భోజనశాలలోకొస్తారు. భోజనానికి మాత్రం అంతా సైముకొస్తారు. క్షణం ఆలస్యంచేయరు. ప్రాతఃకాల భోజనంలో సామాన్యంగా ఓట్ జావ, చేపలు, మాంసం, జాం, బ్రెడ్, వెన్న, టీ లేక కాఫీ వగైరాలు, కావలసినన్ని ఉంటాయి.

సాధారణంగా ప్రయాణీకులు అంబలి, చేపలు, కూర, రొట్టె, వెన్న తినేసి రెండు మూడు కప్పుల టీతో వానిని లోపలికి పంపెయ్యడం నేను చూచాను.

ప్రాతఃకాల భోజనం ఇంకా పూర్తిగాజీర్ణం కాకముందే మధ్యాహ్నం 1—30 గంటలయ్యేసరికి మాధ్యాహ్నిక భోజనానికి గంట కొడతారు. అది ప్రొద్దున్న భోజనానికేమీ తీసిపోదు. కావలసినంత మాంసం, కూరగాయలు, అన్నం, కూర, సమస్తమూ వడ్డిస్తారు. వారానికి రెండు సారులు రెండవ తరగతి ప్రయాణీకులందరికీ మధ్యాహ్న భోజనంతో పండ్లు, పప్పులుకూడా వడ్డిస్తారు. ఇదీ చాలదన్నట్లు 4 గంటలయ్యేసరికి ఒక కప్పు టీ, బిస్కట్లూ . ఇస్తారు. సాయంకాలంవేళ చల్లగాలి తగులడంతోటే ఆ టీ పని అయిపోయేది. సాయంత్రం 6—30 గంటలయ్యేసరికి మరొక ఘనమైన టీ పడేది. రొట్టె, జామ్ లేక మార్మలేడ్ (కావలిస్తే రెండూ), శాలడ్, చాప్సు, టీ, కాఫీ వగైరాలన్నీ సిద్ధం. సముద్రపు గాలి మంచి అనువుగా ఉండడంచేత ప్రయాణీకులు పడుకోవడానికి ముందు ఎనిమిదోపదో, పదిహేనుకు మించకుండా బిస్కట్లు, కొంచెం చీజ్, ఆపైనికొంచెం బ్రాందికాని, బీరుకాని పట్టించేవారు. ఈ పద్ధతిలో ఈ క్రింది మాటలు పూర్తిగా సత్యమేకదా :

"నీ పొట్టే నీ భగవంతుడు. నీ కడుపే దేవాలయం. నీ ఉదరమే దైవసన్నిధి. నీ వంటమనిషే నీ ఆచార్యుడు. వంట పాత్రలలోనే నీ ప్రేమ రగుల్కుంటుంది. వంటశాలలోనే నీ విశ్వాసం మంటలులేపుతుంది. మాంసపు పళ్లేలలోనే నీ ఆశలన్నీ

దాగి ఉన్నాయి. ........నీకు తరుచుగా విందులుచేసి, బాగా మస్తుగా నీకు ఆనందాన్ని చేకూర్చేవారికన్న నీ వెవరిని గౌరవిస్తావు ?"

రెండవతరగతి ప్రయాణీకులలో అన్ని తరహాలవారూ ఉన్నారు. సిఫాయిలు, క్రైస్తవ మత ప్రచారకులు, మంగళులు, నావికులు, విద్యార్థులు, ఉద్యోగులు మొదలైనవారు. కొందరు సాహసకార్యదక్షులు కూడా ఉండవచ్చును. ముగ్గురు నలుగురు స్త్రీలుకూడా ఉన్నారు. ముఖ్యంగా తిండితోనూ, త్రాగుడుతోనూ కాలంగడచిపోయింది. మిగిలిన కాలం నిద్రతోనూ, కబుర్లాడుకోవడంతోనూ, చర్చించుకోవడంతోనూ, ఆటలాడుకోవడంతోనూ, పూర్తి అయిపోయింది. కాని రెండు మూడు రోజులైన తర్వాత భోజనానికీ, భోజనానికీ మధ్యకాలక్షేపం కావడం చాలాకష్టమనిపించింది. పేకాటాడినా, చర్చలుసాగించినా, పరనిందాత్మకమైన బాతాఖానీ సాగించినా కాలం వెళ్ళబుచ్చడం కష్టమే ననిపించింది.

మేము కొందరం పనికల్పించుకున్నాం. వినోదాలు, తాడులాగే పోటీలు, పరుగులు పోటీలు, బహుమతి ప్రదానాలు ఏర్పాటుచేశాం. ఒక రోజు సాయంకాలం పాటలకూ, ఉపన్యాసాలకూ ప్రత్యేకించాం.

ఇలాంటప్పుడు నేను కొంత చొచ్చుకెళ్ళవలసిన కాలమనుకున్నాను. వీటన్నిటిని ఏర్పాటుచేసే కార్యదర్శికి, శాకాహారాన్ని గురించి ఉపన్యసించడానికి నాకొక పావుగంట టైమిప్పించమని కోరేను. కార్యదర్శి అంగీకరించాడు.

అందుకు నేను చాలా తయారుచేసుకున్నాను. నేనివ్వవలసిన ఉపన్యాసాన్నిగురించి బాగా ఆలోచించాను. ఒకసారి, రెండుసార్లు వ్రాసినది తిరుగ వ్రాశాను. శ్రోతలు నా వాదానికి ప్రతికూలురని నాకు తెలుసును. నా ఉపన్యాసం వింటుంటే వాళ్ళకు నిద్రరాకుండా జాగ్రత్త పడాలనుకున్నాను. కొంచం హాస్యోక్తిగా మాట్లాడమన్నాడు కార్యదర్శి. కొంచెం జంకుతో మాట్లాడగలనుగాని, హాస్యంగా మాట్లాడడం నావల్లకాదన్నాను.

నా ఉపన్యాస మేమైందనుకుంటున్నారు ? రెండవ వినోదప్రదర్శనం జరుగనేలేదు. దానితోపాటు నా ఉపన్యాసం జరుగనందుకు

నాకు చాలా విచారం కలిగింది. బహుశా మొదటిరోజు సాయంకాలం వేడుకలవల్ల ఎవరూ సంతోషపడినట్లులేదు. ఏమంటే రెండవతరగతి ప్రయాణీకులలో గాయకులు కాని గ్లాడ్‌స్టనులుకాని లేరు.

ఏమైనా, నేనుమాత్రం ఇద్దరు ముగ్గురు ప్రయాణీకులతో శాకాహారాన్ని గురించి చర్చించాను. వాళ్ళు నేను చెప్పినదంతా నిదానంగా విన్నారు. కాని తుదకు వాళ్ళు చెప్పినదిది: "మీ వాదనను మేము అంగీకరిస్తాం. కాని ప్రస్తుతం మేము తినే ఆహారం మాకు సుఖంగా ఉన్నంతవరకు, మేము మీ ఆహారాన్ని పరీక్షచేయదలచుకోలేదు. అప్పుడప్పుడు మాకు అజీర్ణంచేసినాసరే."

వారిలో ఒకాయన నాకూ, నాశాకాహార మిత్రునికీ రోజూ చక్కనిపండ్లు, పలుకులు లభించడంచూచి శాకాహార భోజనం చేయడానికి ప్రయత్నించాడు. కాని ఎదురుగుండా మాంసంముక్క కనుబడేసరికి ఆగలేకపోయాడు. పాపం!

[ 'ది వెజిటేరియన్' 9—4—1892.]

## 2

అంతేకాకుండా, ప్రయాణీకులలో అన్యోన్యతను పెంపొందించడానికి మర్యాదకోసం ఒకటవతరగతి ప్రయాణీకులు రెండవతరగతి ప్రయాణీకులను తరుచుగా వారి నాటకాలకూ, నృత్యాలకూ ఆహ్వానిస్తూ ఉండేవారు.

మొదటితరగతిలో చాలా అందమైన స్త్రీలు, పురుషులు ఉన్నారు. ఎప్పుడూ ఆటపాటలతో కాలక్షేపం చేయడం కాకుండా, బొత్తుగా దెబ్బలాటలులేకపోతే బాగుండదని కొందరు ప్రయాణీకులు తప్పత్రాగేశారు. (సంపాదకమహాశయా, క్షమించండి. వారు ప్రతిరోజూ మస్తుగానే త్రాగుతూ ఉండేవారు. కాని ఈ సాయంకాలంమాత్రం మరీ వళంతప్పేదాకా పుచ్చుకున్నారు.) విస్కీగ్లాసులు పుచ్చుకుంటూ వారిలో వారేమో చర్చలు సాగించారు. ఆచర్చల్లో కొందరు అసభ్యమైన భాష మాట్లాడేరు. ఆ తిట్టుకోవడం కొట్లాటగా పరిణమించింది. ఈ సంగతంతా ఓడ క్యాప్టెన్‌కు తెలిసింది. ఆయన ఈ కుస్తీలుపట్టే పెద్దమనుష్యులను మందలించాడు. ఆ తర్వాత మళ్ళీ దెబ్బలాటలు జరుగలేదు.

ఈ విధంగా భోజనాలుచేస్తూ, ఆటపాటలతో కాలక్షేపం చేస్తూ ప్రయాణం సాగించాము.

రెండు రోజులు ప్రయాణం చేసినపిమ్మట, మా స్టీమరు జిబ్రాల్టరు ప్రక్కనుంచే వెళ్లింది. కాని జిబ్రాల్టరులో ఆగలేదు. అందుచేత మాకు చాలా ఆశాభంగం కలిగింది. స్టీమరు జిబ్రాల్టరులో ఆగుతుందనుకున్నాం. జిబ్రాల్టరులో పన్నులేకుండా పుగాకు దొరుకుతుంది కనుక మాలో పొగ త్రాగేవారికి ప్రత్యేకంగా ఆశాభంగమైంది.

తరువాత మాల్టా చేరేం. మాల్టా బొగ్గువేసుకునే రేవు అవడంచేత అక్కడ స్టీమరు 9 గంటలు ఆగుతుంది. అందుచేత ప్రయాణీకులందరం ఓడదిగి పైకి వెళ్ళేం.

మాల్టాలో లండన్‌లోమాదిరి పొగలేదు. అది చక్కని ద్వీపం. అక్కడ ఇండ్ల నిర్మాణం అదొకమాదిరిగా ఉంటుంది. మేము గవర్నరు భవనాన్నిచూచాం. అక్కడుండే ఆయుధాగారం చూడదగినది. నెపోలియన్ బండి అక్కడ ప్రదర్శింపబడింది. అక్కడ కొన్ని అందమైన రంగుల చిత్రపటాలు కూడా ఉన్నాయి. బజారుకూడా సుమారుగా బాగానే ఉంది. పండ్లు చౌక. క్రైస్తవ దేవాలయం చాలా గొప్పగా ఉంది.

ఆరుమైళ్ళు మోటారుమీద నారింజతోటలుదాకా వెళ్లేం. అక్కడ వేలాది నారింజ చెట్లున్నాయి. బంగారు చేపలుండే చెరువులున్నాయి. మోటారుఛార్జీ చాలాచౌక. 2 షిల్లింగుల 6 పెన్నీలు మాత్రమే.

ముష్టివాళ్ళ బాధమాత్రం మాల్టాలో చాలా అసహ్యమైనది. రోడ్డుమీద నడుస్తుంటే గుంపులు గుంపులుగా చికాకు కలిగించే ముష్టి వాళ్ళు చుట్టుముట్టేస్తారు. కొందరు ఊరు చూపిస్తామంటారు. మంచి చుట్టలు దుకాణాలు చూపిస్తామంటారు. లేకపోతే ప్రసిద్ధిచెందిన మాల్టా మిఠాయి 'నౌగట్' దొరికే దుకాణాలకు తీసుకుపోతామంటారు.

మాల్టానువదలి బ్రిండిసీ చేరేం. అది మంచి హార్బరు. దాని విశేషమంతే. ఒక రోజంతా కేవలం విలాసంగా గడపడం చాలాకష్టం. పూర్తిగా తొమ్మిది గంటల విశ్రాంతి లభించింది. నాలుగు గంటలైనా ఉపయోగించుకోలేకపోయాం.

బ్రిండిసీ విడచిన తర్వాత పోర్టుసెడ్ చేరుకున్నాం. దానితో యూరోపును వదిలేశాం. మెడిటరేనియన్ దగ్గర శెలవు పుచ్చుకున్నాం. సంఘంలోని పతితులను చూడాలంటేతప్ప పోర్టుసెడ్‌లో చూడదగినదేమీ లేదు. అది దుర్మార్గులకు, దుండగీడులకు నిలయం.

పోర్టుసెడ్‌నుంచి ఓడ బహునెమ్మదిగా సాగి యం. డి. లెస్సెప్స్ త్రవ్వించిన సూయజ్ కాలువలో ప్రవేశించాము. దాని పొడవు 87 మైళ్ళు. దానిని దాటడానికి ఓడ సుమారు 24 గంటలు పయనించింది. రెండు వైపులా భూమికి దగ్గరగానే ఉన్నాం. ఎక్కడో కొన్నిచోట్లతప్ప రెండు ఓడలు ఒకదాని ప్రక్కనొకటి ప్రయాణం చేయలేనంత సన్నంగా ఉన్నది కాలువ. రాత్రి ఆ దృశ్యం చాలాసుందరంగా ఉన్నది. ప్రతిఓడా చాలా పెద్దవైన విద్యుద్దీపాలు వెలిగించాలి. ఒకఓడ మరొకఓడకు ఎదురుగుండా వస్తున్నప్పుడు చూడడానికి చాలా సొంపుగా ఉంటుంది. ఎదుటి ఓడ దీపం కన్నులను మిరుమిట్లు గొల్పుతాయి.

మాకు 'గేంజిస్' ఎదురైంది. మేము హర్షధ్వానాలు చేశాము. గేంజిస్‌లోని ప్రయాణీకులు కూడా హర్షధ్వానాలు చేశారు. సూయజ్ పట్టణం కాలువ ఆచివర నున్నది. అక్కడ స్టీమరు అరగంటకూడ ఆగదు.

ఇక ఎర్రసముద్రంలో ప్రవేశించాము. అది మూడురోజులు ప్రయాణం. కాని చాలా ప్రయాసైన ప్రయాణం. అక్కడ వేడి భరించరానిది. స్టీమరులో కూచుంటే ఉక్కిపోయేది. బయటికొస్తే ఎండవేడిమి భరించడం కష్టమయ్యేది. ఉష్ణోగ్రతగల భారతదేశం చేరుకుంటున్నాము కదా అని ఇక్కడే అనుకున్నాం.

ఏడెన్ చేరుకునేటప్పటికి కాస్తచల్లగాలి తిరిగింది. బొంబాయి కెళ్ళే ప్రయాణీకులం ఇక్కడే 'అస్సాం' ఓడలోకి మారేం. ఈ మార్పు లండన్ వదలిపెట్టి ఒక కుగ్రామంలోకి వెళ్ళడంలాగు అనిపించింది. 'అస్సాం' ఓడ 'ఓషియానా'లో సగంకూడా లేదు.

రావడమొస్తే కష్టాలు ఒంటరిగారావు. 'అస్సాం' ఓడలో ఉండగా వర్షాకాలమవడంచేత తుఫానురేగింది. సాధారణంగా ఇండియన్ సముద్రం ప్రశాంతంగా ఉంటుంది. కనుక తుఫాన్ రేగినపుడది చాలా భీకరంగా ఉంటుంది. బొంబాయి చేరడానికి 5 రోజులు సముద్రంమీద గడపాలి.

రెండోరోజున అసలైన తుపాను పట్టింది. చాలామంది జబ్బుపడ్డారు. డెక్ మీదకొచ్చేసరికి నీరు ముంచెత్తేసేది. పళపళ చప్పుడవుతుండేది. ఏదో పగిలినట్లయేది. కేబిన్‌లో మెల్లగా పడుకోవడం సాధ్యంకాలేదు. తలుపులు పెళ్ళుపెళ్ళుమని కొడుతున్నాయి. సామాను సంచులు గంతులేస్తున్నాయి. పడకమీద దొర్లుతూ ఉండవలసిందే. ఒక్కొక్కప్పుడు ఓడ మునిగిపోతోందా అనిపించింది. భోజనాల బల్లదగ్గరకూడ ఏమీ సుఖంలేదు. స్టీమరు నీవైపు కొరిగేసరికి, ఫోర్కులు, చెంచాలు ఒళ్లోకి దొర్లిపోతుండేవి. వైన్‌సీసాలు, పులుసుపళ్లేలు బోరగిలి బట్టలన్నీ పసుపురంగైపోయేవి.

ఒకరోజు ఉదయం స్టూవర్డును 'ఇది గొప్పతుఫానేనా' అని అడిగేను. 'కాదండీ! ఇదొక లెక్కలోదికాదు' అని అన్నాడు. అసలైన తుఫానులో స్టీమరు ఏవిధంగా ఊగుతుందో చేత్తో అభినయించేసి చూపించాడు.

ఈవిధంగా పైకీ క్రిందకూ ఊగుతూ, జులై 5వ తేదీకి బొంబాయి చేరుకున్నాం. వర్షం జోరుగా పడుతున్నందున రేవుకు చేరడం కష్టమైంది. మొత్తంమీద సుఖంగా ఒడ్డుకుచేరి 'అస్సాం' కొకసలాం పెట్టేశాం.

ఓషియానాలోనూ అస్సాంలోనూ ఉన్న మనుష్యుల సంగతి ఏంచెప్పమంటారు! ఆస్ట్రేలియాలో ధనార్జన చేద్దామనే పుట్టెడాశతో వెళ్లేవాళ్లు కొందరు. కొందరింగ్లండులో చదువు ముగించుకొని సుఖజీవనం కోసం ఇండియా కెళ్లేవారు. కొందరు పనిలోకివచ్చి చేరేవారు. ఆస్ట్రేలియాలోనూ, ఇండియాలోనూ ఉన్న తమభర్తలను కలుసుకునేవారు కొందరు. కొందరు స్వదేశంలో ఆశాభంగం కలిగి, ఎక్కడికెడుతున్నారో తెలియకుండానే బయలుదేరినవారు. మరికొందరు ఏదో అఘాయిత్యం చేయాలని బయలుదేరినవారు. వారెక్కడికెడతారో భగవంతుడికే ఎరుక.

వీరందరి కోరికలు నెరవేరుతాయా? అదే ప్రశ్న. ఎంతో ఆశతో బయలుదేరుతారు. ఎంతో ఆశాభంగం పొందుతారు. అదీమానవుని మనస్సు. మనం ఆశలతోనే జీవిస్తున్నాం.

['ది వెజిటేరియన్' 16-4-1892.]

---

# 15. పత్వారీకి వ్రాసిన లేఖ

బొంబాయి,
సెప్టెంబరు 5, 1892.

ప్రియమైన పత్వారీ,

మీరు దయతో వ్రాసిన ఉత్తరానికి, మీరిచ్చిన సలహాకు నేనెంతో కృతజ్ఞుడను.

నేను క్రిందటిమాటు వ్రాసినట్లుగా, ప్రాక్టీసుకోసం పై దేశాలకెళ్లడం వాయిదా వేయవలసివచ్చింది. మా అన్నగారు దానికి చాలా వ్యతిరేకులు. ఏవిధమైన తంత్రాలులోకి దిగకుండానే, కథియవాడులో గౌరవప్రదంగా జీవించడానికేమీ సందేహపడనక్కరలేదని ఆయన అభిప్రాయము. ఏదెట్లాఉన్నా ఆయన ఈ విషయంలో చాలా నమ్మకంగా ఉన్నారు. సర్వ విధాలా నేనాయన అభిప్రాయాన్ని మన్నించడం న్యాయం. కనుక ఆయన సలహానే అనుసరిస్తాను. ఇక్కడ కూడా నాకు కొంతపని ఇస్తామని వాగ్దానాలుచేశారు. కనుక అధమం రెండు నెలలైనా ఇక్కడే ఉండాలనుకుంటున్నాను.

సారస్వత సంబంధమైన పనిని నేను స్వీకరించడంవల్ల, నా న్యాయ విద్యాభ్యాసానికేమీ ఆటంకం కలుగుతుందని నే ననుకోవడంలేదు. పైగా అలాంటిపనిలో నాకు కలిగే జ్ఞానంవల్ల, పరోక్షంగా నా న్యాయవాదవృత్తికి లాభిస్తుంది కూడా. అంతే కాకుండా అందువల్ల ఏవిధమైన మనస్తాపంలేకుండా స్వేచ్ఛగా పనిచేయడానికి కూడా వీలుంటుంది. కాని ఆపని మాత్రమెక్కడుంది? అది దొరకడమేమంత తేలిక విషయంకాదు.

నేను రాజకోటలో నున్నపుడు మీరిచ్చిన వాగ్దానమునుబట్టి నేను ఋణం ఇవ్వవలసినదని అడిగేను. ఆ విషయం మీతండ్రిగారికెంత మాత్రంతెలియకూడదని నేను అంగీకరిస్తాను. ఇప్పుడా

విషయాన్ని పట్టించుకోకండి. నేను మరొకచోట ప్రయత్నిస్తాను. ఒక సంవత్సరం ప్రాక్టీసు చేసినంత మాత్రన ఎంతో మిగులదని నాకు తెలుసును.

మా అన్నగారు సాచిన్ నవాబుగారి కార్యదర్శిగా సాచిన్‌లోనే ఉంటున్నారు. ఆయన రాజకోట వెళ్లేరు. కొద్ది రోజుల్లో తిరిగివస్తారు.

కాశీదాసు, ధంధూకాలోనే స్థిరవాసమేర్పరచుకుంటానని తెలియచేసినందుకు సంతోషిస్తున్నాను.

కులంవారి ప్రాతికూల్యత ఎప్పటివలెనే ఎక్కువగానే ఉన్నది. నన్ను కులంలోనికి రానివ్వకుండా పట్టుబడుతున్న ఒక వ్యక్తి మీదనే సర్వమూ ఆధారపడున్నది. ఒక్కమనిషి అధికారానికి దాసులై గొర్రెలమందలా ఆయన వెంటబడే కులస్థులను గురించి నేను విచారపడుతున్నాను కాని నావిషయమై నాకంత చింతలేదు. ఏవో అర్థంలేని కొన్ని తీర్మానాలను ఆమోదించి, వారికున్న ద్వేషాన్ని అపరిమితంగా వెళ్లగ్రక్కుతున్నారు. వారి వాదనలో మతానికెక్కడా స్థానంలేదని వేరే చెప్పనక్కరలేదు. వాళ్లలో ఒకనిగా ఉండడానికి వారినాశ్రయించి, బతిమాలి, బామాలి స్తోత్రపాఠంచేయడంకన్న, వారిజోలి శొంఠిలేకుండా ఉండడం మంచిదికాదా? ఏమైనా, నేను రోజులనుబట్టి నడవకతప్పదు.

గుజరాత్‌లో ఎక్కడో వ్రజలాల్ భాయి, 'కార్భారి' (పరిపాలకుడు) గా వెదుకుతున్నాడని తెలుసుకుని చాలా సంతోషించాను.

నీ దస్తూరీ చాలా బాగుంటుంది. నీలాగున వ్రాయాలని బుద్ధిపుట్టింది. కాని బాగా అనుకరించలేకపోయాను.

భవదీయుడు,
మో. క. గాంధీ.

[గాంధీజీ స్వహస్తంతో వ్రాసిన లేఖనుండి]

# 16. పరిచయం

ప్రిటోరియా,
16 సెప్టెంబర్, 1893

నేటాల్ ఎడ్వర్టైజర్ పత్రికా సంపాదకునకు,

అయ్యా,

ట్రాన్స్‌వాల్ ఎడ్వర్టైజర్ పత్రికకు, మిస్టర్ పిళ్ళె వ్రాసిన **ఉత్తరం*** నకలు మీ పత్రికలో ప్రచురింపబడినట్లుగా నాకు తెలియ వచ్చింది. డర్బాన్‌కు వచ్చిన ఆ దురదృష్టవంతుడైన, ఇండియన్ బారిష్టరును నేనే. ప్రస్తుతం ప్రిటోరియాలో ఉంటున్నాను. నేను పిళ్ళెనుకాను. బి. ఏ. కూడా కాను.

భవదీయుడు,
యం. కె. గాంధీ.

[*నేటాల్ ఎడ్వర్టైజర్* 18–9–1893]

---

*ఫుట్‌పాత్ మీదనుంచి తనను దౌర్జన్యంగా నెట్టివేశారని, మిస్టర్ పిళ్ళె ఫిర్యాదుచేశాడు.

# 17. భారతీయ వ్యాపారి

ప్రిటోరియా,
19 సెప్టెంబర్, 1893.

నేటాల్ ఎడ్వర్టైజర్ పత్రికా సంపాదకునకు,

అయ్యా,

ఈ దిగువ వ్రాసిన విషయానికి, మీ పత్రికలో స్థానం ఇచ్చినట్లయితే, మీకు నేనెంతో కృతజ్ఞుణ్ణి. ట్రాన్స్‌వాల్ ఎడ్వర్టైజర్ పత్రికలో, యీమధ్య మిస్టర్ పిళ్ళె, చాలాఅసభ్యంగా వ్రాశాడని, కొంతమంది పెద్దమనుష్యులూ మరికొన్ని పత్రికలూ తీవ్రంగా విమర్శించాయి. "కపటులు, దుర్మార్గులైన ఆసియా వ్యాపారస్థులు" "మన సంఘపు జీవనాళాలను కొరికి తినివేస్తున్న పుండు" "అర్థ అనాగరిక జీవితాన్నిగడిపే యీ చీడపురుగులు" అని కఠోరమైన భాషలో వ్రాయబడిన మీ సంపాదకీయాలవల్ల మిస్టర్ పిళ్ళె వ్రాసిన ఉత్తరంలోని విషయాలను కాదనగలుగుతున్నారా అని ఆశ్చర్య పడుతున్నాను. ఏమైనా శైలి విషయంలో ఒక్కొక్కరి అభిరుచి ఒక్కొక్క విధంగా ఉంటుంది. ఐనా ఒకరి భాషాశైలి విషయమై విమర్శించి తీర్పుచెప్పటానికి నాకు అధికారం లేదనుకుంటున్నాను.

ఐనా నిరుపేదలైన భారతీయవ్యాపారస్థులపై యీ కోప ప్రదర్శనం దేనికి? ఈ కాలనీ నాశనం కాబోయే టటువంటి ప్రమాద పరిస్థితులలో ఏలాఉందో తెలుసుకోవటంకూడా కష్టమే. 15 వ తేదీ మీ సంపాదకీయంవల్ల, నాకు తెలిసినంతవరకు దీనికిగల కారణాలను యీ క్రింది మాటలలో చెప్పవచ్చు. "ఒక ఆసియా దేశీయుడు దివాలాతీసి, పౌండుకు ఐదు పెన్నీలను మాత్రమే చెల్లించాడు: ఆసియా వ్యాపారికి యితనొక నమూనా. చిన్న యూరోపియన్ వ్యాపారస్థుని బయటకు నెట్టివేశాడు."

ఆసియా వ్యాపారస్థులలో చాలామంది దివాలాతీసి, అప్పు యిచ్చిన వారికి చాలాతక్కువ చెల్లిస్తారని అంగీకరిద్దాం. (ఇది ఎంతమాత్రం నిజంకాదు). వారిని కాలనీ నుంచిగాని, దక్షిణాఫ్రికా నుంచిగాని తరిమివేయటానికి, యిది సరియైన కారణమేనా ? ఇన్‌సాల్వెన్సీ చట్టంలోగల లోపంవల్ల, వీరు అప్పుయిచ్చిన వారిని నాశనంచేయగల అవకాశాలున్నట్లుగా దీనివల్ల వ్యక్తం కావటం లేదా ? చట్టం యిటువంటి పద్ధతుల నవలంబించటానికి అవకాశాన్ని కలుగచేస్తే, సాధారణంగా, ప్రజలు దానిని ఉపయోగించుకుంటారు. యూరోపియన్లు, ఇన్‌సాల్వెన్సీ కోర్టులవల్ల లభించే రక్షణను, వినియోగించుకోరా? మాటకుమాటగా భారతీయ వ్యాపారస్థులను సమర్థించడం నా ఉద్దేశ్యం ఎంతమాత్రం కాదు. భారతీయులు యిటువంటి మార్గాలను అవలంబిస్తున్నారంటే, నాకు చాలా విచారంగాఉంది. వ్యాపారంలో, అగౌరవమైన పద్ధతులతో సంపర్కం పెట్టుకోనటువంటి కీర్తి, భారతదేశానికి ఉంది. అటువంటి దేశానికి యిది నిజంగా అవమానకరమైన విషయమే. చట్టం కలుగచేసిన దివాలాతీసే సదుపాయాన్ని వినియోగించుకున్న కారణంగా, భారతీయవ్యాపారస్థులను బహిష్కరించటం అంత సమంజసంగా, నాకు కనిపించటంలేదు. చట్టం యిటువంటి సంఘటనలు తరచు జరుగకుండా అరికట్టగలదు. పైగా టోకు వ్యాపారస్థులు కొంచెం జాగ్రత్తగా ఉండటంవల్లకూడా. వీటిని ఆపుజేయగలరు. అదీ కాకుండా యీవ్యాపారస్థులు, యూరోపియన్ వర్తకులవద్దనుంచి అప్పుతెచ్చుకోగల్గుతున్నారన్న విషయం వల్ల, వాళ్లు మీరు వర్ణించినంత చెడ్డవారు కాదని వ్యక్తం కావటం లేదా ?

ఒకచిన్న యూరోపియన్ వ్యాపారస్థుడు బయటకు పోవలసి వస్తే, ఆ తప్పు యీవ్యాపారస్థులదేనా ? దీనివల్ల వ్యాపారంలో భారతీయ వ్యాపారస్థునకుగల అధికసమర్థత బయటపడుతోంది. ఈ సామర్థ్యంలోగల ఆధిక్యతే, అతని బహిష్కరణకు కారణమనుకుంటున్నాను. ఇది న్యాయమేనా అని మిమ్మల్ని అడుగుతున్నాను. ఒక సంపాదకుడికంటె, మరొక సంపాదకుడు తన పత్రికను బాగా నడుపుకుంటున్నాడనుకుందాం.

ఆ విధంగా ప్రత్యర్థిని రంగంనుంచి బయటకు నెట్టివేసినప్పుడు, ఆ సంపాదకుని, "నీవు సమర్థుడివి, అందువల్ల పడిపోయిన ఆ సంపాదకునకు స్థానంకలుగచేయి" అని అడిగితే, అతనికి ఎలా ఉంటుంది ? అధికసామర్థ్యత ప్రోత్సహింపదగినదికాదా ? తక్కిన వారుకూడా అంతటి స్థానానికి రావటానికి, అది ఉత్సాహ కారణం కాకూడదా ? న్యాయమైన పోటీని నాశనంచేయటం తగిన విధానమేనా ? తన మర్యాదకు భంగం కాదనుకుంటే, యూరోపియన్ వ్యాపారస్థుడు భారతీయ వ్యాపారస్థుని ఆదర్శంగా తీసుకుని తక్కువ ఖర్చుతో వ్యాపారంచేయడం, నిరాడంబర జీవితం గడపటం నేర్చుకోకూడదా ? "ఏ విధంగా నీ విషయంలో ఇతరులు మసులుకోవాలని కోరుకుంటావో, అదేవిధంగా యితరుల పట్లకూడా నీవు ప్రవర్తించు".

ఈ దౌర్భాగ్యపు ఆసియా దేశీయులు, అర్ధ అనాగరిక జీవితాన్ని గడుపుతారని, మీరంటున్నారు. అర్ధ అనాగరిక జీవితం పట్ల మీ అభిప్రాయాలు ఏమిటో తెలుసుకోవాలని నాకు చాలా కుతూహలంగా ఉంది. వారు గడిపే జీవితం విషయమై నాకు కొంత తెలుసు. అందమైన, ఖరీదైన తివాసీగల గది, అలంకరణకు వేలాడే తోరణాలు, ఖరీదైన టేబిల్ క్లాత్ వేసిన డిన్నర్ టేబిల్ (బహుశా వార్నిష్ చేయనిది), దానిమీద అందమైన పూల గుత్తులు, సారా, పుష్కలంగా పందిమాంసం, గొడ్డుమాంసం, ప్రత్యేకంగా ఉష్ణోగ్రతకు పనికివచ్చే తెల్లటి దుస్తులు, (ఇటువంటి దుస్తులు, వేసవిలో తీవ్రమైన ఎండలకారణంగా, యూరోపియన్లు కోరుకుంటారని నేను విన్నాను) బీర్, పొగాకు, నగిషీచేతికర్ర, బంగారు గడియారపుగొలుసు, దర్జాగా సమస్త సదుపాయాలుగల కూర్చుండే గది మొదలైన పైన చెప్పినవి లేనటువంటి జీవితం, అర్ధ అనాగరిక జీవితమని మీరనుకుంటే ; ఇంకా ఒక్కమాటలో చెప్పాలంటే, అతి నిరాడంబర జీవితమని ఎవరైనా దేన్ని గురించి అనుకుంటారో, అది అర్ధ అనాగరిక జీవితమైతే : అప్పుడు భారతీయ వ్యాపారస్థులు తప్పకుండా తమ తప్పును అంగీకరించవలసి ఉంటుంది.

అటువంటి పరిస్థితులలో, మహత్తరమైన యీవలస నాగరికత నుంచి, అలాంటి అర్ధ నాగరికత్వాన్ని ఎంత త్వరగా నిర్మూలనం చేస్తే అంత మంచిది.

నాగరిక రాష్ట్రాలనుంచి కొందరి ప్రజలను బహిష్కరించ దగిన కారణాంశాలు వీరి విషయంలో అసలు లేవనుకుంటాను. రాజకీయాల ప్రసక్తికి వీరు పోనేపోరు. కనుక రాజకీయంగా ప్రభుత్వానికి వీరు ప్రమాదకరమైన వ్యక్తులు కారని నే ననే మాటను మీరు అంగీకరిస్తారనుకుంటాను. వీరేమంత ప్రసిద్ధిచెందిన దోపిడీదొంగలు కారు. ఏ భారతీయ వ్యాపారైనా, జైలు శిక్ష పడినట్లుగాని, అథవా దొంగతనం దోపిడీ మొదలైన తదితర నేరాలుచేసి ముద్దాయిగా నిలబడినట్లుగాని ఒక్క సంఘటనకూడా లేదని నా నమ్మకం. (ఇది తప్పైతే తెలియచేయండి) మద్య పానాది దురలవాట్లేమీ వారికి లేనందువల్ల వారు బహుశాంతి యుతమైన జీవితాన్ని గడుపుతున్నారు.

కాని వీరేమీ ఖర్చుపెట్టరని, ఇప్పుడు మనం తర్కిస్తున్న మీ పత్రికా సంపాదకీయం అంటోంది. వీరేమీ ఖర్చుపెట్టరా ? బహుశా గాలి లేక ఊహల మీద జీవిస్తున్నారనుకుంటాను. 'వేనిటీ ఫెయిర్' లో 'బెకీ' ఏమీతినకుండా ఒక సంవత్సరం జీవించా డని మనకు తెలుసు. ఇక్కడ ఒకవర్గం వారంతా అదేపనిచేస్తున్న ట్లుగా తెలుసుకుంటున్నాం. బహుశా దుకాణాలకు అద్దె, పన్నులు, మాంసానికి ఖరీదు, కిరాణాకొట్టువానికి బిల్లులు, గుమస్తాలకు జీతం మొదలైనవాటికేమీ, వీరు చెల్లించనక్కరలేదని అనుకోవలసి వస్తోంది. ప్రస్తుతం ప్రపంచంలోని వర్తకపు క్లిష్ట పరిస్థితుల్లో, ప్రతిఒక్కరూ, పైన పేర్కొన్న అదృష్టవంతులైన వ్యాపారుల వర్గానికి చెందాలని కోరుకుంటారను కుంటాను.

ఒకసారి అంతా పర్యావలోకనం చేసిచూస్తే, వీరి నిరాడంబ రత్వం, మద్యపానాలను ముట్టకపోవటం, శాంతియుతమైన జీవితాన్ని గడపడం, అన్నిటి కంటే, వ్యాపార లక్షణాలూ

పొదుపరి అలవాట్లూ అందరికీ ఆదర్శప్రాయం కాదగినవే అయినా, యీ ఆసియావ్యాపారస్తులపై ద్వేషం, ఏహ్యాభావం కలుగటానికి మూలకారణాలనిపిస్తోంది. అదీగాక వీరు బ్రిటిష్ పౌరులు. ఇదంతా క్రైస్తవులనబడే వారికి తగినదేనా ? ఇది మంచి పద్ధతేనా ? ఇదా న్యాయం ? ఇదా నాగరికత ? సమాధానంకోసం నేను ఎదురు చూస్తాను.

దీనిని మీ పత్రికలో ప్రచురిస్తారని ఆశిస్తూ ముందుగా ధన్యవాదాలర్పిస్తున్నాను.

భవదీయుడు,

యం. కె. గాంధీ.

[*'నేటాల్ ఎడ్వర్టైజర్'* 23-9-1893.]



# 18. క్రొత్త గవర్నరుకు స్వాగతం

టౌన్‌హాల్,
డర్బాన్,
28 సెప్టెంబర్, 1893

ఘనత్వవహించిన సర్ వాల్టర్ హీలీ హాచిన్‌సన్,

కె. సి. యం. జి. వగైరా గారికి

ఘనతవహించిన ప్రభువులు చిత్తగించేది.

నేటాల్ కాలనీకి జెందిన మహమ్మదీయ, భారతీయ వర్గాలకు చెందిన సభ్యులమైన మేము, యీ దిగువ సంతకములు చేసినవారము, మహా ఘనతవహించిన మహారాణి, ఇండియా చక్రవర్తిని తరఫున, ప్రతినిధిగా తాము యిక్కడకు వచ్చిన సందర్భంలో స్వాగతం చెపుతున్నాం.

ఈ కాలనీ, యిక్కడి పరిసరాలు, ప్రభువులకు ఆహ్లాద కరంగా ఉంటాయనీ, నేటాల్‌లో కొత్త తరహా ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసే కార్యక్రమం ఏ ఇబ్బందులు లేకుండా, స్వేచ్ఛగా, ఉత్సాహంగా సాగుతుందని నమ్ముతున్నాం.

దినదినాభివృద్ధిజెందుతున్న, భారతీయ ప్రాభవం కారణంగా, నేటాల్‌లోని భారతీయవర్గంవారి ప్రత్యేక సమస్యలు ప్రభువుల దృష్టిలో ఎల్లప్పుడూ ఉంటాయని నమ్ముతున్నాం. ఘనతవహించిన మహారాణి ప్రతినిధిగా, ప్రభువులు మా వర్గంవారిని ఆదరించగలరని దృఢమైన నమ్మకంతో, శ్రీవారి అనుమతితో మిమ్ములను వేడుకుంటున్నాం.

ఘనతవహించిన ప్రభువులకూ, హీలీ హాచిన్సన్ సాధ్వికీ, తమరు ఈ కాలనీలో ఉన్నంతకాలం, సర్వసంపదలు కలుగు గాక అని అభిలషిస్తూ శలవు తీసుకుంటున్నాం.

మేము
ప్రభువుల వినయపూర్వక సేవకులము,
దాదా అబ్దుల్లా
యం. సి. కామరుద్దీన్
ఆమద్ తిల్లీ
దావూద్ మహామ్మద్
ఆమద్ జీవా
పార్సీ రుస్తుంజీ
ఎ. సి. పిళ్ళై

[*'నేటాల్ మెర్క్యూరీ'* 30–9–1893.]

---

# 19. భారతీయ ఓటు

ప్రిటోరియా,
29 సెప్టెంబరు, 1893

నేటాల్ ఎడ్వర్టైజర్
పత్రికా సంపాదకులకు :—

ఆర్యా,

ఈ క్రింది విషయాన్ని దయతో మీ పత్రికలో ప్రచురిస్తారని ఆశిస్తున్నాను.

మీ 19 వ తేదీ పత్రికలో, ముందు ఏర్పడబోయే ఆసియా వ్యతిరేకుల సంఘంయొక్క కార్యక్రమం, మీచే నిర్ణయింపబడి ప్రచురింపబడినది. దానికి సంపూర్ణంగా జవాబు వ్రాయటం చాలా కష్టమైనపని. అది పత్రికలకు వ్రాసే ఉత్తరంద్వారా తెలియజేయటం సాధ్యంకాదు. ఐనప్పటికీ, మీ అనుమతితో రెండు విషయాలను గురించి వ్రాస్తాను. "కూలీలఓట్లు, యూరోపియన్ల ఓట్లను ముంచివేయటం" "భారతీయులు ఓటుచేయతగనివారు" అనునవే ఆ రెండు విషయాలు.

ప్రథమంగా మిమ్మల్ని వివేకం, నిజాయితీ ప్రదర్శించమని కోరుతున్నాను. బ్రిటిష్‌జాతి నిజాయితీకి ప్రసిద్ధిచెందింది. ఈ సమస్య విషయంలో, మీరుగాని, మీ పత్రికా పాఠకులుగాని, పాక్షిక దృష్టితో చూడాలని నిర్ణయించుకున్నపుడు, నే జెప్పే నిజపరిస్థితులూ, నా వాదనా, నా మాటలలోని న్యాయాన్ని మీరు గుర్తించేటట్లుగా చేయలేవు. ఈ సమస్యకు సంబంధించిన నిజ పరిస్థితి తెలుసుకోవాలంటే ప్రశాంత చిత్తంతో కూడిన నిర్ణయం, ఆవేశ రహితమైన నిష్పాక్షిక విచారణా చాలా అవసరం.

భారతీయుల ఓట్లు, యూరోపియన్ల ఓట్లను, మించిపోతా యన్న అభిప్రాయం, ఇంతలో జరిగేది కాదని కనిపించడంలేదా? స్థూలంగాచూచే ఏ పరిశీలకుడైనా సరే అటువంటిది జరగటం అసంభవమని తెలుసుకో కలుగుతాడు. యూరోపియన్ ఓటును మించటానికి కావలసిన ఆస్తిసంబంధమైన యోగ్యతలను, ఎంత మంది భారతీయులు కలిసినాకాని సంపాదించలేరు.

భారతీయులు రెండువర్గాలవారుగా ఉన్నారు. వ్యాపా రస్తులు, కూలీలు. రెండవ వర్గంవారు మెజారిటీగా ఉన్నారు. చట్టరీత్యా వీరికి ఓట్లులేవు. పేదరికంతో బాధపడుతూ, కడుపు మాడే కూలిమీద వీరు నేటాల్‌కు వచ్చారు. తమకు ఓటు చేయటానికి, హక్కు కలుగచేసే ఆస్తి లభ్యమవుతుందని, వీరు కల లోనైనా అనుకోగలరా? శాశ్వతంగా నేటాల్‌లో ఎవరైనా ఉండి పోతారని చెప్పవలసివస్తే, వీరినే చెప్పాలి. మొదటి వర్గానికి చెందిన వారిలో కొంతమందికే ఆస్తిఅర్హతలున్నాయి. కాని వీరు నేటాల్‌లో శాశ్వతంగా ఉండిపోరు. పైగా వీరిలో చాలా మందికి చట్టరీత్యా ఓటు చేయడానికి హక్కు ఉన్నప్పటికీ, దానిని వినియోగించుకోవటంలో శ్రద్ధచూపరు. తమ స్వంతదేశంలో కూడా, భారతీయులు ఒకవర్గంగా, ఎప్పుడూ తమకుగల రాజ కీయ హక్కులను ఉపయోగించుకోరు. ఎప్పుడూ ఆధ్యాత్మిక చింతలో మునిగితేలుతూ ఉండటంవల్ల, రాజకీయాలలో ప్రముఖ పాత్రను వహించాలనే ఉద్దేశ్యమే వీరికి ఉండదు. వారికేమీ పెద్ద రాజకీయ ఆశయాలు లేవు. వీరు ఇక్కడికి వచ్చినది రాజకీయ వేత్తలవుదామని కాదు. న్యాయంగా జీవితం గడుపుదామని వచ్చారు. కొంతమంది తూచా తప్పకుండా, నిజాయితీగా జీవిం చకపోవటం నిజానికి విచారకరమైన విషయమే. అటువంటప్పుడు భారతీయులఓటు ప్రమాదంగా పెరిగిపోతుందనుకో డానికి ఆధారంలేదని తోస్తుంది.

భారతీయులకు గల కొద్దిపాటి ఓట్లైనా నేటాల్ రాజ కీయాలలో మార్పు తేలేవు. భారతీయ ప్రాతినిధ్యంకోసం, భార తీయపార్టీ ఆందోళన చేస్తున్నదన్న పుకారంతా వట్టిభ్రమగా

కనిపిస్తోంది. ఎందుకంటే ఎన్నిక ఎప్పుడూ, యిద్దరి తెల్లవారి మధ్యనే. అటువంటప్పుడు కొన్ని భారతీయుల ఓట్లు ఉంటే మాత్రం ఏంపోయింది ? ఆ కొద్దిపాటి ఓట్లు చేయగలిగినదైనా, ఒక తెల్ల ప్రతినిధిని తెచ్చిపెట్టడం తప్ప ఇంకేముంటుంది ? ఆ ప్రతినిధైనా తానుచేసిన వాగ్దానాలను నిలబెట్టుకున్నపుడే, అసెంబ్లీలో వీరికి ఉపకారం చేయగలడు. అటువంటి ఒకరిద్దరు సభ్యులతో, ఇండియన్ పార్టీ తయారవుతుందనుకోవడంకూడా భ్రమే. పరివర్తనం కలుగచేసే దైవికశక్తిని కోల్పోయి అరణ్యంలో రోదనం చేస్తున్న జాన్‌ను, (జాన్ది బాప్టిస్టు) నిజానికి ఆ అసెంబ్లీలోని ఒక రిద్దరు సభ్యులు పోలిఉంటారు. వివిధమైన స్వల్ప ప్రయోజనాల కోసం, ఏర్పడినట్టి శక్తివంతమైన చిన్నపార్టీలైనా, పార్లమెంటులో చేయగలిగినది చాలాస్వల్పంగా ఉంటుంది. వారు చేయగల్గిన దైనా ఫస్ట్‌లార్డ్‌ను ఏవో చిన్న ప్రశ్నలువేసి ఎగతాళి చేయడం తప్ప వేరేమీ ఉండదు. ఆ విధంగా మర్నాడు ఉదయం పత్రికలలో తమపేర్లు చూచుకుని సంతృప్తి పడుతారు.

భారతీయులు ఓటు చేయదగిన నాగరికులు కారనీ, స్వదేశీయులకంటె వీరేమీ ఎక్కువకాదనీ, నాగరికత కొలబద్దతోచూస్తే యూరోపియన్లతో సమానులు కారనీ మీ రనుకుంటూఉండవచ్చు. అదేం నిజంకాదు. అంతా నాగరికత అన్న పదానికిగల అర్థంమీద ఆధారపడి ఉంటుంది. ఈ విషయమై సమగ్రమైన విచారణ చేసినమీదట తెలియవచ్చిన సమస్యలనుగురించి యిక్కడ తర్కించడంకూడా సాధ్యంకాదు. భారతదేశంలో, వీరు అటువంటి హక్కులను అనుభవిస్తున్నారని మీకు తెలియ చేస్తున్నాను. ఇండియన్ మాగ్నాకార్టా అనదగిన, 1858 నాటి మహారాణి ప్రకటనలో యిలావుంది.

> "ఇతర పౌరులపట్ల మాకు ఏవిధమైన విధిఉందో, అదేవిధి భారతీయవలస ప్రాంతాలలోని ప్రజలపట్ల కూడా మాకు ఉన్నది. దేవుని ఆశీర్వాదంతో, ఈ విధులను విశ్వాసంతోనూ, న్యాయబుద్ధితోనూ నిర్వహిస్తాము. అదీకాక మా పౌరులు ఏ జాతికిచెందినా, ఏ తెగకు చెందినా, వారు విద్యావంతులూ, సమర్థులూ, విశ్వాసపాత్రులూ,

అర్హులూ అయినట్లయితే, ప్రభుత్వ ఉద్యోగాలలో వారిని పక్షపాతం లేకుండా స్వేచ్ఛగా చేర్చుకోవాలని మా కోరిక."

భారతీయులకు సంబంధించినంతవరకు యిటువంటివాటిని ఎన్నో చూపించగలను. కాని యిప్పటికే తమ సౌజన్యం ఆధారంగా తీసుకుని, హద్దులను దాటినానేమోనని భయపడుతున్నాను. అయినా యీ క్రింది విషయాలను చెప్తాను. ప్రస్తుతం ప్రధాన న్యాయమూర్తిగా కలకత్తా హైకోర్టులో ఒక భారతీయుడు వ్యవహరిస్తున్నాడు. అలహాబాద్ హైకోర్టులో భారతీయుడు ఒక జడ్జి. ఆ జడ్జి మతస్థులే యీ భారతీయ వ్యాపారస్థులుకూడా. ఒక భారతీయుడు బ్రిటిష్ పార్లమెంటులో సభ్యుడు. 16 వ శతాబ్దంలో, భారతదేశాన్ని పరిపాలించి, అక్కడ జీవించిన అక్బర్ చక్రవర్తి అడుగుజాడలలోనే, చాలావరకు, బ్రిటిష్ ప్రభుత్వం నడుస్తున్నది. ఆ అక్బర్ ఒక భారతీయుడు. ప్రస్తుతపు భూసంస్కరణపద్ధతి, భారతీయుడూ, గొప్ప ఆర్థికశాస్త్రవేత్తాఅయిన తోడర్ మల్ పద్ధతికి నమూనా. అక్కడక్కడ కొద్దిమార్పులతో ఇదంతా నాగరికతాఫలితంగాక, అర్ధ అనాగరికతకు ఫలితమైనట్లయితే, నాగరికత అంటే ఏమిటో ఇక మీ వద్ద నేను నేర్చుకోవలసి ఉంటుంది.

ఇంతగా నిరూపించిన పిదపకూడా, మీరు విద్వేషాలను రగుల్కొల్పి, యూరోపియన్‌వర్గం వారిని భారతీయవర్గంపై ఉసికొల్పితే, నిజంగా మీరు ఘనులే.

భవదీయుడు,
యం. కె. గాంధీ.

[ 'నేటాల్ ఎడ్వర్టైజర్' 3-10-1893.]

# 20. శాకాహార తత్త్వప్రచారం

ప్రిటోరియా నుంచి యం. కె. గాంధీ ఒకపెద్దమనిషికి వ్రాసిన ఉత్తరంలో యిలా వ్రాస్తున్నారు :

దక్షిణాఫ్రికాలో, కాయగూరలు పండించే తోటమాలికి మంచి అవకాశాలున్నాయి. భూమి సారవంతమైన దైనప్పటికీ, యిక్కడ వ్యవసాయం బాగానిర్లక్ష్యం చేయబడింది.

నాయింటి యజమానురాలు ఒక ఆంగ్లస్త్రీ. ఆవిడ శాకాహారిగా మారేటట్లుగా చేయగలిగేను. పిల్లల్ని కూడా శాకాహారం మీదనే పెంచి పెద్దవారిని చేయటానికి ఆమె అంగీకరించింది. కాని ఆ నిర్ణయాన్ని ఆమె నిలబెట్టుకోలేదని అనుకుంటాను. సరియైన కాయగూరలు యిక్కడ దొరకవు. దొరికినా ఖరీదెక్కువ. పళ్లూ, పాలూకూడా ధర ఎక్కువే. పైగా ఆవిడకు రకరకాల కాయగూరలు దొరికేట్టు చూడటం చాలా కష్టమైనపని. అందువల్ల ఎక్కువ ఖర్చు అవుతోందని ఆమెకు తోచటంతోనే, దీనిని వదలివేస్తుంది.

* "ప్రాణాధారమైన ఆహారం" అని మిస్టర్ హిల్ వ్రాసిన వ్యాసం నాకు బాగానచ్చింది. త్వరలోనే యీ విషయమై మళ్లీ ఒకసారి ప్రయత్నించి చూద్దామనుకుంటున్నాను. ఇదివరకు బొంబాయిలో

---

* 1889 ఫిబ్రవరి 4వ తేదీన జరిగిన మొదటి నాలుగు మాసాల సమావేశంలో, వెజిటేరియన్ సొసైటీ అధ్యక్షుడు మిస్టర్ ఎ. యఫ్. హిల్స్ ప్రథమంగా 'ప్రాణాధారమైన ఆహారం' అను సిద్ధాంతాన్ని ప్రచారంచేశారు. పళ్లు, ధాన్యం, కాయలు, అపరాలు మొదలైన ఆహారపదార్థాలలో, బలం, సత్తువ, సూర్యకిరణాలవల్ల లభించేశక్తి మొదలైనవి ఉన్నాయనే ఒక ముఖ్యసిద్ధాంతాన్ని ఆయన లేవదీశారు. హిల్సు: 'ది ఫస్ట్ డైట్ ఆఫ్ పేరడైజ్' (స్వర్గంలో మొదటి భోజనం.) 'ప్రాణప్రదమైన ఆహారము' గురించి గాంధీజీ చేసిన ప్రయోగములు వచ్చే వ్యాసంలో చూడనగును.

ఉన్నపుడు ఒకసారి ప్రయత్నించి చూసిన విషయం మీకు జ్ఞాపకం ఉన్నదను కుంటాను. సరిగా తగినంతకాలం ప్రయత్నించి చూడకపోవటంవల్ల యీ సిద్ధాంతం విషయంలో ఒక నిశ్చితాభిప్రాయానికి రాలేకపోయాను.

దయుంచి మిత్రులందరిని అడిగినానని చెప్పు".

['*ది వెజిటేరియన్*' 30-9-1893.]



# 21. పౌష్టిక ఆహారం విషయంలో పరిశోధన

ఈ పరిశోధనను గురించి విపులంగా చెప్పేముందు, నేనొక్క విషయం చెప్పదలచుకున్నాను. బొంబాయిలో ఉన్నపుడు ఒక వారం రోజులపాటు దీనిని ప్రయత్నించి చూచాను. అప్పట్లో కొంతమంది మిత్రులను ఆదరించవలసియుండటంవల్ల, తదితర సాంఘిక మర్యాదలవల్ల దీనిని వదలివేయవలసి వచ్చింది. ఈ పౌష్టికాహారం నాకు బాగాపడింది. దానిని యింకా కొనసాగించి ఉన్నట్లయితే, నా తత్త్వానికి బాగాసరిపోయేదే.

ఆ పరిశోధన చేస్తున్నపుడు నేను గమనించిన విషయాలను వివరిస్తున్నాను.

**22 ఆగస్టు 1893:** పౌష్టికాహారం విషయమై పరిశోధన ప్రారంభించాను. అంతకుముందు రెండు రోజులనుంచి, నాకు బాగాజలుబు చేసినట్లుగా వుంది. ప్రొద్దున్నే రెండుచెంచాల గోధుమ, ఒక చెంచా బఠాణి, బియ్యం, ద్రాక్ష, రెండు నారింజకాయలు, ఒక కప్పు కోకో తీసుకున్నాను. పప్పుధాన్యాలు అంతకుక్రితం రాత్రి నానవేసి ఉంచాను. ఈ ఆహారం తీసుకొనటం 45 నిమిషాలలో ముగించాను. ప్రొద్దున్న బాగాఉత్సాహంగావుంది. సాయంకాలానికి తలనొప్పివచ్చి, నిరుత్సాహమేర్పడింది. మధ్యాహ్నం, మామూలుగా తినే రొట్టె, కాయగూరలు మొదలైనవి తీసుకున్నాను.

**23 ఆగస్టు :** ఆకలివేయటంవల్ల నిన్న సాయంకాలం బఠాణీలు తిన్నాను. అందువల్ల నిద్ర బాగాపట్టలేదు. ప్రొద్దున్న లేచేసరికి నోరంతా అరుచిగా వుంది. నిన్నటి మాదిరిగానే ప్రొద్దున్న, మధ్యాహ్నం కూడా ఆహారం తీసుకున్నాను. రోజంతా మందకొడిగావుంది. అయినా కొద్దివర్షంకూడా పడింది. తలనొప్పిగాని, జలుబుగాని చేయలేదు. *బేకర్‌తో కలసి టీ త్రాగాను. నా కేమీ అది పడినట్లులేదు. కడుపులోనొప్పి ప్రారంభమైంది.

---

* ఎ. డబ్ల్యు. బేకర్ ప్రిటోరియాలో లాయరు. మత బోధకుడు. తరచు గాంధీజీతో క్రైస్తవ మతాన్ని గురించి చర్చిస్తుండేవాడు. ఆయనను ప్రిటోరియాలోని క్రైస్తవ స్నేహితులకు పరిచయం చేశాడు.

**24** ఆగస్టు : ప్రొద్దున్న లేచేసరికి కడుపు నిండుగావుంది. మామూలుగా ప్రొద్దున్న తీసుకునే ఆహారమే తీసుకున్నాను. బటాణీలు మాత్రం చెంచాకుబదులు అరచెంచాడు మాత్రమే తిన్నాను. మామూలు మధ్యాహ్న భోజనం ఏమీ బాగుండలేదు. రోజంతా అజీర్తిగావుంది.

**25** ఆగస్టు : నిద్రలేచేసరికి కడుపు బరువుగావుంది. తరువాతకూడా ఏమీ బాగుండలేదు. మధ్యాహ్నం భోజనం చేద్దామంటే ఆకలివేయలేదు. అయినా తిన్నాను. నిన్న సరిగా ఉడకని బటాణీలు మధ్యాహ్నం ఆహారంగా తీసుకోనటంవల్ల కడుపుబరువుగా ఉందని అనుకున్నాను. సాయంకాలానికల్లా తలనొప్పి వచ్చింది. కొంచెంగా క్వినైన్ తీసుకున్నాను. నిన్నటి మాదిరిగానే, ప్రొద్దున్నపూట ఆహారం తీసుకున్నా.

**26** ఆగస్టు : నిద్రలేచేసరికి కడుపు ఉబ్బరంగా వుంది. ప్రొద్దున్న ఆహారంగా, అర్ధ చెంచాడేసి బటాణీలు, బియ్యం, గోధుమ, రెండున్నర చెంచాలు ద్రాక్ష, పది బాదంకాయలు, ఒక నారింజకాయ తీసుకున్నాను. రోజంతా నోరు బాగాలేదు. వంట్లోనూ కులాసాగాలేదు. మామూలు మధ్యాహ్న భోజనమే తిన్నాను. సాయంకాలం 7 గంటలకు ఒక నారింజకాయ, కప్పు కోకో తీసుకున్నాను. 8 గంటలకల్లా మళ్లీ ఆకలివేసింది. అయినా ఏమీ తినాలనిలేదు. పౌష్టికాహారం నాకు సరిపడినట్లుగాలేదు.

**27** ఆగస్టు : తెల్లవారేసరికి బాగా ఆకలివేసింది. అయినా వంట్లో బాగున్నట్లుగాలేదు. ఒకటిన్నర చెంచాడు గోధుమ, రెండు ద్రాక్షపళ్ళు, పది బాదంకాయలు, ఒక నారింజకాయ ప్రొద్దున్నే ఆహారంగా తీసుకున్నాను. (బటాణీలు, బియ్యం మానివేశాను.) మధ్యాహ్నమయ్యే సరికల్లా, శరీరస్థితి బాగుపడింది. నిన్నంతా బరువుగా వుండటానికి బటాణీలు, బియ్యం కారణమై వుండవచ్చు. ఒంటిగంటకు ఒక చెంచాడు నానబెట్టని గోధుమలు, ద్రాక్ష, పధ్నాలుగు బాదంపప్పులు తీసుకున్నాను. (ఈ విధంగా మామూలు ఆహారానికి బదులు పౌష్టికాహారం తీసుకున్నాను.) మిస్. హారిస్ యింటివద్ద టీ (రొట్టె, వెన్న, జామ్, కోకో) తీసుకున్నాను. ఇది నాకు ఎంతో ఆహ్లాదకరంగావుంది. దీర్ఘోపవాసంచేసిన తర్వాత రొట్టె, వెన్న తింటున్నట్లుగా ఉంది. టీ అయిన తర్వాత బాగా ఆకలి, నీరసం కలిగింది. అందువల్ల యింటికి రాగానే ఒక కప్పు కోకో, ఒక నారింజకాయ తీసుకున్నాను.

**28** ఆగస్టు : ప్రొద్దున్నే నోరు రుచిగాలేదు. ఒకటిన్నర చెంచా గోధుమ, రెండు చెంచాల ద్రాక్ష, యిరవై బాదంకాయలు, ఒక నారింజ, కప్పు కోకో ఉదయమే ఆహారంగా తీసుకున్నాను. ఆకలి, నీరసంతప్ప, యింకేంలేదు. నోటిరుచికూడా బాగానే ఉంది.

**29** ఆగస్టు : తెల్లవారి నిద్రలేచేసరికి బాగా ఉంది. ప్రొద్దున్నే ఆహారంగా, ఒకటిన్నర చెంచాల గోధుమ, రెండు చెంచాల ద్రాక్ష, ఒక నారింజ, ఇరవై బాదంకాయలు తీసుకున్నాను. మధ్యాహ్న భోజనంగా మూడు చెంచాల గోధుమ, రెండు చెంచాల కిస్‌మిస్ పళ్ళు, ఇరవై బాదంకాయలు, రెండు నారింజలు తీసుకున్నాను. సాయంకాలం అన్నం, సేమ్యా, బంగాళాదుంపలు, త్యాబ్ యింటివద్ద తిన్నాను. సాయంకాలానికి నీరసంగా ఉంది.

**30** ఆగస్టు : ప్రొద్దున్నే రెండేసి చెంచాలవంతున గోధుమ, ద్రాక్ష, ఇరవై బాదంకాయలు, ఒక నారింజ తీసుకున్నాను. మధ్యాహ్నం పైనచెప్పిన వస్తువులుకాక, అదనంగా ఇంకొక నారింజకాయ తిన్నాను. చాలానీరసంగా వుంది. ఆయాసంలేకుండా మామూలుగా షికార్లు చేయలేకపోయాను.

**31** ఆగస్టు : ఉదయమే లేచేసరికి నోరంతా తీయగావుంది. చాలా నీరసంగా ఉంది. ప్రొద్దున్న, మధ్యాహ్నంకూడా, మామూలు ఆహారమే తీసుకున్నాను. సాయంకాలం కప్పు కోకో తీసుకుని, ఒక నారింజకాయ తిన్నాను. అతికష్టంమీద షికారువెళ్ళగలిగేను. పళ్ళు బలహీనమై పోయాయి. నోరంతా తీయనై పోయింది.

**1** సెప్టెంబర్: తెల్లవారి లేచేసరికి బాగా అలసిపోయినట్లనిపించింది. నిన్నటి మాదిరిగానే ప్రొద్దున్న మధ్యాహ్నంకూడా ఆహారం తీసుకున్నాను. చాలానీరసంగా ఉంది. పళ్లు నొప్పిగా ఉన్నాయి. ఈ పరిశోధనను వదలివేయాలి. జేకర్ పుట్టినరోజు అవడంవల్ల ఆయనతో కలిసి టీ త్రాగేను. అది త్రాగిన తరువాత కొంచెం నయమనిపించింది.

**2** సెప్టెంబర్ : ఉత్సాహంతో నిద్రలేచాను. (నిన్నసాయంకాలపు టీ ఫలితం అనుకుంటా). పాతపద్ధతిలోనే ఆహారం, రొట్టె, వెన్న, జామ్, కోకో, తీసుకున్నాను. ఇదివరకటికంటె చాలా ఆరోగ్యంగా ఉన్నట్లనిపించింది.

ఈ విధంగా పౌష్టికాహార విషయమై పరిశోధన ముగిసింది.

పరిస్థితులు సానుకూలంగా ఉండిఉన్నట్లయితే ఈ పరిశోధన పాడై ఉండేదికాదు. ఆహారం విషయంలో జయప్రదంగా పరిశోధన చేయటానికి బోర్డింగ్ హోమ్‌లు అనువైన ప్రదేశాలుకావు. వీనిలో ఆహారం విషయంలో రోజురోజుకూ మార్పులు చేయటం సాధ్యంకాదు. పైగా నాకుదొరికేతాజాపళ్లు నారింజకాయలు మాత్రమే. అప్పట్లో ట్రాన్స్‌వాల్‌లో ఇతరరకాల పళ్లు దొరికేవికావు. ట్రాన్స్‌వాల్ భూమి సారవంతమైనదైనప్పటికీ, అక్కడ పళ్లతోటల పెంపకం చాలా అశ్రద్ధచేయబడింది. అదీగాక పాలు సులభంగా దొరకేవికావు. పాలు చాలా ఖరీదుగా ఉండేవి. దక్షిణాఫ్రికాలో ప్రజలు సామాన్యంగా డబ్బాపాలు ఉపయోగించేవారు. ఈ పరిస్థితుల్లో పౌష్టికాహార విషయంలో చేసిన పరిశ్రమ నిష్ప్రయోజనమని ఒప్పుకోక తప్పదు. పరిసర వాతావరణం, పరిస్థితులూ అనుకూలంగా లేనప్పుడు, పదకొండు రోజులపాటు పరిశోధనచేసి, ఒక నిశ్చితాభిప్రాయానికి రావటంకూడా సాహసమే. ఇరవైసంవత్సరాలపాటు, వండిన సుఖ భోజనానికి అలవాటుపడ్డ ఈ కడుపు, ఒక్కసారిగా వండని శాకాహారాన్ని జీర్ణంచేసుకుంటుందనుకోవటం గూడా అసహజమే. అయినప్పటికీ యీ పరిశోధనకు దానికి తగ్గ విలువ ఉందనుకుంటున్నాను. ఈ పరిశోధనలోని మంచితనంచే ఆకర్షించబడి, అదికొనసాగించటానికి, శక్తి, తాహతు, సరియైన విజ్ఞానం లేక, పరిస్థితులు అనుకూలించకపోవటంవల్ల అది చేయలేనివారికి, పై నాపరిశోధన మార్గదర్శిగా ఉంటుంది. పైనచెప్పిన యోగ్యతలు నాలో లేవని ఒప్పుకుంటాను. పైపరిశోధనచేస్తూ దానివల్ల కలిగే గుణాలను నెమ్మదిగా పరిశీలించే ఓపిక లేక, ఒక్కసారిగా ఆహారవిధానంలో మార్పుచేసాను. మొదట్లోనే ప్రొద్దునపూట పౌష్టికాహారం తీసుకొనటం ప్రారంభించాను. నాలుగైదు రోజులు గడిచిందోలేదో, మధ్యాహ్నంకూడా అదేవిధమైన ఆహారం తినటం మొదలుపెట్టేను. నిజానికి యీ పౌష్టికాహార సిద్ధాంతంతో నాకుగల పరిచయం అంతంతమాత్రమే. మిస్టర్ హిల్ వ్రాసిన చిన్న పుస్తకము, వెజిటేరియన్ పత్రికలో వెలువడ్డ రెండుమూడు వ్యాసాలు మాత్రమే యీ ఆహార పరిశోధన విషయంలో నాకు తెలిసినది. కనుక, ఉండవలసిన యోగ్యతలులేనివారు ఎవరైనాసరే, యీ పరిశోధన చేసినట్లయితే వారికి అపజయంతప్పదు. దానివల్ల తననే కాకుండా, తనుచేసిన పరిశోధనకు గూడా నష్టం కలుగచేసినవారవుతారు.

తనుతీసుకునే శాకాహారంతో తృప్తిపడే సాధారణపు శాకాహారి యీ పరిశోధనలు చేయదగినవ్యక్తికాదని అనుకుంటున్నాను. ఇటువంటి పరిశోధనలను, తమజీవితాలను వాటికోసం అంకితంచేసిన శాస్త్రవేత్తలకే వదలివేయడం మంచిది. భూతదయ పరమావధిగా పెట్టుకొని, ఆహారం కోసం ప్రాణహింసచేయడం పాపం అనుకునే, శాకాహారులకు ముఖ్యంగా పైన నేను చెప్పినమాటలు బాగా వర్తిస్తాయి. మామూలుగా శాకాహారం తీసుకొనటం ఆరోగ్యదాయకమనీ, సాధ్యమనీ తెలుసుకోవడం, దానినవలంభించిన ప్రతివారూ తెలుసుకోగలరు. ఇంతకంటె మనకు యింకేం కావాలి? పొష్టికాహారంవల్ల ఎంతో మేలుకలుగవచ్చు. కాని అశాశ్వతమైన మన యీ శరీరాలకు అది, అమరత్వాన్ని ప్రసాదించలేదు. అదీగాక మానవులలో ఎక్కువమంది, వండిన ఆహారాన్ని తీసుకునే విధానానికి స్వస్తిచెపుతారనుకోవటం గూడా పొరబాటే. కనుక ఆత్మసంపోషణకు, పొష్టికాహారం తగినదికాదు. ఆత్మ అంటె ఏమిటో తెలుసుకోవటం మన జీవితంయొక్క ఏకైక ధ్యేయమైనపుడు, ఆ ప్రయత్నానికి ఆటంకం కలిగించేదేదైనాసరే, పొష్టికాహార పరిశోధనైనాసరే, మనం అవలంభించడం, జీవితలక్ష్యంనుంచి తప్పించుకోవటమే అవుతుంది. భగవత్ సృష్టిలోనివారమైన మనం జీవించటానికి ఆహారం తీసుకొనవలసివస్తే, అనావశ్యకమై స్వాభావిక విరుద్ధమైన జంతుహింసవల్ల లభించే మాంసాహారాన్ని త్యజించకూడదా? ఈ విషయమై నేను దీర్ఘంగా పరిశీలించే ఉద్దేశ్యంలో లేను. పొష్టికాహార పరిశోధన చేస్తూండగా కల్గిన మనోభావాలను తెలియపరుస్తున్నాను. ఏ సోదరుడైనా, సోదరైనా, యీ విషయమై తమ అభిప్రాయాలను వ్యక్తపరుస్తారని ఆశిస్తున్నాను.

పొష్టికాహార విషయమై పరిశోధనచేయటానికి కారణాలు, దానిలోని సహజత్వమే. దీనివల్ల ఆహారం వండనక్కరలేదు. ఎక్కడికిపడితే అక్కడికి సులభంగా మోసుకుపోవచ్చు. ఇంటియజమానురాలు, లేక వడ్డించేవాళ్ల అపరిశుభ్రతవల్ల కలిగేబాధలేదు. పైగా దక్షిణాఫ్రికావంటి

దేశాలలో ప్రయాణంచేసేటప్పుడు, పౌష్టికాహారం చాలా పనికివస్తుంది. ఈ సదుపాయాలే నన్ను బాగా ఆకర్షించినాయి. కాని స్వప్రయోజనంకోసం, ఎంతో సమయాన్ని వినియోగించి, ఎంత బాధపడాలి? అంత బాధపడినా ఫలితం గొప్పగా ఏమీ లభించదు. వీటన్నిటికీ, జీవితం సరిపోనట్లుంది.

[ *'ది వెజిటేరియన్'* 24-3-1894. ]



---

పౌష్టిక ఆహారం అనగా అపక్వాహారము.

# 22. ఇంగ్లండులోని భారతీయులకు

(ఇంగ్లాండులోని భారతీయుల నుద్దేశించి వ్రాసిన యీ ఉత్తరాన్ని మిస్టర్ యం. కె. గాంధీ పంపేరు. మనకు ఎంతోదూరంలో ఉన్నప్పటికీ, వారు మనమధ్య చేస్తున్న తీవ్రకృషికి యీ ఉత్తరమే నిదర్శనం. దానిని యిక్కడ ప్రచురిస్తున్నాం. అయినప్పటికీ, శాకాహారులైన భారతీయులు, జాన్ బుల్ కుమారులులాగా, అనగా ఇంగ్లీషువారివలె కార్యశూరులు కారని మన వ్యతిరేకులు అంటే అనవచ్చు.

—సంపాదకుడు, వెజిటేరియన్.)

---

ప్రిటోరియా.

వెజిటేరియన్ పత్రికా సంపాదకులకు——

ప్రియసోదరా,

నువ్వు శాకాహారివైతే, లండన్ వెజిటేరియన్ సొసైటీలో చేరి, వెజిటేరియన్ పత్రికకు చందాకట్టడం నీ విధ్యుక్తధర్మం.

ఎందుకంటావా.........

(1) ఈ విధంగా నీ ధర్మాన్ని ప్రోత్సహించటమేకాకుండా దానికి సహాయపడినవాడివవుతావు.

(2) శాకాహారులన్నవాళ్లు బహుతక్కువగా ఉన్నదేశములో, దీనివల్ల, ఒక శాకాహారికి, ఇంకొక శాకాహారికి మధ్యగల సానుభూతి వ్యక్తమవుతుంది.

(3) ఈ శాకాహారోద్యమం, రాజకీయంగాకూడా, పరోక్షంగా నైనప్పటికీ, భారతదేశానికి సహాయపడుతుంది. ఆంగ్లేయులలో, శాకాహారులు, తప్పకుండా భారతీయులపట్ల సానుభూతిచూపిస్తారు. (ఇది నాస్వానుభవం).

(4) స్వార్థదృష్టితో చూసినా, దీనివల్ల నీకిష్టులైన శాకాహార స్నేహితులు చాలామంది లభిస్తారు.

(5) శాకాహారానికి సంబంధించిన సాహిత్యం నీకు తెలిసియుండటంవల్ల, నీ సిద్ధాంతాలకు నీవు అంటిపెట్టుకుండవచ్చు. ఈ దేశంలో, నీ మనస్సును ఆకర్షించి, వ్యామోహంలో పడవేసే ఆకర్షణలు ఎన్నో ఉన్నాయి. ఈ సంఘంలో చేరి, పత్రికకు చందాకట్టడంవల్ల, నీకు శాకాహారులైన వైద్యుల సలహా లభిస్తుంది. ఒకవేళ జబ్బు పడినట్లయితే, అందుకు సంబంధించిన మందులు సులభంగా అందుబాటులో ఉంటాయి.

(6) భారతదేశంలోని నీ వారికి యిది ఎంతో సహాయకారిగా ఉంటుంది. ఇంగ్లాండులో మనవాళ్లు, శాకాహారాన్ని వదలకుండా ఉన్నారా అనే సందేహం మనతల్లిదండ్రులలో కల్గకుండా యిదితోడ్పడుతుంది. ఈ విధంగా మన భారతీయ సోదరులు యింకా ఎక్కువ మంది, యిక్కడికి రావటానికి అవకాశాన్ని కలుగచేస్తుంది.

(7) తగినంతమంది భారతీయ చందాదారులు ఉంటే, వెజిటేరియన్ పత్రికా సంపాదకుని పత్రికలో, ఒక పేజీకాని, కొంతభాగంగాని, ఇండియాకు సంబంధించిన విషయాలకు ప్రత్యేకించమని మనంకోరవచ్చు. దీనివల్ల మన భారతదేశానికి లాభముందని నీవు ఒప్పుకోక తప్పదు.

వెజిటేరియన్ సొసైటీలోచేరి, వెజిటేరియన్ పత్రికకు చందా కట్టమని చెప్పటానికి యింకా ఎన్నో కారణాలను, చూపించవచ్చు. కాని పైనచెప్పినవి, నావాదనను అంగీకరించటానికి, చాలుననుకుంటాను.

శాకాహారివి కానప్పటికీ, పైనచెప్పిన కారణాలు చాలావరకు నీకూవర్తిస్తాయని అనుకుంటాను. పత్రికకు నీవుకూడా చందా కట్టవచ్చు. ఎప్పటికైనా, తోటిజీవులరక్తమే ఆహారంగా, జీవించని వ్యక్తులతో నీవు కలుస్తావేమో ఎవరు చెప్పగలరు? మాంచెస్టర్ వెజిటేరియన్ సొసైటీ, దాని పత్రిక *వెజిటేరియన్ మెసింజర్* ఉన్నమాట నిజమే. కాని లండన్ వెజిటేరియన్

సొసైటీ, దాని పత్రిక విషయమై, ఎందుకు చెపుతున్నానంటే, యిది లండన్‌లో మనకు దగ్గరగాఉంది. పైగా యిది వారపత్రిక.

పొదుపుగా ఉండాలనే సాకుచెప్పి, యీ సంఘంలో చేరక, పత్రికకు చందా కట్టకుండా ఉండిపోతారేమో? ఈ పత్రిక చందా బహుస్వల్పం. దానివల్ల, మీ పెట్టుబడికి మించిన ఫలితం లభిస్తుంది.

నన్ను అన్యథా భావించరని తలుస్తాను.

మీ సోదరుడు,
యం. కె. గాంధీ.

['*ది వెజిటేరియన్*' 28-4-1894.]



## 23. శాకాహారము—పిల్లలు

మిస్టర్ యం. కె. గాంధీ, ఒక ప్రైవేటు ఉత్తరంలో యిలా వ్రాస్తున్నారు :

ఈ మధ్యనే వెలింగ్టన్‌లో, కేస్విక్ క్రిస్టియన్‌ల మహాసభ జరిగింది. దానికి గౌరవనీయులైన ఆండ్రూ ముర్రే అధ్యక్షత వహించారు. ప్రేమ పాత్రులయిన కొంతమంది క్రిస్టియన్‌లతో ఆ సభకు హాజరయాను. వారితో ఆరు లేక ఏడేండ్ల ఒక పిల్లవాడు వచ్చాడు. ఒక రోజున ఆ కుర్రవాడు నాతో షికారువచ్చాడు. భూతదయను గురించి ఆ పిల్లవాడితో మాట్లాడుతున్నాను. శాకాహారాన్ని గురించి కూడా చర్చించాము. అప్పటినుంచి ఆ కుర్రవాడు మాంసం ముట్టనేలేదని తర్వాత నాకు తెలిసింది. మా యిద్దరిమధ్య సంభాషణ జరుగకపూర్వం మధ్యాహ్నంపూట ఒకసారి నేను కాయగూరలే ఆహారంగా తీసుకోవటం ఆ పిల్లవాడు చూశాడు. 'మాంసం ఎందుకు తినర'నికూడా అడిగేడు. అతని తల్లిదండ్రులు శాకాహారులు కానప్పటికీ, శాకాహారంలోని సుగుణం వారికి బాగా తెలుసును. అందువల్ల శాకాహారం విషయమై వారి పిల్లవానితో నేను మాట్లాడినా వారు అభ్యంతరం చెప్పలేదు.

తల్లిదండ్రులు అడ్డుచెప్పకుండా ఉంటే, పిల్లలకు శాకాహారం విషయమై చెప్పి, వారు మాంసం ముట్టకుండా చేయటం ఎంత సులభమో తెలియచేయటానికి యీ విషయమై వ్రాస్తున్నాను. ఆ పిల్లవాడూ నేనూ యిప్పుడు పెద్ద స్నేహితులం. నేనంటే అతనికి చాలా యిష్టం కూడాను.

ఇంకో కుర్రాడు, సుమారు పదిహేనేళ్ళు ఉంటాయ్. నాతో మాట్లాడుతూ కోడిని తను చంపలేననీ, ఎవరైనా చంపుతున్నా చూడ లేననీ చెప్పేడు. కాని దాని మాంసం తినటానికి అతనికేమీ అభ్యంతరంలేదు.

[*'ది వెజిటేరియన్'* 5—5—1894.]

# 25. నేటాల్ అసెంబ్లీకి అర్జీ

డర్బాన్,
28 జూన్, 1894

గౌరవనీయులైన, నేటాల్ కాలనీ లెజిస్లేటివ్ అసెంబ్లీ స్పీకర్‌కూ, సభ్యులకూ, నేటాల్ కాలనీలో నివసిస్తున్న భారతీయులు సమర్పించుకొన్న వినయపూర్వక విన్నపములు—

(1) ఈ అర్జీదారులమైన మేము, ఇండియానుంచివచ్చి, యీ కాలనీలో స్థిరపడిన బ్రిటిష్‌పౌరులం.

(2) ఈ అర్జీదారులలో పెక్కుమంది, ఓటర్లుగా నమోదైనాము. లెజిస్లేటివ్ కౌన్సిల్, అసెంబ్లీలకు అభ్యర్థులను ఎన్నుకునే అర్హత మాకు ఉన్నది.

(3) ఎన్నికల చట్టానికి ప్రతిపాదించదలచిన సవరణబిల్లు విషయమై రెండవసారి జరిగిన చర్చను, పత్రికలో చదివినాము. మేము యీ సవరణ బిల్లు విషయంలో ఆందోళన పడుతున్నాము.

(4) ఈ సవరణబిల్లు విషయంలో, పెక్కుమంది వ్యక్తులు వెలిబుచ్చిన అభిప్రాయాలతో ఏకీభవించవద్దని సభవారిని కోరుతున్నాము. ఎందుకనగా, యీ వ్యక్తులు ఏ కారణాలవల్ల యీ సవరణబిల్లు కావాలంటున్నారో, ఆ కారణాలు వాస్తవానికి దానిని సమర్థించేటట్లులేవు.

(5) ఈ సవరణ బిల్లు ఆమోదించటానికిగల కారణాలు, యీ దిగువ ఉదహరించినవేనని, పత్రికలద్వారా మాకు తెలుస్తున్నది.

(i) తమ మాతృదేశంలో భారతీయులు ఎన్నడూ ఓటు చేసియుండలేదు.

(ii) అసలు ఓటుచేయటానికి భారతీయులకర్హతలేదు.

(6) పై కారణాలు నిజంకావనీ, చరిత్ర వేరుగాచెప్తోందనీ గౌరవనీయులైన శాసనసభ్యుల దృష్టికి తెస్తున్నాము.

(7) ప్రాతినిధ్య పరిపాలన మూలసూత్రాలను, ఆంగ్లో-శాక్సనుజాతి మొట్టమొదటిసారిగా తెలుసుకున్న కాలానికి, ఎంతో ముందుగానే భారతజాతికి ఎన్నికలవిధానం తెలుసు. ఎన్నికల పద్ధతిపై ఇండియాలో పరిపాలన జరుగుతుండేది.

(8) పై విషయానికి ఋజువుగా, సర్ హెన్రీ సమ్నర్ మెయిన్ రచించిన 'విలేజ్ కమ్యూనిటీస్' అను గ్రంథాన్ని చూడవలసినదిగా గౌరవనీయులైన సభవారిని కోరుతున్నాము. సమ్నర్ మెయిన్ యీ గ్రంథంలో యిలా వ్రాశారు. 'అనాది కాలంనుంచి భారతీయులకు ప్రతినిధులద్వారా పరిపాలన జరిపే విధానం తెలుసును. భారతీయ గ్రామీణ సంఘాలకు ఉన్నంతటి పటిష్టత, పిమ్మటనే ప్రాతినిధ్యం, ట్యూటానిక్ మార్క్‌కు లేవు. వీటిని రోమను సభలలాగ మార్చిన భారతీయ గ్రామీణ సంఘాల స్థాయికి వచ్చాయి.'

(9) లండన్‌లో, ఈస్ట్ ఇండియన్ అసోసియేషన్‌లో మాట్లాడుతూ మిస్టర్ ఛిసామ్ ఆన్‌స్టీ యిలా అన్నారు:

"విద్యావ్యాప్తిద్వారా తూర్పుదేశాల ప్రజలను మునిసిపల్ పరిపాలనకూ, పార్లమెంటరీ పరిపాలనకూ తగినవారలనుగా చేయాలని మనం అంటూంటాము. కాని ఒక్క విషయాన్ని మనం మరచిపోతున్నాము. మునిసిపాలిటీలకూ, స్థానిక స్వపరిపాలనకూ, తూర్పు జన్మస్థలం. ఇంకా విపులంగా చెప్పాలంటే తూర్పు అన్నపదం ఎంత ప్రాచీనమైనదో, యిది అంతటిపురాతన విషయం. తూర్పుదేశప్రజలమతం ఏదైనప్పటికీ, ఆ దేశాలలో మునిసిపాలిటీలు లేనితావంటూ, — తూర్పునుంచి పడమరకు, ఉత్తరాన్నుంచి దక్షిణానికి—ఎక్కడ వెదకినా కనపడదు. మన పురాతనకాలపు మునిసిపాలిటీలవలె, తూర్పుదేశాలలోనివికూడా ఒక దానితో మరొకటి కలిసి ఉంటాయి. ఇవన్నీకలిపి ప్రాతినిధ్య పరిపాలనకు ఒక స్వరూపాన్ని కలుగచేస్తున్నాయి."

ప్రతిపల్లె, పట్టణంలోకూడా, ఒక్కొక్కకులానికి, ప్రత్యేక నియమాలు నిబంధనలంటూ ఉన్నాయి. ప్రతికులం తన ప్రతినిధిని ఎన్నుకుంటుంది. ఇవి మన శాక్జన్‌విటాన్‌లను పోలి ఉంటాయ్. ఈ శాక్జన్‌విటాన్‌లనుంచే ప్రస్తుతపు పార్లమెంటరీ సంస్థలు పుట్టినాయి.

(10) 'పంచాయత్' అనేది ఇండియాలో ఇంటింటా చెప్పుకునేమాట. తమను ఎన్నుకున్నవారికి ప్రాతినిధ్యంవహించే ఐదుగురు సభ్యులుగల సభ అని యీ మాటకు అర్థం. ఈ సభ్యులు తమ తమ కులాలకు సంబంధించిన సాంఘిక వ్యవహారాలను పర్యవేక్షిస్తుంటారు. ఈ విషయమంతా గౌరవనీయులైన శాసనసభ్యులకు తెలుసుననే అనుకుంటున్నాము.

(11) స్వదేశసంస్థానమైన మైసూరుకు ప్రాతినిధ్యసభ ఉంది. దీనిని మైసూర్ అసెంబ్లీ అని పిలుస్తారు. ఇది బ్రిటిష్ పార్లమెంటుకు సరియైన ప్రతిరూపం.

(12) ప్రస్తుతం దర్బాన్‌లో నివసిస్తున్న భారతీయ వర్తకులకుకూడా పంచాయతీ సభ ఉంది. అతి ముఖ్యసమస్యలమీద యీ పంచాయితీ తీర్పుపై, సంఘం తన నిర్ణయాన్ని తెలియచేస్తూఉంటుంది. నిబంధనల ననుసరించి, తగినంత మెజారిటీ ఉన్నపుడు, పంచాయితీ తీర్పునుకూడా త్రోసిపుచ్చగల హక్కు సంఘానికి ఉంది. ప్రాతినిధ్య విషయంలో మాకుగల సమర్థతకు ఋజువు యిదేనని, అర్జీదారులమైన మేము తెలియచేస్తున్నాం.

(13) ఇండియన్లకు ప్రాతినిధ్యసభలను అర్థంచేసుకునే శక్తిసామర్థ్యాలు కలవని బ్రిటిష్ మహారాణిగారి ప్రభుత్వం గుర్తించింది. అందువల్లనే ఇండియాలో, మునిసిపాలిటీలద్వారా స్థానికస్వపరిపాలన జరుగుతున్నది.

(14) 1891 సంవత్సరంలో, ఇండియాలో 755 మునిసిపాలిటీలు, 892 లోకల్ బోర్డులున్నాయి. వీనిలో 20,000 మంది సభ్యులున్నారు. దీనివల్ల మునిసిపాలిటీలస్థితీ, ఓటర్ల ఉన్నతీ అర్థమవుతుందనుకుంటున్నాము.

(15) ఇంకా మీకు నిదర్శనం కావాలంటే, ఈ మధ్యనే ప్యాస్ కాబడిన ఇండియా కౌన్సిల్స్ బిల్లును చూడవలసినదిగా గౌరవనీయులైన సభ్యులను కోరుతున్నాము. ఈ బిల్లువల్ల ఇండియాలోని వివిధ రాష్ట్ర లెజిస్లేటివ్ కౌన్సిళ్ళకుకూడా ప్రతినిధులను ఎన్నుకునే పద్ధతి అమలులోకి వచ్చింది.

(16) భారతీయులమైన మమ్మల్ని ఓటు చేయనివ్వటం, క్రొత్తగా మీరు మాకిచ్చే సదుపాయమేమీకాదు. ఆ విధంగా చేయకపోవటం, మాయడల అన్యాయంగా ప్రవర్తించటమే అవుతుంది. ఏ పరిస్థితు లలోకూడా, మాతృదేశంలో మాపై అటువంటి ఆంక్ష అంటూ ఉండదు. ఈ విషయాన్ని శాసనసభవారు గమనించవలసిందిగా కోరుతున్నాము.

(17) ఓటుచేసే హక్కును వినియోగించుకోనివ్వటంవల్ల భారతీయులు ఆందోళనకారకులు, రాజద్రోహులుగా తయారవుతారని ఒకవేళ మీరనుకుంటున్నట్లయితే, ఆలా జరగటానికి ఆస్కారం ఏమీ లేదని మేము తెలియచేస్తున్నాము.

(18) సవరణబిల్లు రెండవచర్చ సందర్భంలో జరిగిన చిన్నచిన్న విష యాలు, అనవసరపు కఠిన ప్రసంగాలవిషయమై, మేము ప్రస్తా వించడం అనవసరమనిపిస్తోంది. ఐనప్పటికీ దీనికి సంబంధించిన కొన్ని విషయాలనుగురించి మీ అనుమతితో యిక్కడ ప్రస్తా విస్తాము. మా జాతినిగురించి యితరుల అభిప్రాయాలు ఆధా రంగా, మమ్మల్ని పరీక్షించి ఒక నిర్ణయానికి రావటంకంటె, మా నడవడిని పరిశీలించి మీ అభిప్రాయాన్ని స్థిరపరచుకొనవలసి నదిగా కోరుతున్నాము. ప్రస్తుత పరిస్థితుల్లో యిది సాధ్యం కాదేమోనని మా అనుమానం. సాంఘికంగా కలసిమెలసి ఉండక పోవటంవల్ల మా శక్తిసామర్థ్యాలను సరిగా అర్థం చేసుకోలేక పోయారని మా అభిప్రాయం.

(19) కెన్సింగ్టన్, అసెంబ్లీరూమ్స్‌లో మాట్లాడుతూ, మిస్టర్ యఫ్. పిన్‌కాట్ యిలా అన్నాడు :

భారతీయుల అవివేకం, ప్రాతినిధ్యపరిపాలనవల్ల కలిగే లాభాలను గమనించలేని వారి అసమర్థతనుగురించి మన ఈ దేశంలో ఎంతగానోవిన్నాం. ఇదంతా నిజానికి తప్పుడభిప్రాయం. ప్రాతినిధ్య పరిపాలనకు, విద్యకు సంబంధమేలేదు. ఇదంతా విచక్షణా జ్ఞానంమీద ఆధారపడి ఉంది. విచక్షణాశక్తిలో భారతీయులు మనకేమీ తీసిపోరు. విద్యఅంటూ లేనికాలానికి ఎన్నోవందలసంవత్సరాలకు పూర్వంనుంచీ, మనం ఎన్నుకునే హక్కును వినియోగించుకుంటున్నాం. ప్రతినిధి సభలూ ఉన్నాయి. కనుక విద్యను ప్రామాణికంగా తీసుకుని దీనిని పరీక్షించటం సమంజసంకాదు. మన దేశచరిత్ర చదివిన ప్రతివారికీ రెండు వందల సంవత్సరాలకు పూర్వం మనకు మూఢనమ్మకాలు ఉన్నాయనీ, అజ్ఞానులుగానున్నామనీ తెలుసు. ఐనా మనకు ప్రతినిధుల సంస్థలంటూ అప్పట్లో ఉండేవి.

(20) భారతీయుల సాధారణ ప్రవర్తనను గురించి వ్రాస్తూ, సర్ జార్జి బర్డ్‌వుడ్ యిలా తెలియజేశారు :

భారతీయులు మనకంటె తక్కువ వారేమీకారు. తప్పుడు ప్రమాణాలు ఆధారంగా చేసుకుని మనకు సరిపడని విషయాలను నమ్ముతుంటాము. ఈ విషయంలో భారతీయులు మనకంటె అధికులే.

(21) మద్రాసు గవర్నర్లలో ఒకరైన సర్ థామస్ మన్రో యిలా అన్నారు :

భారతీయులను నాగరికులుగా చేయాలి అనేమాటకు అర్థం ఏమిటో నాకు తెలియదు. సుపరిపాలనవిషయంలో, సిద్ధాంతరీత్యా, కార్యరూపేణా వారికి అంత అనుభవం లేకపోవచ్చును. మంచివ్యవసాయపద్ధతులు, ఉత్పత్తివిధానం, మంచి విద్యాశాలల స్థాపన, అతిథిసత్కారాలనుచేసే సదాచారం నాగరికతకు ప్రమాణంగా తీసుకుంటే, నాగరికత విషయంలో, భారతీయులు యూరపు ప్రజలకేమీ తీసిపోరు.

(22) అపార్థం చేసుకోబడి, తీవ్ర దుష్ప్రచారానికి గురైన భారతీయుని గురించి మాక్స్‌ముల్లర్ యిలా అన్నారు :

మానవుని మేధాశక్తి పరిపూర్ణత చెందిన దేశం, మానవ జాతిసమస్యలు కుణ్ణంగా పరిశీలించబడి, ప్లాటో, కాంటోల గ్రంథాలను చదివినవారి ప్రశంసలకు పాత్రమైన నిర్ణయాలు చేయబడిన ప్రదేశం, ఏదని ఎవరైనా అడిగితే, నేను, ఇండియాను చూపించ వలసివస్తుంది.

(23) చిరకాలంనుంచి వాంఛింపబడుతున్న బ్రిటిష్, భారత జాతీయుల సమైక్యత, ఈ ఎన్నికలచట్టం సవరణబిల్లు ఆమోదంతో, కుంటుపడుతుందని, మీకు విన్నపం చేసుకుంటున్నాము.

(24) భారతీయులమైన మేము, మా గురించి, ఆంగ్లప్రముఖులు ఏమి వ్రాసినది, ఏమి చెప్పినది ఉన్నదున్నట్లుగా పైన తెలియచేశాం. గ్రంథాలనుంచి ఇటువంటి ఉదాహరణలను ఎన్నింటినో చూపించగలం. కాని పైన పేర్కొన్నవి చాలుననీ, వీటివల్ల గౌరవనీయులైన సభవారు సంతృప్తిచెంది, మా కోర్కెలలోని న్యాయాన్ని గమనిస్తారనీ ఆశిస్తున్నాం. మీ నిర్ణయాన్ని తిరిగి ఒకసారి పరిశీలించమని కోరుతున్నాం. ఈ బిల్లును ఆమోదించే ముందు కాలనీలో నివసిస్తున్న భారతీయులకు ఓటుచేసే అర్హత ఉందా లేదా అన్న విషయాన్ని పరిశీలించటానికి ఒక కమీషన్‌ను ఏర్పాటు చేయవలసినదిగా కోరుతున్నాం.

మీరుచేసే న్యాయయుక్తమైన చర్యకు, మేము కృతజ్ఞులుగా ఉంటాం..............

[కలోనియల్ ఆఫీసు రికార్డులు, 179 వ నెం. వాల్యూం 189; ఓట్సు అండ్ ప్రొసీడింగ్స్ ఆఫ్ పార్లమెంట్, నేటాల్ 1894.]

# 26. నేటాల్ ప్రధానమంత్రివద్దకు రాయబారం

డర్బాన్,
జూన్ 29, 1894.

సర్ జాన్ రాబిన్‌సన్, కె. సి. యం. జి,
ప్రధాన మంత్రి, కలోనియల్ సెక్రటరీ,
నేటాల్ కాలనీ.

ఘనతవహించిన ప్రభువులు చిత్తగించేది,

ఈ ప్రతినిధివర్గాన్ని కలుసుకోవటానికి, తమ అమూల్యకాలాన్ని వినియోగించి, అవకాశం కల్పించినందులకు, మిమ్ములను అభినందిస్తున్నాం.

ఈ కాలనీలో నివసిస్తున్న భారతీయుల తరఫున యీ వినతిపత్రాన్ని సమర్పిస్తూ, శ్రద్ధతో దీనిని పరిశీలించవలసిందిగా కోరుతున్నాం.

తమ ఉదారస్వభావాన్ని ఆసరాగా తీసుకొని, మేము హద్దునతిక్రమించ దలుచుకోలేదు. కాని మావిషయం యావత్తూ తమకు విపులంగా నివేదించటానికి తగినంత సమయంలేదే అని విచారిస్తున్నాం.

ఈ విషయంలో మేము చాలాఆలస్యంగా మేల్కొన్నామని అభిశంసించారు. ఇంతకుపూర్వమే, శాసనసభలను ఏ ప్రత్యేక కారణాలవల్ల కోరలేకపోయామో, తమకు తెలియచేస్తాము. మా జాతికి చెందిన యిద్దరు ప్రముఖసభ్యులు, వ్యాపారరీత్యా, కాలనీ వదలిపెట్టి వెళ్లవలసివచ్చింది. ఈ కాలనీలోని ప్రజలతో వారికి ఉత్తరప్రత్యుత్తరాలు కూడా లేకుండా పోయాయ్. ఆంగ్లభాషతో తగినంత పరిచయం లేకపోవడంవల్ల ప్రధాన విషయాలతో సంబంధం కలిగించుకోలేకపోయాము.

ఆంగ్లో—శాక్జను, భారతీయజాతులు రెండూ ఒకే శాఖకు చెందినవని తమకు విధేయపూర్వకముగా విన్నవించుకుంటున్నాం. బిల్లుపై రెండవసారి జరిగిన చర్చ సందర్భంలో తమ మహోపన్యాసాన్ని అతిశ్రద్ధతో విన్నాము. ఆంగ్లో—శాక్జనులు, భారతీయులు, విభిన్న శాఖలనుంచి వచ్చిన వారని తమరుచెప్పిన విషయానికి ఆధారంగా ఎవరైనా గ్రంథకర్త వ్రాసినదేదైనా ఉందేమోనని మేము వెదికేము. కాని, మాక్స్‌ముల్లర్, మారిస్, గ్రీనీ తదితర గ్రంథకర్తలుకూడా యీ రెండుజాతులూ, ఆర్యన్‌జాతినుంచే ఉద్భవించాయని చెపుతున్నారు. ఈ ఆర్యన్‌జాతినే చాలామంది, ఇండోయూరపియన్లని కూడా పిలుస్తారు. సోదరజాతీయులుగా మమ్మల్ని స్వీకరించటానికి అంగీకరించని ఒక జాతివారితో బలవంతంగా కలవాలనేకోరిక మాకు ఎన్నటికీలేదు. నిజాన్ని కప్పిపుచ్చి, మేము ఓటుచేయదగినవారము కామని ప్రచారం చేయబడుతోంది. ఇందులోని యదార్థం ఏమిటో చెప్పదలచుకున్నందుకు మమ్మల్ని క్షమిస్తారని ఆశిస్తున్నాం. భారతీయులు తమకుగల ఓటింగు హక్కును వినియోగించుకుంటారని ఆశించటమంత క్రూరమైన విషయం మరొకటిలేదని మీరన్నట్లుగా మాకు తెలియవచ్చింది. కాని దీనికి సమాధానమల్లా, మాయీ వినతిపత్రమేనని, తెలియచేస్తున్నాం.

మాదృష్టితో చూస్తే, మీ ఉపన్యాసం అన్యాయంగా కనిపించినా, న్యాయసమ్మతమైన భావాలను, నీతిని, ముఖ్యంగా క్రైస్తవమతాన్ని, ప్రతిబింబింప చేస్తున్నదన్న విషయాన్ని తెలుసుకుని సంతృప్తి పడుతున్నాం. దేశంలోని ప్రముఖవ్యక్తులలో అటువంటి ఉద్దేశ్యం ఉన్నంతకాలం, ఏ విషయం పట్లనైనా అన్యాయం జరుగుతుందని మేము భయపడ నవసరములేదు.

మా వినతిపత్రంద్వారా తెలిసిన నిజం ఆధారంగా ఈ కాలనీలోని భారతీయులకు న్యాయం కలుగచేయవలసిందని మీకు విన్నపం చేసుకుంటున్నాం.

మాకోరిక అతిసాధారణమైనదని భావిస్తున్నాము. పత్రికలలో వెలువడినవార్తలు నిజమైనవని విశ్వసిస్తే, భారతీయులలో కూడా, ఈ అమూల్యమైన హక్కును వివేకంతో ఉపయోగించదగిన మర్యాదస్థులు ఉన్నారని, మీరు అంగీకరించినట్లు తెలియవచ్చింది. ప్రస్తుతం సమస్యగా పరిణమించిన యీ విషయంలో విచారణ చేయవలసిందిగా, ఒక పరిశీలకసంఘాన్ని నియమించటానికి యిదే తగిన కారణమని మేము అనుకుంటున్నాం. అటువంటి పరిశీలకసంఘం తప్పక కావాలని మేము కోరుకుంటున్నాం. ఆ పరిశీలకసంఘం భారతీయులు ఓటింగుహక్కును వినియోగించుకోదగినవారని నిష్పక్షపాత బుద్ధితో నిర్ణయించినపుడు, మా కోరిక హద్దుమీరిన దవుతుందా? ఇప్పుడు మీరు ప్రవేశపెట్టదలచుకున్న చట్టాన్ని పూర్తిగా అర్థంచేసుకున్నాం. దీనివల్ల యీ కాలనీలో నివసిస్తున్న భారతీయుడు, నీచస్థితిలోనున్న స్వదేశీయుని కంటె కూడా, క్రిందకు దిగజారిపోతాడు. స్వదేశీయుడైతే చదువుకుని ఓటు చేసే హక్కును సంపాదించుకోగలడు. ఆ సావకాశం భారతీయునికి పూర్తిగా లేకుండా పోతోంది. ఈ చట్టంయొక్క ప్రభావం ఎంతవరకు ఉంటుందంటే, పార్లమెంటులో సభ్యుడైన భారతీయుడు ఒకవేళ యీ దేశానికివస్తే, అతనికి ఓటుచేసే హక్కే లేకుండా పోతుంది.

ఈ చట్టమును ప్రయోగించటంవల్ల కలిగే ప్రమాదకరమైన ఫలితాలనుగురించి ఎంతైనా చెప్పగలం. బహుశా ఈ చట్టానికి నిర్మాణ కర్తలైనవారు కూడా అవి ఈ విధంగా ఉంటాయని ఎన్నడూ ఊహించి ఉండరు. తమరు పరిశీలించవలసిన సమస్యలు యింకా ఎన్నో ఉంటాయి. అందువల్ల మా విషయంలో తమ అమూల్యమైన కాలాన్ని వృథాచేయటం మంచిపనికాదని భావిస్తున్నాం. మాకు ఒక్క వారంరోజులు వ్యవధియిస్తే, యీ సమస్యను విపులంగా అసెంబ్లీ ఎదుట పెట్టగలం. భారతీయులకు పరిపూర్ణమైన న్యాయాన్ని కలుగచేయవలసిందిగా కోరుతూ, తమరు శాయశక్తులా యీ విషయంలో మీ పలుకుబడిని వినియోగిస్తారని ఆశిస్తున్నాం. ఈ సమస్యను తమ నిర్ణయానికి వదిలివేస్తున్నాం. మాకు కావలసినదల్లా న్యాయం.

దయతో యీ ప్రతినిధివర్గాన్ని తమరు కలుసుకోవటానికి అనుమతించినందుకు మా కృతజ్ఞత.

భారతజాతీయులతరఫున యీనివేదికను సమర్పించుకుంటున్నాము.

మీ విధేయులు,
(సం) యం. కె. గాంధీ,
మరి ముగ్గురు.

[1896 ఏప్రియల్ 21 వ తేదీ, నేటాల్ లెజిస్లేటివ్ అసెంబ్లీ ఉత్తరువుననుసరించి ప్రచురింపబడిన పెడ్యూలు ఒకటవ నెంబరు.
కలోనియల్ ఆఫీసు రికార్డు 181, వాల్యూం 41.]



# 27. శాసనసభ్యులకు ప్రశ్నలు

(సర్క్యులరు)

డర్బాన్,
జులై, 1894.

........................గారికి,

అయ్యా,

ఈ దిగువ సంతకములుచేసిన మేము రిజిష్టర్డు పోష్టుద్వారా గౌరవనీయులైన కౌన్సిలు అసెంబ్లీసభ్యులందరికీ ఈ ఉత్తరాన్ని పంపుకుంటున్నాము. ఇందులో జతపరచిన ప్రశ్నలకు సమాధానాలిప్పించమని ప్రార్థిస్తున్నాము. ఇందుతో జతపరుపబడిన మెమోరాండంలో జవాబులకోసం కేటాయించబడిన కాలములను మీరు పూర్తిచేస్తే మేముచాలా కృతజ్ఞులము. రిమార్కుల కాలంలో మీకుతోచిన రిమార్కులను వ్రాసి సంతకంచేసి, మాలో మొదటి సంతకంచేసినవారికి పైచిరునామాకు పంపగోర్తాము.

భవదీయులు,
మో. క. గాంధీ,
మరి నలుగురు.

| ప్రశ్నలు | జవాబులు (అవును - కాదు) | రిమార్కులు |
|---|---|---|
| (1) ఏ విధమైన మార్పులు లేకుండా ప్రస్తుతపు ఎన్నికలచట్టానికి ప్రతిపాదించబడిన సవరణ బిల్లు సరియైనదని మీరు మనసారా భావిస్తున్నారా ? | | |

| ప్రశ్నలు | జవాబులు (అవును - కాదు) | రిమార్కులు |
|---|---|---|
| (2) కాలనీలో ఆస్థిపాస్థులుండి, ఎన్నిక అర్హతగల భారతీయుల పేర్లు ఏకారణం వల్లనైతేనేం, ఓటర్ల జాబితాలో నమోదు కాబడ లేదు. ఈ కారణంవల్ల భారతీయులు పార్లమెంటరీ ఎన్నికలలో పాల్గొనరాదని మీరు భావిస్తున్నారా ? | | |
| (3) ఈ కాలనీ పౌరుడై, ఓటుచేసే అర్హతను బ్రిటిష్ పౌరుడైన ఏ భారతీయుడూ ఎప్పటికీ పొంద లేడని మీరు నిజంగా అనుకుంటు న్నారా ? | | |
| (4) ఆసియా దేశ వాసుడైనంత మాత్రాన యీకాలనీలో ఏ వ్యక్తి ఓటరుకారాదన్న విషయం మీకు న్యాయంగా కనిపిస్తు న్నదా ? | | |
| (5) కంట్రాక్టు కూలీగా వచ్చి కాల నీలో స్థిరనివాస మేర్పరచుకున్న భారతీయుడు, ఇండియాకెళ్ళి పోదలచుకోకపోతే, ఇలాగే సగం బానిసగా మూర్ఖత్వంలోపడిఉండ వలెననేనా మీ అభిప్రాయం ? | | |

[కలోనియల్ ఆఫీస్ రికార్డులు నెం. 179 వాల్యూమ్ 189.]

# 28. నేటాల్ గవర్నర్ వద్దకు రాయబారం

డర్బాన్,
3 జూలై, 1894.

నేటాల్ కాలనీ గవర్నర్, కమాండర్-ఇన్-ఛీఫ్,
వైస్ ఎడ్మిరల్, నేటివ్ జనాభాకు సర్వాధికారి, అయిన
గౌరవనీయులైన సర్ వాల్టర్ ఫ్రాన్సిస్ హీలీ హచిన్‌సన్,
కె.సి.యం.జి. గారి దివ్యసముఖమునకు,

1 జూలై 1894 తేదీని డర్బాన్‌లోని ప్రముఖ భారతీయుల సమావేశం జరిగింది. గత సాయంకాలం నేటాల్ కాలనీ లెజిస్లేటివ్ అసెంబ్లీ సమావేశంలో మూడవ పర్యాయం పరిశీలింప బడిన ఎన్నికల చట్టం సవరణబిల్లు విషయమై, తమవద్దకు ప్రతినిధి వర్గంగా వెళ్లవలసినదిగా పై సమావేశంలో మమ్మల్ని కోరేరు.

ప్రస్తుతరూపంలో యీబిల్లు, బ్రిటిష్ పౌరుడైనా కాక పోయినా, ఓటర్లజాబితాలో లేని ప్రతిభారతీయునీ ఓటరు కాకుండాచేస్తున్నది.

ఈ బిల్లును ప్రవేశపెట్టడం ఘోరమైన అన్యాయమనీ, కొంతమందిభారతీయులకు యిది హానికరమనీ చెప్పటానికి సాహసిస్తున్నాం.

ఇంగ్లాండులో, బ్రిటిష్ పౌరుడైన ఏవ్యక్తయినా సరే, తగిన యోగ్యత ఉంటే, కుల, మత, వర్ణ విచక్షణలేకుండా ఓటుచేయ టానికి అవకాశమున్నది.

కాని యీకాలనీలోని పరిస్థితుల విషయమై విపులంగాచెప్పి మీ అనుగ్రహాన్ని దుర్వినియోగం చేయదలచుకోలేదు. లెజిస్లేటివ్

అసెంబ్లీకి సమర్పించిన అర్జీకాపీ నొకదానిని దీనికి జతపరచు కుంటున్నాము. దీనిని తమరు శ్రద్ధతో పరిశీలించవలసినదిగా మా ప్రార్థన.

మాసమస్య మాకు న్యాయమైనదిగానే తోస్తున్నది. అందు వల్ల దానిని బలపరుస్తూ ఏమీచెప్పనక్కరలేదనే భావిస్తున్నాము.

బ్రిటిష్ పౌరుడైన భారతీయుడు ఎన్నటికీ ఓటుచేసే అర్హతను పొందకుండా నిరోధించే యీ బిల్లును, బ్రిటిష్ మహారాణి ప్రతినిధులైన మీరు అంగీకరించరనే మేము భావిస్తున్నాం.

ఈ విషయంలో, తమకు అర్జీ* సమర్పించుకుంటాం. డర్బాన్‌లో యీ ప్రతినిధివర్గాన్ని కలుసుకుని మాట్లాడడానికి తమరు దయతో అనుమతించినందులకు మా కృతజ్ఞత.

(సం.) యం. కె. గాంధీ,
మరి ఆరుగురు.

[నేటాల్ గవర్నర్ సర్ వాల్టర్ హీలీ హచిన్‌సన్, కాలనీల సెక్రటరీ ఆఫ్ స్టేట్ లార్డ్ రిప్పన్‌కు, 16 జూలై 1894 న పంపిన 62 వ ఉత్తరం. 2 వ అనుబంధంలో నుంచి.]

---

*నిజానికి నేటాలు గవర్నరుకు యిదిగాక వేరే అర్జీ పంపబడలేదు. బహుశా గాంధీజీ ఆయన అనుచరులు వేరొక అర్జీని పంపుదామనుకుని ఉండవచ్చు. కాని అవసరం లేకపోయింది. ఈ అర్జీకూడా తిరస్కరింపబడింది. బిల్లు ప్రతిదశా త్వరగా పూర్తికావింపబడి, మహారాణి అనుమతి పొందటానికై, లార్డ్ రిప్పన్‌కు పంపబడింది. అందువల్ల సర్ వాల్టర్ హీలీ హచిన్‌సన్ ద్వారా, లార్డ్ రిప్పన్‌కు, ఆయన నిర్ణయంకోసం, రెండవ అర్జీ పెట్టవలసివచ్చింది.

# 29. నేటాల్ కౌన్సిల్‌కు అర్జీ

డర్బాన్,
4 జూలై, 1894

లెజిస్లేటివ్ కౌన్సిల్ అధ్యక్షుని, సభ్యులనూఉద్దేశించి మిస్టర్ కేంప్‌బెల్ యీ దిగువ అర్జీని దాఖలుచేశారు.

నేటాల్ కాలనీలో నివసిస్తున్న, యీదిగువ సంతకములుచేసిన భారతీయులు సమర్పించిన అర్జీ.

నేటాల్ కాలనీలో నివసిస్తున్న భారతీయులు తమతరఫున యీ వినయపూర్వకపు అర్జీని, లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు పంపవలసిందిగా, క్రింద సంతకములుచేసిన మమ్ములను నియోగించినారు. ఓటింగుహక్కు-చట్టానికి ప్రతిపాదించబడిన సవరణబిల్లు విషయంలో యీ అర్జీ యివ్వబడుతున్నది. పై సవరణబిల్లు, 2 జూలైన, లెజిస్లేటివ్ అసెంబ్లీలో మూడవసారి చర్చించబడింది. దీని విషయంలో మాకుగల కష్టనష్టాలను గురించి, యిక్కడ విశదీకరించి మేము చెప్పదలచుకోలేదు. లెజిస్లేటివ్ అసెంబ్లీకి సమర్పించిన వినతిపత్రంలో యీ కష్టనష్టాలనుగురించి భారతీయులమైన మేము విపులంగా విన్నవించుకున్నాం. ఆ వినతి పత్రాన్ని ఒకసారి పరిశీలించవలసిందిగా, మిమ్ములను కోరుతున్నాం. దాని కాపీ ఒకటి ఈ అర్జీకి జతపరుస్తున్నాం. ఈఅర్జీపై సుమారు 500 మంది భారతీయులు సంతకాలు చేశారు. ఈ పని చేయటానికి ఒక్కరోజుకంటె వ్యవధి లేకపోయింది. తగినంత వ్యవధి ఉన్నట్లయితే, వివిధ జిల్లాల నుంచి వచ్చిన వార్తల ఆధారంగా, ఈ అర్జీపై పదివేలమందివరకు సంతకాలుచేసి ఉండేవారని అనుకుంటున్నాం. లెజిస్లేటివ్ అసెంబ్లీ మా ప్రార్థనలోని న్యాయాన్ని గుర్తించి, దానిని ప్రసాదిస్తుందని యీ అర్జీదారులమైన మేము ఆశించాం. కాని మా ఆశలు అడియాసలైనాయి. అందువల్ల యీ అర్జీని జాగ్రత్తగా పరిశీలించి, న్యాయసమతలు

ఆధారంగా, లెజిస్లేటివ్ కౌన్సిల్ తనకుగల సవరణ హక్కులను వినియోగిస్తుందనే ఆశతో మిమ్మల్ని కోరడానికి సాహసించాం. ఈ అర్జీ విషయంలో, దిగువ సంతకములుచేసిన వారిలో కొంత మంది, గౌరవనీయులైన దిగువసభాసభ్యులలో కొందరిని కలుసుకున్నారు. ఆసభ్యులందరూ, భారతీయుల ప్రార్థనలోని న్యాయాన్ని గుర్తించారు. కాని యీ విన్నపం ఆలస్యంగా జరిగిందని భావించి నట్లుగా కనబడుతున్నది. ఈ విషయమై వాదోపవాదాలకు దిగకుండా, ఆలస్యం జరిగిందని అనుకున్నప్పటికీ, యీ బిల్లు చట్టం కావటంవల్ల సంభవించే విషాదపరిణామాలను గుర్తించవలసిందిగా, అర్జీదారులమైన మేము కోరుతున్నాం. మా ప్రార్థన అతిసామాన్య మైనది, న్యాయమైనది. అందుచేత విన్నపంచేయటం ఆలస్యమైనదనే కారణాన్ని నిజానికి గౌరవనీయులైన సభ్యులు యీ అర్జీ విషయంలో పాటించకూడదు. ఇంతకంటె సామాన్య పరిస్థితుల్లో, నాగరిక దేశాలలోని పార్లమెంటులు, కమిటీ పరిశీలించిన బిల్లులను కూడా సవరించటం లేక త్రోసిపుచ్చటం జరిగిన సందర్భాలు ఎన్నో ఉన్నాయి. వాటిని పేర్కొనటం అంతకష్టమైన పనికాదు. ఐరిష్ హోంరూల్ బిల్లును లార్డ్సుసభ ఏ పరిస్థితుల్లో నిరాకరించిందీ, మేము చెప్పనక్కరలేదు. ఓటింగు హక్కుచట్టపు సవరణబిల్లు, యథాతథంగా ఆమోదించబడి, చట్టంకావడంతో ఓటర్ల జాబితాలోలేని ఏ భారతీయుడు కూడా, అతని యోగ్యతలు ఏమైన ప్పటికీ, ఓటరు అయ్యే సావకాశంలేకుండా పోయింది. ఇది అతి తీవ్రమైన చర్యని మీకు విన్నవించుకుంటున్నాం. లెజిస్లేటివ్ కౌన్సిల్ యీ బిల్లును ఆమోదించకుండా, పునఃపరిశీలనకు అసెంబ్లీకి పంపుతుందని, అర్జీదారులమైన మేము ఆశిస్తున్నాం.

ఈ విషయంలో న్యాయం చేకూర్చవలసిందిగా మా ప్రార్థన.

(*నేటాల్ ఎడ్వర్టైజర్*, 5-9-1894.)

---

# 30. దాదాభాయి నౌరోజీకి వ్రాసిన ఉత్తరం

*గాంధీజీ దాదాభాయి నౌరోజీకి వ్రాసిన అనేక ఉత్తరాలలో ఇది మొదటిదిలా కనుబడుతుంది. దాదాభాయికి దక్షిణాఫ్రికాలో ఉండే భారతీయుల సమస్యలన్నీ బాగా తెలుసును. 1891 వ సంవత్సరం నాటికే అచటి భారతీయులు తమ సమస్యలను బ్రిటిష్ ప్రభుత్వానికి నివేదించమని ఆయనను కోరేరు. ఉత్తరం పూర్తిపాఠం లభ్యం కాలేదు. దాదాభాయి నౌరోజీ : భారత భీష్మపితామహుడు* (దాదాభాయి : ది గ్రాండ్ ఓల్డు మేన్ ఆఫ్ ఇండియా) *అని ఆర్. పి. మసానీ వ్రాసిన గ్రంథంలో నుండి ఈ క్రింది భాగాలు ఉల్లేఖింపబడినవి.* (పుట 468-9)

డర్బాన్,
జూలై 5, 1894.

నేటాలులో బాధ్యతాయుత ప్రభుత్వమేర్పడిన పిమ్మట వెలసిన మొదటి పార్లమెంటు, ప్రధానంగా భారతీయపార్లమెంటే. ఏమనగా ఎక్కువగా భారతీయులకు అననుకూలమైన శాసనాలను చేయడంతోనే దానిపని సరిపోయింది. లెజిస్లేటివ్ కౌన్సిలును, శాసనసభను ప్రారంభిస్తూ, గవర్నరు తనమంత్రులు, నేటాలులోని భారతీయులు అనుభవిస్తున్న ఎన్నికహక్కునుగురించి విచారిస్తారని చెప్పేరు. భారతీయులు అటువంటి ఎన్నికహక్కును తమ స్వదేశంలో ఎన్నడూ అనుభవించలేదన్నారు. భారతీయులకుగల ఎన్నికహక్కును పూర్తిగా తొలగించడానికి ప్రతిపాదింపబడనున్న చట్టానికి, అదేకారణంగా చెప్పేరు. వారు ఇదివరకెన్నడూ వోటు హక్కును ఉపయోగించలేదనీ, అందుకు వారనర్హులనీ చెపుతున్నారు.

భారతీయులిచ్చిన విన్నపంలో ఇందుకు తగినసమాధానం చెప్పబడింది. కనుక వారిప్పుడు తిరుగబడి బిల్లుయొక్క అసలు ఉద్దేశాన్ని బయటపెట్టేరు. వారి అభిప్రాయమిది. భారతీయులిక

ఇక్కడుండడం మాకిష్టంలేదు. మాకు కూలీలు కావాలి. కాని వాళ్లు నౌకర్లుగామాత్రమే ఉండాలి. వాళ్లపని అయిపోవడంతోనే ఇండియాకెళ్లిపోవాలి.' మీరెక్కడున్నా ఏపరిస్థితుల్లో ఉన్నా, మీ పలుకుబడి నిస్సంశయంగా భారతీయులకొరకే ఉపయోగపడుతున్నది. కనుక ఈ విషయంలో మీరు ప్రత్యేక శ్రద్ధవహించి కృషిచేయవలెనని మనవిచేస్తున్నాను. భారతీయులు మిమ్ములను బిడ్డలు తండ్రిని చూచుకున్నట్లే చూచుకుంటున్నారు. నిజానికి ఇక్కడి ప్రజలభావం అలాగే ఉన్నది.

నన్నుగురించి ఒక్క మాటచెప్పి విరమిస్తాను. నేనింకా చిన్నవాడిని. అనుభవం చాలదు. తప్పులు చేయడానికెన్నోసావకాశాలున్నవి. నేను వహించినబాధ్యత, నాసమర్థతకు మించిన వ్యవహారం. ఈ పనంతటినీ నేను ఏవిధమైన ధనాపేక్షా లేకుండానే చేస్తున్నానని మనవిచేస్తున్నాను. కనుక ఇచటి భారతీయులను కష్టపెట్టి, నేను ధనసంపాదన చేయడంకొరకు, నేనీతలమించినపనికి పూనుకొనలేదని తమరు గ్రహించగలరు. ఈ విషయమై వ్యవహారం జరుపడానికి నేనొక్కడనే ఉన్నాను. కనుక తాముదయచేసి, తగిన సలహాల నిచ్చి నన్ను సరియైనమార్గంలో నడిపిస్తే, మీకెంతో కృతజ్ఞుడను. తండ్రి సలహాలను బిడ్డ పాటించినట్లే మీ సలహాలను నేను పాటిస్తాను.

---

# 31. నేటాల్ కౌన్సిలుకిచ్చిన రెండవ అర్జీ

డర్బాన్,
జూలై 6, 1894.

గౌరవనీయులైన నేటాలు కాలనీ లెజిస్లేటివ్ కౌన్సిలు అధ్యక్షుల వారికీ, సభ్యులకూ, నేటాలు కాలనీలో నివసిస్తున్న భారతీయులు సమర్పించుకున్న వినతిపత్రం. సవినయంగా తమచిత్తానికి తెచ్చే దేమనగా :

(1) 'ఎన్నికహక్కుల సవరణచట్టమును' గురించి గౌరవనీయమైన మీ కౌన్సిలు వారికి విన్నపంచేయడానికి, ఈ కాలనీలో నివసిస్తున్న భారతీయులు ఈ వినతిదారులను నియమించినారు.

(2) 1894 సంవత్సరం జూలై నాల్గవతేదీని గౌ. మిస్టర్ కేంబెల్ ద్వారా మేము సమర్పించుకున్న వినతిపత్రం, సక్రమంగా లేనందున, తిరిగి ఈ వినతిని దాఖలుచేసి మీ అమూల్యమైన కాలాన్ని అతిక్రమించ వలసి వచ్చినందుకు మేము చింతిస్తున్నాము.

(3) మీరు చర్చచేస్తున్న బిల్లు ఇచ్చటి భారతీయ నివాసులలో అపారమైన అసంతృప్తినీ, ఆశాభంగాన్నీ కలిగించినదని, ఇచ్చటి భార తీయుల విశ్వాసానికి పాత్రులమై బాధ్యత వహించిన మేము మీ కౌన్సిలువారికి నివేదిస్తున్నాము. బిల్లులోని హంశాలను భారతీయులు అవగాహన చేసుకొన్నకొద్దీ 'సర్కారు బాబులు మమ్ములను చంపదలచు కున్నారు. మాకేమిగతి ?' అనే మాటలను మేము వింటున్నాము.

(4) ఏదో ఉబుసుపోకకు ప్రజలిలాంటి అభిప్రాయాలను ప్రకటించ డంలేదు. మనసారా బాధపడే అంటున్నారు. కనుక వీటిని గురించి గౌరవ నీయమైన మీ కౌన్సిలువారు చాలా తీవ్రంగా ఆలోచించవలసి ఉంటుందని గౌరవపురస్సరంగా మీకు మనవిచేసుకుంటున్నాము.

(5) మీ కౌన్సిలువారు రెండవమారు ఈ బిల్లును చర్చించిన సందర్భంలో భారతీయులు వోటంటే ఏమిటో ఎరుగరని నిరూపించడానికి ప్రయత్నం జరిగింది. కాని ఆ సంగతి నిజంకాదని మేము సగౌరవంగా మనవిచేయడానికి సాహసిస్తున్నాం. ఎన్నికహక్కువల్ల లభ్యమయ్యే విశేష లాభాలేమిటో వారు బాగా ఎరుగుదురు. దానిలో ఉండే బాధ్యతలను కూడా వారు గుర్తించారు. ఈ బిల్లు అడుగడుగుకూ చెందుతున్న పరిణామాన్ని భారతీయులు ఎంతటి ఉద్రేకంతోనూ, ఆత్రతతోనూ పరిశీలిస్తున్నారో మీ కౌన్సిలువారు స్వయంగా చూడాలనే మేము కోరుతున్నాము.

(6) భారతీయులందరికీ అంతటి ఎరుక ఉన్నదనికాని, వారంతా అంతటి ఆవేశంతో ఉన్నారనికాని మేము చెప్పడంలేదు. కాని అలాంటి భావం సర్వసాధారణంగా వ్యాపించి ఉన్నదనే మనవిచేస్తున్నాం. అంతే కాకుండా, వోటింగుకు అనర్హులైన భారతీయులులేరని కూడా మా అభిప్రాయంకాదు. కాని భారతీయులందరికీ మొత్తంగా వోటుహక్కు లేకుండా చేయడానికి కారణమేమీలేదని విన్నవిస్తున్నాము.

(7) ఈ బిల్లు అమలులో కొచ్చినట్లయితే సంభవించే కొన్ని అక్రమ ఫలితాలను మేము ఈ క్రింద ఉదహరిస్తున్నాము:

(ఎ) ఈ బిల్లు ప్రకారం వోటర్ల పట్టికలో ఈ వరకున్న వారల్లే ఉంటారు. ఇదివరలో ఆహక్కును వినియోగించుకోనని వారు ఆపట్టీలో కొత్తగా చేరడానికి శాశ్వతంగా అవరోధం ఏర్పడింది.

(బి) భారతీయులైన నేటిపెద్దలు వోటుచేయడానికి సావకాశమున్నది. కాని వారిసంతతివారు, సర్వవిధములా వారికన్న అధికులైనప్పటికీ, ఎన్నటికీ వోటుచేయలేరు.

(సి) ఆచరణలో కంట్రాక్టు నౌఖరీలోనున్న భారతీయులూ, స్వేచ్ఛాళువులైన భారతీయులూ ఒకేస్థాయిలో ఉంచబడ్డారు.

(డి) ఇటీవలనే బయటపడిన బిల్లుయొక్క మూల సిద్ధాంతాన్ని ఒక్కసారి చూద్దాం. ప్రస్తుతంలో ఇండియాలో వోటుహక్కును వినియోగించగలిగిన భారతీయు డెవ్వడూలేడనీ, భారతీయులకూ యూరోపియనులకూ చాలా భేదమున్నదనీ,

వారూవీరూ ఎంతకాలం కలసిమెలసి ఉన్నా, భారతీయుడైనవాడు ఈ అమూల్యమైన వోటు హక్కును వినియోగించలేడని ఈ బిల్లు నిర్ధారణ చేయదలచుకున్నట్లు కనబడుతుంది.

(8) వోటింగుహక్కుగల తండ్రి, తనకుమారుడు ప్రజాహిత జీవితంలో పాల్గొనాలనే ఆశతో, చాలాధనాన్ని ధారాళంగా ఖర్చుపెట్టి చదువు చెప్పించికూడా, ఎన్నిక సంస్థలు గలిగినప్రతినాగరిక దేశంలోనూ, విద్యావంతులైన ప్రతివారూ జన్మహక్కుగా అనుభవించే ఈ వోటింగు హక్కు, తనకొడుకుకు లేకపోవడం కళ్ళారాచూడవలసి వస్తున్నది. ఇది న్యాయమా అని ఈ వినతిపత్రం సమర్పించుకుంటున్న మేము సవినయంగా అడుగుతున్నాం.

(9) ఆసియావాసులను వోటుచెయ్యనిచ్చినట్లయితే, ప్రభుత్వమే రంగుజాతుల అనగా భారతీయుల రాజ్యమైపోతుందని మీరు భయపడు తున్న విషయాన్ని మేము వివరించడానికి కుతూహలపడుతున్నాం. కాని, మా అభిప్రాయాలను గౌరవనీయమైన మీ కౌన్సిలువారి ఎదుట నివేదించడాని కిది సమయంకాదని సంకోచిస్తున్నాం. ఇప్పట్లో ఒక్క సంగతి మాత్రమే చెప్పదలచుకున్నాం. మా అభిప్రాయం ప్రకారం అలాంటి ఉపద్రవం ఎన్నటికీ సంభవించదనీ, ఒకవేళ ఎప్పటికో అలాంటిది సంభవ మనుకున్నా, దానిని అసంభవం చేయడానికి ఇప్పుడే నిషేధాలను చేయడం అసమయమనీ, విన్నవిస్తున్నాం.

(10) ఈ చట్టం బ్రిటిష్‌పౌరులలో కొందరిపట్ల పక్షపాతమును, మరికొందరిపట్ల ద్వేషాన్ని చూపిస్తున్నదని వినతిదారులమైన మేము గౌరవపురస్సరంగా మనవిచేస్తున్నాం. బ్రిటిష్ ఇండియన్ పౌరులను యూరోపియనులతోపాటు సమానంగాచూస్తే, కాలనీలోని ఆదిమనివా సులవంటి ఇతర బ్రిటిష్‌పౌరులనుకూడా అలాగే చూడనక్కర లేదాయని అంటున్నారు. వెగటుగా ఉండే ఉపమానాలు మేము చెప్పదలచుకోలేదు. ఏ సిద్ధాంతాలమీద బ్రిటిష్ ఇండియన్ పౌరులను ఆదరించాలో వివరించిన 1858 సంవత్సరం నాటి రాణీగారి ప్రకటన నుండి ఈ క్రింది భాగాలను ఉదహరిస్తున్నాం :

మా రాజ్యంలోని ఇతర పౌరులను ఏరీతిగా పాలిస్తున్నామో, అదేప్రకారంగా భారతదేశంలోని (నేటివ్) ప్రజలనుకూడా పరి

పాలించడం మావిధి. భగవంతుని ఆశీర్వచన ప్రభావంవలన, మేమా ధర్మాన్ని హృదయపూర్వకముగానూ, విశ్వాసంతోనూ నిర్వహించెదముగాక! మా ప్రజలలో ఎవరైనా సరే, ఏ ఉద్యోగాన్నైనా సరిగా నిర్వహించడానికి తగిన విద్యాబుద్ధులు సమర్థత ఉన్నవారయితే, జాతిమత భేదాలు లేకుండా వారినందరినీ మా ఉద్యోగాల్లో చేర్చుకోవలెనని మానిశ్చయం. వారి ఐశ్వర్యమే మాబలం. వారు సంతుష్టిచెందడమే మాకు రక్షణ. వారి కృతజ్ఞతయే మాకు ఉత్తమమైన బహుమానం.

(11) పైన ఉదహరింపబడిన ప్రకటనలో వివరించబడిన ప్రకారమున్నూ, 1833 సంవత్సరం ఛార్టరు ప్రకారమున్నూ, ఇండియాలో ప్రధాన న్యాయమూర్తివంటి బాధ్యతగల పదవులకు భారతీయులు నియమింపబడినారు. అయినప్పటికీ బ్రిటిష్ వలసరాజ్యమైన ఈ దేశంలో, మాకు మా సోదరులకు మాబిడ్డలకు సర్వసాధారణంగా ఉండవలసిన పౌరసత్త్వపు హక్కును లేకుండాచేయడానికి ప్రయత్నం జరుగుతోంది.

(12) భారతీయులకు స్థానికస్వపరిపాలనేకాని రాజకీయ స్వపరిపాలన తెలియదని ఇప్పుడు అంటున్నారు. ఆమాటకూడా ఇప్పుడు నిజం కాదని మేము మనవిచేసుకుంటున్నాం. ఒకవేళ నిజమేనని అంగీకరించినా, పార్లమెంటరీ ప్రజాస్వామికం అమలులో ఉన్న దేశంలో వారికి రాజకీయమైన వోటింగుహక్కు లేకుండా చేయడానికది కారణమెట్లాగవుతుంది? నిజంగా ఆలోచించవలసిన సంగతొక్కటే, మేము ఎవరికోసం ఈ హక్కును కోరుతున్నామో, వారున్నూ మేమున్నూ సమర్థులం, అర్హులం, అవునా కాదా అన్న పరీక్ష ఒక్కటే జరగాలని మామనవి. ఏ రష్యావంటి నిరంకుశ రాజ్యాన్నుంచో వచ్చినవ్యక్తి, ప్రజాప్రతినిధుల పరిపాలనంటే తెలుసుకోలేక పోయినా, దానిని హర్షించకపోయినా, గౌరవనీయులైన మీ కౌన్సిలువారు, ఇతరత్రా అతడు అర్హుడైనపుడు ఆయనకు వోటింగుహక్కు లేకుండా చేయరని మా నమ్మకం.

(13) ముగించేముందు మెకాలేప్రభువు చెప్పిన ఈ క్రిందిమాటలను చిత్తగించవలసినదిగా మీ గౌ. కౌన్సిలును కోరుచున్నాము: "మేము స్వతంత్రులము. నాగరికులము. కనుక మాతోపాటే అటువంటి స్వతంత్రమును, నాగరికతను మానవజాతిలో కొంతమంది కోరినప్పుడు దానిని కాదనడంవల్ల మాకొచ్చే ప్రయోజనంలేదు."

(14) పైన వివరింపబడిన సంగతులనుబట్టీ, వాదనలనుబట్టీ, మిగతావాటి మాటఎట్లున్నా, భారతీయులు ఓటింగుహక్కును సరిగా ఉపయోగించగలరా అనే హంశాన్ని విచారించడానికైనా ఒక విచారణ సంఘాన్ని నియమించదగునని మేము నమ్ముచున్నాము. భారతీయులను వోటు చేయనిస్తే, వారి వోట్లతో యూరోపియను ఓట్లను ముంచేస్తారనీ, ప్రభుత్వాన్ని వశపర్చుకుంటారనే భయం ఎంతవరకు సబబైనదో కూడా ఆ సంఘం విచారించవచ్చును. ఇందుకు సంబంధించిన ఇతర ముఖ్య విషయాలమీదకూడా వారు విచారణ జరిపించవచ్చును. కనుక గౌరవనీయమైన మీ కౌన్సిలువారు, మీకు ఉచితమని తోచిన న్యాయమైన సిఫార్సులతో సదరుబిల్లును గౌ. లెజిస్లేటివ్ అసెంబ్లీకి తిరిగి పంపవలసినదని మేము ప్రార్థిస్తున్నాము.

మీరు న్యాయబుద్ధితోనూ దయతోనూ ఈ పని చేస్తే మేము విధిగా కృతజ్ఞులము................వగైరా.

[ నేటాల్ పార్లమెంటు లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు, 1894 సంవత్సరం 6 వ జూలై నాడు, హాజీ మహమ్మద్ హాజీదాదా, మరి ఏడుగురు భారతీయుల తరఫున గౌ. మిస్టర్ కేంబెల్ దాఖలు చేసిన పిటీషను.

కలోనియల్ ఆఫీసు రికార్డులు నెం. 181—వాల్యూం 38]



# 32. భారతీయులు—వోటింగుహక్కు

*[1894 సం. రం జూలై 7వ తేదీని నేటాల్ మెర్క్యూరీ పత్రిక 'ఇండియన్ విలేజ్ కమ్యూనిటీస్' (భారతదేశపు గ్రామ పంచాయితీలు) అనే సంపాదకీయ వ్యాసంలో, నేటాల్‌లోని భారతీయులు, వోటింగుహక్కుల సవరణ చట్టాన్ని గురించి లెజిస్లేటివ్ కౌన్సిలుకు సమర్పించిన వినతిపత్రంమీద వ్యాఖ్యానిస్తూ, భారతదేశంలోని గ్రామాలలోఉండే ప్రజాప్రాతినిధ్యపుసంస్థకూ, పార్లమెంటరీ ప్రభుత్వ విధానానికీ ఏవిధమైన పోలికాలేదని వ్రాసింది. తమదేశంలో వారు వోటింగుహక్కును వినియోగించుకొనలేదుకనుక, ఇక్కడకూడా ఈ బిల్లుప్రకారం వారికి వోటుహక్కు లేకుండాచేయబడింది. పురాతనకాలంనుంచీ తమ గ్రామపంచాయితీలలో వోటింగుపద్ధతి ఉండేదని భారతీయులు వాదించారు. నేటాల్ మెర్క్యూరీ ఆ అభిప్రాయం సరికాదన్నది. 'విలేజ్ కమ్యూనిటీస్ ఇన్ ది ఈస్టు అండ్ వెస్టు, (ప్రాక్ పశ్చిమ దేశాలలో గ్రామ పంచాయితీలు) అని సర్ హెన్రీ సూమర్ మేయిన్ వ్రాసిన గ్రంథంలో, పురాతనకాలంనుండీ, భారతీయులకు ప్రజాప్రతినిధి సంస్థలలో పాల్గొనే అలవాటున్నదని వ్రాశాడు. ఆ విషయాన్నికూడా నేటాల్ మెర్క్యూరీ కాదన్నది. భారతదేశపు గ్రామ పంచాయితులలో రాజకీయమైన ప్రాతినిధ్యంలేదనీ, ఒక భూమి తగాల విషయమే గ్రామ పంచాయితీ సంఘం పట్టించుకునేదనీ నేటాల్ మెర్క్యూరీ వ్రాసింది. గ్రామ పంచాయితీ విధానం ఆదిమజాతులందరికీ ఉన్నదనీ, ఆ పద్ధతినిచూస్తే భారతీయులు చాలా వెనుకబడున్నారనీ ఆ పత్రిక వ్రాసింది. రాజకీయంగా భారతీయులింకా శైశవావస్థలో ఉన్నారని నైన్‌టీన్ సెంచురీ (19వ శతాబ్దం) అనే పత్రికలో సర్ జార్జ్ ఛెస్నీ వెలిబుచ్చిన అభిప్రాయాన్ని ఉల్లేఖించింది. దానికి జవాబుగా గాంధీజీ ఇలా వ్రాశారు.]*

డర్బాన్,
జూలై 7, 1894.

నేటాల్ మెర్క్యూరీ సంపాదకులకు

అయ్యా,

ఈ రోజున మీ పత్రికలో బహుచక్కగా, సమర్థతతో వ్రాయబడిన సంపాదకీయ వ్యాసాన్ని చదివి ఆనందించాను. వోటింగుహక్కునుగురించిన పిటిషన్ విషయమై వ్యతిరేకంగా చెప్పడానికేమీ ఉండదని మేమనుకోలేదు. ఈ ఆధునికయుగంలో, ఏ సమస్యకైనా రెండో అభిప్రాయం లేకుండాఉండడం చాలా

ఆశ్చర్యకరమైన విషయం. మానవాతీతమైన సంగతనే అంటాను. ఆ సిద్ధాంతం ప్రకారం, మీకు పనికొచ్చే గ్రంథకర్త సర్ జార్జి ఛస్నే ఒక్కడేకాడు. సర్ హెన్రీ సూమర్ మేయిన్ కూడా మానవమాత్రుడే. కనుక ఆయన సిద్ధాంతాలనూ నిర్ణయాలనూ కూడా కాదనేవారుండడం సహజమే. ప్రతికూలభావాలను మానవుడు తప్పించుకుపోలేడు. ఏమైనా ప్రస్తుతానికి నేను రెండో అభిప్రాయాన్ని వ్యక్తం చేయదలచుకోలేదు. మరొక ప్పుడు సావకాశంగా ఆ విషయాన్ని వివరిస్తాను.

మీ కొకవిషయాన్ని తెలియచేసి మిమ్మల్ని ఆశ్చర్య పరచడానికే నేనీ ఉత్తరం వ్రాస్తున్నాను. మైసూరు సంస్థానం వారు తమ ప్రజలకు రాజకీయమైన ఎన్నికహక్కుల నిచ్చారని మీకు తెలియజేయటానికి నేను సంతోషిస్తున్నాను. ఒక పత్రికా ప్రకటననుండి ఈ క్రిందిభాగాలను ఉల్లేఖిస్తున్నాను :

> దివాన్‌గారు వివరించిన పద్ధతిప్రకారం నూరు రూపాయలకు మించిన పన్ను చెల్లించే భూఖామందులుగాని, 13 రూపాయలకుమించి మొహతర్ఫాను చెల్లించేవారుగాని ప్రజాప్రతినిధిసభ (రిప్రజెంటెటివ్ అసెంబ్లీ) ప్రతినిధుల ఎన్నికలో వోటుచేయడానికి అర్హులు. తాము ప్రతినిధులుగా ఉండడానికికూడా అర్హులు. అంతేకాకుండా, తాలూకాలో ఉండే అనుద్యోగులైన పట్టభద్రులందరికీ ప్రతినిధులను ఎన్నుకొనే హక్కునూ, స్వయంగా ప్రతినిధిగా నిలబడే హక్కున్నూ ఇవ్వబడింది. అందువల్ల ఆస్థిపరులకున్నూ, బుద్ధిమంతులకున్నూ అసెంబ్లీలో స్థానమేర్పాటు చేయబడింది. ప్రజాసంస్థలకు, మ్యునిసిపాలిటీలకు, స్థానిక సంస్థలకు ప్రతినిధుల నెన్నుకొనే హక్కివ్వబడింది. మొత్తం ఎన్ను కోబడే ప్రతినిధుల సంఖ్య 347. వీరిని ఎన్నుకొనేవారి సంఖ్య దాదాపు 4,000.

అయ్యా, సద్భావసమేతులైన మిమ్ముల నొక్కమాటడుగు తున్నాను. ఈ రెండు దేశాలకుండే చీలికలను బయటికితీసి వాటిని గోరంతలు కొండంతలుచేసి ప్రజలకు చూపించడంకంటె,

రెండు దేశాల ప్రజలకూ ఉండేపోలికలను ప్రదర్శించడంవల్ల మీరు మానవజాతికెక్కువ సేవచేసిన వారౌతారు కదా? ఊహా మాత్రమై, ఎక్కడో మూల అణిగిఉండి మానవ వైషమ్యాన్ని మాత్రమే ప్రకోపింపచేసే భేదాలను బయటపెట్టడంవల్ల ఎవరికేమి మంచికలుగుతుంది? ఈ రెండు జాతులమధ్య ఈర్ష్యను, ద్వేషాలను వెదజల్లడంవల్ల మీకేమీ క్షేమం కాదనుకుంటాను. ఆ పని చేయడంకూడా మీకు శక్తిసాధ్యమని నే ననుకోను. మీకే కాదు, ఎవరి శక్తికీ సాధ్యంకాదు. కాని మీరు చేయగలిగిన ఉన్నతమైన మహాత్కార్యమొకటున్నది. ఆ పనిచేస్తే మీకు ఘనతకలుగుతుంది. మంచి లభిస్తుంది. అంతకన్న విశేషమేమంటే 1200 సంవత్సరాలనుండి నిరంకుశత్వంలో పడున్నా, ఆశ్చర్యంగా, నలిగిపోకుండాఉన్న ఒక జాతియొక్క కృతజ్ఞత కూడా మీరు పొందుతారు—ఆ పనేమంటే, భారతదేశాన్ని గురించీ, ఆ ప్రజలనుగురించీ ఈ కాలనీలో ఉండేవారికి సరియైన భోగట్టానిచ్చి విజ్ఞానవంతులను చేయడం.

ఇట్లు

మో. క. గాంధీ.

[*నేటాల్ మెర్క్యూరీ* 11—7—1894.]



# 33. నేటాల్ గవర్నరుకు లేఖ

నేటాల్ కాలనీ గవర్నరు, సర్వసేనాని, ఆదిమవాసులైన ప్రజలకు సర్వాధికారి, అయిన ఘనతవహించిన ఆనరబుల్ సర్ వాల్టర్ ఫ్రాన్సిస్ **హీలీ హచిన్సన్** కె. సి. యం. జి. గారికి.........

ఈ దిగువ సంతకములుచేసిన భారతీయులు గౌరవపురస్సరముగా వ్రాసుకున్న విన్నపము.

1. నేటాల్ కాలనీలో నివసిస్తున్న భారతీయులకు ప్రతినిథులమైన మేము, వోటింగుహక్కుల చట్ట సవరణబిల్లు సందర్భంలో, ఘనతవహించిన మీకు ఇందుమూలముగా కొన్ని సంగతులను విన్నవించుకుంటున్నాము.

2. ఘనతవహించిన తాము, పైనచెప్పబడిన బిల్లును సీమ రాణీగారి అంగీకారం నిమిత్తం బ్రిటిష్ప్రభుత్వంవారికి పంపనున్నారని మాకు తెలిసింది.

3. అందువల్ల బిల్లునుగురించి లండన్‌లోని బ్రిటిష్ ప్రభుత్వంవారి కొక విన్నపాన్ని మేము పంపుకుంటున్నాం.

4. ఆపిటీషనును మేము సాధ్యమైనంత త్వరలో మీకు పంపుకుంటాము.

5. పైన చెప్పబడిన మా పిటీషనును, హోంగవర్నమెంటు వారికి అందచేసే నిమిత్తం మీకు మేము దాఖలుచేసుకునేవరకూ, మీరు హోంగవర్నమెంటువారికి పంపేకాగితాలను ఆపుచేయవలసినదిగా సగౌరవంగా ప్రార్థిస్తున్నాం.

ఈ విధంగా న్యాయంచేసి అనుగ్రహించినట్లయితే ఘనతవహించిన శ్రీవారికి, వినతిదారులమైన మేము కృతజ్ఞులము.........వగైరా.

(సం) మో. క. గాంధీ,
మరి పదుగురు.

[16 జూలై 1894 సం. తేదీని నేటాల్ గవర్నరు సర్ వాల్టర్ హీలీ-హచిన్‌సన్, వలసరాజ్యాల కార్యదర్శి లార్డ్ రిప్పన్‌కు పంపిన 62 నెం. కాగితాలలో 6 వ కాగితం.]

[కలోనియల్ ఆఫీసు రికార్డులనుండి, 189 వా. నెం. 179.]

# 34. దాదాభాయి నౌరోజీకి లేఖ

C/o మెస్సర్సు దాదాఅబ్దుల్లా అండ్ కంపెనీ.
డర్బాన్,
జూలై 14, 1894.

ఆనరబుల్ శ్రీ దాదాభాయి నౌరోజీ, యం. పి. గారికి.....

అయ్యా,

నేను లోగడ ఈ నెల 7 వ తేదీని వ్రాసిన ఉత్తరం తరువాయిగా, వోటింగుహక్కుల సవరణ చట్టానికి ప్రతికూలంగా జరుగుతున్న ఉద్యమం ఈ విధంగా అభివృద్ధి అవుతున్నదని మీకు తెలియజేసుకుంటున్నాను.

ఈ నెల 7 వ తేదీని బిల్లు లెజిస్లేటివ్ కౌన్సిలులో 3 వ సారి ఆమోదింపబడింది. కౌన్సిల్‌వారి కిచ్చిన రెండవ విన్నపం అందుకోబడినది. కౌన్సిల్‌వారు పిటీషన్‌ను విచారించేదాకా 3 వ సారి చర్చను నిలుపుచేయవలసినదని ఒక గౌరవనీయసభ్యుడు ప్రతిపాదించాడు. ఆ ప్రతిపాదన నిరాకరింపబడింది.

మహారాణీ తుదిఆజ్ఞకు లోబడి గవర్నరు బిల్లుకు తన ఆమోదాన్నిచ్చాడు. మహారాణీ ఆ బిల్లును త్రోసివేయ దలచుకోలేదని గవర్నరు ప్రకటనచేసిన తర్వాతనే అది చట్టమవుతుందని బిల్లులో ఒక షరతున్నది.

హోంగవర్నమెంటువారికి అందచేయడానికిగాను మేము గవర్నరుకు బహుశా 17 వ తేదీని అందచేయనున్న పిటీషను ప్రతి నొకదానిని, ఇందుతో పంపుతున్నాను. దాదాపు 10 వేల మంది భారతీయులు దానిమీద సంతకం చేస్తారు. ఇప్పటికించుమించు 5 వేలమంది సంతకాలైనాయి.

కౌన్సిలు వారికిచ్చిన పిటీషన్ కాపీని మీకు పంపజాల నందుకు చింతిస్తున్నాను. అందులోని చాలా విషయాలు ప్రచు రింపబడిన వార్తాపత్రికను పంపుకుంటున్నాను.

ఇంతకుమించి వ్రాయవలసిన దేమీలేదు. ఇక్కడి పరి స్థితులు చాలా విషమంగా ఉన్నాయి. వోటింగుహక్కుల బిల్లు చట్టమైతే, పదేళ్ల యేసరికి ఈ కాలనీలో భారతీయులస్థితి దుర్భర మైపోతుంది.

ఇట్లు
విధేయుడు,
మో. క. గాంధీ.

[గాంధీజీ స్వదస్తూరీతో వ్రాసిన ఉత్తరం ఫోటో కాపీ]



## 35. రిప్పన్ ప్రభువుకు విన్నపం

*గాంధీజీ తన 'ఆత్మకథ'లో, భారతీయుల వోటింగు హక్కులనుగురించి తాను ఈ పిటీషనును ఎంతో కష్టపడి తయారుచేశాననీ, 15 రోజులలో పదివేలమంది సంతకాలు చేయించాననీ వ్రాశారు. నేటాలు ప్రధాన మంత్రి, ఈ పిటీషనును గవర్నరుకు పంపుతూ దానిని నిరాకరించవలసిన కారణాలన్నీ ఉదహరించాడు.*

డర్బాన్,
జూలై 17, 1894

మహోఘనతవహించిన మహారాణి ప్రభుత్వంలో, వలసరాజ్యాలకు ప్రధానకార్యదర్శిగారైన, ఘనతవహించిన రైటానరబుల్ మార్క్విస్ ఆఫ్ రిప్పన్‌వారి సముఖానికి—

ప్రస్తుతం నేటాలు కాలనీలో నివసిస్తున్న ఈ దిగువ సంతకములు చేసిన భారతీయులు గౌరవపురస్సరముగా నివేదించు విన్నపములు...

1. ఈ దిగువ సంతకాలుచేసిన విజ్ఞప్తిదారులు, నేటాలు కాలనీలో వివిధ జిల్లాలలో నివసిస్తున్న భారతీయ బ్రిటిష్ పౌరులు.

2. ప్రభువువారి విజ్ఞప్తిదారులలో కొందరు వర్తకవ్యాపార రీత్యా, ఈ కాలనీకివచ్చి ఇక్కడ స్థిరపడినారు. మరికొందరు ఈ దేశానికి మొదట్లో కూలీలుగా బలవంతంగా పంపబడి, చాలాకాలమైన పిమ్మట (30 సంవత్సరాలు కూడా) స్వేచ్ఛను పొందినవారు. ఇంకా కొందరు జానిసలుగా ఉన్న భారతీయులు. కొందరు ఈ కాలనీలోనే పుట్టి, ఇక్కడే చదువుకుని, ప్లీడరు గుమాస్తాలుగాను, కాంపౌండర్లుగాను, కంపోజిటర్లు (అచ్చు కూర్చువారు) గాను, ఫోటోగ్రాఫర్లుగాను, బడిపంతుళ్లు గాను, కాలక్షేపంచేస్తున్నవారు. ఈ అర్జీదారులలో కొందరు ఈ కాలనీలలో భూఖామందులై ఉన్నారు. లెజిస్లేటివ్ అసెంబ్లీ మెంబర్ల

ఎన్నికలలో వోటుచేసే అధికారం వారికున్నది. ఇందులో కొందరికి వోటింగుహక్కుకు తగినంత ఆస్తి, అర్హత ఉన్నప్పటికీ, ఏదోకారణంచేత వారిపేర్లు వోటర్ల జాబితాలో నమోదుకాలేదు.

3. నేటాల్ లెజిస్లేటివ్ కౌన్సిలు గత సమావేశంలో, కాలనీ ప్రధానమంత్రి ఆనరబుల్ సర్ జాన్ రాబిన్సన్ చేత ప్రవేశపెట్టబడిన వోటింగు హక్కు సవరణబిల్లు సందర్భంలో, విజ్ఞప్తిదారులమైన మేము ఈ విన్నపం చేసుకుంటున్నాము. సదరుబిల్లు 2వ సారి చర్చింపబడి ఆమోదింప బడింది. హిస్ఎక్సెలన్సీ గవర్నరుగారి ఆమోదం పొందింది. రాణీగారి ఆమోదానికి వేచిఉంది.

4. ఈ కాలనీలో నివాసమేర్పరుచుకున్న ఆశియావాసులందరినీ, పార్లమెంటుఎన్నికలలో వోటుచేయకుండా నిషేధించడమే సదరుబిల్లు యొక్క అభిప్రాయమైయున్నది. అయితే, ప్రస్తుతమున్న వోటర్ల జాబితాలో న్యాయంగా చేర్చబడినవారిని మాత్రం తొలగించడంలేదు.

5. కాలనీలో ఉన్న రాజ్యాంగంద్వారా, ఈ అన్యాయాన్ని తొలగించుకుని న్యాయం పొందడానకిగాను మేము సాగించిన ఉద్యమం యొక్క సంగ్రహచరిత్రను ప్రభువువారికి తెలుపడానికి అనుమతిని వేడు కుంటున్నాము.

6. వోటింగుహక్కుల సవరణచట్టం రెండవసారి చర్చింపబడి ఆమోదింపబడినప్పుడు మేము గౌరవనీయమైన లెజిస్లేటివ్ అసెంబ్లీవారికి విన్నపం చేసుకున్నాము. రెండవసారి చర్చ ముగిసిన రెండు రోజులకే కమిటీ స్థాయిగడచి, మరొక్కరోజులో మూడవ్వరీడింగుకూడా అయిపోయి, బిల్లు ప్యాసయిపోతుందని మాకు తెలిసినది. వెంటనే, మూడవరీడింగు వాయిదా పడితే తప్ప, అసెంబ్లీవారికి మేము పిటీషను దాఖలుచేసుకునే సావకాశంలేదు. కనుక, మేము లెజిస్లేటివ్ అసెంబ్లీవారికి, మూడవ రీడింగు వాయిదావేయమని టెలిగ్రాఫ్ ద్వారా పిటీషన్ సమర్పించు కున్నాం. వారు ఉదారంగా ఒక్కరోజు వాయిదా దయచేశారు. ఆ ఒక్కరోజులోను సుమారు 500 మంది భారతీయులు సంతకాలుచేసి మరునాడే లెజిస్లేటివ్ అసెంబ్లీవారి ఎదుట ఒక పిటీషనును దాఖలుచేసు కున్నాం. మా ప్రతినిధివర్గంవారు మారిజ్‌బర్గులో కొందరు గౌరవ నీయులైన శాసనసభ్యులను కూడా కలుసుకున్నారు. ప్రధానమంత్రినీ,

అటార్నీ జనరల్‌నుకూడా కలసి మాట్లాడేరు. మా ప్రతినిధివర్గాన్ని చాలా మర్యాదగా ఆదరించి మావాళ్లు చెప్పినదంతా ఓపికగా విన్నారు. మేము కలుసుకుని మాట్లాడినవారంతా ఇంచుమించుగా, పిటీషన్‌లోని మా కోరిక చాలా న్యాయమైనదని అంగీకరించారు. కాని అందరూ మేము ఆ పిటీషనును ఆలస్యంగా ఇచ్చామన్నారు. గౌరవనీయులైన ప్రధానమంత్రిగారు ఆ పిటీషనును పరిశీలించడానికి బిల్లు మూడవరీడింగును నాల్గురోజులు వాయిదా వేయమని కోరేరు. లెజిస్లేటివ్ కౌన్సిలువారికి వెరులాం, రిచ్‌మండ్‌రోడ్, మొదలైన చోట్లనుంచి ఈ పిటీషనును బల పరుస్తూ టెలిగ్రాములు కూడా ఇవ్వబడ్డాయి. కాని అవి ఒకసభ్యుని ద్వారా అందచేయబడలేదనే కారణంచేత వాటిని నిరాకరించారు. మేమిందులో ఉదహరించిన పిటీషనుల నకళ్లను ప్రభువువారికి దీనితో జతపర్చి పంపలేదు. ఏమనగా ప్రభుత్వమువారే తప్పకుండా వాటి నన్నిటినీ ప్రభువువారికి పంపి ఉంటారు.

7. మేము పిటీషన్ దాఖలుచేసిన నాల్గురోజులకు, అనగా 1894 సం.రం జూలై 2వ తేదీ సోమవారంనాడు మా ఆశలకు భిన్నంగా, మూడవరీడింగు పూర్తిచేసి మాకు కష్టంకలుగచేశారు.

8. తరువాత మంగళవారమునాడు మేము గౌరవనీయమైన లెజిస్లేటివ్ కౌన్సిలువారికొక విన్నపాన్ని, గౌ. మిస్టర్ కేంబెల్ ద్వారా దాఖలు చేసుకున్నాం. ఆ పిటిషన్‌లో గౌ. లెజిస్లేటివ్ అసెంబ్లీ ప్రస్తావన ఉన్నదనే కారణంచేత, అది క్రమంగాలేదని త్రోసివేయబడింది. బిల్లు రెండవరీడింగు పూర్తి అయిపోయింది. మాకీసంగతి తెలిసినవెంటనే, ఏ విధమైన జాప్యంచేయకుండా గౌ. కౌన్సిలువారికి మరొక పిటీషన్ తయారుచేశాం. దానిని గురువారంనాడు పంపుకున్నాం. శుక్రవారం నాడు ఆ సభ్యుడే దానిని కౌన్సిలువారి ఎదుటపెట్టేడు. ఈలోగా, రెండవసారి చర్చముగిసిన ఒక్కరోజులో బిల్లు కమిటీస్థాయిలోనుంచి కూడా దాటిపోయింది. ఆనరబుల్ మిస్టర్ కేంబెల్ మేమిచ్చిన పిటీషన్‌ను విచారించడానికి మూడవసారిచర్చ (మూడవరీడింగు) ను వాయిదా వేయ వలసినదని ప్రతిపాదించారు. పిటీషన్ దాఖలుచేయడంలో చాలా ఆలస్యం జరిగిందనే కారణంచెప్పి ఆ ప్రతిపాదనను త్రోసివేశారు. బిల్లు, కౌన్సిలు వారి ఎదుట పట్టుమని నాల్గురోజులైనా ఉండలేదని ప్రభువువారు గుర్తించగలరు. ఘనతవహించిన గౌ. సర్ వాల్టర్ యఫ్. హీలీ హాచిన్

సన్‌గారికి విషయాలన్నిటిని నివేదించడానికి, భారతీయ ప్రముఖులంతాచేరి ఒక ప్రతినిధివర్గాన్ని నియామకంచేశారు. ఆయన ప్రతినిధివర్గాన్ని సమర్యాదగా ఆదరించారు. ఎగువసభలోనూ దిగువసభలోనూ సభ్యులుగా నున్న శాసనసభ్యుల వ్యక్తిగతమైన అభిప్రాయాలను తెలుసుకోవడానికి, కొందరు భారతీయులొక సంఘంగా ఏర్పడి, కొన్ని ప్రశ్నలను తయారుచేసి వాటికి జవాబు లిప్పించమని శాసనసభ్యులందరికీ సర్క్యులర్లు అచ్చొత్తించి పంపేరు. ఆ సర్క్యులరు నకలున్నూ, ఆ ప్రశ్నావళియున్న మెమోరాండమున్నూ ఇందుతో జతపరచుచున్నాము. ఇంతవరకు ఒక్క గౌరవనీయ సభ్యుడు మాత్రమే జవాబిచ్చాడు.. ఆయనకూడా ప్రశ్నలకు జవాబివ్వలేదు.

9. వోటింగుహక్కుల బిల్లును విమర్శించడానికి ముందు, పిటీషనర్లమీద చేయబడిన ఒక ఆరోపణకు ముందుగా జవాబు చెప్పనివ్వండి. గౌ. అసెంబ్లీవారి ఎదుట మేము చాలా ఆలస్యంగా విన్నపం చేసుకున్నామని ఒకసారు చెప్పబడింది. నిజానికి చట్టప్రకారం మేమెంతో జాప్యం చేసినట్లుకాదు. రాణీగారి పాలితులైన భారతీయుల హక్కులను తారుమారుచేసే, ఎన్నో ప్రధానసమస్యలు ఈ బిల్లులో ఇమిడి ఉన్నాయి. కనుక బిల్లును 3వ రీడింగు పూర్తిఅయ్యేలోపల గౌరవనీయమైన లెజిస్లేటివ్ కౌన్సిలువారు తమ నిర్ణయాన్ని పునఃపరిశీలన చేసియుండవచ్చునని మాత్రం మనవిచేస్తున్నాం.

10. ఆసియావాసు లెన్నడూ వోటింగుహక్కును ఉపయోగించుకున్నవారుకారనీ, దానిని ఉపయోగించుకోగల అర్హత వారికిలేదనీ బిల్లు చర్చల సందర్భంలోనూ, బిల్లుయొక్క ఉపక్రమణికలోనూ చెప్పబడింది. కనుక, భారతీయుల వోటింగుహక్కును తీసివేయడానికివే ముఖ్య కారణములనుకుంటాము. మేము గౌరవనీయమైన అసెంబ్లీకి సమర్పించిన పిటీషను పైరెండు కారణాలకూ తగినసమాధానమిస్తున్నదని నమ్ముతున్నాం.

11. ఆసియావాసులకు వోటింగు హక్కును తొలగించడానికి చెప్పబడిన రెండు కారణాలూ నిస్సారమైపోయాయని బహిరంగంగా ఇది సిద్ధమని అంగీకరించకపోయినా, గుంభితంగా అంగీకరించినట్లే. ఏమనగా బిల్లు రెండవరీడింగులో వోటింగుహక్కును లేకుండాచేయడానికి నైతిక

కారణాలను, న్యాయాలను చెబుతూవచ్చిన గౌ. అసెంబ్లీవారు, మూడవ రీడింగులో కేవలం రాజకీయకారణాలతోనే బిల్లును సమర్థించారు. భారతీయులను వోటు చేయనిస్తే, వారు తమవోట్లతో యూరోపియను వోట్లను ముంచేస్తారనీ, యూరోపియనుల ప్రభుత్వానికి బదులు ఆసియా వాసుల ప్రభుత్వమేర్పడుతుందనీ చెప్పబడింది.

12. గౌరవనీయమైన ఉభయశాసనసభలూ మన్నిస్తే, పైన చెప్పబడిన భయానికేమీ సావకాశంలేదని ప్రభువువారికి మేము విన్న వించడానికి సాహసిస్తున్నాం. ఇప్పుడు, యూరోపియను వోటర్ల సంఖ్యతో పోల్చిచూస్తే, భారతీయ వోటర్లసంఖ్య చాలాతక్కువ. కూలీలుగా ఉన్న భారతీయులకు వోటింగుహక్కుకు తగినంత ఆస్థిపాస్థులు లేకపోవడం చేత, వారు జానిసలు (Indenture) గా ఉండే కాలంలోనూ తర్వాత చాలా కాలంవరకూ ఆ హక్కును పొందజాలరు. బుద్ధిపూర్వకంగా స్వంత సొమ్ముతో ఈ కాలనీకొచ్చినవారు శాశ్వతంగా ఉండరనీ, కొన్ని సంవత్సరాలైన తర్వాత స్వదేశానికి వెళ్లిపోతారనీ, వారిస్థానే కొత్తవారు వస్తుంటారనీ, అందరికీ ప్రఖ్యాతిగా తెలిసినవిషయమే. కనుక, వ్యాపారస్థులైనవారి వోట్లసంఖ్య ఎప్పుడూ మారదు. మరొక్కవిషయం కూడా మరువడానికి వీలులేదు. కాలనీ రాజకీయాలలో యూరోపియనుజాతులు తీసుకునేటంత శ్రద్ధను, భారతీయులు తీసుకోరు. యూరోపియనుల జన సంఖ్య 45 వేలు. భారతీయుల సంఖ్యకూడా అంతే. అయినప్పటికీ యూరోపియను వోటర్లసంఖ్యకూ భారతీయ వోటర్లసంఖ్యకూగల తారతమ్యం ప్రధానంగా గమనింపదగిన సంగతి. కొన్నితరాలదాకా, భారతీయుడెవ్వడూ నేటాలు పార్లమెంటులో సభ్యుడుగా ప్రవేశించడానికి ఆశించడమే సంభవంకాదని ప్రభువువారికి మేము మనవిచేస్తున్నాము. అందుకేవిధమైన దాఖాలా అక్కరలేదని కూడా విన్నవించుకుంటున్నాము.

13. ప్రభువువారికి అర్జీనిస్తున్న మేము వోటింగుహక్కును ఉపయోగించడానికి అర్హులమైనప్పుడు, కాలనీ ప్రభుత్వ వ్యవహారాల్లో, ముఖ్యంగా స్వపరిపాలనలో, కొంతజోక్యం కలిగించుకుంటే అనర్థమేమిటి?

14. ఈ బిల్లు ప్రత్యక్షంగా చాలా అభివృద్ధినిరోధకమైనదనిన్నీ, మిక్కిలి అన్యాయమనిన్నీ మేము ప్రభువువారికి మనవిచేయడానికి సాహసిస్తున్నాము.

15. న్యాయంగా ఇప్పుడు వోటర్లలిస్టులో నున్నవారిని తొలగించకుండా ఉంచడంవల్లనే, వోటింగుహక్కును వినియోగించడానికి పిటీషనర్ల హక్కులను, అర్హతలను, అందుకుతగిన బాధ్యతలను గుర్తించడం జరుగుతున్నదని మా అభిప్రాయం. చర్చల సందర్భంలో నిరూపణచేయడానికి ప్రయత్నించిన విధంగా, మేము వోటుచేయడానికి తగిన అర్హులం కాకపోయినప్పటికీ, లిస్టులో ఉంచబడ్డామని మేము విశ్వసించడంలేదు.

16. బిల్లులోని 2వ క్లాజు, తగినంత న్యాయం చేస్తున్నదని అన్నారు. అది చేయడంలేదని మేము మనవి చేస్తున్నాం. అంతేకాకుండా, ఆ క్లాజు, లిస్టులో ఉన్నవారికీ లేనివారికీకూడా మనస్తాపం కలిగిస్తున్నది.

17. తాము వోటు చేయవచ్చునుగాని, తమ సంతతివారు ఎంతటి విద్యావంతులైనా, అర్హులైనా వారుమాత్రం వోటుచేయకూడదంటే, ప్రస్తుతం (జాబితా) లిస్టులో ఉన్నవారికేమీ సంతృప్తిని కలిగించదు. ఈ బిల్లు చట్టమైనట్లయితే, కాలనీలో శాశ్వత నివాసమేర్పరచుకున్న భారతీయులలో తమ సంతానానికి ఉన్నతవిద్యను చెప్పించాలనే ఉత్సాహమే పోతుంది. తమకొడుకులు సంఘంలో ఏ విధమైన గౌరవ స్థాయీలేకుండా, జీవితంలో ఉన్నతాశయాలు లేకుండా, కడజాతివారిగా ఉండటానికి వారు ఇష్టపడరు. మానవులు ఏ లక్ష్యంకోసం ధనార్జన చేస్తారో ఆ లక్ష్యాన్ని మొగ్గగా ఉండగానే త్రుంచివేయడం జరుగుతోంది.

18. రెండవ క్లాజు, ఇదివరకునుంచీ కాలనీలో నివసిస్తున్నవారికి మరొక చీకాకు కలిగిస్తోంది. తమకన్న ఏ విధంగానూ అధికులుగాని కొందరు సోదరులు, యథాలాపంగా వోటుచేయడానికి హక్కు కలిగి ఉండగా, తమవశంలోలేని కొన్నికారణాలవల్ల, వోటర్ల జాబితాలో తమపేర్లు చేరనంతమాత్రాన తమకాహక్కు లేకపోవడం వారికి కష్టం కలిగిస్తోంది. తద్వారా బిల్లు ఒకే వర్గానికి చెందిన ఇండియన్ బ్రిటిష్ పౌరులలో కేవలం యథాలాపంగా ఏర్పడిన స్థితిగతుల మూలంగా లేనిపోని విభేదాలు కల్పిస్తున్నది.

19. రెండవ క్లాజువల్ల జరిగిన న్యాయానికి పిటీషనర్లైన మేము కృతజ్ఞతను తెలుపుటలేదనికూడా చూచాయగా చెప్పబడింది. ఆ రెండవ క్లాజును ఒప్పించడంలో ప్రభుత్వం న్యాయంచేయాలని ఎంత అనుకున్నా, వారి సద్భావాన్ని గౌరవిస్తూ, దానిలో న్యాయంమాత్రం మాకు

కనబడడం లేదని ప్రభువువారికి మనవిచేస్తున్నాం. ఆ విషయాన్ని కొందరు గౌరవనీయసభ్యులుకూడా అంగీకరించారు. ఆ వోట్లు అచిర కాలంలో ఊడిపోతాయి కనుక, ఆ రెండవ క్లాజు ఉన్నా, ఊడినా వారంత పట్టించుకోలేదు. ఆ విషయం స్పష్టంగానే కనుబడుతోంది.

20. ఈ పిటిషనరులైన మమ్ములను, దక్షిణాఫ్రికాలోని ఆదిమ వాసులతో సరిపోల్చడానికి జరిగిన తీవ్రమైన ప్రయత్నాలను మేము విచారముతోను, బిడియంతోనూ గుర్తించాము. భారతీయులు బ్రిటిష్ పౌరులైనంతమాత్రానే వారికి వోటింగుహక్కుంటే, ఇక్కడి ఆదిమ వాసులకుకూడా వోటుచేయడానికి ఎక్కువ అర్హతలున్నాయని తరుచుగా చెప్పబడుతూ వచ్చింది. ఆ విధంగా పోల్చడంగురించి మే మేమీ పేచీ పడదలచుకోలేదు. కాని 1858 సం. రం. రాణీగారి ప్రకటనను చిత్తగించమనే ప్రభువువారిని కోరుతున్నాం. పైగా భారతజాతిని గురించి మీకు స్వయంగానే ఉన్న అనుభవాన్ని గుర్తుకు తెచ్చుకోవలసినదని ప్రార్థిస్తున్నాం. ఇండియన్ బ్రిటిష్ పౌరులప్రభుత్వాలకున్నూ, ఆదిమవాసులైన బ్రిటిష్ పౌరులప్రభుత్వాలకున్నూ, సుస్పష్టంగా కనబడే భేదమును గురించి మేము ప్రత్యేకంగా తమకు నిరూపించనక్కరలేదు.

21. ఈ బిల్లు చట్టమైనట్లయితే, ఈ పిటిషనులో సంతకములు చేసిన వందలాది విద్యావంతులైన భారతీయులు, పార్లమెంటు ఎన్నికలలో వోటుచేయడానికి సావకాశముండదు. బ్రిటిష్ పౌరులైన ఒక వర్గము వారికి ఇటువంటి అన్యాయాన్ని చేసే బిల్లుకు అంగీకారమివ్వవలసినదిగా, మహోఘనతవహించిన మహారాణీగారికి మీవంటి ప్రభువులు సలహా నివ్వరని మేము పూర్తిగా నమ్ముతున్నాము.

22. 27 వ మార్చి 1894 తేదీని ప్రచురింపబడిన నేటాల్ గవర్నమెంటు గెజెట్‌లో, 1893 సం. రం. తాలూకు ఇండియన్ ఇమిగ్రెంట్ స్కూలు బోర్డువారి నివేదికలో, ఆ సంవత్సరం 26 స్కూళ్ళలో 2589 మంది విద్యార్థులు చదువుకుంటున్నట్లు ప్రకటింపబడింది. ఈ పిల్లలు —అందులో చాలామంది కాలనీలో జన్మించినవారే—పూర్తిగా యూరోపియను పద్ధతులమీద పెరుగుతున్నవారేనని మనవిచేస్తున్నాం. వారు తమ భవిష్యజ్జీవితంలో ముఖ్యంగా యూరోపియను జాతులతోనే కలిసి మెలసి ఉంటారు. కనుక వోటింగుహక్కును వినియోగించడంలో

సర్వవిధాల వారు ఏ యూరోపియనుకూ తీసిపోరు; విద్యావిషయాల్లో వారు యూరోపియనులతో పోటీచేయలేకపోయేటంత ప్రధాన లోపముంటే తప్ప. కాని వారటువంటి అసమర్ధులుకారని ఆ విషయాలనెరిగిన వారు నిస్సంకోచంగా నిర్ధారణ చేశారు. ఇండియాలోనూ ఇంగ్లండులోనూ, ఇంగ్లీషు విద్యార్థులకూ భారతీయ విద్యార్థులకూ జరుగుచున్న పోటీల ఫలితాలవల్ల యూరోపియనులతో భారతీయులు జయప్రదంగా పోటీ చేయగలరని కావలసినన్ని ఆధారాలు కనుబడుతున్నాయి. పార్లమెంటరీ కమిటీవారి ఎదుట ఇవ్వబడిన సాక్ష్యాలనుంచి కాని, ఈ విషయమై గొప్పరచయితలు వ్రాసిన వాటినుండిగాని ఉదాహరణలను ప్రత్యేకించి చూపించడం బుద్ధిపూర్వకంగానే మానివేశాము. ఏమంటే, అలాచేయడం కమ్మరవీధిని సూదులమ్మడమే అవుతుంది. కనుక, ఇలా చదువుకున్న పిల్లలు పెద్దవాళ్లైన పిమ్మట వారికి వోటింగుహక్కు నిమ్మనమని అడుగడం, ఏ నాగరిక దేశంలోని మనిషైనా తన జన్మహక్కుగానే భావిస్తాడు కదా! ఆ హక్కుకు ప్రతిబంధకం కలిగితే ఎవరైనా కటకట పడతారుకదా? పార్లమెంటరీ సంస్థలమూలంగా పరిపాలింపబడే దేశంలోని పౌరుడైన ప్రతివాడూ, సామాన్యంగా అనుభవించేహక్కును ఈ పిల్లలకు నిరాకరించి వారిని న్యూనతపరచే పనిని ప్రభువువారు ఎన్నటికీ చేయరని మేము దృఢంగా నమ్ముతున్నాం.

23. ఆనరబుల్ మిస్టర్ కేంబెల్, డాన్‌సా గారలు, స్వంతఖర్చుమీద కాలనీకొచ్చిన భారతీయులకు జరుగబోయే అన్యాయాన్ని గుర్తించినందులకు మేము చాలా కృతజ్ఞులం. కాని వారుకూడా ఇతర సభ్యుల అభిప్రాయానుసారంగానే, (ఇన్‌డెన్‌చరు) కంట్రాక్టు నౌఖర్లుగా వచ్చిన వారికిమాత్రం ఎన్నటికీ వోటుండకూడదనే అభిప్రాయంలోనే ఉన్నారు. ఇతరత్రా అర్హతలున్నప్పుడు, పేదరికమొకటే అపరాధం కాకూడదని మే మీ సందర్భంలో చెప్పకతప్పదు. అయినప్పటికీ కంట్రాక్టుకూలీలకు, కంట్రాక్టులో ఉన్నంతవరకూ వోటుహక్కుండకూడదంటే కొంతవరకు అంగీకరిస్తాము. తరువాత జీవితంలో వారు తగినన్ని అర్హతలు సంపాదించుకున్నప్పటికీకూడా శాశ్వతంగా వారికి వోటులేకుండాచేయడానికి, అంగీకరింపజాలమని సగౌరవంగా ప్రభువువారికి మనవిచేస్తున్నాం. స్వంతఖర్చులమీద ఇక్కడికొచ్చేవారు విధిగా పిన్నవయస్కులు. దేహదారుఢ్యం కలవారు. వారు కంట్రాక్టు కూలీలుగా ఉన్నప్పుడూ,

ఆ పైన స్వేచ్ఛను సంపాదించుకున్న పిమ్మటా, వారు శీఘ్రంగా తెల్లవారి యొక్క నాగరికతను జీర్ణం చేసుకుని పూర్తిగా కాలనీవారై పోతున్నారు. వారు ఒకరి జోలికెళ్ళకుండా ప్రశాంతంగా జీవిస్తుంటారు. నిజానికి కాలనీకి వారు చాలా ఉపయోగంగా ఉంటారనీ, వారి సేవ అమూల్యమనీ గుర్తింపబడింది. ప్రస్తుతం సర్కారులో గుమాస్తాలుగానూ, (దుబాష్) ద్విభాషులుగానూ, బడిపంతుళ్ళుగానూ, వకీలు గుమాస్తాలుగానూ పనిచేస్తున్న విద్యావంతులైన భారతీయయువకులు చాలామంది, ఈ కాలనీకి కంట్రాక్టు నౌకరులుగానే వచ్చారు. అటువంటివారికీ, వారి బిడ్డలకూ వోటుహక్కును తొలగించి, తమ పరిపాలనావిధానంలో పాల్గొనకుండా చేయడం చాలా దుర్మార్గమని మనవిచేస్తున్నాము. కేవలం ఆసియా జాతివాడైనంత మాత్రంచేతనూ, ఒకప్పుడు కంట్రాక్టు కూలీగా ఉండడంచేతనూ, ఇతరత్రా ఎన్ని అర్హత లున్నప్పటికీ, అతనికి రాజకీయ స్వాతంత్ర్యము, రాజకీయ హక్కులు లేకుండా చేయడం సబబు కాదని మేము మనవిచేస్తున్నాము.

24. ఈ బిల్లు ప్రకారం భారతీయుని, స్థితి, ఇచటి ఆదిమ నివాసి కన్న నికృష్టంగా ఉన్నదని మేము ప్రభువువారి చిత్తమునకు నివేదిస్తున్నాము. తగిన అర్హతలు సంపాదించుకుంటే కొత్తగావచ్చిన ఆదిమ నివాసి స్వేచ్ఛను సంపాదించుకుని అన్ని హక్కులకూ అర్హుడవుతాడు. కాని, ఇండియన్ బ్రిటిష్ పౌరుని కొక్కసారి ఓటింగుహక్కుపోతే, ఇక మళ్లీ అది లభ్యంకాదు. వోటింగుహక్కు తొలగించబడినప్పుడు, తరువాత కూడా అతడెంత సమర్థుడైనా, ప్రతిభను సంపాదించినా, ఏమీ లాభంలేదు.

25. ఈ బిల్లుదరహాం మీద చాలాదారుణంగా ఉన్నది. ఎంతటి ప్రముఖుడైన భారతీయుడు నేటాలువచ్చి స్థిరనివాసమేర్పరచుకున్నప్పటికీ, ఇచటి పరిపాలకుల అభిప్రాయంప్రకారం, ఆయన ఓటుచేసే హక్కుకు అర్హుడుకాడు కనుక, ఆయనకు వోటుండదు. కాబట్టి ఇది భారతజాతినంతనూ అగౌరవపరచడమే. ఈ కష్టాన్ని ఉభయ శాసన సభలలోని గౌరవనీయసభ్యులు గుర్తించారు. అందువల్లనే గౌరవనీయుడైన కోశాధికారి, ముందు ముందు కొందరు వ్యక్తుల విషయంలో ప్రత్యేకంగా గమనించవలసివస్తే పార్లమెంటు ఆలోచిస్తుందనికూడా శలవిచ్చారు.

26. ఈ విషయాన్ని సమగ్రంగా అవగాహన చేసుకోనేటందుకు, పూర్వపు నేటాలు లెజిస్లేటివ్ కౌన్సిలులో ఈ వోటు సమస్య చర్చింపబడినప్పటి కాగితాలను, సర్కారు గెజెట్లను ప్రభువువారు చిత్తగించవలెనని కోరుతున్నాం. నేటాలు వ్యవహారాలకు సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరాలు ప్రకటింపబడిన గవర్నమెంటు ప్రచురణ (సి. 3796, 1883) నుండి, మిస్టర్ సాండర్సు, కలోనియల్ ఆఫీసుకు వ్రాసిన లేఖలోని ఈ క్రింది భాగాలను (6వ పేజీ) మేమిచట ఉల్లేఖిస్తున్నాము :

> ఈ సంతకాలు పూర్తిగా ఉండాలనీ, ఎన్నికదారుని స్వదస్తూరిలో ఉండాలనీ, ఇంగ్లీషు అక్షరాల్లో ఉండాలనీ, కొన్ని నియమాలు ఏర్పాటుచేస్తే, ఆసియావాసులు పౌరులుగావచ్చి ఇంగ్లీషువారిని ముంచెత్తే ప్రమాదాన్ని చాలావరకు అరికట్టవచ్చును.

మిస్టర్ సాండర్సు ఆసియావాసులకు ఎంత ప్రతికూలుడైనప్పటికీ, ఇంతకు మించిపోలేకపోయాడు :

> భారతీయులలో ఉత్తమశ్రేణిలోనివారు, తమకున్నూ కొత్తగా వచ్చిన కూలీలకున్నూ తేడాఉన్నదని అంగీకరిస్తారు.

కనుక అప్పటి ప్రభుత్వమువారు భారతీయులలోగల తారతమ్యాలను గుర్తించడానికి సంసిద్ధంగా ఉన్నట్లు స్పష్టమవుతోంది. ఇప్పుడు ఎక్కువ స్వతంత్రం కలిగిన పరిపాలనాసంస్థలయాజమాన్యం క్రింద అందరు భారతీయులను, అనగా కంట్రాక్టు కూలీలను, కంట్రాక్టునుంచి విడిపడ్డ వారిని, స్వతంత్రులను కూడా ఒకేస్థాయిలో ఉంచడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ప్రస్తుతం చర్చింపబడుతున్న బిల్లుతో పోలిస్తే మిస్టర్ సాండర్సు చట్టం చాలా స్వల్పమైనదనే మేము మనవిచేస్తున్నాం. కాని ఆ చట్టమే రాణీగారి ఆమోదాన్ని పొందలేదు. కనుక ఈ వోటింగు హక్కుల సవరణబిల్లు అసలే ఆమోదింపబడకూడదని మా మనవి. ఆ పుస్తకంలోనే 7వ పేజీలో, వలసవచ్చినవారికి, రక్షణ ఏర్పాటుచేసే ఉద్యోగి మిస్టర్ గ్రేవ్సు ఇలా అన్నాడు :

> ఇండియాకు తిరిగి వెళ్లిపోవడానికి తమకూ, తమ కుటుంబాలకూ ఉచితంగా ఓడ ప్రయాణపుటిక్కట్టును కోరని భారతీయులందరూ ఓటుహక్కుకు న్యాయంగా అర్హులని నా అభిప్రాయం.

మిస్టర్ సాండర్సు సూచించిన దస్కతు పరీక్ష, ఆ పరణాలో యూరో పియను వోటర్ల విషయంలో కూడా అమలు జరుగడంలేదని ఆయన చాలా న్యాయంగానే చెప్పేడు. ఆ పేజీలోనే అప్పటి అటార్నీ జనరల్ నివేదికలో ఈ విధంగా ఉన్నది:

> నేను వ్రాసినచట్టం ముసాయిదాలో కొన్ని క్లాజులు సెలెక్టు కమిటీవారి సిఫార్సుల ననుసరించి వ్రాయబడినవని తెలుసుకోన వచ్చును. పరదేశస్థులందరికీ మొత్తంగా వోటు అర్హతను తీసివేయడం మంచిదికాదనే అభిప్రాయంతో, మిస్టర్ సాండర్సు ఉత్తరంలో వివరింపబడిన ప్రత్యామ్నాయపు సూచనలను సెలెక్టు కమిటీవారు అంగీకరించారు.

అదే ప్రభుత్వ ప్రచురణ (బ్లూబుక్) 91వ పేజీలోనున్న, అటార్నీ జనరల్ నివేదికను చిత్తగించమని ప్రభువు వారిని కోరుతున్నాము. ఆ అటార్నీ జనరల్‌గారే మరొక నివేదికలో వ్రాసిన ఈ విషయాలను తమకు నివేదించడానికి ఎంతో కుతూహలపడుతున్నాము. ఆ నివేదిక 14 వ పేజీలో ఆయన ఇలా వ్రాశాడు:

> కాలనీలో అమలులోనున్న సాధారణ చట్టములో ఉదహరింపబడిన జాతులుతప్ప, మిగిలిన అన్ని జాతుల వారికీ, దేశాలవారికీ వోటింగు హక్కు లేకుండా చేయాలనే ఈ సూచన యొక్క ఉద్దేశం. బహుశా ప్రస్తుతం ఈ కాలనీలో భారతీయులు, క్రియోల్ లు అనుభవిస్తున్న ఎన్నికహక్కులను తొలగించడానికే అనుకుంటాను. 12 నెంబరు బిల్లుమీద నే నిదివరలో ఇచ్చిన నివేదికలో చెప్పినట్లే, ఇటువంటి శాసనం చేయడంలో న్యాయంకాని, అవసరంకాని నేను గుర్తించ లేకుండా ఉన్నాను.

27. కాలనీలోని రాజ్యాంగ పరిపాలన కెక్కువ స్వాతంత్ర్యము లభించి, విస్తృతమై మమ్ములనందరినీ కలుపుకోవలసిన సమయంలో, ప్రథమ బాధ్యతాయుత మంత్రివర్గము, మా స్వాతంత్ర్యాన్ని అరికట్టి, మా కందరికీ పూర్తిగా వోట్లులేకుండా చేయడానికి ప్రయత్నిస్తున్నారని చెప్పవలసివచ్చినందుకు మేము చాలా చింతిస్తున్నాము. గత పరిపాలనలో మాహక్కులను కొద్దిగా సంకుచితపరచే ప్రయత్నాలు జరిగినప్పుడు,

హోంగవర్నమెంటువారు అందుకంగీకరించలేదు. కనుక, ఇప్పుడు జరుగుతున్న ప్రయత్నానికి కూడా అదేగతి పడుతుందనీ, మాకు న్యాయం జరుగుతుందనీ మేము బహుధా ఆశిస్తున్నాము.

28. ఈ ఎన్నికహక్కుల బిల్లువలన—ప్రత్యక్షంగా కనుబడక పోయినా—సంభవించే ప్రమాదాలు వ్రాయడానికి వీలులేనన్ని ఉన్నాయి. అందులో కొన్నిటిని మాత్రం ఇక్కడ చర్చించడానికి సావకాశమిప్పించ మని అర్జీదారులమైన మేము ప్రభువువారిని కోరుతున్నాము.

29. ఈ కాలనీలో యూరోపియనువర్గాలవారికీ, భారతీయులకూ చాలా తీవ్రమైన భేదాభిప్రాయాలు ఉన్న సంగతి అందరికీ తెలిసినదే. యూరోపియనులు భారతీయుని ద్వేషంతో చీదరించుకుంటున్నారు. తరుచు అతనిని చికాకుపరచి బాధిస్తుంటారు. ఈ ఎన్నికహక్కుల చట్టంవలన ఈ ద్వేషం మరింత హెచ్చవుతుంది. అలాంటి చిహ్నాలు అప్పుడే కనబడుతున్నాయి. అందుకు ఋజువు కావాలంటే ఆరోజులలోని వార్తాపత్రికలను, ఉభయశాసనసభలోని చర్చలను, ప్రభువువారు చిత్తగించ వలసినదిగా కోరుచున్నాము.

30. బిల్లు రెండవరీడింగు జరిగేసందర్భంలో, భారతీయులకు వోటింగుహక్కు లేకుండా చేయడంవల్ల కాలనీలోని శాసనసభ్యుల బాధ్యతలు మరింత హెచ్చుతాయనీ, భారతీయులకు ప్రాతినిధ్యమున్నప్పటి కంటె లేనప్పుడే వారిక్షేమం ఎక్కువగా గమనింపబడుతుందనీ చెప్ప బడింది. ఇది, ఇంతవరకూ మా అనుభవానికి భిన్నమని మేము ప్రభువు వారికి విన్నవిస్తున్నాము.

31. మ్యునిసిపల్ ఎన్నికలలోకూడా భారతీయులను వోటుచేయ నివ్వకూడదని కొందరు గౌరవనీయసభ్యులు అభిప్రాయపడ్డారు. చర్చలు జరిగేటప్పుడు, ఆ విషయంకూడా త్వరలోనే పరిశీలనకొస్తుందని బాధ్యతగల వర్గాల్లో గుసగుసలు బయలుదేరేయి. ఈ ఎన్నికహక్కుల బిల్లు దానికి నాందిమాత్రమే. దబ్బనం యొక్క మొనదూరితే మిగిలిన దానిని దూర్చటం కష్టంకాదు. అదే ఉద్దేశ్యంలా కనుబడుతోంది.

32. కంట్రాక్టు కూలికొచ్చే భారతీయులు కాలనీలో స్థిరనివాస మేర్పరచుకోదలచుకుంటే వారిమీద నివాసపుపన్ను విధించే అభిప్రాయ

మున్న సంగతి ప్రభువువారికి విదితమే. ఆ పన్ను కొంచెం భారంగానే ఉండాలని వారి అభిప్రాయం. భారతీయులకు కాలనీలో కాపురముండా లనే అభిలాష పుట్టకుండా ఉండేటంతగానూ, శ్వేతజాతులతో పోటీ చేయ డానికి వీలులేనంత భారంగానూ, పన్ను విధించాలని వారి అభిప్రాయం. మాకు వోట్లు లేకపోతే ఈ అర్జీదారులమైన మా భారతీయుల క్షేమం ఎంతగా కాపాడబడుతుందో ఋజువు చేయడానికిదొక నిదర్శనం.

33. భారతీయులకుగల ఎన్నికహక్కులు తొలగింపబడు తున్నాయి. కనుక, వారు సర్కారు ఉద్యోగాల్లో చేరకుండాకూడా నిషేధించాలని సివిల్ సర్వీసులబిల్లు చర్చసందర్భంలో కొందరు గౌరవ నీయులైన శాసనసభ్యులు తమఅభిప్రాయాన్ని వెలిబుచ్చారు. ఇందు నిమిత్తమై ఒక సవరణనుకూడా ప్రతిపాదించారు. కాని లెజిస్లేటివ్ అసెంబ్లీ స్పీకరుయొక్క కాస్టింగువోటుతో అది వీగిపోయింది. ఈ విష యంలో వోట్లు పుచ్చుకోవాలని ప్రభుత్వం చాలా గడుసుతనంతోనూ, దూరదృష్టితోనూ పట్టుపట్టింది. ఈ సందర్భంలో ప్రభుత్వం భారతీయుల పట్ల చాలా సానుభూతితో ప్రవర్తించినదని మేము పూర్తిగా గుర్తిం చాము. కాని గాలి ఎటువీస్తున్నదో, ఈ సంఘటనలపరిణామా లెట్లుంటాయో చెప్పడమేమంత కష్టముకాదు. ఎన్నికహక్కుల బిల్లు ఆ సవరణకు సావకాశమిచ్చినది.

34. కేపు కాలనీలో ఇటువంటి రంగుభేదాలుకాని జాతిభేదాలు కాని లేవని మేము వింటున్నాము.

35. ఈ బిల్లు చట్టమైనట్లయితే, దక్షిణాఫ్రికాలో ఇతరప్రాంతాల్లో ఉంటున్న బ్రిటిష్-ఇండియన్ పౌరులగతి సర్వనాశనమౌతుందని, మేము ప్రభువువారికి సగౌరవంగా విన్నవించుకుంటున్నాము. ట్రాన్సువాలులో భారతీయుల నిప్పటికే అసహ్యించుకుని అణగద్రొక్కుతున్నారు. ఇక వారి బ్రతుకు దుర్భరమవుతుంది. ఒక బ్రిటిష్ కాలనీలో ఉన్న ఇండియన్ బ్రిటిష్ పౌరులను సమానహోదాలో కాకుండా తేడాగా చూడడానికి సావకాశమిస్తే, ఆత్మగౌరవముగల భారతీయులెవ్వరూ కాలనీలో ఉండ డానికి వీలులేని పరిస్థితులొస్తాయని మేము ప్రభువువారికి విన్నవించుకుంటు న్నాము. అందువల్ల భారతీయుల వ్యాపారం పాడైపోయి, రాణీగారి పాలనలోనున్న వందలాది భారతీయపౌరులు నిరుద్యోగులవుతారు.

36. మేము పైన ఉదహరించిన సంగతులవల్లనూ, వాదనవల్లనూ, ఎన్నికహక్కుల సవరణచట్టము చాలా అన్యాయమైనదని ప్రభువువారికి విశ్వాసము కలుగగలదని మేము ఆశిస్తున్నాము. మహాఘనతవహించిన శ్రీరాణీగారి పాలితులలో ఒక వర్గమువారు మరొక వర్గమువారికిగల న్యాయమైన హక్కులను తొలగించడానికి చేసే ప్రయత్నాలను, ప్రభువు వారు సాగనివ్వరనికూడా ఆశిస్తున్నాము.

ఈ విధంగా న్యాయాన్ని అనుగ్రహిస్తే ప్రభువువారికి అర్జీదాఖలు చేసుకున్న మేము ప్రభువువారి ................ వగైరా.

హాజీమహమ్మద్ హాజీదాదా,
మరి పదారుగురు.

[1894 సం.రం జూలై 31 వ తేదీ 66 నెంబరు ఉత్తరం, కాలనీల కార్యదర్శి రిప్పన్ ప్రభువుకు, నేటాల్ గవర్నరు సర్ వాల్టర్ హీలీ హచ్చిన్సన్ పంపిన కాగితాలలో ఒకటవ అనుబంధంనుండి.

కలోనియల్ ఆఫీసు రికార్డు నెం. 179—వాల్యూం 189.]



# 36. దాదాభాయి నౌరోజీకి ఉత్తరం

(రహస్యం)

తపాలాపెట్టె 253,
డర్బాన్,
జూలై 27, 1894.

ఆనరబుల్ దాదాభాయి నౌరోజీ, యం. పి. గారికి

అయ్యా,

ఈ నెల 14 వ తేదీని వ్రాసిన ఉత్తరం తరువాయిగా, ఈ క్రింది సంగతులను మీకు నేను తెలుపవలసియున్నది.

మేము హోంగవర్నమెంటు వారికి దాఖలుచేసుకొన్న పిటీషను గతవారం పంపబడినట్లు నాకు తెలిసింది. ఆ పిటీషను నకలును మీకు ఇదివరకే పంపుకున్నాము.

మాకొచ్చిన భోగట్టా నిజమైతే, అటార్నీ జనరల్‌గా ఉన్న మిస్టర్ యస్కోమ్ ఈ బిల్లును ఆమోదించడానికి కారణం ఆసియావాసులు, ఆదిమవాసుల ప్రభుత్వాన్ని తమ చేతుల్లో పెట్టుకుని నడిపించడానికి వీలులేకుండాచేయడమేనని వ్రాశాడు కాని నిజమైన కారణమిది. భారతీయులకు అనేక ఇబ్బందులను కలిగించి, కాలనీలో ఉంటే లాభంలేదని వారు విసుగుచెందే పరిస్థితులను కలిగించాలని వారి సంకల్పం. కాని పూర్తిగా భారతీయుల నిక్కడనుండి లేవగొట్టేయ్యాలని వారి అభిప్రాయంకాదు. స్వంత ఖర్చుల మీద, స్వబుద్ధితో ఇక్కడికివచ్చే భారతీయులు వారి కక్కర లేదనడానికేమీ సందేహం లేదు. కంట్రాక్టుకూలీలు (జానిసలు)గా వచ్చే భారతీయులు వారికి విధిగా కావాలి. అయితే ఆ కంట్రాక్టు కూలీలు తమ కంట్రాక్టుపని పూర్తిచేసి ఇండియా వెళ్లిపోవాలి. సాక్షాత్తూ మార్జాల మూషిక భాగస్వామ్యం! కాని వారీపనిని ఒక్కసారిగా చేయలేమని వారికి బాగా తెలుసును. కనుక ఈ ఎన్నికహక్కుల బిల్లుతో ఆ పనిని ప్రారంభించారు. ఈ సమస్య

మీద హోంగవర్నమెంటువారి ధోరణి ఎట్లాఉందో వారు పరీక్ష చేయదలచుకున్నారు. హోంగవర్నమెంటు వారిబిల్లుకు ఆమోద మిస్తారనే నమ్మకం తనకు లేదని ఒక అసెంబ్లీమెంబరు నాకు వ్రాశాడు. బిల్లు హోం గవర్నమెంటువారి ఆమోదాన్ని పొందకుండాఉండడం భారతీయుల కెంతముఖ్యమో నేను వేరుగా చెప్పనక్కరలేదు.

భారతీయులకు నేటా లేమీ చెడ్డప్రదేశం కాదు. చాలా మంది భారతీయవ్యాపారస్థులు ఇక్కడ గౌరవంగా జీవనోపాధిని గడించుకుంటున్నారు. ఈ బిల్లు శాసనమైతే భారతీయుల అభి వృద్ధికి చాలా పెద్దదెబ్బ తగులుతుంది.

ఆఫ్రికాజాతీయుల పరిపాలన యూరోపియనుల చేతుల్లో నుంచి భారతీయులచేతుల్లోకొచ్చే సావకాశం ఇసుమంతైనా లేదని నేనొకసారి మనవిచేశాను. మరొకసారి ఆ సంగతే చెపుతున్నాను. ఇది కేవలం హోంగవర్నమెంటువారిని భయపెట్టడానికి చెప్పే సాకు. ప్రభుత్వంతోసహా ఇక్కడ నివసించేవారందరికీ అటువంటి దెన్నడూ జరుగదని తెలుసును. భారతీయులు తమ క్షేమాన్ని చూడగలిగిన ఇద్దరు ముగ్గురు యూరోపియనులను ఎన్నుకోవడం కూడా వారికిష్టంలేదు. ఏవిధమైన అడ్డూలేకుండా భారతీయులను సర్వనాశనంచేయడానికే వారిప్రయత్నం.

పిటీషను కాపీలను సర్ డబ్ల్యు. వెడ్డర్ బర్న్ కూ తదితరులకూ పంపేను. భారత వార్తాపత్రికలకు కూడా పంపేను.

నేను దీర్ఘమైన ఉత్తరాలు వ్రాస్తున్నందుకు క్షమించండి. నే నేవిధంగా పనిచేయాలో తాము సూచనలిస్తే నన్ను బహుధా కృతార్థునిచేసిన వారవుతారు.

ఇట్లు విధేయుడు,
మో. క. గాంధీ.

[గాంధీజీ స్వహస్తంతో వ్రాసిన ఉత్తరం ఫోటోనకలు నుండి గ్రహింపబడినది.]

---

## 37. నేటాల్ ఇండియన్ కాంగ్రెస్

(22 ఆగష్టు 1894 తేదీని స్థాపితం)

ఆగష్టు, 1894.

*అధ్యక్షుడు*

మిస్టర్ అబ్దుల్లా హాజీ ఆదం

*ఉపాధ్యక్షులు*

శ్రీయుతులు :
హాజీమహమ్మద్ హజీదాదా,
అబ్దుల్ ఖాదిర్,
హాజీదాదా హాజీహబీబ్,
మూసాహాజీ ఆదం,
పి. దావ్‌జీ మహమ్మద్,
పీరాన్ మహమ్మద్,
మురుగేశ పిళ్ళె,
రామస్వామి నాయుడు,
హుసేన్ మిరాన్,
ఆదంజీమియాన్ ఖాన్,
కె. ఆర్. నాయనా,
ఆమోద్ బయాత్ (పి.యం.బర్గ్),
మూసాహాజీ కాశిం,
మహమ్మద్ కాశింజీవా,
పార్సీ రుస్తుంజీ,
దావూద్ మహమ్మద్,
హుసేన్ కాశిం ఆమోద్‌తిలీ,
దొరైస్వామి పిళ్లే,
ఉమార్ హాజీ ఆబా,
ఉస్మాన్‌ఖాన్ రహమత్‌ఖాన్,
రంగస్వామి పడయాచీ,
హాజీమహామ్మద్ (పి. యం. బర్గు),
కమరుద్దీన్ (పి. యం. బర్గు)

*గౌరవ కార్యదర్శి*

మిస్టర్ యం. కె. గాంధీ.

## కాంగ్రెస్ కమిటీ

*చెయిర్‌మన్*

మిస్టర్ అబ్దుల్లా హాజీ ఆదాం

*గౌరవ కార్యదర్శి*

మిస్టర్ యం. కె. గాంధీ

*కమిటీ సభ్యులు*

ఉపాధ్యక్షులు అందరు

శ్రీయుతులు :
యం. డి. జోషి,
నర్సీరామ్,
మేనక్జీ,
దావుజీ మమ్మూజీముతాలా,
ముత్తుకృష్ణ,
విస్వేశ్వర్,
గులామ్‌హుసేన్ రందేరీ,
శాంసుద్దీన్,
జి. ఎ. బాసా,
శరాబ్‌జిత్,
యల్. గేబ్రియల్,
జేమ్సు క్రిస్టాఫర్,
సుబ్బునాయుడు,
జాన్ గేబ్రియల్,
సులేమాన్ వోరాజీ,
కాశింజీ అమ్మూజీ,
ఆర్. కందస్వామినాయుడు,
యం. ఇ. కతరాడా,
ఇబ్రాహీం యం. ఖత్రీ,
షేక్‌ఫరీద్,
వారింద్ ఇస్మాయిల్,
రంజిత్,
పెరుమాళ్ళునాయుడు,
పార్సీ ధంజీషా,
రాయప్పన్,
జూసబ్ అబ్దుల్‌కరీం,
అర్జున్‌సింగ్,
ఇస్మాయిల్ పాడియా,
ఈసప్‌లడువా,
మహమ్మద్ ఈసక్,
మహమ్మద్ హాఫీజీ,
యం. పారుక్,
సులేమాన్ దావ్‌జీ,
వి. నారాయణపథర్,
లక్ష్మణ్ పాండే,
ఉస్మాన్ అహమ్మద్,
మహమ్మద్ తాయుబ్.

## సభ్యత్వపు అర్హతలు

కాంగ్రెస్ కార్యక్రమాన్ని అంగీకరిస్తూ, సభ్యత్వపు రుసుమును చెల్లించి దరఖాస్తుఫారంమీద దస్కతు చేసిన వారందరు సభ్యులుగా నుండ వచ్చును.

నెలసరి చందా కనీసం రూ. 5/-

సంవత్సర చందా పౌ. 3/-

## నేటాల్ ఇండియన్ కాంగ్రెస్ ఉద్దేశములు

1. కాలనీలో నివసిస్తున్న భారతీయులకూ, యూరోపియనులకూ స్నేహాన్ని పెంపొందించడం.

2. వార్తాపత్రికల మూలంగానూ, కరపత్ర ప్రచురణవల్లనూ, ఉపన్యాసాలద్వారానూ భారతదేశంలోని ప్రజలకు సమాచారముల నందచేయుట.

3. హిందూస్థానీలు-ముఖ్యంగా కాలనీలో జన్మించిన భారతీయులు- భారత ఇతిహాసాన్ని, సాహిత్యాన్ని చదివేటట్లు ప్రోత్సహించుట.

4. భారతీయుల స్థితిగతులను విచారించి వారికుండే కష్టాలను నివారించుటకు తగినచర్యలు తీసుకొనుట.

5. కంట్రాక్టు కూలీలుగావచ్చిన భారతీయుల పరిస్థితులను పరిశీలించి, వారికుండే బాధలను నివారించడానికి తగుచర్యలు తీసుకొనుట.

6. పేదవారికి, నిస్సహాయులకు సర్వవిధములుగా తోడ్పడుట.

7. భారతీయుల నైతిక, సాంఘిక, రాజకీయ స్థితిగతులను అభివృద్ధి చేయడానికి అవసరమైన కార్యక్రమాలను కొనసాగించుట.

## కమిటీవారిచేత తయారుచేయబడి, కాంగ్రెసుచేత అంగీకరింపబడిన నిబంధనలకు సవరణలు లేక తొలగింపులు

1. నెలకు 10 పౌనులకు మించని బాడుగపైని, సమావేశాలు నిమిత్తం ఒక హాలును అద్దెకు తీసుకోవడానికి అధికారమివ్వడమైనది.

2. అధమం నెలకొకసారైనా కమిటీ సమావేశం కావలెను.

3. కాంగ్రెస్ మహాసభ కనీసం ఏడాదికొకసారైనా సమావేశం కావలెను. ప్రతిసారీ డర్బాన్‌లోనే సమావేశం కానక్కరలేదు.

4. కాలనీలోని ఇతరప్రాంతాలనుండి సభ్యులకు గౌరవకార్యదర్శి ఆహ్వానములు పంపవలెను.

5. రూల్సు తయారుచేసి వాటిని ఆమోదించడానికి కమిటీకి అధికారమివ్వడమైనది. సాధారణమైన రోజువారీ వ్యవహారములను నిర్వహించుటకు కమిటీవారి కధికారమివ్వడమైనది.

6. తగినంత జీతంమీద ఒక కార్యదర్శిని నియమించుకునేందుకు కమిటీకి అధికారమివ్వడమైనది.

7. కాంగ్రెస్ అభివృద్ధిని అభిలషిస్తూ సహాయంచేస్తున్న యూరోపియనును ఎవరినైనా, ఉపాధ్యక్షునిగా నుండమని గౌరవకార్యదర్శి, తనకు ఇష్టమైతే ఆహ్వానించవచ్చును.

8. గౌరవకార్యదర్శి తనకిష్టమైతే కాంగ్రెస్ నిధినుండి వార్తాపత్రికలను పుస్తకాలను కొనవచ్చును.

9. గౌరవకార్యదర్శి, చెక్కును తానొక్కడే సంతకముచేశాడో లేక ఇతరులతో కలిసిచేశాడో అక్కౌంటు పుస్తకంలో రికార్డు చేయవలెను.

## కమిటీ వారామోదించిన నిబంధనలు

1. ప్రతి సమావేశమునకూ, ఛైర్మన్ అధ్యక్షత వహించవలెను. ఆయన హాజరుకాకపోతే కమిటీ మొదటిమెంబరు; ఆయనకూడా ఉండకపోతే రెండోమెంబరు, ఈ వరుసగా అధ్యక్షత వహించవలెను.

2. మీటింగు ప్రారంభంలో గౌరవకార్యదర్శి, గత మీటింగులో ఆమోదింపబడిన వాంశాలను చదువవలెను. తర్వాత అధ్యక్షుడు దాని మీద సంతకంచేయవలెను.

3. ముందుగా గౌరవకార్యదర్శికి నోటీసు ఇవ్వని సూచననుగాని, తీర్మానమునుగాని కమిటీ గుర్తించనక్కరలేదు.

4. కమిటీవారుగాని కాంగ్రెస్ మహాసభవారుగాని చేసిన ఖర్చులను, వచ్చిన జమలను, గౌరవకార్యదర్శి అక్కౌంటు వివరాలను మీటింగులో చదువవలెను.

5. ఒక మెంబరు ప్రతిపాదించి మరొక మెంబరు ఆమోదించినపుడు తప్ప, కమిటీ మరేసూచననుగాని, ప్రతిపాదననుగాని చర్చించనక్కరలేదు.

6. చెయిర్మన్, కార్యదర్శులు ఉద్యోగరీత్యా, కమిటీమెంబర్లుగా పరిగణింపబడుదురు. వోటింగు చెరిసగమైనప్పుడు చెయిర్మన్ కాస్టింగు వోటును ఇవ్వవచ్చును.

7. సభలో మాట్లాడేటప్పుడు ప్రతిసభ్యుడూ చెయిర్మన్ వైపు తిరిగి మాట్లాడవలెను.

8. కమిటీ సమావేశాల్లో మరొక సభ్యునిగురించి ప్రస్తావన చేసేటప్పుడు మిస్టర్ ............అనే గౌరవపదాన్ని వాడవలెను.

9. కమిటీ మీటింగులలో ఈ క్రింది భాషలలో ఒకటిగాని, అన్నిటిని కాని ఉపయోగించవలెను: గుజరాతీ, తమిళ్, హిందూస్థానీ, ఇంగ్లీషు.

10. ఛైర్మన్‌గారికి అవసరమనితోచిన యెడల ఒక సభ్యుని ఉపన్యాసమును వేరొకభాషలోనికి తర్జుమాచేయమని మరొక సభ్యుని ఆజ్ఞాపించవచ్చును.

11. ఏ సూచనగాని తీర్మానముగాని అధిక సంఖ్యాకుల వోటుతో ఆమోదింపబడవలెను.

12. చిల్లానిల్వ 50 పౌనులకు మించినట్లయితే, గౌరవకార్యదర్శి ఆ మొత్తాన్ని తన ఇష్టమొచ్చిన బ్యాంకులో, నేటాల్ ఇండియన్ కాంగ్రెస్ పేరిట నిల్వచేయవలెను.

13. బ్యాంకులో డిపోజిట్ చేయకుండా ఉన్న సొమ్మేమైనా ఉంటే దానికి గౌరవకార్యదర్శి బాధ్యత వహించవలెను.

14. 5 పౌనులకు మించిన అసాధారణమైన ఖర్చులకు ముందుగా కమిటీవారి ఆమోదమును బడయవలెను. ఆ మొత్తానికి మించిన సొమ్మును చెయిర్మన్‌గాని, కార్యదర్శిగాని ఖర్చుపరచినయెడల, సదరుఖర్చును ఆయన స్వంత బాధ్యతమీదనే చేసినట్లు భావింపబడును. 5 పౌనులవరకూ చెక్కులను గౌరవకార్యదర్శి సంతకము చేయవలెను. అంతకుమించిన మొత్తము చెక్కులపైన ఆయన ఈ క్రింద పేర్కొనబడిన వారెవ్వరితోనైనా కలసి సంతకము చేయవలెను: మెస్సర్సు అబ్దుల్లాహాజీ ఆదం, మూసాహాజీ కాశిం, అబ్దుల్ ఖాదర్, కొళందవేలు పిళ్ళే, పి. దావుజీ మహమ్మద్, హుసేన్ కాశిం.

15. మీటింగుకు ఛైర్మన్ కార్యదర్శులు కాకుండా పదిమంది సభ్యులు కోరంగా నిర్ణయించడమైనది.

16. ప్రతి మీటింగుకు అధమం రెండురోజులు ముందుగా గౌరవ కార్యదర్శి సభ్యులకు నోటీసును అందచేయవలెను.

17. వ్రాతమూలకమైన నోటీసును పోష్టులోకాని మనిషిద్వారా కాని పంపినట్లైతే 16 వ నెంబరు నిబంధనను పాటించినట్లే భావించవలెను.

18. ఏ కమిటీ మెంబరుగాని వరుసగా ఆరుసమావేశములకు హాజరు కాని యెడల ఆయన పేరును మెంబర్ల జాబితానుండి తొలగించవచ్చును. (అయితే కమిటీ తన అభిప్రాయాన్ని ముందు తెలుపవలెను.) మీటింగుకు హాజరుకాని సభ్యుడు మరుచటి మీటింగులో తాను రాకపోవడానికి కారణం తెలుపవలెను.

19. తగినంతకారణం లేకుండా, ఏ సభ్యుడుగాని వరుసగా 3 మాసములు చందా ఇవ్వనియెడల ఆతడు తన సభ్యత్వాన్ని పోగొట్టుకొనును.

20. కమిటీ సమావేశములలో పొగత్రాగరాదు.

21. సభలో ఇద్దరు సభ్యులు మాట్లాడాలని ఒకేసారి నిలబడినట్లయితే, ఎవరు ముందుమాట్లాడాలో ఛైర్మన్ నిర్ణయించవలెను.

22. తగినంతమంది సభ్యులు హాజరుగాఉంటే, నిర్ణీతకాలానికి సభ ప్రారంభం కావలెను. నిర్ణీతకాలానికి తగినంతమంది రాకపోతే, ఆ పిమ్మట అరగంట ఆగి, అప్పుడూ రాకపోతే ఏవ్యవహారం జరుపకుండా సమావేశాన్ని వాయిదా వేయవలెను.

23. నేటాల్ ఇండియన్ అసోసియేషన్ వారు, మీటింగుహాలునూ, గ్రంథాలయాన్నీ ఉచితంగా ఉపయోగించుకోవచ్చును. అందుకుగాను వారికి ఉచితమని తోచినవిధంగా మునసర్దిపనివగైరా సేవచేయవలెను.

24. కాంగ్రెస్ మెంబర్లందరూ, కాంగ్రెస్ గ్రంథాలయాన్ని ఉపయోగించుకొనుటకు అర్హులు.

25. కమిటీ సభ్యులందరూ సభారంగంలో కూర్చుండవలెను. ప్రేక్షకులు వెలుపల కూర్చుండవలెను. ప్రేక్షకులు చర్చలలో పాల్గొనకూడదు. చప్పట్లు వగైరా గంద్రగోళం చేసేయడల వారిని హాలులో నుంచి బయటికి పంపివేయవచ్చును.

26. ఈ నిబంధనలను ముందుముందు సవరణ చేయడానికి కమిటీ కధికారమివ్వడమైనది.

[శైపు చేయబడిన ముసాయిదా ఫోటోనుండి గ్రహింపబడినది. గాంధీజీ స్వదస్తూరీతో వ్రాయబడిన ముసాయిదా ఫోటోకూడా ఉన్నది.]



# 38. "రామిసామి"

డర్బాన్
అక్టోబరు 25, 1894.

టైమ్సు ఆఫ్ నేటాలు సంపాదకులకు

అయ్యా,

ఈ నెల 22 వ తేదీ మీ పత్రికలో 'రామిసామి' అనే పేరుతో వ్రాసిన సంపాదకీయవ్యాసంమీద మీ అనుమతితో నా అభిప్రాయాలను తెలుపడానికి సాహసిస్తున్నాను.

మీరు వ్యాఖ్యానించిన టైమ్సు ఆఫ్ *ఇండియా* పత్రిక వ్యాసాన్ని నేను సమర్థించదలచుకోలేదు. కాని మీ సంపాదకీయమే దానిని తగినంతగా సమర్థిస్తున్నదే! 'రామిసామి' అని మీరు సంపాదకీయానికి పేరు పెట్టడంలోనే మీకు పేద భారతీయులంటే ఎంత చికాకో స్పష్టమైపోతోంది. 'భారతదేశంలో చాలా ఉన్నతమైన సంస్కృతిగల వారున్నారు...........' అని మీరు పాపం దయతో అంగీకరించారు. కాని భారతీయులకు తెల్లవారితో సమానంగా రాజకీయాధికారాన్ని ప్రతిపత్తిని ఇవ్వడానికి మాత్రం, మనసొప్పడం లేదు. అందువల్ల మీరు భారతదేశాన్ని రెండువిధాలుగా అగౌరవం చేయడం లేదా? భారతీయులు సంస్కృతి శూన్యులనీ, కేవలం మొరటుజాతికి చెందిన మూర్ఖులనీ, ఆ కారణంచేత వారికి రాజకీయంగా ఇతరులతో సమానమైన ప్రతిపత్తి ఇవ్వకూడదనీ మీ అభిప్రాయమైన యెడల, అది కొంతవరకు క్షంతవ్యమే. మీరు వారిని తెలివైన వారని అంగీకరిస్తున్నారు. అయినప్పటికీ వారిని మీ పాదాల క్రింద త్రొక్కిపెడతామంటున్నారు. ఒకరికి హాని తలపెట్టని అమాయక ప్రజలను న్యూనతపరచి పరమానందం పొందాలనే ఈ విధంగా వ్రాశారు.



లండన్ శాకాహార సంఘము (1890 సం॥) లోని ఇతర సభ్యులతో గాంధీజీ.



నేటాల్ ఇండియన్ కాంగ్రెసు సంస్థాపకులు—1895.

తర్వాత, కాలనీలో ఉండే భారతీయులు, ఇండియాలో ఉండే టటువంటివారు కారని మీరు వ్రాశారు. కాని మీరు ఎవరినైతే తెలివైనవారని ప్రశంసించారో, వారి సోదరులు, వారి సంతతి వారే వీరని మీరు బుద్ధిపూర్వకంగానే మరచిపోతున్నారు. కనుక వీరికికూడా సావకాశమిస్తే, ఇండియాలోని వారి సోదరు లంతటి ప్రతిభావంతులు కావడానికి వీలున్నది. అజ్ఞానాంధ కారంలోపడి, దుర్గుణాల కాలవాలమై లండన్‌లోని ఈస్టెండులో నున్న ఒక మనిషి, సర్వస్వతంత్రమైన ఇంగ్లండులో, ప్రధానమంత్రి కాగల సావకాశమున్నదిగదా!

మేము రిప్పన్ ప్రభువుకు పంపిన వోటింగుహక్కుల పిటీషను విషయంలో మేమెన్నడూ తలపెట్టని ఒక అపార్థాన్ని మీరాపా దించారు. సమర్థులైన ఆఫ్రికనులు (నేటివ్‌లు) వోటింగు హక్కును ఉపయోగించిననాడు మేమేమీ బాధపడము. ఉపయోగించలేక పోతేనే మాకు విచారం కలుగుతుంది. భారతీయులు, తమలో సమర్థులైనవారికి కూడా ఆ హక్కులను ఇవ్వవలసినదనే పట్టుపడు తున్నారు. మీరు మీ తెలివితేటలకొద్దీ, భారతీయులకూ ఆఫ్రికా వాసులకూకూడా వారి చర్మం నల్లగా ఉన్నదనే కారణంగా, అమూల్యమైన ఆ వోటుహక్కును ఇవ్వడానికిష్టపడకుండా ఉన్నారు. మీరు పైపైనే చూడదలచుకున్నారు. చర్మం తెల్లగాఉంటే మీకు చాలును. దాని అడుగున విషముందా, అమృతముందా అనే విచక్షణ మీకక్కరలేదు. మీకు పాపిష్ఠియైన (పబ్లికన్) వాని పశ్చా త్తాపము కంటే, (ఫారిసీ) మత ప్రబోధకుని పైపై ప్రార్థనలు బాగుం టాయి. బహుశా మీరు దీనినంతనూ క్రైస్తవమతమంటా రను కుంటాను. మీరంటే అనవచ్చును. కాని ఇది క్రీస్తుది మాత్రం కాదు.

ఇలాంటి అభిప్రాయాలు కలిగిన మీరు, ఈ కాలనీలో గౌరవ ప్రదమైన వార్తాపత్రిక అయియుండికూడా, *టైమ్సు ఆఫ్ ఇండియా* పత్రికకు మీరు అసత్యదోషాన్ని ఆరోపిస్తున్నారు. నేరారోపణ చేయడం సులభమేకాని దానిని ఋజువుచేయడం వేరువిషయం.

ఒక్క రాజకీయాధికారం మినహాగా మిగిలిన అన్ని పౌర సత్త్వాలను 'రామిసామీ' పొందవచ్చని మీ సంపాదకీయాన్ని

ముగిస్తూ వ్రాశారు. మీరు మీ సంపాదకీయానికిచ్చిన మకుటానికీ, దానిని వ్రాసిన ధోరణికీ, పైన మీరు చెప్పిన అభిప్రాయం ఏమైనా అనుగుణ్యంగా ఉన్నదా? అనుగుణ్యంగా ఉండడం క్రైస్తవ సాంప్రదాయానికీ ఇంగ్లీషువారి ఆచారానికీ విరుద్ధమా? 'చిన్న పిల్లలను నా దగ్గరకురానివ్వండి' అన్నాడు క్రీస్తు (దేవుడు) కాలనీలోఉన్న ఆయన శిష్యులు (?) దానిని కొంచెం సవరించి 'చిన్నపిల్లలు' అనే మాటకు ముందు 'తెల్లవారి' అని చేరుస్తారు కాబోలు. డర్బాన్ మేయరు ఏర్పాటుచేసిన పిల్లలపండుగనాడు, ఉత్సవంలో ఒక్క నల్లపిల్లవాడుకూడా కనబడలేదని నాకు చెప్పారు. నల్ల తలితండ్రులకు పుట్టిన పాపానికిది శిక్షా? మీరు ద్వేషించే 'రామిసామీ' కిచ్చే పౌరసత్వానికిది నిదర్శనమా?

ఆయన (క్రీస్తు) భూమిమీదకు దిగివస్తే, మనలో చాలా మందినిచూచి 'మిమ్మల్ని నేనెరుగనే' అని అనడూ? నేను మీకొక సలహా ఇవ్వడానికి సాహసిస్తున్నాను. దయచేసి మీ 'కొత్త టెస్టుమెంటు' ను మరొకసారి చదువుతారా? కాలనీలో ఉన్న నల్లజాతులవారిపట్ల మీ వైఖరినిగురించి ఒక్కసారి ఆత్మ పరీక్ష చేసుకుంటారా? ఆ పైని మీ ధోరణి బైబిల్ ఉపదేశాలకు గాని, ఉత్తమ బ్రిటిష్ సాంప్రదాయాలకుగాని అనుగుణ్యంగా ఉందని చెప్పగలరా? క్రీస్తునూ, ఉత్తమబ్రిటిష్ సాంప్రదాయాలనూ కూడా పూర్తిగా వదలుకున్నామంటే, నే నేమీ చెప్పగలిగినది లేదు. నేను వ్రాసినదంతా సంతోషంగా ఉపసంహరించుకుంటాను. కాని మిమ్మల్ని అనుసరించేవాళ్ళు చాలామంది ఉండేయెడల, బ్రిటన్‌కూ ఇండియాకూకూడా దుర్దినాలని చెప్పాలి.

ఇట్లు,
మో. క. గాంధీ.

[టైమ్సు ఆఫ్ నేటాల్ 26–10–1894]

# 39. నాజరుకు లేఖ

డర్బాన్,
నవంబరు 12, 1894.

ప్రియమైన మిష్టర్ నాజర్,

ఈ నెల 4 వ తేదీగల మీ ఉత్తరం అందినది. నిన్న సాయంకాలం నేనిచ్చిన టెలిగ్రాం అందేఉంటుంది. ప్రభుత్వానికీ నాకూ మధ్య నడచిన టెలిగ్రాముల నకళ్ళను ఇందుతో పంపుతున్నాను. గవర్నమెంటుకూ ఏజంటుకూ మధ్య జరిగిన ఉత్తరప్రత్యుత్తరాల నకళ్ళను నేను చూడాలనుకుంటున్నాను.

ది స్టార్ పత్రిక వ్యాసం చెడ్డగా ఉంది. బాగా చెడుగా ఉంది. భారతీయులకు పబ్లిక్........(ఇక్కడి వ్రాత తెలియడం లేదు.) చందాలు అక్కరలేదని సంపాదకునికి మీరే వ్రాయవచ్చును. వారు తమ దానధర్మాలను విదేశాలలో దండోరా వేసుకోరు. ట్రాన్సువాలునుండి, పదివేలమంది భారతీయులు నేటాలు వెళ్లేరంటే వారంతాపస్తుండరు. దానిని గురించి అంత గత్తరేమీ ఉండదు. భారతీయులు నేటాలు ప్రభుత్వానికెన్నడూ భారంగాలేరు. భారతదేశం ప్రపంచంలోకల్లా పేదదేశమైనప్పటికీ అచట 'పేదలచట్టం' (పూర్ లా) లేదు. కనుక ఆర్భాటమెరుగని క్రైస్తవ భారతీయుల దానప్రవృత్తి అందరెరిగినదే. కనుక స్టార్ పత్రికవంటి ఉన్నతిగల పత్రిక బ్రిటిష్‌వారి కట్టుబాట్లు గురించి బడాయిగా చెప్పుకుంటూ, పేదవారికీ, బలహీనులకూ అండగా ఉంటామని చెప్పేపత్రిక, ఇటువంటి అపనిందలు చేయడం మర్యాదగాలేదు. నిన్న జోహాన్సుబర్గునుంచి సుమారు 100 మంది భారతీయులు వచ్చారనికూడా సంపాదకులకు చెప్పండి. వాళ్ళల్లో ఒక్కడుకూడా పస్తుండవలసిన అవసరంగాని, సహాయం కోసం తడుముకోవలసిన అగత్యంకాని లేకపోయింది. కాని సర్కారు ఉద్యోగస్థులు బీదలైన తెల్లవారికోసం ప్రత్యేకంగా

ఏర్పాట్లు చేయవలసివచ్చింది. నేటాలు ప్రభుత్వం కొంచెం నిదానంగా చేసినా చివరికి ఉదారంగానే పదిపౌనుల ధరావతును తాత్కాలికంగా రద్దుచేసిందనికూడా వారికిచెప్పండి. ప్రభుత్వము వారి నిర్ణయానికి సంతృప్తిని వెల్లడిస్తూ కృతజ్ఞతను కూడా తెలియజేస్తూ *లీడరు* కు వ్రాయడం సమంజసం.

ఇట్లు,
మో. క. గాంధీ.

*లీడరు* పత్రికలో పడిన పొరబాట్లను మీరు సవరించారనుకుంటాను. 'డాక్టర్' అన్నమాట అపార్థాన్ని కలిగించింది.

మో. క. గాంధీ.

[గాంధీజీ స్వదస్తూరీతో వ్రాసిన ఉత్తరమునకు ఫోటోనకలు నుండి]



# 40. రహస్య క్రైస్తవ సంఘము

డర్బాన్,

నవంబరు 26, 1894.

నేటాల్ మెర్క్యూరీ సంపాదకులకు—

అయ్యా,

మీ పత్రిక ప్రకటనల కాలంలో రహస్య క్రైస్తవసంఘాన్ని గురించిన ప్రకటనను మీ పాఠకుల దృష్టికి తేవడానికి నాకు అనుజ్ఞ నివ్వవలసినదిగా కోరుతున్నాను. ఆ ప్రకటనలోని పుస్తకాలలో వ్రాయబడిన అభిప్రాయాలేమీ కొత్తవి కావు. నేటి నవభావకులకు అర్థమయ్యేలాగున పాతభావాలనే తిరిగి తెలియ చెప్పడం జరిగింది. అంతేకాకుండా అది విశ్వమానవత్వాన్ని ప్రబోధించే ఒక మతవిధానము. అది నిత్యసత్యంమీద ఆధారపడినది. కాని కేవలం కంటికి గోచరమయ్యే విషయాలమీద, చరిత్రమీద, ఆధారపడినదికాదు. జీసస్ క్రైస్తు అధికృతను నిరూపణచేయడానికి, అన్యమతప్రవక్తలైన మహమ్మదును, బుద్ధుని, ఆడిపోయడం ఆమతంలో లేదు. అంతేకాకుండా ఇతర మతాలను క్రైస్తవ మతంతో అన్వయిస్తుంది. క్రైస్తవమతంకూడా అనేక ఇతర మతాలవలెనే ఒకేనిత్యసత్యాన్ని నిరూపిస్తున్నదని ఆ పుస్తకం వ్రాసినవారి అభిప్రాయం. పాతటెస్టుమెంటులోని అనేక క్లిష్ట సమస్యలెన్నిటికో పూర్ణమైనట్టిన్నీ, సంతృప్తికరమైనట్టిన్నీ సమాధానాలు ఈ గ్రంథంలో లభ్యమవుతున్నాయి. మీ పాఠకులలో ఎవరైనా నేటి అధిభౌతికజీవితముతోనూ దానిమెరుగులతోనో అసంతృప్తిచెంది, తన ఆత్మోన్నతికివి చాలవని అనుకుంటే ఆలాటి వారిని ఈ పుస్తకాలు చదువమని అర్థిస్తున్నాను. ఇంతకన్న ఔన్నత్యమైన జీవితాన్ని కాంక్షించేవారూ, తళుకుబెళుకులతో పైకి మాత్రం ధగధగలాడే నవనాగరిక సంస్కారం వెనుక, దానికి భిన్నంగా ఉండే అనూహ్యమైన విశేషముందనుకునేవారూ, నేటి

నవవిలాసాలూ తెంపులేని కార్యోద్వేగమూ, ఆత్మశాంతి నివ్వవని భావించేవారూ, ఈ పుస్తకాలను చదువవలెనని ప్రార్థిస్తున్నాను. ఒకసారి వాటిని చదివినట్లైతే, ఆ ఉపదేశాలన్నిటితో ఏకీభవించినా ఏకీభవించకపోయినా, విధిగా ఆత్మోన్నతిని పొందగలుగుతారని నేను ఘంటాపథంగా చెప్పగలను.

ఈ విషయమై ఎవరైనా నాతో మాట్లాడవలెననే వారుంటే, అలాంటివారితో గోష్ఠిచేయడం నాకు చాలా సంతోషకరమైన సంగతి. అలాంటి పెద్దమనుష్యులను నాకు వ్రాయవలసినదని సంతోషపూర్వకంగా ప్రార్థిస్తున్నాను. ఈ పుస్తకాలను ధనం కోసం అమ్మడంలేదని నేను వేరే వ్రాయనక్కరలేదనుకుంటాను. ఈ సంఘానికి అధ్యక్షుడైన మిస్టర్ మెయిట్లండుగాని ఆయన ప్రతినిధిగాని పీలైతే వాటిని ఉచితంగా ఇచ్చినా ఇవ్వగలరు. చాలా సందర్భాల్లో ఆ పుస్తకాలు గిట్టింపు ధరలకన్న చౌకగానే అమ్మబడినాయి. కొందరికి ఉచితంగానే ఇవ్వబడినాయి. అందరికీ ఉచితంగా పంచిపెట్టడం సాధ్యంకాదు. కొందరికెవరికైనా కావలిస్తే వాటిని చదువుకోడానికి ఇవ్వగలము.

ఈ గ్రంథకర్తలకు కీ. శే. ఆబీకాన్‌స్టంటు వ్రాసిన ఉత్తరంలోని కొంతభాగాన్ని ఉదహరించి ముగిస్తాను. "మానవసమాజం ప్రతిచోటా ఎల్లప్పుడూ మహత్తరమైన ప్రశ్నలను తనకు తానే వేసుకుంటోంది: మనమెక్కడ నుంచి వచ్చాం? మనమెవరం? మనమెక్కడికెడతాం? (ది పెర్‌ఫెక్ట్ వే) 'పరిపూర్ణ మార్గం' అనే పుస్తకంలో ఈ ప్రశ్నలకు పూర్ణమైన, సంతృప్తికరమైన, విశ్వసనీయమైన సమాధానాలు లభ్యమవుతాయి."

ఇట్లు విధేయుడు,
మో. క. గాంధీ.

[ది నేటాల్ మెర్క్యూరీ 3-12-1894]

---

# 41. అమ్మకమునకు పుస్తకాలు

డర్బాన్, నేటాల్.

కీర్తిశేషురాలైన అన్నా కింగ్సుఫర్డుగూ్నా, మిస్టర్ ఎడ్వర్డు మెయిట్ లందునూ్నా రచించిన ఈ క్రిందిపుస్తకాలు ఆయాధరలకు విక్రయింప బడును. ఈ పుస్తకాలు దక్షిణాఫ్రికాలోనికి రావడాని కిదే మొదలు :

| | | | |
|---|---|---|---|
| *ది పెర్ ఫెక్టు వే* | ... | ... | *7/6* |
| *క్లోత్డు విత్ దీ సన్* | ... | ... | *7/6* |
| *ది స్టోరీ ఆఫ్ ది న్యూ గాస్పెల్ ఆఫ్ ఇంటర్ప్రెటేషన్* | ... | ... | *2/6* |
| *ది న్యూ గాస్పెల్ ఆఫ్ ఇంటర్ప్రెటేషన్* | | ... | *1/-* |
| *ది బైబుల్స్ ఓన్ అక్కౌంట్ ఆఫ్ ఇట్ సెల్ఫ్* | | ... | *1/-* |

ఆ పుస్తకాలను గురించి కొన్ని అభిప్రాయాలు :

*ది పెర్ ఫెక్టు వే* అనంతమైన వెలుగునిచ్చే తేజోపుంజము. విపులార్థ దాయకమై, అనేక విషయాలను సమన్వయంచేసే గ్రంథము........దివ్య విషయాలను తెలుసుకోదలచిన జ్ఞానార్థులు విధిగా చదివితీరాలి. (లైట్, లండన్.)

ఈ యుగంలో ప్రచురింపబడిన ఇంగ్లీషు పుస్తకాలన్నిటిలోకీ, విజ్ఞానదాయకమైన నిరుపమ గ్రంథము (అక్కల్టువరల్డు)

ఇందుకు సంబంధించిన కొన్ని కరపత్రాలు నా కార్యాలయంలో ఉచితంగా లభించగలవు.

మో. క. గాంధీ,
ప్రతినిధి.
ది ఇసాట్రిక్ క్రిస్టియన్ యూనియన్,
ది లండన్ వెజిటేరియన్ సొసైటీ.

[*ది నేటాల్ మెర్క్యూరీ* 28-11-1894]

---

ఆ ద్వేషాని కంతకూ మూలకారణం, కేవలం ఆతని చర్మం యొక్కరంగేఅయితే, ఆతడికేమీ శరణ్యాం కనుబడదు. ఎంత శీఘ్రంగా అతడు ఈ కాలనీని వదలిపెడితే అంతమంచిది. అతడేమి సాధనంచేసినా ఆతనిచర్మం తెల్లబడదు. కాని ఆ ద్వేషానికి రంగుకాక మరేదైనా కారణముంటే, భారతీయుని యొక్క ప్రవర్తనను ప్రతిభను వారు అర్థంచేసుకోకపోవడమే కారణమైతే, యూరోపియనులవల్ల ఎప్పటికైనా ఆతడు తగిన మన్ననలను పొందగలడని ఆశింపవచ్చును.

కాలనీలో ఉన్నటువంటి 40 వేలమ్మంది భారతీయులను ఏమిచేయాలో కాలనీలోనివారు తీవ్రంగా ఆలోచించవలసి ఉంటుందని మనవిచేస్తున్నాను. ముఖ్యంగా ఎవరైతే రాజ్యాధికారాన్ని వహించిఉన్నారో, ప్రజలెవరికైతే శాసనాధికారాలనిచ్చారో వారు ముఖ్యంగా ఈ విషయాన్ని బాగా ఆలోచించాలి. 40 వేల మంది భారతీయులను పూర్తిగా కాలనీలోనుంచి ఎత్తివేయడం అసంభవమైనపని. అందు కేమీసందేహంలేదు. వారిలో చాలా మంది కుటుంబాలతో ఇక్కడ స్థిరపడిపోయారు. బ్రిటిష్ కాలనీలో చేయడానికి సాధ్యమైన ఏశాసనముచేతనూ, శాసన కర్తలు వారిని వెళ్లగొట్టలేరు. ఇకముందు భారతీయులెవ్వరూ రాకుండా ఏవైనా కట్టుదిట్టాలు చేయడం సాధ్యం. ఆమాటల్లా ఉండగా, నేను సూచిస్తున్న విషయం చాలా తీవ్రమైనది. కనుక దానిని జాగ్రత్తగా పరిశీలించవలసినదని మిమ్మల్ని కోరుతున్నాను. అందుకే ఏవిధమైన ద్వేషభావమూలేకుండా ఈ ఉత్తరాన్ని చదువవలసినదని ప్రార్థిస్తున్నాను.

భారతీయుల నాగరికస్థాయిని పెంచదలచుకున్నారో, తగ్గించదలచుకున్నారో మీరు చెప్పాలి. పరంపరగా వచ్చే సంస్కారానికి తగినస్థాయిలో వారి నుంచదలచుకున్నారో, క్రిందకు దింపదలచుకున్నారో మీరు చెప్పండి. వారిని మీహృదయాల నుండి దూరంచేసుకుంటారో, దగ్గరకు తెచ్చుకుంటారో తేల్చుకోండి. సూక్ష్మంగా చెప్పాలంటే, మీరు వారిని నిరంకుశంగా పరిపాలిస్తారో లేక సానుభూతితో పరిపాలిస్తారో చెప్పండి.

రోజుకురోజు ద్వేషం పెరిగేటట్లు ప్రజాభిప్రాయాన్ని మీరు రూపొందించగలరు. మీరు తలుచుకుంటే ఆ ద్వేషాన్ని తగ్గించేటట్లు కూడా చేయగలరు.

ఇప్పుడు నే నీ విషయాన్ని ఈ క్రింది నాల్గు సమస్యలుగా విభజించి చర్చించదలచుకున్నాను.

1. భారతీయులు కాలనీలో పౌరులుగా ఉండడానికి తగినవారేనా ?

2. వారెవ్వరు ?

3. ప్రస్తుతం వారిపట్ల చూపుతున్న ఆదరణ ఉత్తమ బ్రిటిష్ సాంప్రదాయానుగుణ్యంగా ఉన్నదా ? నీతి న్యాయాలనూ, క్రైస్తవసిద్ధాంతాలనూ పాటిస్తున్నదా ?

4. కేవలం లౌకికదృష్టితోనూ, స్వార్థదృష్టితోనూ పరికించినప్పటికీ, భారతీయులను హఠాత్తుగాకాని, క్రమక్రమంగాకాని ఇక్కడనుంచి పంపించివేయడంవలన కాలనీకి చెప్పుకోదగినంత శాశ్వతమైన ప్రయోజనం ఉంటుందా?

## 1

మొదటి విషయాన్ని పరిశీలించేటప్పుడు కూలీలుగా పని చేస్తున్న భారతీయుల విషయం ముందుగా ఎత్తుకుంటాను. వారిలో చాలామంది కంట్రాక్టు కూలీలుగా కాలనీకొచ్చినవారే.

కాలనీ క్షేమాభివృద్ధికి కంట్రాక్టుకూలీలుగా వచ్చిన భారతీయులు విధిగా ఉండితీరాలని, ఆ విషయాన్ని బాగా ఎరిగిన విజ్ఞులంతా అంగీకరిస్తున్నట్లే కనబడుతుంది. నౌకరుచాకర్లుగానూ, రైల్వే నౌకర్లుగాను, తోటమాలులుగానూ, వారు కాలనీ అభివృద్ధికి ముఖ్యంగా ఉపయోగపడుతున్నవారే. ఆఫ్రికనులు, చేయలేని పనులనూ, చేయడానికిష్టపడని పనులనూ, కంట్రాక్టుకూలికొచ్చిన భారతీయులు సంతోషంగానూ, చక్కగానూ చేస్తున్నారు. దక్షిణ

ఆఫ్రికాలో దీనిని (నేటాల్‌ను) (గార్డెన్ కాలనీ) ఆరామసీమగా మార్చడానికి భారతీయులు ఎక్కువగా తోడ్పడినట్లు కనుబడుతుంది. పంచదార ఎస్టేటునుండి భారతీయుని తొలగిస్తే, కాలనీ యొక్క ప్రధాన పరిశ్రమగతి ఏమవుతుంది ? ఆ పనిని ఇంతటిలో నేటివ్లు నిర్వహించగలరని ఎవ్వరూ చెప్పలేరు. ఇందుకు దక్షిణాఫ్రికను రిపబ్లిక్ ఒక ఉదాహరణ కాగలదు. నేటివుల కెంతో ప్రోత్సాహమివ్వాలని వారు తలపెట్టినప్పటికీ, భూమి ఎంత సారవంతమైనదైనా అదింకా దుమ్మూ, ఎడారిగానే ఉన్నది. అక్కడున్న గనుల్లో పనిచేయడానికి చౌకగా కూలిజనం దొరకడమే ఒక తీవ్రమైన సమస్యగా పరిణమిస్తోంది. అక్కడ పేరుకు చెప్పుకోదగిన తోట నెల్మాపియస్ ఎస్టేటు ఒక్కటే. దాని బాగంతకూ కారణం భారతీయుల శ్రమ కాదనగలరా ? ఎన్నికలలో ఒక హెచ్చరిక ఈ విధంగా వ్రాయబడింది.

> ............ఆఖరుకు, మరేమీ చేయగలిగినది లేక భారతీయులను దిగుమతిచేసే ఏర్పాట్లు చేయబడినాయి. ఈ ముఖ్యమైన కార్యక్రమాన్ని సాగించడానికి శాసనసభలు చాలా తెలివితేటలుతో దోహదం చేశాయి. భారతీయులను రావించిన సమయంలో కాలనీ అభివృద్ధి, దాని బ్రతుకంతా సందిగ్ధావస్థలోపడింది. ఈ ఇమిగ్రేషన్ పథకం వల్ల కలిగిన ఫలితమేమిటి ? ఆర్థికంగా కాలనీబొక్కసంలో నుంచి సాలీనా పదివేలపౌనులు చొప్పున అడ్వాన్సు ఇవ్వబడింది. ఫలితమేమిటి ? ఇదే. ఇదివరలో కాలనీలో పరిశ్రమలు వృద్ధిచేయడానికీ, ఇతర అభివృద్ధి కార్యక్రమాలకూ వోటుచేయబడిన ఏ సొమ్మూకూడా, కాలనీలో కూలీలను (భారతీయులను) పనిలో ప్రవేశపెట్టినందువల్ల వచ్చినంత ఆర్థికలాభమును చేకూర్చియుండలేదు. కలోనియల్ పరిశ్రమలకు అటువంటి కూలిజనం సప్లయి జరిగి ఉండకపోతే డర్బాన్‌లో యూరోపియను జనాభా ఇప్పుడున్నదానిలో అధమం సగందాకా ఖాళీఅయి యుండేది. ఇప్పుడు ఇరువైమందికి పని దొరుకుతుంటే అప్పుడు ౫ గురికన్న ఎక్కువమంది అవసరముండి ఉండేది

> కాదు. దర్బాన్‌లోని ఆస్తిపాస్తుల విలువ ఇప్పుడున్న దానిలో మూడోవంతో నాల్గోవంతో ఉండేది. దర్బాన్‌లో ఆస్తి ఖరీదునుబట్టే కాలనీలోని ఇతర పట్టణాలలోని ఆస్తి ఖరీదు కూడా తదనుగుణ్యంగా తగ్గులోనే ఉండేది. కోస్తాభూములకు ఇప్పుడున్న విలువ ఎన్నటికీ లభించేది కాదు.

పైన పేర్కొనబడిన పెద్దమనిషి మిస్టర్ గార్లండ్ తప్ప మరెవ్వరూ కారు. 'కూలీ' అని విజ్ఞులైనవారుకూడా నిరసనభావంతో పిలువబడుతుండే భారతీయునివల్ల ఇటువంటి అమూల్యమైన సహాయాన్ని పొందికూడా, గౌరవనీయుడైన ఆ పెద్దమనిషి కృతజ్ఞతనేది లేకుండా కాలనీలో స్థిరనివాస మేర్పరచుకో దలచుకున్న భారతీయునిగురించి వాపోతున్నాడు.

*న్యూస్ రివ్యూలో* మిస్టర్ జాన్సన్ వ్రాసిన వ్యాసములోనుంచి 11—8—1894 తేదీని, *ది నేటాల్ మెర్క్యూరీ* ఉటంకించిన వ్యాసభాగమును ఇక్కడ ఉల్లేఖిస్తున్నాను.

> ............ఈ సమస్యకు పరిష్కారం, పసుపురంగు జాతివారిని (అనగా భారతీయులను) ప్రవేశపెట్టడమే. వారు ఎండవేడిమికి తట్టుకోగలరు. సాధారణంగా సమశీతోష్ణ ప్రాంతాల్లో, యూరోపియనులు చేస్తుండే పనులను నిర్వహించగల బుద్ధికుశలతగలవారు. తూర్పుఆఫ్రికాలో ఇంతవరకు విజయం సాధించిన పసుపురంగుజాతివారు హిందూస్థాన్ నివాసులే. వారు వివిధ మతాలకు, వివిధ తరగతులకూ చెందినవారు. బ్రిటిష్‌వారి ఆధిపత్యాననో, పోర్చుగీసువారి ఆధిపత్యాననో తూర్పు ఆఫ్రికా కోస్తాలో వ్యాపారాన్ని సృష్టించి పెంపొందించారు. విధేయతగలవారు, దయాళువులు, పొదుపరులు, కష్టపడి పనిచేసేవారు హస్తలాఘవంకలవారు, తెలివైనవారు. అటువంటి భారతీయులను సెంట్రల్ ఆఫ్రికాలో ప్రవేశపెట్టినట్లయితే, ఆ ఖండంలో వారు మన సైనికసిబ్బందికి గుండెకాయలాగున ఉంటారు. వేడిప్రదేశమైన ఆఫ్రికాలో, ఆధునికమై నాగరిక పరిపాలన సాగించేటందుకు మనకు కావలసిన

టెలిగ్రాఫు గుమాస్తాలు, చిల్లరదుకాణాదార్లు, వడ్రంపని, తాపీపని వగైరా చేయగలిగిన మేస్త్రీలు, వంటవారు, చిల్లర మల్లర నౌఖరులు, గుమాస్తాలు, రైల్వే వగైరా ఉద్యోగులు వారిలోనే లభ్యమవుతారు. తెల్లవారికీ, నల్ల వారికీకూడా భారతీయుడు ఇష్టుడు కావడంచేత, పరస్పరంగా ఉండే ఈ రెండుజాతులకూ అతడు లంకెగా ఉపయోగపడగలడు.

అరబ్బులని పొరపాటుగా పిలువబడే భారతీయవర్తకులు కాలనీలో ప్రవేశించడానికి చెప్పబడే అభ్యంతరాలను చర్చించడం ఉత్తమమని తోస్తుంది.

6-7-1894 తేదీగల నేటాల్ మెర్క్యూరీ పత్రికలోనూ, 15-9-93 తేదీగల ది నేటాల్ అడ్వర్టయిజరు పత్రికలోనూ ప్రచురింపబడిన అభ్యంతరాలేమంటే వారు లాభసాటిగా వ్యాపారం చేయగల సమర్థులని ఒకటి. వాళ్ళు నిరాడంబరంగానూ, క్లుప్తంగానూ జీవయాత్ర గడపగలరు కనుక చిల్లర మల్లర వ్యాపారాలలో వారు యూరోపియనులతో బాగాపోటీగా వ్యాపారం చేయగలరనేది రెండు. ఏదో ఒకటిరెండు సంగతులను ఆధారంగాచేసుకుని, మొత్తం మీద భారతీయులందరూ దగాచేస్తారనే స్థూలమైన ఆరోపణలు అసలు పరిశీలనార్హమేకావని నేను త్రోసిపారేస్తున్నాను. దివాలాలుతీసిన ప్రత్యేకసంఘటనల విషయంలో, వారిని నేనెంతమాత్రం వెనుకవేసుకు రావడంలేదుకాని ఒక్కమాట మాత్రమే చెప్పదలచుకున్నాను. 'పాపముచేయనివారే ముందుగా రాయి విసరడం న్యాయం'. దయచేసి (ఇన్‌సాల్వెన్సీకోర్టు) దివాలాకోర్టు దస్తావేజులు పరిశీలించండి.

భారతీయులు, యూరోపియనులతో జయప్రదంగా పోటీ చేస్తున్నారన్న అభ్యంతరం నిజమేనని నమ్ముతున్నాను. కాని వారిని కాలనీనుంచి తరిమివేయడానికి అది సరియైన కారణమా? ఆ పద్ధతికి నాగరికులైన మనుష్యులెవ్వరైనా హర్షిస్తారా? వారంత జయప్రదంగా పోటీచేయడానికి కారణమేమిటి? చాలానిరాడంబరమైన వారి జీవితవిధానం, అలవాట్లు, అందుకు కారణమని సుళువుగా

తెలుసుకోవచ్చును. నేటాల్ అడ్వర్టయిజర్ వ్రాసినట్లు ఆ అలవాట్లేమీ అనాగరికమైనవి కావు. వారు బాగుపడడానికి ముఖ్యాతిముఖ్యమైన కారణం, త్రాగుడూ, దానిననుసరించివచ్చే దురలవాట్లకూ, వారు లోనుకాకపోవడం. అందువల్లనే బాగాడబ్బును కూడబెట్టకలుగుతారు. వారి అభిరుచులు బహునిరాడంబరమైనవి. చాలా స్వల్పలాభాలతో వారు సంతృప్తిపడతారు. ఏమంటే వారు నిరుపయోగంగా పెద్దసిబ్బందిని పెట్టుకోరు. క్లుప్తంగా చెప్పాలంటే వాళ్ళు చెమటోడ్చి తమతిండిని సంపాదించుకుంటారు. కాలనీలో వారు నివసించకూడదనడానికి ఇదెట్లా కారణమవుతుందో ఊహించడం చాలాకష్టం. వాళ్ళు జూదమాడరు. పొగత్రాగరు. చిన్న చిన్న అసౌకర్యాలను వారు భరించగలరు. రోజుకు ఎనిమిది గంటలకన్న ఎక్కువగా కష్టపడగలరు. ఈ కాలనీలో ఏ విధమైన బాధలకూ లోనుగాకుండా వారు సుఖంగా ఉండాలంటే వాళ్ళు ఈ సుగుణాలనన్నిటనీ త్యజించి, పాశ్చాత్య జాతులు ఏదురలవాట్లతో సతమతమవుతున్నారో వాటినన్నిటిని అలవరచుకోమంటారా? ఆలాటి అలవాట్లను నేర్చుకోవడం మంచిదంటారా?

భారతీయవర్తకులను గురించి, కూలీలను గురించి కలిపిచెప్పే అభ్యంతరాలను ఆలోచించడం మంచిది. అవి వారి శౌచానికి సంబంధించిన అలవాట్లు. ఆ ఆరోపణను కొంతవరకు అంగీకరించవలసినందుకు సిగ్గుపడుతున్నాను. వారి ఈ అలవాట్లను గురించి చెప్పే సంగతులు చాలావరకు వారిపట్లగల ద్వేషంచేత చెప్పేవైనా, ఈ విషయంలో వారి అలవాట్లు పూర్తిగా పరిశుభ్రమైనవని చెప్పడానికి సావకాశంలేదు. కాని వారిని కాలనీలో నుంచి పంపివేయడానికి మాత్రం అవి కారణంకాదు. ఈ దురలవాటు నుండి వారిని తప్పించడానికి వీలులేనిస్థితిలో వాళ్ళులేరు. శానిటరీ చట్టాన్ని కట్టుదిట్టంగాను, న్యాయంగాను, దయతోనూ అమలు చేస్తే ఈ దురలవాట్లను అరికట్టవచ్చును. పూర్తిగా తొలగించవచ్చునుకూడా. బొత్తుగా పేదరికంవల్ల స్వీయపరిశుభ్రత విషయాలను అంతగాపాటించలేని కంట్రాక్టుకూలీల విషయంలోతప్ప, వారి అలవాట్లంత అసహ్యామైనవి కావు. నా స్వానుభవంవల్ల మరొక్కసంగతి చెప్పగలను. వర్తకంలో ఉన్న భారతీయులు

అథమం వారానికొకసారైనా స్నానంచేసితీరాలని వారి మతా చారం విధిస్తున్నది. పైగా, ప్రతీసారీ పార్థనచేయడానికి ముందు వారు ముఖం, చేతులు, పాదాలు పరిశుభ్రంగా కడుక్కోవాలి. రోజుకు నాల్గుసారులు వారీవిధంగా ప్రార్థనలు చేయవలసినవిధి. అథమం రెండుసార్లకు తక్కువగా ప్రార్థనలు చేసేవారు అరుదు.

సంఘానికి ప్రమాదకరమైన దురలవాట్లు వారికిలేవని నిస్సంకోచంగా అంగీకరిస్తారని ఆశిస్తున్నాను. రాజ్యాంగ శాస నానికి విధేయులుగా ప్రవర్తించడంలో వారెవ్వరికీ తీసిపోరు. రాజకీయంగావారు అపాయంతెచ్చేవారు కారు. కలకత్తాలోనూ, మద్రాసులోను ఉండే కూలీలనుసరఫరాచే సేపజంట్లు ఎన్నిక చేయకంలో, ఇమిగ్రేషన్ ఏజంట్ల పొరబాటువల్ల ఎవరైనా కొద్ది మంది తుంటరులు ఉంటే ఉండచ్చునుకాని, మొత్తంమీద వారు అపాయకరమైన నేరాలలోకెళ్లేవారు కారు. క్రిమినలు కోర్టుల తాలూకు వివరాలను పోల్చిచూపించడానికి నాకు వీలుకలుగ నందుకు చాలా చింతిస్తున్నాను. అందుచేత ఈ విషయమై ఇంతకన్న ఏమీ చెప్పజాలను. కాని నేటాల్ అల్మనక్ వ్రాసిన ఈ క్రింది విషయాన్ని ఉల్లేఖించడానికి అనుజ్ఞనివ్వమని కోరుతున్నాను. 'మొత్తంమీద భారతీయ జనాభా క్రమబద్ధంగా ఉండేవారనీ, చట్టబద్ధులనీ అంగీకరింపకతప్పదు.'

పై విషయాలనుబట్టి, భారతీయులు కాలనీలో ఉండతగినవారనీ, వారు కాలనీకి విశేషంగా ఉపయోగపడే పౌరులనీ, స్పష్టమవుతున్నది, కాలనీలోని భారతీయ వ్యాపారస్థులు ఇక్కడ ఉండదగినవారు కాదన డానికి కారణమేమీ కనబడదు.

భారతీయ వ్యాపారస్థులు ఒక విధంగా పేదవారైన యూరోపియ నులకు మహోపకారం చేస్తున్నారు. వ్యాపారం పోటీవల్ల జీవితావస రాల ధరలను వారు అదుపులో నుంచుతున్నారు. భారతీయ కార్మికుల యొక్క ఆచారవ్యవహారాలను, భాషను, బాగా తెలిసిన వారవడంచేత వారి అవసరాలను తెలుసుకొని వారికి కావలసిన సామగ్రిని యూరో పియను వర్తకులకన్న సరసంగా వారి కందిస్తున్నారు.

## 2

రెండవ విషయం, అనగా భారతీయులు ఎవరు అనేది చాలా ముఖ్యమైన సమస్య. దానిని జాగ్రత్తగా పరిశీలించవలసినదని కోరుతున్నాను. నేను ఈ విషయమై ఇంతగా వ్రాసినందువల్ల భారతదేశాన్ని గురించి, భారత ప్రజలను గురించి తెలుసుకోవాలని అభిలాష కలిగితే నేను కృతార్థుడను. ఏమనగా, దక్షిణాఫ్రికాలో భారతీయులు పడుతున్న కడగండ్లలో సగం, ముప్పాతిక వంతులకు కారణం భారతదేశాన్ని గురించి సరిగా ఇక్కడివారికి తెలియకపోవడమే.

నేనీ ఉత్తరం ఎవరినిగురించి వ్రాస్తున్నానో నాకూ పూర్తిగా తెలుసును. ఈ ఉత్తరంలోని ఈ భాగం తమకు అగౌరవాన్ని కలిగిస్తున్నదని కొందరు గౌరవనీయసభ్యులు భావించవచ్చును. అలాంటివారికి నేను సవినయంగా ఇలా మనవిచేసుకుంటున్నాను. "మీకు భారతదేశాన్ని గురించి చాలాసంగతులు తెలుసునని నాకు తెలుసును. కాని మీకు తెలిసిన సంగతులవలన కాలనీకి మాత్రం ఏవిధమైన ప్రయోజనమూ లేకపోవడం చాలా కఠోరమైన సత్యంకాదా? ఒకేరంగంలో వారితో కలసి పనిచేసిన ఇతరుల అభిప్రాయాలకూ, మీ అభిప్రాయాలకూ చాలా ప్రాతికూల్యత ఉంటేతప్ప భారతీయుల సంగతి అలాలేదు. నేను ఈ విషయాలన్నిటిని మీకోసమే చెబుతున్నప్పటికీ, ఇవి ఇంకా చాలా మందికి అందకమానవు. ముఖ్యంగా కాలనీలో ప్రస్తుతం ఉంటున్న వారందరి క్షేమాన్నీ కోరేవారందరికీ అందకతప్పవు".

ఎన్నికహక్కుల చట్టం రెండవరీడింగులో ప్రధానమంత్రి చేసిన ఉపన్యాసంలో వ్యక్తంచేసిన భావాలతో నే నేకీభవించను. ఇంగ్లీషువారూ ఇండియాదేశస్థులూ ఒకే ఇండో-ఆర్యన్ సంతతికి చెందినవారని ఆయనకు సవినయంగా మనవిచేస్తున్నాను. ఈ అభిప్రాయాన్ని బలపరుస్తూ తగిన ఆధారాలు చూపించడానికి అవసరమైన గ్రంథాలు నాదగ్గరలేవు. కాని *ఇండియన్ యంపైర్* అని సర్ డబ్ల్యు. డబ్ల్యు. హంటర్ వ్రాసిన గ్రంథంనుండి ఈ క్రింది విషయాల నుదహరిస్తున్నాను.

"మహాపురుషుల సంతతికిచెందిన ఈ జాతి (అనగా ఆర్యులు) ఆర్యన్ లేక ఇండో-జర్మన్ వర్గమువారు. వారి నుండే బ్రాహ్మణులు, రాజపుత్రులు, ఇంగ్లీషువారు కూడా ఉత్పత్తియైనారు. ఆదిలో వారు సెంట్రల్ ఏషియాకు చెందినట్లు చరిత్రచెపుతోంది. అక్కడినుంచే కొన్ని శాఖలు ప్రాగ్దేశాలకు, మరికొన్ని పశ్చిమదేశాలకు వ్యాపించినవి. పశ్చిమదేశాలకు వ్యాపించిన ఒకశాఖ పర్షియారాజ్యాన్ని స్థాపించింది. మరొకపలవ ఏథెన్సును, లేసిడేమన్‌ను నిర్మాణం చేసి హెలనిక్ జాతియైనారు. మూడవ పలవకుచెందినవారు ఇటలీపోయి (ఏడుకొండల) పట్టణాన్ని నిర్మించి అభివృద్ధి చేశారు. అదే రోమ్ సామ్రాజ్య నగరమైనది. ఈ జాతివారే కొందరు స్పెయిన్ దేశానికిపోయి అచ్చటి వెండిగనులను త్రవ్వేరు. ఆదికాలంలో ఇంగ్లండు దేశము లోని జనం బ్రిదోనెలలో చేపలు పట్టుకుంటూ, కారన్‌వాల్ లోని తగరపుగనులు త్రవ్వుకుంటూ జీవిస్తుంటే ఆర్యుల నివాసంలాగే ఉండేది.

గ్రీకు, రోమన్, ఇంగ్లీషు, హిందువుల తాలూకు ముత్తాతలంతా ఏషియాలో ఒకేచోట నివసిస్తూ, ఒకే భాషను మాట్లాడుతూ, ఒకే దేవుళ్ళను ఆరాధిస్తూ ఉండేవారు.

యూరోపులోనూ, ఇండియాలోనూ ఉండిన మతా లన్నీ ఒకచోటనుంచే ఉత్పన్నమైనాయి.

వివేకవంతుడైన ఈ చరిత్రకారుడు, అనేకులైన ప్రముఖుల రచనలన్నిటినీ పరిశోధించిన పిమ్మటనే నిస్సంకోచంగా ఇటువంటి నిశ్చయానికొచ్చాడు. ఒకవేళ ఈ విషయంలో నేను పొరపాటు పడినా చాలామంది ప్రముఖులతోటివాడనే అవుతాను. ఈ నమ్మకం సరియైనదైనా కాకపోయినా, ఈరెండు జాతులమధ్యా, హృదయ పూర్వకమైన సమైక్యతను సాధించడానికి యత్నించేవారు ఈ విశ్వాసాన్నే మూలాధారంగా చేసుకుంటున్నారు. ఈ రెండు జాతులూ, బహిరంగంగా ఒకే పతాకం క్రింద న్యాయసమ్మతంగా బంధింపబడే ఉన్నాయి.

ఆఫ్రికాలోని అనాగరికులైన ఆదిమవాసులకన్న భారతీయులు కొంచెం మాత్రమే మెరుగన్న భావం ఈ కాలనీలో వ్యాపించి ఉన్నట్లు కనబడుతుంది. పిల్లలలోకూడా ఇలాంటి నమ్మకాన్నే వ్యాపింపచేస్తున్నారు. అందువల్ల భారతీయుని ఒక మోటుమనిషిగా వారు భావిస్తున్నారు.

కాలనీలో అటువంటి పరిస్థితులు ఉండడానికి, కాలనీలోని క్రైస్తవ శాసనసభ్యులెవ్వరూ బుద్ధిపూర్వకంగా అంగీకరించరని నా నమ్మకం. ఆ విశ్వాసంతోనే, భారతీయులు పారిశ్రామికంగా గాని, మానసికంగాగాని, పాండిత్యవిశేషంలోగాని మరేరంగంలో గాని, తమ ఆంగ్లోశాక్సన్ సోదరుల కేవిధంగానూ తీసిపోరని ఋజువుచేసేటందుకు ఈ క్రింది విషయాలను విపులంగా ఉటంకించడానికి సాహసిస్తున్నాను.

భారతీయ వేదాంత శాస్త్రాన్ని గురించి, మతాన్ని గురించి, విజ్ఞానవంతుడైన *ఇండియన్ యంపైరు* గ్రంథకర్త ఈ విధంగా వ్రాశాడు :

> ప్రత్యక్షమైన మతానుభూతికి, బ్రాహ్మణమార్గం, నియమయుక్తమైన నైష్ఠిక జీవనం, దానధర్మాలు, త్యాగం, భగవధ్యానం, ఆధ్యాత్మ జీవితంలో అనేక ప్రత్యక్ష సమస్యలతోపాటు, మతంలో అనేక మానసిక సమస్యలు ఉన్నాయి. మంచిచెడ్డలను, సుఖదుఃఖములను సమన్వయం చేయడం వంటివి. బ్రాహ్మణతత్వజ్ఞులు, ఈ సమస్యలన్నిటికీ పరిష్కార సాధనాలను పూర్తిగా ఆలోచించి పెట్టేరు. అటు తరువాత గ్రీకు, రోమన్ తత్త్వజ్ఞులను, మాధ్యమిక యుగంలోని విజ్ఞాన శాస్త్రవేత్తలనూ కలవరపరచిన అనేక విషమ సమస్యలకు కూడా వారు పరిష్కార సాధనాలను ఆలోచించిపెట్టేరు. సృష్టిస్థితుల పరిణామమంతటిని కూలంకషంగా చర్చించారు. *నేటి శరీర శాస్త్రవేత్తల భావాలు, కొద్ది విశేషంతో కపిలుని పరిణామ వాదాన్నే* స్థిరపరుస్తున్నాయి. 1877 సం. రం. లో భారతదేశంలోని దేశీయ భాషలలో ప్రచురింపబడిన మతగ్రంథాలు 1,192.

ఇవిగాక నీతిశాస్త్రాన్ని గురించి, మానసిక శాస్త్రాన్ని గురించి మరొక 56 పుస్తకాలు ప్రచురింపబడ్డాయి. 1882 సం. రం. లో ప్రచురింపబడిన మతగ్రంథాలు 1,545, నైతిక మానసిక శాస్త్రగ్రంథాల సంఖ్య 153 వరకూ పెరిగింది.

మేక్సుముల్లరు భారతీయ తత్త్వశాస్త్రాన్ని గురించి ఈ విధంగా వ్రాశాడు: (ఈ క్రింద ఉదహరింపబడినదీ, మరికొన్ని భాగాలు కూడా ఎన్నిక హక్కుల పిటీషన్‌లో పూర్తిగానూ, భాగాలుగానూ కూడా ఉదహరింపబడ్డాయి.)

"ఏ దేశంలో మానవుని మనస్సు పూర్తిగా వికసించిందనీ, ఏ దేశంలోని మేధావులు జీవితానికి సంబంధించిన గడ్డు సమస్యలనుగురించి గహనంగా ఆలోచించి, వాటికి ప్లాటో కేంటు మొదలగు తత్త్వవేత్తలను బాగా అవగాహన చేసుకున్న విజ్ఞానులు కూడా పరిశీలించదగిన పరిష్కార సాధనములను కనిపెట్టేరనీ, నన్నడిగితే నేను భారతదేశ మంటాను. గ్రీకు రోమను తత్త్వజ్ఞుల భావాల మీదనే పోషింపబడుతున్న యూదుల జాతివారమైన మనము, మన ఆంతరంగిక జీవితాన్ని పరిపక్వంచేసుకుని, జీవితాన్ని సమగ్రమైనట్టిన్నీ, మానవత్వంతో కూడినట్టిదిగానూ చేసుకోవడానికి ఏ సాహిత్యాన్ని ఆశ్రయించాలని ప్రశ్నిస్తే మరల భారతదేశ సాహిత్య మనే నేను చెప్పవలసొస్తుంది. జీవితమంటే కేవలం ఐహిక జీవిత మొక్కటేకాదు. అనేక రూపాంతరములు దాల్చేశాశ్వత జీవితం."

జర్మన్ తత్త్వవేత్త అయిన షోఫెన్‌హార్ ఉపనిషత్తులలోని భారతీయ మీమాంస శాస్త్రంయొక్క మహత్తునుగురించి ఈ విధంగా ప్రశంసించాడు :

ప్రతివాక్యంలో నుంచి మహాగంభీరమైన స్వతంత్రమైన, తన్మయత్వం కలిగించేటటువంటి ఆలోచన లుత్పన్నమౌతాయి. మహోన్నతమైన పవిత్రభావాలు ఉత్తేజపరుస్తాయి. భారతీయ వాతావరణం ఆవృతమై ఆ

భావాలను ప్రకోపింపచేస్తాయి. *ఉపనిషత్తులవలె మనస్సుకు ఉత్తేజం కలిగించి ఉపయోగపడే గ్రంథపారాయణం మరొక టి ప్రపంచంలో లేదు. నా జీవితానికి శాంతినిచ్చేవి ఉపనిషత్తులే. నా మరణానికికూడా శాంతినిచ్చేవవే.

ఇక విజ్ఞాన శాస్త్రాన్నిగురించి సర్ విలియం హంటర్ ఈ విధంగా అన్నాడు :

పాశ్చాత్యవ్యాకరణ శాస్త్రజ్ఞులు కేవలం పోలికలను బట్టిమాత్రమే భాషను పరిశీలించే కాలంలో, భారతదేశంలో వైయ్యాకరణులు భాషకు వ్యాకరణపు మూలసూత్రాలను నిర్మాణంచేశారు. పాశ్చాత్య పండితులు సంస్కృత భాషాపాండిత్యాన్ని అభ్యసించినప్పటినుండే వారితత్త్వ శాస్త్రం ప్రారంభమైనది..............ప్రపంచంలోని అన్ని వ్యాకరణాలకన్న పాణిని వ్యాకరణం మహోన్నత స్థాయిలో ఉంది...............సంస్కృత భాషలో ఉండే యావత్తు సౌందర్యాన్నీ, అది క్రమమైన వరుసలో పొందు పరచింది. అది మానవుని నిర్మాణశక్తికి, పరిశ్రమకు అమోఘమైన ఉదాహరణము.

ఆ వ్యాకరణ శాస్త్రాన్నిగురించే సర్. హెచ్.యస్. మెయిన్ ఇచ్చిన రీడ్ ఉపన్యాసం '*విలేజి కమ్యూనిటీస్*'లో ప్రచురింప బడింది. అందులో ఈవిధంగా చెప్పబడింది :

భారతదేశం ప్రపంచానికి భాషాశాస్త్రాన్ని, పురాణాలను ప్రసాదించింది. వ్యాకరణాన్నీ, పురాణగాథలనే కాకుండా మరొక గొప్పదైన కొత్త శాస్త్రాన్ని కూడా ఇంకా భారతదేశమే ఇవ్వవచ్చును. దానికి న్యాయశాస్త్ర మని పేరెట్టడానికి నేను సందేహిస్తున్నాను. ఏమంటే అది సామాన్య న్యాయశాస్త్రం యొక్క అవధులను దాటుతుంది. భారతదేశంలో ప్రపంచంలోని ఏ భాష

* (17వ శతాబ్దంలో సంస్కృతం నుండి పర్షియను భాషలోకి ఉపనిషత్తులు తర్జుమా చేయబడినాయి.)

కంటే కూడా పురాతనమైన భాష ఉన్నది. ఇతరచోట్ల కన్న ఇక్కడ ప్రకృతిని మహత్తరమైన వ్యక్తిత్వంతో చిత్రించిన వాచకమున్నది. అంతే కాకుండా పురాతనమైన ఆర్యులసంస్థలు, ఆర్యుల ఆచారవ్యవహారాలు, ఆర్యుల శాసనాలు, వారి భావాలు, నమ్మకాలు నిలచి ఉన్నాయి.

భారతీయ ఖగోళ శాస్త్రాన్నిగురించి ఆ చరిత్రకారుడే (హంటర్) ఇలా వ్రాశాడు :

బ్రాహ్మణుల ఖగోళశాస్త్రవిజ్ఞానం రెండు భావాలను రేకెత్తిస్తోంది. దానిపట్ల అపారమైన పూజ్యభావమూ ఉంది. అన్యాయంగా ద్వేషమూ ఉన్నది..... ..........కొన్ని విషయాలలో బ్రాహ్మణులు, గ్రీకు ఖగోళశాస్త్రజ్ఞుల ఖగోళ శాస్త్రజ్ఞానాన్ని మించిపోయారు. వారి ఖ్యాతి పాశ్చాత్యదేశాలన్నిటిలోనూ వ్యాపించింది. యూదులదేశాల్లో కూడా వారికీర్తి చిరస్థాయిగావింపబడింది. 8, 9 శతాబ్దాలలో అరబ్బులు వారికి శిష్యులైనారు.

బీజగణితం, సంఖ్యాశాస్త్రాల విషయంలో బ్రాహ్మణులు పాశ్చాత్యుల సహాయమేమీ లేకుండానే చాలా సమర్థతను గడించారు. దశాంశ పద్ధతికి చిహ్నములను సృష్టించినందుకు వారికి మనం ఋణపడున్నాము ........ హిందువుల దగ్గరనుంచి వాటిని అరబ్బులు నేర్చుకున్నారు. వారు వాటిని యూరపులోని వారికి అందచేశారు ........ 1877 సం.రం.లో గణితశాస్త్రంమీదనూ, మెకానికల్ సైన్సు అనగా యంత్రశాస్త్రం మీదనూ, దేశభాషలలో ప్రచురింపబడినపుస్తకాలసంఖ్య89. 1882 సం.రం.లో వాటిసంఖ్య166.

బ్రాహ్మణుల వైద్యశాస్త్ర విజ్ఞానంకూడా స్వతంత్రంగా వృద్ధిపొందినదే..............................పాణిని వ్యాకరణ శాస్త్రంలో ఉదహరించబడిన కొన్ని రోగాలపేర్లను బట్టి,

ఆయన కాలానికే (అనగా క్రీ.పూ. 350 సంవత్సరాలనాటికే) ఆయుర్వేద వైద్య శాస్త్రం చాలా అభివృద్దిలో నున్నట్లు స్పష్టమవుతుంది............... సంస్కృతంలో వ్రాయబడిన ఆ గ్రంథాల అనువాదాల మూలంగానే అరబిక్ వైద్య శాస్త్రం రచింపబడింది...............17వ శతాబ్దంవరకూ పాశ్చాత్య వైద్యం, అరబిక్ వైద్యశాస్త్రంమీదనే ఆధార పడింది. 1877 సం. రం. లో భారతదేశంలోని దేశీయ భాషలో ప్రచురింపబడిన వైద్యగ్రంథాల సంఖ్య 130. 1882 సం. రం. లో వాటి సంఖ్య 212. ఇవిగాక ప్రకృతి శాస్త్రాలను గురించి వ్రాయబడిన గ్రంథాలు 87.

యుద్ధశాస్త్రాన్నిగురించి సర్ విలియం హంటర్ యిలా వ్రాశాడు :

ఈశ్వరకటాక్షంవలన సిద్ధించిన దివ్యజ్ఞానానికి ఉపాం గాలనుగా బ్రాహ్మణులు ఆయుర్వేదాన్ని, యుద్ధకళను, సంగీతశాస్త్రాన్ని, శిల్పాన్ని భావించారు. క్రీస్తుకు పూర్వమే సంస్కృత కావ్యాల్లో యుద్ధకళ ఒకశాస్త్రంగా నిరూపింప బడింది. అగ్నిపురాణంలోని ఉత్తరఖండంలో ఈ యుద్ధ కళనుగురించి చాలా అధ్యాయాలు రచింపబడ్డాయి.

భారతీయ సంగీతశాస్త్రంయొక్క ప్రభావం చాలా దేశాలకు వ్యాపించింది ......... ... సంగీతశాస్త్రజ్ఞానం బ్రాహ్మణుల దగ్గరనుండి పారశీకులద్వారా అరబ్బులకు సంక్రమించింది. 11వ శతాబ్దారంభంలో గైడో అరిజ్జో అనే పాశ్చాత్య సంగీతశాస్త్రజ్ఞుడు అరబ్బులదగ్గరనుండి గ్రహించి దానిని యూరోపియను సంగీతశాస్త్రంలోకి జొప్పించాడు.

శిల్పశాస్త్రాన్నిగురించి ఈ గ్రంథకర్త ఇలా వ్రాశాడు :

భారతదేశంలో బౌద్ధులు గొప్ప రాతిశిల్పులుగా ప్రసిద్ధికెక్కేరు. వారు నిర్మించిన మఠాలు, దేవళాలు 22 శతాబ్దాల కళాభివృద్ధి యొక్క ఇతిహాసాన్ని చాటు తున్నాయి. ఆదికాలంలో గుహల్లోనూ, కొండలమీద

దేవాలయాల్లోనూ వారు నిర్మించిన శిల్పఖండాలు మొదలుకొని, ఇటీవల జైనుల కాలంలో ధగధగ మెరిసే గిలాబాల తోనూ, రకరకాల అలంకరణాలతోనూ నిండిన నిర్మాణాల వరకూ, శిల్పంయొక్క చరిత్ర ఇందులో ద్యోతకమవుతుంది. యూరోపులోని చర్చిలమీద గోపురాలు బౌద్ధదేవాలయాల మీద శిఖరాల అనుకరణ కావడం అసంభవంకాదు......... మనమీనాటికీ చూచి దిగ్భ్రమచెంది ప్రశంసించేటటువంటి శిల్పఖండాలను, హిందువుల కళానైపుణ్యత శాశ్వతంగా సృష్టించింది.

గ్వాలియరు రాజభవనంలోని శిల్పకళాఖండాలు, మహమ్మదీయుల మశీదులు, ఆగ్రా ఢిల్లీనగరాల్లోని సమాధులు, దక్షిణదేశంలోని పురాతన దేవాలయాలలోని శిల్పాలు, అందచందాలకు, అలంకరణ విశేషములకు అసమానమైనవని చెప్పకతప్పదు.

మనకాలంనాటి ఇంగ్లీషు అలంకరణకళ, చాలావరకు భారతీయ విధానాలను, నమూనాలనూ అనుకరించినదే............పురాతన శిల్పాన్ని తూచాతప్పకుండా అనుకరింపబడిన భారత శిల్పఖండాలకు, యూరోపులోని అంతర్జాతీయ ప్రదర్శనాలలో ఇప్పటికీ అగ్రస్థానం లభిస్తూనే ఉన్నది."

(*రౌండు ది వరల్డు*) 'ప్రపంచ యాత్ర' అనే గ్రంథాన్ని రచించిన ఆంద్రూకార్నీజీ ఆగ్రాలోని 'తాజ్‌మహల్'ను గురించి ఏమన్నారో చూడండి :

కొన్ని విషయాలు అతిపవిత్రమైనవవడంచేత వాటిని స్తనశల్యపరీక్ష చేయడానికిగాని, మాటలలో వర్ణించడానికి గానివీలులేదు. అత్యంత సుందరమై, 'ఇదిమానవనిర్మితమేనా' అనిపించే ఒకసుందర నిర్మాణమున్నదని నేనీరోజున తెలుసుకున్నాను. అది ఈ పవిత్రవర్గానికి చెందినదే................ తాజ్ ఒక విధమైన మీగడతెలుపురంగు చలువరాతితో

నిర్మింపబడింది. అందుచేత శుద్ధతెలుపు చలువరాయివలె మనసుకు నిరుత్సాహం కలిగించదు. స్త్రీవలె అప్యాయతను, సానుభూతిని ఇస్తుంది. ఒక ప్రముఖ విమర్శకుడు, తాజ్ స్త్రీ నిర్మాణమన్నాడు. దానిలో పురుషలక్షణాలేమీ లేవన్నాడు ఆయన. దాని అందచందాలన్నీ స్త్రీ లక్షణాలే. మిగడతొరకవంటి పాలరాతిమీద నల్లపాలరాతితో అరబిక్ అక్షరాలు పొదుగబడినాయి. ఖురాన్ అంతా ఆవిధంగానే చెక్కబడిందన్నారు. నేను బ్రతికున్నంతకాలం, కొండవాగుల మధ్యతిరుగుతున్నా, వెన్నెలరాత్రిళ్ళలో అడవులలో సంచారంచేస్తున్నా, ప్రశాంతమైన నా మనస్సులో అత్యుత్తమమైనభావాలు ఎప్పుడు ఎక్కడ విహారం చేసినా, అటువంటప్పుడుకలిగే ఉత్తమభావాల్లో తాజ్ మహల్ సుందర దృశ్యం ఒకటి.

భారతదేశానికి ఒక న్యాయశాస్త్రంకూడా లేకపోలేదు. మనువు రచించిన ధర్మశాస్త్రం, చాలాసునిశితమైన న్యాయనిర్వచనమని ప్రసిద్ధికెక్కింది. దాని ధర్మబుద్ధికి సర్ హెచ్. యస్. మెయిన్ ఎంతోముగ్ధుడై, కాబోలు, 'బ్రాహ్మణ ధర్మజ్ఞుల దృష్టిలో న్యాయమేవిధంగా ఉండాలో బహు ఆదర్శప్రాయంగా చిత్రించారు' అన్నాడు. 1891 సంవత్సరంలో మిస్టర్ పిన్‌కాట్, నేషనల్ రివ్యూలో వాటిని 'మనువుయొక్క వేదాంతసూత్రాలు' అని ప్రస్తావించాడు.

నాటక కళలోకూడా భారతీయులు తీసిపోలేదు. ప్రఖ్యాత నాటకమైన 'శకుంతల'ను గురించి 'గథే' ఇలా చెప్పేడు :

"నవవసంతంలోని పూవులు, వసంతం ఆఖరున లభ్యమయ్యే పండ్లు, ఆత్మోత్సాహాన్ని, ఆనందాన్ని కలిగించి, తన్మయంచేసే సర్వవస్తువులు, భూమి, స్వర్గము అన్నిటినీ కలిపి ఒక పేరు పెట్టమంటే నేను 'శకుంతల' అని ఛటుక్కున చెప్తాను."

భారతీయుల నడవడినిగురించి, సాంఘిక జీవనంగురించి చెప్పవలసొస్తే అనేక ఆధారాలున్నాయి. ఇక్కడ కొన్ని భాగాలు

మాత్రమే ఉదహరించగలను. హంటర్ వ్రాసిన 'భారత సామ్రాజ్యము' నుండి ఈ క్రింది భాగాన్ని పొందుపరుస్తున్నాను :

> గ్రీకు రాయబారి మెగాస్తనీస్ భారతదేశంలో బానిసలు లేకపోవడం గురించి చాలా ప్రశంసించాడు. భారత స్త్రీల పాతివ్రత్యాన్ని, పురుషుల ధైర్యసాహసాలను చాలా మెచ్చుకున్నాడు. ధైర్యంవిషయంలో వారు ఆశియా వాసులందరినీ మించిపోయారు. వారి తలుపులకు తాళాలు అక్కరలేదు. అన్నిటికన్నా భారతీయులు అసత్యాన్నాడి ఎరుగరు. సహజంగా నిదానస్థులు, కష్టపడి పనిచేసేవారు, మంచి వ్యవసాయకులు, నైపుణ్యంగల చేతిపనివారవడంచేత వారు తగాదాలుపడి కోర్టులకెక్కలేదు. సంస్థానాధీశుల పరిపాలనలో వారు ప్రశాంతంగా జీవించారు. ఆరాజుల పరిపాలనలో మను ధర్మశాస్త్రానుసారంగా, వంశానుగతంగా, వర్ణధర్మమునునుసరించి మంత్రులు, సంగ్రామశూరులు ఉండేవారు..........గ్రామపరిపాలనా పద్ధతి చక్కగా వర్ణింపబడినది. *ప్రతిగ్రామం చిన్న స్వతంత్రమైన ప్రజాప్రభుత్వ కేంద్రంవలె, ఆ గ్రీకు యాత్రికునకు అగుపడింది.*

భారత ప్రజలనుగురించి బిషప్ హెబర్ ఇలా అన్నాడు :

> వారి సహజస్వభావం చాలామంచిదనే నేనభిప్రాయపడుతున్నాను. వారు చాలా ఉన్నతశ్రేణికి చెందిన వీరులు. మర్యాదస్థులు. బుద్ధిశాలురు. జ్ఞానసముపార్జనకు, అభివృద్ధికి వారు చాలా కుతూహలపడుతుంటారు........ వారు చాలానిదానస్థులు. శ్రమపడి పనిచేసే స్వభావం కలవారు. వారికి తలితండ్రులయడల భక్తి, పిల్లలయడల ప్రేమమెండు. స్వభావసిద్ధంగా వారు నెమ్మదైనవారు. ఓర్మిగలవారు. నేనుచూచిన అందరి మనుష్యులలోకీ అల్పసంతోషులు. కొద్దిగా దయతో ఆదరిస్తే పరమానంద భరితులౌతారు.

కొంత కాలం మద్రాసు గవర్నరుగా నుండిన సర్ థామస్ మన్రో ఇలా అన్నారు :

> భారత ప్రజలను నాగరికులను చేయడమంటే ఏమిటో నాకు సరిగా అర్థం కావడంలేదు. సూత్రప్రాయంగానూ ఆచరణలోనూ చక్కని ప్రభుత్వవిధానం లేకపోవడం వారిలోపమంటే కొంతవరకంగీకరింప వచ్చును. కాని, మంచి వ్యవసాయ పద్ధతులు, సాటిలేని వస్తువుల తయారీ, భోగభాగ్యాలకు అవసరమైన సామగ్రిని ఉత్పత్తి చేయడం, విద్యాభ్యాసానికి పాఠశాలలను నెలకొల్పడం, దయాదాక్షిణ్యాలు అతిథి మర్యాదలు కలిగిఉండడం, అన్నిటికన్న, స్త్రీలపట్ల అమితమైన గౌరవ మర్యాదలతో ప్రవర్తించడం మొదలైన ఉత్తమ లక్షణాలు నాగరికతకు చిహ్నములైనట్లయితే, హిందువులు, నాగరికతలో యూరోపు ప్రజలకు ఏవిధంగానూ తీసిపోరు.

సర్ జార్జిబర్డుఉడ్ భారతీయుల సాధారణ ప్రవృత్తినిగురించి ఈ విధంగా అభిప్రాయాన్ని ప్రకటించాడు :

> వారు చాలా ఓర్మిగలవారు. శాంతస్వభావులు. కష్టపడి పనిచేయగలవారు. కాయకష్టాన్ని బాగా భరించగలవారు. శాసనబద్ధులు. శాంతిప్రియులు........ విద్యావంతులు, వ్యాపారస్థులు చాలా నిజాయితీగలవారు. సత్యప్రియులు. స్థూలంగాచెప్పాలనొస్తే, బ్రిటిష్‌సర్కారు వారికి నమ్మకమైన విశ్వాసపాత్రులు. ఈ మాటలు స్పష్టంగా అర్థమవుతున్నాయనుకుంటున్నాను. బొంబాయిలోని సెట్టియావర్గానికి చెందినవారిలో అనగా ఉన్నత శ్రేణికి చెందిన (ఉన్నత తరగతివారు) వారిలో, నైతిక సత్యప్రియత్వం, జర్మనీ జాతివారిలో ఎంత ప్రస్ఫుటంగా అగుపడుతుందో అంతగానే కనుబడుతుంది. క్లుప్తంగా చెప్పాలంటే భారతీయులు ఏ విధంగాచూచినా మనకన్న తక్కువవారుకారు. పైగా మనం విశ్వసిస్తున్నట్లు నటిస్తున్న కొన్ని ప్రమాణాలనుబట్టి చూస్తే, వారు మనకన్న అధికులే.

సర్ ట్రీవిల్యన్ ఈ విధంగా అన్నాడు :

వారి దగ్గర (భారతీయుల దగ్గర) చాలా చెప్పుకో దగిన పరిపాలనా సమర్థత ఉన్నది. గొప్ప నిదానం, గొప్ప కార్యదీక్ష, సునిశితమైన బుద్ధివిశేషం వారికున్నది.

సర్ డబ్ల్యు. డబ్ల్యు. హంటర్ వారి కుటుంబవిషయాలను గురించి ఈ విధంగా వ్రాశాడు :

కుటుంబక్షేమం, బంధుప్రేమ విషయాల్లో, నిజానికి ఇంగ్లీషువారికీ హిందువులకూ ఎక్కడా పోలికే లేదు. తలి తండ్రులు పిల్లలయెడల చూపించే ప్రేమకుగాని, పిల్లలు తలితండ్రులపట్ల చూపించే ప్రేమకుగాని పోలినది ఇంగ్లం డులో ఎక్కడా గనుబడదు. ఈ దేశంలో (ఇంగ్లండు) భార్యాభర్తలలో కనుబడే గాఢమైన అన్యోన్య ప్రేమ వంటిది భారత ప్రజలలో తలితండ్రులలోనూ వారి బిడ్డల లోనూ కనుబడుతుంది.

మిష్టర్ పింకట్ ఈ విధంగా చెపుతున్నాడు :

సాంఘిక వ్యవహారములలో, ఇంగ్లీషువారు, భార తీయులపైన పెత్తనం చలాయించడానికి ప్రయత్నించడం కంటె, వారి పాదములదగ్గర శిష్యులుగా కూచుని నేర్చుకో దగినవారు.

యం. లూయీ జకోలియట్ ఈ విధంగా అన్నాడు :

ఓ ప్రాచీన భారతదేశమా, మానవజాతిని లాలించి పెంచిన ఓ తల్లీ, నీకు జయమగుగాక ! పూజ్యు రాలైనా ఓ మాతా, నీకు నమస్కారము ! శతాబ్దములుగా నీపైన క్రూరమైన దాడులు ఎన్నిజరిగినా అడుగంటని మహాతల్లివి. మతాలకు, ప్రేమకు, సారస్వతానికి, శాస్త్రాలకు పట్టిల్లయిన ఓ దేవీ నీకు నమస్కారం. తల్లీ, మా పాశ్చాత్య దేశాల భవిష్యత్తు నీ ప్రాచీన వైభ వాన్ని పునరుద్ధరించడంలోనే ఉండుగాక !

సర్ విక్టర్ హ్యూగో ఇలా అన్నాడు:

> ఫ్రాన్సు, జర్మనీ దేశాలు యూరోపును సంపాదించాయి. ప్రాచ్యదేశాలకు భారతదేశ మెటువంటిదో, జర్మనీ పశ్చిమ దేశాలకు అటువంటిది.

వీటితోడు భారత దేశము మానవులలో పురుషోత్తముడైన బుద్ధభగవానుని జన్మభూమి అనే సంగతి గమనించండి. కొందరాయనను క్రీస్తుతర్వాత అంతటి ఉత్తమజీవి లేడంటారు. బ్రిటిష్ ప్రభుత్వం స్వల్ప మార్పులతో ఎవరి పరిపాలనా పద్ధతులను అంగీకరించినదో అటువంటి అక్బర్ జన్మభూమి. తన దాతృత్వ విశేషంచేత భారత దేశాన్నే కాకుండా ఇంగ్లండునుకూడా ఆశ్చర్యపరచిన పారశీక ప్రభువును (**Baronet**) భారత దేశము ఇటీవలనే కోల్పోయినది, ప్రస్తుతం వైస్రాయిగానున్న లార్డ్ ఎల్గిన్ చేత, ఉత్తమశ్రేణికి చెందిన యూరోపియను పత్రికా రచయితలతో పోల్చదగిన ప్రతిభావంతుడని ప్రశంసల నందిన క్రిస్టోదాస్ పాల్ ఇక్కడే జన్మించాడు. ముత్తుకృష్ణయ్యారు, (సర్ టి. ముత్తుస్వామయ్యారు,) మహమ్మద్ వంటి న్యాయమూర్తులు భారతదేశంలోనే వెలిసేరు. భారతీయ హైకోర్టుల్లో జడ్జీలుగా పనిచేసిన భారతీయ, యూరోపియన్ న్యాయమూర్తులందరిలోనూ వారి తీర్పులు చాలా గొప్పవని అందరూ అంగీకరించిన విషయమే. బదురుద్దీన్ తయాబ్జీ, సురేంద్రనాథ బెనర్జీ, ఫిరోజ్ షా మెహతావంటి ఉపన్యాసకులు తమ గంభీరోపన్యాసములతో అనేకమారులు ఆంగ్లేయ సభల్లోని సభికులను నిశ్చేష్టితులనుచేసిన సంగతి మరువకూడదు.

ఇండియా అంటే ఇది. కొంచెం అతిశయోక్తులతోనూ, అలంకారాలతోనూ, ఈ చిత్రాన్ని చిత్రించినట్లు మీకు కనుబడ వచ్చును. కాని ఇందులో అసత్య మేమీ లేదు. దీనికి బొరుసులేక పోలేదు. కాని ఈ రెండు జాతులను సమన్వయపరచడంలోకంటె విడగొట్టడాని కెక్కువ సరదాపడేవాళ్లెవరైనా ఆ బొరుసుసంగతి చెప్పవచ్చును. దయచేసి డేనియల్‌వలె నిష్పక్షపాతబుద్ధితో ఈ విషయాన్ని పరిశీలించండి. ఇండియా ఆఫ్రికావంటిది కాదనీ, అసలైన నాగరిక దేశమనిన్నీ, మీకు విశ్వాసం కలుగడానికి కావలసినన్ని ఆధారాలు లభిస్తాయని నేను విశ్వాసంతో చెప్పగలను.

ఈ విషయాన్ని విరమించే ముందు ఎవరైనా చెప్పగలిగే ఈ అభ్యంతరాన్ని గురించి ప్రస్తావన చేయనివ్వండి. 'మీరుచెప్పినదంతా నిజమైతే, కాలనీలో మీరు భారతీయులని పిలిచేవారు భారతీయులు కారన్నమాట. ఏమంటే ఇక్కడ వారి అలవాట్లు, ప్రవర్తన అందు కనుగుణ్యంగాలేవు. ఎంతగా అబద్ధాలాడతారో చూడండి, అని అంటారు. నేను కాలనీలో ఎవరితో కలిసి మాట్లాడినా భారతీయులు అబద్ధాలాడతారనే చెపుతూ ఉంటారు. కొంతవరకు ఈ ఆరోపణను నేనంగీకరిస్తాను. ఇతర వర్గాలవారు కూడా ఇలాగే అసత్యవర్తనులని నిరూపించడంవల్ల నాకేమీ తృప్తి లేదు. ముఖ్యంగా భారతీయులుండే అధ్వాన్నపు పరిస్థితుల్లో ఉండే వారెవ్వరూ వారికన్న మెరుగుకాదు. అయినప్పటికీ ఆవాదన నాశ్రయించక తప్పడంలేదు. నేనైతే వారు సాధారణ మానవులకన్న మిన్నగానే ఉండాలని కోరుతుంటాను. కాని వారు మానవాతీతులని నేను చెప్పను. వారు నేటాలుకు కడుపుకు చాలీచాలని కూలికొస్తారు. (కంట్రాక్టుకూలీ కొచ్చేవారిమాటే ఇది) తీరా వచ్చాక వారొక చిత్రమైన పరిస్థితుల్లో పడతారు. ఎక్కడా అనువైన వాతావరణం కనుబడదు. కాలనీలో స్థిర నివాసమేర్పరచుకుంటే భారతదేశాన్ని వదలిపెట్టినప్పటి నుంచి ఆజన్మాంతం ఏవిధమైన నైతిక విద్యాగంధమూ ఉండదు. హిందువులైనాసరే మహమ్మదీయులైనాసరే, వారికి చెప్పుకోదగిన మతప్రబోధమేమీ లభించదు. పైవారి సహాయంలేకుండా వారు స్వంతంగానే జ్ఞానసముపార్జనం చేసుకోగలిగినంత విద్యావంతులుకారు. అటువంటి పరిస్థితుల్లో వాళ్లు అబద్ధాలాడేరంటే విపరీతమేమీలేదు. కొంతకాలానికి అదే అలవాటైపోయి అదొక జబ్బుగా పరిణమిస్తుంది. అకారణంగా అబద్ధాలాడతారు. అందువల్ల తమకేమీ లబ్ధిలేకపోయినా ఆపని చేస్తారు. పాపం! నిజానికి వాళ్లేమిచేస్తున్నారో వాళ్లకు తెలియదు. కేవలం అశ్రద్ధవల్ల వారి నైతిక శక్తులు పూర్తిగా నిర్జీవమైపోయే స్థితికొస్తుంది, వారి జీవితం. అబద్ధాలాడడంతో కూడా చాలా భయంకరమైన రూపమొకటున్నది. పెట్టాలని హింసపెట్టబడుతున్న సోదరునితో కూడా వారు నిజంచెప్పలేరు. వారి యజమాని ఏమిచేసి

చాతాపోకని దయు. పోనీపోనీగా లభించే భత్యప్రాంజలు తగ్గించి, కఠినమైన శిక్షల కిచ్చి, మిదప్రైన బాధలనంత నిలిపిగా తీసుకోగలిగినంత తప్పు వేస్తులుకారు. ప్రెంచ్యి యజమానికి వ్యతిరేకంగా నిజమైన సాక్ష్యం చెప్పలేరు. అందుచేత వారు క్షమింపతగినవారా? వాస్తవానికి వారు సానుభూతి కర్హులు. దయాధర్మాలకు పాత్రులుగాని పురాత్రులనుగా వాళ్లను చూడ దగునా? కాక సానుభూతికర్హులైన నిస్సహాయులనువలె చూడవలెనా? అటువంటి పరిస్థితులలో మరే వర్గానికి చెందిన ప్రజలెవ్వరైనా ఇంకొకలాగున ప్రవర్తించేవారున్నారా?

బాగా అబద్ధాలాడే వర్తక వ్యాపారస్థుల కెట్లా సమర్థిస్తా వని నన్నెవరైనా అడుగవచ్చును. ఈ విషయంలో వారిమీద చేయబడుతున్న నేరారోపణ నిరాధారమని మనవిచేస్తున్నాను. వ్యాపార ధర్మంలోనూ, న్యాయస్థానాల్లోనూ ఇతరవర్గాల వా రాడే అబద్ధాలకన్న వారెక్కువ అబద్ధాలనాడడంలేదు. వారు ఇంగ్లీషుమాట్లాడ లేకపోవడంవల్లనూ, తర్జుమా చేసేవారు సరిగా చేయకపోవడంవల్లనూ, వారి విషయమై చాలా అపోహాలు పడు తున్నారు. తమిళం, తెలుగు, హిందూస్థానీ, గుజరాతీ ఈ నాలుగు భాషల్లోనూ, తర్జుమా చేయవలసివచ్చేది. వర్తకంలో ఉండే భారతీయుడు విధిగా హిందూస్థానీలోనో గుజరాతీ భాష లోనో మాట్లాడతాడు. హిందుస్థానీ ఒకచే మాట్లాడేవారు మంచి హిందూస్థానీ మాట్లాడుతారు ఒక్కడు మాత్రం మినహాగా, అక్కడుండే అనువాదకులంతా తమిళం, గుజరాతీ, ఇతర భారతీయ భాషలనన్నిటినీ, కలగాపులగంచేసేసి మాట్లాడుతారు. హిందూ స్థానీ వ్యాకరణాన్ని వారెంత మాత్రమూ పాటింపరు. సామా న్యంగా తర్జుమాదారు సాక్షితో వాదిస్తేకాని దాని అర్థం అతడికి గ్రాహ్యకమయ్యేదికాదు. ఈ తతంగం జరుగుతుంటే న్యాయ మూర్తికి విసుకు పుడుతుంది. తప్పుడు సాక్ష్యమిస్తున్నాడను కుంటాడు న్యాయమూర్తి. సాక్షి వచ్చీరాని తర్జుమాచేసే దుబా షీని ఏమిటయ్యాసంగతని అడిగితే తన మిడిమిడి భాషాజ్ఞానాన్ని కప్పిపుచ్చుకోవడానికి సాక్షి తిన్ననైన జవాబునివ్వడంలేదని అంటాడు. పాపం సాక్షికి తనతప్పును తాను సవరించుకొనే సావ

కాశంలేదు. గుజరాతీ మాట్లాడేవారి విషయంలో ఈ చిక్కు మరింతగా ఉన్నది. తర్జుమాదారుడు చాలా ప్రయాసపడిన మీదట నే సాక్షిచెప్పే సంగతులను గ్రహించకలుగుతాడు. గుజరాతీ మాట్లాడే సాక్షి తానుచెప్పే విషయాలను ఎదుటవారి కర్థమయ్యే ట్లు చెప్పడానికిపడుతుండే బాధలు, ఆయన నర్థంచేసుకొనేందుకూ తర్జుమాదారుడు పడేపాట్లు, నేను స్వయంగా చూచాను. తమకు పరిచయంలేని పదాలనుంచి సారంతీసే దుభాషుల బుద్ధిసునిశితత్వం కూడా గొప్పదే. సాక్షీ దుబాషీ ఒకరినొకరు అర్థంచేసుకోవడానికి పాట్లుపడుతుంటే న్యాయమూర్తి సాక్షిచెప్పే మాటలను నమ్మకూడదనే నిర్ణయానికొస్తాడు. సాక్షి అబద్ధాలకోరనే అభిప్రాయానికొస్తాడు.

## 3

'ప్రస్తుతం వారిపట్లచూపే ఆదరణ, గౌరవమర్యాదలూ ఉత్తమ బ్రిటిష్ సాంప్రదాయానుగుణ్యంగా ఉన్నాయా? నీతి న్యాయాలకు అనుగుణ్యంగా ఉన్నాయా? లేక క్రైస్తవ సిద్ధాంతముల ననుసరించి ఉన్నవా? అన్న మూడవ ప్రశ్నకు సమాధానం చెప్పాలంటే ఇప్పుడు వారియడల కనుపరచే ప్రవర్తన ఎట్టిది అనేవిషయాన్ని విచారించడం చాలా అవసరం. కాలనీలో భారతీయుని చాలాకటువుగా ద్వేషిస్తున్నారన్న విషయం నిస్సందేహంగా అంగీకరింప బడుతుందనుకుంటాను. సామాన్యుడు అతని నసహ్యించు కుంటాడు. తిడతాడు. ఉమ్మేస్తాడు. తరుచు కాలిబాట మీద నుంచి త్రోసేస్తుంటాడు. వాళ్లని తిట్టడానికి పత్రికలకు ఇంగ్లీషు నిఘంటువులో ఘూరైన మాటలు దొరకడంలేదు. కొన్ని ఉదాహరణకు చూడండి: "జాతి ఆయువుపట్లను తినేస్తున్న పుండు; వేరుపురుగులు; జిత్తులమారి దుర్మార్గపు, అర్ధ అనాగరికులైన ఆసియాజాతుల వారు; నల్లగా సన్నంగా అశుభ్రంగా ఉండి దౌర్భాగ్యపు హిందూ అని పిలువబడే పదార్థం; దుర్గుణాల పుట్ట, బియ్యంతిని బ్రతికేవాడు ,.............అలాంటి హిందూను మనఃపూర్వకంగా అసహ్యించుకుంటున్నాను; జిత్తుల మారులు, అబద్ధాలకోరులూ అయిన దరిద్రపు కూలీలు" మొదలైనవి. పత్రికలు సర్వసాధారణంగా భారతీయులను సరియైన పేరుపెట్టి

పిలువక, 'రామిసామి' 'మిస్టర్ సామి', 'మిస్టర్ కూలీ' 'నల్లమనిషి' పేర్లనే వాడుతుంటారు. ఈ తిట్టుమోతు మాటలు ఎంత సర్వ సాధారణంగా వాడబడుతున్నాయంటే, పవిత్రమైన న్యాయ స్థానపు ఆవరణలో కూడా ('కూలీ' అనేమాటైనా) ఉపయోగింప బడుతున్నాయి. ప్రతిభారతీయుడైన వాడిని 'కూలీ' అని అనడం, న్యాయమైనట్లు, ఉచితమైనట్లు భావింపబడుతోంది. ప్రజాహిత జీవితంలో ఉండేవాళ్లుకూడా ఈ మాటను నిస్సంకో చంగా వాడుతున్నారు. బాగా వివేకవంతులనుకోబడే వారు కూడా 'కూలీ గుమస్తా' అనడం నేను తరుచుగా విన్నాను. ఆమాటే అసమంజసమైన ప్రయోగం. ఎవరిపట్ల అది ఉపయో గింపబడుతున్నదో వారికి చాలా బాధాకరం. అయితేనేమి. ఈ కాలనీలో భారతీయుడొక మానాభిమానాలు లేని జంతువు!

ట్రాంబండ్లలో భారతీయు లెక్కడానికి వీలులేదు. రైల్వే ఉద్యోగులు భారతీయులను జంతువులనుగా చూడవచ్చును. భారతీయుడెంత పరిశుభ్రంగాఉన్నా అతడితోపాటు ఒకే రైలు పెట్టెలో కూచుని ప్రయాణంచేయడానికి శ్వేతజాతివారెవ్వరూ ఇష్టపడరు. అతడిపొడే సహించలేరు. భారతీయులను హోటళ్ళలోనికి రానియ్యరు. గౌరవనీయులైన భారతీయులను ఒక్క హోటలులో ఉండనివ్వడానికికూడా నిరాకరించిన సందర్భాలు నేనెరుగుదును. ఆఖరుకు ప్రజలందరికోసం ఏర్పడ్డ స్నానాలగదులను కూడా ఎంత గొప్ప భారతీయులైనా ఉపయోగించ డానికి వీలులేదు.

నాకు చేరుతున్న భోగట్టాలో వదోవంతు సంగతులను బట్టి చూచినా, ఎస్టేట్లులోని కమతాలలో భారతీయ కంట్రాక్టు కార్మికుల పట్ల యజమానుల ప్రవర్తన చాలా అమానుషంగా ఉన్నది. భారతీయ కార్మికులపట్ల, రక్షణాధికారి వహిస్తున్న శ్రద్ధ ఎంత మాత్రం తృప్తికరంగా కనుబడదు. ఏమైనా, ఈ విషయమై నాకు గల అనుభవం పరిమితమవడంచేత ఇంతకన్న హెచ్చుగా వ్రాయను.

ఇల్లువాకిలిలేనివారి విషయంగా చేయబడినచట్టం చాలా నిరంకుశంగా ఉన్నది. అనేక సందర్భాల్లో గౌరవనీయులైన భారతీయులు ఆ చట్టంవల్ల అనేక అగచాట్లను పడుతున్నారు.

దీనికితోడు, భారతీయులను ప్రత్యేక పేటలలో నివసించేటట్లు చేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయనే వదంతులు కూడా బయలుదేరినాయి. అది కేవలం అభిప్రాయమాత్రమే కావచ్చును. కాని భారతీయులపట్ల, యూరోపియను కాలనిస్టులకుండే ద్వేషాని కదొక నిదర్శనం. అలాంటి సంకల్పాన్ని నెరవేర్చే సావకాశములున్నప్పుడు, నేటాలులోని భారతీయుల స్థితి ఏవిధంగా ఉంటుందో ఊహించుకోవలసినదని మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను.

ఈ విధంగా భారతీయులయెడల ప్రవర్తించడం బ్రిటిష్ న్యాయానికి, నీతికి, క్రైస్తవ మతానికి అనుగుణ్యంగా ఉన్నదా ?

మీ అనుజ్ఞతో నేను మెకాలే వ్రాసినదానిలోనుంచి ఒక భాగాన్ని ఉదహరిస్తున్నాను. భారతీయులపట్ల మీ ప్రవర్తనను ఆయన హర్షించేవాడేమో మీరే ఆలోచించుకోండి. భారతీయుల పట్ల ఉండవలసిన ప్రవర్తనగురించి ఆయన ఈ విధంగా తన అభిప్రాయాలను వెలిబుచ్చాడు :

> భగవంతుడు మనపెత్తనానికి వప్పచెప్పిన ప్రజలను, కేవలం వారు మనంచెప్పినట్లు నడుచుకునేటట్లు చేయడానికి, వారికి నల్లమందు నిషా ఎక్కించి నిర్వీర్యులను చేయడానికి మనం ఎన్నడూ అంగీకరించము. పాలకులమైన మనం పాలితులపట్ల చూపవలసిన ధర్మాలనన్నిటిని అతిక్రమించి, కేవలంవారి దుర్వ్యసనాల మీద, అవివేకంమీద, దౌర్భాగ్యంమీద ఆధారపడి చలాయించే అధికారానికి విలువ ఏమున్నది ? మామూలుకన్న ఎక్కువగా రాజకీయ స్వాతంత్ర్యాన్ని, విజ్ఞానవికాసాన్ని, అనుభవిస్తున్న మనము, 3 వేల సంవత్సరాలనుండి మతాధికారుల నిరంకుశత్వమునకు బానిసలైన ప్రజలపట్ల నిర్వహించవలసిన బాధ్యతలు లేవా ? మనం అనుభవిస్తున్న స్వాతంత్ర్యాన్ని, నాగరికతను, మానవజాతికి చెందిన ఇతరులకు మనం నిరాకరించేయెడల మనస్వాతంత్ర్యానికి, నాగరికతకు ఏమీ విలువలేదు.

కాలనీలో భారతీయులపట్ల చూపుతున్న ప్రవర్తనను వారు ఎంత మాత్రమూ అంగీకరించరని ఋజువు చేయడానికి మిమ్ములను మిల్, బర్కు, బ్రైట్, ఫాసెట్ వంటి మేధావుల రచనలను చూడవలసినదిగా కోరుతున్నాను.

ఒక మనిషిని పొట్టకూటికి కూలని ద్రవ్యమిచ్చి తీసుకొనివచ్చి దాస్యంలో బంధించి, అతడు కాస్తంత స్వేచ్ఛనుకోరి కొంచెం మెరుగుగా జీవించడం మొదలెట్టేసరికి అతగాడిని ఇంటికి పంపించెయ్యడానికి ప్రయత్నించడం, తనస్వదేశం కొత్తకావడంవలన అతనికి బహుశా జీవనాధారంకూడ లేకుండా ఉండేటట్లు చేయడం, ధర్మంకాదు. బ్రిటిషుజాతి న్యాయపక్షతకు ఇది లక్షణంకాదు.

భారతీయులపట్ల మీప్రవర్తన క్రైస్తవబోధకు అనుగుణ్యం కాదనడానికెక్కువగా వాదించనక్కరలేదు. శత్రువులను ప్రేమించమనీ, ఎవరికైనా చొక్కా కావలసివస్తే నీచొక్కా నిచ్చేయమనీ, ఎడమ చెంపనుకొడితే కుడిచెంపను కూడా చూపించమనీ ప్రబోధించిన మహనీయుడు, యూదులకు యూదేతరులకూ గల భేదాలను తొలగించిన మహాప్రవక్త, తోడిమానవుని ముట్టుకుంటేనే అపవిత్రుడనవుతాననే అహంకారాన్ని ఎంతమాత్రం సహించడు.

## 4

మొదటి విషయాన్ని చర్చించినపుడే ఆఖరు విషయం కూడ చాలవరకు పరిశీలించామనుకుంటాను. కాలనీలోనుంచి భారతీయుడైన ప్రతివారినీ తరిమివేయడానికి ప్రయత్నం జరిపిస్తే నామటుకు నేనంత విచారించను. అలా జరిగితే కాలనీలోని వారు అచిర కాలంలో తాముచేసినపనికి పశ్చాత్తాప పడక మానరు. చిల్లర వ్యాపారము, చిల్లర వృత్తులు స్తంభించి పోతాయి. భారతీయులు మాత్రమే చేయగల పనులను యూరోపియనులు చేయరు. భారతీయులవల్ల కాలనీకి లభిస్తున్న చాలా ఆదాయంపోతుంది. దక్షిణాఫ్రికా వాతావరణంలో యూరోపియనులు, యురోపులో తేలికగా చేయగలిగినట్లు పనులను చేయలేరు. అయితే నేను సవినయంగా చెప్పవలసిన సంగతి ఒక్కటే. భారతీయులను

కాలనీలో ఉంచేటట్లయితే, వారి సమర్థతకూ నిజాయితీకి అను గుణ్యంగా వారిపట్ల ప్రవర్తించాలి. అనగా వారి యెడల ప విధమైన ద్వేష భావంలేకుండా, న్యాయంగా ఆలోచించి వారికేమి ఇవ్వవలసి ఉంటుందని మీకు తోస్తుందో దానినివ్వండి.

ఈ విషయాన్ని జాగ్రత్తగా పరిశీలించమని మిమ్మలను ప్రార్థిస్తున్నాను. మీకు ముఖ్యంగా ఇంగ్లీషు వారికి నే నొక విషయాన్ని జ్ఞాపకానికి తెస్తున్నాను. భగవంతుడు ఎందుకో ఇంగ్లీషు వారిని భారతీయులను కలిపేడు. ఇంగ్లీషువారి చేతుల్లో భారతీయుల భవిష్యత్తును గుప్తపరిచాడు. భారతీయులపట్ల ఆంగ్లేయుల ప్రవర్తన మీదనే భవిష్యత్తంతా ఆధారపడుంది. యాదృచ్ఛికంగా సంభవించిన ఈ కలయిక వలన సానుభూతి, ప్రేమ, అన్యోన్య అవగాహన, స్వేచ్ఛాయుతమైన పరస్పరమైత్రి, వీటన్నిటితో కూడిన శాశ్వత కలయికగా మారుతుందో, లేక భారతీయులను అణచిపెట్టి ఉంచేశక్తి ఇంగ్లీషువారి కుండేటంతవరకో లేక సహజంగా నెమ్మదిగా ఉండే భారతీయు లొక్కసారి విజృంభించి విదేశ దాస్యాన్ని తొలగించే తీవ్రప్రయత్నం చేసేదాకా ఉంటుందో ఆంగ్లేయుల ప్రవర్తన మీద ఆధారపడుంటుంది. ఇంగ్లండులోని ఇంగ్లీషువారు, ఉభయజాతి ప్రజల హృదయాలనూ సమన్వయం చేయాలనీ, రంగు భేదాలనుతాము పాటించమనీ, తమతోపాటు భారతదేశాన్ని కూడ పైకెత్తుతే కాని భారత దేశాన్ని అణగద్రొక్కి, తాము దానిపై కెక్క మనీ, తమ వ్రాతలవల్ల మాటలవల్ల చేతలవల్ల ఋజువు చేశారని కూడ మీకు జ్ఞాపకం చేస్తున్నాను. ఇందుకు నిదర్శనం కావలిస్తే దయచేసి బ్రైట్, ఫాసెట్, బ్రాడ్లా, గ్లాడ్ స్టన్, వెడ్డర్ బర్న్, పిన్ కాట్, రిప్పన్, రీ, నార్తు బ్రూక్, డఫరిన్ మొదలైన అనేక మంది ప్రజాప్రతినిధుల అభిప్రాయాలను చిత్తగించమని కోరుతున్నాను. అప్పటి ప్రధానమంత్రికిష్టంలేక పోయినా, బ్రిటిష్ పార్లమెంటు ఎన్నికల్లో ఒక ఆంగ్లేయ నియోజక వర్గంనుంచి భారతీయుని ఎన్నుకోవడమే నా అభిప్రాయానికి నిదర్శనం.

(సెంట్రల్ ప్రిన్సుబరీ నియోజకవర్గంనుండి దాదాభాయి నౌరోజీ 1893 సం. లో పార్లమెంటుకు ఏన్నుకోబడిన విషయాన్ని పురస్కరించుకుని).

కన్సర్వేటివ్ పార్టీ లిబరల్ పార్టీలతోసహా బ్రిటిష్ పత్రికలన్నీ ఎన్నికైన భారతీయ సభ్యుని అభినందించాయి. ఇదొక అపూర్వ సంఘటనని ప్రస్తుతించాయి. పార్లమెంటు సమావేశంలో, కన్సర్వేటివు లిబరల్ సభ్యులతో సహా అందరూ ఆయనకు హృదయ పూర్వకమైన స్వాగతాన్నిచ్చారు. కనుక మీరు వారిని అనుకరిస్తారాలేక క్రొత్తదారి త్రొక్కుతారా? అభ్యుదయ లక్షణమైన ఐకమత్యాన్ని పెంపొందిస్తారా? లేక పతన లక్షణమైన విద్వేషాన్ని వృద్ధిచేస్తారా?

ఇది ఏ సద్భావంతో వ్రాయబడినదో ఆ సద్భావంతోనే దీనిని స్వీకరించ వలసినదని మిమ్ములను ప్రార్థిస్తూ ఈ లేఖను ముగిస్తున్నాను.

ఇట్లు విధేయుడు,
మో. క. గాంధీ.

[నేటాలు మెర్క్యురీ స్టీము ప్రింటింగు వర్క్సు, దర్బాన్‌లో ముద్రింపబడిన కరపత్రము నుండి గ్రహింపబడినది.]



# 43. యూరోపియనులకు లేఖ

బీచ్ గ్రవ్
డర్బాన్
డిసెంబరు 19, 1894 సం.

అయ్యా,

ఇందుతో జతపరచిన బహిరంగ లేఖను తాము పరిశీలించి తమ అభిప్రాయము నివ్వవలసినదిగా కోరుతున్నాను.

మీరు క్రైస్తవ మతబోధకులైనా, పత్రికా సంపాదకులైనా ప్రజాహిత జీవితంలో ఉన్నవారైనా, వర్తకులైనా, న్యాయవాదులైనా ఈ విషయాన్ని మీరు పరిశీలింపక తప్పదు. మీరు క్రైస్తవ మతబోధకులైనట్లయితే, తాము జీసస్ ప్రబోధము ననుసరించి దీనిని పరిశీలించాలి. తోడి మానవులపట్ల ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూకూడా మీ ప్రవర్తన జీసస్‌కు బాధ కలిగించకుండా ఉండేటట్లు చూడడం మీ ధర్మం. మీరు పత్రికా సంపాదకులైనట్లయితే మీ బాధ్యత చాలా ఎక్కువైనది. పత్రికా రచయితగా మీకుగల పలుకుబడిని మీరు మానవాభ్యుదయానికి ఉపయోగిస్తున్నారో, లేక మానవపతనానికి ఉపయోగిస్తున్నారో తెలియాలంటే మీరు జాతుల సమైక్యతకు కృషిచేస్తున్నారా లేక వివిధ జాతుల భిన్నతకు పనిచేస్తున్నారా అనే విషయాన్ని బట్టి తేలాలి. ప్రజాసేవలో ఉండేవారికికూడ పైమాటలే వర్తిస్తాయి. మీరు వర్తకులో న్యాయవాదులో అయినట్లయితే మీరు ఎవరివల్ల ధనార్జనచేస్తున్నారో వారిపట్ల మీరొక ధర్మాన్ని నిర్వర్తించవలసి ఉన్నది. కాలనీలోని భారతీయుల సంగతి సందర్భములు తెలియక వారిని అనేక విధాలైన కఠిన చర్యలకు పాల్జేస్తున్నప్పుడు వారియడల సానుభూతి కనుపరచి

మీ తోటివారినిగా ఆదరిస్తారో లేక కుక్కలను చూచినట్లు చూస్తారో మీరే నిర్ణయించుకోవాలి. మీ వృత్తి ధర్మంవల్ల ఇతరులకన్న మీరు వారికెక్కువ సన్నిహితులుగా ఉంటారు కాబట్టి వారివిషయం బాగా తెలుసుకోవడానికి మీ కెక్కువ సావకాశ మున్నది. కొంచెం సానుభూతితో చూస్తే, ఇదివరలో సరియైన దృక్పథంతో వారిని అర్థంచేసుకున్న వందలాది యూరోపియనుల వలెనే మీకుకూడా వారు మంచివారుగానే కనబడవచ్చును.

కాలనీలో ఉన్న భారతీయులపట్ల యూరోపియనుల ప్రవర్తన సంతృప్తికరంగా లేదని నమ్మి, వారియడల సానుభూతిని చూపే యూరోపియనులు చాలమంది ఉన్నారో లేదో తెలుసు కోవడానికే మీ అభిప్రాయాన్ని తెలుసుకొన గోరుతున్నాను.

ఇట్లు విధేయుడు,
మో. క. గాంధీ.

[సబర్మతీ సంగ్రహాలయమునుండి గ్రహింపబడినది ]



# 44. అధి భౌతికవాదంయొక్క అసంపూర్ణత

మో. క. గాంధీ

ఇసాట్రిక్ క్రిస్టియన్ యూనియన్, లండన్ శాఖాహార సమితి } ప్రతినిధి

డర్బాన్,
జనవరి 21, 1895 సం.

*నేటాల్ అడ్వర్టైజరు* పత్రికా సంపాదకులకు.

అయ్యా,

ఇసాట్రిక్ క్రైస్తవ సంఘాన్ని గురించీ, లండన్ శాఖాహార సమితిని గురించీ, మీ పత్రికలో ప్రకటనల కాలంలో ప్రచురింపబడిన నోటీసును మీ పాఠకుల దృష్టికి తేవడానికి మీరు అనుజ్ఞను దయచేయవలెనని కోరుతున్నాను.

ప్రపంచంలోని అన్ని గొప్ప మతాలు ఒక్కటనీ, ఒక్క మూలంలోనుంచే అవన్నీ ఉత్పన్నమైనాయనీ నిర్ధారణ చేయడమే యూనియను యొక్క లక్ష్యం. ప్రపంచం ఇదివర కెన్నడు కనివిని ఎరుగని నాగరకతను ప్రసాదించినట్లుగా చెప్పుకొనే అధి భౌతిక తత్త్వం చాలా అసంపూర్ణమైనదని ఈ ప్రకటన చేయబడిన పుస్తకాలు నిరూపణ చేస్తున్నాయి. నేటి నాగరికత మానవ ప్రపంచానికేదో మహోపకారం చేసినట్లు చాటుతోంది. కాని అది సాధించిన మారణయంత్ర సృష్టి సంగతి మరచి పోతోంది. అరాజకాన్ని పెంపు చేయడం, పెట్టుబడి దారులకూ కార్మికులకూ తగాదాలు పెంచడం, సైన్సు పేరిట (అలాపేరెట్టడం తప్పు) నోరులేని అమాయకపు జంతువులను బుద్ధిపూర్వకంగా హింసచేయడం మొదలైనవన్నీ ఈ నాగరికత యొక్క ఫలితాలని వారు మరచి పోయారు.

ఏమైతేనేమి. ఈ నాగరికత పట్ల విముఖత్వం జనించినట్లు కనుబడుతోంది. దివ్యజ్ఞాన సమాజం యొక్క విజయం, క్రైస్తవ మతబోధకులు **(Doctrine of holiness)** పవిత్రతా సిద్ధాం

తాన్ని అంగీకరించటం, పునర్జన్మను గురించి విస్పష్టంగా, 'పెర్ఫెక్టివే' అనే గ్రంథంలో నిరూపించిన సిద్ధాంతాన్ని ప్రొఫెసర్ మాక్సు ముల్లరు అంగీకరించడం, ఇంగ్లండులోను ఇతర దేశాల్లోనూ కూడ పునర్జన్మ సిద్ధాంతాన్ని మేధావులంతా అంగీకరిస్తున్నారని ఆయన ప్రకటన చేయడం, 'జీసస్ క్రైస్తు జీవితంలో తెలియని సంగతులు' అనే పుస్తకం ప్రచురణ కావడం, ఇవన్నీ ఇందుకు నిదర్శనాలు. ఈ పుస్తకాలు దక్షిణాఫ్రికాలో లభించవు. ఆ పుస్తకాలమీద వెలువడిన అభిప్రాయాలను మాత్రమే నేను చూచాను. మనలనంత స్వార్థ పరులనుగాచేసిన ఈ నాగరికతనుండి వెనుకకు మరలుతున్నట్లు ఈ సంఘటనలూ ఇంకా అనేక విషయాలు ఋజువు చేస్తున్నాయి. మరల జీసస్ క్రైస్తు బోధనలవైపే కాకుండా బుద్ధుడు, జొరాష్టర్, మహమ్మద్ మొదలైన ప్రవక్తల ప్రవచనాలకేసి కూడాదృష్టి మళ్ళుతోంది. వీరందరినీ అసత్యవాదులైన ప్రవక్తలనుగా తిరస్కరించడంలేదు. ఈ ప్రవక్తల ప్రబోధాలు, జీసస్ ప్రబోధాలు ఒకదాని కొకటి బలపరచేవిగానే గుర్తింపబడుతున్నాయి.

శాఖాహారమునకు సంబంధించిన పుస్తకాలను నేను ప్రకటింపజాలనందుకు చాలా విచారిస్తున్నాను. పొరబాటున అవి ఇండియాకు పంపబడినాయి. అవి డర్బాన్ రావడానికి కొంత కాలం పడుతుంది. త్రాగుడుకన్న పెద్ద దురభ్యాసం మరొకటిలేదు. అన్ని వ్యసనాలకు అది మూలం. త్రాగుడు దురభ్యాసంతో బాధపడే వారందరూ, దానినుండి తప్పించుకోవాలని ఆత్రతగా ఉంటే, ఒక నెల రోజులపాటు ప్రధానంగా నూకరొట్టెను, నారింజకాయలు లేక ద్రాక్ష పళ్ళను ఆహారంగా తీసుకుంటే ఈ యావనుండి బయటపడతారు. నేను స్వయంగా ఈ విషయమై ఎన్నో ప్రయోగాలు చేశాను. మసాలాలులేకుండా శాకాహారం తీసుకుంటూ, తాజాపండ్ల రసాలను ధారాళంగా స్వీకరించి, టీ, కాఫీ, కోకో, ఆఖరుకు నీళ్ళుకూడా అక్కరలేకుండా రోజులు తరబడి జీవించడం సాధ్యమని నేను చెప్పగలను. ఈకారణం వల్లనే ఇంగ్లండులో కొన్ని వందలమంది శాకాహారులైనారు. ఒకప్పుడు త్రాగుబోతుతనానికి బాగా అలవాటైనవారే, ఈనాడు విస్కీ వగైరా మత్తు పదార్థాల వాసననుకూడా భరించలేని స్థితికి

వచ్చారు. 'మానవుని ఆహారం' అనే గ్రంథంలో డాక్టర్ బి. డబ్ల్యు. రిచర్డుసన్ త్రాగుబోతుతనానికి శాకాహారం నివారణోపాయంగా చెప్పేడు. నేటాలులాంటి ఉష్ణ ప్రదేశంలో, కావలసినన్ని పండ్లు, కూరగాయలు పుష్కలంగా లభిస్తాయి కనుక, రక్త రహితమైన ఆహారం సర్వ విధాలా లాభదాయకం. పరిశుభ్రతకు, ఆర్థిక సౌలభ్యానికి, ఆధ్యాత్మిక సంపత్తికీ అన్నివిధాలా మాంసాహారంకన్న శాకాహారం ఉత్తమమైనది.

ఇసాటెరిక్ క్రిస్టియన్ యూనియను పుస్తకాలు, కేవలం ధనార్జనకోసం ప్రచురింపబడిన పుస్తకాలు కావని వేరే చెప్పనక్కర లేదనుకుంటాను. కొన్ని సందర్భాల్లో వాటిని ఉచితంగా ఇచ్చేశాం. కొందరి కవసరమైతే అరువిస్తాం. మీ పాఠకుల కెవరికైనా ఇ. సి. యు. ని గురించికాని, లండన్ శాకాహార సంఘాన్ని గురించికాని ఇంకా భోగట్టా కావలసివస్తే నాతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపవచ్చును. ఈ ముఖ్య సమస్యలను గురించి నాతో మాట్లాడడానికివచ్చినా ఎవరైనా రావచ్చును.

ఇ. సి. యు. (ఇసాటెరిక్ క్రిస్టియన్ యూనియన్) బోధల గురించి రెవరెండ్ జాన్ పల్సుఫర్డు, డి. డి. వ్రాసిన విషయాన్ని ఉల్లేఖించి ముగిస్తాను.

> ఈ ఉపదేశములు ఒక మానవాతీతమైన ఆధ్యాత్మిక శక్తినుండి బయలుదేరినవని, ఆత్మాత్మికజ్ఞానంగల ప్రతి పాఠకుడు అంగీకరింపక తప్పదు. పవిత్రమైన లోకముల యొక్క జ్ఞానసంపద, దేవుని వివేకము అందులో కేంద్రీకరింపబడినాయి. క్రైస్తవులైనవారు తమ మతాన్ని ఎరుగుంటే వారికి అమూల్యమైన వచనములలో క్రీస్తు కనుబడతాడు. ఆయన పరిణామాన్ని ఇందులో ప్రత్యక్షంగా చూడకలుగుతారు. అటువంటి సందేశాలు సాధ్యమనే సంగతీ, వాటిని ఈ ప్రపంచాని కందివ్వ వచ్చుననే సంగతీ, మన శకానికి శుభ సూచకము.

భవదీయుడు
మో. క. గాంధీ.

[నేటాల్ అడ్వర్టయిజర్, 1-2-1895]

## 45. దాదాభాయి నౌరోజీకి లేఖ

328, స్మిత్ వీధి,
డర్బాన్, నేటాల్,
జనవరి 25, 1895.

పార్లమెంటు మెంబరు శ్రీ దాదాభాయి నౌరోజీగారికి,
లండన్.

అయ్యా,

ప్రభుత్వమువారేమీ మాట్లాడకపోయినా, రాణీగారు వోటింగుహక్కుల బిల్లును అంగీకరించలేదని పత్రికలు తెలుపుతున్నాయి. ఈ విషయంలో తామేమైనా భోగట్టా ఇవ్వగలరా?

ఇచట స్థిరనివాసమేర్పరచుకున్న భారతీయులు, వారితరఫున మీరు విశేషంగా శ్రమతీసుకుంటున్నందుకు చాలా కృతజ్ఞతను తెలుపుకుంటున్నారు.

భవదీయుడు,
మో. క. గాంధీ.

ఇందుతో తమ పరిశీలన నిమిత్తం కాగితాన్ని పంపుకుంటున్నాను.

[గాంధీజీ స్వహస్తంతో వ్రాసిన ఉత్తరంయొక్క ఫోటోగ్రాఫ్ నుండి సంగ్రహింపబడినది.]

## 46. అమ్మకమునకు పుస్తకాలు

డాక్టర్ అన్నా కింగ్స్ఫర్డ్, మిస్టర్ ఎడ్వర్డ్ మైట్‌లాండ్‌లు రచించిన యీ దిగువ పుస్తకాలు మొదటిసారిగా దక్షిణాఫ్రికాలో, ఇందులో ప్రకటింపబడిన వెలలకు అమ్మకానికి సిద్ధంగా ఉన్నాయి.

| | | | |
|---|---|---|---|
| ది పర్‌ఫెక్ట్ వే | .... | .... | 7/6 |
| క్లోత్‌డు విత్ ది సన్ | .... | .... | 7/6 |
| ది స్టోరీ ఆఫ్ ది న్యూ గాస్పెల్ ఆఫ్ ఇంటర్‌ప్రెటేషన్ | .... | .... | 3/6 |
| బైబిల్స్ ఓన్ ఎకౌంటు ఆఫ్ ఇట్‌సెల్ఫ్ | | .... | 1/- |
| ది న్యూ గాస్పెల్ ఆఫ్ ఇంటర్‌ప్రెటేషన్ | | .... | 1/- |

"దేవునివాక్కునో, దేవపుత్ర వాక్కునో వింటున్నట్లుంది. సాహిత్యంలో దీనికి సమానమైనది నాకు వేరొకటి కనబడలేదు. (*ది పర్‌ఫెక్టు వే*)"—కీ. శే. సర్ యఫ్. హెచ్. డాయల్.

'పర్ ఫెక్టు వే' అనే పుస్తకం పందొమ్మిదవ శతాబ్దంలో ప్రచురించబడిన పుస్తకాలలోకల్లా ప్రకాశవంతమైనదీ, ఉపయోగకరమైనదిగా భావిస్తున్నాం.—(నాస్టిక్) (యు. యస్. ఏ.)

యం. కె. గాంధీ,
ఏజంటు, ఇసోటరిక్ క్రిస్టియన్ యూనియన్,
లండన్ వెజిటేరియన్ సొసైటీ.

[*నేటాల్ ఎడ్వర్టైజర్*] 2-2-1895.

# 47. మహమ్మదీయ ధర్మశాస్త్రం

*1893 సం. రం మార్చి 22 వ తేదీగల 'నేటాల్ విట్‌నెస్' (నేటాలుసాక్షి) అనే పత్రికలో ఈ క్రింది రిపోర్టు ప్రచురింపబడినది:*

మరణశాసనం వ్రాయకుండా చనిపోయిన హసాన్ దావూజీ ఆస్థివిషయంలో మాస్టర్ నివేదికను అంగీకరించవలసినదని నిన్నటిరోజున సుప్రీంకోర్టువారి ఎదుట మిస్టర్ టాథాం దరఖాస్తు పెట్టుకున్నాడు. ఆ నివేదికలో మహమ్మదీయ న్యాయశాస్త్రము ననుసరించి బారిష్టరు మిస్టర్ గాంధీ తయారుచేసిన పంపిణీ పథకం జతపరుపబడిందని మిస్టర్ టాథాం చెప్పేడు.

సర్ వాల్టర్ రాగ్ (సుప్రీంకోర్టులో ఒక జడ్జీ): దీనిలో ఉన్నవిషయ మల్లా ఒక్కటే. అదేమంటే మిస్టర్ గాంధీకి మహమ్మడన్ లా తెలియదు. ఫ్రెంచివారికా లా ఎంతకొత్తో గాంధీకి కూడా అంతే. అందులో ఉదహరించిన సంగతులకు అందరిలాగే ఆయనా పుస్తకాలమీదనే ఆధార పడుతున్నాడు. ఆయనకు స్వానుభవంవల్ల తెలిసినదేమీలేదు.

పంపిణీ పథకం మతగురువుల వద్దనుంచీ మిస్టర్ గాంధీ దగ్గరనుంచీ స్వీకరించ బడిందని మిస్టర్ టాథాం చెప్పేడు. వీరుగాక మరెవ్వరి దగ్గర కెళ్ళాలో తనకు తెలియదనీ, దొరికినంతవరకు నిపుణుల దగ్గరనుండి ఛోగట్టా తీసుకున్నామనీ ఆయన అన్నాడు.

సర్ వాల్టర్ రాగ్: మరణించిన ఆయన సోదరునికి చెందవలెనని మిస్టర్ గాంధీ ఉదహరించిన ఆస్థిభాగము, మహమ్మదీయ శాసనం ప్రకారం పేదవారికి చెందాలి. మిస్టర్ గాంధీ హిందువుడు. ఆయన మతం సంగతి ఆయనకు తెలుసును. కాని మహమ్మదీయ శాసనముల సంగతి ఆయన కేమీ తెలియదు.

మిస్టర్ టాథాం- మనం గాంధీ అభిప్రాయాన్ని స్వీకరించాలా, లేక మతగురువుల అభిప్రాయాన్ని స్వీకరించాలా అన్నదే ప్రశ్న.

సర్ వాల్టర్ రాగ్: మనం మతగురువుల అభిప్రాయాన్ని స్వీకరించాలి. సోదరుడు తాను పేదల ప్రతినిధి యని ఋజువు చేసినపుడు మిస్టర్ గాంధీ చెప్పిన ప్రకారం అతడు 5/24 వ వాటాకు అర్హుడు.

*దీనిమీద వ్యాఖ్యానిస్తూ గాంధీజీ ఇలా వ్రాశాడు :*

డర్బాన్,
మార్చి 23, 1895.

నేటాల్ విట్‌నెస్ సంపాదకులకు—

అయ్యా,

22 వ తేదీ గల మీ పత్రికలో మహమ్మడన్ లాను గురించి సర్ వాల్టర్ రాగ్ కున్నూ, మిస్టర్ టాథాం కున్నూ జరిగిన సంభాషణ రిపోర్టుమీద నేను చెప్పదలచుకొన్న కొన్ని సంగతులను న్యాయ దృష్ట్యా ప్రకటించగలరని నమ్ముతున్నాను.

నా వాదనను బలపరచుకోవడం నిమిత్తమే నేను ఈ విధంగా మిమ్ములను కోరడంలేదు. సర్ వాల్టర్ రాగ్ యెడల నాకు సంపూర్ణమైన గౌరవమే. కాని సుప్రీంకోర్టు వారిచ్చిన తీర్పు, మహమ్మడన్ లాను అపార్థం చేసుకోవడం వల్ల కలిగిన ఫలితమని నా నమ్మకం. అందువల్ల ఈ తీర్పు భారతీయ నివాసులలో చాల మందికి ప్రతిబంధకం కలిగిస్తుంది.

నేనే మహమ్మదీయుడనైతే, కేవలం మహమ్మదీయుడుగా జన్మించిన అర్హత ఒక్కటే గల వారి తీర్పు నంగీకరించ వలసివస్తే, చాలా విచారిస్తాను. మహమ్మదీయుడైనంత మాత్రాన అతనికి వారి ధర్మశాస్త్రం దానంతటదే స్ఫురిస్తుందనుకోవడం ఆశ్చర్యమైన సంగతి. మహమ్మదీయ న్యాయశాస్త్రం మీద ఇతర మతస్థులు అభిప్రాయం చెప్పడాని కనర్హులనడం కూడా ఆశ్చర్యమే.

మీ పత్రికలోని రిపోర్టు దోషరహితమైనదైతే సోదరుడు పేదలకు తాను ప్రతినిధినని ఋజువు చేసుకున్న మీదటనే 5/24 వాటా కర్హుడని ఇవ్వబడిన తీర్పు, ఇండియాలో అమల్లోనున్న మహమ్మదీయ న్యాయశాస్త్రమునకున్నూ, ఖురాన్‌లో చెప్పబడిన న్యాయశాస్త్రమునకున్నూ విరుద్ధమని చెప్పవలసి యున్నది.

మెక్‌నాటెన్ వ్రాసిన 'మహమ్మడన్ లా' అనే గ్రంథంలో వారసత్వాన్ని గురించి వ్రాసిన అధ్యాయాలను నేను బహుజాగ్రత్తగా పరిశీలించాను. (దీనిని మహమ్మదీయేతరుడైన భారతీయుడే క్రోడీకరించాడు. ఇండియానుంచి తిరిగి వచ్చిన పిమ్మట మెసర్సు బిన్సు అండు మేసన్ కంపెనీ వారి నివేదిక ప్రకారం ఆ గ్రంథం మహమ్మదీయ న్యాయశాస్త్రం గురించి ప్రచురింపబడిన ఉత్తమ గ్రంథాలలో ఒకటి.) ఈ వారసత్వానికి సంబంధించి ఖురాన్‌లో చెప్పబడిన భాగాలను కూడా పరిశీలనగా చదివేను. వాటిలో దేనిలోనూ కూడా చనిపోయిన ముసల్మానుల ఆస్థిలో ఏ వాటా కూడా పేదవారికి చెందుతుందనే మాట ఒకటికూడా నాకు కనబడ లేదు. మహమ్మదీయ న్యాయానికి ఆ గ్రంథమూ, ఖురాన్ ప్రమాణము లైనట్లయితే, ఈ కేసు ఆస్థిలో పేదవారికి ఏ భాగమూ చెందదు. మరణశాసనం లేని ఆస్థిలోని, ఏ భాగానికి కూడా ఏ సందర్భాల్లోనూ పేదవారికి హక్కులేదు. సోదరుడు ( నిజానికి సవితి కొడుకని ఉండాలి ) మహమ్మదీయ చట్ట ప్రకారం ఏ వాటా నైనా స్వీకరించే యడల దానిని సోదరుడుగా తనకున్న హక్కుల వల్లనే పొందుతాడని నేను ఋజువు చేయగలనని ఆశిస్తున్నాను.

బహుశా (ప్రభువువైన) జడ్జీగారు, వారసత్వం విషయం ప్రస్తావన చేసినపుడు అప్రయత్నంగా ఆయనకు తెలియకుండానే, ప్రతి మహమ్మదీయుడూ విధిగా చేయవలసిన దానధర్మాలను గురించి ఆలోచించి ఉంటారు. అది మహమ్మదీయ మతంలో ఒక ప్రధాన సిద్ధాంతం. కాని జీవితంలో దాన ధర్మాలుచేయాలన్న సిద్ధాంతం, వారసత్వం పంపిణీకి వర్తించదు. జీవితకాలంలో దాన ధర్మాలు చేసుకున్న మహమ్మదీయుడు స్వర్గాన్నో లేక అక్కడొక గౌరవస్థానాన్నో సంపాదించుకుంటాడు. ఆతని మరణానంతరం అతడి ఆస్థిలోనుంచి ఒకభాగాన్ని ప్రభుత్వం దాన ధర్మాలు చేయడంవల్ల ఆధ్యాత్మికంగా ఆయనకేమీ మేలు కలుగదు. ఏమనగా అది ఆయన చేసినపని కాదు. ఒక మహమ్మదీయుడు మరణించినట్లైతే ఆయన ఆస్థికి ప్రధానమైన వారేకాకుండా మొత్తం బంధువులంతా హక్కుదారులే.

ఖురాన్ ఈ విధంగా చెపుతోంది :

తల్లితండ్రులు గాని బంధువులు గాని మరణించిన పిమ్మట వారి ఆస్తిపాస్థులను ఆయా భాగములలో పొందటానికి బంధువర్గాన్ని నిర్ణయం చేశాము.

లా ఈ ప్రకారంగా చాటుతోంది :

మరణించిన వ్యక్తియొక్క ఆస్థి ఈ విధమైన నాల్గు ధర్మములను నెరవేర్చవలసి యున్నది; సమాధి వగైరా అంత్య క్రియలు ఏ విధమైన ఆడంబరం లేకుండానూ ఏ విధమైన లోటు లేకుండానూ జరుగాలి; మిగిలిన దానిలో నుంచి అతడు న్యాయంగా చేసిన ఋణాలన్నీ తీర్చి వేయబడాలి; అప్పులు తీర్చగా మిగిలిన దానిలో నుండి మూడవవంతు (లెగసీస్) చెల్లింపబడాలి. ఆఖరుకు మిగిలినది వారసులకు పంచి ఇవ్వాలి.

వారసులు ఈ క్రింది విధంగా వివరింపబడ్డారు :

1. న్యాయశాస్త్ర రీత్యా భాగస్తులు. (2) మిగిలిన వారు. (రెసిడ్యూయరీస్) (3) దూరబంధువులు. (4) ముందుగా అంగీకరింపబడిన వారసులు (5) ప్రసిద్ధిగా గుర్తింపబడిన రక్తబంధువులు (6) (**Universal legatees**) యూనివర్సల్ లెగటీస్ (7) ప్రభుత్వం—రాజు.

లీగల్ షేరర్సు (అనగా న్యాయశాస్త్రరీత్యా భాగస్వాములు) ఈ విధంగా చెప్పబడ్డారు:

"ఖురాను ప్రకారంగాని, సాంప్రదాయ ప్రకారంగాని, అందరియొక్క అంగీకారంతో గాని ఇంతింత భాగాల కర్హులని నిర్ణయింపబడినవారు. వీరు 12 తరగతులుగా ఉన్నారు. అందులో అన్న తమ్ముల బిడ్డలు కూడా ఉన్నారు. 'రెసిడ్యూయరీలు' అనగా వాటా నిర్ణయింపబడకపోయినప్పటికీ, భాగస్వాములైన వారి భాగాలన్నీ ముట్టిన పిమ్మట మిగిలిన ఆస్థి కర్హులైన వారు. న్యాయశాస్త్రరీత్యా భాగస్వాములు లేకపోతే యావదాస్థికీ వారే అర్హులు. కొందరు

న్యాయరీత్యా భాగస్వాములైనవారు కొన్ని సందర్భాల్లో 'లీగల్ షేరర్సు' గా చేర్పబడరు. వారంతా 'రెసిడ్యూయరీ' లవుతారని ఈ సందర్భంలో గమనించవలసి ఉంటుంది. దూరబంధువులు **(Distant kindred)** అనగా పై రెండు వర్గాలకూ అనగా లీగల్ షేరర్సు, రెసిడ్యూయరీలు కాని వారు. న్యాయశాస్త్రరీత్యా భాగస్వాములైన వారి వాటాలు వారికిచ్చిన పిమ్మట, ఏమైన మిగిలినయెడల వారి తరువాత వారైన రెసిడ్యూయరీలకు చెందాలి. రెసిడ్యూయరీలు లేకపోతే, భాగస్వాములకే వారి భాగాల దామాషాయీ ప్రకారం చెందుతుంది."

మిగిలిన వారసులను గురించిన వివరాలతో ఈ పత్రికలో చోటును నేను నింపదలచుకోలేదు. పేదలు ఈ వర్గాలకు చెందరనిచెపితే చాలును. మొదటి మూడు వర్గాలవారు సంతృప్తిపడిన అనంతరం ఏమైనా ఉంటే వారు పుచ్చుకోవచ్చును.

'రెసిడ్యూయరీ' లు లో ఈ క్రిందివారు సహజమైన హక్కులు గలవారిగా ఉదహరింపబడ్డారు.

మరణించిన ఆతని తండ్రి కొడుకులు అనగా సోదరులు. రక్తసంబంధం గల సోదరులు, ఎంత దూరస్థులైనా వారి కొడుకులు.

1 వ శెక్షను 12 వ రూలులో ఇలా ఉన్నది :

'సాధారణంగా సోదరి కన్న సోదరుడు రెట్టింపు భాగాన్ని పుచ్చుకోవాలి. దానికి మినహాయింపు వేర్వేరు తండ్రుల వల్ల ఒకేగర్భాన జన్మించిన సోదర సోదరీలు.

11 వ శెక్షనులోని 25 వ రూలులో ఈ విధంగా చెప్పబడింది ?

కూతుళ్ళుగాని, కొడుకు కూతుళ్లు (పౌత్రి) మాత్రమే ఉండి, సోదరులు లేనిచోట, వారుభయుల వాటాలు పోగా మిగిలినది తోడబుట్టిన పడుచులకు చెందుతుంది. ఒక్కతే కూతురు గాని పౌత్రి గాని ఉన్నయెడల సగం ఆస్థికి తోడ

బుట్టిన స్త్రీలు అర్హులు. ఇద్దరుగాని అంత కెక్కువగాని ఉన్నయెడల మూడవ భాగానికి అర్హులు.

ఈ రెండు రూల్సునూ కలిపి చదువుకున్న యెడల ఈ కేసులో సోదరునికి రావలసిన వాటాను నిర్ణయించడం చాలావరకు తేలికవుతుంది.

నేను ఉదహరిస్తున్న గ్రంథంలో ఈ సమస్య దాని పరిష్కారంతో సహా ఈ విధంగా ఉన్నది :

"ఉదాహరణ 7. భర్త, కుమార్తె, సోదరుడు, ముగ్గురు తోడబుట్టిన స్త్రీలు. పరిష్కారం పూర్తిగా వ్రాయనక్కర లేదు. సోదరుడు 'రెసిడ్యూయరీ' గా తనకు గల అర్హతవల్ల 2/20 వంతు వాటాకు అర్హుడు.

పైన ఉదహరింపబడిన దానినిబట్టి, సోదరులు, వాళ్లు లేకపోతే రక్తసంబంధం గల సవతి సోదరులు **(Half brothers)** వారి వారికి గల సహజమైన హక్కులవల్లనే భాగస్వాములు లేక రెసిడ్యూయరీలు అవుతారని స్పష్టమవుతోంది. కనుక ఈ కేసులో సర్ వాల్టర్ అభిప్రాయం సరియైనది కాదు. సోదరుడు ఏదైనా ఆస్తిని పొందడమంటూ ఉంటే అది ఆయనకున్న హక్కు ప్రకారమే కాని పేదల *ప్రతినిధిగా మాత్రంకాదు.* ఆయనకేమీ చెందక పోయినట్లయితే మిగిలిన ఆస్తి మరల భాగస్వాములకే చెందాలి (న్యాయశాస్త్రాన్ని మన్నించే యెడల ఇటువంటి సందర్భంలో సోదరునికి చెందకుండా ఉండడమే సంభవంకాదు).

కాని నివేదికలో మతగురువు అభిప్రాయమునకు నా అభిప్రాయమునకు తేడా ఉన్నట్లు వ్రాయబడింది. 'నా' అనే మాటకు బదులు 'చట్టం' అనడం న్యాయం. (ఏమంటే నేను చట్టంలో ఉన్నది మాత్రమే చెప్పేను) మత గురువున్నూ న్యాయ శాస్త్రమున్నూ భేదించడానికి వీలులేదని చెప్పడానికి సాహసిస్తున్నాను. భేదిస్తే మతగురువుది లోపంకాని చట్టాన్ని త్రోసెయ్యడానికి వీలులేదు. కాని మిస్టర్ టాథాం నాకు పంపిన నివేదికలోని పంపిణీ విధానం మతగురువు యొక్క అంగీకారాన్ని పొందినదే అయిన యెడల, ఈ విషయంలో నా అభిప్రాయం మత

గురువు అభిప్రాయానికి భిన్నంగా లేదు. ఆయన వ్రాసిన ఉత్తరం ప్రకారం అది మతగురువు అంగీకారమును పొందినట్లుగానే కనుబడుతోంది. సవతి సోదరుడు పేదల ప్రతినిధిగా ఆస్థిని తీసుకోవడమనే మాటే మతగురువు ఎక్కడా ఎత్తుకోలేదు.

ఆఖరుమాట. నేను నివేదికను చూచిన పిమ్మట, సర్ వాల్టర్ అభిప్రాయం ప్రకారం మహమ్మదీయులకే మహమ్మదీయుల చట్టం తెలుస్తుంది కనుక, పనికట్టుకుని నేను కొందరు మహమ్మదీయ ప్రముఖులను సందర్శించాను. ఈ నిర్ణయాన్ని గురించి నేను వారితో ప్రస్తావించగా వారు చాలా ఆశ్చర్యపడ్డారు. వారికీవిషయమంతా స్పష్టంగానే కనుబడింది. కనుక వారంత పెద్దగా ఆలోచించకుండానే ఇలా అన్నారు: "విల్లు వ్రాయకుండా మరణించిన ఆస్థిలో పేదలకేమీ చెందదు. సవతి సోదరుడు తనకు గల హక్కు ప్రకారమే తన వాటాకు అర్హుడు."

కనుక సర్ వాల్టర్ నిర్ణయం మహమ్మదీయ న్యాయానికీ, మతగురువు అభిప్రాయానికీ, మహమ్మదీయ ప్రముఖుల అభిప్రాయాలకూ విరుద్ధమని మనవి చేస్తున్నాను. మరణించిన మహమ్మదీయునిఆస్థి, న్యాయప్రకారం ఆతని బంధువులకు రావలసిన ఆస్థి వాటాలు వారికి చెందకుండా, వారు పేదల ప్రతినిధులని ఋజువు చేసుకునే వరకూ బిగ బట్టడం చాలా కష్టములకు కారణమవుతుంది. అటువంటి షరతు మహమ్మదీయుల ఆచార సాంప్రదాయంలోగాని చట్టంలోగాని ఎక్కడా తలపెట్టబడలేదు.

భవదీయుడు
మో. క. గాంధీ.

[*నేటాల్ విట్‌నెస్*, 28–3–1895]

# 48. ప్రిటోరియా ఏజంటుకు విన్నపము

ప్రిటోరియాలో రాణీగారి ఏజంటైన గౌరవనీయులు సర్ జాకోబస్ డీవెట్, కె. సి. యం. జి. గారికి :—

> ఈ రిపబ్లిక్‌లోని బ్రిటిష్ ఇండియా వర్తకుల తరఫున వ్యవహరించడానికి కమిటీగా ఏర్పడిన ప్రిటోరియా వాస్తవ్యులు తాయుబ్‌ఖాన్, అబ్దుల్‌గనీ, జోహాన్సుబర్గు వాస్తవ్యుడు హాజీహబీబ్ హాజీదాదా దాఖలుచేసుకొన్న విన్నపము.

మహాఘనత వహించిన రాణీగారి ప్రభుత్వానికీ దక్షిణ ఆఫ్రికా రిపబ్లిక్‌కున్నూ, భారతీయ సమస్యపై వచ్చిన వివాదంలో, ఆరెంజి ఫ్రీస్టేటులోని బ్లోమ్‌ఫాన్‌టీన్‌లో ఇవ్వబడిన మధ్యవర్తి పరిష్కారంతో రాణీగారి ప్రభుత్వము సంతృప్తి చెందినదోలేదో తెలుసుకోవడానికి హిస్‌ఎక్స్‌లెన్సీ హైకమిషనరుతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపవలసినదని మిమ్ములను సగౌరవముగా ప్రార్థిస్తున్నాము. 1885 సంవత్సరం మూడవ నెంబరు చట్టాన్ని, 1886 సం॥రం వాల్క్సరాద్ బెస్లూట్ సవరణతోసహా, ఈ ప్రభుత్వం అమలు జరిపి తీరవలెనని మధ్యవర్తి తీర్పు ఇచ్చిన సంగతి మీరెరిగే ఉంటారు. ఆ చట్టాన్ని నిర్వచించడంలోగాని అర్థం చెప్పడంలోగాని ఏదైనా పేచీగాని అభిప్రాయభేదంగాని సంభవించినట్లైతే ఈ రిపబ్లిక్ తాలూకు హైకోర్టువారు ఆ పేచీని పరిష్కరించవలసి ఉంటుంది.

గ్రీన్ పుస్తకములలో (ప్రభుత్వ ప్రచురణలు) ఒకదానియందు (నం. 21894) 31, 35 పేజీలలో, ఈ రిపబ్లిక్‌వారు దాఖలుచేసిన మధ్యవర్తి తగాదా విషయంలో, హైకోర్టువారి ఎదుట ఇస్మాయిల్ సులేమాన్ కంపెనీ వారు చేసుకున్న దరఖాస్తు సందర్భంలో, గౌరవనీయులైన ప్రధాన న్యాయమూర్తి తీర్పు నిస్తూ వ్యాపారం సాగించే స్థలాలకూ, భారతీయులు నివసించే స్థలాలకూ ఏవిధమైన తేడా ఉండకూడదని నిర్ణయించారు. ఈ సంగతి సందర్భాలనుబట్టి, ప్రధాన న్యాయమూర్తి తీర్పునుగురించిన స్టేటుమెంటు సరియైన

దైనట్లైతే, పై చట్టంప్రకారం దాఖలు చేయబడిన కేసులో తీర్పు, రాణీగారి ప్రజలైన భారతీయ నివాసులకు ప్రతికూలంగానే ఉంటుందనడంలో సందేహమేమీలేదు. ఇలా చెప్పడంలో కోర్టువారి మర్యాదను కాదనడం మా అభిప్రాయంకాదు. ముచ్చెలకాలో ఉదహరింపబడిన ప్రకారం మధ్యవర్తి తాను పరిష్కారం చేయకుండా, హైకోర్టువారి నిర్ణయానికే వదలి పెట్టేశాడు కనుక, మధ్యవర్తి ముచ్చెలకా షరతుల ప్రకారం ఏ పరిష్కారము చేయలేదనే మనవి చేస్తున్నాం. కనుక పైన ఉదహరింపబడిన మధ్యవర్తి తీర్పును రాణిగారి ప్రభుత్వం ఒప్పుకొని ఆ ప్రకారం అమలు చేస్తుందేమో తాము వ్రాసి తెలుసుకోవలసినదని మిమ్ములను సవినయంగా కోరుతున్నాము.

సం. తాయుబ్ హాజీఖాన్ మహమ్మద్
,, అబ్దుల్ గనీ
,, హాజీహబీబ్ హాజీదాదా.

దక్షిణాఫ్రికా రిపబ్లిక్ హై కమీషనరు, కాలనీల ప్రధాన కార్యదర్శికి, 29 ఏప్రిల్ 1895 తేదీన 204 నెంబరు లేఖతో పంపిన దస్తావేజు.

[కలోనియల్ ఆఫీసు రికార్డులు, నెం. 417 వా. 148.]



# 49. నేటాల్ అసెంబ్లీకి విన్నపము

నేటాల్ కాలనీ లెజిస్లేటివ్ అసెంబ్లీ గౌరవనీయ అధ్యక్షులకు, (స్పీకరు) సభ్యులకు—

నేటాల్ కాలనీలో నివసిస్తున్న ఈ క్రింద సంతకములు చేసిన భారతీయుల విజ్ఞప్తి.

దయచేసి చిత్తగించండి.

విజ్ఞప్తిదారులు ఈ కాలనీలో నివసిస్తున్న భారతీయుల ప్రతినిధులుగా, మీ ఎదుట చర్చకు రానున్న (ఇండియన్ ఇమిగ్రేషన్ లా అమెండుమెంటు బిల్లు) భారతీయ వలసచట్ట సవరణ చట్టము విషయములో, గౌరవ పురస్సరముగా ఈ విజ్ఞప్తిని చేసుకుంటున్నారు.

బిల్లులో, తిరిగి కంట్రాక్టు కూలీ పద్ధతిని చొప్పించడం, దాని కంగీకరించకపోతే పన్ను విధించడం, అందుకు సంబంధించిన భాగాలూ చాలా అన్యాయమనీ, శుద్ధ అనవసరమనీ, బ్రిటిష్ రాజ్యాంగ సిద్ధాంతాలకు ప్రతికూలమనీ విజ్ఞప్తిదారులు మనవి చేసుకుంటున్నారు.

బిల్లు చాలా అన్యాయమని ఋజువు చేయడానికి మేమంతగా వ్రాయనక్కరలేదని మనవిచేస్తున్నాం. కాంట్రాక్టు కూలీపరిమితిని 5 సంవత్సరాలనుంచి అనంతంగా పొడిగించడమే అన్యాయం. అందువల్ల కంట్రాక్టు కూలీల యజమానులు మును పటికన్న ఎక్కువగా వారిని బాధించి కఠినంగాచూడడానికి సావకాశాలు ఎక్కువవుతాయి. కాలనీలో యజమానులు ఎంతదయా దాక్షిణ్యాలు గలవారైనా, మానవస్వభావానికి అతీతులుకారు. స్వార్థ పరత్వం ప్రకోపించినపుడు మానవుని ప్రవర్తన ఏవిధంగా ఉంటుందో మేము ప్రత్యేకంగా నిరూపించ నక్కరలేదు. పైగా ఈ చట్టము కేవలము ఒక పక్షమువారి క్షేమం కోసమే చేయబడిన

దని చెప్పడానికి సాహసిస్తున్నాం. ఏమంటే, యజమాని సౌకర్యమే అందులో ప్రధానంగా ఉన్నది కాని, పనివాండ్ల కేమీప్రయోజన దాయకంగా లేదు.

ఈ బిల్లును ప్రవేశపెట్టడానికి ఏవిధమైన కారణాలు లేవు. కనుక ప్రవేశపెట్టడమే అనవసరమని మేము మనవి చేసుకుంటు న్నాము. కాలనీని ఏదైనా ఒక ఆర్థిక విపత్తునుండి తప్పించ డానికిగాని, ఏదైనా ఒక పరిశ్రమకు సహాయం చేయడానికిగాని ఈ బిల్లు ఉద్దేశింపబడలేదు. భారతీయ కూలీల అవసరం ముఖ్యంగా కావలసియుండినపరిశ్రమలకు, అట్టి అవసరం ఇకలేదనే కారణం చేతనే అందు నిమిత్తమై ఏర్పడిన పదివేల పౌనుల సహాయమూ, క్రిందటి సంవత్సరమే ఆపుచేయబడింది. అందుచేత ఈ శాసనం చేయవలసిన అవసరం ఎంతమాత్రమూ లేదని స్పష్టంగా తెలుస్తోంది.

ఈ బిల్లు బ్రిటిష్ రాజ్యాంగం యొక్క మూలసిద్ధాంతాలకు భిన్నమని ఋజువు కావాలంటే, గత శతాబ్దంలో జరిగిన గొప్ప సంఘటనలను, అందులో బ్రిటన్ ధరించిన ప్రముఖపాత్రను మీరు చిత్తగించవలెనని కోరుతున్నాం. పచ్చి బానిసత్వం దగ్గర నుంచి, తేలికైన వెట్టిచాకిరి వరకూ, బ్రిటిష్ సాంప్రదాయము అసహ్యించుకుంటూనే వచ్చింది. సాధ్యమైనంత వరకు ప్రతిచోటా అది రద్దుచేయబడింది. ఈకాలనీలో లాగుననే అస్సాంలోకూడా కంట్రాక్టు కూలీపద్ధతిఉంది. ఇటీవలనే రాణిగారి ప్రభుత్వం ఆదేశంలోని కూలీవిధానాన్ని గురించి ప్రస్తావిస్తూ, ఏదైనా ఒక ముఖ్యమైన పరిశ్రమను నిలబెట్టి వృద్ధిచేయడానికి అవసరమైనంత వరకే కంట్రాక్టు కూలీపద్ధతిని ప్రోత్సహించవలెననీ, ఆ పిమ్మట సాధ్యమైనంత త్వరలో దానిని రద్దుచేయాలనీ అంగీకరించింది. మీ ఎదుటనున్న ఈ బిల్లు ఆ సిద్ధాంతాన్ని వ్యతిరేకిస్తున్నదని విన్నవించుకుంటున్నాము.

కనుక మీరు తలపెట్టిన ప్రకారం, కంట్రాక్టు కూలీ పరి మితిని పొడిగించడం, అన్యాయం, అనవసరం. బ్రిటిష్ రాజ్యాంగం యొక్క మూల సిద్ధాంతాలకు అది విరుద్ధమైనట్లయితే, (అవునని

మేము ఋజువు చేశామనుకుంటాం) మీరు తలపెట్టిన పన్ను విధింపు మరీ ఘోరం. పన్నులను ఆదాయాన్ని పెంపుచేయడానికి మాత్రమే విధించాలనే సంగతి చిరకాలంగా అంగీకరింపబడుతున్న శుద్ధ సత్యం. మీరు తలపెట్టిన పన్ను అటువంటిదని మాట వరుసకైనా చెప్పడానికి వీలులేదని మేము భావిస్తున్నాం.

కూలీకంట్రాక్టు పూర్తికావడంతోనే భారతీయుని కాలనీలో నుంచి తరిమివేసేటందుకే ఈ పన్ను ఉద్దేశింపబడింది. కనుక అది నిషేధాత్మకమైన పన్ను. స్వేచ్ఛా వ్యాపార సిద్ధాంతాలకు చాలా వ్యతిరేకం.

పైగా ఇందువల్ల కంట్రాక్టు కూలీలుగా వచ్చిన భారతీయులను అనవసరంగా బాధించడమవుతుందని మా భయం. ఇండియాలోని అన్ని సంబంధాలను తెగతెంపులు చేసుకొని సకుటుంబంగా ఈ దేశమొచ్చిన భారతీయుడు, మళ్ళీ తన దేశంపోయి బ్రతుకుతెరువేర్పరచుకోవడం అసంభవమనే చెప్పాలి. మా అనుభవాన్ని బట్టి నిజం చెప్పాలిసొస్తే, ఇండియాలో పనిలేక దేహపోషణ చేసుకోలేనివారే, కంట్రాక్టు కూలికి ఈ కాలనీ కొస్తున్నారని మనవి చేస్తున్నాం. భారతీయ సాంఘిక కట్టుబాట్లు ఏలాంటివంటే, భారతీయుడికి అసలు తన దేశం వదలి రావడానికే సావకాశముండదు. బలవంతమైన కారణాలచేత వదలి రావడమంటూ ఉంటే మళ్ళీ స్వదేశానికెళ్ళి పొట్టపోసుకోవడమే అసంభవం. ఇక ధనార్జన సంగతి చెప్పేదేముంది ?

కాలనీయొక్క ఐశ్వర్యాభివృద్ధికి భారతీయ కార్మికుల తోడ్పాటు విధిగా ఉండితీరాలని అందరూ అంగీకరిస్తున్న విషయమే. అలాంటప్పుడు, కాలనీయొక్క సంక్షేమానికి విశేషంగా తోడ్పడే భారతీయుల నింతకంటె బాగా చూడాలని మేము విన్నవించుకుంటున్నాము.

ఈ బిల్లు వర్గభేదాలను పెంపొందిస్తుందని వేరుగా చెప్పనక్కరలేదు. కాలనీలో ఉన్న భారతీయులమీద అది విద్వేషాన్ని పురికొల్పుతోంది. అందువల్ల బ్రిటిష్ పౌరులలోనే ఒకవర్గమువారికీ

మరొకవర్గంవారికీ మధ్యనుండే భేదాలు బాగా రెచ్చిపోతాయి. కనుక బిల్లులో, కంట్రాక్టు కూలీపద్ధతిని ప్రవేశపెట్టే భాగాన్నీ, దాని నతిక్రమిస్తే పన్నువిధించే భాగాన్నీ, మీరు ఎంతమాత్రమూ అంగీకరించకూడదనే నిశ్చయానికి రావలసినదని విజ్ఞప్తిదారుల మైన మేము సవినయంగా మనవిచేస్తున్నాం. ఈ విధంగా న్యాయంచేయించి దయచూపితే మేమెంతో కృతజ్ఞులం.

(సం.) అబ్దుల్లాహాజీ ఆదం
వగైరా చాలామంది.

[అచ్చువేయబడిన పత్రంయొక్క ఫోటోనుండి గ్రహింపబడినది.]



# 50. కమరుద్దీన్‌కు లేఖ

పోష్టు బాక్సు-66
డర్బాన్, నేటాల్.
మే 5, 1895.

ప్రియమైన మహమ్మద్ కాశిం కమరుద్దీన్,

మీరు పంపిన భారతీయుల సంతకాలు చేరినవి. డచ్చివారివి కూడా స్వీకరించి ప్రిటోరియాకు పంపినారని నమ్ముతున్నాను. ఈ విషయం చాలా జరూరు కనుక ఆలస్యం చేయకండి. డచ్చి పిటీషను అక్కడికి పంపమని ప్రిటోరియాకు కూడా తంతి పంపేను. ఇదంతా బుధవారంలోగా జరిగిపోవాలి. మీరేమి చేసినదీ నాకు వివరంగా వ్రాయండి.

ప్రతి భారతీయుడు ఈపని విషయమై అత్యంత శ్రద్ధ వహించడం చాలా అగత్యం. లేకపోతే మనం తరువాత పశ్చాత్తాప పడవలసొస్తుంది.

భవదీయుడు,
మోహన్‌దాస్ గాంధీ.

[గుజరాతీలో వ్రాసిన ఉత్తరం ఫోటోకు తర్జుమా.]

---

# 51. శాకాహార ప్రచారక సంఘం

నేను ఇంగ్లండులో ఉండగా అన్నా కింగ్స్ఫర్డుసతి వ్రాసిన పెర్ఫెక్ట్ వే ఇన్ డైయట్) నిర్దుష్టమైన ఆహారము అనే గ్రంథాన్ని చదివినప్పుడు, దక్షిణ ఆఫ్రికాలో ట్రాపిస్టులు అనే శాకాహారుల కాలనీ ఒకటున్నదని తెలుసుకున్నాను. (ట్రాపిస్టులంటే మౌనం వగైరా యమనియమాలను పాటించే సన్యాసులు.) అప్పటినుంచీ వారిని చూడాలని నేను కుతూహల పడుతూ వచ్చాను. ఎట్టకేలకు ఆ కోరిక నెరవేరింది.

దక్షిణాఫ్రికాలో ముఖ్యంగా నేటాలు, శాకాహారులకు ఎంతో అనువైన ప్రదేశమని ముందుగా చెప్పుకోదగినసంగతి. భారతీయులు నేటాలును దక్షిణాఫ్రికాకంతకూ, ఆరామసీమగా తయారుచేశారు. దక్షిణాఫ్రికా భూమిలో ఏ వస్తువునైనా అపారంగా పండించవచ్చును. అరటిపళ్ళు, అనాసపండ్లు, నారింజపండ్లు అనంతంగా లభ్యమవుతాయి. నిజానికి వినియోగంకన్న ఉత్పత్తి ఎక్కువ కనుక శాకాహారు లక్కడ బాగా నివసించ కలుగుతా రనడాని కేమీ సందేహంలేదు. అన్ని అవకాశాలుండీ, ఉష్ణోగ్రత బాగాఉండీకూడా అంత తక్కువగా శాకాహారులు ఉండడమే ఆశ్చర్యకరమైన సంగతి. దాని పర్యవసాన మేమంటే పెద్దపెద్ద భూఖండాలు ఆలనా పాలనా లేకుండా బీడుపడిపోయి ఉన్నాయి. దక్షిణాఫ్రికాలో ప్రధానంగా ప్రజలుతినే ఆహార పదార్థాల నన్నిటినీ అక్కడే పండించడానికి సావకాశమున్నా, వాటిని పై దేశాలనుండి దిగుమతి చేసుకుంటున్నారు. నేటాలువంటి బహు విస్తీర్ణమైన ప్రదేశంలో 40 వేలమంది మాత్రమే శ్వేతజాతులవారున్నప్పటికీ చాల బాధలు పడుతుంటారు. ఈ బాధంతకూ కారణం వారు వ్యవసాయం చేసుకోకపోవడమే.

మరొక విచిత్రమైన సంగతి. అసహజమైన జీవనం చేయడంవల్ల కలిగే బాధాకరమైన సంగతేమంటే, భారతీయ జనాభా యెడల వారు కనుబరచే అపారమైన ద్వేషం. అక్కడి భారతీయ జనాభాకూడా 40 వేలు. భారతీయులు శాకాహారులవడం వలన, ఏవిధమైన కష్టం లేకుండా వ్యవసాయం చేసుకుంటారు. కనుక సహజంగా కాలనీలో అన్నిచోట్లా చిన్నచిన్న

కమతాలన్ని భారతీయులవే. వారి పోటీ శ్వేతజాతులవారికి చాలా కష్టంగా ఉంటుంది. అందువల్లవారు గడ్డివామిలోని కుక్క పద్ధతిగా ఆత్మ హత్యాకరమైన విధానాన్ని అనుసరిస్తున్నారు. దేశంలో అనంతంగా ఉన్న వ్యవసాయపు భూమివనరులను నిరుపయోగంగా బీడు పెట్టెయ్యడానికైనా అంగీకరిస్తారు కాని, వాటిని భారతీయులు అభివృద్ధిలోకి తెస్తామంటే ఎంతమాత్రం ఒప్పుకోరు. ఇటువంటి అలసత్వం వల్లనూ, హ్రస్వ దృష్టి వల్లనూ, ఇప్పుడున్న జనానికి రెండు మూడు రెట్లు జనాన్ని కూడా అవలీలగా పోషింపగలిగిన కాలనీ, అనేక అవస్థలకు లోనై హానీ హానీగా 80 వేలమంది యూరోపియనులను ఇండియనులను పోషిస్తోంది. ట్రాన్సువాలులో ఈద్వేషం ఎంతవరకెళ్ళిందంటే, అక్కడ భూమి చాలా సారవంతమైన దైనప్పటికీ, రిపబ్లిక్ అంతా ఎడారిగానే ఉండిపోయింది. ఏ కారణం చేతనైనా అచటి బంగారపు గనులలో పనులు సాగకపోతే వేలాది ప్రజలు పనిలేక, తిండిలేక మలమల మాడిపోతారు. ఇక్కడ నిజంగా నేర్చుకోవలసిన పాఠంలేదా ? మాంసాహారం తినే అలవాట్లవల్ల సంఘంయొక్క అభివృద్ధి వెనక్కెళ్ళింది. చేతులు కలుపుకుని కష్టించి పనిచేయవలసిన రెండు సంఘాలకూమధ్య భేదభావాన్ని అధికం చేసింది. మరొక్క విషయంకూడా గమనించదగినది. కాలనీలోని యూరోపియనులతో పాటే, భారతీయులుకూడా బాగా ఆరోగ్యంగా ఉంటారు. యూరోపియనులు, వారి మాంసభాండాలు అక్కడ లేకపోతే చాలామంది డాక్టర్లు పస్తుండవలసినవారేనని కూడా నే నెరుగుదును. భారతీయులు శాకాహారులు కావడంవల్ల, సహజంగా క్లుప్తంగా జీవిస్తూ మితమైన అలవాట్లు కలిగి యుండడంచేత యూరోపియనులతో జయప్రదంగా పోటీ చేయగలుగుతున్నారు. అయితే కాలనీలో ఉండే భారతీయులంతా పూర్తియైన శాకాహారు లనుకోకూడదు. కాని చాలా మటుకంతే.

పైన్‌టౌన్ దగ్గర మారియన్ కొండలలో ఉంటున్న ట్రాపిస్టులు పైన చెప్పిన సంగతులలోని సత్యాన్ని ఏవిధంగా ఋజువు చేస్తున్నారో చూడవచ్చును.

డర్బాన్‌నుంచి 16 మైళ్ళు రైలుమీద ప్రయాణంచేస్తే, పైన్‌టౌన్ అక్కడుంది. ఆ ఊరు సముద్రమట్టానికి 11 వందల అడుగుల ఎత్తున ఉన్నది. శీతోష్ణస్థితి చాలా బాగుంటుంది.

పైన్ టౌన్‌కు మూడుమైళ్ళలో ట్రాఫిస్టు మఠం ఉన్నది. నేనూ నా స్నేహితుడూ ఈ మఠంఉన్న మరియన్ కొండ లేక కొండల దగ్గరకు నడచి వెళ్ళేం. పచ్చని పచ్చికపట్టిన ఆ చిన్న కొండలమీద నడవడం ఎంతో సంతోషమైంది.

ఆ ఆశ్రయం చేరడంతోనే మాకొక పెద్దమనిషి తటస్థపడ్డాడు. ఆయన నోట్లో పొగగొట్టముంది. వెంటనే ఆయన ఆ సంఘంలోని వాడు కాడని గ్రహించుకున్నాం. కాని ఆయనే మమ్ములను అతిథుల గదిలోనికి తీసుకెళ్ళేడు. అక్కడ ఒక అతిథుల పుస్తకం ఉన్నది. ఆ పుస్తకం 1894 సం. రం. లో ప్రారంభించబడింది. అందులో పట్టుమని 20 పేజీలైనా పూర్తికాలేదు. వాస్తవానికి ఈ మిషన్ వారిని గురించి తెలుసుకోవలసినంత తెలియబడడంలేదు.

ఇంతలో మఠస్థులలో ఒకడు వచ్చి చాలా వినమ్రుడై నమస్కరించాడు. చింతపండు నీళ్ళు, అనాసపళ్ళు మాకు ఉపాహార మిచ్చారు. మేము సేదతేరుకున్నాక, మమ్మల్ని తీసుకువెళ్ళిన స్థలాలన్నిటిని చూచాం. అక్కడ ఇళ్ళన్నీ పక్కాపండు ఇటుకతోనే కట్టబడి ఉన్నాయి. అక్కడంతా ప్రశాంతంగా ఉన్నది. కర్మాగారాలలో పనిముట్ల చప్పుడు, ఆదిమవాసుల పిల్లల గలభామాత్రమే ఆ ప్రశాంతతకు భంగం కలిగిస్తూ వచ్చాయి.

ఆ సెటిల్‌మెంటు (ఆశ్రయం) ప్రశాంతమైన ఆదర్శగ్రామం. సంపూర్ణమైన ప్రజాస్వామిక సిద్ధాంతాలమీద దాని ఆధిపత్యం ఏర్పాటు చేయబడింది. అక్కడ స్వాతంత్ర్యం, సమానత్వం, సోదరత్వం ఈ సిద్ధాంతాలు సంపూర్ణంగా ఆచరణలో ఉన్నాయి. ప్రతిపురుషుడు సోదరుడు. ప్రతి స్త్రీ సోదరి. ఆ ఆశ్రయంలో సన్యాసులు సుమారు 120 మంది దాకా ఉన్నారు. సన్యాసినులు దాదాపుగా 60 మంది ఉన్నారు. సన్యాసినుల (నన్సు) మఠం సన్యాసుల (మాంక్సు) మఠానికి అరమైలు దూరంలో ఉన్నది. సన్యాసులు, సన్యాసినులు కూడా మౌనవ్రతంలోనే ఉన్నారు. బ్రహ్మచర్య నియమాన్ని అవలంబించి ఉన్నారు. ఏబట్ (అనగా నేటాల్‌లోని ట్రాపిస్టు మఠాధిపతి) అనుజ్ఞపొందినవారు తప్ప సన్యాసులుగాని సన్యాసినులుగాని మాట్లాడడానికి వీలులేదు. పట్టణంలోకెళ్ళి సరుకులు వగైరా ఖరీదు చేసేవారికి, అతిథులను సత్కరించవలసిన వారికి మాత్రమే మాట్లాడడానికి అనుజ్ఞ.

సన్యాసులంతా పొడుగాటి తెల్లని దుస్తులను ధరిస్తారు. ముందొక చిన్న నల్లగుడ్డను, వెనుకొక నల్లగుడ్డను ధరిస్తారు. సన్యాసినులు నిరాడంబరమైన ఎర్రని దుస్తులను ధరిస్తారు. ఎవ్వరూకూడా మేజోళ్లను వేసుకోరు.

ఈ సన్యాసి మఠంలో చేరదలచినవారు ముందుగా రెండు సంవత్సరములు దీక్షపూనాలి. అప్పుడతనిని 'నావిస్' అనగా దీక్షార్థి అంటారు. రెండు సంవత్సరాల అనంతరం ఆతడు మఠాన్ని వదలిపెట్టి వెళ్ళిపోదలచుకుంటే వెళ్లిపోవచ్చు. ఇష్టమైతే జీవితాంతం వరకూ సన్యాస దీక్షను స్వీకరించవచ్చును. అసలైన ట్రాపిస్టు సరిగా తెల్లవారగట్ల 2 గంటలకు నిద్ర లేస్తాడు. నాలుగు గంటలసేపు ప్రార్థన, దైవచింతన చేస్తాడు. ఆరుగంటలకు రొట్టి, కాఫీ వగైరా సాధారణమైన ప్రాతఃకాల భోజనం చేస్తాడు. 12 గంటలకు రొట్టె, పులుసు, పండ్లతో మధ్యాహ్న భోజనం ముగిస్తాడు. సాయంకాలం 6 గంటలకు రాత్రి భోజనం ముగించి 7, 8 గంటలకు నిద్రపోతాడు. ఈ సన్యాసు లెవ్వరూ మత్స్యమాంసాలను, కోళ్లను తినరు. ఆఖరుకు గ్రుడ్లను కూడా ముట్టరు. పాలు పుచ్చుకుంటారు. కాని నేటాలులో అవి చౌకగా లభ్యం కావు. సన్యాసినులు మాత్రం వారానికి నాల్గుసార్లు మాంసం తినవచ్చును. ఇలాంటి తేడా ఎందుకు ఏర్పాటు చేయబడిందని అడిగితే, 'సన్యాసినులు సన్యాసులకన్న సున్నితమైన వారు కావడం వల్ల' నని మాతోకూడా వచ్చిన గైడ్ చెప్పేడు. దాదాపు శాకాహారియైన నా మిత్రుడు కాని నేను కాని ఆ వాదంలోని బలాన్ని గాని సబబును గాని గుర్తించలేక పోయాం. మేము సన్యాసులు సన్యాసినులు కూడా శాకాహారులుగా ఉంటారనే అనుకున్నాం. అందుచేత ఈ సంగతి వినేసరికి మాకు చాలా ఆశ్చర్యం కలిగింది. విచారం కూడా కలిగింది.

వైద్యుని సలహాపైన తప్ప వారెవ్వరూ మద్యపానం చేయరు. స్వంత ఉపయోగం నిమిత్తం దగ్గర డబ్బు ఉంచుకోరు. ధనికులైనా, పేదలైనా అంతా సమానమే.

మాకు ఆ ఆశ్రయంలోని అన్నిచోట్లూ చూపించారు. అందులో బట్టల బీరువాలు కాని, మేజాబల్లలు కాని, పెట్టెలు కాని కనుబడలేదు. పనిమీద వెళ్లవలసినవారు తప్ప ఎవ్వరూ కూడా ఆశ్రయం సరిహద్దులు

దాటి బయటికి వెళ్లకూడదు. మత సంబంధమైన పుస్తకాలు, పత్రికలు తప్ప ఇతరమైన పుస్తకాలను పత్రికలను చదువకూడదు. ఆమోదింప బడిన మతగ్రంథాలు తప్ప, అన్ని మతగ్రంథాలను కూడా చదువడానికి వీలులేదు. ఇటువంటి కఠినమైన నియమాలతో అక్కడ జీవితం ఉండబట్టే, మొదట్లో నోట్లో పొగగొట్టంతో మాకు కనుబడిన స్నేహితుని 'మీరు ట్రాపిస్టులా' అని మేమడిగినపుడు, "కాదు కాదు. ట్రాపిస్టుకాక మరెవ్వడ నైనా అవుతాను" అన్నాడు. అయినప్పటికీ మంచివారైన ఆ సన్యాసి నులు సన్యాసులు వారి జీవితాలంత కష్టమైనవిగా భావించుకోవడంలేదు.

రోమన్ కేథలిక్‌లు నీరసంగానూ, జబ్బుగానూ, విచారంగానూ ఉంటారని ఒకానొక సభలో ఒక ప్రొటెస్టెంటు మతగురువు ఉపన్యసించాడు. ట్రాపిస్టులను కేథలిక్‌లకు చిహ్నాలుగా తీసుకుంటే, నిజానికి వారు ఆయన మాటకు భిన్నంగా, చాలా ఆరోగ్యంగానూ, సంతోషం గానూ ఉన్నారు. మే మెక్కడికెళ్లినా, ఏ సన్యాసిని గాని సన్యాసినిని గాని చూచినా, వాళ్ళు చిరునవ్వుతో వినమ్రులై నమస్కరించేవారు. మఠాన్ని చూపించడానికి మాకు తోడుగావచ్చినాయన ఈ పద్ధతినెంతో ప్రశం సిస్తూనే ఉన్నాడు. స్వయం విధితమైన ఈ శిక్షణ భరింపరానిదని ఆయన భావిస్తున్నట్లు తోచలేదు. అకుంఠితమైన విశ్వాసానికి, పరిపూర్ణమైన ఆజ్ఞా పాలనకు ఇంతకంటే ఉత్తమమైన ఉదాహరణ మరొకటి కానరాదు.

వారి భోజనం ఎంత ఆడంబర రహితంగా ఉన్నదో, వారి భోజనాల బల్లలు, పడకగదులు కూడా అంత నిరాడంబరంగానే ఉన్నాయి. భోజనాల బల్లలు సెటిల్మెంటు (ఆశ్రయం) లోనే కర్రతో తయారు చేయబడ్డాయి. వాటికేమీ వార్నిష్ వగైరాలు లేవు. మేజాబల్లలపైన గుడ్డల నుపయోగించరు. డర్బాన్‌లో దొరికే సరుకులోకల్లా చౌకరకమైన కత్తులను చెంచాలను వా రుపయోగిస్తారు. గాజు పళ్లెలకు గ్లాసులకు బదులు పింగాణీ పూత పూసిన వస్తువులను ఉపయోగిస్తున్నారు.

పడుకునేందుకు ఒక పెద్దహాలు ఉన్నది (పెద్దదే కాని అక్కడున్న జనానికి తగినంత పెద్దది కాదు.) అందులో 80 మంచాలున్నాయి. మంచా లతో ఎక్కడా ఖాళీ అన్నమాట లేదు.

ఆదిమవాసుల నివాసంలో ఈ మంచాలు మరీ ఇరుకుగా అమర్చ బడ్డాయి. (నేటివ్సు) ఆదిమవాసులు పరుండే హాలులోకి మేము ప్రవేశించే

సరికే అక్కడ ఉక్కిరి బిక్కిరిగా ఉన్నదని గ్రహించాం. మంచాలన్నీ ఒక దానికొకటి అంటే వున్నాయి. మధ్య ఒక పలక మాత్రమే అడ్డు. నడువడానికి మధ్య ఖాళీ కూడా లేదు.

వాళ్ళు రంగు భేదాన్ని పాటించరు. ఇక్కడ ఆదిమవాసులను తెల్ల వాళ్లతోపాటు సమానంగానే ఆదరిస్తారు. వాళ్లలో చాలామంది పిల్లలు. సన్యాసులకు ఏమి భోజనవసతులున్నాయో వారికి కూడా అవే భోజనవసతులు. సాధారణంగా క్రైస్తవ కాఫిర్లు (దక్షిణాఫ్రికాలోని బంటూ జాతివారు) ఎందుకూ పనికిరారని అంటారు. అందులో కొంత నిజం లేకపోలేదు. కాని ఆదిమవాసులలోనుండి మంచి క్రైస్తవులను తయారుచేయడంలో ట్రాపిస్టుల కృషి చాలా జయప్రదంగా నెరవేరినదని ఎటువంటి వారైనా అంగీకరింపక తప్పదు. ఇతర క్రైస్తవ మిషనుల వారు నిర్వహించే పాఠశాలలలో ఆదిమవాసులు పాశ్చాత్య నాగరికత యొక్క అవలక్షణాలను మాత్రమే నేర్చుకోవడం జరుగుతోంది. నైతికాభివృద్ధి చాలా తక్కువ. కాని ట్రాపిస్టు మిషన్ వారి దగ్గర శిక్షితులైన ఆదిమవాసులు నిరాడంబరత్వానికీ, శీలానికీ, పెద్దమనిషి తరహాకీ నమూనాలుగా ఎన్నదగినవారని చెప్పాలి. వాళ్ళు వినమ్రులై, హుందాగా అక్కడి కొచ్చిన వారికి నమస్కరిస్తుంటే కన్నుల పండుగైంది.

ఈ మిషన్ వారి ఆశ్రయంలో 1200 మంది పెద్దలూ పిన్నలూ ఆదిమవాసులున్నారు. వారంతా అలసత్వాన్ని సోమరితనాన్ని, పిచ్చినమ్మకాలను వదలిపెట్టి, కష్టపడి పనిచేయడం, ఉపయోగమైన కాలక్షేపం చేయడం, ఒకే ఒక భగవంతుని ధ్యానించడం అలవాటు చేసుకున్నారు.

ఆ సెటిల్ మెంటులో రక రకాల కార్ఖానాలు ఉన్నాయి. కమ్మరం, వడ్రంగం, డబ్బాలు చేయడం, చెప్పులు కుట్టడం, చర్మాలు సాపు చేయడం మొదలైనవి. అక్కడ ఆదిమవాసులకు ఇంగ్లీషు, జూలూ భాషలతోపాటు ఈ పరిశ్రమలన్నీ నేర్పుతారు. ఆశ్రయంలో ఉన్నవారు దాదాపు అంతమందీ కూడా జర్మనులు. కాని వారు ఆదిమవాసులకు జర్మనుభాషను నేర్పడానికి ప్రయత్నించలేదు. ఆదిమవాసులతోపాటు తెల్లవారు కూడా అక్కడే కలసి మెలసి పని చేస్తుంటారు. నిజంగా, అక్కడ నివాసమేర్పరచుకున్న మహాపురుషుల ఉదారతకు, మానసిక ఔన్నత్యానికి ఇదొక గొప్ప నిదర్శనము.

సన్యాసినుల ఆశ్రయములో బట్టలను చలువచేయడం, కుట్టుపని, గడ్డితో టోపీలు చేయడం, అల్లికపని చేస్తుంటారు. అక్కడ ఆదిమవాసులైన ఆడపిల్లలు, పరిశుభ్రమైన దుస్తులను ధరించి, కష్టపడి పనిచేస్తుండడం చూడవచ్చును.

చర్చికి దాదాపు రెండుమైళ్ల దూరంలో ముద్రణాశాఖ, పిండి మర ఏర్పాటు చేయబడ్డాయి. ఒక జలపాతంవల్ల ఈ మరలు నడిపింపబడుతున్నాయి. అదొక పెద్ద భవనం. వేరుశనగ గింజల నుండి నూనె తీయడానికొక చిన్న నూనెమిల్లు కూడా అక్కడే ఉన్నది. ఆ ఆశ్రయంలో ఉండే జనానికి కావలసిన వస్తువులు చాలా వరకు ఆ కార్ఖానాలలోనే తయారవుతాయని వేరే చెప్పనక్కరలేదు.

వారి స్వంత వ్యవసాయ క్షేత్రాల్లోనే స్థానికంగా పెరిగే పండ్లూ కాయలూ వారు ఉత్పత్తి చేస్తారు. కనుక ఆ సెటిల్‌మెంటు చాలవరకు స్వయంపోషకమని చెప్పవచ్చును. ఆ చుట్టుప్రక్కల ఉండే ఆదిమవాసులను వారెంతో ప్రేమిస్తారు. గౌరవిస్తారు. ఆదిమవాసులు కూడా వారినెంతో ప్రేమించి గౌరవిస్తారు. అంతే కాకుండా వారిలోనుంచే క్రైస్తవులవుతూ ఉంటారు.

ఈ సెటిల్‌మెంటు విశేషమేమంటే ఎక్కడ చూచినా మత ప్రభావం కనబడుతుంది. ప్రతి గదిలోనూ ఒక శిలువ కనబడుతుంది. ఏ గదిలోనైనా ప్రవేశించే చోటనే ఒక చిన్న పాత్రలో 'పుణ్యతీర్థం' ఉంటుంది. అక్కడుండే వారంతా అత్యంతమైన భక్తితో ఆ నీటితో కండ్ల రెప్పలను తుడుచుకుంటారు. నుదుటా గుండెల మీదా అద్దుకుంటారు. పిండి మర దగ్గరకు త్వరితంగా నడచి వెళ్లేటప్పుడు కూడా శిలువ యొక్క చిహ్నాలు కనుబడకుండా ఉండవు. అదొక చక్కని కాలిబాట. ఒక ప్రక్కన బ్రహ్మాండమైన లోయ. దానిగుండా జల జల ధ్వనులతో ప్రవహించే సెలఏరు. రెండవ ప్రక్కన చిన్న చిన్న కొండలు. వాటిపైని శిలువపైన కొరత వేయబడిన క్రీస్తుగాథను జ్ఞప్తికి తెచ్చే చెక్కడాలున్నాయి. ఆ లోయంతా పచ్చగా పచ్చిక బయళ్ల తివాచీలా ఉన్నది. మధ్య మధ్య అందమైన వృక్షాలున్నాయి. ఇంతకన్నా ఆనందదాయకమైన ప్రకృతి సౌందర్యం, సౌఖ్యమైననడకా ఊహించడానికి వీలులేదు. అటు

వంటి స్థలంలో చెక్కబడిన చిత్రాలు బ్రహ్మాండంగా నీ మనస్సును ఆకర్షింపక మానవు. ఒకచోట చెక్కబడిన చిత్రాన్ని చూచి ఆనందించి దానిని గురించిన ఆలోచన పూర్తికావడానికి ముందే మరొక చిత్రం చెక్కబడింది. అంతటి కళాకౌశలంతో అవి చెక్కబడ్డాయి.

ఈ విధమైన నడకవలన, మరొక ఆలోచన రాకుండా, ఏ విధమైన గొడవలేకుండా, ప్రశాంతమైన స్థితిగతులలో మనస్సును ధ్యానస్థితిలో ఉంచడానికి వీలవుతుంది. అక్కడ చెక్కబడినకొన్ని దృశ్యాలు ఈ విధంగా ఉన్నాయి. 'జీసస్ మొదటిసారి పతనం'; 'జీసస్ రెండవసారి పతనం; సైమన్ శిలువను తీసుకెడుతున్నాడు'; 'జీసస్‌ను శిలువ మీదనుంచి మేకులు కొట్టేరు'; 'జీసస్ తన మాతృమూర్తి ఒడిలో ఉంచబడ్డాడు'; వగైరా వగైరా.

ఆదిమవాసులు కూడా ప్రధానంగా శాకాహారులని వేరే చెప్ప నక్కరలేదు. వారికి మాంసం తినకూడదనే నిషేధమేమీ లేదు కాని సెటిల్‌మెంటులో మాత్రం దానిని ఇవ్వరు.

దక్షిణాఫ్రికాలో ఇలాంటి సెటిల్‌మెంట్లు (ఆశ్రయాలు) 12 ఉన్నాయి. అందులో చాలావరకు నేటాలులోనే ఉన్నాయి. మొత్తం వాటిలో 300 మంది సన్యాసులు, 120 మంది సన్యాసినులు ఉన్నారు. నేటాలులోని శాకాహారులు ఇటువంటివారు. వారుశాకాహార సిద్ధాంతాన్ని ఒక ప్రాథమిక సూత్రంగా భావించరు. శాకాహారము శరీరంలోని మాంసముయొక్క ఉధృతాన్ని తగ్గిస్తుందనే వారి విశ్వాసము. బహుశా శాకాహార సంఘములంటూ ఉన్నవని కూడా వారికి తెలియదు. శాకాహారమును గురించి వ్రాయబడిన గ్రంథాలేమీ చదువాలనే లక్ష్యంకూడా వారికి లేదు. అయినప్పటికీ అటువంటి మహనీయులైన వారిని చూచి ఏ శాకాహారి ఉప్పొంగడు? యధాలాపంగా ఒకసారి వారితో మాట్లాడితేనే ప్రేమ, ఉదారత, త్యాగబుద్ధి కలుగుతాయి. ఆధ్యాత్మిక దృష్ట్యా శాకాహారము యొక్క ఘనతకు వారు ప్రత్యక్షమైన నిదర్శనములు. లండన్‌నుంచి నేటాలు వచ్చినందుకు తగిన ప్రతిఫలం ఈ సెటిల్‌మెంటును సందర్శించడమని స్వానుభవంవల్ల తెలుసుకున్నాను. అందువల్ల నీ మనస్సులో శాశ్వతంగా పవిత్రభావం ఏర్పడక మానదు. ప్రొటెస్టెంటైనా

సరే, క్రైస్తవుడైనాసరే, బౌద్ధుడైనాసరే, మరెవ్వరైనా కానీ ఒకసారి ఈ క్షేత్రాన్ని సందర్శిస్తే, 'ఇదే రోమన్ కేథలిక్ మతమైతే దీనికి వ్యతిరేకంగా ఎవరేమిచెప్పినా శుద్ధ అబద్ధ'మని ముక్కుమీద వేలు వేసుకుని చెప్పకమానడు. ఏ మతమైనా దివ్యమైనట్టిదిగానో లేక ఆసురమైనట్టిదిగానో కనుబడడానికి ఆ మతావలంబులు దానిని ఏ విధంగా కనుపింపచేస్తారో దాని మీదనే ఆధార పడుంటుందని నా మనస్సుకు నిస్సంకోచంగా తోచింది.

[*ది వెజిటేరియన్*, 18-5-1895]



# 52. రిప్పన్ ప్రభువుకు విజ్ఞప్తి

ప్రిటోరియా,
(దక్షిణాఫ్రికా రిపబ్లిక్)
మే, 1895.

మహోఘనత వహించిన రాణీగారి సలస రాజ్యాల ప్రధాన కార్యదర్శి హిస్ ఎక్సెలెన్సీ రైటానరబుల్ ది మార్క్విస్ ఆఫ్ రిప్పన్ గారికి, లండన్.

దక్షిణ ఆఫ్రికా రిపబ్లిక్‌లో నివసిస్తున్న బ్రిటిష్ ఇండియన్ పౌరులు చేసుకున్న విజ్ఞప్తి.

దయచేసి చిత్తగించండి.

దక్షిణ ఆఫ్రికా రిపబ్లిక్‌లో విజ్ఞప్తిదారుల స్థితిగతులనుగురించి తమకు ఇందుమూలముగా మనవి చేసుకోవడానికి సాహసిస్తున్నాం. ముఖ్యంగా ఆరెంజిఫ్రీస్టేటు తాలూకు ఇండియన్ ఆర్బిట్రేషను కేసులో ప్రధాన న్యాయమూర్తి ఇటీవల ఇచ్చిన తీర్పు ఏవిధంగా వర్తిస్తుందో మనవి చేస్తున్నాం.

2. విజ్ఞప్తిదారులమైన మేము, వర్తకులుగాను, దుకాణాల్లో సహాయకులుగానూ, చిల్లర వ్యాపారస్థులుగానూ, వంటవారిగానూ, బట్లర్లుగానూ, కూలీలుగానూ, ట్రాన్సువాలంతా వ్యాపించి ఉన్నాం. అయితే అత్యధిక సంఖ్యాకులం జోహాన్సుబర్గులోనూ, ప్రిటోరియాలోనూ స్థిరవాస మేర్పరచు కొనియున్నాము. సుమారు 200 మంది వర్తకులుగా ఉన్నారు. వారి వ్యాపారం దాదాపు లక్షపౌనుల కిమ్మతుంటుంది. ఇందులో మూడు ఫరములు ఇంగ్లండునుంచి, దర్బాన్, పోర్టు ఎలిజబెత్, ఇండియా వగైరా ఇతర దేశాలనుంచీ సరాసరి సరుకులను దిగుమతి చేస్తాయి. కనుక ప్రపంచములోని ఇతర దేశాలలో వారి బ్రాంచీలు ఉన్నాయి. వాటిబ్రతుకులు ఈ ఫరములు ట్రాన్సువాలులో సాగించకలిగిన వర్తక వ్యాపారం మీద ఆధారపడి ఉన్నాయి. మిగిలిన వారంతా వివిధ

స్థలాల్లో చిన్న చిన్న దుకాణాలు పెట్టుకుని స్వల్పంగా వ్యాపారం చేసుకునే వాళ్లే. రిపబ్లిక్‌లో వస్తువులను కొనుక్కొని వీధుల్లో అమ్ముకునే వారు దాదాపు రెండువేల మంది ఉన్నారు. విజ్ఞప్తిదారులలో కార్మికులైనవారు యూరోపియనుల ఇండ్లల్లోనూ, హోటళ్లలోనూ నౌఖర్లుగా వుంటున్నారు. వాళ్ళొక 1500 మంది దాకా ఉంటారు. అందులో వెయ్యిమంది జోహాన్సుబర్గులోనే ఉన్నారు.

3. ఈ రాజ్యంలో మేము లోనగుతున్న ప్రమాద పరిస్థితులను గురించి చర్చించడానికి ముందు, ఒక్క విషయాన్ని మనవి చేయదలచుకున్నాం. అసలు వ్యవహారం మాకు సంబంధించినది. మా హక్కులే ప్రమాదమునకు గురి అవుతున్నవి. అయినప్పటికీ (ఆర్బిట్రేషన్) మధ్యవర్తి పరిష్కారం గురించి మాతో ఆలోచించనేలేదు. మధ్యవర్తి పరిష్కారం సంగతి మాకు తెలిసిన తక్షణమే మేము ఆ సిద్ధాంతానికీ, మధ్యవర్తి ఎన్నికకూ కూడా మా అసమ్మతి తెలియచేశాం. మేము ప్రిటోరియాలో ఉన్న బ్రిటీష్ ఏజంట్ ముఖస్థముగా, మా అసమ్మతిని తెలియచేశాం. ట్రాన్సువాలులోని భారతీయులకు కలుగుతూ వచ్చిన ఇబ్బందులను గురించి చెప్పుకోవడానికి మే మెప్పుడు ఆయన దర్శనం చేసుకున్నా, చాలా మర్యాదగానూ, శ్రద్ధగానూ మమ్ములను ఆదరించేవాడని ఈ సందర్భంలో చెప్పదలచినాము. కేప్ టౌనులోని రాణీగారి హైకమీషనరుకు వ్రాత మూలంగా మా అసమ్మతిని తెలియచేశామని కూడా తమకు విన్నవించుకుంటున్నాం. ఈ విషయమై మేము ప్రస్తావన చేయడంలో, ఆ రెంజీ ఫ్రీస్టేటు ప్రధాన న్యాయమూర్తి మానసిక ఔదార్యాన్నిగాని, ధర్మబుద్ధిని గాని శంకించే అభిప్రాయం మాకు లేదు. రాణీగారి ఉద్యోగుల వివేకాన్ని కూడా మేము కాదనడంలేదు. గౌరవనీయుడైన ప్రధానన్యాయమూర్తికి భారతీయుల యెడల గల ద్వేషభావాన్ని మే మెరుగుదుము. కనుక ఆయన న్యాయం చేయడానికి ఎంత ప్రయత్నించినా, ఈ కేసులో నిజానిజములన్నీ గ్రహించి సమ బుద్ధితోనూ నిష్పక్షపాతంగానూ ఆయన ప్రవర్తించడం అసాధ్యమని మేము తలచినాము. ఇప్పుడు కూడా ఆలాగే తలుస్తున్నాం. ఏ కేసులోనైనా జరిగిన సంగతులు అంతకుముందే తమకు తెలిసినట్లయితే న్యాయమూర్తులు సాధారణంగా అలాంటి కేసులను తాము విచారించకుండా ఉండడం సత్సాంప్రదాయం. ముందు తమకు తెలిసిన విషయాలవల్ల మనసు తప్పుదారి పడుతుందేమోనని వారి సంశయం.

4. రాణీగారి ప్రభుత్వం, ఈ కేసును మధ్యవర్తి పరిష్కారానికి పంపుతూ వ్రాసిన దస్తావేజులో ఈ విధంగా వ్రాయబడిఉంది :

మధ్యవర్తి, రాణీగారి ప్రభుత్వం కోరిన హక్కులను అంగీకరించవచ్చును. లేక దక్షిణాఫ్రికా రిపబ్లిక్ కోరికలను అంగీకరించవచ్చును. లేదా దీనికి సంబంధించిన ఆర్డినెన్సులు, ఆర్డర్లు వగైరాలన్నిటిని సమగ్రంగా పరిశీలించి తనకు సరియైనదని తోచిన అన్వయం చెప్పవచ్చును.

5. పత్రికల్లో ప్రచురింపబడిన మధ్యవర్తి పరిష్కారం ఈ విధంగా ఉన్నది :

(ఏ) రాణీగారి ప్రభుత్వమున్నూ దక్షిణాఫ్రికా రిపబ్లిక్ ప్రభుత్వమున్నూ కోరిన కోరికలలో ఈ క్రింద వివరింపబడినవితప్ప మిగిలినవన్నీ నిరాకరింపబడినవి.

(బి) దక్షిణాఫ్రికా రిపబ్లిక్, భారతీయుల పట్లను, తదితర ఆసియా వాసులైన వ్యాపారస్థుల పట్లను, వారు బ్రిటీష్ పౌరులు కావడం చేత, 1885 సం.రం.లో చేయబడిన 3 నెం. చట్టమునూ, 1886 సం.రం. దక్షిణాఫ్రికా జాతీయ శాసనసభ—వాల్కసరాడ్—చేసిన సవరణను, దేశంలోని న్యాయస్థానాలు ఇచ్చిన తీర్పులలోని అన్వయం ప్రకారం విధిగా, పూర్తిగా అమలు జరపాలి. (సవరణచేయబడిన ఈ చట్టాన్ని అనుసరించి తమ ఎడల ప్రవర్తించి యుండలేదని అభ్యంతరం చెప్పినపుడే ఈ అన్వయం వర్తిస్తుంది.)

6. కనుక, మధ్యవర్తి పరిష్కారానికి ఎందునిమిత్తమై పంపబడినదో ఆవిషయము పరిష్కరింవబడలేదు కనుక, ఈ మధ్యవర్తి నిర్ణయం చట్ట సమ్మతం కాదని విజ్ఞప్తిదారులమైన మేము సవినయంగా మనవి చేసుకుంటున్నాము. అందువల్ల రాణీగారి ప్రభుత్వం దానికి బద్ధులై యుండ నక్కరలేదు. ఏ అభిప్రాయంతో ఈ విషయం మధ్యవర్తి పరిష్కారానికి పంపబడిందో ఆ అభిప్రాయమే త్రోసివేయబడింది. అసలు రిఫరెన్సు ప్రకారం మధ్యవర్తి, రెండు ప్రభుత్వాల్లో ఏదో ఒక దాని కోరికలను అంగీకరించాలి. లేదా తనకు సరియైనదని తోచినట్లుగా ఆర్డినెన్సులకు నిర్వచనం చేయాలి. అలా నిర్వచనం చేయడంలో దానికి సంబంధించిన ఉత్తరువులను జాగ్రత్తగా పరిశీలించాలి. ఆ విధంగా చేయ

డానికి బదులు విద్యాకోవిదుడైన మధ్యవర్తి ఆ అధికారాన్నే మరొకరి చేతుల్లో పెట్టేడు. ఆ పెట్టడంలో కూడా, ఎవరైతే వారి సహజమైన ఉనికి వలన సాక్ష్య సంపన్నాలను, పద్ధతులను ఉపయోగించుకోలేరో ఆలాంటి వారి కప్పచెప్పేడు. మధ్యవర్తి ఆలాంటి సాక్ష్యాన్ని ఉపయోగించుకోవాలనీ, అందువల్ల ఒకవేళ చట్టానికంత అనుగుణ్యంగా ఉండక పోయినా, న్యాయమైనట్టిన్నీ, సబబైనట్టిన్నీ నిర్వచనం చేయడానికి వీలుంటుందనీ కూడా మధ్యవర్తి ధర్మంగా చెప్పబడింది.

7. ఈ మధ్యవర్తి పరిష్కారం రెండు కారణాలచేత క్రమమైనది కాదని విజ్ఞప్తిదారులమైన మేము విన్నవిస్తున్నాము. మొదటి కారణ మేమంటే మధ్యవర్తి తన అధికారాన్ని మరొకరికి వప్పచెప్పడం. ప్రపంచంలో ఎక్కడాకూడా, మధ్యవర్తి అలాంటి పనిచేయడానికి వీలులేదు. రెండవ కారణం, మధ్యవర్తి, అసలుదేని నిమిత్తమైతే తన పరిష్కారం కోరబడిందో దాని విషయమై నిర్ణయం చేయక పోవడం. తనను తీర్పుచెప్పమన్న విషయాన్ని ఆయన అపరిష్కృతంగానే వదిలేశాడు.

8. నిర్వచనానికి సంబంధించిన పరిష్కారం న్యాయస్థానాల్లో జరుగ కూడదని అసలు అభిప్రాయంగా కనుబడుతుంది. ఆ విషయమై ఒకేసారి తుది నిర్ణయం జరుగాలని అభిప్రాయంలా కనుబడుతుంది. ఆలా కాకపోయినట్లయితే, 1894 సం. రం. 1, 2 నెంబర్లు ట్రాన్సువాలు ప్రభుత్వ ప్రచురణలో ఈ నిర్వచనాన్ని గురించి కనుబడే ఉత్తర ప్రత్యుత్తరాలను రాణీ గారి ప్రభుత్వం సాగనిచ్చేదే కాదు. రాజకీయంగానూ యుక్తియుక్తంగానూ, పరిష్కరింపబడవలసిన ఒక్క విషయాన్ని మధ్యవర్తి వదలిపెట్టేశాడు. ఆయన తీర్పు క్రమమైనదైతే ఆ విషయనిర్ణయం న్యాయస్థానానికి వదలివేయబడింది. ట్రాన్సువాలు ప్రభుత్వం తరఫున దాఖలు చేయబడిన కేసులో ప్రధాన న్యాయమూర్తి ఇదివరకే తన అభిప్రాయాన్ని వ్యక్తపరచిన మాట నిజమైతే, ఈ కేసులో ఆయన నిర్ణయం ఏ విధంగా ఉంటుందో తేలేపోయింది. ఆ మాట నిజమేనని ధృవపరచడంకోసం ఆ రోజుల్లో ప్రకటింపబడిన వార్తా పత్రికలను, ముఖ్యంగా 1895 సం. ఏప్రిల్ 27వ తేదీ 'ది జోహాన్సు బర్గ టైమ్సు'ను (వార పత్రికను) చిత్తగించవలెనని ప్రభువు వారిని మేము కోరుతున్నాము.

9. కాని, మేము ఉన్నతమైనట్టిన్నీ విస్తృతమైనట్టిన్నీ కారణాల వల్ల ప్రభువు వారికి ఈ విజ్ఞప్తిని చేసుకుంటున్నాము. ఈ సమస్య రాణీ గారి ప్రజలైన వేలాది జనానికి సంబంధించినది. వందలకొద్దీ బ్రిటిష్ పౌరుల నిత్యజీవనం ఈ సమస్యమీద ఆధార పడుంది. కేవలం శాస్త్ర ప్రకారం ఈ విషయంమీద నిర్ణయం జరిగితే, వందలాది కుటుంబాలు పైసా చేతులో లేకుండా సర్వనాశనమైపోతారు. ఇటువంటి జీవన్మరణ సమస్యను పరిష్కరించడం న్యాయస్థానాలకు వదలిపెట్టరని విజ్ఞప్తిదారుల మైన మేము చాలా నమ్మకంతో ఉన్నాం. న్యాయస్థానాలలో పై చిక్కులను ఆలోచించడానికి వీలులేకుండా అనేక ప్రతిబంధకాలున్నాయి. ట్రాన్సువాలు ప్రభుత్వమువారి వాదన తుట్టతుదకు అంగీకరింపబడినట్లయితే, వర్తకులకు సంబంధించినంతవరకు వారు సర్వవిధాలుగా నాశనమైపోతారు. ఈ వినాశం వారొక్కరికే కాదు. ట్రాన్సువాలులోనూ, ఇండియాలోనూ ఉంటున్న వారి కుటుంబాలకు, బంధువులకు, వారిమీద ఆధారపడున్న నౌఖర్లుకు అందరికీ వినాశహేతువే. ట్రాన్సువాలులో చిరకాలంగా వర్తక వ్యాపారం చేసుకుంటున్న మాలో కొందరిని, ఎవరో కొందరు తమ స్వార్థంకోసం చెప్పిన తప్పు మాటలను పట్టుకుని, మాలోప మేమీ లేకుండానే ఇక్కడనుంచి తరిమివేయడం జరిగితే, ఇంతకాలమైనాక కొత్త చోట్లకు పోయి కొత్తమార్గాలుపట్టి పొట్ట పోసుకోవడం అసాధ్యమైన సంగతి.

10. విషయం చాలా ప్రమాదకరమైన దవడంచేతనూ, విజ్ఞప్తి దారుల ఆస్తిపాస్తుల భవిష్యత్తు దీనిమీద ఆధారపడి ఉండడంచేతనూ, మేమింత విపులంగా ఈ విషయమును వ్రాయవలసి వచ్చినదని విన్నవించు కుంటున్నాము. కనుకనే దీనిని ఏకాగ్రచిత్తంతో పరిశీలించ వలసినదని ప్రభువు వారిని వేడుకుంటున్నాము.

11. 1881 సం. రం. పరిషత్తు శాలూకు 14వ క్లాజు ఆదిమవాసులకు తప్ప తదితరుల కందరికీ సమాన రక్షణల నిస్తున్నది. దానిని త్రోసి పుచ్చడానికి స్వార్థపరులు కొందరు, ట్రాన్సువాలులోని భారతీయులు సరియైన పరిశుభ్రతను పాటించరని అపవాదును లేవగొట్టి, దానిని వ్యాప్తం చేస్తున్నారు. 1885 సం. రం. 3 వ నెంబరు చట్టం విషయంలో రాణీ గారి ప్రభుత్వం సాగించిన ఉత్తర ప్రత్యుత్తరా లన్నిటిలోనూ, ప్రజారోగ్య

రక్షణకొరకు భారతీయులకోసం కొన్ని వీధులను ప్రత్యేకించ వల సినదేకాని, పట్టణాల్లోకొన్ని భాగాల్లో మాత్రమే వారు వ్యాపారం చేసు కోవాలని నిర్బంధించడానికి వీలులేదని స్పష్టంగా, ఘంటాపథంగా చెప్ప బడి ఉన్నది. 1885 సం. రం. 3 వ నెంబరు చట్టాన్ని అప్పటి హై కమీష నరు సర్. హెచ్. రాబిన్సన్ ప్రతిఘటిస్తూనే వచ్చారు. 1886 సవరణ చట్టానికి తన ప్రాతికూల్యతను ఉపసంహరించుకుంటూ ఇలా ఉత్తరం వ్రాశాడు. (1894 గ్రీన్ బుక్ నెంబరు 1, పేజీ 46, 26 సెప్టెంబరు 1886) సవరణ చట్టము, 'లండన్ పరిషత్తు 14 వ క్లాజుకు ఇంకా భిన్నంగానే ఉన్న ప్పటికీ, మీ అభిప్రాయంలో ప్రజారోగ్య రక్షణకోసం అది అవసరమంటు న్నారు కనుక, దానిని ఇంక వ్యతిరేకించ నక్కరలేదని నేను రాణీగారి ప్రభుత్వానికి సలహా ఇస్తున్నాను.' మధ్యవర్తి పరిష్కారానికి పంపేటప్పుడు ఇచ్చిన రిఫరెన్సులోనూ, 1885 సం. రం. 3 వ నెంబరు చట్టంలోనూకూడా పరిశుభ్రత కొరకు మాత్రమే పరిషత్తు నిర్ణయాలను అతిక్రమించడానికి అనుమతించవచ్చునని స్పష్టంగా ఉదహరింపబడింది.

12. పరిషత్తు నిర్ణయాలను త్రోసి పుచ్చడానికి తగిన అపరిశుభ్రత ఉన్నదని భావిస్తున్నందుకు, మా అసమ్మతిని ఘంటాపథంగా తమకు గౌరవపురస్సరంగా తెలుపుతున్నాము. అటువంటి అపరిశుభ్రత ఏమీ లేదని మేము ఋజువు చేయగలము.

13. మా నివాసాలు పరిశుభ్రత విషయంలో యూరోపియనుల నివాసాలకు ఎంతమాత్రమూ తీసిపోవని ఋజువు చేసేటందుకు డాక్టర్ల దగ్గర నుంచి మూడు యోగ్యతా పత్రాలను (సర్టిఫికేటులను) ఇందుతో జతపరచి పంపుకుంటున్నాం. (అనుబంధములు ఎ, బి, సి.) మాకు ఇరుగు పొరుగున ఉండే యూరోపియనుల నివాసములతో పోలిస్తే మావేవిధంగానూ తీసి పోవని సవాల్ చేస్తున్నాం. ఏ మంటే ప్రిటోరియాలో మా యిండ్లకూ, దుకాణాలకూ ప్రక్క ప్రక్కగానే యూరోపియనుల ఇండ్లూ దుకాణాలూ కూడా ఉన్నాయి.

14. మేము కోరకుండానే లభించిన ఈ ప్రశంసా పత్రాన్ని చిత్తగిస్తే తమకు విశదమవుతుంది. 16 అక్టోబరు 1885 తేదని, స్టాండర్డ్ బ్యాంకు

జాయింటు జనరల్ మేనేజరైన మిస్టర్ మిచ్చల్, అప్పట్లో హై కమీషనరైన సర్. హెచ్. రాబిన్సన్‌కు ఈ విధంగా వ్రాశాడు:

> భారతీయ వర్తకులు నాకు తెలిసినంత వరకు అన్నివిధాలా క్రమబద్ధులు. కష్టపడి పనిచేస్తారు. గౌరవనీయులు. వారిలో కొందరు ధనికులు. సంఘంలో వ్యక్తిత్వంగలవారు. బొంబాయిలోనూ, మారిషస్‌లోనూ, తదితర స్థలాల్లోనూ పెద్దపెద్ద వ్యాపార సంస్థల కధిపతులు. (గ్రీన్‌బుక్ 1, పే 37.)

15. ప్రసిద్ధికెక్కిన 35 యూరోపియను కంపెనీలు

> 'పైన చెప్పబడిన భారతీయవర్తకులు—అందులో చాలా మంది బొంబాయివారు–వారి దుకాణములను, ఇండ్లను అన్ని విధములైన పారిశుధ్యపు ఏర్పాట్లతో, యూరోపియనుల ఇండ్లతో సమానంగా పరిశుభ్రంగా ఉంచుకుంటారని విస్పష్టంగా ప్రకటిస్తున్నాం. (అను. డి.)

16. అయితే ఇవేమీ పత్రికలలో ప్రకటింప బడకపోవడం వాస్తవమే. విజ్ఞప్తిదారులమైన మేమందరమూ 'చీడ పురుగుల' మని ఇచటి పత్రికల వారి అభిప్రాయం. వాల్కుసరాద్‌కు (జాతీయ శాసనసభకు) కూడా ఈ విధంగానే తెలియచేయ బడింది. ఇందుకు కారణాలు వేరుగా చెప్ప నక్కరలేదు. అక్కడ జరుగుతుండే చర్చలలో పాల్గొనడానికి మాకు తగినంత ఇంగ్లీషు భాషరాదు. అందుచేత అక్కడ మమ్ములను గురించి చెప్పబడే తప్పుడు మాటలు తెలుసుకోవడానికి గాని, వాటిని కాదని నిర్ధారణ చేయడానికిగాని వీలులేకుండా పోతోంది. ఇక్కడ మాకు స్థావరంకూడా లేకుండా చేయబడుతోందని తెలుసుకున్న తరువాతనే కొందరు యూరోపియను వర్తకుల వద్దకు, డాక్టర్ల వద్దకూపోయి, మా పరిశుభ్రతను గురించి వారి అభిప్రాయములను తెలుపవలసినదని కోరేము.

17. అదట్లా ఉండగా మా విషయమై చెప్పుకోవడానికి మాకు కూడా హక్కున్నదని మనవి. దరహంమీద చూచుకుంటే, పైకి మా యిండ్లు నిరాడంబరంగానూ, అలంకార రహితంగానూ కనుబడవచ్చునుకాని, పరిశుభ్రత విషయంలో యూరోపియనుల ఇండ్లకు ఎంతమాత్రమూ తీసిపోవని నిస్సందేహంగా, ధారాళంగా చెప్పగలం. ఇక వ్యక్తిగతమైన

పరిశుభ్రత మాట కొస్తే, మేము ఎక్కువ నీటిని ఉపయోగిస్తాం. ట్రాన్సు వాలులో మాకు తరుచుగా సన్నిహితులుగాఉండే యూరోపియనులకన్న ఎక్కువసారులు స్నానం చేస్తాం. ఈ విధంగా వ్రాయడంలో మేము యూరోపియను సోదరులతో పోల్చుకుని వారికన్న గొప్పవారమని చెప్పడం మా అభిప్రాయం కాదు. పరిస్థితులు ఈ విధంగా చెప్పుకోవలసిన అగత్యాన్ని కలిగించాయి.

18. రెండవ నెంబరు గ్రీన్‌బుక్‌లో 19-21 పేజీలలో ప్రచురితమైన రెండు పొందికైన పిటీషనులలోనూ, ఆసియావాసులందరినీ వెళ్ళగొట్ట మని ప్రార్థనచేస్తూ, మొత్తం ఆసియావాసులను, చైనావారిని దరహాంమీద దుమ్మెత్తిపోయడం వల్ల, విధిలేక, పైనచెప్పిన విషయాలను మేముచెప్ప వలసి వచ్చింది. మొదటి విజ్ఞప్తిలో చైనావారి దుర్గుణా లన్నిటినీ వారికి మాత్రమే ఉన్నట్లు విశదపరిచారు. రెండవదానిలో మొదటి విజ్ఞప్తిని పేర్కొని అ దుర్గుణాలన్నీ ఆసియా వాసులందరికీ ఉన్నట్లే అందరినీకలపి నిందించారు. చైనా వారినిగురించీ, కూలీలు తదితర ఆసియావాసులను గురించీ ప్రత్యేకంగా పేర్కొంటూ రెండవ విజ్ఞప్తిలో ఈ విధంగా వ్రాయ బడింది. 'వీళ్ల అపరిశుభ్రమైన దురలవాట్లవల్లనూ, అపనీతికరమైన అభ్యాసము లవల్లనూ, కుష్టురోగము, సిఫిలిస్ (సుఖరోగము) మొదలైన అసహ్యాకరమైన వ్యాధులు వ్యాపించి సంఘాని కంతకూ ప్రమాదం తెచ్చిపెట్టగలవు.'

19. చైనావారి సంగతి వదలిపెట్టి, మరొక రెవరితోనూ పోల్చుకోనక్కరలేకుండానే, మాకు సంబంధించినంతవరకు పై ఆరోప ణలు పూర్తిగా నిరాధారమైనవని మేము ఘంటాపథంగా చెపుతున్నాం.

20. స్వార్థపరులైన ఆందోళకులు ఎంతవరకూ వెళ్లేరో ఋజువు చేయడానికి, ఆరెంజీ ఫ్రీస్టేటు వాల్కనరాడ్ వారికి దాఖలు చేయబడిన ఒక విజ్ఞప్తినుంచి ఒకభాగాన్ని మేమిక్కడ ఉదహరిస్తున్నాం. దాని ప్రతి ఒకటి, ప్రిటోరియా చేంబరు ఆఫ్ కామర్సు వారి అంగీకారంతో ట్రాన్సువాల్ ప్రభుత్వానికి పంపబడింది :

> ఈ మనుష్యులు స్టేటులోనికి భార్యలు, బంధువులైన ఇతర స్త్రీలు లేకుండా వస్తారు కనుక, అందువల్ల కలిగే ఫలితాలు స్పష్టమే. స్త్రీ లందరినీ ఆత్మశూన్యులుగా భావించవలెననీ, క్రైస్తవులు సహజ శత్రువులనీ వారిమతం చెపుతుంది. (గ్రీ. బుక్. నెం. 1, 1894-పే. 30.)

21. భారతదేశంలో వ్యాప్తమైయున్న గొప్ప మతాలకు ఇంత కంటె నిందాకరమైన విషయమూ, భారతజాతి కింతకంటె అగౌరవమైన మాటా వేరొకటున్నదాయని మేమడుగుతున్నాం.

22. భారతీయులకు ప్రతికూలంగా కేసును తయారుచేయడానికి ఇటువంటి (స్టేటుమెంటులు) విషయాలు ఉపయోగింపబడ్డాయని పైన చెప్పబడ్డ ప్రభుత్వ ప్రచురణలవల్ల తెలుస్తున్నది.

23. అసలైనదీ, నిజమైనదీ కారణం ఒక్కటే. దానిని మొదట నుండీ కప్పిపుచ్చుతున్నారు. విజ్ఞప్తిదారులమైన మమ్ములను ప్రత్యేకమైన పేటల్లో నివసించమని బలవంతం చేసినా, మేము గౌరవంగా పొట్ట పోసుకోకుండా ఎన్ని ఆటంకాలు కలిగించినా, అన్నిటికీ కారణం ఒకటే. వ్యాపార సంబంధమైన అసూయ. నిజానికి ఈ దండయాత్రంతా వ్యాపారస్థులమైన మామీదనే. వ్యాపారాన్ని సాగిస్తున్న మేము, క్లుప్తంగా జీవితాన్ని గడుపుతూ, ఏవిధమైన దుర్వ్యసనాలకూ లోనుకాకుండా ఉండడంవల్ల, వ్యాపారపు పోటీలో జీవితానికి అవసరమైన వస్తువుల ధరలను తగ్గించ కలిగినాము. బాగాలాభాలు తీయటాని కలవాటుపడిన యూరోపియను వర్తకుల కిది సరిపడలేదు. విజ్ఞప్తిదారులమైన మేమందరమూ ఒక్క మినహాయింపుకూడా లేకుండా త్రాగుడు అభ్యాసం లేని వారమనే సంగతి అందరికీ తెలిసినసంగతే. మా అలవాట్లు చాలా కుశలమైనవి. అందుచేత స్వల్ప లాభాలతో మేము సంతృప్తి పడతాము. మామీద ప్రతికూలభావం కలుగడాని కిదొకటే కారణం. ఆ సంగతి దక్షిణాఫ్రికాలోని వారందరూ ఎరుగుదురు. దక్షిణాఫ్రికాలోని పత్రికలవల్ల కూడా ఈ సంగతి తెలుస్తుంది. వారొక్కొక్కప్పుడు విస్పష్టంగా తమ అసహనాన్ని సహజ స్వరూపంలో వెళ్ల గ్రక్కేస్తూ ఉంటారు. కనుక 'కూలీ సమస్య' (నీచంగా చేసే ప్రయోగం)ను గురించి చర్చిస్తూ, 1893 సం. రం సెప్టెంబరు 15వ తేదీని '*ది నేటాల్ అడ్వర్టైజరు*' పత్రిక దక్షిణాఫ్రికాకు 'కూలీ' విధిగా ఉండితీరాలని నిరూపించి ఆపైని ఈ విధంగా వ్రాసింది :

> భారతీయ వ్యాపారస్థుని ఎంతత్వరగా అణచివేస్తే అంత మంచిది. సాధ్యమైతే బలవంతం చేయడం మంచిది. సంఘం యొక్క ఆయువుపట్లను కొరికేస్తున్నవారు వీరే.

24. ఈ విషయాన్ని గురించి ట్రాన్సువాల్ ప్రభుత్వ ప్రచురణమైన 'ప్రెస్' ఈ విధంగా వ్రాసింది: 'ఆసియావాసుల దండయాత్రను సకాలంలో అరికట్టకపోతే యూరోపియను దుకాణదారులు, నేటాలులోనూ కేపు కాలనీలో అనేక ప్రాంతాల్లో వలెనే, దివాలా కొట్టేస్తారు. గోడకు మేకులై పోతారు.' ఆ వ్యాసమంతా చదువడానికి చాలా బాగుంటుంది. దక్షిణాఫ్రికాలోని యూరోపియనులకు రంగుజాతులవారియెడ గల ఉద్దేశా లెల్లాఉంటాయో తెలుసుకోవడానికది చక్కని ఉదాహరణ. ఆవ్యాసంలో వ్యాపారపు పోటీ భయమే ఎక్కువగా ద్యోతకమవుతున్నా ఈ క్రింది పేరా ప్రత్యేకంగా గమనింపదగినది :

> ఈ జనమెచ్చి మీదపడిపోతే, యూరోపియనుల వ్యాపారం అసాధ్యమై పోతుంది. సిఫిలిస్, కుష్ఠురోగం మొదలైన అసహ్యా మైన వ్యాధులు గలిగి, హీనమైన అవినీతి కలవాటుపడిన మనుష్యులతో కలిసిమెలసి ఉండడంవల్ల విధిగా సంభవించే ప్రమా దాలకు మన మందరమూ గురి అవుతాము.

25. అయినప్పటికీ ఇందుతో జతపరచిన డాక్టర్ వీల్ ప్రశంసా పత్రంలో తన నిశ్చితాభిప్రాయాన్ని ఈ విధంగా తెలియచేశాడు. తెల్ల వారిలో ఆఖరు శ్రేణికి చెందినవానికంటె నల్లవారిలో కడవర్గానికి చెందిన మనిషి మంచి పరిసరాల్లో, పరిశుభ్రమైన ఆరోగ్య పద్ధతులను పాటిస్తూ మేలు జీవనం గడుపుతున్నాడు. (అను. ఎ, బి, సి.)

26. 'ఎప్పుడో ఒకప్పుడు ప్రతిజాతికి చెందినవారూ, ఒకరో లేక అనేకులో కుష్టు వగైరా వ్యాధులకు సంబంధించిన ఆస్పత్రులలో చికిత్స పొందినవారున్నారు. కాని భారతీయు డొకడుకూడా అందులో ప్రవేశించలేద'ని డాక్టరు వ్రాసిపెట్టేడు. ఇంతేకాకుండా జోహాన్సుబర్గు డాక్టర్లిద్దరు ఈ విధంగా చెప్పేరు. భారతీయులు తమతో సమానమైన యూరోపియనులకు ఏ విధంగానూ తీసిపోరు. (అను. బి, సి.)

27. విజ్ఞప్తిదారులమైన మేము మా వాదనను ఇంకా బలపరచ డానికి 13-4-1889 తేదిగల 'కేప్ టైమ్సు' పత్రిక సంపాదకీయ వ్యాసంనుంచి ఈ క్రింది భాగాలను ఉల్లేఖిస్తున్నాము. ఆ వ్యాసం భారతీయుల వాదనను ఎంతగా విశదీకరించడానికి వీలుందో అంత న్యాయంగా విశదీకరించింది.

ఉదయం పత్రికలలో ఆరబ్, ఇండియన్ వ్యాపారస్తుల చర్యలను గురించి వ్రాయబడిన కొన్ని సంగతులు, కొద్దికాలం క్రిందట ట్రాన్సువాలు ముఖ్య పట్టణంలో 'కూలీ ట్రేడర్' మీద రేగ గొట్టబడిన దుమారం సంగతిని జ్ఞాపకానికి తెచ్చాయి.

ఒక భారతీయ వ్యాపార సంస్థను గురించి ప్రశంసాత్మకంగా మరొక వార్తాపత్రికలో ప్రచురింపబడిన భాగాన్ని ఉల్లేఖించి, ఈ విధంగా ఆ వ్యాసం వ్రాయబడింది :

> ఇటువంటి ఉదాహరణాలు ఎన్నో ఉంటూ ఉండగా, గౌరవనీయులూ, కష్టించి పనిచేసే వారూ అయిన కొందరు పెద్ద మనుష్యుల కూటమిని గురించి, వారిజాతిని మరుగు పరచి, తోడి మానవులలో వారికిన్యూనత కలిగేటట్లున్నూ, సంఘంలో వారి అంతస్తుకు అపార్థం కలిగేటట్లున్నూ పేర్లుపెట్టి పిలచినందుకు క్షమించమని వేడుకుంటారని ఆశించడం న్యాయం. వారిని అవహేళనంచేసే వారంతా ఈర్ష్య చెందేటట్లు. వారు ఆర్థిక రంగాల్లో విజయాలను సాధించి ఉండగా, వారిని ట్రాన్సువాలులో కొన్ని ప్రాంతాల్లో మాత్రమే ఉంచెయ్యాలనీ, సగం నాగరికతగల ఆదిమ వాసులతోపాటు చేయాలనీ, కాఫిర్లకు వర్తించే కఠినమైన చట్టాలను వారిపట్ల వర్తింపచేయాలనీ జరుగుతుండే ఆందోళన మాకర్థం కావడంలేదు.

ఎవరికీ ఏవిధమైన నొప్పి కలిగించకుండా నెమ్మదిగా పని చేసుకునే అరబ్ వర్తకుని గురించీ, ఆలాగే ఎవరికీ అపకారం తల పెట్టకుండా ఇంటింటికీ పోయి చక్కని వస్తువులను అమ్ముకునే భారతీయుని గురించీ, ఈ కాలనీలోనూ, ట్రాన్సువాల్ లోనూ చాలా దురభిప్రాయం వ్యాపించి ఉంది. వారిని 'కూలీలు'గా భావించే అహంకారానికి కారణం, వారే జాతినుండి వచ్చారో తెలియకపోవడమే. అద్భుతమైన కవిత్వ సంపద, ఊహాతీతమైన కావ్యసంపత్తి గల బ్రాహ్మణతత్వం, ఈ 'కూలీ వర్తకుని' దేశంలోనే ఉత్పన్నమైనదన్న సంగతి తలుచుకున్నా, 24 శతాబ్దాల క్రితం దైవాంశ సంభూతుడైన బుద్ధుడు ఆదేశంలోనే జన్మించి స్వార్థ త్యాగ సిద్ధాంతాన్ని ప్రబోధించి ఆచరించాడన్న సంగతి తలుచుకున్నా, మనం

మాట్లాడుకునే భాషలోని శుద్ధసత్యాలన్నీ ఆదేశపు కొండలలోనుంచీ మైదానాలలో నుంచే మనం తెలుసుకున్నా మన్న సంగతి తలుచుకున్నా, అటువంటివారి సంతానాన్ని, అనాగరికులైన నల్ల ఆదిమవాసుల సంతానంతోపాటు సమానంగా పరిగణిస్తున్నందుకు విచారం కలుగక మానదు. భారతీయ వ్యాపారస్థునితో కాస్సేపు నిలబడి మాట్లాడిన వారెవ్వరైనా, తామొక పండితునితోనో, పెద్దమనిషితోనో మాట్లాడు తున్నామని ఆశ్చర్య పడక మానరు. ఇటువంటి తేజోనిధియైన భారతమాత పుత్రులనే కూలీలని అసహ్యించుకుని, కాఫర్లతో సమానంగా చూడాలంటున్నారు.

భారతీయ వ్యాపారస్థునికి ప్రతికూలంగా ఈవిధమైన గోల సాగించేవారికి, వారెవ్వరో తెలియ చెప్పవలసిన సమయంవచ్చింది. ఆతనిని బాగా దిగలాగే వారిలో చాలామంది బ్రిటిష్ పౌరులు. ఒక గొప్ప సంఘానికి వారు చెందినవారై, సమస్తమైన హక్కులను, ప్రత్యేకతలను అనుభవిస్తున్నారు. అన్యాయంపట్ల అసహ్యత, న్యాయంపట్ల ఆదరణా వారి సహజలక్షణాలు. పరదేశ ప్రభుత్వంలోనైనా, స్వదేశప్రభుత్వంలోనైనా, తమ హక్కులకు, స్వాతంత్ర్యానికి భంగం కలిగినట్లయితే, వాటికొరకు ఏవిధంగా పూనిక వహించి పోరాడాలో వారికి తెలుసును. భారతీయ వ్యాపారస్థుడు కూడా బ్రిటిష్ పౌరుడేననీ, అతడుకూడా వారనుభవించే స్వాతంత్ర్యాన్నీ హక్కులనూ ఆ న్యాయప్రకారమే కోరుతున్నాడనీ, బహుశా వారికి తోచలేదు కాబోలు. ఆఖరుమాటగా పామర్‌స్టన్ కాలంనాటి భాషలో, చెప్పాలంటే, ఒకరికివ్వడానికి ఇష్టపడని హక్కులను తాముకావాలని కోరడం ఇంగ్లీషు సాంప్రదాయానికి విరుద్ధం. ఎలిజబెత్ రాణీ నాటి గుత్తవిధానం రద్దైపోయినప్పటి నుంచీ, సమానంగా వ్యాపారం చేసుకునే హక్కు ఇంగ్లీషు రాజ్యాంగంలో అంతర్భాగమైపోయింది. ఈ హక్కు కెవరైనా ప్రతిబంధకం కలిగించే యడల బ్రిటిష్ పౌరసత్త్వపు హక్కు హఠాత్తుగా ప్రకోపిస్తుంది. వ్యాపారపు పోటీలో భారతీయుడు జయిస్తున్నాడనీ, ఇంగ్లీషు వ్యాపారస్థుని కన్న ఆతడు క్లుప్తంగా జీవిస్తాడనీ చెప్పే వాదన, చాలా నిస్సారమైనది. అన్యాయమైనది. ఇతరదేశాలతో, వ్యాపార రంగంలో జయప్రదంగా పోటీచేయ కలుగడమే

ఇంగ్లీషు వ్యాపారానికి మూలం. తమతో జయప్రదంగా పోటీ వ్యాపారాన్ని సాగిస్తున్న వారినుండి తమకు రక్షణ నిమ్మని ప్రభుత్వాన్ని ఇంగ్లీషు వర్తకులు కోరడం కేవలం పిచ్చి అని చెప్పాలి. ఈ విషయంలో భారతీయులకు జరుగుతున్న అన్యాయం స్పష్టంగా కనుబడుతోంది. వారు వ్యాపారం జయప్రదంగా సాగిస్తున్నారు కాబట్టి వారిని ఆదిమవాసులతో సమానం చేయమని కోరేవారిని, మా దేశస్థులని చెప్పుకోడానికి కూడా సిగ్గేస్తుంది. పై చేయిగా నున్న జాతివారితో జయప్రదంగా వారు పోటీ చేయగలుగుతుండడమే, వారు ఇప్పటికంటె, పై స్థాయి కర్హులని నిదర్శనం........ వార్తాపత్రికలూ, డచ్చివారూ, ఆశాభంగానికి లోనైన దుకాణాదారుడూ చిత్రించిన 'కూలీ' కన్న భారతీయ వర్తకుడు, ఘటికుడని ఋజువు చేయడానికి తగినన్ని ఆధారాలు చెప్పబడ్డాయి.

28. స్వార్థపరాయణత్వం వల్ల కళ్ళుపొరలు కప్పకపోతే, యూరోపియనుల భావాలుకూడా భారతీయులకు వ్యతిరేకంగా లేవని పైన ఉల్లేఖించిన విషయాన్ని బట్టి తెలుసుకోవచ్చును. స్టేటులోని బర్గర్సు, యూరోపియనులుకూడా భారతీయులకు ప్రతికూలంగా ఉన్నారని గ్రీన్ బుక్కులలో పదే పదే వ్రాయబడి ఉండడంచేత, మేము దక్షిణాఫ్రికా రిపబ్లిక్ అధ్యక్షునికి రెండు విజ్ఞప్తులను పంపించినాము. బర్గర్సులో చాలామంది, ట్రాన్సువాలులో భారతీయులు నివసించి స్వేచ్ఛావ్యాపారం సాగించుకోవడానికి తమకెట్టి అభ్యంతరమూ లేకపోవడమే కాకుండా వారిని కష్టపెట్టే చట్టాల ఫలితంగా వారు ఈ దేశాన్ని వదలిపెట్టి పోవలసొస్తే, అందువల్ల చాలా కష్టపరిస్థితు లేర్పడతాయని మొదటి విజ్ఞప్తిలో నిరూపించారు. (అను. ఈ.) రెండవ విజ్ఞప్తి యూరోపియను నివాసులు సంతకాలు చేసి పంపుకున్నది. దానిలో సంతకం చేసినవారి అభిప్రాయంలో, భారతీయుల పారిశుద్ధ్యపు అలవాట్లు, యూరోపియనుల అలవాట్ల కేమీ తీసిపోవనీ, ఈ అందోళన కంతకూ కారణం వ్యాపారంలో వచ్చిన అసూయయేననీ నిరూపింపబడింది. (అను. యఫ్.) అలా కాకపోయినా స్టేటులోని ప్రతి బర్గరూ, ప్రతి యూరోపియనూ కూడా భారతీయులకు వ్యతిరేకులనుకున్నా-అందువల్ల ప్రధాన విషయానికేమీ ప్రతిబంధక ముండకూడదని మేము మనవి చేస్తున్నాము. ఏవర్గమువారి యడల అటువంటి భావమున్నదో, ఆ వర్గము వారు న్యూనత పొందడానికి తగిన కారణములుంటే తప్ప ఆ

స్థితి గతులేర్పడవు. దీనిని అచ్చుకు పంపే సమయానికి (14-5-1895) డచ్చివారి విజ్ఞప్తిలో 484 మంది బర్గరులు, యూరోపియనుల విజ్ఞప్తిలో 1340 మంది, సంతకాలు చేశారు.

29. ఆరెంజిఫ్రీస్టేటు ప్రధాన న్యాయమూర్తి ఇచ్చిన తీర్పువలన అసలు విషయమేమీ తెలికపడలేదనీ, పరిష్కార మార్గమేమీ ఏర్పడలేదనీ ఈ క్రింది సంగతుల వలన స్పష్టం కాగలదు:

అవార్డు ఇవ్వనట్లుగానే భావించి, రాణీగారి ప్రభుత్వం, విశేషంగా రక్షణ నివ్వడం అవసరం. ఏమనగా, వాదనకోసం, మధ్యవర్తి తీర్పు క్రమమైనదనీ, తుదిపరిష్కారమనీ అంగీకరిద్దాం. ట్రాన్సువాల్ ప్రధాన న్యాయమూర్తి, ప్రభుత్వం నిర్ణయించిన స్థలాల్లోనే భారతీయులు నివసించి వ్యాపారం చేసుకోవాలని నిర్ణయం చేశారనుకుందాం. వెంటనే ఒక ప్రశ్న ఉదయిస్తుంది. వారి నెక్కడకు పంపుతారు? ఊరికి దూరంగా సందుగొందుల్లో ఉండమనవచ్చు. ఎక్కడైతే పారిశుద్ధ్యానికి తగిన ఏర్పాట్లు చేసుకోవడం అసాధ్యమో అక్కడ ఊరిబయటకు, వ్యాపారం చేసుకుంటూ మర్యాదగా జీవించడానికి వీలుగాని చోట్లకు పొమ్మంటారా? అది సంభవం కావచ్చును. 1893 రెండవ నెంబరు గ్రీన్ బుక్ 72 పేజీలో, ట్రాన్సువాలు ప్రభుత్వం మలయాలకు వాసయోగ్యంకాని స్థలాన్ని నిర్దేశించినపుడు, బ్రిటిష్ ఏజంటు తెలిపిన ఈ క్రింది తీవ్రమైన అసమ్మతిని చూస్తే ఆ విధంగానే తోస్తుంది.

> ఊరిలోనిచెత్త పోగుపెట్టేచోట, పట్టణానికీ ఆ ప్రదేశానికీ మధ్యనున్న గొందెలో పారే మురికి ఊటనీరుతప్ప మరే విధమైన నీటివనరు లేని చిన్ని చోటికి పొమ్మంటే, తప్పకుండా వారికి ప్రమాదకరమైన జ్వరాలు తదితర రోగాలు సోకుతాయి. అందువల్లవారి ప్రాణాలకు ముప్పు కలుగడమే కాకుండా పట్టణంయొక్క ఆరోగ్యానికి కూడా భంగం కలుగుతుంది. ఇటువంటి తీవ్రమైన అభ్యంతరాలు అలా ఉండగా, వారికి నిర్దేశింపబడినచోట్ల కాని మరెక్కడగాని వారు ఉండడానికి అలవాటైన విధంగా ఇండ్లు, కట్టుకునే స్తోమతు వారికిలేదు. ప్రస్తుతం వారున్న చోటునుండి వారిని వెళ్ళగొట్టడంవలన, వారు ప్రిటోరియాను వదలిపెట్టి పోవడమే సంభవం. అందువల్ల వారికి కలిగేబాధ మాట ఏలా

ఉన్నా, వారిని నౌఖర్లుగా ఉపయోగించుకుంటున్న తెల్లవారికే చాలా ఇబ్బంది, నష్టమూ కలుగుతుంది.

30. ఆ పుస్తకంలోని ఆఖరు పేజీలో 21-3-1898 తేదీని హై కమీషనరు పంపిన ఉత్తరంలో ఈ క్రింది విధంగా ఉన్నది :

> మధ్యవర్తి పరిష్కారం ఆసియాలోని ఆటవికుడైన బ్రిటిష్ పౌరుని కెవ్వరికైనా వర్తిస్తుందని రాణీగారి ప్రభుత్వం భావించ వచ్చును.

31. ఆ ఉత్తరంలో చెప్పబడిన ప్రకారం మధ్యవర్తి పరిష్కారం ఆసియావాసులైన ఆటవికులకు (ఆదిమవాసులకు) వర్తించేటట్లయితే, ఆసియా వాసులైన వారందరిని ఆటవికులంటే తప్ప, ట్రాన్సువాలులో ఆదిమవాసు లెవరున్నారు? మాటవరుసకైనా ఆ మాట చెప్పరని మేము దృఢంగా విశ్వసిస్తున్నాం. కనుక విజ్ఞప్తిదారులైన మమ్మల్ని ఆదిమ వాసులలో చేర్చడాని కెంతమాత్రమూ వీలులేదు.

32. భారతీయులపట్ల చెప్పబడే అభ్యంతరాలు, కేవలంపారిశుద్ధ్యానికి సంబంధించినవే అయితే, ఈ దిగువ అభ్యంతరాలకు కారణాలు ఊహించడానికి వీలులేకున్నది.

1. కాఫిర్లవలెనే భారతీయులు కూడా స్థిరాస్థిని సంపాదించుకో కూడదు.
2. 3 పౌ. 10 షిల్లింగులు రుసుము చెల్లించి భారతీయు లందరూ రిజిష్టరు చేయించుకోవాలి.
3. రిపబ్లిక్ ద్వారా పయనించే టప్పుడు, ఆదిమవాసులవలెనే భారతీయులు కూడా రిజిస్ట్రేషను టిక్కట్టు లేకపోతే ప్యాసులను చూపించాలి.
4. రైళ్లల్లో మొదటి తరగతి రెండవ తరగతులలో ప్రయాణం చేయడానికి వీలులేదు. ఆదిమవాసులతో పాటు కట్టకట్టుకుని ఒకేబండిలో ప్రయాణం చేయాలి.

33. విజ్ఞప్తిదారులైన మాలో చాలామంది, డెల్గోవాబేలో పెద్ద పెద్ద ఆస్థులకు యజమానులనే సంగతి తాము మనస్సుకు తెచ్చుకుంటే పై షరతులు ఎంతటి బేనుర్యాదైనవో, అవెంతగా మాకు బాధకలిగిస్తాయో

తెలుస్తుంది. అక్కడివారు వారిని చాలా గౌరవంగా మన్నించడం చేత, వారు మూడవతరగతి రైలు టిక్కట్టును కొనుక్కోలేరు. అక్కడ యూరోపియనులు వారిని చాలా సంతోషంతో ఆహ్వానిస్తారు. వారికే విధమైన ప్యాసులూ అక్కరలేదు. అలాంటప్పుడు ట్రాన్సువాలులో వారిని మరోవిధంగా ఎందుకు చూడాలని మేమడుగుతున్నాం. ట్రాన్సు వాలు సరిహద్దులలో ప్రవేశించేటప్పటికి వారి పారిశుద్ధ్యపు అలవాట్లు అసహ్యమైన వవుతాయా ? డెల్గోవా బేలో ఉన్నప్పుడు భారతీయుని బాగా ఆదరించే యూరోపియను పెద్దమనిషే, ట్రాన్సువాలులో కొచ్చే సరికి ఆ పెద్దమనిషే ఆ భారతీయునే మరోలాగున చూడడం కూడా తరచుగా జరుగుతూ ఉంటుంది.

34. ఈ ప్యాసుల చట్టం ఎంతచిక్కును తెచ్చి పెడుతున్నదో నిరూపించడానికి గాను హాజీమహమ్మద్ హాజీ దాదాగారిచ్చిన (అఫిడవిట్) వాఙ్మూలాన్ని ఇందుతో జతపరచినాము (అను. జి.) మిస్టర్ హాజీ మహమ్మద్ ఎవరో, అందుతో జతపరచిన ఉత్తరంవల్లనే తెలుసుకోవచ్చును. (అను. హెచ్.) ఆయన దక్షిణాఫ్రికాలోనున్న భారతీయులకల్లా అగ్రగణ్యుడు. మేము ఉదాహరణకు మాత్రమే ఆయన అఫిడవిట్‌ను జతపరచినాం. భారతీయులలో అగ్రగణ్యుడైన వాడే, అమర్యాదకూ, కష్టాలకూ, గురికాకుండా ప్రయాణం చేయడం అసాధ్యమైనప్పుడు, మామూలు భారతీయుల కడగండ్లు ఎలా ఉంటాయో నిరూపించడానికే దానిని జతపరచినాము. అవసరమైతే, అలాంటి అమర్యాదకరమైన సంఘటనలను వందలకొద్దీ ఋజువు చేయగలము.

35. భారతీయులు వేరు పురుగులు లాగున జీవిస్తారనీ, డబ్బు ఖర్చు పెట్టరనీ కూడా చెప్పబడింది. కూలిపని చేసుకునే భారతీయుల విషయం లోనూ, వారి పిల్లల విషయంలోనూ ఈ మాటలు చెప్పడానికి ఎంత మాత్రమూ వీలులేదు. వారిని ఎక్కువగా ద్వేషించే యూరోపియనులు కూడా ఆ మాటలు చెప్పరు. ఏమంటే వారు వేరుపురుగులు కారు. ఈ శ్రమజీవులలో చాలామంది కుటుంబాలతోనే స్థిరనివాస మేర్పరచుకున్నారు. చాలామంది ఆదాయానికి మించి ఖర్చు పెట్టుకుంటూ జీవిస్తున్నారని మేము స్వయంగా ఎరుగుదుము. ఇక వర్తక వ్యాపారం చేసు కునే భారతీయుల విషయంలో కొంత విశదీకరణం అవసరం.

ఈ ద్వేషమంతా అసలు వారిమీదనే. ఈ విజ్ఞప్తిదారులైన మేము వర్తకులము. ఇండియాలో మామీద ఆధారపడుతున్నవారికి మేము డబ్బు పంపిస్తున్న సంగతి కాదనము. పంపిస్తున్నామని సగర్వంగా చెప్పుకుంటాము. కాని మేము పంపేసొమ్ము వారికయ్యే ఖర్చుకు తగినది కాదు. యూరోపియను వర్తకులతో మేము వ్యాపారంలో జయప్రదంగా పోటీ చేయడానికి కారణం, విలాసాల కోసం వారికన్న మేము చాలా తక్కువ సొమ్మును ఖర్చుచేయడమే. అయినప్పటికిన్నీ యూరోపియను భూస్వాములకు మేము శిస్తులు కట్టాలి. నేటివ్ నౌకర్లకు జీతనాతాలివ్వాలి. మాంసాహారం కోసం కొనుక్కునే జంతువుల నిమిత్తం డచ్చిరైతులకు డబ్బివ్వాలి. టీ, కాఫీ వగైరా ఇతర సరకులను ఈ దేశంలోనే కొనుక్కుంటున్నాం.

36. భారతీయుడు ఈ వీధిలో కాపురం చేయాలా లేక ఆ వీధిలో కాపురం చేయాలా అన్నది అసలు సమస్యకాదు. దక్షిణాఫ్రికా అంతటిలోనూ, అతని అంతస్తు ఏమిటనేదే సమస్య. ఏమంటే, ట్రాన్సువాలులో జరిగినపని, మిగిలిన రెండు కాలనీలలోనూ జరుగవచ్చును. స్థానిక స్థితిగతులను బట్టి స్వల్ప తేడాలున్నా ఈ సమస్యంతా ఒకే స్థాయిలో పరిష్కారం కావాలనే సాధారణంగా అందరి అభిప్రాయం.

37. భారతీయుని కూడా ఆదిమవాసులైన కాఫిర్ స్థితికి దింపాలనే ఉద్దేశమే ఇంతవరకు వ్యక్తమైన అభిప్రాయాలనుబట్టి కనుబడుతోంది. కాని యూరోపియను వర్గాల్లో గౌరవనీయులైన వారి అభిప్రాయం మాత్రం సాధారణంగా దానికి భిన్నంగానే ఉన్నది. కాని దానిని వారు గట్టిగా చెప్పలేరు. అప్పుడప్పుడు పత్రికలలో ప్రకటిస్తారు.

38. నేటాల్ కాలనీ వారు, దక్షిణాఫ్రికాలోని ఇతర రాష్ట్రాలలో ఉన్నవారిని ఒక 'కూలీ' మహాసభకు ఆహ్వానిస్తున్నారు. 'కూలీ' అనే పదాన్ని ఉద్యోగస్థులే ధారాళంగా వాడుక చేస్తున్నారంటే, భారతీయుని యెడల ఎంతటి ద్వేషం వ్యాప్తమైయున్నదో స్పష్టంగా కనుబడుతోంది. ఇక ఆ మహాసభ ఈ సమస్యను గురించి ఏమైనా చేయగలిగితే ఏమి చేస్తుందో వేరే చెప్పనక్కరలేదు. ట్రాన్సువాలు ప్రభుత్వం వారు, (ఆర్బిట్రేటరు) మధ్యవర్తి ఎదుట దాఖలు చేసిన కేసులో ఆసియా దేశంనుంచి వచ్చిన ఏ వ్యక్తికైనా 'కూలీ' అనే మాట వర్తిస్తుందని వ్రాశారు.

39. భారతీయుల యెడల దక్షిణాఫ్రికాలో విద్వేషం ఇంత ఎక్కువగా ఉన్నది. ఈ విద్వేషానికి మూల కారణం స్వార్థపరుల ఆందోళన. (ఆ విషయాన్ని మేము పైన వ్రాసిన దానిలో నిరూపించ గలిగేమని నమ్ముతున్నాం.) కాని ఆ ద్వేషభావం యూరోపియను లందరిలోనూ లేదని కూడా తెలుస్తున్నది. దక్షిణాఫ్రికాలో ధనార్జన కోసం పోటా పోటిగా ప్రయత్నాలు జరుగుతున్నాయి. ప్రజల యొక్క నైతిక స్థాయి ఏమంత ఎక్కువగాలేదు. భారతీయుల జీవిత పద్ధతులను గురించి అనేక అపోహాలు, అద్భుత కల్పనలు వ్యాప్తి చేయబడ్డాయి. అందునిమిత్తం ప్రత్యేక శాసనాలు కూడా పుట్టినాయి. ఇటువంటి పరిస్థితులలో మీ విజ్ఞప్తిదారులమైన మమ్ములను గురించి ఏమైనా ఆరోపణలు చేయబడినపుడున్నూ, భారతీయ సమస్య విషయంలో ఏమైనా పరిష్కార మార్గాలు సూచించి నప్పుడున్నూ, వాటిని బహుజాగ్రత్తగా ఆలోచించి స్వీకరించవలెనని ప్రభువువారికి మేము మనవి చేసుకోవడంలో విశేషమేమీ లేదు.

40. 1858 సంవత్సరం ప్రకటన ప్రకారం, రాణీగారి ప్రభుత్వంలోని ఇతర పౌరులతోపాటు మేము కూడా సమానమైన హక్కులకు, ప్రత్యేకతలకు అర్హులమనే సంగతి అట్లుండగా, ప్రభువులైన తాము, ఆ హక్కులకు హామీ ఇస్తూ పంపిన లేఖ (డిశ్పాచ్) లోని ఈ దిగువ విషయాన్ని కూడా తమ చిత్తానికి తెస్తున్నాము :

> రాణీగారి పాలితులైన భారతీయులను, ఆమె ఇతర పాలితులతో పాటు సమానంగా చూడవలెనని రాణీగారి ప్రభుత్వము వారు వాంఛిస్తున్నారు.

41. ఇది స్థానిక విషయం మాత్రమే కాదు. ఇది ప్రధానంగా సామ్రాజ్యాని కంతకూ సంబంధించిన విషయమని మేము మనవి చేస్తున్నాం. ఇతర కాలనీలలోనూ, దేశాలలోనూ, ఎక్కడెక్కడ రాణీగారి పౌరులు ఒడంబడికల మూలంగా స్వేచ్ఛావ్యాపారాన్ని చేసుకుంటున్నారో, భారతీయులు కూడా అక్కడకు పోవచ్చును కనుక, ఇప్పుడీ సమస్య పరిష్కారాన్ని బట్టే కొంతవరకు వారు వ్యవహరిస్తారు. దక్షిణాఫ్రికాలో ఉన్న చాలామంది భారతీయులకు ఈ సమస్య సంబంధించి ఉన్నది. దక్షిణాఫ్రికాలో స్థిర స్థావర మేర్పరచుకున్న వారి కిది జీవన్మరణ సమస్య. నిరంతరం

వారు కష్టాలపాలై ఉంటున్నందువలన వారికి నైతికపతనం కలుగ వచ్చును. తత్ఫలితంగా వారికి నాగరికమైన అలవాట్లుపోయి, ఆదిమ వాసులైన నేటివుల స్థితికి దిగజారి పోగలరు. ఒకతరం గడిచిన తర్వాత, ఈ విధంగా దిగజారిపోతున్న భారతీయులకూ, నేటివులకూ అలవాట్ల లోనూ, ఆచారాల్లోనూ, ఆలోచనలలోనూ అంతగా భేదం లేకుండా పోవచ్చును. వలస పోవడంలో గల అభిప్రాయమే నాశనమైపోతుంది. రాణీగారి పౌరులలో చాలామంది నాగరికతలో ఉన్నతస్థాయికి పోవడా నికి బదులు దిగజారిపోవడం తటస్థిస్తుంది. అటువంటి స్థితిగతుల వల్ల కలిగే ఫలితాలు సర్వవిధాలా నాశన హేతువులు కాగలవు. ఆత్మగౌరవం గల భారతీయు డెన్నడూ కూడా దక్షిణాఫ్రికాలో అడుగు పెట్టలేడు. భారతీయుల నిర్మాణ కృషి అంతా అంతరించి పోతుంది. బ్రిటిష్ బావుటా (యూనియన్ జాక్) ఎగురుతున్నచోట, రాణీగారి సామ్రాజ్యాధి కారం చలామణీ అయేచోట, ప్రభువులు అటువంటి దుస్థితి ఏర్పడనివ్వరని మేము దృఢంగా నమ్ముతున్నాం.

42. దక్షిణాఫ్రికాలో భారతీయులపట్ల ద్వేషభావం బహుళ వ్యాప్తమై ఉన్న ఈ పరిస్థితులలో, స్వార్థపరులైన వారు మాకు వ్యతిరే కంగా సాగిస్తున్న ఆందోళనకు, రాణీగారి ప్రభుత్వం లొంగిపోతే, మా పట్ల గొప్ప అన్యాయాన్ని చేసిన వారవుతారు.

43. మా పారిశుద్ధ్యపు అలవాట్లు, యూరోపియనుల ఆరోగ్యానికి ఏ విధంగానూ ప్రమాదము కలిగించవన్నమాటే నిజమైననాడు, మాకు ప్రతికూలంగా జరుగుతున్న ఆందోళనకు వ్యాపార సంబంధమైన అసూయే కారణమన్న సంగతి నిజమైననాడు, ఆరెంజిఫ్రీస్టేటు ప్రధాన న్యాయ మూర్తి తీర్పు, మమ్మోలను బంధించదని మనవి చేస్తున్నాం. ఆయనకు ఆకేసు పంపడం క్రమమైనప్పటికీ కూడా తీర్పు మాకు వర్తించదు. లండన్ కన్వెన్షన్ (పరిషత్తు) నిర్ణయాలను అతిక్రమించేటందుకు రాణీగారనుమతించ డానికి తగిన కారణాలేమీ లేవు.

44. మా పారిశుద్ధ్యపు అలవాట్లను గురించి, మేము పైన చెప్పిన సంగతులను, ప్రభువువారు అనుమానించే యెడల, ఇందులో చాలా పెద్ద పెద్ద సమస్యలు ఇమిడి ఉన్నాయి కనుకనూ, మా పారిశుద్ధ్యపు అలవాట్లను గురించి భిన్నమైన అభిప్రాయాలు వ్యక్తపరుపబడినవి కనుకనూ,

దక్షిణ ఆఫ్రికా భారతీయుల యెడల ద్వేషభావం ఎక్కువగా ఉండడం చేతనూ, కన్వెషను నిర్ణయాలను అతిక్రమించడానికి అనుమతించేముందు, పరస్పరం వ్యతిరేకంగా చెప్పబడిన సంగతుల నిజానిజములను విచారించ డానికీ, దక్షిణాఫ్రికాలో భారతీయుని అంతస్థును గురించి సమగ్రంగా విచారించి నిర్ణయం చేయడానికీ ఒక నిష్పాక్షికమైన విచారణ జరిపించ వలసినదిగా మేము ప్రభువు వారిని సవినయంగా కోరుతున్నాము.

ముగించే ముందు; మా కేసును యావత్తూ ప్రభువు వారి చేతుల్లో ఉంచుతున్నామని మనవి చేస్తున్నాం. రంగు ద్వేషానికి మమ్ములను మీరు బలిచేయరనే విశ్వాసంతో ఈ పని చేస్తున్నాం. దక్షిణాఫ్రికాలోని భార తీయులను వారి స్థాయినుండి కూలద్రోసి, రాణీగారి ప్రభుత్వం అసహజ మైన స్థితిలో పడెయ్యదనీ, నిజాయితీగా జీవించి పొట్టపోసుకొనే సావ కాశాలు లేకుండా చేయదనీ, అంటువంటిస్థితికి అంగీకరించదనీ మేము విశ్వ సిస్తున్నాం.

దయతో మాకీ న్యాయం దయచేసినందుకు, మేము మీ కెప్పుడూ కృతజ్ఞులము వగైరా.

(అసలు అచ్చువేయబడిన కాపీలో సంతకాలు లేవు.)

## అనుబంధం 'ఎ'

గత ఐదు సంవత్సరాలనుంచీ, ప్రిటోరియా పట్టణంలో, డాక్టరుగా ప్రాక్టీసు చేస్తున్నాను.

ఈ కాలంలో, ముఖ్యంగా మూడేళ్ళక్రితం, ఇప్పటికంటే భారతీయుల జనాభా ఎక్కువగా ఉన్నపుడు, వారిలో, నాకు బాగా ప్రాక్టీసు ఉండేది.

సాధారణంగా భారతీయులందరు శుచిగా ఉంటారు. మురికి, అజాగ్రతైన అలవాట్లవల్ల కలిగే రోగాలు వారిలో లేవు. వారి ఇళ్ళు సాధారణంగా, పరి శుభ్రంగా ఉంటాయి. పారిశుద్ధ్యపు పనులనువారు మనఃపూర్వకంగా చేస్తారు. వర్గాలవారిగా పరిశీలించినా, తక్కువ తరగతి భారతీయుడు ఏవిధంగాకూడా, తక్కువ తరగతి తెల్లవానికి తీసిపోడని నా అభిప్రాయం. ఇంకా చెప్పాలంటే తక్కువ తరగతి భారతీయుడు, తనతో సమాన తరగతి తెల్లవారికంటే మంచి గృహంలో ఉంటూ, పారిశుద్ధ్య కార్యక్రమాలను అతి శ్రద్ధతో ఆచరిస్తాడు.

ఇదికాక, నేను మరొక్క విషయాన్ని గమనించాను. పట్టణంలోను, జిల్లా అంతటా, మశూచికం అంటువ్యాధిగా ప్రబలిఉన్న రోజుల్లో (ఇప్పటికీ జిల్లాలో యితర ప్రాంతాలలో ప్రబలంగానే ఉంది) ఇతర జాతులకు చెందిన వారిలో, ఒకరు లేక కొంతమంది యీ వ్యాధికి గురై, ప్రత్యేకంగా దూరంగా ఉంచబడ్డారు కాని, ఆ విధంగా మశూచికం తగిలిన భారతీయుడు ఒక్కడూ కూడా నాకు కనపడలేదు.

అందువల్ల పరిశుభ్రత ఆధారంగా, భారతీయుల విషయంలో అభ్యంతరం చెప్పటానికి అవకాశం లేదని నా అభిప్రాయం. తెల్లవారి విషయంలో, పారిశుద్ధ్య కార్యక్రమాన్ని అమలు జరిగేట్లుచూసే అధికారుల అజమాయిషీ, భారతీయుల విషయంలోకూడా జరిగేట్లు చూడవలసిన అవసరం ఉంది.

27 ఏప్రిల్ 1895
ప్రిటోరియా, జడ్. ఎ. అర్.*

హెచ్. ప్రయిర్ వీలే
బి. ఏ., యం. బి. బి. యస్.
(కాంటాబ్)

## అనుబంధం 'బి'

జొహాన్స్‌బర్గ్,
1895.

ఈ నోటు తెచ్చిన భారతీయుల వసతిగృహాలను నేను పరీక్షచేశాను. అవి పరిశుభ్రంగా, ఆరోగ్యకరమైన వాతావరణంలో ఉన్నాయి. యిరోపియన్ ఎవరైనా సరే నివసించటానికి తగిన పరిస్థితిలో ఉన్నాయి. నేను ఇండియాలో, కూడా కొంతకాలం నివసించాను. ఇక్కడ **Z. A. R.** లోని భారతీయుల యిళ్లు వారి స్వదేశములోని యిళ్ళకంటే కూడా ఎక్కువ పరిశుభ్రంగా ఉన్నాయని ధృడపరుస్తున్నాను.

సి. పి. స్పింక్
యం. ఆర్. సి. పి. & ఐ. ఆర్. సి. యస్.
(లండన్)

---

* ఇది డచ్ భాషలో దక్షిణాఫ్రికా రిపబ్లికును తెలియపరుస్తుంది.

## అనుబంధం 'సి'

జొహాన్స్‌బర్గ్,
14 మార్చి 1895.

నా వృత్తి ధర్మాన్ననుసరించి, జొహాన్స్‌బర్గ్‌లో నివసిస్తున్న బొంబాయినుండి వచ్చిన వర్తకులు మొదలైన పై తరగతి భారతీయుల యిళ్లను చాలాసార్లు చూడవలసి వచ్చింది. వారి అలవాట్లు, గృహజీవనం, పరిశుభ్రమైనవనీ, అదే తరగతి తెల్లవారితో సరితూగుతారని, నేను నా అభిప్రాయంగా తెలియచేస్తున్నాను.

డాక్టర్ నాహమ్‌చర్,
యం. డి.

## అనుబంధం 'డి'

జొహాన్స్‌బర్గ్,
14 మార్చి 1895.

దక్షిణాఫ్రికా రిపబ్లిక్‌లోని భారతీయ వర్తకుల విషయంలో బయలుదేరిన వివాదాల పరిష్కారసంఘం, బ్లోమ్ ఫాంటీన్‌లో ప్రస్తుతం సమావేశమవుతున్నట్లు దిగువ సంతకములు చేసినవారికి తెలియవచ్చింది. భారతీయ వ్యాపారుల అనాచారపు అలవాట్లు కారణంగా వారు యూరోపియనుల పొరుగున నివసించటానికి అర్హులుకారని ఆరోపణలు జరిగినట్లుగా కూడా తెలియవచ్చింది.

ఈ విషయంలో మేము తెలియజేసే దేమనగా...

(1) పైన పేర్కొన బడిన భారతీయ వ్యాపారులలో పెక్కుమంది బొంబాయినుంచి వచ్చారు. వారు తమతమ వ్యాపారపు ప్రదేశాలను, నివాస గృహాలను పరిశుభ్రంగా, ఆరోగ్యకరమైన స్థితిలో ఉంచుకుంటున్నారు. అవి యూరోపియన్ల గృహాలకు ఎంతమాత్రం తీసిపోవు.

(2) వారిని కూలీలని పిలవటంకాని, బ్రిటిష్ ఇండియాలోని తక్కువ కులపు వారిగా పరిగణించటంకాని శుద్ధ పొరబాటు. వారు భారతీయ ఉన్నత కులాలకు చెందినవారు.

హేమాన్ గార్డన్ అండ్ కో
బ్రాండ్ అండ్ మెర్క్స
లిండ్సే అండ్ ఇన్నిస్
గెస్టాప్ స్కేనిడిర్
సి. లిబే
క్రిస్టోఫర్ పి. స్పిన్క్
ఎ. వెంట్‌వర్త్ బాల్
జె. గార్లిక్
హెచ్. వుడ్‌క్రాఫ్ట్
గార్డన్ మిచెల్ అండ్ కో
జొహాన్స్‌బర్గ్, జడ్.ఎ.ఆర్.
ఆర్.ఆర్. కోర్టర్
పి. బార్నెట్ అండ్ కో
ఇజ్రాయల్ బ్రదర్స
హెచ్. క్లాఫాన్
పేన్ బ్రదర్స్
హెచ్. యఫ్. బార్ట్
జోసఫ్ లాజరస్ అండ్ కో
జియో.జాస్.కెటిల్ అండ్ కో
బోర్టన్స్ బ్రదర్స
జె. డబ్ల్యు. జాగర్ అండ్ కో
టి. చార్లి
ఆర్. జి. క్రామర్ అండ్ కో
హోల్ట్ అండ్ హోల్ట్
బి. ఇమాన్యు ఏల్
ఏడామ్ అలెగ్జాండర్

బి. అలెగ్జాండర్
ఎ. బేరెన్స
యస్. కోల్‌మన్
అలెగ్జాండర్ పి. కె.
జి. కొనిస్‌బర్గ్
జె. హెచ్. హాప్‌కిన్స
లీబర్‌మన్
బెల్‌స్టెడ్ అండ్ కో
జె. హెచ్. హాప్‌కిన్స
జె. హెచ్. హాప్‌కిన్స
ష్లామ్ అండ్ ఆమ్స్‌బర్గ
హ్యూగో బింగెన్
జాన్. డబ్ల్యు. సి.
హెచ్. బెర్న్‌బర్గ్ అండ్ కో
జనరల్ వ్యాపారస్థులు,
దుకాణపు దారులు
జొహాన్స్‌బర్గ్
ఇ. నీల్
జె. కస్టింగ్
యస్. డబ్ల్యు. లూయీ
స్పెన్స అండ్ హ్యారీ
ఫ్రీస్‌మన్ అండ్ షఫీసా
జె. ఫాగల్‌మన్
టి. రేట్స అండ్ కో
బి. గండల్‌ఫింగర్
జె. గండల్‌ఫింగర్

## అనుబంధం 'ఇ'

గౌరవనీయులైన దక్షిణాఫ్రికా రిపబ్లిక్, ప్రిటోరియా, అధ్యక్షులకు, విన్నవించే దేమనగా—

ఈ రాష్ట్రంలోని భూస్వాములు, భారతీయులు యిక్కడ నివసిస్తూ వ్యాపారం చేయటానికి పూర్తిగా వ్యతిరేకులని, యీరిపబ్లిక్ లోని కొంతమంది స్వార్థపరులైన యూరోపియన్లు ప్రచారం చేస్తున్నారు. ఈ దిగువ సంతకములు చేసిన భూస్వాములమైన మేము, వారిని వ్యాపారం చేయకుండా ఆటంకపరచ వద్దని కోరుతున్నాము. భారతీయులు శాంతిప్రియులు, చట్టబద్ధంగా ప్రవర్తించే పౌరులు. అందుచేత వారు యిచ్చట ఉండ తగినవారు. బీదలపాలిటవారు పెన్నిధులు. నిత్యజీవితావసరాలకుకావలసిన వస్తుసామగ్రిని, భారతీయులు న్యాయమైన వ్యాపారపు పోటీతో, తక్కువధరకు అందచేస్తూ వాటిధరలు పెరుగకుండా చూస్తున్నారు. వారికిగల పొదుపరితనం, మితమైన ఆహార అల వాట్లే దీనికి కారణము.

ఈ రాష్ట్రంలోనుంచి వారిని తొలగించడం మాకు ఒక పెద్ద దెబ్బలాంటిది. ముఖ్యంగా వర్తకపు కేంద్రాలకు దూరంగా ఉంటున్న మావంటి భూస్వాములు, అనుదినమూ కావలసిన వస్తు సామగ్రికి భారతీయ వ్యాపారస్తులపైననే ఆధారపడి యున్నాం. కనుక వారి స్వాతంత్ర్యాన్ని అరికట్టే ఏ చర్య అయినాసరే, వారిని యిక్కడినుంచి తొలగించటానికి దారితీస్తుంది. భారతీయ వ్యాపారస్తులు లేక పోవటంతో, మా క్షేమానికి జీవితానందానికి అంతరాయం కలుగుతుంది. కనుక భారతీయులను ట్రాన్స్‌వాల్ నుంచి వెళ్లగొట్టే ఏ చర్యా తీసుకొనవద్దని మేము సవినయంగా కోరుతున్నాం.

[పెక్కుమంది భూస్వాముల సంతకాలు]

దక్షిణాఫ్రికాలో భూస్వాములను బర్గర్లంటారు.

## అనుబంధం 'ఎఫ్'

గౌరవనీయులైన దక్షిణాఫ్రికా రిపబ్లిక్, ప్రిటోరియా అధ్యక్షులకు—

ఈ రిపబ్లిక్ లో నివసిస్తున్న, దిగువ సంతకములు చేసిన యూరోపియనుల మైన మేము, యీదేశంలో ఏ అవరోధంలేకుండా నివసిస్తూ, వ్యాపారం చేసు కుంటున్న భారతీయులపట్ల, స్వార్థపరులైన కొంతమంది లేవదీసిన ఆందోళనకు నిరసన తెలియచేస్తున్నాము.

మా అనుభవాన్నిబట్టి, భారతీయులు పరిశుభ్రతలో, యూరోపియన్లకు ఏమాత్రం తీసిపోరని చెపుతున్నాం. భారతీయులలో, ముఖ్యంగా వ్యాపారస్థులలో, అంటువ్యాధులు ప్రబలుతున్నాయంటూ జరిగిన ప్రకటనలకు ఆధారం లేదు.

ఈ ఆందోళనకు కారణం, భారతీయుల పరిశుభ్రత వారి ఆచార వ్యవహారాలూ కాదు. వ్యాపారం విషయంలో యీర్ష్య మాత్రమే దీనికి మూలం. భారతీయులు తమ పొదుపరితనం చేతనూ మితమైన అలవాట్లవల్లనూ, జీవితానికి కావలసిన వస్తువుల ధరలు పెరుగకుండా చూస్తున్నారు. ఈ విధంగా యీ రాష్ట్రంలోని బీదవారికి వారు ఒక పెన్నిధిగా తయారైనారు.

వారిని వేరుగా కాపురం ఉండేట్లుచేసి, వేరుగా వ్యాపారం చేసుకొనవలసిందిగా, బలవంత పరచడం మంచిపని కాదని మా అభిప్రాయం.

కనుక వారి స్వాతంత్ర్యాన్ని అరికడుతూ, చివరకు రిపబ్లిక్‌నుంచి వారిని తొలగించే ఏ చర్యా తీసుకొనవద్దని కోరుతున్నాం. అటువంటి చర్య తీసుకుంటే వారిజీవనానికే దెబ్బ తగులుతుంది. ఇది క్రైస్తవ మతస్థుల దేశంలో తీసుకొనవలసినచర్య కాదు.

[పై అర్జీ ఆఫ్రికన్, ఇంగ్లీషు భాషలలో అచ్చయింది. దీనిమీద సంతకాలు చేసినవారి పేర్లు, ఫైలులోని ప్రతిలో లేవు.]

## అనుబంధం 'జి'

హాజీమహమ్మద్ హాజీదాదా అండ్‌కో ; ప్రిటోరియా, డెల్గోవా బే, డర్బాన్ వగైరాచోట్ల వ్యాపారంచేస్తున్న కంపెనీ, మేనేజింగ్ సీనియర్ భాగస్వామి నయిన, హాజీమహమ్మద్ హాజీదాదా అనే నేను, ప్రమాణపూర్వకంగా చెప్పేదేమనగా—

(1) 1894 సంవత్సరంలో ఒకసారి నేను జొహాన్స్‌బర్గ్‌నుంచి, చార్లస్‌టౌన్‌కు, కోచీలో ప్రయాణం చేశాను.

(2) ట్రాన్స్‌వాల్ సరిహద్దు దగ్గరకు వచ్చేసరికి యూనిఫారమ్‌లో ఉన్న ఒక యూరోపియనున్నూ మరొకడున్నూ వచ్చి, ప్యాస్ చూపించమని అడిగేరు. నా దగ్గర ప్యాస్ లేదనీ, యిదివరలో ఎన్నడూ, నన్ను అడగలేదనీ కూడా చెప్పేను.

(3) ప్యాస్ ఒకటి విధిగా తెచ్చుకోవలసి ఉంటుందని, ఆ మనిషి తిరస్కారంగా చెప్పేడు.

(4) ఒకటి తెచ్చి పెట్టమనీ, దానికయ్యే ఖర్చులిస్తాననీ చెప్పేను.

(5) దానిమీదట నిర్లక్ష్యంగా, తనతో పాస్‌లు యిచ్చే ఆఫీసరు వద్దకు నన్ను రమ్మనీ, రాకపోతే, కోచీలోనుంచి బయటకు లాగుతాననీ చెప్పేడు.

(6) పరిస్థితులు విషమిస్తాయనే ఉద్దేశ్యంతో క్రిందకు దిగేను. రెండు మైళ్లు నేను నడవ వలసివచ్చింది. ఆ మనిషి గుర్రంమీద స్వారి చేస్తూ వచ్చాడు :

(7) ఆ ఆఫీసుకు చేరిన తర్వాత, పాస్ తీసుకోనవలసిన అవసరం లేదని తెలిసింది. ఎక్కడికి వెడుతున్నావని మాత్రం అడిగేరు. ఆ తర్వాత వెళ్ళి పొమ్మన్నారు.

(8) గుర్రంమీద స్వారీచేస్తూ నాతో వచ్చిన మనిషికూడా వెళ్ళిపోయాడు. రెండుమైళ్లు నడిచి తిరిగి వెనక్కువచ్చాను. నేను వచ్చేసరికి కోచీ వెళ్ళిపోయింది.

(9) అందువల్ల, ఛార్ల్‌స్టన్ వరకు ఛార్జీ యిచ్చి టిక్కెట్టు కొన్నప్పటికీ, యింకా రెండుమైళ్లు నడిచి అక్కడికి చేరుకోనవలసి వచ్చింది.

(10) తదితర భారతీయులు కూడా, యిదే విధంగా కష్టాలకూ, అవమానాలకూ గురైనారని, నా స్వానుభవంమీద చెపుతున్నాను.

(11) కొద్దిరోజుల క్రితం, డెల్‌గోవా బేనుంచి ప్రిటోరియాకు, యిద్దరు స్నేహితులతో ప్రయాణం చేయవలసి వచ్చింది.

(12) ట్రాన్స్‌వాల్‌లో ప్రయాణం చేయటానికిగాను, దక్షిణాఫ్రికా ఆదిమవాసుల మాదిరిగా, మేము పాస్‌లు తీసుకొని జాగ్రత్త పడవలసిన అవసరం కల్గింది.

హాజీ మహమ్మద్ హాజీ దాదా.

24 ఏప్రియిల్ 1895 న ప్రిటోరియాలో నా ఎదుట ప్రమాణం చేసి చెప్పబడింది.

ఎన్వరోల్మారీ,
వి. రాసక్.

## అనుబంధం 'హెచ్'

టెలిగ్రాం అండ్ కేబుల్
ఎడ్రస్ : ''బోటింగ్''

పాయింట్ నేటాల్ పోర్టు
2 మార్చి 1895.

ఆఫ్రికాబోటింగ్ కంపెనీ నుంచి.

మిస్టర్ హాజీ మహమ్మద్ హాజీ దాదా (మెస్సర్స్ హాజీ మహమ్మద్ హాజీ దాదా అండ్ కో) వారికి—

అయ్యా,

మీరు ఇండియాకు వెడుతున్నారని తెలిసింది. ఈ సందర్భంలో, గత పదిహేను సంవత్సరాల నుంచీ, మీకూ మాకూ గల వ్యాపార పరిచయాన్నిబట్టి వర్తకంలో మీకుగల యోగ్యతను శ్లాఘిస్తున్నాం. ఇక్కడ మీరు నివసించిన ఇన్ని దినాలలోను, వ్యాపార విషయాలలో, మీ నిజాయితీని, ఏ ఒక్క వర్తక సంఘంకూడా శంకించలేదని, మీకు తెలియచేయటానికి సంతోషిస్తున్నాం. మీరు తప్పక నేటాల్‌కు తిరిగి వస్తారని ఆశిస్తున్నాం. మరల మీతో వ్యాపార సంబంధం పెట్టుకుందామనే అభిలషిస్తున్నాం. మీకు ప్రయాణం సుఖంగా జరుగుగాక యని కోరుకుంటున్నాం.

మీ విశ్వాసపాత్రులు,
ఆఫ్రికన్ బోటింగ్ కంపెనీ తరపున,
(సం) ఛార్లెస్. టి. హచిన్స్,

[అర్జీ, అనుబంధాలు, అచ్చుప్రతినుంచి ఫొటోస్టాట్ చేయబడ్డాయి]

# 53. ఎల్గిన్ ప్రభువుకు విజ్ఞప్తి

హిజ్ ఎక్స్‌లెన్సీ, ది రైటానరబుల్ యరల్ ఆఫ్ ఎల్గిన్, పి. సి., జి. యమ్. యస్. ఐ. జి. యమ్. ఐ. ఇ. వగైరా, వైస్రాయి అండ్ గవర్నరు జనరల్ ఆఫ్ ఇండియా, కలకత్తా. వారి చిత్తమునకు తెచ్చేది ఏమగా :

దక్షిణాఫ్రికాలో ఉంటున్న భారతీయుల తరఫున, వారి ప్రతినిధుల మైన మేము, దక్షిణాఫ్రికా రిపబ్లిక్‌లో రాణీగారి పౌరులైన భారతీయుల విషయమై ఈ విజ్ఞప్తిని చేసుకొంటున్నాము.

దాదాపు వెయ్యిమంది బ్రిటిష్ ఇండియనులు (భారతీయులు) సంతకాలుచేసి, ఇలాంటి విజ్ఞప్తినే ఒకదానిని కాలనీల సెక్రటరీ ఆఫ్ స్టేటు గారికి పంపుకున్నాము. అందులోని విషయాలనే మరల ఇక్కడ ఉదహరించడానికి బదులు ఆ పిటిషనుయొక్క ప్రతిని అనుబంధాలతో సహా ఇందుతో జతపరచి పంపుకుంటున్నాము. దానిని ప్రభువువారు చిత్తగించవలెనని కోరుతున్నాం.

తాము రాణీగారి ప్రతినిధిగా, యావద్భారత దేశానికీ ప్రత్యక్షంగా మహారాజై ఉన్నారు. కనుక మీ రక్షణను అర్థించడం చాలా అవసరమని, చాలా యోచనచేసిన పిమ్మట మేము ఈ నిర్ణయానికొచ్చాము. తాము దయయుంచి అటువంటి రక్షణ నివ్వకపోతే దక్షిణాఫ్రికా రిపబ్లిక్‌లోనూ, యావత్తు దక్షిణాఫ్రికాలోనూ కూడా భారతీయులు చాలా నిస్సహాయ స్థితిలో పడిపోతారు. ఎంతో చొరవగా ముందు కెడుతున్న దక్షిణాఫ్రికా భారతీయులను బలవంతంగా అచ్చటి ఆదిమవాసుల స్థితికి తీసుకొస్తారు. వారేమీ తప్పుచేయకుండానే ఇలాంటి బాధలకు లోనవుతున్నారు.

ఎవరైనా కాస్తంత తెలివైన పెద్దమనిషి దక్షిణాఫ్రికాను సందర్శించాడనుకోండి. దక్షిణాఫ్రికాలో స్థిరాస్థి సంపాదించుకోవడానికి

వీలులేని జాతివారున్నారనీ, వారు ప్యాసులు లేకుండా ఇష్ట మొచ్చినట్లు రాష్ట్రంలో తిరుగడానికి వీలులేదనీ, వారు వ్యాపారం కొరకు దేశంలో అడుగు పెట్టడంతోనే, ప్రత్యేకంగా మూడు పౌనుల పది షిల్లింగులు రుసుము చెల్లించి రిజిస్ట్రేషను చేయించుకోవాలనీ, వారికి వర్తకం చేసుకోవడానికి లైసన్సులు లభించవనీ, వర్తకం చేసుకోవడానికీ నివసించడానికీ కూడా వారికి త్వరలో పట్టణాలకు దూరంగా ప్రత్యేక స్థలాలను నిర్దేశింపబోతున్నారనీ, రాత్రి 9 గంటలు దాటిన పిమ్మట వారు ఇండ్లల్లోనుంచి బయటికి రాకూడదనీ ఆయనకు చెప్పి, అందుకు కారణాలూహించుకోమంటే ఆయనేమనుకుంటాడు? వీరు మోటుమనుష్యులు, అరాజకులు, రాష్ట్రానికీ సంఘానికీ కూడా ప్రమాదం తెచ్చిపెట్టే వారు కాబోలు నని అనుకోడా? అయినప్పటికీ పైన ఉదహరింపబడిన చిక్కులన్నిటితో సతమతమవుతున్న భారతీయులు గుండాలు కారనీ, అరాజకులు కారనీ, దక్షిణాఫ్రికాలోనూ ముఖ్యంగా ద. ఆ. రిపబ్లిక్‌లోనూ ఉంటున్న శాంతిప్రియులూ, చట్టబద్ధులూనని మేము మనవి చేస్తున్నాం.

జోహాన్సుబర్గులో, యూరోపియను జాతులకు చెందిన కొందరు బయలుదేరి నిజంగా సంఘానికి ప్రమాదం తెస్తున్నారు. వారి కోసమే ఇటీవల పోలీసుఫోజును పెంచవలసి వచ్చింది. రహస్యపు పోలీసుశాఖ వారికి, వారెక్కువ పని కల్పించారు. వారట్లుండగా భారతీయులు మాత్రం ప్రభుత్వానికి అలాంటి ఆత్రత నెన్నడూ కలుగచేయలేదు.

ఇందుకు ఋజువు కోసం, ప్రభువువారు దక్షిణాఫ్రికాలోని వార్తా పత్రికలను చిత్తగించవలెనని కోరుతున్నాం.

ప్రస్తుతం భారతీయులకు ప్రతికూలంగా ఆందోళన సాగిస్తూ వారి నీకడకు తెచ్చినవారు కూడా, భారతీయుల మీద అటువంటి ఆరోపణలను చేయాలనుకోలేదు.

భారతీయునకు సరియైన పారిశుద్ధ్యపు అలవాట్లు లేవనేదొకటే వారి మీద ఆరోపణ. రైటానరబుల్ రిప్పన్ ప్రభువుకు మేము పంపుకున్న విజ్ఞప్తిలో, అది సరియైనది కాదనీ, నిరాధారమైనదనీ నిర్దుష్టంగా ఋజువు చేశామని నమ్ముతున్నాం. అథవా ఆ ఆరోపణకు కొంత కారణమున్నదని వాదన కొరకు అంగీకరించి నప్పటికీ, భారతీయులను స్థిరాస్తి సంపాదించు

17*

కోకుండా నిషేధించడానికీ, రాజ్యంలో ఏ విధమైన ఆటంకాలు లేకుండా స్వేచ్ఛగా తిరుగకుండా చేయడానికీ, అది తగిన కారణం కాదని స్పష్టంగానే కనుబడుతోంది. భారతీయుల దగ్గరనుంచి ప్రత్యేకంగా 3 పౌనుల 10 షిల్లింగులు రుసుము వసూలు చేయడానికి అది తగిన కారణం కాజాలదు.

దక్షిణాఫ్రికా రిపబ్లిక్ ఈ విషయమై కొన్ని చట్టాలను చేసిందనీ, ఆరెంజి ఫ్రీస్టేటు ప్రధాన న్యాయమూర్తి అప్పుడే ఒక తీర్పు నిచ్చాడనీ, ఆ తీర్పును రాణీగారి ప్రభుత్వం అంగీకరించి తీరాలనీ ఎవరైనా అంటే అన వచ్చును.

ఇందులో జతపరచిన పిటీషనులో ఈ అభ్యంతరాలన్నిటికీ సరియైన జవాబు లివ్వబడినాయి. లండన్ పరిషత్తు, రాణీగారి బ్రిటీష్ పౌరులందరి హక్కులకూ ప్రత్యేక రక్షణల నిస్తున్నది. ఇది అందరూ అంగీకరించిన విషయమే. కన్వెన్షను (పరిషత్తు) నిర్ణయాలను అతిక్రమించడానికీ, మధ్య వర్తి నిర్ణయానికీ, రాణీగారి ప్రభుత్వం పారిశుద్ధ్య కారణాలవల్లనే అంగీక రించింది. పరిషత్తు నిర్ణయాలను అతిక్రమించడానికి ఆవిధంగా ఇవ్వబడిన అనుమతి, మీకు పూర్వమున్న రాజప్రతినిధితో సంప్రదించకుండానే ఇవ్వ బడిందని మాకు తెలియచేశారు. కనుక భారత ప్రభుత్వానికి సంబం ధించినంతవరకు ఆ అనుమతి వారిని బంధించదని మా మనవి. భారత ప్రభుత్వాన్ని సంప్రదించి యుండవలసినదని ప్రత్యేకించి చెప్పనక్కరలేదు. వ్యవహారం ఇంతవరకూ వచ్చాక, ఈ ఒక్క కారణం వల్లనే ప్రభువువారు ఈ విషయంలో జోక్యం కలిగించుకోవడానికి ఇష్టపడకపోతే, మిమ్ములను కలుగచేసుకోమని మేము కోరడానికి తగిన ఇతర కారణాలూ, మీరు మా కోరికనంగీకరించతగిన కారణాలూ లేకపోలేదు. రాణీగారి అనుమతి పొందడానికి చెప్పబడిన కారణాలు లోగడ ఎప్పుడూ లేవు. ఇప్పుడూ లేవు. నిజానికి రాణీగారి ప్రభుత్వానికి తప్పుడు విషయాలే నివేదింపబడినాయి.

ఇందులో నిబిడీకృతమైన సమస్యలు చాలా ముఖ్యమైనవి. సామ్రాజ్యాని కంతకూ సంబంధించినవి. పారిశుద్ధ్యం విషయంలో చేయ బడిన ఆరోపణలకు మేము మర్యాదగానే మా తీవ్రమైన అసమ్మతిని తెలియచెప్పేం కనుక, ద. ఆఫ్రికాలోని బ్రిటీష్ ఇండియన్ పౌరుల

కన్యాయం జరుగకుండా ఉండాలంటే, ఈ విషయమై సమగ్రమైన విచారణజరుగకుండా పరిష్కారం జరుగకూడదని మీకు విన్నవించు కుంటున్నాము.

మేము విశేషించి ప్రభువు వారి కాలహరణం చేయదలచుకోలేదు. ఇందుతో జతపరచిన కాగితాలను ఏకాగ్రతతో చిత్తగించమనే కోరు తున్నాం. ద. ఆఫ్రికాలో భారతీయ పౌరులకు ప్రభువువారు సంపూర్ణంగా రక్షణ ఇప్పిస్తారని ఆఖరుమాటగా వేడుకుంటున్నాము.

దాక్షిణ్యంతో ఈ న్యాయాన్ని దయచేయించినందుకు మీకు సర్వథా కృతజ్ఞులం వగైరా, వగైరా.

[అచ్చుప్రతి ఫోటో నుండి]

---

# 54. నేటాల్ కౌన్సిలుకు పిటీషను

[ఈ పిటీషను 1895 సం. రం. జూన్ 26 వ తేదీని *'ది నేటాల్ మెర్క్యురీ'* పత్రికలో ప్రచురించబడింది.]

డర్బాన్,
1895 సం. రం. జూన్ 26 తేదీకి ముందు.

గౌరవనీయులైన లెజిస్లేటివ్ కౌన్సిలు అధ్యక్షుల వారికి, సభ్యులకు.

నేటాల్ కాలనీలో నివసిస్తూ వ్యాపారం చేసుకుంటున్న ఈ దిగువ సంతకములు చేసినవారి విన్నపము.

మామనవి ఏమనగా :

కాలనీలో నివసిస్తున్న భారతీయుల తరపున, గౌరవనీయమైన కౌన్సిలువారి ఎదుట చర్చకు రానున్న ఇండియన్ ఇమిగ్రేషన్ సవరణ బిల్లు విషయంలో, ప్రస్తుతం అమలులో ఉన్న కంట్రాక్టు కూలీ పద్ధతికి సంబంధించి, కంట్రాక్టు అనంతరం కాలనీలో స్వేచ్ఛాళువైన పౌరుడుగా ఉండాలంటే ప్రతి సంవత్సరం మూడు పౌనుల రుసుము చెల్లించాలని, చేయబడుతున్న సవరణలను గురించి మేమీ విన్నపం చేసుకుంటున్నాము.

పైనచెప్పబడిన రెండు సవరణలున్నూ చాలా అన్యాయమనీ, అనవసరమనీ మేము సగౌరవంగా విన్నవించుకుంటున్నాము.

ఇండియాకువెళ్లి ఈ విషయాన్నిగురించి విచారణ చేసిరమ్మని పంపబడిన మెస్సర్సు బిన్సు అండ్ మేసన్‌గార్లు సమర్పించిన నివేదికలోని ఈ క్రింది భాగములను, గౌరవనీయమైన సభవారు చిత్తగించవలెనని కోరుతున్నాము :

కూలీలు వలసపోతున్న ఏ దేశంలోనూ కూడా రెండవసారి కూలీ కంట్రాక్టు అంగీకరింపబడడంలేదు. భారత ప్రభుత్వమువారిని

అంగీకారంకోసం అనేకసార్లు అడగడంజరిగినా అంగీకారం రాలేదు. కూలీ కంట్రాక్టు ముగిసినపిమ్మట తప్పకుండా వారిని వారిదేశం పంప డానికి అనుమతి కూడా ఇవ్వబడలేదు.

కనుక, ఈ బిల్లులోని క్లాజులు బ్రిటిష్ కాలనీలో అమలులో ఉన్న పద్ధతికి వ్యతిరేకంగా, అంతకన్నా అధ్వాన్నంగా ఉన్నాయని మేము మనవి చేస్తున్నాం.

కంట్రాక్టు కూలీగావచ్చే భారతీయునికి పనిలో చేరేటప్పుడు సగటు వయస్సు 25 అనుకుందాము. ఈ క్లాజు ప్రకారం అతడు పదిసంవత్సరాలు పనిచేయవలిసివస్తే, ఆతనికి జీవితంలో ఉత్తమభాగమంతా బానిసత్వంలోనే సరిపోతుంది.

పదిసంవత్సరాలపాటు వరుసగా కాలనీలో నివసించిన భారతీయుడు ఆపైన ఇండియాకు తిరిగివెళ్లడం కేవలం నిష్ప్రయోజనం. అటువంటి భార తీయుడు తన స్వదేశంలోనే పరాయివాడవుతాడు. ఇక్కడ వ్యాపారం వత్తిడి ఇప్పటికే ఎక్కువై పోయింది. అందుచేత పుష్కలంగా డబ్బు సంపా దించి పట్టుకుపోయి దానిమీద వడ్డీతో జీవించడానికి వీలులేదు.

పదిసంవత్సరాల్లో కంట్రాక్టు కూలీ చేసిన భారతీయుడు సంపాదించ గలిగే వేతనం 87 పౌనులు. అందులో 37 పౌనులు మాత్రం, 10 సంవత్స రాలకూ బట్టలకూ తదితర ఖర్చులకూ మినహాయిస్తే, ఆతడు ఆదాచేయగలిగి నది 50 పౌనులు. ఇండియావంటి బీద దేశంలో కూడా, ఆ మూలధనం మీద వచ్చే వడ్డీ, ఆతడు జీవించడానికి చాలదు. కనుక అటువంటి భారతీయుడు ఇండియాకు వెళ్లడానికి సాహసించినా, మళ్లీ కంట్రాక్టు కూలీగానే తిరిగి వస్తాడు. అందువల్ల ఆతడు యావజ్జీవం బానిసగానే ఉంటాడు.

అంతేకాకుండా అటువంటి భారతీయునికి కుటుంబం అనేది ఉన్నట్ల యితే వాళ్లను పూర్తిగా అశ్రద్ధచేస్తాడు. కుటుంబంగలవాడు 50 పౌనులను ఆదాచేయడం సాధ్యంకాదు. కంట్రాక్టుకూలీలుగా కుటుంబాలతో సహి తంగా వచ్చిన భారతీయులు ఏమీ ఆదాచేయలేకపోవడం మేము స్వయంగా ఎరుగుదుము.

మూడుపౌనులు లైసెన్సు రుసుము చెల్లించడం గూర్చిన రెండవ క్లాజు చాలా అంసతృప్తిని కలిగిస్తుందనీ, వారికి చాలా బాధకలుగచేస్తుం

దనీ, మేము విజ్ఞప్తి చేస్తున్నాము. రాణీగారి పౌరులలో కొందరిని మాత్రమే, అందులోనూ కాలనీకి చాలా ఉపయోగపడేవారిని మాత్రమే, ఈ విధంగా కేటాయించి ఈ పన్నును ఎందుకు విధించవలసి వచ్చినదో మేము అర్థం చేసుకోలేక పోతున్నామని మనవి చేసుకుంటున్నాము.

పదిసంవత్సరాలపాటు కాలనీలో బానిసతనం చేసిన పిమ్మట, స్వతంత్రంగా బ్రతుక దలచుకున్న మనిషిమీద భారంగా పన్ను వేయడం సాధారణ న్యాయ సిద్ధాంతాలకూ, ధర్మానికీ విరుద్ధమని సవినయంగా మీకు విన్నవించుకుంటున్నాము.

ఈ బిల్లు చట్టమైన తర్వాత కాలనీలోకొచ్చే భారతీయులకుమాత్రమే ఈ క్లాజులు వర్తిస్తాయనీ వారిక్కడికి రావడంలో ఉండే సాధక బాధకాలన్నీ వారు తెలుసుకునే వస్తారనీ చెప్పేమాట అసలు ఆక్లాజుల విషయంలో ఉండే అభ్యంతరాలను తొలగించడంలేదు. ఏమనగా కంట్రాక్టుచేసుకునే రెండు పార్టీలకూ ఒకే విధమైన స్వేచ్ఛలేదు. పేదరికంవల్ల బాధపడుతూ, కుటుంబాన్ని పోషించుకునే గత్యంతరంలేక కంట్రాక్టు కూలికి ఒడబడే భారతీయునికి స్వేచ్ఛ ఎక్కడున్నది ? తాత్కాలికంగా కలిగిన బాధల నుండి తప్పుకోవడానికి, ఇంతకన్న అధ్వాన్నమైన పనులుచేయడానికి అంగీకరించిన మనుష్యుల నెరుగుదుము. కనుక పైన చెప్పబడిన క్లాజులు గౌరవనీయమైన కౌన్సిలువారి ఆమోదమును పొందవని మేము ఆశిస్తున్నాం. ఇటువంటి న్యాయం దయచేసినందుకు మేము సర్వథా.................... ప్రార్థిస్తున్నాం.

(సం.) అబ్దుల్లా హాజీ ఆదం
ఇంకా చాలామంది భారతీయులు

[అచ్చువేసిన కాపీనుండి ఫోటో తీయబడినది.]

# 55. మిస్టర్ చాంబర్లేనుకు విజ్ఞప్తి

డర్బాన్,
ఆగష్టు 11, 1895.

మహారాణీగారి కాలనీల ప్రధానమంత్రి రైటానరబుల్ జోసెఫ్ చాంబర్లేను గారికి, లండన్.

నేటాల్ కాలనీలో నివసిస్తున్న ఈ దిగువ సంతకములు చేసిన భారతీయుల విజ్ఞప్తి.

మనవి ఏమనగా :

ప్రస్తుతం అమలులోనున్న కంట్రాక్టు కూలీ పద్ధతిని సవరిస్తూ, కాలనీలో స్వతంత్రంగా ఉండదలచిన భారతీయులు సంవత్సరానికి మూడు పౌనులు రుసుముచెల్లించి ప్రత్యేకమైన లైసన్సు తీసుకోవాలని, ఇండియన్ ఎమిగ్రేషన్ సవరణ చట్టాన్ని గౌ. నేటాలు లెజిస్లేటివ్ అసెంబ్లీవారునూ, కౌన్సిలువారున్నూ ఇటీవల ప్యాసుచేసి ఉన్నారు. ఆ సందర్భంలో మేము మీకీ విజ్ఞప్తిని దాఖలు చేసుకుంటున్నాము.

(2) పై చెప్పిన విషయానికి సంబంధించిన క్లాజులను ఆమోదించకుండా చేయాలని మేము సగౌరవంగా గౌ. శాసనసభలు రెండింటికిని విజ్ఞప్తులను పంపుకున్నాము. కాని ఫలితంలేకపోయిందని మనవి చేయవలసివచ్చినందుకు చింతిస్తున్నాము. మేము పంపుకున్న విజ్ఞప్తుల నకళ్ళను ఇందుతో జతపరచి పంపుకుంటున్నాము (అను. ఎ, బి.)

(3) ఈ విషయానికి సంబంధించిన క్లాజులు ఈ విధంగా ఉన్నాయి :

క్లాజు 2 : ఈ చట్టం అమలులో కొచ్చిన తేదీ నుండి, 1891 సం. రం. ఇండియన్ ఇమిగ్రేషన్ చట్టం 11 వ సెక్షన్‌లో ఉదహరింపబడిన బి., సి. షెడ్యూలు ప్రకారం భారతదేశంనుండి వలసవచ్చిన

వారు సంతకంచేయవలసిన ఖరారునామాలో వారిక్రింది షరతును చేర్చి సంతకంచేయాలి :

> కంట్రాక్టు పరిమితి ముగిసిన పిమ్మట కాని, తదితర విధంగా నిర్ణయింపబడినపుడుగాని మేము ఇండియాకు తిరిగి వెళ్ళిపోతాం. లేదా, నేటాలులోనే ఉంటే ఎప్పటికప్పుడు కూలీ కంట్రాక్టు వ్రాసుకుంటాం. ఈ కంట్రాక్టుకు ప్రతి సంవత్సరమూ, జీతాలు ఈ విధంగా ఉండడానికి నిర్ణయం. మొదటి సం. రం. నెలకు 16/—, రెండవ సం. రం. లో నెలకు 17/—, మూడవ సం. రం. నెలకు 18/—, నాల్గవ సం. రం. లో నెలకు 19/—, 5 వ సం. రం. లోనూ తరువాత సంవత్సరాలకు నెలకు 20/—.

క్లాజు 6 ఈ విధంగా ఉన్నది :

> ఈ చట్టంలోని రెండవ శెక్షన్ ప్రకారం కంట్రాక్టు వ్రాసుకున్న ప్రతి భారతీయ కంట్రాక్టు కూలీ ఇండియాకు తిరిగి వెళ్ళిపోవడానికి నిరాకరించినా, అలక్ష్యంచేసినా, లేక తిరిగి నేటాలులో కూలీ కంట్రాక్టులో ప్రవేశించడానికి నిరాకరించినా, అతడు కాలనీలో ఉన్నంతకాలం ప్రతి సంవత్సరం జిల్లా మేజస్ట్రేటు దగ్గరనుంచి లైసెన్సుపొందాలి. సదరు ప్యాసు లేక లైసెన్సుకు ప్రతి సంవత్సరమూ 3 పౌనుల రుసుము చెల్లించాలి. ఆ రుసుమును వసూలు చేయడానికి నియమించబడిన ఉద్యోగికాని, (క్లార్కు ఆఫ్ ది పీస్) మేజస్ట్రేటుగాని సదరు రుసుమును తక్షణ చర్యల నమలుజరిపి వసూలు చేయవచ్చును.

రెండవ క్లాజులో చెప్పబడిన 'బి' షెడ్యూలులో నౌఖరీ పరిమితికి సంబంధించినంతవరకు ఈ క్రింది విధంగా ఉన్నది :

> ..................నుండి నేటాలుకు వలసవచ్చిన ఈ దిగువ సంతకముచేసిన మేము, నేటాలులోని ఇండియన్ ఇమిగ్రెంట్ల రక్షకుడు నియమించిన యజమానులదగ్గర నౌఖరీచేయుటకు ఇందుమూలంగా అంగీకరిస్తున్నాం. మా పేర్లకు ఎదురుగా

ఉదహరింపబడిన జీతాలను, (అలవెన్సులను) భత్యాలను స్వీకరించడానికి నిర్ణయం.

4. మీ ఎదుటనున్న ఈ బిల్లు చట్టమైతే, కంట్రాక్టు కూలీగా వచ్చిన భారతీయుడు, మొదటి 5 సంవత్సరాలు కంట్రాక్టు నౌఖరీచేసిన తర్వాత, కాలనీలో నివసించదలచుకుంటే శాశ్వతంగా కంట్రాక్టు కూలీగా ఉండి పోవాలి. లేకపోతే సంవత్సరానికి 3 పౌనులు పన్ను చెల్లించాలని స్పష్టంగా తెలుస్తుంది. మేము పన్ను అనేమాటను ఉపయోగించాలనే ఉపయోగించాము. ఏమంటే కమిటీస్థాయి దాటకముందు అసలు బిల్లులో అమాటే ఉపయోగింపబడింది. పన్ను అనేమాట తీసేసి లైసెన్సు అనేమాట మార్చి నందువల్ల దానిలోఉండే చెడుగేమీ పోలేదని మేము మనవి చేస్తున్నాము. పైగా చట్టాన్ని రచించిన వారికి, కాలనీలో ఉన్న ఒక వర్గం ప్రజల మీద తాము తల పన్ను వేస్తున్నామనీ, అది బ్రిటిష్ న్యాయ సంప్రదాయానికి విరుద్ధమనీకూడా తెలుసుననే సంగతి ఇందువల్ల స్పష్టమవుతోంది.

5. కంట్రాక్టుకూలీ కాలపరిమితి 5 సంవత్సరాలనుండి అనంతంగా పొడిగించడం అమితమైన అన్యాయమని విజ్ఞప్తిదారులమైన మేము, సవినయంగానూ ఘంటాపథంగానూ మనవి చేసుకుంటున్నాము. ముఖ్యంగా భారతీయ కంట్రాక్టు కూలీలు పనిచేస్తుండే పరిశ్రమలకు అలాంటి రక్షణలేమీ అక్కరలేదు కనుక, ఈ చట్టం శుద్ధ అనవసరం.

6. 1894 సం. రం. లో, నేటాలు ప్రభుత్వం ఇండియాకు పంపిన విచారణ సంఘంవారి నివేదికే ఈ క్లాజులకంతకూ మూలకారణం. ఆ సంఘంలో మెసర్సు బిన్సు, అండ్ మేసన్ లిద్దరే ప్రతినిధులు. ఇటువంటి చట్టం చేయవలసిన కారణాలేమిటో వారు ఆ రిపోర్టులో ఉదహరించారు. 1894 సం.రం. తాలూకు, 'ప్రొటెక్టర్ అఫ్ ఇమిగ్రెంట్సు' వార్షిక నివేదికలో 20, 21 పేజీలలో వాటిని ప్రచురించారు. ఆ నివేదికలోనుంచి ఈ క్రింది భాగాలను ఉల్లేఖిస్తున్నాం :

> యూరోపియనుల జనాభా కన్నా, ఆదిమవాసుల జనాభా (నేటివ్ పాప్యులేషన్) చాలాఎక్కువగానున్న ఈ దేశంలో పరిమితం లేకుండా భారతీయులను స్థిరనివాసులు కానివ్వడం భావ్యంగా కనబడదు. కంట్రాక్టు కూలిపని ఆఖరవడంతోనే వారిని వారి ఇండియాకు వెళ్లిపోవాలని సాధారణంగా అందరూ కోరుతున్నారు.

ఇప్పటికప్పుడే దాదాపు 25 వేలమంది భారతీయులు స్వతంత్రంగా కాలనీలో స్థిరనివాస మేర్పరచుకున్నారు. అందులో చాలామంది తిరుగు ప్రయాణానికి స్టీమరు టిక్కట్టును పొందే హక్కును కూడా పోగొట్టుకున్నారు. వీరుకాక వర్తకంచేసుకునే బనియా జనాభా వేరుగా ఉన్నారు.

7. కనుక, ఈ ప్రత్యేకపు ఏర్పాట్లన్నిటికీ కారణం రాజకీయమే. నిజం చెప్పాలనొస్తే, జనంవత్తిడి సంగతి లేనే లేదని చెప్పాలి. కొత్తగా వెల్లడియైన దేశంలో, మనుష్యసంచారం లేకుండా, వ్యవసాయంలోకి రాని భూమి లెక్కలేనంత ఉన్నపుడు ఆ సమస్య అసలు ఉత్పన్నమేకాదు.

8. ఆ రిపోర్టులోనే డెలిగేట్లు ఇంకా ఇలా వ్రాశారు :

వర్తకంమినహా ఇతర పనిపాటలు చేయని అరబ్బుల గురించి, వ్యాపారస్థుల్లోనూ, దుకాణదారుల్లోనూ చాలా ద్వేషమున్నది. కాని వారందరూ బ్రిటీష్ పౌరులవడంచేతనూ, ఏ విధమైన (అగ్రిమెంటు) ఒడంబడిక లేకుండానే కాలనీలో ప్రవేశించారు కనుకనూ, ఎవ్వరూ వారి జోలికి పోకూడదనే సంగతి గుర్తింపబడింది.

* * * *

చెప్పుకోతగినంతగా 'కూలీ' యూరోపియనులతో పోటీకిరాడు. సముద్రతీర ప్రాంతంలోనే ఎక్కువగా తోటలున్నాయి. కూలీలూ నేటివులూ లేకపోతే ఇతర నౌఖరులు చాలా తక్కువ. కనుక అక్కడయూరోపియనులు వ్యవసాయపుపని చేయడం అసాధ్యం. ఇక్కడ స్థిరనివాస మేర్పరచుకున్న పనిపాటలుచేసే భారతీయులు, ఇంతవరకూ కాలనీకి చాలా ఉపయోగంగా ఉన్నారనే విషయంలో మేము నిశ్చితాభిప్రాయులమై ఉన్నప్పటికీ, భవిష్యత్తు విషయం బాగా ఆలోచిస్తే, అందులోనూ ద. ఆఫ్రికా ఆదిమవాసుల సమస్య ఇంకా పరిష్కారం కాకుండా ఉన్నప్పుడు, అందరితోపాటు మేము కూడా ఆందోళనపడుతున్నాము. కూలీల్లో చాలామంది ఓడల మీద తిరుగు ప్రయాణపు సౌకర్యాలను వినియోగించుకున్నట్లయితే, ఇంత ఆందోళన పడవలసిన అవసరం లేకపోయేది.

9. కాలనీలో భారతీయులను స్వతంత్రులుగా ఉండనివ్వకపోవడానికి చెప్పబడిన కారణాల్లో భాగమైన పైసంగతులు సరిగ్గా దానికి వ్యతి

రేకంగా ఋజువుచేస్తున్నాయి. భారతీయ వ్యాపారస్తులు (విజ్ఞప్తిదారులలో చాలామంది ఆవృత్తిలోనివారే) 'ఏవిధమైన ఒడంబడికా లేకుండానే కాలనీలో ప్రవేశించారు' కనుక వారిజోలికి పోవడానికి వీలులేకపోతే, కంట్రాక్టు కూలీకొచ్చినవారిజోలికి పోవడానికి అంతకన్నా వీలులేదు. ఏమంటే వారుకూడా అలాంటి బ్రిటిష్ పౌరులే. నిజానికి వారు కాలనీకి ఆహ్వానింపబడ్డారు. కమీషన్ డెలిగేట్ల భాషలో వారు ఇక్కడ స్థిరపడడం వల్ల 'కాలనీకి చాలా ఉపయోగమైనది'. కనుక కాలనీలోనివారి ప్రత్యేక సద్భావానికీ ఆదరణకు వారు బహుధా అర్హులు.

10. "చెప్పుకోదగినంతగా కూలీ యూరోపియనులతో పోటీకి రానప్పుడు" కంట్రాక్టు కూలీకొచ్చిన భారతీయులను, ప్రశాంతంగానూ నిజాయితీగానూ వారిపొట్ట వారు పోసుకోకుండా జీవితమసాధ్యమయ్యే పనులను చేయడంలో న్యాయమేమిటని మేమువినయంగా ప్రశ్నిస్తున్నాం. సంఘానికి ప్రమాదాన్ని తెచ్చిపెట్టే ప్రమాదకరమైన లక్షణాలేమీ ప్రత్యేకంగా వారిలో లేవనుట నిశ్చయమేకదా! శాంతి ప్రియత్వం, మెత్తదనం భారతజాతికి ప్రసిద్ధమైన లక్షణాలని ప్రతీతి ఉండనే ఉన్నది. అధికారులకు అణగి మణగి ఉండడంకూడా వారిప్రసిద్ధ లక్షణం. డెలిగేట్లు తమ నోటివెంట మరొకమాట చెప్పజాలరు. ప్రొటెక్టరుకూడా ఆ డెలిగేట్లలో ఒకడు. ఆయన తన రిపోర్టులో (పే. 15) ఇలా వ్రాశాడు :

> చాలామంది భారతీయులను జాతిమొత్తంగా నిరసిస్తుండడం నేనెరుగుదును. కాని వారు తమచుట్టూ కాస్తంతపరికిస్తే వందలాది భారతీయులు ప్రశాంతంగానూ, నిజాయితీగానూ, అనేక ఉపయుక్తమైన వృత్తులను చేసుకుంటూ కాలక్షేపం చేస్తుండడం చూడక మానరు.
>
> * * * *
>
> కాలనీలో స్థిరనివాసులైన భారతీయులు సాధారణంగా వ్యాపార విషయంలో ముందంజవేస్తూ, ధనార్జనచేసుకుంటూ, సంఘంలో చట్టబద్ధులుగా ఉంటూనే ఉన్నారని చెప్పగలుగుతున్నందుకు నాకు చాలా సంతోషంగా ఉన్నది.

11. గౌ. అటార్నీ జనరల్, బిల్లు రెండవసారి చర్చను ఉపక్రమిస్తూ ఈ విధంగా చెప్పినట్లు నివేదింపబడింది :

> ఏ పరిశ్రమకుగాని నష్టంకలిగేవిధంగా, కూలీలను ప్రవేశపెట్టే విషయంలో జోక్యం కలిగించుకునే ఉద్దేశంలేదు. కాని స్థానికంగా ఉండే పరిశ్రమలకు కూలీ సప్లయికోసమే భారతీయుల నిక్కడికి రప్పించాం కాని, వివిధరాష్ట్రాలలో నిర్మాణమౌతున్న ద. ఆఫ్రికా జాతిలో వారిని భాగస్థులుగా ఉంచే అభిప్రాయంతో కాదు.

12. పైన చెప్పబడిన విషయాలు, చర్చలోనున్న క్లాజులను పూర్తిగా ఖండిస్తున్నాయని, అటార్నీ జనరల్‌గారి నగౌరవపరచకుండానే మీకు మనవి చేసుకుంటున్నాము. కనుక బిల్లుకు అనుమతినిచ్చి రాణీగారి ప్రభుత్వం అటువంటి అభిప్రాయాలకు దోహదమివ్వదని మేము విశ్వసిస్తున్నాము.

13. మనుష్యులను శాశ్వతంగా బానిసత్వంలో ఉంచడానికి జరిపే ప్రయత్నాలకు దోహదమివ్వడం బ్రిటిష్ రాజ్యాంగ సిద్ధాంతాలకు భిన్నమని మేము భావిస్తున్నాము. బిల్లు ఆమోదింపబడినట్లయితే, అంతే జరుగుతుందని వేరే చెప్పనక్కరలేదని మనవి.

14. గవర్నమెంటువారి స్వంత పత్రికైన *'నేటాల్ మెర్క్యురీ'* 11—5—1895 తేదీ పత్రికలో బిల్లును ఈవిధంగా సమర్థించింది :

> న్యాయమైన కూలిచ్చి, కాలనీవారికి సహాయపడడానికి తీసుకు రాబడిన మనుష్యులు, కంట్రాక్టును భగ్నపరచి కాలనీవారికి పోటీదారులుగా ఉండడానికి ప్రభుత్వం ఎంతమాత్రమూ అంగీకరింపజాలదు. కాలనీవారికి సేవచేయడానికేతప్ప మరొకపనికి మరొకపరతుపైన వారిక్కడకు రాలేదు. ప్రభుత్వం మరొకలాగున చేసే యడల, మంచిచెడ్డలకు గల తేడాను నాశనం చేసినవారవుతారు. న్యాయం, ధర్మంలేదని చాటడమే అవుతుంది. నిష్పక్షపాతంగా ఆలోచిస్తే ఇందులో కాఠిన్యమేమీలేదు. అలాంటి కోరికాలేదు. దీనికెవ్వరూ చెప్పగల అభ్యంతరమూ ఉండకూడదు.

15. బాధ్యతగలవారిలో కూడా భారతీయులపట్ల ఎటువంటిద్వేషం ప్రబలిఉన్నదో చూపించడానికే పైసంగతులను ఉదహరించాము. కంట్రాక్టు

కాలంలో షరతుల ప్రకారం కూలిపనిచేసి, కంట్రాక్టు పూర్తియైన తర్వాత కూడా కూలిచేసి, పిమ్మట కొద్దిమంది కాలనీలో వ్యాపారం చేయడానికి సాహసించడమే ఈ ద్వేషానికంతకూ కారణం.

16. కాలనీయొక్క క్షేమాభివృద్ధులకు చాలా అవసరమని అంగీకరింపబడినవారిని, శాశ్వతంగా బానిసలుగా ఉండమనడంగాని, 9-5-1895 తేదీని 'నేటాల్ అడ్వర్టయిజరు' 'వ్రాసినట్లు సంవత్సరానికి 3 పౌనులు చొప్పున పన్ను చెల్లించి స్వాతంత్ర్యాన్ని కొనుక్కోమ'ని చెప్పడంకాని 'కఠినమూ అన్యాయమూ కాదని' చేయబడిన ప్రకటనను రాణీగారి ప్రభుత్వం అంగీకరించదని మేమురూఢిగా విశ్వసిస్తున్నాము.

17. ఆక్లాజులోని అన్యాయం ఎంత విస్పష్టంగా ఉన్నదంటే, భారతీయులకేమీ అనుకూలంకాని నేటాల్ అడ్వర్టయిజరు పత్రికవంటిదికూడా నొచ్చుకుని 16-5-1895 తేదీ పత్రికలో ఇలా వ్రాసింది :

> 'భారతదేశానికి వెళ్లిపోని భారతీయుడు ప్రభుత్వానికి ప్రతి సంవత్సరం పన్ను చెల్లించాలి' అని మొదట తయారుచేయబడిన బిల్లులో శిక్షానిర్ణయంచేసే క్లాజు ఉండినది. మంగళవారంనాడు అటార్నీ జనరల్ దానిని ఈ విధంగా మార్పుచేయవలెనని ప్రతిపాదించాడు : 'కాలనీలో ఉండడానికి ప్యాసుగాని లైసెన్సుగాని పొందవలెను.' అందుకు మూడురూపాయలు రుసుము చెల్లించాలి. ఇది నిశ్చయంగా మంచి మార్పే. చివరకు లభించే ఫలితం ఒకటే అయినా, కాస్తంత సున్నితమైన భాషలో చెప్పబడింది. కూలీలుగా ఉండదలచిన వారిమీద ప్రత్యేకమైనపన్ను విధించాలన్న సూచన, స్థూలంగా ఒక సమస్యను రేకెత్తిస్తున్నది. సామ్రాజ్యంలో అంత ర్భాగమైన దేశంలోనుంచి వచ్చే కూలీలమీద ఇటువంటి భారమొకటి వేస్తే, బ్రిటిష్ సామ్రాజ్యంతో సంబంధంలేని దేశాలనుండి వచ్చే యూరోపియనేతర జాతులవారైన చైనీయులు, అరబ్బులు, స్టేటు బయటనుంచివచ్చే కాఫిర్లు, ఇతర ప్రేక్షకులు మొదలైనవారికి కూడా ఈ రూలు వర్తింపచేయవలసి ఉంటుంది. ఒక్క కూలీలను మాత్రమే ఈ విధంగా బాధించి, మిగిలిన పరాయి దేశాలవారందరినీ ఏవిధమైన అనర్హతలులేకుండా స్వేచ్ఛగా ఉండనివ్వడం సమధర్మం కాదు. పరాయివారిమీద పన్ను వేయడం ప్రారంభమంటూ చేస్తే,

ముందు బ్రిటిష్ ఛాపుటా క్రిందలేని దేశస్థులతో ప్రారంభంకావాలి. మన కిష్టమున్నా లేకపోయినా మనవలెనే ఒకే చక్రవర్తి పాలనలో నున్న పౌరులతో ప్రారంభించకూడదు. ఇటువంటి ప్రత్యేకమైన అనర్హతలకులోను కావడానికి వారు ఆఖరున ఉండాలి కాని ముందుండ కూడదు."

18. ఈ ఏర్పాటు న్యాయబుద్ధి కలవారెవ్వరికీ నచ్చుబాటుకాలేదని మేము మనవిచేస్తున్నాం. కాలపరిమితిలేకుండా కంట్రాక్టు కూలీ పద్ధతిని పొడిగించడానికీ, లేక బలవంతంగా స్వదేశానికి పంపివేయడానికీ, నేటాల్ ప్రతినిధులు ఇండియా ప్రభుత్వందగ్గర ఏవిధంగా వాగ్దానం పొందగలిగేరో మాకు తెలియదు. కాని ఇందులో, విశదీకరించిన ప్రకారం కంట్రాక్టు కూలీలైన భారతీయుల వాదాన్ని రాణీగారి ప్రభుత్వమున్నూ, ఇండియా గవర్నమెంటువారున్నూ సంపూర్ణంగా పరిశీలిస్తారని మేము విశ్వసిస్తున్నాం. నేటాల్ డెలిగేషన్‌వారు పరోక్షంలో చెప్పినమాటల ఫలితంగా ఇచ్చిన ఆమోదం, కంట్రాక్టు కూలీలైన భారతీయులవాదాని కేవిధమైన ప్రతిబంధకం కలిగించదనికూడా మేము నమ్ముతున్నాము.

19. ఘనతవహించిన నేటాలు గవర్నరుగారికి, ఘనతవహించిన వైస్రాయి 1894 సం. రం. సెప్టెంబరు 17 వ తేదీని వ్రాసిన ఉత్తరంలోని ఈ క్రింది భాగాలను, తక్షణం విశదమయ్యేటందుకు ఉదహరిస్తున్నాము:

> ప్రస్తుతం అమలులో ఉన్న పద్ధతి, అనగా వలసపోయిన వ్యక్తి కంట్రాక్టుకూలీ పరిమితి ముగియడంతోనే, తన స్వంతపూచీమీద కాలనీలో నివాసమేర్పరచుకోవడానికి వీలుగా ఉండే పద్ధతి యథాతథంగా ఉండడమే నా అభిమతం. రాణీగారి పాలనలోనున్న పౌరులను, బ్రిటిష్ ఛాపుటాక్రిందనున్న ఏ కాలనీలోనైనా నివసించడానికి వీలులేకుండా చేయాలనే అభిప్రాయాలతో నాకేమాత్రమూ సానుభూతిలేదు. కాని కాలనీలో భారతీయ నివాసుల యెడల ప్రబలియున్న విద్వేషభావాన్ని గమనించి, 20-1-1894 తేదీని నేటాలు డెలిగేట్లు సమర్పించిన మెమోరాండంలోని, పై పేరాలో చెప్పబడిన సూచనలను (ఏ మొదలు యఫ్) వరకూ, ఈ క్రింది మార్పులతో అంగీకరించడానికి నేను సిద్ధంగా ఉన్నాను.

(ఏ) మొదట్లో (రిక్రూటు) తీసుకోబడినప్పుడే, కంట్రాక్టు పరిమితిలోపుగా కాని, వెంటనే కాని ఇండియాకు తిరిగి వెళ్ళిపోవాలని కంట్రాక్టులో షరతు ఉండాలి. ఆ షరతులమీదనే ఇంకొక పీరియడువరకు కంట్రాక్టు కూలీగా ఒడంబడిక వ్రాసుకుంటే తప్ప.

(బి) ఆ విధంగా తిరిగివెళ్ళిపోవడానికి నిరాకరించిన కూలీలను క్రిమినలు చట్టముల క్రింద నేరస్థులనుచేసి శిక్షించకూడదు.

(సి) రెండవసారి కంట్రాక్టు పరిమితి రెండు సంవత్సరములు మాత్రమే ఉండాలి. మొదటి కంట్రాక్టు పూర్తి అయిన తర్వాత, తరువాత మరల చేసుకోబడిన కంట్రాక్టులపరిమితి ముగిసినప్పుడు ఉచితంగా ఓడ ప్రయాణపు ఏర్పాట్లు చేయవలెను. ప్రస్తుతమున్న ఏర్పాట్లు రాణీగారి ప్రభుత్వం అంగీకారంతో నేను ఆమోదించడానికి సిద్ధంగా ఉన్నమార్పుల సారాంశం ఇది :

(మూలంలో ఈ సారాంశం ఇవ్వబడలేదు.)

20. డెలిగేట్లు చేసిన సూచనలను రాణీగారి ప్రభుత్వం ఇంతవరకూ అంగీకరించనందుకు మేము చాలా సంతోషిస్తున్నాము.

21. బలవంతంగా దేశానికి పంపివేయడానికీ లేక మరల కంట్రాక్టు కూలీలుగా చేయడానికీ ఆలోచన ప్రారంభమైనప్పుడే ఎంత అన్యాయంగా తోచినాయో, ఇంకా ఋజువు చేయడానికి, 1885 సం. రం. లో నేటాలులో సమావేశమైన ఇమిగ్రేషన్ కమీషన్ వారి ఎదుట ఇవ్వబడిన సాక్ష్యము నుంచీ, రిపోర్టునుంచీ ఈ క్రింది భాగాలను ఉల్లేఖిస్తున్నాం.

22. ఆకమీషనరులలో ఒకరైన జె. ఆర్. సాండర్సు తానుపంపిన అనుబంధ నివేదికలో తన అభిప్రాయాలను ఈ విధంగా ఘాటుగ్గా వ్యక్త పరిచాడు :

> భారతీయులను, నౌఖరీ కాలపరిమితి ముగిసిన తర్వాత, తిరిగి కంట్రాక్టు కూలీకి కుదరకపోతే, వారిని బలవంతంగా ఇండియాకు పంపేసేటందుకు చట్టంచేసే విషయంలో కమీషనువారు ఏ విధమైన శిఫార్సున్నూ చేసియుండకపోయినా, అటువంటి అభిప్రాయాన్ని చాలా తీవ్రంగా నేను ఖండిస్తున్నాను. ఈ రోజున అటు

వంటి చట్టాలు కావాలని కోరేవారు, దానివల్ల వచ్చే ఫలితాలేమిటో కొంచెం తెలుసుకుంటే, నాకన్న గట్టిగా వారు వాటిని ప్రతిఘటిస్తారని నా నమ్మకం. పూర్తిగా భారతీయుల వలసను ఆపెయ్యండి. అందువల్ల కలిగే ఫలితాలను ఎదుర్కోండి. అంతేకాని చాలా గొప్ప తప్పిదమని నేను ఋజువు చేయగలిగినపని మాత్రం చేయకండి.

నౌఖరులలోని మంచి అంతా అనుభవించి (మంచీ చెడ్డా కూడా) ఆ పైని వారనుభవించవలసిన పారితోషికాన్ని నిరాకరించడం తప్ప మరేమిటిది ? మన క్షేమంకోసం, వారు తమవయస్సులోని ఉత్తమభాగాన్ని ధార పోసినపిమ్మట వారిని పంపివెయ్యడమా ! (పంపివెయ్యగలిగితే, కాని పంపలేము). ఎక్కడికి ? వారు చిన్న వయస్సులో నుండగా ఎక్కడైతే లేమిచేత బాధపడి దానినుండి తప్పుకోడాని కిక్కడికి వచ్చారో అక్కడికేపోయి తిండి తిప్పలు లేకుండా బాధపడమనేనా ? షైలాకు లాగా పౌను మాంసమును పొందడానికి యత్నించి, చివరకు షైలాకు లాగే ప్రతిఫలాన్ని పొందుతాం.

మీరు కావాలాంటే భారతీయులను ఇక్కడికి రాకుండా పూర్తిగా ఆపెయ్యండి. ఇప్పటికే చాలాఇళ్ళు ఖాళీ అయిపోయి ఉన్నాయి. ఇవి చాలకపోతే ఇంకా ఇళ్ళల్లో ఉండే అరబ్బులను, భారతీయులను ఖాళీచేయండి. సగం జనమైనాలేని దేశంలో, ఎవరు ఉత్పత్తిశక్తినీ వినియోగశక్తినీ హెచ్చు చేస్తున్నారో వాళ్ళనే తరిమెయ్యండి. అందువల్ల ఈ ఒక్క విషయంలో ఏం జరుగుతుందో విచారిద్దాం. దానిని ఉదాహరణగా తీసుకుని మిగతా వాటి సంగతి చూచుకుందాం. ఇండ్లల్లో కాపురాలు లేకపోతే వాటి ధరలు ఏవిధంగా పడిపోతాయో ఆలోచించండి. అందువల్ల గృహనిర్మాణ పరిశ్రమ స్తంభించి పోతుంది. తత్ఫలితంగా ఆ పరిశ్రమకు సంబంధించినవస్తు సామగ్రి వ్యాపారం పడుకుంటుంది. దానివల్ల శ్వేతజాతుల వారైన మెకానికులకు పనిపాటులు తగ్గిపోతాయి. ఇంతమందికి కొనుగోలుశక్తి ఉడిగినపుడు ప్రభుత్వాదాయం పడిపోతుందనుకోక తప్పదు. అందువల్ల అదనపు పన్నులు విధించడమో సిబ్బందిని తగ్గించుకోవడమో లేక రెండూ చేసుకోవడమో తప్పదు. ఈ ఫలితాలను, ఇంకా

ఊహాకతీతమైన అనేక ఫలితాలను ఎదుర్కోవలసి వస్తుంది. అసూయ, జాత్యహంకారమనే అంధత్వం ప్రకోపించి నట్లయితే, కానివ్వండి. అనుభవిద్దాం. కాలనీలోనికి భారతీయులు రాకుండా చేయవలెనంటే చేయవచ్చును. బహుశా ఈ 'ప్రజారంజకత్వాన్ని' కాంక్షించేవారు కోరేవిధంగా కాకుండా, అంతకన్న సులువుగానూ, శాశ్వతంగానూ ఆపని చెయ్యవచ్చును. కాని నౌఖరీ చేయించుకుని వారిని గెంటెయ్యడం మాత్రం ఈ కాలనీ చేయలేదు. అటువంటి ప్రయత్నంచేసి కాలనీకి అప్రతిష్ట తేవద్దని నేను హెచ్చరిస్తున్నాను.

23. మాజీ లెజిస్లేటివ్ కౌన్సిలు మాజీ సభ్యుడు ప్రస్తుతం అటార్నీ జనరల్‌గా ఉంటున్నటువంటి (గౌ. మిస్టర్ ఎస్కోంబీ) కమీషను ఎదుట ఈ విధంగా సాక్ష్యమిచ్చి యున్నాడు. (పే. 177)

కంట్రాక్టు పరిమితికాలం అయిపోయిన భారతీయుల విషయంలో, దేశాంతరశిక్ష విధింపబడిన నేరస్థుని తప్ప, మరే మనిషినీ, నువ్వు ప్రపంచంలో ఫలానా భాగానికి వెళ్ళమని బలవంతం చేయడానికి వీలుందని నేను అనుకోవడంలేదు. ఈ విషయాన్ని గురించి నేను చాలా వింటున్నాను. నా అభిప్రాయాలన్నీ మార్చుకోవలసినదిగా నన్ను పదేపదే హెచ్చరించారు. కాని నేను మార్చుకోలేక పోతున్నాను. ఒక మనిషిని ఇక్కడికి తీసుకొచ్చారు. *అతని అంగీకారంతోనని సూత్రప్రాయంగా చెవుతున్నా వాస్తవంలోమాత్రం తరుచు అంగీకారం లేకుండానే తీసుకొస్తున్నాం.* (ఇటాలిక్సు విజ్ఞప్తిదారులవి) జీవితంలోని ఉత్తమ భాగమైన 5 ఏండ్లు మనకు అతడు సేవచేస్తాడు. పాతవాళ్ళందరినీ మరచిపోయి ఇక్కడ కొత్త అనుబంధాలను సంపాదించుకుంటాడు. ఒక చిన్న కొంపా సంసారమూ ఏర్పరచుకుంటాడు. అటువంటప్పుడు మంచీ చెడ్డా ఆలోచించిచూస్తే, నా అభిప్రాయ ప్రకారం అతనిని పంపివేయడానికి వీలులేదు. అంతకన్న భారతీయులను ఇకముందు ఇక్కడకు రాకుండా ఆపుచేయడం మంచిది. అంతేకాని వారిని రప్పించి వారిచేత చేయించుకోవలసిన నౌఖరీ చేయించుకొని, ఆపైని పొమ్మనడం తగనిపని. కాలనీలో, లేక కొన్ని భాగాల్లో, భారతీయులు కావాలనే అభిప్రాయమూ ఉన్నట్లున్నది. అయితే భారతీయుల ప్రవేశంవల్ల కలిగే ఫలితాలనుండి తప్పుకోవాలనికూడా

ఉన్నట్లు కనుబడుతుంది. నాకు తెలిసినంతవరకు భారతీయుల వల్ల ఏ విధమైన అపాయమూ కనబడదు. పైగా కొన్ని విషయా లలో వాళ్ళవల్ల చాలామేలు చేకూరుతోంది. 5 సంవత్సరాలు సత్ప్రవర్తనతో ఉండిన మనిషిని బయటికి పంపివేయడానికి సబబైన కారణమేమీ నా చెవిని పడలేదు. 5 ఏండ్లు సేవచేసిన భారతీయుని నేరస్థుడైతే తప్ప పోలీసు నిఘాలో ఉంచడం నా అభిప్రాయంకాదు. యూరోపియనులకంటె అరబ్బుల నెందుకు పోలీసు నిఘాలో ఉంచాలో నా కర్థం కావడంలేదు. కొందరు అరబ్బుల విషయంలో ఈ సంగతిమరీ అసహ్యాకరంగా కనుబడుతోంది. వారు ధనవంతులు. గొప్పవారైన బంధువర్గం కలవారు. వాళ్ళతో సరసంగా వ్యవ హరించగలిగితే వారితో వ్యాపారం చేయడం మంచిది.

24. పై విషయాలను తమచిత్తానికి తెచ్చేముందు, పది సంవత్సరాల క్రిందట పై అభిప్రాయాలను ప్రకటించిన పెద్ద మనిషే, ఇపుడు చర్చింప బడుతున్న బిల్లును ప్రవేశపెడుతున్నందుకు మా విచారమును తెలుపక తప్పదు.

25. భారతదేశానికి విధిగా తిరిగి వెళ్ళిపోవడమో, లేక మరల బానిసత్వాని కొడబడడమో, ఏదో ఒకదానికి భారతీయులు ఒడబడవలెనను బిల్లునకు ఇండియా ప్రభుత్వము అనుమతిని పొందేటందుకు మిస్టర్ మేసన్‌తో పాటు (డెలిగేటు) ప్రతినిధిగా ఇండియా వచ్చిన మిస్టర్ హెచ్. బిన్సు, కమీషను ఎదుట సాక్ష్యంలో తన అభిప్రాయాన్ని ఈవిధంగా వెలిబుచ్చేడు :

> కంట్రాక్టు కూలీ పరిమితి ముగియడంతోనే భారతీయుల నందరినీ తమ దేశానికి బలవంతంగా పంపెయ్యాలనే ఆలోచన చేయడం భారతీయ జనాభాకు చాలా అన్యాయం చేయడమని నా అభిప్రాయం. ఇండియా గవర్నమెంటు అందుకు ఎన్నడూ అంగీకరించదు. స్వతంత్రంగా బ్రతుకుతున్న భారతీయ జనాభా, సంఘానికి చాలా ఉపయోగకరమైన వర్గమని నా అభిప్రాయం. మామూలుగా మనం అనుకునే సంఖ్యకన్న వారిలో చాలా హెచ్చుమంది కాలనీలో నౌఖరీలలో, ముఖ్యంగా పట్టణాల్లోనూ గ్రామాల్లోనూ ఇండ్లల్లోనూ పనిచేస్తూ ఉన్నారు. స్వతంత్రులైన భారతీయ జనాభా లేనప్పుడు, పీటర్ మారిజ్‌బర్గు, డర్బాన్

పట్టణాల్లో పండ్లు, కూరగాయలు, చేపలు లభ్యమయ్యేవికావు. ఇప్పుడు అవన్నీ ధారాళంగా లభిస్తున్నాయి. యూరోపునుంచి వలసవచ్చిన వారెవ్వరూ కూరగాయల తోటలను పెంచాలని గాని, చేపలు పట్టి విక్రయించాలని కాని ఏవిధమైన అభిలాషా కనుపరచ లేదు. స్వతంత్రులైన భారతీయులే లేకపోతే పీటర్ మారిజ్‌బర్గు, డర్బాన్, పట్టణాల్లోని మార్కెట్లల్లో, పదేళ్ళక్రితం మాదిరిగానే ఏమీ దొరికేవి కావని నా అభిప్రాయం. (155–157 పే.)

26. ప్రస్తుతం ప్రధాన న్యాయమూర్తి, అప్పట్లో అటార్నీ జనరల్‌గా ఉంటూ ఈ అభిప్రాయాన్ని తెలియచేశాడు :

ఈ కాలనీలోనికి భారతీయులను ఏ చట్టాలక్రింద ప్రవేశ పెట్టేరో, వాటిని మార్చడానికి నే నభ్యంతర పెడుతున్నాను. ఇక్కడికి రావింపబడిన భారతీయులలో చాలామంది, కోస్తాప్రాంతాలలో తెల్లజాతులవారు చేయలేకపోయిన అనేకపనులను చేసి చాలవరకు మాటదక్కించారు. వారులేకపోతే సేద్యంకాకుండా ఉండిపోయే అనేక భూములలో, కాలనీలో నివసించేవారికి నిజంగా ఎక్కువ ఉపయోగంగా ఉండే పంటలను పండించారు. ఇండియాకు తిరిగిపోవడానికి ఉచితంగా ఇవ్వబడిన స్టీమరు టిక్కెట్టును ఉపయోగించుకోక పోవడంవల్ల, వారు నమ్మకస్థులైన తెలివైన, ఇంటి నౌఖర్లుగా ఉపయోగపడుతున్నారు. (పే. 327)

27. ఈ ఏర్పాటును గురించి, కాలనీలో చాలా ప్రముఖులైన వారి అభిప్రాయా లెట్లా ఉన్నాయో చూపడానికి ఆ నివేదికలో నుంచే ఇంకా చాలా భాగాలను ఉల్లేఖించడానికి సావకాశమున్నది.

28. మెస్సర్స్ బిన్స్ అండ్ మేసన్ రిపోర్టులోని ఈ క్రింది సంగతులను చిత్తగించవలెనని మేము కోరుతున్నాము :

ఇంతవరకు ఏ దేశానికి కూలీలు వలస వెళ్ళినా, రెండవ టరము కంట్రాక్టు కూలీ పద్ధతికి, అంగీకరించమని ఇండియా గవర్నమెంటువారిని ఎన్నిసారులు కోరినా వారు ఒప్పుకోలేదు. కంట్రాక్టు పరిమితి ఆఖరు కావడంతోనే తప్పని సరిగా ఇండియాకు వెళ్ళిపోవాలన్న షరతునుకూడా వారు ఆమోదించలేదు.

29. ఈ చట్టాలను సమర్థిస్తూ కాలనీలో చెప్పబడే మాటేమిటంటే ఏదైనా ఒకపని చేయడానికి అందుకు సంబంధించిన పార్టీ లిద్దరూ ఇచ్ఛికంగా ఒడంబడిక కుదుర్చుకుంటే, అందులో అన్యాయమేమీ లేదంటారు. నేటాలుకు వెళ్ళేటప్పుడు తామే పరిస్థితులలో అక్కడి కెడుతున్నారో భారతీయులకు ముందుగానే తెలుస్తుందని కూడా చెపుతారు. గౌ. లెజిస్లేటివ్ అసెంబ్లీ అండ్ కౌన్సిలు వారికి పంపుకున్న పిటీషనులలో ఈ విషయం చర్చింపబడింది. ఒడంబడిక చేసుకునే రెండు పక్షాలవారూ సమాన స్థాయిలో ఉన్నవారు కారుకాబట్టి, ఈ సూత్రం ఎంతమాత్రమూ వర్తించదని మేము మరొక్కసారి మనవి చేస్తున్నాం. మిస్టర్ సాండర్సు చెప్పినట్లు 'తిండిలేక మలమల మాడుతున్న స్థితినుండి తప్పుకోవడానికి' కంట్రాక్టు కూలికి కుదిరేమనిషిని స్వేచ్ఛాళువు అనడానికి వీలులేదు.

30. ఇటీవల 1894 సం. రం. లో కూడా, పైన చెప్పబడిన ప్రొటెక్టరు నివేదికలో భారతీయులు కాలనీలో ఉండితీరాలని వ్రాయబడింది. 15వ పేజీలో ఇలా ఉన్నది :

> కాలనీలోనున్న భారతీయ జనాభా నంతను కొద్దికాలం పాటైనా అక్కడినుంచి తప్పించ కలిగినట్లయితే,—ఏవో కొన్ని మినహా,—ఇప్పుడున్న పరిశ్రమలన్నీ, కేవలం నమ్మకమైన కార్మికులు దొరకని కారణంచేత, పడుకుంటాయనే విషయంలో నాకేమీ సందేహంలేదు. (ఆదిమవాసులు) నేటివులు సాధారణంగా పనిచేయరనే సంగతిని మరచిపోయి ప్రయోజనంలేదు. కనుక భారతీయ కూలీలు లేకపోతే ముఖ్యమైన పరిశ్రమలుగాని, వ్యవసాయంగాని జయప్రదంగా సాగదని కాలనీలోని వారంతా స్థూలంగా అంగీకరించే సంగతే. అంతేకాదు. నేటాల్‌లోని ఏ గృహస్థుకూ ఇంట్లో పనిచేసే వాడుండడు.

31. ఈ విషయంలో దాదాపు నిపుణులైనవారి అభిప్రాయాలన్నీ మొదటినుండి ఇప్పటివరకూ, ఇదేవిధంగా భారతీయుల ఉపయోగాన్ని చాటుతూనే ఉన్నాయి. అటువంటి జనాన్ని శాశ్వతంగా బానిసలుగానే ఉంచాలనడం కాని, వాళ్ళకు ఇచ్చుకునే సమర్థత ఉన్నదా లేదా అనే విచక్షణకూడా లేకుండా ఏటేటా 3 పౌనులు పన్ని చ్చుకోమనడం కాని చాలా అన్యాయమని మా మనవి. సున్నితంగా చెప్పవలసొస్తే పక్షపాతం, స్వార్థపరత్వం అని చెప్పాలి.

32. ఈ బిల్లుశాసనమే అయితే, ఇమిగ్రేషన్ యొక్క అభిప్రాయమే పోతుందనే సంగతి మేము మీదృష్టికి తెస్తున్నాము. భారతీయుల ఆర్థిక స్థితిని బాగుచేయడమే అంతిమలక్ష్యమైతే, వారిని శాశ్వతంగా బానిసత్వంలో పడవేయడంవలన ఆ లక్ష్యం నెరవేరదు. భారతదేశంలో జనాభా వత్తిడిగల ప్రాంతాలలో వత్తిడి తగ్గించడం అభిప్రాయమైతే అదీ సిద్ధించదు. ఏమంటే కాలనీలో భారతీయుల సంఖ్యను పెరుగనివ్వకూడదనే ఈ బిల్లు అభిప్రాయం. అసలుకోరిక ఏమంటే బానిసత్వపుబాధ భరించలేనివారిస్థానే క్రొత్తవారిని దిగుమతిచేయడం. ఆ పైని పాతవారిని బలవంతంగా ఇండియాకు పంపేయడం. మొదటిదానికన్న రెండవకోరిక చాలా అధ్వాన్నమైనదని మేము సవినయంగా మనవి చేసుకుంటున్నాము. ఏమంటే, జనాభా అధికంగా ఉన్న జిల్లాల ఒత్తిడిని తగ్గించడానికి నేటాలు సాధనంగా ఉపయోగపడదు. ఇక బలవంతంగా ఇండియాకు పంపబడినవారికి పనిదొరికే సావకాశం లేకనూ, జీవనానికి తగినంత పెట్టుబడి లేకపోవడంవల్లనూ, వారిని ప్రజల ద్రవ్యంతో భరించవలసొస్తుంది. అందుచేత వాళ్ళునిరంతరం, ఇండియాకు ఆత్రత కలిగించి బాధకలిగించినవారవుతారు. ఇందుకు జవాబుగా ఆలాంటిదెప్పుడూ జరుగదనీ, ఊహామాత్రమేననీ అంటారు. అనగా కాలనీలోని భారతీయులు సంతోషంగా ఏటేటా పన్ను కట్టేస్తారని అభిప్రాయం. కాని ఆవిధంగానే వాదించే యడల, నిజంగా తిరుగ కంట్రాక్టుకూలీ కంగీకరించడమూ, పన్నుకట్టడమూ అనే క్లాజులు వారి కోరిక చెల్లడానికి శుద్ధ అనవసరమని ఆ వాదన ఋజువు చేస్తుంది. ఈ బిల్లు ప్రవేశపెట్టి ఆదాయాన్ని వృద్ధిచేయడం లక్ష్యమని ఎన్నడూ చెప్పబడుండలేదు.

33. కాలనీ, భారతీయులను భరించలేని యడల, మా అభిప్రాయంలో ఇకముందునుంచి నేటాలు ఇమిగ్రేషన్ ఆపివేయడం ఒక్కటే మార్గం. అథవా తాత్కాలికంగానైనా ఆపేయాలి. ఏదో ఒకేపార్టీకి లాభదాయకమైన ఏర్పాటు, అందులోనూ ఎవరికదక్కరలేదో వారికే లాభించే ఏర్పాటుపట్ల గౌరవపురస్సరమైన మా తీవ్ర అసమ్మతిని ప్రకటిస్తున్నాం. ఆ విధంగా ఇమిగ్రేషన్ ఆపుచేసినందువల్ల జనాభా వత్తిడిగల భారత ప్రాంతముల కేమంతగా ఇబ్బంది కలుగదు.

34. ఇంతవరకు మేము కంట్రాక్టు కూలీ, లైసెన్సులకు సంబంధించిన క్లాజులను రెండింటినీ చర్చించాము. లైసెన్సుల విషయంలో పరాయి

రాష్ట్రమైన ట్రాన్సువాలులో కూడా వారంతటవారే స్వంతఖర్చులపైన అక్కడకెళ్లే భారతీయుల మీద ఏటేటా పన్ను విధించడానికి సాహసించ లేదు. ఒక్కసారే 3 పౌనుల 10 షిల్లింగులు రుసుము చెల్లించి లైసెన్సు తీసుకుంటే చాలు. దీని విషయంలోకూడా, తదితర విషయాలతోపాటు రాణీగారి ప్రభుత్వానికి విజ్ఞప్తి పంపబడిందని మాకు తెలిసింది. ఈ చట్ట ప్రకారం తీసుకోవలసిన లైసెన్సు, చాలా అసహ్యంగా ఏటేటా విధింపబడే పన్ను. ఈ పన్నును చెల్లించగలిగిన స్తోమతు ఉన్నదా లేదా అనే విచక్షణ లేకుండానే అందరూ చెల్లించాలి. ఎవరైనా భారతీయుడు ఈ పన్నుకు అభ్యంతర పెడితేగాని ఇవ్వకపోతేగాని ఏంచేస్తారని చర్చల సందర్భంలో ఒక శాసనసభ్యుడు అటార్నీ జనరలు నడిగేడు. అందుకు జవాబుగా గౌ. అటార్నీ జనరల్ పన్నివ్వని భారతీయుని ఇంట్లో అందుకు తగినంత సొత్తు దొరుకుతుందనీ, దానిని సూక్ష్మపద్ధతిలో జప్తుచేయవచ్చుననీ చెప్పేడు.

లైసెన్సు క్లాజును ప్రవేశపెట్టడం పైనచెప్పిన వైస్రాయి లేఖలో విశదీకరింపబడిన హద్దును అతిక్రమించడమేనని ఆఖరుమాటగా మేము నివేదించుకుంటున్నాం.

ముగించేముందు, ఇందు చర్చింపబడిన క్లాజులు శుద్ధ అన్యాయమైనవిగా రాణీగారి ప్రభుత్వం నిశ్చయిస్తారనీ, కనుక పైన చెప్పబడిన ఇండియన్ ఇమిగ్రేషన్ అమెండుమెంటు చట్టానికి అనుమతిని నిరాకరిస్తారనీ రూఢిగా మేము విశ్వసిస్తున్నాము. అందులకు ప్రార్థిస్తున్నాము. కాక, న్యాయప్రకారం మాకు జరుగవలసిన సదుపాయాలను చేయించగలందులకు కోరుతున్నాము.

దయతో ఈ విధంగా న్యాయం చేసినందులకు విజ్ఞప్తి దారులమైన మేము సర్వధా కృతజ్ఞులము........ ....వగైరా.

[అచ్చు కాపీ యొక్క ఫోటోనుండి.]

# 56. లార్డు ఎల్గిన్‌కు విన్నపం

డర్బాన్,
ఆగష్టు, 11, 1895.

హిస్ ఎక్సెలెన్సీ రైటానరబుల్ లార్డు ఎల్గిన్, వైస్రాయి అండ్ గవర్నరు జనరల్ ఆఫ్ ఇండియా, ఇన్ కౌన్సిల్ వారికి, కలకత్తా.

నేటాలు కాలనీలోని ఈ దిగువ సంతకములు చేసిన భారతీయుల విజ్ఞప్తి.

మా మనవి ఏమనగా,

గా. నేటాలు లెజిస్లేటివ్ అసెంబ్లీ వారున్నూ, కౌన్సిలువారున్నూ ఇటీవల ఆమోదించిన ఇండియన్ ఇమిగ్రేషన్ సవరణ బిల్లులోని కొన్ని క్లాజులను గురించి మేము మహారాణీ వారి ప్రభుత్వానికి పంపుకున్న విజ్ఞప్తిని తమరు చిత్తగించవలసినదని, మహారాణీగారి పాలితులమైన మేము మనవి చేసుకుంటున్నాము. సదరుకాపీని ఇందుతో జతపరచినాము. సదరు సవరణ చట్టము కొంతవరకు ప్రభువువారు, నేటాలు గవర్నరుకు పంపిన లేఖ (డిశ్పాచి) ననుసరించే ఉన్నది.

పై విజ్ఞప్తిని తమరు చిత్తగించవలసినదని కోరడమే కాకుండా, బిల్లును గురించి సగౌరవముగా మే మీదిగువ విషయాలను విన్నవించుకుంటున్నాము :

మీరు కంట్రాక్టు కూలీ విధాన పునరుద్ధరణ సిద్ధాంతానికే కాక బలవంతంగా ఇండియాకు పంపించివేయడానికీ అంగీకరించినట్లు తెలుసుకొని చాలా విచారించినాము.

నేటాలు డెలిగేట్లు ఇండియాకు బయలుదేరి వచ్చినపుడు, మేము మా ప్రతినిధులను పంపనందుకుకూడా విచారిస్తున్నాం. మేమలా పంపజాలనందుకు కలిగిన ప్రతిబంధకాలను ఇప్పుడు చర్చించి ప్రయోజనమేమీ లేదు. ఈ బిల్లు చట్టమైతే మాకు చాలా అన్యాయం, అక్రమం జరుగుతుంది. కనుక మేము సకాలంలో మా ప్రతినిధివర్గాన్ని పంపకపోవడంవల్ల మీరు న్యాయం చేయించడానికేమీ ఆటంకముండదని మేము ఆశిస్తున్నాము.

తప్పకుండా ఇండియాకు వెళ్లిపోవాలన్న షరతును అతిక్రమించి నపుడు క్రిమినల్ చర్యలు తీసుకోవడానికి సావకాశంలేనప్పుడు, అటువంటి క్లాజును కంట్రాక్టులో వ్రాసుకోవడం నిరుపయోగం. పైగా ప్రమాద కరం. కంట్రాక్టు వ్రాసినవారిలో దానిని అతిక్రమించాలనే వైఖరి వృద్ధి అవుతుంది. ఆ విధంగా వ్యతిక్రమణం జరుగుతుంటే చట్టం నిరుపయోగ మవుతుందని ప్రభువువారికి మేము మనవిచేస్తున్నాం. అటువంటి దండన షరతులవల్లనే, కంట్రాక్టులో అన్యాయమున్నట్లు స్ఫురిస్తుంది. ఏ కారణా లైనా ఇటువంటి క్లాజులను సమర్థించలేవు. అందులోనూ మీ అనుమతి కొరకు చెప్పబడిన కారణాలు ఏమీ సంతృప్తికరంగాలేవని మేము విన్న విస్తున్నాం.

అనుబంధములో సూచించిన ప్రకారం అభ్యంతర పెట్టబడిన క్లాజు లకు అనుమతించవద్దని మిమ్ములను మేము విధేయపూర్వకంగా ప్రార్థిస్తు న్నాం. మిస్టర్ జె. ఆర్. సాండర్సున్నూ, గౌ. మిస్టర్ ఎస్కోంబీ యున్నూ, గట్టిగా చెప్పినప్రకారం నేటాలుకు ఇమిగ్రేషన్ పూర్తిగా మాని పించండని కోరుతున్నాము.

రాణీగారి పౌరులలో కొందరు పేదవారైనంత మాత్రాన వారిని బానిసలుగాచేసి, వారిమీద ప్రత్యేకంగా తల పన్ను విధించి ఇదివరకే అటువంటి పేదపౌరులవలన, అపారంగా లబ్ధిపొందుతున్న కాలనీవారు ఇంకా వారి నెక్కువగా పీడించి ప్రతిఫలమివ్వ నక్కరలేకుండా ఎక్కువ పనిపుచ్చుకోవడానికి చేస్తున్న ప్రయత్నాలకు మా అసమ్మతిని తెలుపు తున్నాము. తప్పకుండా ఇండియాకు పంపెయ్యడమూ, తప్పితే తలపన్ను విధించడం వికారభావం కాక మరేమి? ఏమనగా కాలనీలో భారతీయుల జనాభా ఇప్పటికి మూడు రెట్లయినప్పటికీ ఏమంత కలవరపడనవసరం లేదని మాదృఢమైన విశ్వాసం.

ఇటువంటి విషయంలో కాలనీవారి అభిప్రాయమే ప్రభువు వారికి మార్గదర్శకం కాకూడదు. ఆ క్లాజులు భారతీయులపట్ల ఏ విధంగా వర్తిస్తాయోకూడా మీరు బాగా యోచించవలసి ఉంటుంది. ఈ క్లాజులు అంగీకరింపబడినట్లయితే, అందువలన నిస్సహాయులైన రాణీగారి భారతీయ పౌరులకు అపారమైన అన్యాయాన్ని, అపకారాన్ని చేయడమే అవుతుందని మీకు నిస్సందేహంగా విన్నవించుకుంటున్నాము.

5 ఏండ్లు బానిస కూలిపని చేయడమే కష్టమైన సంగతి. దానిని అపరిమితంచేయడమంటే, 3 పౌనులు తలపన్ను చెల్లించుకోలేని భారతీయుడు, ఇండియాకు వెళ్లిపోకపోతే శాశ్వతంగా బానిసగా పడుండాలన్న మాట. తన అవస్థను బాగుచేసుకోవడానికేమీ సావకాశంలేకుండా, తను కాపురముండే గుడిసెను మార్చి ఇల్లుకట్టుకోకుండా, చింకిగుడ్డలు మార్చి మంచి బట్టలుకొనుక్కోకుండా, రుచియైన భోజనంలేకుండా బానిసగానే ఉండాలన్న మాట. తన ఇష్ట ప్రకారం తనపిల్లలకు విద్యచెప్పించుకోడానికి వీలులేదు. కాస్తంత ఉల్లాసంగా తనభార్యను సంతోషపెట్టడానికి వీలులేదు. ఇంతకన్న, ఇండియాలో అర్ధాకలితో ఉన్నా, స్వేచ్ఛగానూ, తనలాగే బాధ పడుతుండే బంధుమిత్రులతోనూ కలసి ఉండడం మంచిది. అక్కడైతే తనస్థితిని మార్పుచేసుకోగలనని ఆశించవచ్చును. అందుకు సావకాశం లభించనూ వచ్చును. ఈ సందర్భంలో ఎన్నటికీ అలాంటి సావకాశమేమీ కనుబడదని విన్నవిస్తున్నాం. ఇమిగ్రేషనును (వలస పోవడానికి) ప్రోత్సాహపరచడం యొక్క అభిప్రాయమది కాదని మేము విశ్వాసంతో మనవి చేస్తున్నాం.

కనుక, కాలనీవారికి భారతీయుల వలన అక్కరలేకపోతే, మేమభ్యంతర పెట్టిన ఏర్పాట్లను అంగీకరించడంకంటే, ప్రభువువారు దయతో ఇక ముందునుంచి పూర్తిగా నేటాలుకు ఇమిగ్రేషన్ ఆపుచేయించవలెనని మేము తుదిమాటగా విన్నవించుకుంటున్నాము. కాకపోతే తాము న్యాయమని తోచిన ఇతర సౌకర్యములను ప్రసాదించవలెనని కోరుతున్నాం.

ఈ విధమైన న్యాయాన్ని దయచేయించినందులకు విజ్ఞప్తిదారులమైన మేము కృతజ్ఞులము..... ....వగైరా.

(సం.) అబ్దుల్ కరీం హాజీ ఆదం,
ఇంకా ఇతరులు.

[అచ్చు కాపీనుండి ఫోటో తీయబడినది.]

# 57. నేటాల్ ఇండియన్ కాంగ్రెస్ ప్రథమ నివేదిక

ఆగష్టు 1895.

## ప్రారంభం

1894 సం. రం. జూలై నెలలో నేటాలు లెజిస్లేటివ్ అసెంబ్లీలో, నేటాల్ ప్రభుత్వం వోటింగుహక్కు సవరణబిల్లును ప్రవేశపెట్టింది. ఆ బిల్లు కాలనీలో ఉన్న భారతీయుల ఉనికికి చాలా ప్రమాద భూయిష్టమైనదని అందరూ గుర్తించారు. ఆ బిల్లు ప్యాసుకాకుండా ఏవిధమైన చర్యలు తీసుకోవాలనే విషయాన్ని చర్చించడం కోసం దాదా అబ్దుల్లా కంపెనీవారి ఆవరణలో సమావేశాలు జరిగేయి. అసెంబ్లీవారికి, కౌన్సిలు వారికీ అర్జీలు దాఖలు చేయబడ్డాయి. దర్బాన్‌నుంచి పి. యం. బర్గుకు ఒక ప్రతినిధివెళ్లి ఆసభల్లోని సభ్యులను కలుసుకున్నాడు. ఏమైనా, బిల్లు రెండు సభలలోనూ ఆమోదింపబడింది. ఈ ఆందోళనవలన ఒక ఫలితం కలిగింది. కాలనీలో ప్రప్రథమంగా ఏర్పడిన బాధ్యతాయుత ప్రభుత్వంలో, భారతీయుల అభివృద్ధిని నిరోధించే శాసనాలను ఎదుర్కోవడానికీ, వారి ఆస్థిపాస్థులను రక్షించడానికీ, ఒక శాశ్వతమైన సంస్థ ఉండాలని అందరూ అంగీకరించారు.

దాదా అబ్దుల్లా కంపెనీవారి ఆవరణలో ముందుగా కొన్ని సమావేశాలు జరిగిన పిమ్మట, ఆగష్టు 22 వ తేదీని అత్యంత ఉత్సాహంతో, నేటాలు ఇండియన్ కాంగ్రెస్ యథావిధిగా ఏర్పాటు చేయబడింది. భారతీయులలో ముఖ్యులైన వారంతా అందులో చేరేరు. 76 గురు మొదటిరోజు సాయంకాలమే సభ్యులైనారు. సభ్యులపట్టీ క్రమక్రమంగా 228 వరకూ పెరిగింది. మిస్టర్ అబ్దుల్లా హాజీ ఆదం అధ్యక్షుడుగా ఎన్నికైనారు. ముఖ్యులైన ఇతర సభ్యులు ఉపాధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు. మిస్టర్ యం. కె. గాంధీ గౌరవ కార్యదర్శిగా ఎన్నికైనారు. ఒక చిన్న కార్యవర్గంకూడా ఏర్పాటుచేయబడింది. కాని కాంగ్రెసు ప్రారంభదశలో, మిగిలిన సభ్యులుకూడా సభలకు రావాలని కుతూహలపడిన కారణంచేత, కార్యవర్గం ఆచరణలో రద్దుచేయబడినది. సభ్యులందరూ సభలకు ఆహ్వానింపబడుతుండేవారు.

## ఆర్థిక స్థితి

కనీసపు నెలసరి చందా 5 షిల్లింగులు. హెచ్చు ఇచ్చేవారికి పరిమితి లేదు. ఇద్దరు మెంబర్లు నెలకు 2 పౌనులు చందా ఇచ్చారు. ఒకరు 25 షిల్లింగులు, పదిమంది 20 షిల్లింగులు, 25 మంది 10 షి., ముగ్గురు 7/6, ముగ్గురు 5/3, ఇద్దరు 5/1, 187 మంది 5/- చొప్పున నెలసరి చందా లిచ్చారు.

ఈ క్రిందిపట్టీ, వివిధవర్గాల చందాదారులు, వారిచ్చిన చందాలు, ఇవ్వవలసినబాకీలు కనుపరుస్తుంది.

| తరగతి | సంఖ్య | సంవత్సర చందా పౌ. షి. పె. | సంవత్సరంలో ఇచ్చినది | బాకీ |
|---|---|---|---|---|
| 40 | 2 | 48- 0-0 | పౌ. 48- 0-0 | — |
| 25 | 1 | 45- 0-0 | పౌ. 15- 0-0 | — |
| 20 | 10 | 120- 0-0 | పౌ. 93- 0-0 | పౌ. 27- 0-0 |
| 10 | 22 | 132- 0-0 | పౌ. 88- 5-0 | పౌ. 43-15-0 |
| 7/6 | 3 | 13-10-0 | పౌ. 8-12-6 | పౌ. 4-17-6 |
| 5/3 | 2 | 6- 6-0 | పౌ. 3- 8-3 | పౌ. 2-17-9 |
| 5/1 | 2 | 6- 2-0 | పౌ. 5- 6-9 | పౌ. 0-15-3 |
| 5 | 187 | 559-10-0 | పౌ. 273- 5-0 | పౌ. 286-15-0 |
| | 228 | 900- 8-0 | పౌ. 535-17-6 | పౌ. 366- 0-6 |

పై పట్టీని బట్టి రావలసిన పౌ. 900/8/-బదులు కాంగ్రెస్ 500పౌ. 17షి. 6 పెన్నీలను మాత్రమే వసూలు చేయగలిగింది. అనగా 59 శాతం. బాకీదారులలో 5 షిల్లింగుల చందాదారులు ఎక్కువ. అందుకు కారణాలు చాలా ఉన్నాయి. కొందరు చాలా ఆలస్యంగా చేరేరు. అందువల్ల సంవత్సరాని కంతకూ చందా ఇవ్వలేదు. చాలామంది ఇండియాకెళ్ళి పోయారు. కొందరు పేదరికంవల్ల ఇవ్వలేక మానేశారు. కాని ప్రబలమైన కారణం ఇవ్వడాని కిష్టంలేకనే అని చెప్పవలసి వచ్చినందుకు విచారిస్తున్నాం. కొందరు ముందుకొచ్చి శ్రద్ధపడితే మరొక 30 శాతం వసూలుచేయ వచ్చును. సాధారణ చందాలు బెన్నెటు కేసుకోసం ఇచ్చిన ప్రత్యేక

చందాలు, న్యూ కేసిల్ చార్లెస్ టౌన్ నుంచి వసూలైన చందాలు పట్టిక, ఈ క్రింద వివరించబడినాయి. (ఆ పట్టిక ప్రచురింపబడలేదు)

ఈ లిస్టు పూర్తిగా ఇవ్వడానికి కారణం, ఈ పేర్లు అచ్చులిస్టులో లేక పోవడంవల్లనే.

మొత్తం ఆదాయం ఇది :—

| | | పౌ. షి. పె. |
|---|---|---|
| నెలసరి చందాలు | .... | 535-17-6 |
| విరాళాలు .... | .... | 80-17-0 |
| మొత్తం | .... | 616-14-6 |

అచ్చులిస్టు ప్రకారమే పై మొత్తం కూర్చబడింది.

ఇప్పుడు బ్యాంకులో 598 పౌ. 19 షి. 11 పె. నిలవ ఉన్నది. రొఖం ఖర్చులు, అక్కౌంటు మార్పులు చేరిస్తేనే పై మొత్తమైనది.

రొఖం ఖర్చులు పౌ. 7. షి. 5 పె. 1. అక్కౌంటు మార్పు 10 పౌ. 10 షి. 8 పౌ. లు అందులో మిస్టర్ నాయుడుగారి కివ్వవలసిన అద్దె. అది చందా క్రింద జమకట్టబడింది. 2 పౌ. అబ్దుల్ ఖాదర్ ; 10 షి. మూసా ఆదం సేట్ అద్దెకు మించుమలె చందాగా జమకట్టుకున్నది.

| | | |
|---|---|---|
| కనుక | పౌ. | 598 — 19 — 11 |
| | పౌ. | 7 — 5 — 1 |
| | పౌ. | 10 — 10 — 0 |
| | పౌ. | 616 — 15 — 0 |

అచ్చు లిస్టుతో డిపాజిట్‌లను పోలిస్తే 6 పెన్నీలు తేడా కనుబడుతోంది. అది ముట్టినది కాని లిస్టులో చూపబడనందున ఆ తేడా వచ్చింది. ఏమనగా ఒక సభ్యుడు ఒకసారి 2 షి. 6 పె. లను మరొకసారి 3 షి. 10 పె. లను ఇచ్చాడు. 3 షిల్లింగులు లిస్టులో చూపడానికి వీలులేక పోయింది.

చెక్కులద్వారా పెట్టిన ఖర్చులు ఈ తేదివరకూ పౌ. 151 — 11 షి. 1½ పె. ఖర్చుల వివరాలు ఇందుతో జతపరుపబడినాయి. (అది ఈ గ్రంథంలో

అచ్చు వేయలేదు. బాకీలు ఇంకా పూర్తిగా తీర్చలేదు. ఇమిగ్రేషన్ పిటీషను ఖర్చులున్నూ ఈ దిగువచెప్పబడిన టిక్కెట్ల ఖర్చులున్నూ ఇంకా ఇందులో కలపలేదు.

చెక్కులను మార్చే విషయంలో నిబంధనలు తూ. చ. తప్పకుండా పాటింపబడినవి. గౌ. కార్యదర్శికి 5 పౌనులు లోపుగాఉండే చెక్కులను మార్చడానికి అధికార మున్నప్పటికీ, ఆ అధికారాన్ని ఎప్పుడూ విని యోగించలేదు. ఆయనతోపాటు, అబ్దుల్ కరీమున్నూ ఆయన హాజరు లేకపోతే, దొరసామి పిళ్ళె, పి. దావూజీ గార్లున్నూ, వారు లేకపోతే హుసేన్ కాశిమున్నూ సంతకాలు చేసేవారు.

## కాంగ్రెస్ కార్యకలాపం :
## కార్యక్రమం, కార్యకర్తలు, కష్టాలు.

ఆఖరు విషయం ముందు ఎత్తుకుందాం. కాంగ్రెస్ చాలా కష్టాలనే గడచింది. చందాలు వసూలు చేయడం చాల ప్రయాసైనపని అని త్వర లోనే తెలిసింది. అనేకసలహాలివ్వబడ్డాయికాని ఏ ఒకటీ పూర్తిగా నెరవేరిందనడానికి వీలులేదు. చివరకు కొందరు కార్యకర్తలు ఐచ్ఛి కంగా ముందుకొచ్చారు. వాళ్ళ కృషి ఫలితంగానే 448 పౌనుల నిల వైనా చూపించకలుగుతున్నాం. పార్సీ రుస్తుంజీ, అబ్దుల్ ఖాదిర్, అబ్దుల్ కరీం, దొరసామి, దావూజీ కథరాడా, రాన్ డేరీ, హుసేన్ కాసిం, పేరన్ మహమ్మద్, జి. హెచ్, మియాన్ ఖాన్, ఆమోద్ జీవా గార్లు ఎప్పుడో ఒకప్పుడు చందాలు వసూలు చేయడంకోసం కష్టపడినవారే. దాదాపు అందరూ, ఒకమాటు కాకుండా అనేకమారులు చందాల వసూలుకోసం బయలుదేరేరు. మిస్టర్ అబ్దుల్ ఖాదర్ స్వంతఖర్చులమీద పీటర్ మారిజ్ బర్గు వెళ్ళి దాదాపు 50 పౌనులు వసూలు చేసుకొచ్చారు. ఆయనాపనిచేసి ఉండకపోతే ఆ సొమ్ములో చాలాభాగం కాంగ్రెసుకు దక్కేదికాదు. మిస్టర్ అబ్దుల్ కరీం స్వంతఖర్చుమీద వెరులాంవరకూ సంచారంచేసి దాదాపు 25 పౌనులు వసూలు చేశారు.

చెక్కులు సంతకంచేసే విషయంలో ప్రముఖులైన సభ్యులలో అభిప్రాయభేదాలు బయలుదేరేయి. మొదట్లో చేయబడిన రూలుప్రకారం గౌరవ కార్యదర్శి సంతకము చేయడం, దానిమీద ఈ క్రిందివారిలో ఒకరు

మరల సంతకాలు చేయాలి: అబ్దుల్లా హెచ్. ఆదం, మూసాహాజీ కాశిం, దౌజీ మహోమ్మద్, హుసేన్ కాశిం, అబ్దుల్ ఖాదర్, దొరస్వామి పిళ్లేగార్లు. ఈ విషయంలో కలిగిన అభిప్రాయభేదంవల్ల కాంగ్రెస్ మొదటికే మోసం వచ్చేటంత భయం కలిగింది. కాని సభ్యులమంచితనంవల్ల, ఆలాటిప్రమాదంరాకుండా చేయాలని వారుపడ్డ తాపత్రయంవల్ల, ఆ మబ్బు విడిపోయింది. పైన చెప్పబడిన మార్పు ఏకగ్రీవంగా అంగీకరింపబడింది.

డర్బాన్‌లో కాంగ్రెస్ ఒక మాదిరిగా ఏర్పడినతర్వాత, దావూద్ మహమ్మద్, మూసాహాజీఆదం, మహమ్మద్ కాశింజీవా, పార్సీరుస్తుంజీ, పేరన్ మహమ్మద్ గార్లున్నూ గౌరవ కార్యదర్శిన్నీ, సభ్యులను చేర్పించ డానికి, స్వంత ఖర్చులమీద పీటర్ మారిస్‌బర్గు వెళ్లేరు. అక్కడ ఒక సభ ఏర్పాటు చేయబడింది. 48 మంది సభ్యులైనారు. రెండవసారి ఆలాంటి సమావేశమే వెరులాంలో జరిగి, 37 మంది సభ్యులైనారు. హుసేన్ కాశిం, పార్సీరుస్తుంజీ గార్లున్నూ గౌరవ కార్యదర్శియున్నూ అక్కడ కెళ్ళేరు. ఆమోద్ ఖాయత్, హాజీ మహోమ్మద్, కమరుద్దీన్‌గారలు పీటర్ మారిస్‌బర్గులోనూ, ఇబ్రాహీంమూసాజీ ఆమద్, ఆమద్‌మితర్, పి. నాయుడు గారలు వెరులాంలోనూ చాలా సహాయం చేశారు.

మిస్టర్ అమీరుద్దీన్ కాంగ్రెస్‌లో సభ్యుడు కాకపోయినా కాంగ్రెస్‌కెంతో అవసరమైన సహాయం చేశాడు. మిస్టర్ యన్ డీ. జోషీ దయతో గుజరాతీ నివేదికను సాఫుప్రతి వ్రాసి ఇచ్చారు.

కాంగ్రెస్ సంవత్సరం ప్రారంభంలో మిస్టర్ సోమసుందరం సభల్లో తర్జుమాచేసీ, కరపత్రాలు పంచిపెట్టీ సహాయపడ్డాడు. న్యూకేసిల్‌లోనూ. చార్లస్‌టౌన్‌లోనూకూడా కొంతపని జరిగింది. రెండవసంవత్సరం చందా దారులుగా చేరేరు.

మహమ్మద్ సిదాత్, సులేమాన్ ఇబ్రాహీం, మహమ్మద్ మీర్ గారలు న్యూకేసిల్‌లో చాలా పట్టుదలతో విసుగూ విరామం లేకుండా పని చేశారు. వారున్నూ మిస్టర్ దావూద్ ఆమ్లాయున్నూ స్వంత ఖర్చుల పైన చార్లస్‌టౌన్‌కూడా వెళ్ళేరు. చార్లస్‌టౌన్ ప్రజలు గొప్పగా సహాయపడ్డారు. ఒక్క గంటలో ఉన్నజనమంతా చందాదారు లైనారు. దిన్‌దార్, గులాంరసూల్, వందాగార్లు చాలా తోడ్పాటు

చేశారు. ఇంగ్లండులోనూ భారతదేశంలోనూ ఉన్న వారివారి మిత్రులకు ఓటింగుహక్కుల గురించి, హోం ప్రభుత్వానికి పంపుకున్న ట్రాన్సు వాల్ పిటీషన్ ఇమిగ్రేషన్ పిటీషనులగురించి దాదాపు వెయ్యి ఉత్తరాలు వ్రాయబడినాయి.

కంట్రాక్టు కూలీకి ప్రత్యామ్నాయంగా 3 పౌనుల తలపన్నును విధించే ఇమిగ్రేషన్ చట్టానికి ప్రతికూలంగా చాలా తీవ్రమైన ఆందోళన చేయబడింది. ఉభయ శాసనసభలకూ పిటీషనులు దాఖలు చేయబడినాయి.

ట్రాన్సువాల్ పిటీషన్ ప్రత్యక్షంగా కాంగ్రెస్ ఆధ్వర్యాన పంప బడక పోయినా, కాంగ్రెస్ పనిని సమీక్ష చేసేటప్పుడు ఉదహరింపక తప్పదు.

కాంగ్రెస్ లక్ష్యాన్ననుసరించి, ఉభయ శాసన సభలసభ్యులకున్నూ బహిరంగలేఖలు అందచేయబడ్డాయి. కాలనీలోనూ ద. ఆఫ్రికాలోనూ వాటిని విరివిగా పంచిపెట్టడమైనది. పత్రికలు వాటిని గురించి బాగా ప్రస్తావన చేశాయి. అందువలన చాలామంది సానుభూతియుతమైన ఉత్తరాలు వ్రాశారు. నేటాల్‌లోని భారతీయుల స్థితినిగురించి పత్రికలలో ఉత్తరాలుకూడా అప్పుడప్పుడు ప్రచురమైనాయి. పోస్టాఫీసులో యూరోపియనులు ప్రవేశించడానికొకగుమ్మం, నేటివులున్నూ ఆసియా వారున్నూ ప్రవేశించడానికింకొక గుమ్మం ఏర్పాటుచేయబడిన సందర్భంలో పూర్వపు అధ్యక్షుడు ప్రభుత్వంతో ఉత్తర ప్రత్యుత్తరాలను నడిపించారు.

ఫలితం మొత్తంమీద అసంతృప్తికరంగాలేదు. ఇప్పుడు మూడు జాతులవారికి వేర్వేరు గుమ్మాలు ఏర్పాటు చేయనున్నారు. కంట్రాక్టు కూలీలలోకూడా కొంతపని జరిగింది. బాలసుందరంపట్ల అతని యజమాని చెడ్డగా వ్యవహరించినపుడు, అతనిని మిస్టర్ అస్క్యూ దగ్గరకు మార్చడం జరిగింది.

రైల్వే డిపార్టుమెంటులోని కంట్రాక్టు కూలీల తరపున కూడా కాంగ్రెస్ కొంతజోక్యం కలుగజేసుకుంది. మొహరం పండుగ విషయం లోనూ, రాక్షసిబొగ్గుకు బదులు వంటచెఱకు సప్లయి చేయించడానికీ జోక్యం పుచ్చుకుంది. మేజస్ట్రీటు వారియెడల చాల సానుభూతిని చూపించాడు.

తూహీ కేసుకూడా చెప్పుకో దగినది. ఇస్మాయిల్ ఆమద్ టోపీని బహిరంగస్థలంలో బలవంతంగా లాక్కుని, ఇతరత్రా కూడా అగౌరవ పరిచారు. ఆ కేసులో తీర్పు ఆతని కనుకూలంగానే రికార్డు చేయబడింది.

ప్రసిద్ధికెక్కిన బెన్నెట్ కేసు విషయంలో కాంగ్రెసుకు చాలా ధనవ్యయమైంది. కాని ఆ సొమ్ముమాత్రం వృథా పోలేదని మా నమ్మకం. మేజిస్ట్రేటుకు వ్యతిరేకంగా మనకు తీర్పురాదని ముందుగా తెలుసున్న విషయమే. మిస్టర్ మోరెకాం అభిప్రాయానికి భిన్నంగా మనం కోర్టుకెళ్ళేం. ఏమైనా అందువలన మనస్థితేమిటో స్పష్టంగా తేలింది. భవిష్యత్తులో అలాంటి సంఘటన జరిగితే ఏమిచెయ్యాలో మనకు తెలిసింది.

భారతీయులవాదంపట్ల కాలనీలోని యూరోపియనులలో అంతగా సానుభూతి ఉత్పన్నం కాలేదు కాని ఇండియాలోనూ ఇంగ్లాండులోనూ చాలా సానుభూతి కలిగింది. *లండన్ టైమ్సు* పత్రిక, *టైమ్సు ఆఫ్ ఇండియా* పత్రికకూడా ద. ఆఫ్రికా భారతీయుల కేసును బాగా బలపరి చాయి. నేషనల్ కాంగ్రెస్ యొక్క బ్రిటిష్ కమిటీ చాలా ఉషారుగా పనిచేసింది. సర్. డబ్ల్యు. డబ్ల్యు హంటర్, మిష్టర్. యం. ఎ. వెబ్. గౌ. ఫిరోజ్ షా మెహతా, గౌ. ఫజల్ ఖాయ్, విశ్రామ్ మొదలైన వారి దగ్గరనుంచి సానుభూతి పూర్వకమైన ఉత్తరాలు వచ్చినాయి. భారతీయ పత్రికలు, ఇంగ్లీషు పత్రికలుకూడా మన ఫిర్యాదులను చాలా సాను కూలతతో సమీక్షించాయి.

యూరోపియనులలో మిస్టర్ అస్క్వ్యూ ఒక్కడే కాంగ్రెస్ సభలకు హాజరైనాడు. కాంగ్రెస్ ఇంకా బహిరంగంగా ప్రజలలో పడలేదు. శాశ్వతమైన ఉనికి ఏర్పడిన పిమ్మటనే బాగా వెల్లడిలోకి రావడం మంచిదని భావింపబడింది. అది మెల్లగా పనిచేసింది.

కాంగ్రెస్ చేసిన పనినిగూర్చిన సమీక్షను, పూర్వపు అధ్యక్షుడు ఇండియా కెడుతుంటే ఇచ్చిన వీడ్కోలు పత్రాన్ని గురించిన ప్రస్తావనతో ముగించడం సమంజసం.

## కాంగ్రెసుకు బహుమానాలు

ఇవి చాలానూ వివిధంగానూ ఉన్నాయి. ఇందులో మిస్టర్ పార్సీ రుస్తుంజీ అగ్రస్థానం వహిస్తారు. ఆయన 3 లాంతర్లు, టేబిల్ క్లాత్, గడియారం, వ్రాత సామగ్రి, పూలకుండీలు, సంవత్సరం పొడుగునా చమురు ఇచ్చాడు. ప్రతిమీటింగురోజునా సరిగా సమయానికి ఆయన తన స్వంత మనుష్యులను పంపి హాలు శుభ్రంచేయించి, దీపాలు వెలిగింప చేసేవాడు. 4 వేల కరపత్రాలనుకూడా సప్లయిచేశాడు. మిస్టర్ అబ్దుల్ కాదిర్ మెంబర్ల పట్టీని అచ్చు వేయించియిచ్చాడు.

మిస్టర్ సి. యం. జీవా ఉచితంగా రెండువేల కరపత్రాలను అచ్చువేయించాడు. అందుకు కాగితాన్ని కొంత మిస్టర్ హాజీ మహమ్మద్‌నూ, కొంత మిస్టర్ హుసేన్ కాశిమున్నూ భరించారు.

మిస్టర్ అబ్దుల్లా హాజీ ఆదం, తివాచీని, మిస్టర్ మేనక్జీ బల్లను బహుమానమిచ్చారు.

మిస్టర్ ప్రాగ్జీ ఖీంభాయీ వెయ్యి కవర్లనిచ్చాడు. గౌరవ కార్యదర్శి నిబంధనలను ఇంగ్లీషులోనూ, గుజరాతీలోనూ ఇండియాలో అచ్చువేయించి తెప్పించాడు. ప్రతి పదిహేనురోజులకు పంపేసర్క్యులరులకు పోష్టు బిళ్లలు, కాగితాలు వగైరా సప్లయిచేశాడు.

మెంబరు కాకపోయినా మిస్టర్ లారెన్సు చాలా ఉత్సాహంతో కరపత్రాలను పంచేవాడు.

## ఇతర విషయాలు

సభలకు హాజరైన వారిసంఖ్య చాలా తక్కువ. సమయానికిరాకపోవడం మరీ బాధాకరమైన విషయం. కాంగ్రెస్ కార్యకలాపాల్లో తమిళ సభ్యు లంతగా ఉత్సాహాన్ని చూపలేదు. అధమంవారు సభలకు సమయానికి హాజరైనా, పై లోపాన్ని పూరించిన వారవుతారు. చిన్న మొత్తాలు చందాలు చేయడానికి సులువుకోసం ఒక షిల్లింగు, 2 షిల్లింగులు, ఆరు పెన్నీల టిక్కెట్లను ఎ. హెచ్. ఆదం, అబ్దుల్ కాదిర్, డి. పిళ్లే, గౌరవ కార్యదర్శిగారలు సంతకాలుచేసి పంచిపెట్టేరు. కాని దాని ఫలితాలను ఇంకా అంచనా వేయడానికి సాధ్యపడడంలేదు.

బాగా ఉత్సాహంగా పనిచేసేవారికి ప్రోత్సాహం ఇవ్వడానికి, బహుమాన పతకాలివ్వాలని కూడా నిశ్చయింపబడింది. అవింకా తయారు కాలేదు.

## మరణము—ప్రయాణము

మిస్టర్ దిన్షా కొన్ని మాసముల క్రిందట చనిపోయినందుకు విచారం తెలుపుతున్నాం.

పదిమంది సభ్యులు ఇండియాకు వెళ్లిపోయారు. వారిలో పూర్వపు అధ్యక్షుల వారు కాక, హాజీ మహమ్మద్, హాజీ సులేమాన్, హాజీ దాదా, మేనగ్జీగార్లు చెప్పుకోవలసినవారు. ముత్తుకృష్ణ, రంజిత్‌సింగ్‌గార్లు రాజీనామాల నిచ్చారు.

20 మంది సభ్యులు అసలు చందానే ఎప్పుడూ ఇవ్వనందున వారు కాంగ్రెస్‌లో చేరనట్లే భావించుకొనవలసి ఉంటుంది.

## సలహాలు

ముఖ్యమైన సలహా ఒకటి. చందా ఎంతైనా, సంవత్సరానికంతకూ ముందుగానే వసూలు చేయాలి.

కొన్ని ఖర్చులు పెట్టడానికి కాంగ్రెస్ ఆమోదించినా, ఖర్చుమాత్రం జరుగకపోవడం గమనింపదగినది. చాలా నిర్దుష్టంగా పొదుపు పాటింపబడింది. కాంగ్రెస్‌ను బలమైన పునాదిమీద కట్టుకురావాలంటే అధమం రెండువేల పౌనులైనా అవసరం.

[సబర్మతీ సంగ్రహాలయం కాపీనుండి.]



# 58. భారతీయుల వోటింగుహక్కు

దర్బాన్,
సెప్టెంబరు 2, 1895.

నేటాల్ మెర్క్యురీ సంపాదకులకు,

అయ్యా,

దక్షిణాఫ్రికా భారతీయులను గురించిన కొన్ని వార్తలను పురస్కరించుకుని తాము వ్రాసిన సంపాదకీయములమీద కొంచెం వ్యాఖ్యానించడానికి సాహసిస్తున్నాను. ఇండియాదేశంలో భారతీయులు రాజకీయ హక్కుల ననుభవించడంలేదు కనుక, ఆ హక్కులను దక్షిణాఫ్రికాలో ఇవ్వడానికి ఇచ్చటి ప్రజలభ్యంతర పెడుతున్నారనీ, వారేహక్కుల నక్కడ పొందియున్నారో, వాటిని ఇక్కడ ఇవ్వడానికి ఏమీ అభ్యంతరంలేదనీ మీరు అనేకసారులు వ్రాశారు. కాని శాస్త్రప్రకారం ఇండియాలో భారతీయులు యూరోపియనులతోపాటు సమానమైన హక్కులనే అనుభవిస్తున్నారని ఇదివర కనేకసారులు నేను ఇతరచోట్ల చెప్పేను. ఇప్పుడుకూడా ఆ మాటే మళ్లీ చెపుతున్నాను. 1833 సం. రం. ఛార్టరున్నూ, 1858 సం. రం. ప్రకటనయున్నూ, రాణీగారి ఇతర పౌరులేహక్కులను, ప్రత్యేకతలను అనుభవిస్తున్నారో వాటినన్నిటిని భారతీయులకుకూడా హామీ ఇచ్చాయి. ఇటువంటి స్థితిగతుల్లో ఇతర పౌరులు ఏ హక్కుల ననుభవిస్తున్నారో వాటిని భారతీయులకుకూడా వర్తింపచేస్తే కాలనీలోని భారతీయులు పూర్తిగా సంతృప్తిపడతారు.

భారతదేశంలో యూరోపియనులు వోటు చేయడానికి సావకాశమున్నచోట భారతీయులమీద నిషేధమేమీలేదు. వారికి మ్యునిసిపల్ ఎన్నికలలో ఓటు చేయడానికి హక్కుంటే, వీరికి ఉన్నది. వారు లెజిస్లేటివ్ కౌన్సిలుకు వోట్లిచ్చి సభ్యులుకావడానికి సావకాశముంటే, వీరికీ అలాంటి సావకాశమున్నది. రాత్రివేళ 9 గంటలు దాటిన పిమ్మట యూరోపియనులు వీధులవెంట నడవడానికి వీలుంటే, భారతీయులకూ అలాంటి వీలుంది. యూరోపియనులంత స్వేచ్ఛగా భారతీయులు ఆయుధాలను మాత్రం దగ్గరుంచుకోవడానికి సావకాశంలేదు. ద. ఆఫ్రికాలోని భారతీయులుకూడా

ఆయుధాలు ధరించడానికేమీ అంతగా ఆత్రతపడడంలేదు. ఇండియాలో తలపన్ను లేదు. ఇటీవల ఇక్కడ ప్యాసుచేయబడిన ఇమిగ్రేషన్ చట్టానికి, దయచేసి, మీ అసమ్మతిని తెలియచేసి, నిస్సహాయులైన కంట్రాక్టుకూలీ భారతీయుల కృతజ్ఞతకు పాత్రులవుతారా ? రాజకీయ సమానత్వ సిద్ధాంతం వల్లనే మిస్టర్ నౌరోజీ పార్లమెంటు కామన్సు సభలో ప్రవేశించ కలిగేడు.

బ్రిటిష్‌వారి 'శక్తి వల్లనూ, ధనం వల్లనూ' ఈ కాలనీ నిర్మింపబడినది కనుక, భారతీయులకు సమాన హక్కులివ్వడానికి మీరు అభ్యంతర పెడుతున్నట్లయితే, మీరు జర్మనీవారికి ఫ్రెంచివారికి కూడా అభ్యంతర పెట్టాలి. ఆ సూత్ర ప్రకారం, ఆదిలో ఇక్కడకొచ్చి తమరక్తం ధారపోసినవారి సంతతివారు, ఇంగ్లండునుంచి వచ్చినజనం తమ్ములను బయటికి పంపినందుకు అభ్యంతర పెట్టవచ్చును. ఇటువంటి అభిప్రాయం స్వార్థంతోకూడిన సంకుచితత్వమే కదా ? అప్పుడప్పుడు మీ సంపాదకీయాల్లో దయారసంగల గొప్ప గొప్ప సద్భావాలను నేను చదివేను. భారతీయుల దురదృష్టమేమో కాని, భారతీయ విషయమొచ్చినపుడు మాత్రం యీ సద్భావాలనన్నిటినీ ప్రక్కకు నెట్టేస్తుంటారు. అయినప్పటికీ, మీ కిష్టమున్నా లేకపోయినా, భారతీయుడు మీతోటి పౌరుడే. ఇంగ్లాండు, భారతదేశాన్ని వదలిపెట్ట దలచుకోలేదు. కాని అంకుశం పుచ్చుకుని పరిపాలించాలనీ అభిప్రాయం లేదు. సుపరిపాలనవలన భారతీయుల ప్రేమను సంపాదించి, వారు మరొక పరిపాలనను కోరకుండా చేయాలనే తమ కోరికని, ఇంగ్లీషు రాజకీయ వేత్తలు చెపుతున్నారు. మీరు వెలిబుచ్చిన అభిప్రాయాలవంటి అభిప్రాయాలు, వారి కోరికకు భిన్నంకాదా ?

వెయ్యి పౌనులను సంపాదించుకుంటూ 50 పౌనులు సంపాద్యం కలవారి వలెనే జీవించే భారతీయులు చాలా అరుదు. బహుశా అసలు సంగతేమంటే, కాలనీలో వెయ్యి పౌనులు సాలుసరి ఆదాయంగల భారతీయుడొక్కడులేడు. కొందరి వర్తకంచూస్తే వారు పుట్లకొద్దీ ధనాన్ని సంపాదిస్తున్నారని అనుకునేటట్లు కనుబడుతుంది. వారి వ్యాపారమైతే నిశ్చయంగా పెద్దదే. కాని లాభంమాత్రం అంత ఉండదు. ఏమంటే దానిలో చాలామంది భాగస్వాములుంటారు. భారతీయునికి వ్యాపారమంటే చాలా ఇష్టం. తనకు గౌరవంగా జీవితం నడచిపోతుంటే, తన లాభాలను ఇతరులతో పంచుకోవడానికి సంకోచించడు. ఎక్కువ భాగమంతా తానే పుచ్చుకోవాలని పట్టుపట్టడు. యూరోపియనువలెనే, భారతీయుడుకూడా

తన డబ్బును ఖర్చుపెట్టేవాడేకాని, అంత నిర్లక్ష్యంగా మాత్రం కాదు. బొంబాయిలో బాగా డబ్బు సంపాదించిన ప్రతి వర్తకుడున్నూ బ్రహ్మాండమైన భవంతీలను కట్టుకున్నారు. మొంబాసాలో ఉన్న భవంతిఒక్కటీ భారతీయుడు కట్టుకున్నదే. జాంజిబారులో భారత వర్తకులు బాగా సంపాదించారు. కనుక వారు అక్కడ పెద్ద పెద్ద భవంతులను నిర్మించారు. కొందరు విలాసగృహాలుకూడా నిర్మించారు. డర్బాన్‌లోగాని దక్షిణ ఆఫ్రికాలో కాని వారీపనిచేయక పోవడానికి కారణం, అందుకు తగినంత సంపాదింపకపోవడమే. ఈ విషయాన్ని మీరింకా శ్రద్ధగా పరిశీలిస్తే, (ఇలా అన్నందుకు క్షమించండి) భారతీయులు ఈ కాలనీలో వీలైనంత ధారాళంగానే ఖర్చుపెడుతున్నారని తెలుసుకుంటారు. కాకపోతే, మొదటికి మోసం రాకుండా మాత్రం చూచుకుంటారు. బాగా సంపాదిస్తున్న వారు, తమ షాపుల్లోనే నేలమీద పడుకుంటారనడం, పొరబాటని చెప్పడానికి సాహసిస్తున్నాను. మీరు మీ పొరబాటును కొంచెం సవరించుకుని, కొన్ని గంటలపాటు సంపాదకీయ ఆసనాన్ని వదలివస్తే, నేను మీతోకూడాఉండి భారతీయుల దుకాణాలను చూపిస్తాను. బహుశా, అప్పుడు మీరు వారిని గురించి కొంచెం ఉదారంగా ఆలోచిస్తారనుకుంటాను.

బ్రిటిష్ కాలనీలకు భారతీయ సమస్య, కేవలం స్థానికమైనదే కాకుండా, సామ్రాజ్య ప్రాముఖ్యతగల విషయమని నా నమ్మకం. కనుక ఈ విషయంలో ఆగ్రహం తెచ్చుకోవడం కాని, ముందే కొన్ని అభిప్రాయాలను పెట్టుకుని వాటిని సమర్థించుకోడానికి అసలు సత్యాన్ని కప్పిపుచ్చడంకాని, ఈ సమస్య పరిష్కారానికి సరియైన సమాధానం కాజాలదు. రెండు జాతులవారికీ మధ్యగల భేదాలను ఇంకా ఎక్కువచేయడం కాలనీలో ఉన్న బాధ్యతగల ప్రముఖులకు ధర్మంకాదు. కాని వీలైనంతవరకు వారిని దగ్గరకు తీసుకురావడం వారి విధి. భారతీయులను కాలనీకి ఆహ్వానించి, పిమ్మట వారిని ఆడిపోయడం బాధ్యతగల కాలనీవాసులకు న్యాయమా? భారతీయ కూలీలను ప్రవేశపెట్టినందువల్ల కలిగే సహజ పరిణామాలనుండి వారెలా తప్పించుకుంటారు?

భవదీయుడు,
మో. క. గాంధీ.

[నేటాల్ మెర్క్యురీ, 5–9–1895.]

---

# 59. భారతీయులకు వోటింగుహక్కు

*[ద. ఆఫ్రికాలోని భారతీయులకు వోటింగు హక్కులనివ్వాలనే గాంధీజీ వాదనను ఖండిస్తూ, ఇండియాలో చాలా కాలము నివసించిన మిస్టర్ టి. మార్స్టన్ ఫ్రాన్సిస్ 6–8–1895 తేదీ నేటాల్ మెర్క్యురీ లో ఇలా వ్రాశాడు. ఇండియాలో భారతీయులు మ్యూనిసిపల్ ఎన్నికలలో వోటుచేయడానికీ, లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో మెంబర్లు కావడానికీ సావకాశమున్నప్పటికీ, యూరోపియనుల అభిప్రాయాన్ని త్రోసి వేయడానికిగాని, తాము సర్వాధిపత్యాన్ని వహించడానికి గాని వీలులేకుండానే ఆ సంస్థలు నిర్మాణం చేయబడినాయి. మ్యూనిసిపల్ చెయిర్మన్‌గా ఎప్పుడూ, సివిల్ సర్వీసు ఉద్యోగే ఉంటాడనీ, డివిజనల్ కమీషనరు, గవర్నరు, వైస్రాయి, ఇండియామంత్రి, అందరికన్న పైన బ్రిటిష్ పార్లమెంటు, ఇండియాలోని శాసనసభలను మ్యూనిసిపాలిటీలను అదుపులో ఉంచగలవనీ ఆయన వ్రాశాడు. దానికి గాంధీజీ ఈ క్రింది జవాబు వ్రాశాడు.]*

డర్బాన్,
సెప్టెంబరు 15, 1895.

నేటాలు మెర్క్యురీ సంపాదకులకు—

అయ్యా,

భారతీయ సమస్యను గురించి మిస్టర్ మార్స్టన్ ఫ్రాన్సిస్ వ్రాసిన లేఖకు జవాబుగా కొన్ని సంగతులు వ్రాయడానికి సాహసిస్తున్నాను.

భారతదేశంలో మ్యూనిసిపాలిటీలను గురించి, లెజిస్లేటివ్ కౌన్సిలులను గురించి మీ విలేఖరి వ్రాసిన వివరములు సరియైనవి కావని నా నమ్మకం. ఉదాహరణకు, ఇండియాలో మ్యూనిసిపల్ చెయిర్మన్, సివిల్ సర్వీసు అధికారిగా ఉండనక్కరలేదనుకుంటాను. ప్రస్తుతం బొంబాయి కార్పొరేషన్‌కు ప్రెసిడెంటుగా ఉన్నవారు భారతీయుడైన వకీలు.

వోటింగుహక్కులు ఇక్కడున్నంత విస్తృతంగా భారతదేశంలో ఉన్నవని నేనెన్నడూ చెప్పలేదు. ఇప్పుడుకూడా చెప్పదలచుకోలేదు. భారతదేశంలోని శాసనసభలు, ఇక్కడి లెజిస్లేటివ్ అసెంబ్లీ అంతటి ప్రాతినిధ్యం వహించియున్నవనికూడా నేననడంలేదు. అయినప్పటికీ, వోటింగు

హక్కులు ఎంత పరిమితమైనా, ఆ హక్కులు జాతిభేదాలు, రంగుభేదాలు లేకుండా అందరికీ సమానంగానే ఉన్నాయి. ప్రజా ప్రభుత్వమంటే ఏమిటో తెలుసుకోగలిగిన సమర్థత భారతదేశానికి ఉన్నదనే సత్యాన్ని అందరూ గుర్తించారన్న విషయమెవ్వరూ కాదనలేరు. నేటాలులోని వోటింగు హక్కులు ఇండియాలో లేవని మిస్టర్ ఫ్రాన్సిస్ చెప్పే విషయాన్నెవరూ కాదనరు. అదే పరీక్ష అయితే, యూరోపులోనుంచి వచ్చిన వారెవ్వరూ ఇక్కడ వోటింగుహక్కులకు అర్హులుకారు. ఏమనగా వివిధ యూరో పియను రాజ్యాలలో, ఇక్కడున్న వోటింగు అర్హతలు మాదిరిగా లేవనుట నిర్వివాదాంశము.

ప్రజా ప్రాతినిధ్య సిద్ధాంతాన్ని భారతీయులు బాగా అవగాహన చేసుకున్నారా లేదా అనే విషయంలో, ఆ పరీక్షలో భారతీయులెప్పుడూ కృతార్థులు కాకపోలేదని మరొక ఉదాహరణనిస్తున్నాను. ఈ వారం పోస్టులో వచ్చిన 'టైమ్సు' పత్రికలో 'భారత పరిస్థితులు' గురించి వ్రాయ బడిన వ్యాసంనుంచి ఈ క్రింది భాగాలను ఉల్లేఖిస్తున్నాను:

> భారతీయ సిపాయీల (నేటివ్ సోల్జర్సు) సాహసకార్యాము లను గుర్తించి, వారు మన తోటిపౌరులుగా ఉన్నందుకు మనం గర్వ పడుతున్నట్లయితే,........ అటువంటి ప్రమాద పరిస్థితులలో వారు తోటి వీరుల యడల కనుపరచిన భక్తివిశ్వాసములు మరింత శ్లాఘ నీయములు........ఒక విషయంలోనే కాకుండా అనేక విషయాల్లో భారతీయులు, మనతోటిపాటు ప్రతిభావంతులైన పౌరులుగా ఉండ డానికి సర్వవిధములా అర్హతలను సంపాదించుకుంటున్నారనే విషయం సత్యం. వివిధ జాతులమధ్య గౌరవమైన సమానత్వం పెంపొందించడానికి యుద్ధరంగ మెప్పుడూ సూక్ష్మమార్గం. అంత కన్న కఠినమైనట్టిన్నీ నెమ్మదియైనట్టిన్నీ పౌరజీవితంలోకూడా, భారతీయులు మన గౌరవానికి పాత్రులని వారు నిరూపించు కుంటున్నారు. మూడు సంవత్సరాలక్రిందట, కొంతవరకు ఎన్నిక పద్ధతిమీద, భారతదేశంలో శాసనసభలు విస్తృతం చేయబడినాయి. రాజ్యాంగ చట్టానుబద్ధమైన ప్రభుత్వ నిర్మాణం చేయడంలో ఇటు వంటి ప్రయోగాన్ని ఇదివరకు మన పాలనలో ఉన్న దేశాలలో ఎక్కడా చేసిఉండలేదు........... అక్కడ జరుగుతున్న చర్చలు చాలా సహాయభూతంగా ఉన్నాయి. బెంగాలుకు సంబంధించినంత

వరకూ, ఈ ప్రయోగం చాలా కష్టాలకు కారణమవుతుందని ఊహించబడింది కాని, చాలా కష్టంమీదట అక్కడకూడా జయప్రదమైనది.

దీనిని వ్రాసినవారు (సర్ డబ్ల్యు. డబ్ల్యు. హంటర్) భారతదేశంలో 30 సంవత్సరాలు ఉద్యోగంచేసిన ప్రసిద్ధ చరిత్రకారుడని అందరకూ తెలిసిన విషయమే. వోటింగు లేకుండా చేయడం చాలా చిన్న విషయమని కొందరు అనుకోవచ్చును. అందువల్ల భారతీయులకు కలిగే పరిణామాలను గురించి ఆలోచించడానికి కూడా భయంకరంగా కనుబడుతున్నాయి. అందువల్ల కాలనీలోని యూరోపియనుకు కలిగే లాభాలు పూజ్యం. కాకపోతే ఒకజాతిని, లేక దేశాన్ని అణగద్రొక్కేమనే సంతోషం పొందగలుగుతారేమో. 'తెల్లమనిషి పరిపాలనా లేక పసుపు మనిషి పరిపాలనా' అనే సమస్య లేదు. అటువంటి భయభ్రాంతులను పెట్టుకోవడానికేమీ కారణాలులేవని నేను ముందు ముందు ఋజువు చేయగలనని నమ్ముతున్నాను.

మిస్టర్ ఫ్రాన్సిస్ వ్రాసిన ఉత్తరంలో కొన్ని భాగాలు గమనిస్తే ఆయన ఇండియాను వదలిపెట్టి చాలా కాలమైనట్లు కనబడుతుంది. సివిల్ కమీషనరు ఉద్యోగంకంటే బాధ్యతగల ఉద్యోగాలు బహుకొద్దిగా ఉన్నాయి. అయినప్పటికీ, ఒక భారతీయునికి ఆ ఉద్యోగం ఇవ్వడంచాలా వివేకమని ఈ మధ్యనే ఇండియా మంత్రి (సెక్రటరీ ఆఫ్ స్టేటు) భావించాడు. ఇండియాలో ప్రధాన న్యాయమూర్తికెంత అధికారమున్నదో మిస్టర్ ఫ్రాన్సిస్‌కు తెలిసిన సంగతే. బెంగాలులోనూ, మద్రాసులోనూ, ఆ పదవిని భారతీయులు అలంకరించారు. బ్రిటిష్‌జాతిని భారతజాతిని 'అనురాగమనే పట్టుత్రాడుతో' బంధించాలనుకునేవారికి, ఈ రెండు జాతులు కలిసిమెలసి ఉండే స్థానాలు అగుపడడం కష్టంకాదు. ఈ రెండు జాతులవారి మూడు మతాలలోకూడా, పైకి ఒకదానికొకటి భిన్నంగా కనుబడినా, అన్నింటికీ సమానంగా ఉండే విషయాలు చాలా ఉన్నవి. మూడూ ఏకమైతే చెడుగేమీలేదు.

ఇట్లు
భవదీయుడు
మో. క. గాంధీ.

[*నేటాల్ మెర్క్యురీ*, 23 9-1895.]

---

# 60. ఇండియన్ కాంగ్రెస్

డర్బాన్
సెప్టెంబరు 23, 1895.

నేటాల్ అడ్వర్టయిజరు సంపాదకులకు —

అయ్యా,

శనివారంనాటి మీ పత్రికలో, 'ఇండియన్ కాంగ్రెస్' సరిగా చెప్పాలంటే 'నేటాల్ ఇండియన్ కాంగ్రెస్'ను గురించి మీరు వ్రాసిన సంగతులు కొంచెం తొందరపడి వ్రాయబడినవి. ఏమంటే ఆ పేరు ఉపయోగింపబడిన కేసు* ఇంకా పూర్తికాలేదు. కోర్టు ధిక్కార నేరానికి గురి అవుతాననే భయం లేకపోతే, ఈ కేసుకూ కాంగ్రెస్‌కూ ఏ పరిస్థితులలో సంబంధ మేర్పడిందో వివరంగా సంగతులు చెప్పిఉండేవాడిని. అందుచేత కేసు అయిపోయేవరకు ఆ సంగతులు తెలియచేయడం మానేస్తున్నాను.

ఈలోగా, మీరు వ్రాసిన విషయాలవల్ల ఏవిధమైన దురభిప్రాయాలూ కలుగకుండా, మీ అనుమతితో కాంగ్రెస్ లక్ష్యాలను విశదీకరిస్తాను. అవేమిటంటే :

"1. కాలనీలో నివసిస్తున్న భారతీయులకూ యూరోపియనులకూ మధ్య అన్యోన్య సుహృద్భావాన్ని పెంపొందించి ఒకరినొకరు బాగా అర్థంచేసుకునేటట్లు చేయడం.

---

* ఒక కొట్లాట కేసు విచారణలో భారతీయుని సాక్ష్యమివ్వకుండా, నేటాల్ ఇండియన్ కాంగ్రెస్ నాయకులు దిగతీశారని ఒక ఆరోపణ చేయబడింది. నేటాల్ ఇండియన్ కాంగ్రెస్ సభ్యుడైన పడయాచీ ఆ కేసులో ముద్దాయి. కాంగ్రెస్ నాయకులే ఆయనకు ప్రోత్సాహమిచ్చారని చెప్పబడింది. గాంధీజీ నాయకత్వాన ప్రభుత్వాన్నెదుర్కోడానికి కాంగ్రెస్ కుట్ర చేస్తోందనీ, భారతీయులైన కూలీలను తమకున్న కష్టాలనుగురించి ఆందోళన చేయమని ప్రోత్సహిస్తోందనీ, కూలీలకు వర్తకులకు సహాయం చేస్తానని వాగ్దానంచేసి వారిదగ్గరనుంచి గాంధీజీ ధనాన్ని వసూలుచేసి స్వంతానికి వాడుకుంటున్నాడనీ ఆరోపణలు చేయబడ్డాయి. గాంధీజీ కలోనియల్ సెక్రటరీకి 21వ అక్టోబరు 1895 తేదీని వ్రాసిన ఉత్తరం కూడా చూడనగును. పే. 306 మొ. 309.]

2. వార్తాపత్రికలద్వారా, కరపత్రముల ద్వారా, ఉపన్యాస మూలకంగా, భారతదేశమును గురించీ, భారతీయులను గురించీ సరియైన భోగట్టాను వ్యాప్తిచేయడం.

3. కాలనీలోని భారతీయులకు, ముఖ్యంగా ఇక్కడే జననమందిన వారికి, భారతదేశ చరిత్రను తెలియచెప్పుట, భారతదేశ విషయాలను పరిశీలించే అభిరుచి వారిలో కలిగించుట.

4. భారతీయులకు కలుగుతున్న ఇబ్బందులేమిటో తెలుసుకుని చట్టసమ్మతమైన మార్గముల ద్వారా వాటిని నివారించుటకు ఆందోళన చేయుట.

5. కంట్రాక్టు కూలీలుగాఉన్న భారతీయుల స్థితిగతులను విచారించి, వారికి ప్రత్యేకంగా కలుగుతున్న కష్టములను తొలగించుటకు సాయపడుట.

6. పేదవారికి, ఆర్తులైనవారికి వీలైనంత వరకు సహాయపడుట.

7. స్థూలంగా, భారతీయుల నైతిక సాంఘిక, వైజ్ఞానిక, రాజకీయ అభ్యుదయానికి, అవసరమైన కార్యాలను కొనసాగించుట.''

కాంగ్రెస్ నిబంధనల ప్రకారంగా, మొత్తం సంఘానికంతకూ సంబంధించినవైతే తప్ప కేవలం వ్యక్తుల కష్టనిష్ఠురాలలో జోక్యం కలిగించుకోవడానికి వీలేలేదు.

''ఇండియన్ కాంగ్రెస్' యొక్క ఉనికి యధాలాపంగా తెలుసుకోబడింది'' అని వ్రాయడం అందరూ ఎరిగిన, విషయానికి అనుగుణ్యంగా లేదు. 'నేటాల్ విట్‌నెస్' పత్రిక ఆ విషయాన్ని ప్రకటించింది. అందులోనుంచి గ్రహించి మీ పత్రికలో కూడా ఆవార్త ప్రచురింపబడినట్లే నాకు జ్ఞాపకం. ఇంతకుముందు కాంగ్రెస్ స్థాపనగురించి అధికారరీత్యా ప్రకటన చేయని మాట వాస్తవం. సంస్థాపకులకు దాని శాశ్వతమైన బ్రతుకునుగురించి ధైర్యం చిక్కకపోవడమే అందుకు కారణం. కాలక్రమేణా, దానంతటదే ప్రజల దృష్టిలోకి రావడం మంచిదని వారు భావించారు. దానిని రహస్యంగా ఉంచాలని ఏవిధమైన ప్రయత్నమూ చేయలేదు. పైగా, అందులో సభ్యులుగా చేరమనీ 15 రోజుల కొకసారి జరిగే సభలకు హాజరు

కమ్మనీ, సానుభూతి పరులైన కొందరు యూరోపియనులకు సంస్థాపకులు ఆహ్వానములు కూడా పంపినారు. ప్రైవేటుగా మాట్లాడుకునే మాటల్లో ఇందుగురించి కొందరు దురభిప్రాయాలను వెలిబుచ్చడంవల్లనూ, ఇప్పుడు మీరు బహిరంగంగానే (తెలియకనే అనుకుంటాను) దురభిప్రాయాన్ని వెల్లడి చేయడంవల్లనూ, పై సమాధానానికి అవసరం కలిగిందని భావిస్తున్నాను.

ఇట్లు
భవదీయుడు
మో. క. గాంధీ.
గౌరవ కార్యదర్శి, నేటాల్ ఇండియన్ కాంగ్రెస్.

షరా :

మీ ఎరుక నిమిత్తం, మా నిబంధనలు, మొదటి సంవత్సరం సభ్యుల పట్టి, ప్రథమ వార్షిక నివేదిక, ఇందుతో జతపరచినాను.

మో. క. గాం.

[*ది నేటాల్ అడ్వర్టయిజర్*, 21 9 1895]

# 61. ది ఇండియన్ కాంగ్రెస్

*సెప్టెంబరు **21,1895** తేదీని 'నేటాల్ మెర్క్యురీ' పత్రికలో 'హెచ్'అనే విలేకరి, ఒక మేజిస్ట్రేటు కచేరిలో తర్జుమాదారుగా ఉంటున్న ఒకానొక సివిల్ సర్వీసు ఉద్యోగి, కాంగ్రెస్ కార్యకలాపాలన్నిటికీ వెనుకనుండి తోడ్పడుతున్నాడనీ, ఆయనను అలాంటి తుంటరిపని చేయకుండా ఆపు చేయాలనీ కోరుతూ ఉత్తరం వ్రాశాడు. దానికి గాంధీజీ ఈ విధంగా సమాధాన మిచ్చాడు.*

డర్బాన్
సెప్టెంబరు 24, 1895.

*నేటాల్ మెర్క్యురీ* సంపాదకులకు

అయ్యా,

నేటాలు ఇండియన్ కాంగ్రెస్ యొక్క పుట్టుకను గురించీ, ఇతర విషయాల గురించీకూడా, మీ విలేకరి 'హెచ్'కి ఎవరో తప్పుడు భోగట్టా నిచ్చారని స్పష్టమవుతోంది. మిస్టర్ అబ్దుల్లాహాజీ ప్రయత్నాల వల్ల కాంగ్రెస్ ఏర్పాటుచేయబడింది. కాంగ్రెస్ మీటింగు లన్నిటికీ నేను హాజరైనాను. ప్రభుత్వోద్యోగి ఎవ్వరూ ఆ సభల్లో పాల్గొనలేదు. నిబంధనలు తయారుచేసిన బాధ్యత, అనేకములైన విజ్ఞప్తుల ముసాయిదాల తయారుచేసిన బాధ్యత సంపూర్ణంగా నాదే. అచ్చయి, కాంగ్రెస్ మెంబర్లకూ తదితరులకూ పంచిపెట్టడానికి సిద్ధంకాకపూర్వం, ఏ ప్రభుత్వోద్యోగికాని, ఆ విజ్ఞప్తులను కండ్లతో చూసైనా ఉండలేదు.

మో. క. గాంధీ.
గౌ. కార్యదర్శి,
నేటాల్ ఇండియన్ కాంగ్రెస్.

[*ది నేటాల్ మెర్క్యురీ*, 27-9-1895]

---

## 62. ది ఇండియన్ కాంగ్రెస్

*1895 సం.రం. సెప్టెంబరు 28వ తేదీని 'నేటాల్ మెర్క్యురీ' పత్రికలో, మరల 'హెచ్' ఒక ప్రభుత్వోద్యోగి కాంగ్రెస్‌ను రహస్యంగా నిర్మాణం చేశాడనీ, కార్యదర్శిగా పనిచేస్తున్నందుకు గాంధీజీకి సంవత్సరానికి 300 పౌనులు భృతి నిస్తున్నారనీ వ్రాశాడు. దానికి గాంధీజీ ఈ విధంగా బదులువ్రాశాడు:*

డర్బాన్
30 సెప్టెంబరు, 1895.

నేటాల్ మెర్క్యురీ సంపాదకులకు—

అయ్యా,

మీ శనివారంనాటి సంచికలో 'హెచ్' వ్రాసిన సంగతులు నా కొక్కడికి మాత్రమే సంబంధించి ఉన్నట్లయితే దానిని నేనంతగా గమనించి యుండేవాడినికాను. కాని ఆ ఉత్తరంలో ప్రభుత్వోద్యోగులకు సంబంధించిన విషయాలుండడంచేత నేను మిమ్మల్ని మరల శ్రమపెట్ట వలసి వచ్చింది. నేను కాంగ్రెసుకు జీతం పుచ్చుకునే కార్యదర్శినికాను. పైగా ఇతర సభ్యులందరితోపాటు నేనుకూడా శక్తివంచన లేకుండా దానికి చందా నిచ్చుకుంటున్నాను. కాంగ్రెస్ తరఫున నాకెవ్వరూ ఏమీ ఇవ్వరు. కొందరు భారతీయులు నాకు సంవత్సరం మొత్తంమీద గుత్త ఫీజు ఇస్తారు. దానిని తిన్నగా నాచేతికే ఇస్తారు. ఇందులో గుప్తంగా ఉంచవలసినదేమీ కాంగ్రెసుకు లేదు. అయితే కాంగ్రెసు స్వంతబూరా ఊదుకోదు. కాంగ్రెసును గురించి బహిరంగంగాకాని, ప్రైవేటుగాకాని ఎవరే సంజాయిషీ కోరినా, సాధ్యమైనంత త్వరలో ఇవ్వబడుతుంది. కాంగ్రెసు కార్యకలాపాలను గురించి తెలియచేసే కొన్ని కాగితాలను ఇందుతో జతపరచి పంపుతున్నాను.

భవదీయుడు
మో. క. గాంధీ,
గౌరవ కార్యదర్శి. నే. ఇం. కాం.

[*నేటాల్ మెర్క్యురీ*, 4–10–1895.]

## 63. నేటాల్ ఇండియన్ కాంగ్రెస్ కిచ్చిన ఉపన్యాసం

*[1895 సం. రం. అక్టోబరు 1 వ తేదీని, నేటాల్ ఇండియన్ కాంగ్రెస్ ఆధ్వర్యాన డర్బాన్‌లో రుస్తుంజీ భవనంలో జరిగిన భారతీయుల సమావేశంలో గాంధీజీ ఉపన్యసించాడు. సభకు 800, 1000 మంది హాజరైనారు.]*

మిస్టర్ గాంధీ సభలో చాలాసేపు ఉపన్యసించాడు. నేటాల్ ఇండియన్ కాంగ్రెస్ ఉనికి అందరికీ బాగా వెల్లడైనది కనుక, సభ్యులు సకాలంలో చందాలను చెల్లించడం చాలా అవసరమన్నాడు. చేతిలో 700 పౌనులున్నాయనీ, గత సమావేశంకన్న 100 పౌను లెక్కువైనాయనీ ఆయన చెప్పేడు. ఇంకా తమకు 4 వేల పౌనులు కావాలి కనుక ప్రతివారు ఏదో ఒక చందా మొత్తమును ఫలానా రోజుకి ఇస్తామని వాగ్దాన పత్రాన్ని సంతకం చేయమని ఆయనకోరేడు. నూరు పౌనుల సామానులను విక్రయించిన ప్రతి వర్తకుడూ 5 షిల్లింగులను కాంగ్రెస్ కివ్వవలెనని హెచ్చరించాడు.

ఇంతవరకు ఇంగ్లండులో తాముచేసిన ప్రయత్నాలు సఫలీకృతమైనాయనీ, ఇండియానుంచికూడా సత్ఫలితాలనాశిస్తున్నామనీ మిస్టర్ గాంధీ చెప్పేడు. బహుశా జనవరిలో తాను ఇండియాకు వెళ్లడం జరుగవచ్చనీ, అక్కడనున్న మంచి బారిష్టర్లను కొందరిని నేటాలు పంపడానికి ప్రయత్నిస్తాననీ ఆయన చెప్పేడు.

[*ది నేటాల్ అడ్వర్టయిజరు*, 2–10–1895.]

# 64. భారతీయ సమస్య

డర్బాన్,
అక్టోబరు 9, 1895.

*నేటాల్ అడ్వర్టయిజరు* పత్రిక సంపాదకులకు —

అయ్యా,

నిన్నటిరోజున మీ పత్రికలో వ్రాయబడిన సంపాదకీయము యొక్క మొత్తం ధోరణికి ఏ భారతీయుడూ అభ్యంతర పెట్టజాలడు. ఒక సాక్షిని దిగదీయడానికి కాంగ్రెస్ పరోక్షంగానైనా ప్రయత్నం చేసి ఉంటే, తప్పకుండా అది అణచివేయదగినదే. కాంగ్రెస్ అటువంటి ప్రయత్నాన్ని చేయలేదని మాత్రం మరొక్కసారి చెప్పి ప్రస్తుతానికి ఊరుకుంటాను. కాంగ్రెసును ఖండిస్తూ ఇవ్వబడిన తీర్పుమీద అప్పీలుచేయబడింది కనుక, అందులోని సాక్ష్యాన్ని గురించి విపులంగా చర్చించడానికి నాకు స్వేచ్ఛలేదని భావిస్తున్నాను. కాంగ్రెసునుగురించి ఒక్క సాక్షిని మాత్రమే ప్రశ్నించారు. ఆతడు ఈ కేసుకూ కాంగ్రెసుకూ ఏమీ సంబంధంలేదని చెప్పేడు. మనుష్యులు వ్యక్తిగతంగా చేసినపనులను, వారు సభ్యులుగా ఉన్న సంఘాలకు ఆపాదించడం మొదలుపెడితే, ఏ సంఘంమీదనైనా ఏ నేరాన్నైనా ఋజువు పరచవచ్చు ననుకుంటాను.

'ఒక భారతీయుని కొక వోటు'ను భారతీయులు కోరడంలేదు. కేవలం 'కూలీ'గా ఉన్న వారికి వోటిమ్మనీ కోరడంలేదు. ప్రస్తుతం అమలులో ఉన్న చట్ట ప్రకారంకూడా కేవలం కూలీగా ఉంటే వోటు హక్కులేదు. జాతిభేదం రంగుభేదం కనుపరుస్తున్నందుకే మా అసమ్మతి. ఈ సమస్యను అంతటినీ సమగ్రంగా ప్రశాంతంగా ఆలోచిస్తే ద్వేషానికిగాని, ఆగ్రహానికిగాని తావుండదు.

ప్రపంచంలో ఏ భాగంలోనూకూడా భారతీయులు రాజకీయాధిక్యతకోసం ప్రయత్నం చేయలేదు. చాలామంది భారతీయ జనాభా ఉన్న మారిషస్‌లోకూడా వారు రాజకీయ అధికారాలకోసం ఉబలాటపడలేదు. కనుక నేటాలులో వారి జనాభా 40 వేలనుంచి నాలుగులక్షలకు పెరిగినా వారలాంటి ప్రయత్నం చేయడం సాధ్యంకాదు.

భవదీయుడు,

మో. క. గాంధీ.

[*నేటాల్ అడ్వర్టయిజరు*, 10-10-1895.]



# 65. నేటాల్ ఇండియన్ కాంగ్రెస్

డర్బాన్,
అక్టోబరు 21, 1895.

గౌరవనీయులైన కలోనియల్ కార్యదర్శి గారికి—
పీటర్ మారిస్ బర్గు.

అయ్యా,

పత్రికలలో కొన్ని సంగతులు ప్రకటించబడడంవల్లనూ, డర్బాన్ రెసిడెంట్ మేజస్ట్రీటు కోర్టులో రంగస్వామి పడయాచీ మీద, రెగీనా దాఖలు చేసిన ఫిర్యాదులో ఇవ్వబడిన తీర్పులో వ్రాసిన సంగతులవల్లనూ, కాంగ్రెస్ గౌరవ కార్యదర్శి హోదాలో, నేనీ లేఖను మీకు వ్రాయవలసి వచ్చింది.

కాంగ్రెసు, ఆగష్టు నెలలో ఒకనాడు, అసగారా అనే భారతీయుని పిలిపించి, ఒకానొక కేసులో సాక్ష్యమివ్వవద్దని దిగదీయడానికి ప్రయత్నించిందనీ, అదొకకుట్ర అనీ ఏవేవో సంగతులు ఆ తీర్పులో వ్రాయబడినాయి.

కాంగ్రెస్, పైన చెప్పబడిన మనిషిని గాని మరే మనిషిని గాని సాక్ష్యమివ్వకుండా చేయాలనే ఉద్దేశ్యంతో పిలిపించలేదని నేను మనవి చేస్తున్నాను. తీర్పు ఇచ్చిన మేజస్ట్రీటు ఆ విధంగా వ్రాయడానికేమీ ఆధారాలు లేవనికూడా మనవి.

పై హంశాలు వ్రాయబడిన తీర్పుమీద అప్పీలు నడుస్తోంది. అందుచేత పత్రికలలో దానిని గురించి విపులంగా చర్చించడానికి నాకు వీలులేక పోయింది. దురదృష్టవశాత్తు, మేజస్ట్రీటు ఆ హంశాలను కేవలం నిరాధారంగా వ్రాసిన కారణంచేత, న్యాయమూర్తులు దానిని గురించి పూర్తిగా విచారించకపోవచ్చును. అసగారా సాక్షిపరీక్షలోనూ, క్రాసు పరీక్షలోనూ, రెండవసారి పరీక్షలోనూ కాంగ్రెస్‌ను గురించిన ప్రస్తావనే రాలేదు. రెండవసారి పరీక్ష అయిన పిమ్మట, మేజస్ట్రీటు సాక్షిని

కాంగ్రెసును గురించి ప్రశ్నించాడు. ఆ ప్రశ్నలవల్లా జవాబులవల్లా, ఏ వారంలో సాక్షిని భయపెట్టేరని చెప్పబడిందో ఆ వారంలో కాంగ్రెస్ సమావేశం జరుగనేలేదని స్పష్టమైంది. కాంగ్రెస్ మెంబర్లను ఆగష్టు 20 వ తేదీన జరుగబోయే మీటింగుకూ, 17 వ సెప్టెంబరు తేదీని జరుగబోయే మీటింగుకూ హాజరు కావలసినదిగా కోరుతూ 14 ఆగష్టు, 12 వ సెప్టెంబరు తేదీలలో పంపబడిన అచ్చునోటీసులు దాఖలు చేయబడినాయి.

సాక్షిని భయపెట్టేరన్న సంగతి, ఆగష్టు 12 వ తేదీని జరిగిందని ఆరోపణ. సాక్షిని ఆరోజున మూసా ఆఫీసుకు మహమ్మద్ కమరుద్దీన్ పిలిపించాడనీ, అప్పుడక్కడ యం. సి. కమరుద్దీన్, దాదా అబ్దుల్లా, దావూద్ మహమద్ ఇంకా ఇద్దరు ముగ్గురు కొత్తవారెవ్వరో ఉన్నారనీ చెప్పబడింది. ఇక్కడే సాక్షిని ఏవో ప్రశ్నించారనికూడా చెప్పబడింది. సాక్షి మూసా ఆఫీసులో కాంగ్రెస్ సమావేశాలు జరుగలేదని చెప్పినప్పటికీ, మూసా ఆఫీసులో జరిగే సభకు రమ్మని తనకు నోటీసు రాలేదని చెప్పినప్పటికీ, ఆ నోటీసుల ప్రకారం జరిగిన సభలకు తాను హాజరు కాలేదని చెప్పినప్పటికీ, కాంగ్రెసు సమావేశాలు కాంగ్రెసు హాలులోనే జరుగుతాయని చెప్పినప్పటికీ, తానే సభలకూ హాజరుకాలేదని చెప్పినప్పటికీ, దీనిని మేజిస్ట్రేటు కాంగ్రెస్‌కు అంటకట్టేడు.

మేజస్ట్రీటు అభిప్రాయానికి కొంచెం అనుకూలించే సంగతి ఒక్కటే. మూసా ఆఫీసులో ఉన్నారన్న ఆరు ఏడుగురులోనూ ముగ్గురు కాంగ్రెస్‌లో సభ్యులు.

సాక్ష్యంలోనుంచి ఈ విషయానికి సంబంధించిన భాగాలను ఇందుతో జతపరచి పంపుతున్నాను.

ఏదోవిధంగా మేజస్ట్రీటు పక్షపాతం వహించి ఉన్నాడని చెప్పడానికి సాహసిస్తున్నాను. పొన్నుసామి పాతర్ మీదా మరి ముగ్గురిమీదా పెట్టబడిన కేసులో, పిసరంత సాక్ష్యమైనా లేకుండా, ముద్దాయిలందరు కాంగ్రెసు మెంబర్లనీ, కాంగ్రెస్, వారికి మద్దతు చేస్తోందనీ తనతీర్పులో ఉదహరించాడు. వాస్తవంలో వారెవ్వరూ కాంగ్రెస్ సభ్యులు కారు. ఆ విషయంలో కాంగ్రెస్‌కేమీ సంబంధంలేదు. రంగసామి కేసులో మిస్టర్ మిల్లరుకు నేను సహాయంచేయడం చాలా విశేషంగా చెప్పబడింది. కనుకపొన్నుసామి

మీద, తదితరుల మీద మోపబడిన అభియోగంలో నా కసలేమీ సంబంధమే లేదని చెప్పవలసివచ్చింది. కేసు చాలాదూరం సాగి దాదాపు ఆఖరు దశ కొచ్చేవరకూ అలాంటికేసు జరుగుతున్నట్లుకూడా నాకు తెలియదు. ఒకే అపరాధానికి రెండవసారి ఛార్జి పెట్టబడినపుడు నా సహాయం కోరబడింది. అప్పుడుకూడా కాంగ్రెస్ గౌరవ కార్యదర్శిగా కాదు; లాయరుగా మాత్రమే.

కాలనీలో ఉండే రెండు జాతులకూ ఉపయోగంగా ఉండే సంస్థగా కాంగ్రెసును నిర్మాణంచేయవలెననే, సంస్థాపకుల ఉద్దేశ్యమని ప్రభుత్వానికి గట్టిగా చెప్పదలచుకున్నాను. తమకు సంబంధించిన సమస్యలపట్ల భారతీయుల అభిప్రాయాలను సరిగా తెలియచెప్పి ఇప్పుడున్న ప్రభుత్వానికి సహాయపడే సాధనంగానే కాంగ్రెస్ ఉపయోగపడాలని నిర్మాతల అభిప్రాయము. ప్రభుత్వాన్ని ఏవిధంగానూ ఇరుకుల్లో పెట్టడం వారిమతం కాదు.

అటువంటి అభిప్రాయాలు ఉండడంచేత, కాంగ్రెస్ ఉపయోగాన్ని భంగపరచే మాటలుచెప్పబడినపుడు వారు కట కట పడడం సహజం. కనుక, మేజస్ట్రీటు తీర్పులో వ్రాసినమాటలకు, ప్రభుత్వం ఏమాత్రమైనా విలువ నివ్వదలచుకుంటే, కాంగ్రెస్ యొక్క నిర్మాణాన్ని గురించి, దాని కార్యక్రమాన్ని గురించి, సమగ్రమైన విచారణ జరిపించే యడల, కాంగ్రెస్ మెంబర్లకు అంతకన్న సంతోషదాయకమైన విషయమింకొకటుండదు.

భారతీయులకూ భారతీయులకూ మధ్యవచ్చిన కోర్టు వ్యవహారాల్లో, ఇంతవరకు కాంగ్రెస్ ఏవిధమైన జోక్యమునూ కలుగచేసుకోలేదని నేను చెప్పగలను. జనానికందరికీ సంబంధించిన విషయం కాకపోతే, వ్యక్తిగతమైన కష్టాల్లో కలుగచేసుకోవడానికి నిరాకరించిందనికూడా చెప్పగలను. కాంగ్రెస్ తరఫున గాని, కాంగ్రెస్ పేరిట కాని ఏ ఒక్కసభ్యుడు గాని కొందరు సభ్యులుకాని, ఏ పనీచేయడానికి వీలులేదు. ఏపనిజరిగినా, గౌరవ కార్యదర్శి, రూల్సు ప్రకారం వ్రాతమూలకమైన నోటీసిచ్చి సమావేశం చేసిన కాంగ్రెస్ మీటింగులో అధిక సంఖ్యాకుల ఆమోదం పొందనిదే జరుగదు.

ఈ కేసు విషయంలో కాంగ్రెసుకు ఏవిధమైన జోక్యంలేదని ప్రభుత్వం సంతృప్తి పడినయెడల, ఆ సంగతిని బహిరంగంగా ప్రకటించవలసినదని, కాంగ్రెస్ తరఫున నేను సవినయంగా మనవిచేస్తున్నాను. అలా కాకుండా ఈ విషయంలో ఏవిధమైన సంశయమున్నా, సమగ్రమైన విచారణ జరిపించమని కోరడానికి వెనుతీయడంలేదు.

కాంగ్రెస్ నిబంధనలను, 22 వ ఆగష్టు తేదీతో ఆఖరయ్యే సంవత్సరం తాలూకు సభ్యుల జాబితాను, ప్రథమ వార్షిక నివేదికను ఒక్కొక్క ప్రతిని ఇందుతో పంపుకుంటున్నాను.

ఇంకా మీకే భోగట్టా కావలసినా నేను సంతోషంతో అందచేయగలను.

భవదీయుడు వగైరా
(సం.) మో. క. గాంధీ,
గౌరవకార్యదర్శి,
నేటాల్ ఇండియన్ కాంగ్రెస్.

నేటాల్ గవర్నరు, రాణీగారి కాలనీల ప్రధాన కార్యదర్శికి 30—12—1895 తేదీని పంపిన 128 నెం. లేఖకు ఒకటవ అనుబంధం.

[కలోనియల్ ఆఫీసు రికార్డులు 179 నెం. వాల్యూం 192.]

# 66. మిస్టర్ చాంబర్లేనుకు విజ్ఞప్తి

రైటానరబుల్ జోసెఫ్ చేంబర్లేన్, హెర్ మేజస్టీస్ ప్రిన్సిపల్ సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఫర్ కాలనీస్, లండన్.

దక్షిణాఫ్రికా రిపబ్లిక్‌లో నివసిస్తున్న బ్రిటీష్ ఇండియన్ పౌరులవిజ్ఞప్తి.

మామనవి ఏమనగా :

దక్షిణాఫ్రికా రిపబ్లిక్‌లోని నేటాల్ లెజిస్లేటివ్ అసెంబ్లీవారు, 7—10—1895 తేదీని ఆమోదించిన తీర్మానమును గురించి, ద. ఆఫ్రికా భారతీయుల ప్రతినిధులమైన మేము రాణీగారి ప్రభుత్వానికి ఈ విన్నపం పంపుకుంటున్నాము. రిపబ్లిక్‌లో ఉంటున్న బ్రిటీష్ పౌరులందరినీ మిలిటరీ సర్వీసునుంచి మినహాయిస్తూ రాణీగారి ప్రభుత్వమున్నూ, ద. ఆఫ్రికా రిపబ్లిక్‌వారున్నూ చేసుకున్న ఒడంబడికను వారు ఆమోదించారు. కాని అందులో బ్రిటీష్ పౌరులు అంటే తెల్లజాతులవారు అని నిర్వచనంచేస్తూ ఒక చిన్న మినహాయింపుచేశారు.

విజ్ఞప్తిదారులమైన మేము సదరు తీర్మానాన్ని చదువడంతోనే, బ్రిటీష్ పౌరులలో శ్వేతజాతులవారికీ రంగుజాతులవారికీ మధ్య భేదాన్ని చూపడం గురించి, మా అసమ్మతిని తెలియచేస్తూ 22 అక్టోబరు 1895 తేదీని తంతివార్తను పంపుకున్నాము.

బహుశా, దక్షిణాఫ్రికా రిపబ్లిక్‌లో ఉంటున్న భారతీయులను దృష్టిలో పెట్టుకునే ఈ మినహాయింపు చేయబడింది.

అసలు ఒడంబడికలో 'బ్రిటీష్ పౌరులు' అన్నమాటలకు ఏ విధమైన నిర్వచనమూ చేయబడలేదు. ఆ ఒడంబడికను యథాతథంగా ఆమోదించకుండా ఈ మార్పుచేయబడింది. కనుక ఆకారణంచేతనైనా, మార్పుచేయబడిన ఒడంబడికను రాణీగారి ప్రభుత్వం ఆమోదించదని మేము విశ్వసిస్తున్నాము.

భారతీయ పౌరులకు పై తీర్మానం ఎంతగా అవమానకరమో మేము వేరుగా వ్రాయనక్కరలేదు.

బ్రిటిష్ పౌరులను మిలిటరీ సర్వీసునుండి మినహాయించడానికి చెప్ప బడే కారణం ఒకటే. బ్రిటిష్ పౌరులకు రిపబ్లిక్‌లో పూర్తిగా బర్గర్ హక్కులు లేవు కనుక, వారితోపాటు మిలిటరీ సర్వీసు చేయమని బలవంత పెట్టకూడదని అభిప్రాయం. రిపబ్లిక్‌లోని యూఇట్ లాండర్ జనాభా, తమ్ములను పౌరులుగా గుర్తించి వోటింగు హక్కుల నిచ్చినట్లయితే, తాముకూడా మాలాబోక్ దండయాత్రలో సంతోషంతో పాల్గొంటామని అప్పట్లో చెప్పేరు.

కనుక యూరోపియనులకు— తీర్మానం ప్రకారం 'తెల్ల బ్రిటిష్ పౌరుల'కు—రాజకీయ నిషేధాలున్నాయి కనుక వారు మిలిటరీ సర్వీసు నుండి మినహాయింపబడితే, ద. ఆ. రిపబ్లిక్‌లో ఏ విధమైన రాజకీయ హక్కులులేని భారతీయులను మినహాయించడం మరింత సబబుకదా. భారతీయులు కేవలం వస్తువులవంటి చరాస్థిగానే పరిగణింపబడుతున్నా రనడానికి ఈ తీర్మానం మరొక నిదర్శనం.

ద. ఆఫ్రికా అంతటిలోను—కాలనీలలోనూ, స్వతంత్ర రాష్ట్రాల లోనూ, (ఆఖరుకు కొత్తగా భాగుచేయబడిన బులావయో మొదలైన ప్రాంతాల్లోకూడా) భారతీయులను నిరంతరం అనేక విధాలుగా హింస పెడుతున్నారు. సాధారణంగా దక్షిణాఫ్రికాలో భారతీయులు లోనగు తున్న నిర్బంధాలు చాల ఎక్కువగా ఉన్నాయి. విజ్ఞప్తిదారులమైన మేమూ మా సోదరులూ, వాటిని రాణీగారి ప్రభుత్వం ద్వారా తొలగించు కోడానికి ప్రయత్నాలు జరుపుకుంటున్న సమయంలో, దక్షిణాఫ్రికా రిపబ్లికు ప్రభుత్వం భారతీయుల స్వేచ్ఛనింకా అరికట్టడానికి చేసే ప్రయత్నాలకు రాణీగారి ప్రభుత్వం ప్రోత్సాహమివ్వదని ఆఖరుమాటగా ప్రార్థిస్తున్నాము. విశ్వసిస్తున్నాం.

దయతో ఈ విధంగా న్యాయం దయచేయించినందులకు విజ్ఞప్తి దారులం కృతజ్ఞులం వగైరా....

యం. సి. కమరుద్దీన్,
అబ్దుల్ గనీ
మహామద్ ఇస్మాయిల్ వగైరా.

[10–12–1895 తేదీని రాణీగారి హైకమీషనరునుండి, ద. ఆ. రిపబ్లిక్ కాలనీల ప్రధాన కార్యదర్శికి పంపిన 692 నెం. లేఖతో జతపరుపబడిన ఉత్తరం. కలోనియల్ ఆఫీసు రికార్డులు 417 నెం. వాల్యూం 152.]

# 67. భారతీయులకు వోటింగుహక్కులు

## దక్షిణాఫ్రికాలో ఉండే ప్రతి బ్రిటిష్ పౌరునికి హెచ్చరిక

బీచ్ గ్రవ్, డర్బాన్,
డిసెంబరు 16, 1895.

భారతీయులకు వోటింగుహక్కులనిచ్చే విషయంలో వార్తాపత్రికలకు సంబంధించినంతవరకు కాలనీ అంతా—కాలనీ అన్న మాటేమిటి; ద. ఆఫ్రికా అంతా—చాలా అట్టుడికి పోయింది. కనుక ఈ హెచ్చరిక చేస్తున్నందుకు ఏమీ క్షమాపణ చెప్పుకోనక్కరలేదు. భారతీయుల వోటింగు హక్కు విషయమై, వారి అభిప్రాయమేమిటో క్లుప్తంగా ప్రతి బ్రిటిష్ వ్యక్తికీ తెలియచేయడానికిదొక ప్రయత్నం.

భారతీయులకు వోటింగుహక్కును తీసివేయడానికి చెప్పే కొన్ని కారణాలివి :

1. ఇండియాలో భారతీయులకు ఎన్నికహక్కు లేదు.
2. ద. ఆఫ్రికాకొచ్చే భారతీయులు బాగా అధమస్థాయికి చెందినవారు; నిజానికి వారు ఇండియాలో ఎందుకూ పనికిరాని చెత్తవంటివారు.
3. ఎన్నికహక్కు అంటే ఏమిటో భారతీయునికి అర్థంకాదు.
4. భారతీయుడెంతటి బ్రిటిష్‌పౌరుడో, నేటివ్‌కూడా అంతటివాడే. నేటివ్‌కు ఎన్నికహక్కు లేదు కనుక భారతీయునికీ ఉండకూడదు.
5. నేటివ్ జనాభా క్షేమంకోసం, భారతీయులకు వోటింగు అధికారముండకూడదు.
6. ఈ కాలనీ ఎప్పటికీ తెల్లవారి దేశంగానే ఉండాలికాని, నల్లవారి దేశం కాకూడదు. భారతీయులకు వోట్లధికారాన్నిస్తే, వారు యూరోపియనుల వోట్లను ముంచెత్తేస్తారు. అందువల్ల భారతీయులకు రాజకీయ ఆధిక్యత ఏర్పడుతుంది.

వరుసగా ఈ అభ్యంతరాలన్నిటిని ఎత్తుకుంటాను.

## 1

భారతదేశంలో భారతీయులకు వోటింగు అధికారం లేదనీ, భారతదేశంలోలేని అదనపు హక్కులను ఇక్కడ కోరడానికి వీలులేదనీ పదేపదే చెప్పబడుతోంది.

మొదటి విషయమేమంటే, భారతదేశంలో అనుభవిస్తున్న హక్కులకు మించి విశేషమైన హక్కులను భారతీయుడు వాంఛించడంలేదు. ఇండియాలోని ప్రభుత్వ విధానం, ఇక్కడి ప్రభుత్వంవంటిది కాదని మనసులో పెట్టుకోవాలి. కనుక రెంటికీ పోల్చడానికి వీలులేదని ప్రత్యక్షంగా కనుబడుతూనే ఉన్నది. దీనికి జవాబుగా, ఇండియాలో కూడా ఇలాంటి ప్రభుత్వ మేర్పడేవరకు ఇచటి భారతీయులు వేచియుండాలని చెప్పవచ్చును. కాని ఇది సరియైన జవాబుకాదు. ఆ సిద్ధాంతం ప్రకారమైతే, నేటాలు కొచ్చే ప్రదేశస్థునికి కూడా, ఇక్కడున్నటువంటి వోటింగుహక్కునే, అదే పరిస్థితుల్లో, తనదేశంలో అనుభవిస్తుంటే తప్ప, వోటింగుహక్కుండకూడదని వాదించవచ్చును. ఈ సూత్రాన్ని సర్వత్రా వర్తింపచేసేయడల ఇంగ్లండు నుంచి వచ్చేవారికి కూడా నేటాలులో వోటింగుహక్కుండ దన్నమాట. ఏమంటే, అక్కడుండే వోటింగుహక్కు పద్ధతి, ఇక్కడ పద్ధతివంటిది కాదు. ఇంగ్లండుస్థితే ఇలాఉంటే, నిరంకుశ ప్రభుత్వాలు రాజ్యం చేస్తున్న జర్మనీ రష్యాలమాట చెప్పక్కరనేలేదు. కనుక భారతదేశంలో వారికి వోటింగు హక్కున్నదా అన్న సంగతి ప్రశ్నేకాదు. ప్రజాప్రాతినిధ్య ప్రభుత్వ పద్ధతి వారికర్ధమవుతుందా కాదా అని మాత్రమే ఆలోచించాలి.

భారతదేశంలో వోటింగుహక్కు చాలా పరిమితమై యున్నదన్న మాట సత్యమే. కాని ఉండడం మాత్రమున్నది. ప్రజాప్రాతినిధ్యంతో కూడిన ప్రభుత్వమంటే ఏమిటో తెలుసుకోగల సమర్థత భారతీయులకున్నదని లెజిస్లేటివ్ కౌన్సిళ్ళు గుర్తించాయి. ప్రజాప్రాతినిధ్య సంస్థలకు వారు తగుదురనడానికి అవే ప్రత్యక్షమైన నిదర్శనాలు. లెజిస్లేటివ్ కౌన్సిళ్ళలోని సభ్యులు కొందరు ఎన్నుకోబడ్డవారు. కొందరు నియామితులు. భారతదేశములోని లెజిస్లేటివ్ కౌన్సిళ్ళు పూర్వం నేటాలు లెజిస్లేటివ్ కౌన్సిలునే చాలావరకు పోలియున్నాయి. ఆ కౌన్సిళ్ళలోనికి ప్రవేశించడానికి భారతీయుల కేవిధమైన నిషేధమూలేదు. ఒకే స్థాయిలో యూరోపియనులతోవారు పోటీ చేస్తారు.

బొంబాయి లెజిస్లేటివ్ కౌన్సిలుకు ఇటీవల జరిగిన ఎన్నికలలో ఒక నియోజకవర్గంలో యూరోపియనుడు, భారతీయుడు పోటీ చేశారు.

ఇండియాలోని అన్ని లెజిస్లేటివ్ కౌన్సిళ్ళల్లోనూ భారతీయులు సభ్యులుగాఉన్నారు. ఈ ఎన్నికలలో భారతీయులూ, యూరోపియనులు వోటుచేస్తారు. ఎన్నికహక్కు పరిమితమే. అంతేకాకుండా డొంకతిరుగుడు పద్ధతి కూడాను. ఉదాహరణకు : బొంబాయి కార్పొరేషన్ బొంబాయి శాసనసభకు ఒక సభ్యుని ఎన్నుకుంటుంది. కార్పొరేషన్ సభ్యులను పన్నులు చెల్లించేవా రెన్నుకుంటారు. వారు చాలామంది భారతీయులే.

బొంబాయి మ్యునిసిపల్ ఎన్నికల్లో పాల్గొనే వోటర్లు వేలాదిగా ఉన్నారు. ఆ తరగతివారి నుండీ, అటువంటి వర్గంవారినుండీ వచ్చినవారే ఈ కాలనీలోని వర్తకులు.

అంతేకాకుండా, చాలా ముఖ్యమైన ఉన్నతోద్యోగాలను భారతీయులకిస్తున్నారు. ఇందువల్ల భారతీయులకు ప్రజాప్రతినిధి ప్రభుత్వమంటే అర్థంకాదని బుజువవుతోందా ? సంవత్సరానికి 60 వేల రూపాయలు లేక 6 వేల పౌనులు జీతంకలిగిన ప్రధానన్యాయమూర్తి పదవిని ఒక భారతీయుడలంకరించాడు. ఈ మధ్యనే ఇక్కడ వర్తకుల తరగతికి చెందిన వారినే ఒకాయనను బొంబాయి హైకోర్టుజడ్జీగా నియమించారు.

ఇక్కడ కంట్రాక్టు కూలికొచ్చిన కొందరుభారతీయుల కులానికి చెందిన ఒక తమిళ ప్రముఖుడు, మద్రాసు హైకోర్టుకు న్యాయమూర్తి అయినాడు. బెంగాలులో ఒక భారతీయుని, చాలా బాధ్యతతోకూడిన సివిల్ కమీషనర్ పదవికి నియమించారు.

కలకత్తాలోనూ బొంబాయిలోనూ భారతీయులే విశ్వ విద్యాలయాలకు ఉపాధ్యాయులుగా ఉన్నారు. యూరోపియనులతోపాటే భారతీయులు కూడా సివిల్ సర్వీసులకు పోటీచేస్తున్నారు.

ప్రస్తుతం బొంబాయి కార్పొరేషన్ ప్రెసిడెంటు, కార్పొరేషన్ సభ్యులచేత ఎన్నుకోబడిన భారతీయుడు.

నాగరిక దేశాలన్నిటితోపాటు సమానస్థానాన్ని అలంకరించడానికి భారతదేశానికి అర్హత ఉన్నదన్న యోగ్యతాపత్రాన్ని 23–8–1895 తేదీ గల లండన్ టైమ్సు పత్రిక ఇచ్చింది.

టైమ్సు పత్రికలో ఇండియన్ సమాచారాలను వ్రాసే ఆయన ప్రసిద్ధ చరిత్రకారుడైన సర్ విలియం విల్సన్ హంటర్ అని అందరికీ తెలిసిన విషయమే. ఆయన ఇలా వ్రాశాడు :

ఈ గౌరవాలను సంపాదించేటందుకు వారు చేసిన సాహస కార్యాలనూ, అంతకన్నకూడా వారుచూపిన అద్భుతమైన ఓర్మిని చదువుతుంటే ఆశ్చర్య విభ్రమాలవల్ల శరీరం ఝుల్లుమంటుంది. ఆర్డర్ ఆఫ్ మెరిట్ పొందిన ఒకసిపాయి శరీరంమీద ముప్పదిగాయాలైనా ఉన్నాయి. బహుశా అన్ని దెబ్బలుండడం ఇదివరకెప్పుడూ వినలేదని *'ఇండియన్ డెయిలీ న్యూస్'* పత్రిక వ్రాసింది. రాస్ పటాలం విడిపోయినపుడు, కొండలలో గుండుదెబ్బతిన్న మరొకడు, కిక్కురుమనకుండా గుండు ఇరుక్కున్న చోటును గుర్తించి నిర్భయంగా తన రెండుచేతుల్తోనూ నొక్కి దానిని బయటికిలాగి పారేశాడు. రక్తం ధారగా కారుతున్నప్పటికీ, తుపాకిని భుజాన్వేసుకుని 21 మైళ్ళు నడిచాడు.

ఈ విధంగా ప్రఖ్యాతి తెచ్చుకున్న నేటివ్ సిపాయిల ధైర్య సాహసాలనుచూచి అటువంటివారు మనతోటి పౌరులైనందుకు గర్వపడుతున్నాం. కాని అటువంటి సాహసకార్యాలకు, ఓర్మికి వాళ్లకిచ్చే స్వల్పమైన బహుమానాలను తలచుకుంటే మాత్రం మరొకభావం కలుగుతుంది.

కొరగ్ పోరాటం సందర్భంలో 4 వ బెంగాల్ కాల్బలానికిచెందిన ఇద్దరు నీళ్ళుమోసేవారు చూపించిన సాహసాన్ని గురించి ఉత్తరాల్లో ప్రత్యేకంగా వ్రాయబడింది. ప్రాణాలమీది కొచ్చిన పరిస్థితులలో తోటివీరులపట్ల వారుచూపిన భక్తిశ్రద్ధలు నిరుపమానములు. ఆ పటాలానికి చెందిన మరొక సిపాయి, స్వర్గీయ కెప్టెన్ బార్డును చిత్రాల్ కోటలోకి తీసుకొచ్చిన పార్టీలోఉండి ప్రదర్శించిన అద్భుత సాహసమూ, కార్యదీక్షాకూడా ఆ నివేదికలో ఉదహరింపబడింది........వాస్తవానికి భారతీయులు అనేక రంగాలలో మనతోపాటే పౌరులుగా ఉండదగినవారనిపించుకునే హక్కును సంపాదించుకుంటున్నారు. వివిధ జాతులమధ్య గౌరవప్రదమైన సమానత్వాన్ని పెంపొందించేందుకు యుద్ధరంగం ఎల్లప్పుడూ

సూక్ష్మమార్గం. కాని భారతీయులు అంతకన్న నిదానమైనట్టిన్నీ, కష్టమైనట్టిన్నీ పౌరజీవితంలోకూడా మన గౌరవానికి పాత్రు లవుతున్నారు. *మన పాలనలో ఉన్న దేశాలలో రాజ్యాంగ బద్ధమైన ప్రభుత్వాన్ని నెలకొల్పడానికి చేయబడిన ప్రయోగాల్లో, మూడేండ్ల క్రితం కొంతవరకు ఎన్నిక సిద్ధాంతంమీద విస్తృతంచేయబడిన భార తీయ శాసనసభకన్న గొప్పదింకొకటి లేదు.* ఆ ప్రయోగం జయ ప్రదమవుతుందా కాదా అన్న సంశయం బెంగాలులో కలిగినంతగా మరే రాష్ట్రంలోనూ కలుగలేదు. లెఫ్టినెంట్ గవర్నరు పరిపాల నలోనున్న బెంగాలుయొక్క జనాభా మద్రాసు, బొంబాయి ప్రెసిడెన్సీల మొత్తం జనాభా అంత ఉన్నది. పరిపాలనా దృష్ట్యాచూస్తే, వాటికన్న చాలా కష్టమైనది.

బెంగాలు శానిటరీ డ్రెయినేజి ఆక్టు అనే చాలా క్లిష్టమైన చట్టాన్ని, శాలిస్‌బరీ ప్రభువు చట్టంక్రింద విస్తృతం చేయబడిన తన శాసనసభ చర్చించినపుడు, పార్టీకారణాలవల్ల ప్రాతికూల్యత లేకుండా అనుభవ సహితమైన సలహాలను తాను పొందగలిగినట్లు, సర్ చార్లెస్ ఇలియట్ ఉదారంగా చెప్పేడు. అక్కడ జరిగినచర్చలు చాలా సహాయకారిగా ఉన్నాయి. ఎక్కడైతే ఎన్నిక పద్ధతి ప్రవేశ పెట్టడంవల్ల చాలా చిక్కులు కలుగుతాయని శంకింపబడిందో, అటు వంటి బెంగాలులో, *చాలా కష్టంమీద ఈ ప్రయోగం జయప్రదమైన దని నిర్ధారణ చేయబడినది.* (ఇటాలిక్సు నావే)

## II

ద. ఆఫ్రికాలో ఉండే భారతీయుడు భారతీయుల్లోకల్లా అధముస్తు డనేది రెండవ అభ్యంతరం. ఆమాట ఎంతమాత్రం నిజంకాదు. వర్తక వ్యాపారాల్లో ఉన్న వారి విషయంలో ఆ సంగతి చెప్పనక్కరలేదు. కంట్రాక్టు కూలికొచ్చేవారిలోకూడా భారతదేశంలోని అగ్రజాతులకు చెందినవారు చాలామంది ఉన్నారు. వారు పేదవారన్నమాట నిజమే. కొందరు ఇండి యాలో పనిపాటలు లేకుండా సోదాగా తిరిగేవారే. చాలామంది కడ జాతులకు చెందినవారుకూడా ఉన్నారు. కాని మీరు నొచ్చుకోకుండా ఉంటే ఒక్కసంగతి చెప్పనివ్వండి. నేటాలులో ఉన్న భారతీయులు ఇండియా లోని ఉత్తమశ్రేణికి చెందినవారు కారంటే, ఇక్కడున్న యూరోపియనుల

సంగతి అంతటిదే. కాని ఈ విషయాన్ని గురించి అనవసరమైన ప్రాముఖ్యత నిస్తున్నారు. భారతీయుడు ఆదర్శప్రాయమైన భారతీయుడు కాకపోతే, ఆయనను అలాంటివానినిగా చేయడానికి ప్రభుత్వం సహాయపడాలి. ఆదర్శ ప్రాయమైన భారతీయుడంటే ఎలా ఉంటాడో తెలుసుకోవాలని పాఠకుడు కుతూహలపడితే, భారతీయుడుకూడా ఆదర్శ ప్రాయుడైన యూరోపి యనువంటి నాగరికుడే అని ఋజువు చేయడానికి అనేక ఆధారాలను సంక లనంచేసి ప్రచురించిన నా 'బహిరంగ' లేఖను చదువమని కోరుతున్నాను. అధమస్తుడైన యూరోపియను అగ్రస్థానానికి రావడానికి సావకాశమున్నట్లే ఇండియాలోకూడా అధమస్తునికి సావకాశము ఉన్నది. భారతీయుని కాల నీలో నిరంతరం నిరాదరణ చేయడంవల్లనూ, అతనిని అణగద్రొక్కే శాస నాలను చేయడంవల్లనూ, అతడు దిగజారి, ఇదివరకు కాకపోయినా ఇకముందు ప్రమాదమైన వ్యక్తిగా మారవచ్చును. అతనిని త్రోసిపుచ్చి, అసహ్యించు కుని, ఆడిపోస్తుంటే, అలాంటి స్థితిగతులలో ఇతరులేమి చేస్తారో అతడూ ఆ పనే చేస్తాడు. ఇతరులేమవుతారో, అతడూ అదే అవుతాడు. ఆతనిని ప్రేమించి ఆదరించినట్లయితే ఇతర జాతుల వారెంత అభ్యున్నతికి రాగలరో ఆతడూ అంతటి ఉన్నతిని అందుకోగలడు. ఇటువంటి పరిస్థితులలో భారత దేశంలో ఆత డేహక్కులను అనుభవిస్తున్నాడో వాటినైనా ఇక్కడ ఇస్తే కాని ఆతనిని బాగా ఆదరణతో చూచినట్లు లెక్కకాదు.

## III

భారతీయుడు వోటింగు హక్కంటే ఏమిటో అర్థంచేసుకోలేడని చెప్ప డం భారతదేశచరిత్రనే నిర్లక్ష్యం చేయడమవుతుంది. ఆదికాలంనుంచీ భార తీయునికి ప్రజాప్రాతినిధ్యమంటే ఏమిటో తెలుసును. దాని అంతర్యాన్ని గ్రహించి ఆనందించాడు. ఆ సిద్ధాంతం ఇమిడిఉన్న పంచాయితీయే, ఆతని కార్య కలాపాలకు మార్గదర్శకము. తన సంఘానికంతకూ యాజమాన్యం వహిస్తున్న పంచాయితీలో తాను సభ్యుడనని ఆయన భావించుకుంటూ ఉంటాడు. ఆలా భావించుకోగలిగినశక్తివల్లనే, ప్రజాప్రభుత్వసిద్ధాంతమంటే ఏమిటో తెలుసుకోవడంవల్లనే, ఆతడు ప్రపంచంలోకల్లా నెమ్మదైనవాడూ, ప్రమాదంలేనివాడూ అయినాడు. శతాబ్దాలనుంచి విదేశపరిపాలనలో ఉన్న ప్పటికీ ఆతడు సంఘానికి ఉపద్రవం తెచ్చేవాడు కాలేదు. ఆతడెక్కడికెళ్ళినా, ఎటువంటిస్థితిగతులలో ఉండవలసివచ్చినా, తనపైన అధికారం ఛలాయి స్తున్నవారి అభిప్రాయ ప్రకారం అధిక సంఖ్యాకుల నిర్ణయాన్ని శిరసావహి

స్తుంటాడు. ఏమంటే, తానున్న సంస్థలో అధిక సంఖ్యాకుల బలముంటే కాని ఎవ్వరూ అధికారాన్ని వహించలేరని ఆతడెరుగును. ఈ సిద్ధాంతం భారతీయుల హృదయానికి బాగా హత్తుకుపోయింది. అందుచేతనే స్వదేశ సంస్థానాధిపతులైన నిరంకుశపాలకులుకూడా తాము ప్రజల క్షేమం కోసమే పరిపాలించాలనుకుంటారు. అయితే అందరూ ఆ సిద్ధాంతాన్ని ఆచరణలో పెట్టడం లేదన్నమాట వాస్తవమే. అందుకు కారణాలను ఇక్కడ విశదీకరించనక్కరలేదు. పేరుకు రాజవంశంవారి ప్రభుత్వం సాగుతున్నా, సర్వాధి కారాలను వహించే సంస్థ పంచాయతీ అనేది 'ఆశ్చర్యకరమైన సంగతి. పంచాయతీ సభ్యుల ప్రవర్తన అధిక సంఖ్యాకుల అభిప్రాయాన్ననుసరించే ఉంటుంది. ఈ అభిప్రాయాన్ని బలపర్చే ఆధారాలు కావలంటే, గౌ. లెజిస్లేటివ్ అసెంబ్లీవారికి దాఖలు చేయబడిన విజ్ఞప్తిని చిత్తగించవలసినదని కోరుతున్నాను.

## IV

"భారతీయుడెంతటి బ్రిటిష్ పౌరుడో, నేటివ్‌కూడా అంతే కనుక, నేటివుకులేని వోటింగుహక్కు భారతీయుని కుండకూడదు."

పత్రికలలో చూస్తుండడంవల్ల నేను పై అభ్యంతరాన్ని ఉదహరించాను. భారతీయులు ఈ వరకే వోటింగుహక్కును అనుభవిస్తున్నారన్న సత్యాని కది భిన్నం. భారతీయునికున్న వోటింగుహక్కును తీసివేయడానికే ఇప్పుడు జరుగుతున్న ప్రయత్నం.

విశేషంగా ఒకరితో నొకరిని పోల్చడంపెట్టుకోకుండా, కేవలం శుద్ధ సత్యములైన సంగతులనే చెప్పదలచుకున్నాను. నేటివ్‌లకు వోటింగు హక్కు, కొంతకాలంనుంచి అమలులో ఉన్న ప్రత్యేకశాసనాన్ననుసరించి ఉన్నది. ఆ చట్టం భారతీయులకు వర్తించదు. ఇండియాలో ఇండియనుల కున్న వోటింగు హక్కు ప్రత్యేక చట్టాన్ననుసరించిలేదు. ఉన్నదేదో అందరికీ సమానంగానే వర్తిస్తుంది. 1858 సం. రం. రాణీగారి ప్రకటనలోనే భారతీయునికి స్వాతంత్ర్య సత్వ మొసంగబడినది.

## V

నేటాల్ జనాభాకు అపకారం జరుగుతున్న కారణంచేతనే భారతీయులకు వోటులేకుండా చేయాలనే వాదన ఇటీవల బయలుదేరింది. ఏ

విధంగా ఈ అపకారం జరుగుతున్నదో మాత్రం చెప్పబడలేదు. భారతీయులు నేటివ్‌లకు సారా సప్లయిచేస్తుంటారనీ, అందువల్ల అతడు పాడై పోతున్నాడనీ, ఎల్లప్పుడూ చెపుతున్న అభ్యంతరం మీదనే ఇప్పుడుకూడా ఆధారపడుతున్నారని ఊహిస్తాను. భారతీయుల వోటింగుహక్కు ఈ విషయంలో మార్పు చేయదని నా అభిప్రాయం. భారతీయులువారికి సారా సప్లయిచేస్తుంటే, వోటింగు హక్కులనివ్వడంవల్ల అంతకంటె ఎక్కువ సారాను సప్లయిచేయరు. కాలనీలో నేటివ్ పోలిసీని, డౌనింగ్ స్ట్రీటు అధికారులు (లండన్‌లోని బ్రిటిష్ పాలకులు) జాగ్రత్తగా కనిపెడుతూ, చాలా వరకు స్వంతంగానే నడిపిస్తుంటారు. ఆవిధానాన్ని మార్పు చేయకలిగిన బలాన్ని భారతీయ వోటర్లు ఎన్నటికీ సంపాదించుకోలేరు. నిజానికి, ఈ విషయంలో డౌనింగ్ స్ట్రీటుముందర యూరోపియనుకాలనిస్టులుకూడా ఏమీ ఆగలేరు. కాని ఒక్కక్షణంపాటు వాస్తవాన్ని పరిశీలిద్దాం. ఇప్పటికి వోటర్లపట్టీలో నమోదైన భారతీయ వోటర్ల స్థితిగతులను గురించి ఈ క్రింద ఇవ్వబడిన ప్రకటనను పరిశీలిస్తే, అందులో చాలామంది వర్తకులని తెల్లమవుతోంది. వారు చాలామంది సారాను ముట్టుకోరనీ, సారాను అసలు ఈ దేశంలో లేకుండా చేయాలనేవారనీ, అందరకూ తెలిసున్న విషయమే. వోటర్లపట్టీ ఆ ప్రకారమే ఉన్నట్లయితే, ఆ వోట్లవల్ల నేటివ్‌పాలసీ బాగుపడుతుంది కాని చెడిపోదు. 1885-87 సంవత్సరముల తాలూకు ఇండియన్ ఇమిగ్రేషన్ కమీషన్‌నుంచి ఉల్లేఖింపబడిన సంగతులవల్ల ఈ విషయంలో భారతీయులు యూరోపియనులకన్న అధమస్తులుకారని తెలుస్తోంది. వాటి నిక్కడ ఉల్లేఖించడంలో ఉభయులనూ పోల్చాలని నా అభిప్రాయంకాదు. సాధ్యమైనంతవరకు ఆపనిచేయకుండా ఉండడానికే నేను ప్రయత్నించాను. అందువల్ల నా దేశస్థులను నేను క్షమించ దలచుకోలేదు. ఎవరైనా భారతీయుడు త్రాగినాడని తెలిసినా, నేటివ్‌లకు త్రాగు డందిస్తున్నాడని తెలిసినా, ఆ విషయంలో నాకన్న ఎక్కువ చింతించేవాడింకొకడుండడు. భారతీయులకు వోటు లేకుండా చేయడానికిది ప్రత్యేక కారణంగా చెప్పడం మాత్రం పైకి చెప్పేమాటే కాని, సహేతుకమైనది కాదని ఋజువు చేయడమే నా అభిప్రాయమని పాఠకులకు హామీ ఇస్తున్నాను.

తదితర విషయాలతోపాటు, భారతీయులు త్రాగుతారనీ, దాని ఫలితంగా సంభవించే, ఇతర నేరాలన్నిటినీ చేస్తుంటారనీ చేయబడిన ఆరో

పణలను విచారించి నివేదించమని కోరబడిన కమీషనర్లు ఈ విధంగా నివేదించారు : (పే 42, 43)

ఈ విషయమై మేము చాలామంది సాక్షులను విచారించాము. వాళ్ల సాక్ష్యమునుబట్టి చూచినా, మాకు లభ్యమైన క్రిమినల్ స్టాటిస్టిక్స్సను, అనగా అంకెలనుబట్టి చూచినా త్రాగుబోతుతనమూ ఇతర నేరాలూ, నిషిద్ధ శాసనాలు తలపెట్టబడని ఇతర జాతులలోకన్న దానిననుసరించి ఉండే వలసవచ్చిన భారతీయులలో అధికంగా ఉన్నాయని మాకు నమ్మకం కలుగడంలేదు.

నేటివ్‌లకు, భారతీయుల ద్వారా ఘాటైన సారా తేలికగా లభ్యమవుతున్నదని గట్టిగాచెప్పబడే మాటల్లో చాలా సత్యమున్నదని మేము అంగీకరిస్తున్నాం .... కాని దొంగ సారా అమ్మకం సాగించే తెల్లవారికన్న వారెక్కువ అపరాధులని చెప్పజాలము.

భారతదేశాన్నుంచి వలస వచ్చినవారు నేటివ్‌లకు సారా అమ్ముతున్నారని పెద్దగా ఫిర్యాదులు చేసేవారే, నేటివ్‌లకు సారా అమ్మేవారనికూడా చూచాయగా తెలుస్తున్నది. దొంగ సారా అమ్మే భారతీయుల పోటీవలన వారి వృత్తికి, వారి లాభాలకూ భంగం కలుగుతోంది.

పై విషయాలవల్ల మరొక్క తెలుసుకోదగిన విషయం ఋజువవుతోంది. ఇండియాలో ఇండియనులకు త్రాగుడు దురభ్యాసంలేదనీ, వారిక్కడకొచ్చి దానిని నేర్చుకుంటున్నారని కమీషనరుల అభిప్రాయంగా తేలింది. నేటాల్‌లో భారతీయులు ఎందుకు ఏ విధంగా త్రాగుడు కలవాటు పడుతున్నారో పాఠకులే చెప్పాలి.

83 వ పేజీలో కమీషనర్లు ఈ విధంగా వ్రాశారు :

తమ దేశంలోకన్న నేటాలులో, భారతీయులు—ముఖ్యంగా స్వతంత్రులైనవారు,—నిషాచేసే పదార్థాలను సేవించడానికి ఎక్కువ అలవాటు పడుతున్నారని మాకు నమ్మకం తోచినది. కాని కాలనీలోఉండే ఇతర జాతులవారికన్న భారతీయులలో త్రాగి తందనాలు త్రొక్కేవారి జనాభా నిష్పత్తి ఎక్కువగా ఉన్నదని మాకు సంతృప్తికరమైన ఆధారాలేమీ కనుబడలేదు.

సూపరింటెండెంటు అలెగ్జాండరు కమీషన్ ఎదుట ఇచ్చిన సాక్ష్యంలో ఇలా అన్నాడు : (పే. 146)

ప్రస్తుతంలో భారతీయులను, తప్పనిసరిగా భరించవలసినఅనర్థమనే అనాలి. వాళ్ళుకూలీలుగా పనిచేయకపోతే మనమేమీ చేయలేము. దుకాణాదారులుగా వారువిధిగా మనకు ఉండితీరాలి. వారు నేటివ్ లంతఉపయోగమైనవారు. వారు బాగా అభివృద్ధిచెందేరు. నేటివ్‌లు బాగా పడిపోయారు. జరుగుతున్న దొంగతనాలన్నీ దాదాపు నేటివ్‌ల వల్లనే జరుగుతున్నాయి. నా అనుభవాన్నిబట్టి చెప్పాలనుకుంటే, నేటివ్‌లు భారతీయులద్వారా సారాను సంపాదించుకుంటారు. ఎవరు సప్లయిచేస్తే వారిదగ్గరనుంచే వారు దానిని సంపాదించుకుంటారు. ఈ విషయంలో కొందరు తెల్లవారు భారతీయులకేమీ తీసిపోవడంలేదు. పనిపాటలులేకుండా ఊరివెంట తిరుగుతూ, రెండు పెన్నీలకోసం, ఒక సారాసీసాను నేటివ్‌లకు సప్లయిచేస్తున్నారు.

నేటాలులో, ప్రస్తుత పరిస్థితులనుబట్టి, భారతీయ జనాభా స్థానే తెల్ల జనాభాను ప్రవేశపెట్టడం సాధ్యంకాదని నా అభిప్రాయం. పెట్టలేమనే నా ఉద్దేశం. నాకున్న సిబ్బందితో నేను 3 వేల మంది భారతీయులను సరిచూచుకోగలను. కాని 3 వేల మంది తెల్ల బ్రిటిష్ కార్మికులుంటే నేను సర్దుకోలేను....

149, పేజీలో ఆయనింకా ఇలా అన్నాడు :

కోళ్లను దొంగిలించడం మొదలైన ఇతర తప్పుడు పనులన్నీ కూలీలే చేస్తున్నారని జనం వారిని అనుమానించడం నేను చూస్తున్నాను. కాని అది సరియైనదికాదని నేను తెలుసుకున్నాను. ఈ మధ్య విచారణ కొచ్చిన కోళ్ల దొంగతనాలు తొమ్మిదింటిలోనూ, నా కార్పొరేషన్ పాకీ కూలీలమీదనే నేరారోపణ చేయబడింది. కాని చివరకు ఆకోళ్లను దొంగిలించినందుకు ఇద్దరు నేటివులు, ముగ్గురు తెల్లవాళ్ళు, శిక్షింపబడ్డారు.

నేటివ్‌లను గురించి ప్రకటింపబడిన బ్లూబుక్‌లోని విషయాలను పరికించవలసినదని పాఠకులను కోరుతున్నాను. నేటివ్‌లు యూరోపియనులతో కలసిమెలసి ఉంటూ ఉండడంవల్ల వారి నైతిక ప్రవర్తన అధ్వాన్న స్థితికే వచ్చినదని దాదాపు అందరు మేజస్ట్రేటులు ఏకాభిప్రాయంలోనే

ఉన్నట్టుగా అందులో చూడవచ్చును. కాదనడానికి వీలులేని ఇటువంటి ఆధారాలు ఉంటుండగా నేటివ్‌ల పతనానికి సంపూర్ణంగా భారతీయులే కారణమనడం అన్యాయం కాదా ? 1893 సంవత్సరంలో ఈబరోలో దొంగ సారాయిని అమ్మినందుకు, 3 గ్గురు భారతీయులు మాత్రమే శిక్షింపబడితే, యూరోపియనులు 28 గురు శిక్షపడ్డారు.

## VI

"ఈ దేశం తెల్లవాడిదేశంగానే ఉండితీరాలి. నల్లవాడిదేశం కాకూడదు. భారతీయులకు వోటింగుహక్కునిస్తే, వాళ్ళు యూరోపియను వోట్లను ముంచెత్తేస్తారు. నేటాలులో రాజకీయంగా భారతీయుల ఆధిక్యత స్థిరపడుతుంది."

పై స్టేటుమెంటులోని మొదటిభాగం ప్రస్తావన నేను ఎత్తుకోదలచుకోలేదు. దానిని నేను పూర్తిగా అర్థంచేసుకోలేదనికూడా ఒప్పుకుంటాను. కాని రెండవ భాగంలో నిబిడీకృతమై ఉన్న అపోహను తొలగించడానికి మాత్రం ప్రయత్నం చేస్తాను. భారతీయులవోట్లు యూరోపియను వోట్లనెన్నటికీ ముంచెత్తలేవని నేను చెప్పడానికి సాహసిస్తున్నాను. రాజకీయమైన ఆధిక్యతను సంపాదించడానికి భారతీయుడు ప్రయత్నిస్తున్నాడనే అభిప్రాయం, పూర్వానుభవానికి శుద్ధ విరుద్ధం. ఈ విషయాన్ని గురించి నేను చాలామంది యూరోపియనులతో మాట్లాడేను. కాలనీలో ప్రతి మనిషికీ ఒక వోటున్నదనే భావంతోనే దాదాపు వారందరూ వాదన చేశారు. ఆస్తికి సంబంధించిన అర్హత ఒకటి ఉన్నదని చెపితే వారు కొత్తగా తెలుసుకున్నారు. వోటింగుహక్కుల అర్హతలను గురించి విశదీకరించే సెక్షనును ఇక్కడ ఉల్లేఖిస్తున్నందుకు మన్నించండి.

> ఈ క్రింద మినహాయింపబడినవారు తప్ప, 21 సంవత్సరముల వయస్సు దాటిన ప్రతిమనిషి, ఒక జిల్లా ఎన్నికవర్గంలో 50 పౌనుల విలువగల స్థిరాస్తినిగాని, సంవత్సరానికి 10 పౌనులు శిస్తు చెల్లించే ఆస్తికి కవులుదారు హక్కునుగాని కలిగిఉండేయెడల, ఇటుపైన చెప్పబడిన పద్ధతి ప్రకారం వోటరుగా రిజిష్టరుచేయించుకునే యెడల, ఆ జిల్లా మెంబరు ఎన్నికలలో వోటుచేయడానికి అర్హుడు. పైన చెప్పబడిన ఆస్తి స్వంతదార్లుగా గాని, కవులుదార్లుగా కాని ఒకరికన్న ఎక్కువమంది స్వాధీనంలో ఉన్న యెడల, అందులో ఉన్న వారం

దరూ క్రమంగా నమోదు చేయించుకున్నట్లయితే ఆ ఆస్థికి సంబంధించిన వారంతా వోటు చేయవచ్చును. కాని ఆస్థిని స్వాధీనంలో ఉంచుకున్న వారందరూ దానిని సమంగా పంచుకుంటే స్వంత ఆస్థి అయినా, కవులుదారుగానైనా ఒక్కొక్కవాటా విలువ, వోటు హక్కు నిచ్చేదిగా ఉండాలి.

దీనినిబట్టి ప్రతి భారతీయుడికీ వోటు హక్కు లేదని స్పష్టపడుతోంది. యూరోపియనుతో పోలిస్తే, కాలనీలో 50 పౌనుల స్వంత స్థిరాస్థిగలవారు గాని, సంవత్సరానికి 50 పౌనులు శిస్థు చెల్లించే కవులుదారులుగాని ఎంత మందున్నారు? ఈ చట్టం చాలా కాలంనుంచి అమలులో ఉంది. ఈ క్రింది పట్టీవల్ల యూరోపియను వోటర్లకూ భారతీయ వోటర్లకూ ఉండే నిష్పత్తి ఏవిధంగా ఉందో బోధపడుతుంది. ఈ మధ్యనే *గెజెటులో* ప్రకటింపబడిన జాబితాలనుండి నేను క్రోడీకరించాను :

## వోటర్లు

| నెం. | నియోజక వర్గాలు | యూరోపియనులు | భారతీయులు |
|---|---|---|---|
| 1. | పీటర్ మారిజ్‌బర్గు | 1521 | 82 |
| 2. | ఉమ్‌గేని | 306 | నదారతు |
| 3. | లయన్సురివర్ | 511 | నదారతు |
| 4. | ఇక్సోపో | 573 | 3 |
| 5. | డర్బాన్ | 2100 | 143 |
| 6. | కౌంటీ ఆఫ్ డర్బాన్ | 779 | 20 |
| 7. | విక్టోరియా | 566 | 1 |
| 8. | ఉమ్‌వోటీ | 438 | 1 |
| 9. | వీనెన్ | 528 | నదారతు |
| 10. | క్లిప్ రివర్ | 591 | 1 |
| 11. | న్యూకేసిల్ | 917 | నదారతు |
| 12. | అలెగ్జాండ్రా | 201 | ,, |
| 13. | ఆల్‌ఫ్రెడ్ | 278 | ,, |
| | | 9,309 | 251 |
| | | మొత్తం | 9,560 |

కనుక, 9,560 మంది రిజిస్టర్డువోటరులుంటే, అందులో భారతీయులు 251 మంది మాత్రమే. రెండు నియోజకవర్గాల్లో మాత్రమే చెప్పుకోదగినంత మంది భారతీయ వోటరులున్నారు. భారతీయ వోటర్లు యూరోపియను వోటర్లు, 1 : 38 నిష్పత్తిలో ఉన్నారు. అనగా భారతీయులకు 38 రెట్లమంది యూరోపియనులున్నారన్నమాట. 1895 సం. తాలూకు, ప్రొటెక్టర్ ఆఫ్ ఇండియన్ ఇమిగ్రెంట్సు (భారతీయ వలసదారుల సంరక్షకుడు) నివేదికలో, మొత్తం 46,343 మంది భారతీయుల్లో, 30,303 మంది మాత్రమే స్వతంత్రులు. దీనికి వర్తకం చేసుకునేవారి సంఖ్య దాదాపు 5 వేలు కలిపితే మొత్తం 35 వేలమంది స్వేచ్ఛాపరులైన భారతీయులుంటారు. కనుక ప్రస్తుతం యూరోపియను జనాభాతో పోటీచేయగల భారతీయ జనాభా హెచ్చుగాలేదు. ఈ 35 వేల మందిలోనూ సగానికిపైగా, కంట్రాక్టుకూలీలైన భారతీయులకన్న ఆర్థికంగా ఒక్కమెట్టు మాత్రమే హెచ్చుగా ఉంటారు. డర్బాన్‌కుచుట్టూఉన్న 50 మైళ్ల ప్రదేశంలో నేను జిల్లాలన్నీ సంచారం చేస్తున్నాను. కనుక స్వతంత్రులైన భారతీయులలో చాలమంది హీనీ హీనీగా పొట్టమాత్రం పోసుకోగలుగుతున్నారని ధైర్యంగా చెప్ప గలను. వారెవ్వరికీ 50 పౌనుల విలువగల స్థిరాస్థి ఎక్కడా కనుబడదు. వయస్సువచ్చిన స్వతంత్రులైన భారతీయులు 12,360 మంది మాత్రమే ఉన్నారు. అందుచేత ఇండియన్ వోట్లు యూరోపియను వోట్లను ముంచెత్తేస్తాయని భయపడడానికెక్కడా ఆధారాలు లేవు.

భారతీయవోటర్ల జాబితాను విమర్శగాచూస్తే, ఇండియన్ వోటర్లు చిరకాలంగా కాలనీలో స్థిరనివాస మేర్పరచుకున్న వారేనని తెలుస్తుంది. నేను పరిశీలనగా గుర్తుపట్టగలిగిన 205 మందిలోనూ ఒకప్పుడు కంట్రాక్టు కూలీలుగా ఉండినవారు 35 మంది మాత్రమే. వారైనా 15 సంవత్సరములు పైగా కాలనీలోనే ఉంటున్నారు. భారతీయవోటరు లెందరు ఎంత కాలంనుంచి కాలనీలో ఉంటున్నారో, వారిలో ఒకప్పుడు కంట్రాక్టుకూలీ చేసిన వారెందరో ఈ దిగువ పట్టీ తెలుపుతున్నది :

| | | | |
|---|---|---|---|
| 4 సంవత్సరముల | నివాసం | .... | 13 గురు |
| 5 మొ. 9 సంవత్సరముల | ,, | .... | 50 ,, |
| 10 మొ. 13 సంవత్సరముల | ,, | .... | 35 ,, |
| 14 మొ. 15 సంవత్సరముల | ,, | .... | 59 ,, |

| | | |
|---|---|---|
| ఒకప్పుడు కంట్రాక్టుకూలీలుగా ఉండి స్వతంత్రులైనవారు, కాలనీలో 15, 20 సంవత్సరములనుంచి కాపురముంటున్నవారు | .... | 35 |
| కాలనీలో జన్మించినవారు | .... | 9 |
| ద్విభాషులు .... | .... | 4 |
| ఏ వర్గానికీ చెందనివారు | .... | 46 |
| | | 251 |

ఈ పట్టీ నూటికి నూరుపాళ్ళు సరియైనదని ఎవరూ చెప్పలేరు. కాని ప్రస్తుతం మనపనికి సరిపోతుందనుకుంటాను. కనుక ఈ అంకెలను బట్టి, కంట్రాక్టు కూలీలుగా వచ్చినవారు స్వతంత్రులై వోటర్ల పట్టీలో చేరడానికి అవసరమైనంత స్థిరాస్థిని సంపాదించడానికి అధమం 15 సంవత్సరాలైనా పడుతుందని తేలుతోంది. కంట్రాక్టు కూలీనుంచి స్వేచ్ఛలోపడ్డవారిని మినహాఇస్తే, వర్తకాని కొచ్చిన జనాభామాత్రం వోటర్ల జాబితానంతనూ నింపెయ్యగలదని ఎవ్వరూ చెప్పజాలరు. పైగా స్వేచ్ఛను పొందిన 35 మందిలోనుంచే చాలామంది వర్తకులైనారు. అసలు స్వంతసొమ్ముతో ఇక్కడకొచ్చిన వర్తకులలో చాలామంది వోటర్ల పట్టీలో చేరడానికి చాలా కాలంపట్టింది. నేను గుర్తు పట్టించజాలని 46 గురిలోనూ, వారిపేర్లనుబట్టి చాలా మంది ఈ వ్యాపారస్తుల వర్గానికి చెందినవారులాగే కనుబడుతున్నారు. కాలనీలో పుట్టిన భారతీయులు చాలామంది ఉన్నారు. వాళ్లలో చాలామంది చదువుకున్నవారే. కాని వోటర్ల జాబితాలో 9 మంది మాత్రమే ఉన్నారు. వారు వోటు అర్హతను సంపాదించుకోలేనంత పేదవారని స్పష్టపడుతోంది. మొత్తంమీద, ఇప్పటి జాబితానుపట్టి చూస్తే, భారతీయులవోట్లు అపారంగా పెరిగిపోతాయనే భయం, కేవలం ఊహా మాత్రమేనని తోచకమానదు. 205 మందిలోనూ 40 మందికి పైగా చనిపోయినవారో, లేక కాలనీ వదలి

పెట్టిపోయినవారో ఉన్నారు. ఇండియన్ వోటర్లజాబితాను వృత్తులవారీగా విభజన చేస్తే ఈ విధంగా ఉన్నది :

| | | |
|---|---|---|
| వర్తక సంస్థకు చెందినవారు | దుకాణాదారులు | 92 |
| | వర్తకులు | 32 |
| | బంగారపు పనివారు | 4 |
| | నగల వర్తకులు | 3 |
| | మిఠాయి వర్తకుడు | 1 |
| | పండ్ల వర్తకులు | 4 |
| | వ్యాపారస్థులు | 11 |
| | తగరపు పనివాడు | 1 |
| | పొగాకు వర్తకులు | 2 |
| | భోజనంహోటలు | 1 |
| | | 151 |

| | | |
|---|---|---|
| గుమాస్తాలు మరియు సహాయకారులు | గుమాస్తాలు | 21 |
| | అకౌంటెంట్స్ | 6 |
| | చిఠాఆవర్జాలు వ్రాసేవాడు | 1 |
| | అమ్మకపువారు | 6 |
| | బడిపంతులు | 1 |
| | ఫోటోగ్రాఫరు | 1 |
| | ద్విభాషులు | 4 |
| | చిల్లర దుకాణాదారులు | 5 |
| | మంగలిపనివారలు | 2 |
| | సారాయిఅమ్మేవాడు | 1 |
| | మేనేజర్లు | 2 |
| | | 50 |

| | | |
|---|---|---|
| తోట పనివారలు తదితరులు | కూరగాయల వర్తకుడు | 1 |
| | వ్యవసాయదారులు | 4 |
| | ఇంటినౌకరులు | 5 |
| | చేపలుపట్టువాడు | 1 |
| | తోటపనివారలు | 26 |
| | దీపాలు వెలిగించేవారు | 3 |
| | బండి తోలేవారు | 2 |
| | పోలీసులు | 2 |
| | కూలీలు | 2 |
| | హోటలుపని వాడు | 1 |
| | వంటవారు | 3 |
| | | 50 |
| | మొత్తము | 251 |

ఈ విశదీకరణంవలన, అనర్హులూ అధమస్థులూ అయిన భారతీయులు వోటర్ల జాబితానంతనూ నింపేస్తారనే భయానికేమీ కారణం లేదని స్పష్టమౌతున్నదని నా అభిప్రాయం. ఏమనగా చాలామంది వ్యాపారస్థులు. వారినే అరబ్బు లంటున్నారు. వాళ్ళు వోటుచేయడానికి అనర్హులు కారని అందరూ అంగీకరిస్తూనే ఉన్నారు.

రెండవవర్గంలో చేర్చబడినవారు వర్తకులు. లేక కొంతబాగా ఇంగ్లీషువిద్య నభ్యసించినవారు.

మూడవవర్గంవారు కొంచెం పై శ్రేణికి చెందిన కార్మికులు. మామూలు కంట్రాక్టు కూలీలు కన్న బాగా పైనున్నవారు. 20 సంవత్సరాలకు పైనుంచీ, కాలనీలో కుటుంబాలతోసహా కాపురముంటూ స్థిరాస్థిని సంపాదించుకున్నవారు. లేక బాగా శిస్తులు చెల్లించేవారు. నా భోగట్టా సరియైనదైతే, వీరిలో చాలా మంది తమ మాతృభాషను చదువడం వ్రాయడం నేర్చినవారు. ప్రస్తుతం అమలులోనున్న ఓటర్ల జాబితాను బట్టే ముందు జాబితా తయారయ్యేయడల, వోటింగుహక్కులు విషయంలో

ఏమీ మార్పులు జరుగకపోయినా, ఆ జాబితా యూరోపియనులకు సంతృప్తి కరంగానే ఉంటుంది. ఏమంటే భారతీయ వోటర్ల సంఖ్యా బహు స్వల్పం. పైగా వారిలో ముప్పాతిక పాళ్ళు వర్తకవర్గానికి చెందినవారు. కాలనీలో చాలాకాలంవరకూ వర్తకం చేసుకునేవారి సంఖ్య ఇంతకన్న పెరుగదనే సంగతి కూడా గమనించాలి. ఏమంటే, చాలామంది వస్తున్నా, దాదాపు అంతమందీ ఇండియా వెళ్ళిపోతున్నారు. సర్వసాధారణంగా వెళ్ళిపోయేవారి స్థానాలను వచ్చేవారు ఆక్రమించుకుంటున్నారు.

ఇంతవరకు నేను అంకెలను బట్టే చర్చించాను కాని, రెండుజాతుల యొక్క సహజ ధోరణులను గురించి తలపెట్టనేలేదు. జాతుల సహజస్వభావాలు, వారి రాజకీయవైఖరులను చాలావరకు తీర్చి దిద్దుతాయనడానికేమీ సందేహంలేదు. సర్వసాధారణంగా భారతీయులు రాజకీయ వ్యవహారాలలో అంత ఎక్కువగా జోక్యం కలిగించుకోరనే విషయంలో అభిప్రాయభేదాలు ఉండడానికి వీలులేదు. ఎక్కడాకూడా రాజకీయాధికారాన్ని చేపట్టాలని వారు ఎప్పుడూ ప్రయత్నించలేదు. వారిమతం (హిందూ కావచ్చును, మహమ్మదీయుడు కావచ్చును, పేరు మారినంత మాత్రాన తరతరాలుగా కలిగిన ప్రబోధం మరుగుపడదు) లౌకిక వ్యవహారాలలో ఒక విధమైన అలక్ష్యాన్ని ప్రబోధిస్తుంది. గౌరవప్రదంగా జీవితం గడుస్తుంటే వారు సంతృప్తిపడతారు. వారి వర్తక వ్యాపారాలకు భంగం కలిగించాలనే ప్రయత్నాలు జరిగి ఉండకపోతే, సంఘంలో వారిని న్యూనతపరచి కడజాతి వారికన్న అధములుగా చేయాలనే ప్రయత్నాలు జరుగకపోతే, శాశ్వతంగా వారిని నీరుమోసుకునేవారిగానూ, కట్టెలు కొట్టేవారినిగానూ చేసి కంట్రాక్టు కూలీ పద్ధతిలో బంధించి వేయాలనే ప్రయత్నాలు జరిగి ఉండకపోతే, ఈ వోటింగు హక్కునుగురించిన ఆందోళన ఉండేదేకాదని నేను ధైర్యంగా చెప్పగలను. నేను మరొక అడుగు ముందుకెడుతున్నాను. ఇప్పుడు కూడా నిజానికి ఇందులో రాజకీయాందోళన అనేది లేదని చెప్పడానికేమీ సందేహంలేదు. పత్రికలు, అటువంటి ఆందోళనను భారతీయులకంటకట్టడానికి ప్రయత్నాలు చేస్తున్నాయి. వాళ్ల పాటికి వారిని న్యాయమైన వృత్తులు చేసుకుని బ్రతకనివ్వండి. వాళ్లను క్రిందకు దిగదీయడానికి ప్రయత్నాలు చేయకండి. మామూలు దయతో వారిని ఆదరించండి. అంతమాత్రంచేస్తే వాళ్ళు వోటర్ల జాబితాలో పేర్లు చేర్చుకోడానికికూడా శ్రద్ధ వహించరు. కనుక, వోటింగుహక్కుల ప్రశ్న ఉండదు.

ఎవరో కొద్దిమంది భారతీయులు రాజకీయాధికారాలను వాంఛి స్తున్నారనీ, వారు మహమ్మదీయ ఆందోళకులనీ, గత అనుభవాలనుబట్టి మహమ్మదీయుల పరిపాలన వలన కలిగే అనర్థాలను హిందువులు గ్రహించా లనీ, కొందరు బాధ్యతగల వ్యక్తులు అంటున్నారు. ఇందులో మొదటి భాగం నిరాధారమైన విషయం. రెండవభాగం చాలా విచారకరమైనది. బాధాకరమైనది. రాజకీయాధికారాన్ని చేపట్టడమంటే, శాసనసభలలో స్థానాలను పొందడమనే అర్థమైతే, రాజకీయాధికారాన్ని చేపట్టడం అసం భవం. కాలనీలో బాగా ఇంగ్లీషు తెలిసిన చాలా ధనవంతులైన భార తీయులు ఉన్నారని ఆ ప్రకటనవల్ల ముందుగా ఊహించుకోవలసొస్తుంది. కాలనీలో కొద్దిమంది ధనవంతులు ఉన్నారు. కాని శాసనసభ్యుడుగా పనిచేయకలిగిన సమర్థు డొక్కడూ కనుబడడు. అనగా రాజకీయాల నర్థం చేసుకోకలిగిన వారెవ్వరూ లేరనికాదు. శాసనసభ్యుని కుండ వలసినంత ఇంగ్లీషు భాషా పరిచయమున్న వారెవ్వరూలేరు. రెండవ విషయం, కాలనీలోని హిందువులను మహమ్మదీయుల మీదకు రెచ్చగొట్టే ప్రయత్నమే. కాలనీలో అటువంటి ప్రమాదం కలుగాలని బాధ్యులైన వారు ఎలా ఆలోచించ గలుగుతున్నారా అన్నది ఆశ్చర్యకరమైన సంగతి. అటువంటి ప్రయత్నాలు ఇండియాలో జరిపినందువల్ల చాలా ప్రమాదకర మైన ఫలితాలు సంభవించాయి. బ్రిటిష్ పరిపాలన స్థిరత్వానికే మోసం వచ్చేటట్లు కనుబడింది. ఉభయవర్గాలవారూ అన్యోన్యంతో బ్రతుకుతున్న ఈ కాలనీలో ఇటువంటి భేదాలను చొప్పించడం చాలా తుంటరితనమని చెప్పడానికి నేను సందేహించడంలేదు.

భారతీయులందరికీ వోటింగుహక్కు లేకుండా చేయడం చాలా ఘోరమైన అన్యాయమని గుర్తింపబడడం శుభ సూచకము. అరబ్బులనే వారికి వోటింగుహక్కుల నివ్వాలని కొందరనుకుంటున్నారు. వారిలో కొందరిని ఎన్ని, వారికి మాత్రమే ఇవ్వాలంటారు కొందరు. కంట్రాక్టు కూలీలుగా వచ్చినవారికి వోటింగుహక్కులు ఎప్పటికీ ఉండనే కూడదని కొందరంటున్నారు. ఇటీవల స్టేంగరు నుంచి వచ్చిన సూచన మరీ చమత్కారంగా ఉన్నది. ఆ సూచన ప్రకారమైతే, ఎవ రైతే ఇండియాలో తాము వోటర్లమని ఋజువు పరుచుకుంటారో వారే నేటాలులో అందుకు అర్హులవుతారు. పాపం! భారతీయు లొక్కరికి మాత్రమే ఎందు కలాంటి నిబంధన ఉండాలి? కాలనీలో ఉండే వారంద

రికీ ఆ నిబంధనను వర్తింప చేసేటట్లయితే, భారతీయులు దాని కభ్యంతర పెట్టరనుకుంటాను. ఆ పరిస్థితులలో యూరోపియనులు కూడా ఓటర్ల జాబితాలో తమ పేర్లు చేర్పించుకోవడానికి చాలా కష్టపడతారనుకుంటాను. ఏమంటే, తమతమ రాజ్యాలలో ఓటర్ల పట్టికలో పేరుగల యూరోపియనులు కాలనీలో ఎంతమంది ఉన్నారు ? కాని ఇటువంటి మాటే యూరోపియనుల గురించి చెపితే, వారు చాలా ఆవేశపడుండేవారు. ఆ మాటే భారతీయులను గురించి చెపుతుంటే పెద్దగా ఆలోచన చేస్తున్నారు.

ప్రతి భారతీయుడికీ వోటు కావాలని భారతీయులు ఆందోళన చేస్తున్నారని చెపుతున్నారు. ఆ మాట శుద్ధ నిరాధారమైన విషయమనీ, భారతీయుల యడల అనవసరంగా ద్వేషం పురిగొల్పడానికే ఆ మాట చెపుతున్నారనీ మనవి చేస్తున్నాను. యూరోపియనుల సంఖ్యాబలంయొక్క ఆధిక్యతను నిలబెట్టుకోవడానికి, ఇప్పుడున్న ఆస్థి అర్హత, ఎప్పటికీ కాక పోయినా ప్రస్తుతానికి చాలునని నా నమ్మకం. కాని యూరోపియను కాలనిష్టులకు అది చాలదని తోచే యడల, న్యాయమైన విద్యా విషయమైన అర్హతను సూచించే యడల భారతీయు లెవ్వరూ అభ్యంతర పెట్టరనుకుంటాను. రంగుభేదాన్ని కనుపరచి, జాతిభేదం కారణంగా ఓటు హక్కు లేకుండా చేస్తేనే భారతీయులు అసమ్మతిని తెలుపుతున్నారు. జాతిమత భేదాల కారణంగా ఏ విధమైన అనర్హతలుగాని, నిర్బంధాలు కాని ఉండవని రాణీగారి పౌరులైన భారతీయులకు అనేకమార్లు హామీలివ్వ బడ్డాయి. కేవలం సద్భావ ప్రకటనకోసం మాటవరుసకి ఈ హామీలివ్వబడలేదు. వారి ప్రజ్ఞను గుర్తించే ఇవ్వబడినాయి. భారతీయులు తమతోపాటు సమానంగా చూడబడడానికి నిస్సంకోచంగా అర్హులని ధైర్యం చిక్కిన తర్వాతే, బ్రిటిష్ సింహాసనం పట్ల రాజభక్తి పరాయణులుగా ఉంటారనీ, చట్టబద్ధులుగా ఉంటారనీ గుర్తించిన తర్వాతనే, ఈ పద్ధతుల మీద తప్ప మరోవిధంగా భారతదేశంమీద బ్రిటిష్ ఆధిపత్యాన్ని శాశ్వతంగా ఉంచడానికి వీలుండదని గ్రహించిన పిమ్మటనే, ప్రప్రథమంగా అటువంటి హామీ ఇవ్వబడింది. ఆ హామీలు చాలా తీవ్రంగా అతిక్రమింపబడిన సందర్భాలున్నంత మాత్రాన, హామీలయొక్క ఉనికిని కాదనడానికి వీలు లేదని నామనవి. ఆలాంటి అతిక్రమణలు, రూలున్నదనే విషయాన్ని ధృవ పరుస్తున్నాయి. అంతేకాని దానిని రద్దు చేయవు. నాకు తగినన్ని

సావకాశములుంటే, మీకు విసుగు పుట్టిస్తున్నానేమో ననే భయంలేకుండా ఉంటే, 1858 సం. రం. రాణీగారి ప్రకటన తు. చ. తప్పకుండా అమలు జరుపబడిన ఘట్టాలనూ, ఇండియాలోనూ ఇతర చోట్లలోనూ కూడా ఇప్పటికీ అమలు జరుగుతున్న సందర్భాలనూ అనేకంగా ఉదహరించగలను. కనుక జాతి భేదాలవలన ఏర్పడుతున్న అనర్హతల యెడల భారతీయులు అసమ్మతిని తెలియచేయడం చాలా న్యాయమని మనవిచేస్తున్నాను. వారి అసమ్మతి గుర్తింపబడి మన్నింపబడుతుందని కూడా నమ్ముతున్నాను. ఇంతచెప్పిన మీదట నా సోదరుల తరఫున మరొక విషయం చెప్పదలచుకున్నాను. వోటర్ల జాబితాలో ఉండడానికి అభ్యంతరం పెట్టగలిగిన మనుష్యులను తొలగించడానికిగాని, భవిష్యత్తులో భారతీయుల వోటు ప్రబలం కాకుండా ఉండడానికిగాని వోటింగుహక్కులను మార్పుచేస్తే భారతీయులు అభ్యంతర పెట్టరన్న విషయం మనవి చేస్తున్నాను. వోటు యొక్క విలువను గుర్తించలేని అమాయకులైన భారతీయుల పేర్లను ఓటర్లజాబితా కెక్కించడం భారతీయుల అభిప్రాయంగాదని నేను రూఢిగా చెప్పగలను. భారతీయులందరూ అలాంటివారుకారు. అలాంటివారు కొందరుంటే వారు దాదాపు అన్ని జాతులలోనూ ఉన్నారు. సాధ్యమైనంత వరకు యూరోపియను కాలనిష్టుల ననుసరించి నడుచుకోవాలనే, బుద్ధిశాలులైన భారతీయుల అభిప్రాయం. యూరోపియను కాలనిష్టులను, ఇంగ్లండునూ కాదని రొట్టెను పూర్తిగా సంపాదించుకోడంకన్న, ముక్కను పోగొట్టుకోడానికికూడా వారు సంసిద్ధులే. ఏదైనా చట్టం అవసరమైతే అది ఎవరికి వర్తిస్తుందో వారి ఆమోదాన్ని పొందినప్పుడే దానిని బలపర్చమని శాసనసభ్యులను, యూరోపియను కాలనిష్టులను వేడుకోడానికే నేనీ విజ్ఞప్తిని చేస్తున్నాను. ఈ విషయమై ప్రముఖులైన కాలనిష్టుల అభిప్రాయాలెట్లున్నవో తెలియపరచేటందుకు బ్లూబుక్‌లోనుంచి అనగా ప్రభుత్వ ప్రచురణలనుంచి కొన్ని భాగాలను పొందుపరుస్తున్నాను.

గౌ. లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యుడైన మిస్టర్ సాండర్సు ఇంతవరకు పోగలిగేడు.

> ఆసియాజనం ఇంగ్లీషువారి సంఖ్యను మించిపోయే విపరీత ప్రమాదం సంభవించకుండా ఆపడానికి, వోటరు స్వదస్తూరీతో ఇంగ్లీషుఅక్షరాలలో సంతకం చేయాలనే నిర్వచనంచేస్తే చాలును.

[నేటాల్ ఎఫైర్సు 3796/1883.]

ఆ పుస్తకంలోనే 7 వ పేజీలో, పూర్వం ఇమిగ్రెంట్సు ప్రొటెక్టరుగా నుండిన కెప్టెన్ గ్రేవ్సు ఇలా వ్రాశాడు :—

> వారికీ, వారి కుటుంబాలకూ ఉచితంగా ఓడ టిక్కెట్టును పొందే హక్కును పోగొట్టుకున్న భారతీయులు న్యాయంగా ఓటింగుహక్కుకు అర్హులని నా అభిప్రాయం.

ఆయన శాఖకు సంబంధించిన భారతీయులను అనగా కంట్రాక్టు కూలి కొచ్చినవారిని గురించే కెప్టెన్ గ్రేవ్స్ పైవిధంగా చెప్పేడు.

అప్పట్లో అటార్నీ జనరలుగా ఉండి ప్రస్తుతం ప్రధాన న్యాయ మూర్తిగా ఉన్నవారు ఈ విధంగా అంటున్నారు :—

> పరదేశస్థులను ప్రత్యేకంగా అనర్హులనుచేసే చట్టాన్ని ఆమోదించడం మంచిదికాదని భావింపబడడంచేత, మిస్టరు సాండర్సు ఉత్తరంలో చెప్పబడిన ప్రత్యామ్నాయ పథకాన్ని అమలుచేయడానికి నియమింపబడిన సెలెక్టు కమిటీ వారంగీకరించిన శిఫార్సుల ననుసరించే, నేను తయారుచేసిన బిల్లుయొక్క ముసాయిదాలోని క్లాజులు ఉన్నాయని చూడవచ్చును.

ఆ పుస్తకం 14వ పేజీలో ఆయన ఇంకా ఇలా వ్రాశారు :

> కాలనీలోని కామన్‌లాకు లోబడని అన్ని దేశాలవారికీ వోటు లేకుండా చేయాలన్న విషయంలో, బహుశా భారతీయులు క్రియోల్‌లు ఇప్పుడు అనుభవిస్తున్న ఎన్నిక హక్కులను వారికి లేకుండా చేయడానికే దీని అభిప్రాయమని అనుకుంటాను. నే నిదివరకే నా నివేదికలో (సీరియల్ నెం. 12) ఇందులో న్యాయమేమీ లేదనీ, అవసరంకూడా నాకు కనుబడడం లేదనీ చెప్పి ఉన్నాను.

ఈ బ్లూ బుక్‌లో, ఎన్నిక హక్కులను గురించిన సంగతులు, చాలా తెలుసుకోదగినవి ఉన్నవి. ప్రత్యేకంగా కొందరికి అనర్హతలు కల్పించడానికి అప్పటి కాలనిష్టులు చాలా అసహ్యాపడినట్లు స్పష్టంగా అందులో కనుబడుతోంది.

ఎన్నికహక్కులు విషయంలో జరుపబడిన అనేక సభల్లో పాల్గొన్న ఉపన్యాసకులంతా ఒకే విధంగా వాదించారు. యూరోపియను రక్తంతో స్వాధీనం చేసుకున్న ఈ దేశాన్ని, యూరోపియను హస్తాలతో బాగు చేయబడిన ఈ దేశాన్ని, భారతీయులను ఆక్రమించుకోకుండా చేయాలనే వారి వాదన. భారతీయులు కాలనీకి, మధ్యలో ప్రవేశించినట్లుగా వారు నిరూపించడమే వారి ప్రయత్నం. పై అభిప్రాయంలో మొదటి విషయం ఎత్తుకుందాం. భారతీయులు తమరక్తాన్ని ధారపోయలేదు కనుక, వారి కేవిధమైన హక్కులూ ఉండకూడదంటే, యూరోపులోని ఇతర రాజ్యాలకు చెందిన యూరోపియనులకు కూడా ఏవిధమైన హక్కులూ ఉండకూడదు. ఆదిలోవచ్చి స్థిరపడిన తెల్లవారి కాణాచిలోకి ఇతర ఇంగ్లీషు వలసదారులుకూడా అడుగుపెట్టడానికి వీలులేదని వాదించడం సాధ్యం. వాస్తవంగా రక్తం ధారపోయడమే ప్రజ్ఞకు చిహ్నమైతే, బ్రిటిష్ కాలనిష్టులు, ఇతర బ్రిటిష్ సామంతరాజ్యాలు, సామ్రాజ్యంలో అంతర్భాగాలని భావించేయడల, భారతీయులు బ్రిటిష్ వారికోసం అనేకసార్లు రక్తాన్ని ధారపోశారు. చిత్రాల్ ముట్టడి ఈ మధ్యనే జరిగిన ఘట్టం.

కాలనీ అంతా యూరోపియను హస్తాలతోనే ఇంతటిదైనదనీ, భారతీయులు మధ్యనొచ్చిన పరాయివారనీ చెప్పేమాటకు, వాస్తవికమైన సంగతులు మరొకలాగున ధృవపరుస్తున్నాయని మాత్రమే నేను మనవి చేస్తున్నాను.

*ఇండియన్ ఇమిగ్రెంట్సు కమిషను నివేదిక* నుండి నేనీక్రింది భాగాలను నా వ్యాఖ్యానమేమీ లేకుండా పొందు పరుస్తున్నాను. ఆ నివేదికను నాకరువిచ్చిన ఇమిగ్రేషన్ ప్రొటెక్టరుగారికి నేనెంతో ఋణపడున్నాను:

ఒక కమీషనరైన మిస్టర్ సాండర్సు 98వ పేజీలో ఈవిధంగా చెప్పేడు :

> భారతీయులవలన ఐశ్వర్యాన్ని తీసుకొచ్చించి. ధరలు పెరిగినాయి. అయినకాడికి ఉత్పత్తిచేసి అమ్మేయడానికి ప్రజలు ఇష్టపడడంలేదు. యుద్ధం, ఉన్ని, చక్కెర వగైరా పదార్థాల హెచ్చుధరలూ, భారతీయులు వ్యాపారంచేసే దేశవాళీ సామగ్రి ధరలను హెచ్చులో ఉంచి, ఐశ్వర్యాన్ని పెంపుచేశాయి.

99వ పేజీలో ఆయన ఇలా వ్రాశాడు :

ఈ విషయాన్ని స్థూలమైన ప్రజాహిత దృష్టితో పరికిద్దాం. నేటాలులోగాని, దక్షిణాఫ్రికాలోగాని, తెల్లవాళ్ళు కేవలం కూలిపని కోసం నేటాలులోఉండి పోరు. అంతకన్న వాళ్ళు మనలను విడచిపెట్టి బాగాలోపలి భాగానికైనా పోతారు. లేక సముద్రంమీదైనా పోతారు. ఇందుకుసందేహంలేదు. అయితేనల్లకూలీలు ప్రవేశించివారు భూగర్భితమైన సంపత్తిని బయటికి తీస్తున్నారు. విస్తీర్ణమైన నిర్మానుష్యమైన అనేక ప్రాంతాలను వారు వ్యవసాయంలోకి తీసుకొని వస్తున్నారు. అందుచేత వలసవచ్చిన తెల్లవారికి, లాభదాయకంగా ఉండే కొత్త వృత్తులు, ఉపాధులూ కలుగుతున్నాయి.

మనకు కలుగుతున్న అనుభవమే ఈ విషయాన్ని బాగా దృఢపరుస్తోంది. 1859 సంవత్సరం సంగతిచూద్దాం. భారతీయ కూలీలు తప్పకుండా లభిస్తారనే విశ్వాసంకుదిరిన కొద్ది సంవత్సరాలకే, సద్యోఫలితంగా 4 రెట్లు ఆదాయం పెరిగింది. 5 షిల్లింగులు, అంతకు లోపుగా రోజుకూలి సంపాదించుకునే మెకానికులకు కూలి రెట్టింపైనది. ఈ అభివృద్ధివలన బర్గునుంచి సముద్రంవరకూ అందరికీ ఉత్సాహం ఇనుమడించింది. కొద్ది సంవత్సరాల అనంతరం, భారతీయకూలీలను, కొంతకాలంవలస రాకుండా చేస్తారనే పుకారు బలమైనదేపుట్టింది. (నా మాటతప్పైతే రికార్డులు నన్ను సరిదిద్దగలవు) వెంటనే ఆదాయం పడిపోయింది. పనుల్లోనుంచిజనాన్ని తగ్గించడం, జీతాల కోతలూ బయల్దేరాయి. కొద్ది సంవత్సరాలకు అనగా 1873 సంవత్సరంలో (1868 సం. రం. లో వజ్రాల గనులు కనిపెట్టబడిన చాలకాలానికి) మరల భారతీయ కూలీలను స్వేచ్ఛగా రానిస్తారనే హామీ ఇచ్చేటప్పటికి, దానిపని అదిచేసింది. ఆదాయం పెరిగింది. జీతభత్యాలు పెరిగేయి. మనుష్యులను పనిలోనుండి తగ్గించడమనే మాటేలేదు. (ఇప్పుడు కూడా అంతే) ఇటువంటి రికార్డు, దాని చరిత్రనదే చెపుతుంది. ఆ చరిత్ర, జాత్యహంకారంవంటి కుర్రతనాన్ని, నీచమైన అసూయను తొలగించాలి.

రంగు కూలీలను ప్రవేశపెట్టడంవల్ల, తెల్లవారి సంక్షేమం ఏ విధంగా వృద్ధి పొందుతుందో నిరూపించడానికి, కాలనీల వ్యవహా

రాలలో ఎక్కువశ్రద్ధను ఆసక్తిని కనుబరుస్తున్న మేన్‌ఛస్టర్ ప్రభువు ఉపన్యాసాన్ని పరికించండి. అయనప్పుడే క్వీన్సులాండునుంచి తిరిగి వచ్చాడు. రంగు కూలీలను రానిచ్చినట్లయితే, వారు తెల్లవారితో పోటీ కొస్తారనీ, అందువల్ల తెల్లవారికి పనిపాటులు లేకుండా పోతాయనే అనవసర భయంతో నల్లవారిని రాకుండా చేయాలనే ఆందోళన ఫలితం చాలా ప్రమాద భూయిష్ఠంగా పరిణమించినదని ఆయన తనశ్రోతలకు తెలియచెప్పేడు.

100వ పేజీలో ఆ పెద్దమనిషే ఇంకా ఇలా అన్నాడు :

స్వతంత్రంగా వర్తకం చేసుకునే భారతీయుల వ్యాపారపు పోటీవల్ల, వస్తువులను కొనుక్కునేవారికి అవి చౌకగా లభ్యమవుతున్నాయి. (అటువంటప్పుడు జనం ఎందుకు బాధపడుతున్నారో తెలియడంలేదు) భారతీయుల చిన్న దుకాణాలను, పెద్దదుకాణాలను నిర్వహించే తెల్లవారు ప్రోత్సహిస్తున్నారు. తద్వారా తమ వస్తువులను విడుదల చేసుకోడానికి వారు భారతీయులను వినియోగించుకుంటున్నారు.

మీరు చేయదలచుకుంటే, ఇండియన్ ఇమిగ్రేషన్ ఆపు చెయ్యండి. ఇప్పటికే ఖాళీగాఉన్న ఇళ్ళను ఇంకా ఖాళీచేయండి. సగం జనాభాగల దేశంనుంచి, ఉత్పత్తి వినియోగ శక్తులుగల ఆరబ్‌లను ఇండియనులను వెళ్లగొట్టండి. అందువల్ల ఈ ఒక్క విషయంలో కలిగే ఫలితాలను పరిశీలిద్దాం. వాటిని ఇతర విషయాలకు ఉదాహరణగా తీసుకుందాం. మనుష్యులు లేని ఇండ్లయొక్క ఆస్థివిలువలు, హోమీలు ఏ విధంగా పడిపోతాయో గమనించండి. అందువల్ల గృహనిర్మాణ పరిశ్రమ స్తంభిస్తుంది. దానిననుసరించి ఉండే ఇతరవృత్తులు, వ్యాపారాలూ అన్నీ పడుకుంటాయి. ఇంకా కాస్తంత ముందుకుపోయి ఆలోచిస్తే తెల్ల మెకానికులకు పనితగ్గిపోతుంది. ఇంతమందికి కొనుగోలుశక్తి పోయేసరికి ఆదాయం పడిపోకతప్పదు. అందుకోసం కొందరిని పనిలోనుండైనా తప్పించాలి. లేకపోతే అదనపు పన్నులైనా విధించాలి. కండ్లుమూసుకుని జాత్యహంకారంతోనూ, అసూయతోనూ ప్రవర్తిస్తే ఇలాంటిఫలితాలనూ, ఇంకాలెక్కలేనన్ని ఇతర దుష్ఫలితాలను ఎదుర్కోవలసొస్తుంది.

మిస్టర్ హెన్రీబిన్సు కమీషన్ ఎదుట ఈ విధంగా సాక్ష్యం చెప్పేడు : (పే. 156)

స్వతంత్రులైన భారతీయులు మన సంఘానికి చాలా ప్రయోజనకారులని నా అభిప్రాయం. అందరూ అనుకునే సంఖ్య కన్న చాలా ఎక్కువమంది, కాలనీలో నౌఖరులుగా నున్నారు. ముఖ్యంగా పట్టణాల్లోనూ గ్రామాల్లోనూ ఇండ్లలోపనిపాటులు చేసే నౌఖరులువారే. పైగావారు మంచి వ్యవసాయకులు. నేను కొంతశ్రమపడి సంపాదించిన భోగట్టానుబట్టి, వారు గత రెండు మూడేండ్లనుంచీ సంవత్సరానికి లక్షమణుగుల జొన్నలను పండిస్తున్నారు. దానికితోడు తగినంత పుగాకువగైరా ఇతర పంటలను కూడా పండిస్తున్నారు. స్వతంత్రులైన భారతీయులు రాకపూర్వం పీటర్ మారిజ్ బర్గులోనూ, డర్బాన్ లోనూ పండ్లు, కూరగాయలు, చేపలు దొరికేవికావు. ఇప్పుడవి సమృద్ధిగా దొరుకుతున్నాయి.

కూరగాయ తోటలను పెంచాలనేవారినీ, చేపలుపట్టి అమ్మకానికి తీసుకురావాలనేధోరణిగల వారినీ యూరోపియనులను ఎన్నడూ ఎరుగము. భారతీయ జనాభాయే లేకపోతే, పీటరుమారిజ్ బర్గు, డర్బాన్ మార్కెట్లు పదేండ్లక్రితం ఏవిధంగా ఉండేవో, అలాగే ఉండేవని నా అభిప్రాయం. ........కూలీల వలస శాశ్వతంగా నిలుపుచేసిఉంటే, యూరోపియను మెకానిక్ లకు ముడుతుండే జీతనాతాలు అలాగే ఉండేవేమోకాని, వారి నాపుచేసిన కొద్దిరోజులకు ఇప్పుడున్నంతపని దొరికేది కాదు. భారతీయ కూలిజనం లేకుండా ఉష్ణప్రాంతాల్లో సాధ్యమయ్యే వ్యవసాయం ఇదివరకు సాగలేదు. ముందుసాగదు.

అప్పటి అటార్నీ జర్నలు, ప్రస్తుత ప్రధాన న్యాయమూర్తి కమీషను ఎదుట యీవిధంగా సాక్ష్యం యిచ్చాడు : (పేజీ 327)

భారతీయులను ప్రవేశపెట్టడంవలన, కోస్తా ప్రాంతాలలోనికి వలసవచ్చిన తెల్లవారు చేయలేనిపనిని వారు పూర్తిచేయగలిగేరు. తెల్లవారు వ్యవసాయంచేయలేని భూమిని భారతీయులు సాగులోకితెచ్చి, కాలనీలోని ప్రజలకు నిజంగా ఉపయుక్తమైన పంటలు పండించారు. లేకపోతే అవన్నీ బంజర్లుగా ఉండిపోవలసినవే.

తిరుగు ప్రయాణపు సౌకర్యాలను ఉపయోగించుకోని భారతీయులందరూ ఇండ్లలో నమ్మకంగా పనిపాటులుచేసే నౌఖర్లుగా పనికొస్తున్నారు.

స్వతంత్రులుగా కాలనీకి వచ్చిన భారతీయులు, స్వాతంత్ర్యాన్ని పొందిన భారతీయులు, సర్వసాధారణంగా కాలనీకి చాలా ఉపయోగంగా ఉంటున్నారని ఋజువుచేయడానికి ఇంకా అనేక ఆధారాలను చూపించవచ్చును. కమీషనర్లు తమ నివేదిక 82వ పేజీలో ఇలా వ్రాశారు :

19. చేపలుపట్టడంలోనూ, వాటిని నిలవచేయడంలోనూ వారు చాలా పరిశ్రమ చేస్తుంటారు. డర్బాన్ బే లోని శాలిస్ బరీ ద్వీపంలో భారతీయు లేర్పరచుకున్న చేపలవాడ, భారతీయులకే కాకుండా, కాలనీలోని తెల్లవారికికూడా చాలా ఉపయోగంగా ఉన్నది.

20. అనేకమైన మెట్ట ప్రాంతాల్లోనూ, కోస్తాప్రాంతాల్లోనూ ఎందుకూ పనికిరాని బంజర్లను, వారు చక్కని తోటలుగా మార్చేరు. కూరగాయలను, పొగాకును, జొన్నలను పండిస్తున్నారు. పండ్లచెట్లను నాటేరు. డర్బాన్‌లోనూ, పీటర్‌మారిజ్‌బర్గులోనూ, స్థానికంగా ఉండే బజారులన్నిటిలో పూర్తిగా కూరగాయలను వారే సప్లయి చేస్తున్నారు. ఒకప్పుడు ఈ వ్యాపారమంతా తెల్లవారి గుత్తగా ఉండేది. స్వతంత్ర భారతీయుల ఈ పోటీయే తెల్లవారి ఈర్ష్యకు కారణమై ఉండాలి.............................భారతీయులను గురించి న్యాయంగా చెప్పాలంటే, ఈ పోటీ సహజంగా చాలా సబబైనదని అంగీకరించాలి. దీనిని సాధారణ ప్రజలంతా హర్షిస్తున్నారు. ప్రొద్దున్నుంచి, భారతీయ చిల్లర వ్యాపారులు, స్త్రీలు-పురుషులు-పిల్లలు అందరూ, బరువైన తట్టలు నెత్తినెట్టుకుని ఇల్లిల్లూ తిరుగుతుంటారు. అందువల్ల పౌరులు ప్రశస్తమైన కూరగాయలనూ పండ్లనూ రోజూ చవుకగా కొనుక్కోగలుగుతున్నారు. కొద్ది సంవత్సరాల క్రిందట విపరీతమైన ధరలుపెట్టి మార్కెట్టులలో కొనుక్కుందామని ప్రయత్నించినా, నిశ్చయంగా దొరుకుతాయనే నమ్మకముండేది కాదు.

వర్తకులను గురించి కమీషనరు రిపోర్టు 74 పేజీలో ఈ విధంగా ఉన్నది :

యూరోపియను కాలనిష్టుల మనస్సుల్లో భారతీయులందరి మీదా ఇంతగా ఆగ్రహం రేగడానికి, వ్యాపారంలో అరబ్ వర్తకులు యూరోపియనులతో పోటీచేస్తున్న చాకచక్యమే కారణమని మేము రూఢిగా నమ్ముతున్నాము. వలసవచ్చిన భారతీయ జనాభాకు అవసరమైన సామగ్రులూ బియ్యం వ్యాపారం చేసే వారిమీద వారికి మరీ ఆగ్రహం..........................................

ఇమిగ్రేషన్ చట్టాల ప్రకారం నేటాలుకు భారతీయులు వలస వచ్చిన కారణంచేతనే అరబ్ వర్తకులుకూడా నేటాలు చేరేరు. కాలనీలో ఇప్పుడు ఉంటున్న 30 వేల మంది వలస వచ్చిన భారతీయులకు ముఖ్యంగా కావలసిన భోజన పదార్థం బియ్యం. బుద్ధి సూక్ష్మతగల ఈ వర్తకులు, ఈ బియ్యాన్ని సప్లయి చేయడంలో తమ తెలివితేటలను, శక్తియుక్తులను ఉపయోగించారు. అందువల్ల అంతకు పూర్వం బస్తా 21 షిల్లింగులు అమ్మిన బియ్యంబస్తాధర 1884 సం.రం. నాటికి 14 షిల్లింగులకు పడిపోయి మొత్తం బియ్యంతినేవారందరికీ లాభించింది............

ఆరు ఏడుసంవత్సరాల క్రితంఉండే ధరలమీద నూటికి 25, 30 శాతం తగ్గింపు ధరలకు అరబ్బుల దగ్గరనుంచి కాఫర్లు (నేటివ్‌లు) వస్తువులను కొనుక్కోగలుగుతున్నారని చెపుతున్నారు.

ఏషియాటిక్ లేక అరబ్ వర్తకులమీద కొందరు విధించ దలచుకున్న నిర్బంధ చట్టమునుగురించి విపులంగా చర్చించడానికి మాకు సావకాశంలేదు. కాని *ఈ వర్తకుల ఉనికివలన మొత్తం కాలనీ కంతకూ చాలా లాభదాయకమనీ, వారికి ప్రతిబంధకం కలిగించే శాసనాలను చేయడం అన్యాయమన్నమాట అటుండగా, చాలా బుద్ధితక్కువవని అనీ విశేషంగా పరిశీలన చేసిన మేము మా అభిప్రాయంగా ఇక్కడ ఉదహరింపక తప్పదు.* (ఇటాలిక్సు నావి)

* * * *

8........వారిలో దాదాపు అందరూ మహమ్మదీయులు. చాలామంది మద్యపదార్థాలను ముట్టరు. కొద్దిమంది మితంగా త్రాగుతారు. క్లుప్తంగా జీవించే స్వభావం గలవారు. చట్టానికి బద్ధులై నడుచుకుంటూ ఉండేవారు.

కమీషన్‌ముందు సాక్ష్యమిచ్చిన 72 మంది యూరపియనుల లోనూ, భారతీయులు ఉండడంవల్ల కాలనీ వ్యవహారాలు మారి పోతాయని చెప్పినవారందరూ, దాదాపుగా కాలనీ సంక్షేమానికి భారతీయులు విధిగా ఉండితీరాలన్నవారే.

భారతీయులకు వోటింగుహక్కులు ఉండాలని వాదించడానికి నేను పై సంగతుల నన్నిటినీ విపులంగా ఉల్లేఖించలేదు. (ఆ హక్కులు ఇదివరకే ఉన్నాయి) కాని భారతీయుడు ఎక్కడినుంచో వచ్చిన పరాయివాడనీ, ఈ కాలనీయొక్క ఐశ్వర్యంతో అతనికేమీ సంబంధంలేదనీ చెపుతుండే మాటలు తప్పని చెప్పడానికే ఉల్లేఖించాను. 'పాయసం మంచిచెడ్డలు తింటే తెలుస్తుంది' అని సామెత. భారతీయులనుగురించి ఎవరేమాట చెప్పినా అందరికీ వారి అవసరంమాత్రం ఉంది. ప్రొటెక్టరు డిపార్టుమెంటు వారు భారతీయ కూలీల సప్లయి కావాలని వచ్చే కోరికలను తట్టుకోలేక పోవడమే ఇందుకు ఉత్తమనిదర్శనం.

ప్రొటెక్టరు 1895 స. రం. వార్షిక నివేదిక 5వ పేజీలో ఇలా వ్రాశాడు:

> ఈ సంవత్సరంలో కోరబడిన జనానికింకా 1330 మంది లోటుగా ఉన్నారు. ఈ జనంకాక 1895 సం.రం. నాటికి 2,760 మంది కావలసియున్నది. మొత్తం కావలసినవారి సంఖ్య 4,090. ఈ సంఖ్య మించుమలె నివేదిక సంవత్సరంలో మద్రాసునుంచి 1,049 మంది, కలకత్తానుంచి 983 మంది వచ్చి చేరుకున్నారు. నిరుటి సంవత్సరం ఆర్డరు ఇచ్చిన జనాన్ని పూర్తిచేయడానికి 2,058 మంది కావలసి యున్నది. (వాయిదా దాటిపోయిన రిక్విజిషనులు 12 మినహా)

భారతీయుడు కాలనీకి ప్రమాదం తెచ్చేవాడుగా ఉన్నట్లయితే ఇకముందు ఇమిగ్రేషన్ (వలస) ఆపుచేయడమే అత్యంతన్యాయమైన, ఉత్తమ పద్ధతి. కాలక్రమేణా భారతీయజనాభా కాలనీవారిని బాధించరు. కాని వారిని బానిసస్థితిలో ఉంచుకుంటామనడం మాత్రం, న్యాయం కాదు.

భారతీయులకు వోటింగుహక్కుల నివ్వడానికి చెప్పబడే అభ్యంత రాలన్నిటికీ ఈ హెచ్చరిక తృప్తికరమైన జవాబులనిచ్చినట్లయితే; భార తీయులు రాజకీయాధికారాన్ని, పలుకుబడిని సంపాదించడంకోసం వోటింగు

హక్కుల ఆందోళన చేయడంలేదనీ, పత్రికలు తలపెట్టిన అమర్యాద ప్రయత్నాలకు అసమ్మతిగానే వారి ఆందోళన సాగిస్తున్నారనీ చెప్పిన మాటను పాఠకుడు అంగీకరిస్తున్నట్లయితే; భారతీయులకు వోటింగు హక్కులుండకూడదని ప్రతిఘటించడానికిముందు, కొంచెం నిదానంగా యోచించమని నేను పాఠకుని కోరడంలో బేసబబేమీలేదు. "బ్రిటిష్ పౌరుడు" అనేభావం ఒకపిచ్చి, ఆవేశమూ అని పత్రికలన్నీ త్రోసేసినాయి. అయినప్పటికీ నేనాభావంమీదనే ఆధారపడుతున్నాను. అదేలేకపోతే వోటింగుహక్కుల ఆందోళనే ఉండేదికాదు. అదేలేకపోతే ప్రభుత్వ సహాయంతో ఇమిగ్రేషన్ (వలస) ఉండేదికాదేమో ! భారతీయుడు బ్రిటిష్ పౌరుడేకాకపోతే బహుశా అతడు నేటాలుకు రావడమే సంభవమయ్యేది కాదేమో ! కనుక 'బ్రిటిష్‌పౌరుడు' అనేభావాన్ని అంతతేలిగ్గా మరచి పోవద్దని దక్షిణాఫ్రికాలోఉన్న బ్రిటిష్‌వారిని నేను హెచ్చరిస్తున్నాను. 1858 సం. రం నాటి ప్రకటన రాణీగారు చేసినది. దానిని బ్రిటిష్‌పౌరులందరూ అంగీకరించినట్లే భావించుకోవాలి. ఏమంటే ఆ ప్రకటనను ఆమె తనిష్ట ప్రకారం చేసినది కాదు. అప్పటి ఆమెసలహాదారుల సలహాపైననే చేయబడింది. ఆ సలహాదారులకు వోట్లిచ్చి, వోటర్లు వారియందు తమ కుండే సంపూర్ణ విశ్వాసాన్ని ప్రకటించారు. ఇండియా ఇంగ్లండుది. ఇంగ్లండు ఇండియామీద తమపెత్తనాన్ని వదలుకోదలచుకోలేదు. ఏ భారతీయుని యడల ఏ బ్రిటిష్‌వాడు ఏవిధంగా ప్రవర్తించినా, తుదకు అది బ్రిటిష్‌వారికీ భారతీయులకూ మధ్య ఉండే సంబంధ బాంధవ్యాలను రూపొందిచడంలో దాని ప్రభావం కనుపరుపకమానదు——పైగా, భారతీయుడు బ్రిటిష్‌పౌరుడు కనుకనే దక్షిణాఫ్రికాలో ఉన్నాడనడం నిజం. ఎవరికిష్టమున్నా లేకపోయినా అతడిని భరించకతప్పదు. కనుక ఈ రెండుజాతులమధ్యా మనస్తాపంకలిగే పనులేమీ చేయకపోవడం మంచిదికదా ? తొందరపాటుగా నిర్ణయాని కొచ్చినా, నిరాధారమైన ఊహల నాధారంగాచేసుకుని నిర్ణయాల కొచ్చినా, అనుకోకుండా భారతీయుల కన్యాయం జరుగుతుంది.

న్యాయమాలోచించేవారు ఇప్పుడాలోచించవలసిన విషయం భారతీయులను కాలనీలోనుంచి పంపివేయడమెట్లని కాదు. (ఏమంటే అదిజరుగని పని) ఈ రెండుజాతులమధ్య తృప్తికరమైన సుహృద్భావాన్ని కలిగించాలి. భారతీయుల యడల శతృత్వాన్నీ ద్వేషభావాన్నీ వహించడంవల్ల ఏమీ

ప్రయోజనంలేదని మనవిచేస్తున్నాను. ఇరుగుపొరుగువారితో కలహించి ద్వేషించడంలో ఏమైనాసంతోషముంటే నేను చెప్పలేను. అటువంటి విధానం బ్రిటిష్ రాజ్యాంగానికీ, బ్రిటిష్ న్యాయానికీ, ధర్మానికీ విరుద్ధం. అన్నిటి కన్నా, భారతీయులకు వోటింగుహక్కుల నివ్వటానికి అభ్యంతర పెట్టేవారి క్రైస్తవ మతతత్వానికే అసహ్యమైనది.

నేను ప్రత్యేకంగా దక్షిణాఫ్రికాలో ఉండే పత్రికలవారికీ, ప్రజాసేవకులకూ మతబోధకులకూ ఈ విజ్ఞప్తిచేస్తున్నాను: ప్రజాభిప్రాయం మీ చేతుల్లోఉంది. దానిని మీరు రూపొందించి నడిపించగలరు. ఇంతవరకు అవలంబింపబడుతున్న పద్ధతి న్యాయమైనదీ సరియైనదీ అవునో కాదో నిర్ణయించ వలసినవారు మీరు. దానిని అదే విధంగానే సాగించాలా అనే సంగతి నిర్ణయించ వలసినది మీరు. బ్రిటిష్‌పౌరులుగానూ, ప్రజాభిప్రాయాన్ని రూపొందించవలసిన నాయకులుగానూ, రెండుజాతులవారిని విడగొట్టడం మీపనికాదు. ఉభయులనూ ఏకంచేయడం మీధర్మం. భారతీయులలో చాలా లోపాలు ఉన్నాయి. ఈ రెండుజాతులమధ్యా ప్రబలియున్న అసంతృప్తికరమైన స్థితిగతులకు కొంతవరకు వారే కారకు లనడానికేమీ సందేహంలేదు. లోపమంతా కేవలం ఒకప్రక్కనేలేదనే సంగతిని మీకు నచ్చచెప్పడమే నా ఉద్దేశం.

భారతీయులు ఫిర్యాదుచేయడానికేమీ కారణాలులేవని పత్రికల్లో నేను తరచుగా చదువుతూవచ్చాను. ఆ విషయంలో మీరుగాని, ఇచ్చటి భారతీయులుగాని నిష్పక్షపాతమైన అభిప్రాయానికి రాజాలరు. కనుక బయటిదేశాలలో, ఇంగ్లండు ఇండియాలోని పత్రికలనుచూచి ప్రజాభిప్రాయ మెల్లాఉందో తెలుసుకోమని కోరుతున్నాను. భారతీయులు ఫిర్యాదు చేయడానికి సబబైన కారణాలున్నాయని ఇండియాలోనూ ఇంగ్లండు లోనూకూడా పత్రికలు దాదాపు ఏకాభిప్రాయంలో ఉన్నాయి. ఈ సందర్భంలోనే, మరొకవిషయంకూడా తప్పని నేను చెప్పదలచుకున్నాను. పైదేశాలవారి అభిప్రాయం దక్షిణాఫ్రికాలోని భారతీయులు పంపిన అతిశయోక్తమైన నివేదికలమీద ఆధారపడి యున్నదని తరుచు చెప్పేమాటలు అసత్యం. ఇంగ్లండుకూ ఇండియాకూ, పంపబడిన సమాచార నివేదికలసంగతి నాకు కొంతతెలుసునని ధైర్యంగా చెప్పగలను. వాటిలో పొరబాట్లుంటూఉంటే, అన్నిటిలోనూకూడా ఉన్నసంగతులను తగ్గించిపంపిన నివేదికలేకాని అతిశయోక్తులుకావని నేను నిశ్చయంగా

చెప్పగలను. ఎవ్వరూ కాదనలేనిసాక్ష్యం, ఆధారమూ ఉంటేకాని ఏ ఒక్క మాటా వ్రాయలేదు. ఆ నివేదికలోని అసలువిషయాలు గురించి రెండభిప్రాయాలులేవు. అందరూ అంగీకరించిన విషయాలేకావడం చాలాగొప్ప విశేషం. అందరూ అంగీకరించిన ఆ విషయాలమీద ఆధారపడి ద. ఆఫ్రికాలో భారతీయులను న్యాయంగా చూడడంలేదని పైవారు అభిప్రాయపడుతున్నారు. రేడికల్ పక్షంవారి వార్తాపత్రిక 'ది స్టార్' వ్రాసిన అభిప్రాయాన్ని మాత్రమే నేనిక్కడ ఉల్లేఖిస్తున్నాను. ప్రపంచంలోకల్లా ఒడుదుడుకలులేకుండాఉండే 'టైమ్సు' పత్రిక అభిప్రాయమేమిటో ద. ఆఫ్రికా వారందరికీ తెలిసినదే. 21 అక్టోబరు 1895 తేదీని, స్టార్ పత్రిక, మిస్టర్ చేంబర్లేనును సందర్శించిన రాయబారవర్గాన్ని గురించి వ్యాఖ్యానిస్తూ ఈ విధంగా వ్రాసింది :

> బ్రిటిష్ ఇండియన్ పౌరులను అసహ్యమైన బాధలకు గురిచేస్తున్నారన్నసంగతి తెలుపడానికి పై వివరాలు చాలును. భారతీయులను సాక్షాత్తూ బానిసలుగా చేస్తున్న ఇండియన్ ఇమిగ్రేషన్ చట్టం మరొక నిదర్శనం. అదిఘోరమైన అన్యాయం. బ్రిటిష్ పౌరులకు అమర్యాదకరం; దానిని తయారుచేసినవారికి సిగ్గుచేటు. మనకందరకూ తలవంపు కలిగించేది. దక్షిణాఫ్రికాలోని వర్తకుడు దురాశకొలదీ, రాణీగారి ప్రకటనలవల్లనైతేనేమి, శాసనంవల్లనైతేనేమి, మనతోపాటు సమానులైన మనుష్యులమీద ఇంతటి అన్యాయం చేయబోతుంటే, అతనిని వారించవలసిన విధి ఇంగ్లీషు వారందరికీ ఉన్నది.

ద. ఆఫ్రికాలోని భారతీయుని యెడల 'అత్యంతదయ' చూపబడడం లేదని మీకు నమ్మకం కుదిరేటట్లు నేను చేయగలిగితే, ఇచటి పరిస్థితులకు కొంతవరకు యూరోపియనులుకూడా బాధ్యులని గుర్తించేటట్లు చేయగలిగితే, భారతీయ సమస్యను యావత్తూ నిష్పాక్షికంగా చర్చించడానికి, ఒక మార్గం ఏర్పడుతుంది. బహుశా 'డౌనింగ్ స్ట్రీటు' (లండన్) జోక్యం అక్కర లేకుండానే, ఉభయ పార్టీలకూ సంతృప్తికరమైన పద్ధతిలో ఈ సమస్య పరిష్కరింపబడవచ్చును. ద. ఆఫ్రికా భవిష్యత్తుకంతకూ సంబంధించిన ఇటువంటి ముఖ్య విషయంలో క్రైస్తవమత ప్రబోధకులెందుకు మౌనమువహించి యున్నారు ? వాళ్లు నిస్సందేహంగా రాజకీయాల్లో పాల్గొంటున్నారు. భారతీయులకు వోటుహక్కును తీసివేయాలని ఆందోళనచేసే సభలకు వారు

హోజరవుతున్నారు. ఇది కేవలం రాజకీయసమస్యమాత్రమేకాదు. ఒకజాతి యెడలగల అకారణ ద్వేషంచేత వారిని అణగద్రొక్కి అగౌరవంచేస్తుంటే వీరుచూస్తూ కూర్చుంటారా? క్రీస్తుదేవుని క్రైస్తవమతం ఇటువంటి అల సత్యాన్ని హర్షిస్తుందా?

భారతీయులకు రాజకీయాధికారం అక్కరలేదని మరొక్కసారి ఉద్ఘాటిస్తున్నాను. వోటింగుహక్కును తీసివేయడంవల్ల కలిగే అమర్యాదకూ, దాని ననుసరించివచ్చే ఇతర ఫలితాలకూ, చట్టాలకూ వారు భయపడుతున్నారు. అందుకే దానిని ప్రతిఘటిస్తున్నారు.

ఈ విజ్ఞప్తినంతనూ చదివి, అందులోని విషయాన్నిగురించి తమ అభిప్రాయాన్ని తెలియచేస్తే, వారికి చాలా కృతజ్ఞుడనని ఆఖరుమాటగా మనవి చేస్తున్నాను. చాలామంది యూరోపియనులు లోపాయికారీగా భారతీయుల యెడల తమ సానుభూతిని వెలిబుచ్చారు. భారతీయుల వోటింగు హక్కునుగురించి కాలనీలో జరుపబడుతున్న అనేకసభల్లో ఆమోదింపబడిన తీర్మానాలకూ, అక్కడ ఎంతో విద్వేషపూరితంగా ఇవ్వబడుతున్న ఉపన్యాసాలకూ, తమ అనంగీకారాన్ని తెలియచేశారు. కాని, ఈ పెద్దమనుష్యులు, తాము విశ్వసించిన అభిప్రాయాలను ప్రకటించే ధైర్యంతెచ్చుకుని ముందు కొచ్చినట్లయితే, నాల్గువిధాలుగా బహుమానాల నందుకుంటారు. కాలనీలోనున్న నలభైవేలమంది భారతీయుల కృతజ్ఞతకు పాత్రులవుతారు. అంతేకాదు. యావద్భారతదేశం కృతజ్ఞతకూ పాత్రులవుతారు. కాలనీకి భారతీయుడొక శనివంటివాడనే దురభిప్రాయాన్ని కాలనీలోని యూరోపియనుల మనస్సులనుండి తొలగించినవారవుతారు; దక్షిణాఫ్రికాలో, పురాతనమైన ఒకజాతిపట్ల అకారణంగా జరుగుతున్నదని తమకు తెలిసిన హింస నుండి, వారిని పూర్తిగాగాని కొంతవరకుగాని తొలగించడానికి సాయపడిన వారవుతారు. మహోదారపురుషులైన ఇతర బ్రిటన్‌లతోపాటు, ఇంగ్లండునూ ఇండియానూ, ప్రేమశాంతులతో బంధించకలుగుతారు. అందుకొరకు ముందుగా ప్రయత్నించినవారు కొంత హేళనకు గురికావచ్చును. కాని అటువంటి ఫలితాలను సాధించేటప్పుడు ఈ హేళన నేమీ గణించనక్కరలేదు. రెండుజాతులనూ విడదీయడం తేలికైనపనే. కాని ప్రేమ అనే పట్టుపాశంతో కలుపడం కష్టమైనపని. తప్పకుండా పొందితీరాలి అనుకునే ప్రతివిషయం లోనూ, ముందుగా చాలా కష్టమూ, ఆత్రతా పడాలి.

ఈ విషయంలో నేటాలు ఇండియన్ కాంగ్రెస్‌గురించి ప్రస్తావన చేయబడింది. దానిని గూర్చిన అనేక దురభిప్రాయాలను వ్యాపింపచేస్తు న్నారు. దాని లక్ష్యములను గురించీ, అది పనిచేసే విధానం గురించీ ప్రత్యే కంగా ఇంకొక కరపత్రంలో (అది లభ్యం కాలేదు) చర్చిస్తాను.

ఈ విజ్ఞప్తి తయారవుతుండగా మిస్టర్ మేడన్, బెల్లాయిర్‌లో ఒక ఉపన్యాసమిచ్చాడు. ఆ మీటింగులో ఒక చిత్రమైన తీర్మానం ఆమో దింపబడింది.

ఆయనయడల నాకెంత గౌరవమున్నప్పటికీ, భారతీయులు ఎల్లప్పు డూ దాస్యంలోనే ఉన్నారు కాబట్టి, స్వపరిపాలన కనర్హులని ఆయనచేసిన ప్రకటనతో నే నేకీభవింపను. ఆయనచేసిన ప్రకటనకు, చారిత్రకమైన ఆధార ములు చూపించడానికి ప్రయత్నించాడు. కాని చరిత్ర ఆమాటను బలపర చడంలేదు. అలెగ్జాండరు దండయాత్రతోనే భారతదేశచరిత్ర ప్రారంభం కాలేదు. అయినప్పటికీ అప్పటి భారతదేశంకూడా ఈనాటి యూరోపుతో సరితూగుతుందని నేను ధైర్యంగా చెప్పగలను. అందుకు ఆధారం కావా లంటే హంటరు వ్రాసిన *'ఇండియన్ యంపైర్'* (భారత సామ్రాజ్యము) అనే గ్రంథంలో 169-70 పేజీలలో ఇండియానుగురించి గ్రీకులవర్ణన చదు వండి. అందులోని కొన్ని భాగాలను నేను నా బహిరంగలేఖలో ఉల్లేఖిం చాను. కాని అంతకు పూర్వకాలపుచరిత్ర సంగతేమిటి ? ఆర్యనుల అసలు నివాసము ఇండియాకాదనీ, సెంట్రల్ ఏషియా (ఆసియా మధ్య ప్రాంతం) వారి ఆదిమనివాసమనీ, ఒక శాఖవారు భారతదేశానికొచ్చి దానిని స్థావ రం చేసుకున్నారనీ, మరికొన్ని శాఖలు యూరోపులో స్థిరపడ్డారనీ చరిత్ర చెపుతోంది. ఆకాలపు ప్రభుత్వము నిజమైన నాగరిక ప్రభుత్వమని చరిత్ర చెపుతోంది. ఆర్యుల సారస్వతమంతా అప్పుడే వృద్ధి చెందింది. అలెగ్జాండరు కాలమొచ్చేటప్పటికి భారతదేశం క్షీణముఖం పట్టింది. ఇతరదేశాలు ఇంకా రూపురేఖలు దాల్చకముందు భారతదేశం మహోన్నతస్థితిలో ఉండినది. ఈనాటి భారతీయులు వారి సంతతివారు. కనుక భారతీయులెప్పుడూ దాస్యంలోనే ఉన్నారనడం సరికాదు. కాకపోతే ఇండియా అజేయమని పించుకోలేదు. కాని ఓటింగుహక్కులను తొలగించడానికి కిదేకారణమైతే, ఏదేశంకూడా అజేయంకాదు. భారతదేశంమీద నేడు ఇంగ్లండు సర్వాధి కారాన్ని చలాయిస్తున్నమాట వాస్తవమే. అందుకు భారతీయులు

సిగ్గుపడడంలేదు. బ్రిటీష్ సామ్రాజ్యంలో ఉన్నందుకు గర్విస్తున్నారు. ఏమంటే ఇంగ్లండే భారతదేశాన్ని ఉద్ధరిస్తుందని వారి నమ్మకం. అన్నిటికంటె అత్యాశ్చర్యకరమైన విషయమేమంటే, అనేక శతాబ్దాల నుండి భారతీయులు పర ప్రభుత్వ దాస్యంలో పడున్నప్పటికీ, బైబిల్ లోని యూధులవలెనే, వారినికూడా అణచివేయడం సాధ్యంకాలేదు. భారత దేశం తన ఇష్టంమీదనే ఇంగ్లండుక్రింద ఉందని చాలామంది బ్రిటిష్ మేధావుల అభిప్రాయం. ప్రొఫెసర్ సీలీ ఇలావ్రాశాడు :

> భారతదేశంలోని జాతులను జయించిన సేనలో 5 వ వంతు మాత్రమే ఇంగ్లీషువారు. కంపెనీవారు తమ అధికారాన్ని స్థిర పరచుకున్న మొదటి యుద్ధాల్లో అనగా ఆర్కాటు ముట్టడి, ప్లాసీ, బక్సారు యుద్ధాల్లో కంపెనీతరపున పోరాడినవారిలో యూరో పియనులకన్న సిఫాయిలే ఎక్కువగా ఉన్నారు. మరొక గమనార్హ మైన సంగతేమంటే సిఫాయిలేమీ తక్కువగా పోరాడినట్లు వినం. సిఫాయిలు సోల్జర్లుకన్న అధికంగా ఉన్నారన్న సంగతినీ, యుద్ధ నైపుణ్యాలలో సిఫాయిలు సోల్జర్లతో అడుగుకలిపేరన్న సంగతినీ అంగీకరిస్తున్నప్పుడు, ధైర్యసాహసాల్లో మనకున్న సహజవిశేషం వల్లనే మనకు జయం లభించిందని చెప్పేసిద్ధాంతం, నిస్సారమై పోయింది.

(డిగ్బీ రచించిన *'ఇండియా ఫర్ ఇండియన్సు అండ్ ఫర్ ఇంగ్లండు,)*

ఆ గౌరవనీయుడైన పెద్దమనిషి (మిస్టర్ మేడన్) ఇంకా ఇలా అన్నట్లు ప్రకటింపబడింది :

> నేటాలులో కొన్ని పరిస్థితులలో మనకు (కాలనిష్టులకు) బాధ్యతాయుతప్రభుత్వం వప్పచెప్పబడింది. మేము కోరినబిల్లును మీరు అంగీకరించనందున, ఆపరిస్థితులన్నీ మారిపోయినాయి. చాలా ప్రమాదభూయిష్టమైన పరిస్థితులను మీరు తెచ్చిపెట్టేరు. కనుక మీరిచ్చిన అధికారాలను మేము మళ్లీ మీకు వప్పచెప్పడం మాధర్మం.

ఇదంతా అసలు సత్యానికెంతదూరంగా ఉన్నదో చూడండి ! బ్రిటిష్ ప్రభుత్వం, కాలనీలో భారతీయులకు బలవంతంగా వోటింగుహక్కు ఇస్తు

న్నట్లు భావింపబడుతోంది. కాని అసలుసంగతి వేరు. బాధ్యతాయుత ప్రభుత్వమువల్ల అప్పట్లో ఉండినపరిస్థితులు చాలావరకు మారడం నిజం. డౌనింగు స్ట్రీటు (బ్రిటిష్ ప్రభుత్వం) ఈ విధంగా చెప్పినట్లైతే న్యాయమేకదా! "కొన్ని పరిస్థితులలో మీకు బాధ్యతాయుతమైన స్వపరిపాలన నిచ్చాం. మీరు కడచిన సంవత్సరంలో ప్రవేశపెట్టిన బిల్లువల్ల ఆపరిస్థితులు మారిపోయాయి. మొత్తం బ్రిటిష్ రాజ్యాంగానికీ, బ్రిటిష్ న్యాయసూత్రాలకూ ప్రమాద భూయిష్టమైన పరిస్థితులను మీరు తెచ్చిపెట్టేరు. కనుక, బ్రిటిష్ రాజ్యాంగం ఏమూల సూత్రాలపై ఆధారపడుందో, వాటిని మీరు అతిక్రమించకుండా చూడడం మా విస్పష్టమైన ధర్మంకాదా?"

మిస్టర్ మేడన్ అభ్యంతరాన్ని అంగీకరించే పరిస్థితుల్లోనే బాధ్యతాయుత ప్రభుత్వమొసంగబడినదని మనవిచేస్తున్నాను. భారతీయులకు వోటింగుహక్కులను తీసివేస్తామని అప్పుడే యూరోపియను కాలనిష్టులు పట్టుబట్టినట్లయితే అసలు బాధ్యతాయుత పరిపాలన ఇవ్వబడుండేదా అన్నది వేరే ప్రశ్న.

మో. క. గాంధీ.

[1895 సం. రం. లో డర్బాన్‌లో 40, ఫీల్డు స్ట్రీటులో టి. యల్. కల్లింగ్ వర్తు ముద్రించిన కరపత్రంనుండి.]

# 68. నేటాలులో శాకాహారము

నేటాలులో, ఈ విషయంలో పూనికవహించడం చాలాకష్టమైన పని. నేటాలులోనేకాదు మొత్తం దక్షిణాఫ్రికాలోనే అంత. అయినప్పటికీ, ఆరోగ్యదృష్ట్యా ఆలోచించినా, ఆర్థికంగాచూచినా, ఆచరణయోగ్యతను బట్టి చూచినా శాకాహారానికి ఇంత సౌకర్యమైన ప్రదేశం మరొకటిలేదు. కాని ప్రస్తుతం ఆర్థికంగా శాకాహారమంత తేలికకాదు. శాకాహారిగా ఉండడానికి చాలా నిగ్రహం ఉండాలి. అసంభవమనికూడా అనిపిస్తుంది.

"లండన్‌లో అయితే ఫరవాలేదు. అక్కడ అనేకంగా శాకాహార భోజనశాలలు ఉన్నాయి. కాస్తంత పుష్టినిచ్చే శాకాహారం దొరకని దక్షిణాఫ్రికాలో, శాకాహారిగా ఉండడం ఎట్లా సాధ్యమవుతుంది?"

అని ఈ విషయమై నేను ప్రస్తావనచేసిన అనేకులు జవాబుచెపుతుండే వారు. దక్షిణాఫ్రికా సమశీతోష్ణంగల ప్రదేశం. సమృద్ధిగా తెరపిలేకుండా కూరగాయలు దొరుకుతాయి. అలాంటప్పుడు సాధారణంగా పై జవాబు రావడం అసంభవమనుకుంటారు. అయినప్పటికీ ఆ జవాబు రావడంలో సబబున్నది. ఉన్నహోటళ్లలో ఉత్తమమైన వాటిలోకూడా మధ్యాహ్నం భోజనంలో విధిగా బంగాళాదుంపలే ఉంటాయి. అవికూడా సరిగా వండినవి కావు. రాత్రిభోజనంలో రెండుకాయకూరలు ఉండవచ్చును. సాధారణంగా ఆకూరలలో మార్పుండదు. ఆరామసీమయని చెప్పదగిన ద. ఆఫ్రికాలో ఆయాకాలాల్లో అతిచౌకగా పండ్లుదొరుకుతాయి. అయినప్పటికీ దక్షిణాఫ్రికాలోని హోటళ్లలో పండ్లే కనబడవు. పప్పుదినుసులు అసలేలేవు. డర్బాన్‌లో ఏమైనా పప్పుదినుసులు దొరుకుతాయా అని ఒక పెద్దమనిషి నాకు వ్రాశాడు. చార్లెస్‌టౌన్‌లోను, దాని ప్రక్కనున్న పేటల్లోనూ ఆయన కెక్కడా పప్పులు దొరుకలేదు. పలుకులు క్రిస్టమస్ రోజుల్లోమాత్రం కొనుక్కోడానికి వీలవుతుంది.

ఇప్పటి పరిస్థితులివి. కనుక తొమ్మిది నెలలనుంచి నేను ప్రచారం చేస్తున్నా, నెమ్మదిగా మనుష్యులను బుజ్జగించినా, చెప్పుకోదగినంత అభివృద్ధి కనుబడదు. శాకాహార ప్రచారానికివే అభ్యంతరాలు కావు. ఇక్కడ

జనానికి బంగారంతప్ప మరొక ఆలోచనేలేదు. ఈ బంగారం జ్వరం ఎంత వ్యాప్తమై పోయిందంటే, గొప్పవారికీ, పేదవారిలో పేదవారికీకూడా ఇదిసోకింది. మత బోధకులకుకూడా ఈ జ్వరమే తగిలింది. జీవితంలో ఉన్నతమైన విషయాలను గురించిగాని ఆముష్మిక విషయాలనుగురించిగాని ఆలోచించడానికి వారికి తీరికలేదు.

'వెజిటేరియన్' పత్రికాప్రతులు ప్రతివారం అన్ని పఠనాలయాలకూ పంచిపెట్టబడుతున్నాయి. వార్తాపత్రికల్లో అప్పుడప్పుడు ప్రకటనలు వేయబడుతున్నాయి. ఇందువల్ల కొన్ని అభిమానపూర్వకమైన ఉత్తరాలు వస్తున్నాయి. కొందరు భోగట్టాలు చేస్తున్నారు. ఈ ఉత్తర ప్రత్యుత్తరాల్లోనూ, ఈ సంభాషణల సందర్భంలోనూ కొంత హాస్యరసంకూడా లేకపోలేదు. ఇసాట్రిక్ క్రిస్టియానిటీ విషయంలో నాతో కొంతవరకు ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపిన ఒక స్త్రీ, దానికీ శాకాహారానికీ సంబంధం ఉన్నందుకు చాలా ఆగ్రహపడింది. ఆవిడకు చెడ్డ చిరాకుకలిగి ఆ పుస్తకాలను చదువకుండానే నాకు తిరిగి ఇచ్చివేసింది. మరొక పెద్దమనిషి జంతువునైనా తుపాకితో కాల్చడం, కత్తితోకోయడం చాలా సిగ్గుచేటనీ, తానటువంటిపనిని ఈ జన్మకుచేయననీ వ్రాశాడు. కాని ఎవరైనా మాంసం వండిపెడితే మాత్రం భోజనంచేయడానికేమీ ఆయనకు అభ్యంతరం లేదట.

ద. ఆఫ్రికాలో ముఖ్యంగా నేటాలులో శాకాహారతత్త్వం వర్ధిల్లడానికి సావకాశాలు చాలా ఉన్నాయి. కాని వాటిని ప్రచారంచేసే మనుష్యులులేరు. భూమి చాలా సత్తువైనది. ఏ పంటయినా పండుతుంది. కావలసినంత బంజరుభూమి ఉన్నది. ఎవరైనా బుద్ధిశాలురైన వ్యవసాయకులు తలచుకుంటే బంగారుపంటలు పండించవచ్చును. జోహాన్సుబర్గు బంగారంకోసం దేవులాడే వారుకొందరు వ్యవసాయంచేసి ధనార్జనచేయాలనే ధోరణిలో పడితే, రంగుద్వేషాన్ని వారు వదలుకోగలిగితే, నేటాలులో అన్నిరకాల పండ్లు కూరగాయలు పండించగల రనడానికేమీ సందేహంలేదు. ద. ఆఫ్రికా శీతోష్ణస్థితివలన, యూరోపియనులు మాత్రమే దానిని పూర్తిగా సాగులోకి తీసుకు రాజాలరు. భారతీయుల సహాయాన్ని వారు విధిగా పొందితీరాలి. కాని ద. ఆఫ్రికాలో చాలా బలీయంగాఉన్న రంగుద్వేషంవల్ల వారు ఆ సహాయాన్ని పొందరు. భారతీయకూలీలమీదనే కాలనీ ఐశ్వర్యం ఆధారాపడున్న నేటాలులోకూడా రంగుద్వేషం బలీయంగానే ఉంది.

భారతీయకూలీలచేత పనిచేయించుకోవాలని తనకెంత అభిలాషగా ఉన్నా, ఈ రంగుద్వేషంవలన సాధ్యంకావడంలేదని ఒకతోట యజమాని నాకు ఉత్తరం వ్రాశాడు. కనుక శాకాహారులకు దేశాభిమానయుతమైన పనిచేయ డానికిక్కడ గొప్ప సావకాశమున్నది. ద. ఆఫ్రికాలో బ్రిటిష్ పౌరులైన తెల్లవారికీ భారతీయులకూ వివాహ సంబంధాలేర్పడడానికుండే అడ్డంకులు బలమై పోతున్నాయి. ఇంగ్లీషువారిలోను, భారతీయులలోను, ఉత్తములైన రాజకీయవేత్తలు అవిచ్ఛేదకమైన ప్రేమపాశాలచేత రెండుజాతులనూ బంధింపవచ్చునని అభిప్రాయపడుతున్నారు. వేదాంతవేత్తలు అటువంటి కలయికవల్ల సత్ఫలితాలు కలుగగలవని ఆశిస్తున్నారు. ద. ఆఫ్రికా బ్రిటిష్ పౌరులైన తెల్లవారు, ఈ కలయికను శక్తివంచనలేకుండా ప్రతిఘటిస్తు న్నారు. ఆ ప్రమాదం జరుగకుండాచేయడానికి కొందరు శాకాహారులు ముందుకు రావచ్చునేమో !

నేను మరొక్కసూచనచేసి, నేటాలులో జరిగిన పనినిగురించి తొందరలో వ్రాసిన ఈ సమీక్షను ముగిస్తాను. శాకాహార గ్రంథములను బాగుగా చదివినవారు, ఉపాధులున్నవారు, ప్రపంచంలోని వివిధ దేశాలను దర్శించి, శాకాహారుల దృష్ట్యా అక్కడుండే సావకాశాలను పరిశీలించి నివేదించడం వల్లనూ, శాకాహార ప్రచారం సాగించడానికి వారికి వీలనితోచిన దేశాలకు వెళ్లి అక్కడ స్థిరపడమని కోరడంవల్లనూ, బాగా పనిజరుగుతుంది. ఆలాగున స్థిరపడినవారికి ఆర్థికంగాకూడా సౌలభ్యమేర్పడితే పేదవారైన శాకాహారులకు ఉపాధిమార్గముల నేర్పాటుచేయవచ్చును. తద్వారా ప్రపంచంలోని వివిధ ప్రాంతాల్లో నిజమైన శాకాహారతత్వకేంద్రాలను స్థాపించ వచ్చును.

కాని శాకాహారతత్వం ఇంతపని సాధించాలంటే అదొకమతం కావాలి. కేవలం ఆరోగ్య శాస్త్రానికి సంబంధించిన సౌకర్యం కాకూడదు. ప్రచారవేదిక యొక్క స్థాయిని ఇంకా చాలా ఎత్తుచేయాలి.

[*ది వెజిటేరియను* 21–12–1895.]

# 69. శాకాహార తత్వం

డర్బాన్
ఫిబ్రవరి 3, 1896.

*నేటాలు మెర్క్యురీ* సంపాదకులకు

అయ్యా,

ఆహార సంస్కరణాభిలాషినైన నేను, మీరు మీ శనివారపు పత్రికలో "రోగనివారణకు కొత్త శాస్త్రము" అని ప్రకృతి ఆహారము అనగా శాకాహార భోజన విశిష్టతను గురించి వ్రాసిన సంపాదకీయ వ్యాసానికి మిమ్ములను అభినందిస్తున్నాను.

మన దురదృష్టంకొలదీ భోగలాలసత ఈ కాలంలో చాలా ఎక్కువైనది. ఏ సిద్ధాంతాన్నైనా, ఆచరించాలనే సంకల్పం లేకపోయినా, మాటలతో బలపర్చేవారెక్కువై పోయారుకాని, లేకపోతే మనమంతా శాకాహారులుగా ఉండవలసినవారమే. మరొకలా ఎందుకుండాలి? మాంసాహారం లేకుండా మనం జీవించలేమన్నది చాలా ఘోరమైన పొరబాటని సర్ హెన్రీ థాంప్సన్ అంటున్నాడు. ప్రసిద్ధులైన శరీరశాస్త్రజ్ఞులు, పండ్లు మనిషికి సహజమైనఆహారమని నిర్ణయించినారు. బుద్ధుడు, పైథాగరస్, ప్లేటో, పోర్ ఫ్రీ, రే, డేనియల్, వెస్లీ, హోవర్డు, షెల్లీ, సర్ ఐజాక్ పిట్ మన్, ఎడిసన్, సర్. డబ్ల్యు. బి. రిచర్డు సన్, వగైరాలెందరో ప్రముఖులు శాకాహారులున్నారు. శాకాహారులైన క్రైస్తవులు, క్రీస్తుకూడా శాకాహారే అంటారు. సమాధినుంచి లేచి వచ్చిన పిమ్మట ఒక కాల్చిన చేపను తిన్నట్లు ఒక కథ తప్ప, ఆయన శాకాహారి కాదనడానికేమీ ఇతర ఆధారాలు కానరావు. ద. ఆఫ్రికాలో చాలా ప్రయోజకులనిపించుకున్న మిషనరీలు (ట్రాపిస్టులు) శాకాహారులే. ఏ విధంగా పరిశీలించినా, శాకాహార భోజనం, మాంసాహారంకన్న చాలా ప్రశస్తమైనదని ఋజువు చేయబడింది. తత్వశాస్త్రవేత్తలందరూ ఆత్మసాధనకు మాంసాహారంకన్న అపాయకరమైన దింకొకటి లేదంటారు. అన్ని మతాల ఆచార్యులూ-బహుశా ఒక్క ప్రొటెస్టెంటు గురువులుతప్ప-మాంసాహారాన్ని నిషేధించారు. నేడు నిరీశ్వర తత్వానికీ, భౌతిక వాంఛలకూ, మత

నిర్లక్ష్యతకూ కారణం మాంసం తినడమనీ, మద్యం త్రాగడమేననీ, అందువల్ల ఆధ్యాత్మిక చింత తగ్గిపోతోందనీ తీవ్రవాదులైన శాకాహారులంటారు. ప్రపంచంలో ఉద్భవించిన మేధావులందరూ, ఆహారాదినియమాలను పాటించినవారేననీ, ముఖ్యంగా వారు ఉద్గ్రంథాలను రచించేకాలంలో సాత్వికాహారులనీ, మేధావులదృష్ట్యా, శాకాహారభోజనం ఉత్తమమైనదని నిరూపించడానికి శాకాహారులు చెపుతుంటారు. గొడ్డుమాంసము, దానితో కలసే ఇతర మసాలాలు మందులు నిష్ప్రయోజనమైనప్పుడు, శాకాహారం అమోఘంగా పనిచేసిందని శాకాహార పత్రికల్లో ప్రచురింపబడే అనేక వ్యాసాలు, సమీక్షలు ఋజువుచేస్తున్నాయి. ప్రపంచంలో చాలా వరకు వ్యవసాయకులు శాకాహారులేనని కండపుష్టిగల శాకాహారులు ఉదాహరణపూర్వంగా ఋజువు చేస్తున్నారు. చాలా బలంకలిగినటువంటిన్నీ, ఉపయోగమైనటువంటిన్నీ జంతువైన గుఱ్ఱం శాకాహారేననీ, చాలా భీకరమై, నిరుపయోగమైన సింహం మాంసాహారి అనీ వారు చెపుతుంటారు. స్వార్థపరులైన కొందరు మనుష్యులు భోగలాలసమైన తమ ఆకలి చల్లార్చుకునేటందుకు, పాపంకొందరు మనుష్యులను కటికివృత్తికిపాల్జేసినారనీ, తాము మాత్రం ఆపనిచేయడానికి భయపడి క్రుంగిపోతారనీ, శాకాహారసిద్ధాంతులు విచారపడుతూ ఉంటారు. మాంసాహారం, మద్యపానం రెండూ లేనప్పుడే ఇంద్రియ నిగ్రహంకలిగి, పతితులుకాకుండా ఉండడం చాలా కష్టం. దానికి తోడు జంట దురభ్యాసాలైన మాంసం, త్రాగుడూ రెండూ ఉంటే, మరింత కష్టం. కనుక వాటిజోలికి పోవద్దని శాకాహార తత్వజ్ఞులు మనకు ప్రాధేయపూర్వకంగా చెపుతున్నారు. మాంసం తినడంవల్ల మద్యపానాసక్తి పెరుగుతుందనీ, శాకాహారంలో ప్రధానమైన పండ్లరసాలు, త్రాగుడు వ్యసనాన్ని పోగొడతాయనీ చెపుతారు. మాంసాహారం అనవసరమేకాకుండా శరీరానికి ప్రమాదకరమని వారి వాదన. మాంసాహారంకొరకు అమాయకమైన జంతువులనుక్రూరంగా హింసచేయవలసి ఉంటుంది కనుక, మాంసాహారం అదేపనిగాతినడం అవినీతికరమనీ, పాపమనీకూడా వారభిప్రాయం. శాకాహారభోజనపదార్థాలు అన్నిటికన్నా చౌకైనవని శాకాహార సిద్ధాంతులైన ఆర్థిక శాస్త్రవేత్తలు నిస్సంకోచంగా చాటుతున్నారు. అధి భౌతిక (లౌకిక) సంస్కృతి ముందుకెడుతున్నకొద్దీ, అపారమైనధనం కొద్దిమందిచేతుల్లోకి చేరుకుంటూ ఉండడంచేత, దానితోపాటే పెరుగుతున్న పేదరికం పూర్తిగా పోకపోయినా చాలావరకు తగ్గాలంటే సాధారణంగా అందరూ

శాకాహారులుగా మారిపోవాలి. డాక్టర్ లూయీకూన్ కేవలం శరీర శాస్త్రం దృష్ట్యా మాత్రమే శాకాహారం ఆవశ్యకతను నిరూపిస్తున్నాడు. ఆయన శాకాహారాన్ని తినడం ప్రారంభించేవారికి, అనేకమైన శాకాహార పదార్థాలలో ఏవి తినతగినవో ఎన్నుకోడానికి ఒక పద్ధతిగాని, వాటిని సరిగా పచనంచేసుకునే పద్ధతినిగాని చెప్పలేదు. శాకాహారాలను వంటచేసే పద్ధతులనూ, వాటి మంచిచెడ్డలను వివరించేవీ కొన్ని పుస్తకాలు నాదగ్గర ఉన్నవి. (వాటి ఖరీదులు 1 పెన్నీ మొదలు 1 షిల్లింగువరకూ ఉన్నాయి). చౌక పుస్తకాలన్నీ అందరికీ ఇవ్వడమైపోయింది. మీ పాఠకులలో ఎవరైనా ఈ క్రొత్త శాస్త్రాన్ని దూరాన్నుంచిచూచి ఆనందించడంతో సంతృప్తిపడకుండా, ఆ సిద్ధాంతాలను ఆచరించడానికి పూనుకునే యడల, శాకాహార తత్వానికి సంబంధించిన కరపత్రాలను నాదగ్గరున్నంతవరకు పంపుతాను. బైబిల్‌లో విశ్వాసమున్నవారికి దానిలోనుండి ఈ క్రింది విషయాన్ని ఉల్లేఖిస్తున్నాను. 'పాప పతనానికి' ముందు మనం శాకాహారులమే :

> .... దేవుడన్నాడు : తెలుసుకోండి! మీకు ఈ భూమి మీదనున్న మొక్కలుమొలిచే విత్తనాలన్నీ ఇచ్చాను. ప్రతిచెట్టుకీ ఒక పండుంది. ఆ పండులో మళ్లీ చెట్టును మొలిపించే విత్తుంది. అవే మీకు ఆహారం. ఈ భూమి మీదవుండే ప్రతి జంతువుకీ, ప్రాణమున్న, గాలిలో ఎగిరే ప్రతి పక్షికీ, నేలమీద పాకే ప్రతి జీవానికీ, ఈ పచ్చని వనంతరాలన్నిటినీ ఆహారంగా ఇచ్చాను; అదల్లాగే అయింది.

క్రైస్తవులుగా మతంపుచ్చుకోని వారు మాంసాహారం తిన్నారంటే కొంతవరకు క్షమార్హం కావచ్చును. కాని 'పునర్జన్మ' నెత్తినవారు అనగా మతంపుచ్చుకున్నవారు మాత్రం క్షంతవ్యులు కారంటారు శాకాహారులైన క్రైస్తవులు. ఏమంటే, వారిస్థితి 'పాప పతన' మప్పటికంటే అధికంగా కాకపోయినా, అంతతో సమానంగానైనా ఉండాలంటారు. దేవుడు పతితులను ఉద్ధరించిన సమయంలో మరల ఈ విధంగా అన్నాడు :

> తోడేలు గొఱ్ఱెపిల్లతో నివసించుగాక. చిరుతపులి మేకపిల్ల దగ్గర పరుండునుగాక ; ఆవుదూడా, సింహంపిల్లా కలసి నివసించునుగాక. వీటన్నిటికీ చిన్నపిల్లవాడు కాపరిగా నుండునుగాక........ సింహం ఎద్దువలెనే గడ్డితినునుగాక !........పవిత్రమైన నాకొండలో

పరస్పర హింసగాని నాశముగాని చేయకుందురుగాక. ఏమంటే సముద్రాలన్నీ జలపూరితమైనట్లే, భూమి అంతా దైవ జ్ఞానంతో నిండిపోవునుగాక.

ప్రపంచమంతటా ఇలాంటి రోజులు రావడానికి చాలాకాలం పట్ట వచ్చును. కాని ఎవరీసంగతి నెరుగుదురో, ఎవరు ఆచరించగలరో అటువంటి క్రైస్తవులెందుకు తమ మట్టుకైనా ఆచరించకూడదు ? ఎప్పుడో జరిగేపనిని ఇప్పుడే చేసుకుంటే ప్రమాద మేమీలేదు. అందువల్ల వాటిరాకనుకూడా తొందరచేయవచ్చును.

భవదీయుడు,

మో. క. గాంధీ.

[*నేటాల్ మెర్క్యురీ*, 4—2—1896.]



# 70. నేటాల్ గవర్నరుకు విజ్ఞప్తి

డర్బాన్,
ఫిబ్రవరి 26,1896.

హిస్ యక్సలెన్సీ ది ఆనరబుల్ సర్ వాల్టర్ ఫ్రాన్సిస్ హీలి హచ్చిన్‌సన్, నైట్ కమాండర్ ........వగైరా, నేటాల్ కాలనీ కమాండర్ ఇన్ చీఫ్ అండ్ గవర్నర్, వైస్ అడ్మిరల్ ఆఫ్ నేటాల్, సుప్రీంఛీఫ్ ఆఫ్ నేటివ్ పాప్యులేషన్, గవర్నర్ ఆఫ్, జూలూలాండ్ వగైరా వగైరా గారికి—

పీటరు మారిజ్‌బర్గు,
నేటాల్

నేటాలులో నివసిస్తున్న ఈ దిగువసంతకములుచేసిన ఇండియన్ బ్రిటిష్ పౌరుల విజ్ఞాపన.

మా మనవి చిత్తగించేది :

నేటాలులో నివసిస్తున్న భారతీయులకు ప్రతినిధులమైన మేము, జూలూలాండ్‌లో నాన్‌ద్వేనీ టౌన్‌షిప్‌లో నివేశనస్థలాల అమ్మకం విషయంలో, 25-2-1896 తేదీ నేటాలు గవర్నమెంటు గెజెట్‌లో ప్రకటింపబడిన నిబంధనలలో ఈ క్రింది భాగాలను గురించి ప్రభువువారికి విజ్ఞప్తిచేసుకుంటున్నాము :

సెక్షన్ 4 లోని భాగము : పుట్టుకవల్లగాని జాతివల్లగాని యూరోపియనులైనవారు ఈ స్థలాల వేలంలో పాల్గొనదలచినట్లయితే, నిర్ణయింపబడిన వేలం తేదీకి కనీసం 20 రోజులైనా ముందుగా, తమకు కావలసిన నివేశనస్థలం నెంబరు వగైరా వివరాలను తెలుపుతూ, జూలూలాండ్ శెక్రటరీ పేరిట పీ. మా. బర్గుకుగాని, ఇషొవే (జూలూలాండ్)లో ఉన్న గవర్నమెంటు శెక్రటరీ పేరగాని వ్రాతమూలకమైన నోటీసివ్వాలి.

18 వ సెక్షన్‌లోని భాగం : పుట్టుకవలన యూరోపియనులైనవారున్నూ, జాతికి యూరోపియనులైనవారున్నూ మాత్రమే ఈ

నివేశన స్థలాలలో ఉండడాని కర్హులు. పై షరతులను అమలు జరుపక పోయినట్లయితే సదరు నివేశనంగాని నివేశనములుగాని, పై సెక్షన్‌లోవలెనే ప్రభుత్వానికి చెందగలవు.

రూలు 20 : నాన్ద్వేనీ టౌన్‌షిప్‌లో నివేశన స్థలాలను కొనుక్కున్నవారు, ఎప్పుడైనా ఆ స్థలాలనుగాని ఇండ్లనుగాని అందులోని భాగాలనుగాని అమ్మడంగాని అద్దెకుగాని ఇవ్వదలచుకున్నా, ఊరికే ఎవరికైనా ఉండనివ్వదలచుకున్నా, యూరోపియనులకు పుట్టినవారినీ, యూరోపియను జాతివారినీతప్ప మరొకరిని ప్రవేశ పెట్టకూడదు. ఈ షరతుకు లోబడి ఈ నివేశనాలు విక్రయింపబడును. 10, 11, 13 సెక్షనుల ప్రకారం సదరుస్థలాల క్రియ దస్తావేజులలో పై షరతువిధిగా ఉదహరింపబడాలి. క్రయదారుడు పై షరతులను అతిక్రమించేయడల, 17వ సెక్షను ప్రకారం సదరు నివేశనాలు ప్రభుత్వానికి స్వాధీనమవుతాయి.

పై నిబంధనలు, మహారాణిగారి భారతీయ పౌరులు, నాన్ద్వేనీ టౌన్‌షిప్‌లో నివేశన స్థలాలనుగాని స్థిరాస్థులనుగాని కొనుక్కోకుండా చేయడానికేనని మేము అర్థం చేసుకుంటున్నాము. ఈ విధంగా బ్రిటిష్ పౌరులైన భారతీయులకూ, ఇండియనులకూ మధ్య అన్యాయమైన తారతమ్యం చూపిస్తున్నందుకు మేము తీవ్రమైన అసమ్మతిని తెలుపుతున్నాము.

ద. ఆఫ్రికాలో ప్రబలుతున్న రంగు విద్వేషానికి లొంగిపోతున్నారనడానికిది మరొక ఉదాహరణయే తప్ప, ఈ వెలికి మరొక కారణం మాకు కనుపించటంలేదు.

మహారాణీగారి పౌరులైన కొందరికి, మరికొందరికంటే హెచ్చు సౌకర్యాలను కలిగించడం, బ్రిటిష్ న్యాయనీతికి విరుద్ధము. అంతేకాకుండా భారతీయులకు సంబంధించినంతవరకు 1858 సం. రం. (ప్రొక్లమేషన్) రాణీగారి ప్రకటనలో బ్రిటిష్ ఇండియనులకు యూరోపియనులతోపాటు సమానహక్కులను ప్రసాదించిన షరతులను, ఈ నిబంధనలు అతిక్రమిస్తున్నవని మేము సవినయంగా మనవిచేస్తున్నాం.

ఈ విషయంలో ట్రాన్సువాలులో ఉంటున్న భారతీయుల తరఫున రాణీగారి ప్రభుత్వంచేస్తున్న ప్రయత్నాలుచూస్తూ, స్థిరాస్థి హక్కుల

విషయంలో ఈ నిబంధనలద్వారా చూపబడుతున్న తారతమ్యాన్ని చూస్తుంటే చాలా ఆశ్చర్యకరంగానూ విరుద్ధంగానూ ఉన్నదని మేము విన్నవించుకుంటున్నాము.

చాలామంది భారతీయులకు, జూలూలాండ్‌లోని ఇతర ప్రాంతాల్లో స్థిరాస్థులున్నాయని మేము విజ్ఞప్తి చేసుకుంటున్నాం.

కనుక రెగ్యులేషనులలోని 23వ సెక్షన్ ప్రకారం మినహాయింపు చేయబడిన అధికారాలను పురస్కరించుకుని, ఈ విధమైన తారతమ్యాలను తొలగించేవిధంగా ప్రభువువారు మార్పులనుగాని సవరణలుగాని చేయమని, ఉత్తరువులు దయచేయించవలెనని, మేము సవినయంగా ప్రార్థిస్తున్నాము.

ఈ విధంగా, దయచేసి న్యాయం చేయించినట్లయితే మేము సదా కృతజ్ఞులం వగైరా........

సం. అబ్దుల్ కరీం హాజీ
మరి 39 మంది.

[చేతితో వ్రాయబడిన కాపీనుండి ఫోటో తీయబడినది.]



విధేయుడు,

# 71. భారతీయులు—ప్యాసులు

డర్బాన్
మార్చి 2, 1896.

*నేటాల్ మెర్క్యురీ* సంపాదకులకు—

అయ్యా,

పనిపాటులు చేయకుండా సోమరిగా తిరిగేవారి నిమిత్తంచేయబడిన (వ్యాగ్రెన్సీలా) చట్టంప్రకారం రాబర్ట్సు, రిచర్డ్సు అనే ఇద్దరుముద్దాయీల మీద మోపబడిన అభియోగాన్నిగురించీ, దానిమీద సూపరింటెండెంటు అభిప్రాయాలనుగురించీ మీ 29వ ఫిబ్రవరి తేదీగల పత్రికలో ప్రచురింప బడిన విషయాలమీద, నా అభిప్రాయాలను ప్రకటింప గోరుచున్నాను. గొప్పవాడైన సదరు పోలీసు సూపరింటెండెంటు, ఎవరినిగురించి హఠాత్తుగా పైకొచ్చినవాళ్ళనీ, ఇంకా ఇతరచెడ్డమాటలనూ ప్రయోగించాడో, ఆ ముద్దాయిలైన రాబర్ట్సు, రిచర్డ్సుగార్లను సమర్థించటానికీ, భారతీయ సంఘాన్ని సమర్థించడానికీ నేనీ సంగతులు వ్రాస్తున్నాను. మీ పత్రికలోని రిపోర్టుప్రకారం, మిస్టర్ వాలర్ తీర్పు న్యాయవిరుద్ధమని ధ్వనిస్తుంది.*

ఆ అభిప్రాయాన్ని చిత్రించడానికి, సాక్ష్యంలోకొన్ని భాగాలను ఉదహరించాడు. నేను ఏభాగాలను, ముద్దాయిలయెడలనూ, అటువంటి స్థితిలోపడ్డ ఇతరులయెడలనూ, సానుభూతికోసం ఉపయోగించ దలచుకున్నానో, ఆభాగాలనే అయన ఉదహరించాడు.

వారిది చాలా కఠినమైనకేసు. వారిని అరెస్టుచేయడంలోనూ పిమ్మట బాధపెట్టడంలోనూ పోలీసులు చాలాపొరబాటుచేశారని నా అభిప్రాయం.

---

* [పోలీసు మేజస్ట్రేటు మిస్టర్ వాలర్ కేసును కొట్టివేయడానికి చెప్పిన కారణాలివి. రాత్రి 9 గంటలకు రంగుజాతిమనిషి ప్యాసులేకుండా కనుబడినపుడు పోలీసుప్రశ్నిస్తే, ఇంటికెళ్ళిపోతున్నానని జవాబు చెప్పినట్లయితే అతడు దోషికాడు. చట్టప్రకారం రాత్రి 9 మొదలు ఉదయం 5 గంటలులోగా రంగుజాతిమనిషి, తన యజమానివద్దనుంచి ప్యాసులేకుండా వీధుల్లో తిరుగుతూ అడిగినపుడు సరియైన సమాధానం ఇవ్వలేకపోతే అతనిని అరెస్టుచేయవచ్చును.]

పోలీసువారు (వేగఖాండు) సోమరుల చట్టాన్ని భారతీయుల విషయంలో కొంచెం నిదానంగా ఆలోచించి ప్రయోగిస్తున్నట్లయితే, ఆ చట్టమంత బాధాకరమనిపించదని నేనుకోర్టులో చెప్పినమాటనే మరల చెబుతున్నాను. ముద్దాయీలు ఇద్దరు కంట్రాక్టు కూలీలైనభారతీయుల కొడుకులు అవడం వారియడల వ్యతిరేకతకు కారణం కాకూడదు. అందులోనూ ఒక మనిషి తాహతును ఆతని విలువనుబట్టే కాని పుట్టుకనుబట్టి నిర్ణయింపబడని ఇంగ్లీషు జాతివారి కసలేతగదు. అలాకాకపోతే కటికవానికొడుకును మహాకవిగా గౌరవించడం జరుగదు. రెండవముద్దాయి రెండుసంవత్సరాలక్రితం తన పేరును మార్చుకున్న సంగతిని సూపర్నెంటుగారే పెద్దవిషయంగాచేశాడు. అతడిని అరెస్టుచేసిన పోలీసుజవాను కావాలనిచేసిన *అగౌరవానికి దాని నొక సాకుగా చెప్పడానికి ప్రయత్నించాడు. డ్యూటీలోఉన్న కాని స్టేబులుకు, అతడెప్పుడు పేరుమార్చుకున్నాడో తెలియదన్న విషయం మరువకూడదు. సోమరుల చట్టాన్నుండి తప్పుకోవడానికి అతడీవిధంగా పేరుమార్చుకున్నాడని సూపర్నెంటు ఊహించుకున్నమాట సరియైనది కాజాలదు. అతడాప్రయత్నం చేయడానికి అతడేజాతివాడో ముఖం చహరాచూస్తేనే తెలిసిపోతుంది. పైగా ముద్దాయి తన జాతినిగురించి గాని పేరునుగురించిగాని భిడియపడినట్లు కనుబడదు. ఆ విషయమై ప్రశ్నించడంతోనే వెంటనే జవాబుచెప్పేడు. ఆ జవాబువల్ల సూపర్నెంటు ఎంతో సంతోషపడి ఇలా అన్నాడు: "సరేలఖ్బాయీ! అంతా నీలాగే ఉంటే పోలీసువారికి కష్టమే కలుగదు."

మతం మార్చుకోవడం తప్పైతే తప్పు, ఎవరైనా మార్చుకుంటే ఏమంత మహాపరాధంకాదు. చిన్న సంగతులను పెద్దవాటితో పోల్చవల సొస్తే, మిస్టర్ క్విలియం మహమ్మదీయుడు కావడంతోనే హాజీఅబ్దుల్లా అయినాడు. పూర్వం మానికాలో కాన్సల్ జనరల్‌గా ఉండిన మిస్టర్ వెబ్, మహమ్మదీయమతం స్వీకరించడంతోనే మహమ్మదీయ నామం ధరించాడు. భారతీయులు క్రిస్టియనుల పేర్లనే కాకుండా క్రిస్టియను దుస్తులు ధరించడంకూడా కానిస్టేబులుల దృష్టిలో అపరాధమే. ఇప్పుడు, సూపర్నెంటు అభిప్రాయ ప్రకారం భారతీయుడు మతం మార్చుకుంటే కూడా అనుమానానికి గురిఅవుతాడన్నమాట. చట్టాన్ని

*ముద్దాయి తనపేరు శామ్యుల్ రిచర్డ్సు అని చెప్పేసరికి కానిస్టేబుల్ అతనిని చూచి నవ్వేడు.

తప్పించుకోడానికి కాకుండా, నిజమైన విశ్వాసం కారణంగా, మతం మార్చుకుంటే అతడి నెందు కనుమానించాలి? ఈ కేసులోని ముద్దాయీ లిద్దరూ నిజమైన క్రైస్తవులేనని నేను భావిస్తున్నాను. ఏమనగా వారుభయులూ డాక్టర్ బూత్ *మన్ననలను పొందినవారే. "ఒకమనిషి నిజమైన క్రైస్తవుడేనా లేక క్రైస్తవ వేషంలోఉన్న సైతానా అనేవిషయం ఎట్లా తెలుస్తుంది?" అని సూపర్నెంటు ప్రశ్నించవచ్చును. ఇది జవాబు చెప్పటానికి, కష్టమైనప్రశ్నే. ప్రతికేసులోనూ దాని మంచిచెడ్డలనుబట్టి ఆ విషయం నిర్ణయింప బడాలని నేను కోర్టువారికి మనవిచేశాను. ఇతర జాతులవారి విషయంలోవలెనే, మామూలుగా ఊహాలవల్ల కలిగే లాభాన్ని భారతీయుల కివ్వాలి.

ఇద్దరు మనుష్యులు పెద్దమనిషితరహాగా దుస్తులు ధరించి, రాత్రి 9-30 గంటలకు మెయిన్‌రోడ్ వెంట మెల్లగా నడచివస్తుంటే, పోలీసులాపి ప్రశ్నిస్తే, తోటల్లోనుంచి ఇంటికెడుతున్నామని సమాధానం చెప్పేరు. వారిని ఆపిన చోటునుంచి వారిండ్లకు 7 నిముషాలనడకకన్న హెచ్చులేదు. వారిద్దరిలో ఒకడు గుమాస్తా. రెండవవాడు ఉపాధ్యాయుడు. ఇటువంటి సందర్భంలో మామూలు ఊహావల్ల కలిగే ప్రయోజనాన్ని వారికివ్వవచ్చునని నేను కోర్టువారికి చెప్పుకున్నాను. ఇటువంటి కేసుల్లో పోలీసుల కనుమానం తగిలితే వారిని ఇంటిదాకా దిగబెట్టవచ్చుననికూడా నేను మనవిచేశాను. అది కూడా చేయడానికి వీలులేకపోతే, పోలీసువశంలో ఉన్న మనుష్యులను పెద్దమనుష్యులునుగా చూడవచ్చును. ముందే వారిని దొంగలూ బంది పోట్లుగా నిర్ణయించ నక్కరలేదు. వారి వేషాన్ని గురించీ, మతాన్ని గురించీ చెప్పేమాటలను, వారు దొంగవేషధారులని తెలిసేవరకు ఆపవచ్చును కదా!

దాదాపు సంవత్సరం క్రిందట, నేను స్టాండర్టన్‌నుంచి డర్బాన్‌కు ప్రయాణం చేస్తున్నాను. నాతోటి ప్రయాణీకులనిద్దరిని దొంగలుగా అనుమానించారు. నేనుకూడా ఆబండిలోనే ఉండడంచేత వారి సామానుతోపాటు నాసామానునుకూడా వాల్‌క్రస్టు దగ్గర సోదాచేశారు. మా బండిలో ఒక అపరాధ పరిశోధకుడు కూడా ఎక్కేడు. వారి సామానులను సోదాచేయడానికివచ్చిన ఇనస్పెక్టరుకు వారొక గ్లాసు విస్కీ నివ్వకలిగేరు.

* డర్బాన్‌లోని సెయింటు అయిదాన్సు చర్చిలో మతబోధకుడు.

డిటెక్టివ్‌తో పెద్దమనుష్యులులాగునా, సమానఫాయియాలోనూ, సంభాషణ చేశారు. వారు పెద్దమనిషితరహాగా దుస్తులు ధరించడమూ, మొదటి తరగతి బండిలో ప్రయాణంచేయడమూ, అందుకు కారణమనుకోవాలి. డిటెక్టివ్ వారిని ముందుగానే దోషులుగా పరిగణించలేదు-వారు యూరోపియనులనే సంగతి నేను చెప్పడం మానకూడదు. దారిపొడుగునా ఇటువంటి విచారకరమైన పనిచేయవలసివచ్చినందుకు చింతిస్తూనే వచ్చాడు. దురదృష్టవంతులైన ఈ పిల్లలనుకూడా ఆ విధంగానే చూడమని నేను వాదించవచ్చునా? వారిని చీకటికొట్లో పెట్టడంకన్న, పడుకోడానికి మరొక స్థలం చూపించవచ్చును. కొట్లో పెట్టడంతప్పనిసరైతే, పడుకోడానికి పరిశుభ్రమైన కంబళ్లిచ్చి యుండవచ్చును. కానిస్టేబులు కొంచెం దయగామాట్లాడి ఉండవచ్చును-ఇదే జరిగిఉంటే, ఈ కేసు మేజస్ట్రీటుదాకా వచ్చి ఉండేదికాదు.

"హఠాత్తుగా పెద్దవాళ్లైన ఈ యువకులు జామీనుమీద విడుదల కావడానికిబదులు రాత్రంతా లాకప్‌లో ఉండడానికే అంగీకరించారు." అని సూపరింటెంటు చేసిన ప్రకటనను నేను ఖండిస్తున్నాను. నిజం దానికి వ్యతిరేకమే. వారు జామీనిచ్చారు కాని, రాత్రివేళ అది అంగీకరింపబడలేదు. మేజస్ట్రీటు, వారి ఈ ప్రవర్తనతో సంతృప్తిపడలేదు. జామీనుమీద విడుదల చేయమని మరల ప్రొద్దునకూడా అడిగేరు. రెండవ ముద్దాయికోరిక అంగీకరింపబడింది. మొదటి ముద్దాయిని జామీనుమీద విడుదల చేయడానికి, కానిస్టేబులు అంగీకరింపలేదు. అతని పేరుకెదురుగా 'విడుదలచేయకూడదు' అని వ్రాయబడి ఉంది. అలా వ్రాయబడిన పుస్తకం కోర్టులో దాఖలుచేయబడింది. తర్వాత ఇన్‌స్పెక్టరు బెన్నీకి ఈ విషయం తెలియడంతోనే వెంటనే ఈ తప్పును సవరించుకుని విడుదలచేయించాడు.

సూపరింటెంటు మాటటుంచి, మొదటి ముద్దాయి చట్టాన్ని ధిక్కరించలేదని మనవి చేస్తున్నాను. మేజస్ట్రీటు ఏ విధమైన ఉత్తరువునూ చేసి యుండలేదు. ముద్దాయికి మేయర్సు ప్యాసును తెచ్చుకోమని నన్ను సలహాయివ్వమని, తండ్రివలె ఎంతో దయతో సూచించాడు. అటువంటిదేమీ అవసరంలేదని నేను మనవిచేశాను. కాని ఆయన సూచించాడు కాబట్టి దానిని మన్నించి అలాగే చేస్తానన్నాను. టౌను క్లార్కుదగ్గరనుంచి ప్యాసు ఇవ్వబడదని ముద్దాయికి ఇప్పుడే జవాబు వచ్చింది. ఒక గుమాస్తా, ఒక ఆదివారం స్కూలుమాష్టరూ, ఎన్నడూనేరస్థులుగా పరిగణింపబడ

లేదన్నాడు. రాత్రి 9 గంటలైన తర్వాత బయట తిరుగడానికి అతని కర్తృతలేకపోతే అతడు ఆదివారం స్కూలు మాష్టరుగా ఉండడాని కసలే తగడు. చిన్న పిల్లల ప్రవర్తనను తీర్చిదిద్దే ఆదివారం ఉపాధ్యాయ పదవిలో ఆతనిని ఉంచడంకన్నా, రాత్రివేళ 9 గంటలుదాటేక వీధుల్లో తిరుగ నివ్వడమే తక్కువ ప్రమాదకరమైనపని. "రాత్రివేళ అరబ్ వర్తకులజోలికి గాని తదితర మర్యాదస్థులైన రంగుజాతులవారి జోలికిగాని" తన పోలీసు శిబ్బందిపోలేదని సూపర్నెంటు చెపుతున్నాడు. ఈ యిద్దరు యువకులూ 'తదితర మర్యాదస్థులైన రంగుజాతులవారి' తరహాలో చేరడాని కర్హులు కారా? తానుస్వయంగా ఈ యువకులను అరెస్టుచేసి ఉండేవాడేమో బాగా యోచించి చెప్పవలసినదని నేను సవినయంగా ఆయనను ప్రార్థిస్తు న్నాను. "ఆయన ఫౌజంతా ఆయనంత నిదానస్తులుగానూ సౌమ్యులు గానూ ఉంటే ఏ విధమైన చిక్కులూ ఉండవు" అని ఆయనభాషనే ఉపయోగించి నేను చెపుతున్నాను.

నా బహిరంగలేఖను గురించి ప్రస్తావిస్తూ, నిజమైన అన్యాయా లున్నచోట వాటిని సానుభూతితో ఆలోచిస్తామని మీరు దయతో శలవిచ్చా రనుకుంటాను. ఇది నిజమైన అన్యాయమే నంటారా? అన్యాయమని మీకు తోస్తే, ఇటువంటి సంఘటనలు మళ్లీ జరుగకుండా మీ సానుభూతిని కోరు తున్నాను. నా సలహాను పాటించే మర్యాదస్తులైన భారత యువకులను తమ యజమానులవద్దనుండి ప్యాసులను తీసుకోవలసినదని చెప్పలేకుండా ఉన్నాను. మేయరు ప్యాసును తీసుకోవలెనని వారితో చెప్పేను. కాని మొదటి దరఖాస్తు నిరాకరింపబడడంవల్ల ఇతరుల ఉత్సాహం చల్లారి పోయింది. ఇటువంటి నిర్బంధాలను ప్రజలుహర్షించేటట్లయితే, మేజస్ట్రీటు అభిప్రాయానికి విరుద్ధంగానైనా, ఇకముందుకూడా ఆపనేచేయమని పోలీసు లను ప్రోత్సహించవచ్చును. కనుక పత్రికలు తమ అభిప్రాయాలను ప్రక టించి మర్యాదస్థులైన భారతీయులకు మేయరు ప్యాసులు లభించేటట్లయినా చేయవచ్చును. లేదా ఇకముందు పోలీసు లటువంటి నిర్బంధాలను సాగించడం అసంభవంగా చేయవచ్చును. కార్పొరేషన్ మీద దావా వేయడానికి సావకాశ మొకటున్నది. కాని గత్యంతరం లేకపోతేనే దానికి పోవాలి.

భవదీయుడు
మో. క. గాంధీ.

[నేటాల్ మెర్కురీ, 6-3-1896.]

## 72. జూలూల్యాండు తాత్కాలిక కార్యదర్శికి

డర్బాన్,
మార్చి 4, 1896.

సి. వాల్ష్ యస్పైక్వర్,
తాత్కాలిక కార్యదర్శి,
(జూలూల్యాండు)
పీటర్ మారిజ్ బర్గు.

అయ్యా,

నాన్ద్వేనీ టౌన్‌షిప్ నిబంధనలను గురించి నేను జూలూల్యాండ్ గవర్నరుగారికి పంపుకున్న విజ్ఞప్తికి జవాబుగా, తాము కడచిన మాసం 27 వ తేదీని వ్రాయించిన ఉత్తరంచేరినది. ప్రభువువారికి ముందుండిన గవర్నరుకాలంలో ప్రకటింపబడిన ఇషోవీ టౌన్‌షిప్ నిబంధనలకు ఇది నకలేనని తెలిపినారు.

అట్లయినట్లయితే, ఈ రెండు టౌన్‌షిప్పులకూ సంబంధించిన నిబంధనలనుకూడా రంగుభేదాన్ని తొలగిస్తూ మార్పులుచేయించవలెనని విజ్ఞప్తిదారుల తరపున నేను గవర్నరు ప్రభువువారిని కోరుతున్నాను. ఏమైనప్పటికీ ఇటువంటి నిబంధనలు 'ఇషోవీ' టౌన్‌షిప్పులో ఉన్నాయనే కారణంచేత నాన్ద్వేనీలో అటువంటి నిబంధనలనే ప్రవేశ పెడతామనడం సబబుకాదు. ద. ఆఫ్రికాలోని ఇతర భాగాల్లో స్థిరాస్థి హక్కులను గురించి జరుగుతున్న సంగతులను గమనిస్తే ఈ నిబంధనలలో అసలే న్యాయం కనబడదు.

మెల్మోత్ టౌన్‌షిప్పులో అటువంటి నిబంధనలులేవని నేను నమ్ముతున్నాను.

భవదీయుడు
మో. క. గాంధీ.

[కలోనియల్ ఆఫీస్ రికార్డులు నెం. 427 వాల్యూం 24]

---

## 73. జూలూలాండు కార్యదర్శికి లేఖ

సెంట్రల్ వెస్టు స్ట్రీట్
డర్బాన్, నేటాల్
మార్చి, 6, 1896.

జూలూలాండ్ కార్యదర్శి గారికి,
పీటర్ మారిజ్ బర్గు.

అయ్యా,

మెల్మోత్ టౌన్‌షిప్ నిబంధనలలో రంగుభేదాలు లేవని తెలిసికూడా 'ఇషోవీ' టౌన్‌షిప్ నిబంధనలలో రంగుబేధాన్ని ప్రవేశపెట్టడానికి గల కారణాలేమిటో నాకు శలవిస్తారా? 'మెల్మోత్' టౌన్‌షిప్ రెగ్యులేషనులు ఏ తేదీని ప్రచురింపబడ్డాయోకూడా తెలియ చేస్తారా?

భవదీయుడు
మో. క. గాంధీ.

[కలోనియల్ ఆఫీస్ రికార్డు నెం. 427 వా. 24]

# 74. దాదాభాయి నౌరోజీకి లేఖ

మో. క. గాంధీ
అడ్వకేటు
ప్రతినిధి—ఇసాట్రిక్ క్రైస్తవ సంఘం
ప్రతినిధి—లండన్ వెజిటేరియన్ సంఘం

తపాలాపెట్టె 66
సెంట్రల్ వెస్టుస్ట్రీటు
డర్బాన్, నేటాల్
మార్చి 7, 1896.

గౌ. దాదాభాయి నౌరోజీ,
నేషనల్ లిబరల్ క్లబ్
లండన్

అయ్యా,

వచ్చే సమావేశంలో మంత్రివర్గం ప్రవేశపెట్టబోయే వోటింగు హక్కులబిల్లునూ, నేను బ్రిటిష్‌కమిటీ చెయిర్మన్‌కు వ్రాసిన ఉత్తరం అచ్చు ప్రతినీ, (చూ. పే. 365) ఇందుతో జతపరచినాను.

నాన్‌ద్వేనీ విజ్ఞప్తిదారులకోరికలను, జూలూల్యాండ్ గవర్నరు నిరాకరించాడు. ఆ విషయమై హోంగవర్నమెంటు వారికొక విజ్ఞప్తిని నేను తయారు చేస్తున్నాను. (చూ. పే. 366)

కమాండో విజ్ఞప్తిని గురించి తాము వ్రాసిన ఉత్తరానికి నేను కృతజ్ఞుడను.

ఇట్లు విధేయుడు
మో. క. గాంధీ.

[గాంధీజీ స్వహస్తంతో వ్రాసిన లేఖకు ఫోటోనకలు నుండి]

# 75. వెడ్డర్‌బరన్‌కు లేఖ

మో. క. గాంధీ
అడ్వకేటు
ప్రతినిధి—ఇసాట్రిక్ క్రిస్టియన్ యూనియన్
ప్రతినిధి—లండన్ వెజిటేరియన్ సొసైటీ

తపాలాపెట్టె 66
సెంట్రల్ వెస్టు స్ట్రీట్
డర్బాన్, నేటాలు
మార్చి 7, 1896.

ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ బ్రిటిష్‌కమిటీ అధ్యక్షుడు సర్ విలియం వెడ్డర్‌బరన్, బేరనెట్, యం. పి. వగైరా గారికి—లండన్.

అయ్యా,

నేటాల్ లెజిస్లేటివ్ అసెంబ్లీ రాబోయే ఏప్రిల్ సమావేశంలో, గవర్నమెంటువారు ప్రవేశపెట్టదలచుకున్న వోటింగుహక్కుల బిల్లును ఇందుతో జతపరచి పంపుకుంటున్నాను. 1894 వ సం. రం. ఆక్టు స్థానే ఈ బిల్లు ప్రవేశపెట్టబోతున్నారు. ఆ చట్టానికి ప్రతికూలంగా ఇదివరలోనే ఒక విజ్ఞప్తిని పంపుకున్నాం (చూ. పే. 110). ఈ బిల్లు మిస్టర్ చేంబర్లేన్ అంగీకారాన్ని పొందినదని చెపుతున్నారు. అదే నిజమైతే, ఇచటి భారతీయులు చాలా చిక్కైన పరిస్థితులలో పడతారు. భారతదేశంలో ప్రజా ప్రతినిధిసంస్థలు ఉన్నవి కనుక, ఈ బిల్లు భారతీయులకు వర్తించదని పత్రికలు అభిప్రాయపడుతున్నట్లు కనుబడుతోంది. కాని ఈ బిల్లు ఇచటి భారతీయులకు వర్తింపచేయడానికే ఉద్దేశింపబడినదనడానికేమీ సందేహం లేదు. బిల్లును ప్రతిఘటించాలని మా ఉద్దేశం. ఈలోగా కామన్సు సభలో ప్రశ్నవేస్తే, మిస్టర్ ఛేంబర్‌లేను అభిప్రాయాల ఆంతర్యమేమిటో తెలుసుకోవడానికి వీలవుతుందని నా అభిప్రాయం. ఇక్కడ జరుగుతున్న అనేక ముఖ్యమైన విషయాలనుగురించి భారతీయులు త్వరలో మీ సహాయాన్నీ సలహానూ అపేక్షింపవలసి వస్తుంది.

ఇట్లు విధేయుడు
మో. క. గాంధీ.

[స్వదస్తూరీతో వ్రాయబడిన లేఖకు ఫోటోనుండి.]

---

# 76. మిస్టర్ ఛేంబర్లేనుకు విజ్ఞప్తి

డర్బాన్, నేటాల్
మార్చి 11, 1896.

రాణీగారి కాలనీలకు ప్రధాన కార్యదర్శి, రైటానరబుల్ జోసెఫ్ ఛేంబర్లేను గారికి, లండన్.

నేటాలు భారతీయుల ప్రతినిధులుగా ఈ దిగువ సంతకములు చేసిన భారతీయుల విజ్ఞప్తి.

దివ్యచిత్తమునకు తెచ్చేది :

25–2–1896 తేదీని నేటాలు గవర్నమెంటు గెజెటులో, జూలూ ల్యాండ్‌లోని నాన్‌ద్వేనీ టౌన్‌షిప్పు విషయంలో చేయబడిన కొన్ని నిబంధనలను గురించి మేము రాణీగారి ప్రభుత్వానికి ఈ విన్నపం చేసుకుంటున్నాం. నాన్‌ద్వేనీ టౌన్‌షిప్‌లో రాణీగారి పౌరులైన భారతీయులు, స్థిరాస్థిని సంపాదించుకోడానికి, సదరు నిబంధనలు ప్రతిబంధకంగా ఉన్నవి. జూలూ ల్యాండ్‌లోని 'ఇషోవీ'లో కూడా ఇటువంటి నిబంధనలే ఉన్నవి. వాటిని గురించికూడా ఈ విజ్ఞప్తిని సమర్పించుకుంటున్నాం.

బ్రిటిష్ ఇండియనులకు ప్రతిబంధకం కలిగించే నిబంధనలలోని భాగాలు ఇవి :

> 4 వ సెక్షన్‌లోనిభాగం-ఆ నివేశన స్థలాల వేలంలో పాల్గొన దలచిన, యూరోపియను సంతతివారు, యూరోపియను జాతికి చెందినవారు, నిర్ణయింపబడిన వేలం తేదీకి కనీసం 20 రోజులుముందు వ్రాతమూలకంగా జూలూల్యాండు కార్యదర్శికి నోటీసివ్వవలెను.
>
> 18 వ సెక్షన్‌లోనిభాగం : పుట్టుకవలన యూరోపియను లైనవారున్నూ, జాతికి యురోపియనులైనవారున్నూ మాత్రమే ఈ నివేశనస్థలాలలో ఉండడానికర్హులు. పైషరతును అమలు జరపక పోయినట్లయితే సదరు నివేశనంగాని నివేశనములుగాని, పై సెక్షన్‌లోవలెనే ప్రభుత్వానికి చెందగలవు.

సెక్షన్ 20లోని భాగము : నాన్ ద్వేనీ టౌన్ షిప్ లో నివేశన స్థలాలను కొనుక్కున్న వారు, ఎప్పుడైనా ఆస్థలాలనుగాని ఇండ్లను గాని అందులోని భాగాలనుగాని అమ్మడంగాని అద్దెకుగాని ఇవ్వ దలచుకున్నా, ఊరికే ఎవరినైనా ఉండనివ్వదలచుకున్నా, యూరో పియనులకు పుట్టినవారినీ యూరోపియను జాతివారినీ తప్ప మరొక రిని ప్రవేశపెట్టకూడదు. ఈ షరతుకులోబడి ఈ నివేశనాలు విక్ర యింపబడును. 10, 11, 13 సెక్షనుల ప్రకారం సదరుస్థలాల క్రయ దస్తావేజులలో పైషరతు విధిగా ఉదహరింపబడాలి. క్రయదారుడు పై నిబంధనలను షరతులను అతిక్రమించేయడల, 17వ సెక్షను ప్రకారం సదరు నివేశనాలు ప్రభుత్వానికి స్వాధీనమవుతాయి.

నాన్ ద్వేనీ నిబంధనలు గెజెటులో ప్రకటింపబడిన మరుచటి దినమే, మేము జూలూలాాండు గవర్నరు ప్రభువుగారికి, రంగుభేదాలను తొలగిస్తూ సదరు నిబంధనలను మార్పించవలెననీ, లేదా సవరించవలెననీ విజ్ఞప్తిని పంపుకున్నాము.

సదరు విజ్ఞప్తికి "1891 సం. రం. లో పూర్వపు గవర్నరుగారు 'ఇషోవి' టౌనుషిప్పువిషయంలో ప్రకటనచేసిన నిబంధన లేవైతే అమలులో ఉన్నాయో, అవే ఇవని" బదులు వచ్చింది. దాని కాపీని ఇందుతో జత పరచినాము. అందుమీదట 1896 సం. రం మార్చి 4 వ తేదీని, బ్రిటిష్ ఇండియనులకు సంబంధించినంతవరకు రెండు టౌనుషిప్పుల నిబంధనలనూ మార్పుచేయమని లేదా సవరణచేయమని మేము కోరియున్నాము.

దానికి 5—3—1896 తేదీని మాకోరికను అంగీకరించడం గవర్నరు గారికి న్యాయంగా కనుబడలేదని జవాబు వచ్చింది.

భారతీయులపట్ల చేయబడిన ఈ అపచారము చాలా స్పష్టంగా కను పడుతోంది కనుక, ఈ విషయాన్ని మేము రాణీగారి ప్రభుత్వానికి తెలుపు కున్న వెంటనే దానిని సరిచేస్తారని విశ్వసిస్తున్నాము. స్వపరిపాలన గల కాలనీలలో ఇటువంటి అధర్మమైన, అనవసరమైన భేదాలను లేకుండా చేసి నపుడు,రాణీగారి పాలనలో ఉండే కాలనీలలో దీనికి తావివ్వకూడదని మేము సగౌరవంగా విన్నవించుకుంటున్నాము.

ఈ విజ్ఞప్తిదారులలో చాలామందికి జూలూలాాండులో స్థిరాస్తి ఉన్నది.

1889 సం. రం. లో మెల్మోత్ టౌన్‌షిప్ అమ్మకం చేసినపుడు, దానిలో నివేశనస్థలాలను కొనడంలో భారతీయులు దరిదాపు 2 వేల పౌనులుదాకా పెట్టేరు.

భారతీయులు పెట్టుబడి పెట్టిన 2 వేల పౌనులకు తగిన ప్రతిఫలం పొందేటందులకైనా, జూలూల్యాండులో భారతీయులను స్వేచ్ఛగా భూమిని కొనుక్కోనివ్వాలని మేము మనవి చేస్తున్నాం.

నేటాలులోని గవర్నమెంటు పత్రిక సాధారణంగా భారతీయుల ఆశయాలకు ప్రతికూలంగా ఉంటుంది. అటువంటి పత్రికకుకూడా ఈ అపచారం చాలా ఘోరమనిపించింది. జూలూలాండ్ గవర్నరుకిచ్చిన విజ్ఞప్తిని చాలా అనుకూలంగా పరికించింది. ఆ పత్రిక వ్రాసిన సంగతులు చాలా సముచితమైనవి. అందుచేత వాటినిక్కడ ఉల్లేఖించడానికి అనుమతించమని కోరుతున్నాను :

> జూలూల్యాండ్‌లో కొత్తగా ఒక భారతీయసమస్య ఉత్పన్నమయేటట్లు కనుబడుతుంది. కొత్తగా ఏర్పాటుచేయబడిన నాన్‌ద్వేనీ టౌన్‌షిప్ నివేశనస్థలాల విక్రయం విషయంలో, గత మంగళవారం నాడు గవర్నమెంటు గెజెటులో ప్రకటింపబడిన నిబంధనలలో యూరోపియను సంతతివారు, యూరోపియను జాతివారుతప్ప మిగిలిన వారెవ్వరూ అక్కడస్థలాలను కొనుక్కోకూడదనీ, నివసించకూడదనీ ప్రత్యేకంగా నిషేధాలు చేయబడినాయి. ఇలాంటి విషయాల్లో ఎప్పుడూ ముందడుగువేస్తుండే భారతీయులు, అటువంటి నిబంధనలనుచేసినందుకు గవర్నరుకు తమ అసమ్మతిని తెలియచేశారు. జూలూల్యాండు ఇంకా క్రౌన్ కాలనీగా ఉండి ఎక్కువగా సామ్రాజ్యాధికారుల పర్యవేక్షణలో ఉంటూ ఉండగా, అందులోనూ నేటాలులో అమోదింపబడిన వోటింగుహక్కులబిల్లు చట్టంకాకుండా చేయడానికి హోం గవర్నమెంటు చేస్తున్న తీవ్రమైన ప్రయత్నాల ధోరణిని గమనిస్తూకూడా, ఇటువంటి నిబంధనలను ఏవిధంగా అమలు జరుపగలరో మాకు గోచరం కావడంలేదు. భారతీయులకు కొందరికి ఈవరకే జూలూల్యాండులో స్థిరాస్థులు ఉన్నట్లు వారు దాఖలుచేసిన అసమ్మతివలన మాకు తెలుస్తోంది. అదివాస్తవమైతే, ఇతర కారణాల సంగతి ఎట్లాఉన్నా, విజ్ఞప్తిదారుల విషయం

జాగ్రత్తగా పరిశీలింపబడవలసుంటుందని మాకు తోస్తోంది. జూలూ ప్రాంతంలో భారతీయులు భూమిని శాశ్వతంగా సంపాదించు కోకుండా కొన్ని ప్రత్యేక నిబంధనలు ఉంటే ఉండవచ్చును. కాని అది క్రౌన్ కాలనీ అనే సంగతి నెవ్వరూ విస్మరించకూడదు. అందు చేత, బాధ్యతాయుత ప్రభుత్వంగల నేటాలులో వీలులేని నిబంధన లను, జూలూలాండ్యాదులో అమలుచేయడం ఏవిధంగా సాధ్యమాయని మా కాశ్చర్యము కలుగుతోంది.

ద. ఆఫ్రికాలోని వివిధభాగాలలో ప్రకటితమవుతుండే నిబంధనలలో రంగుభేదాలు తరుచుగా ప్రాకుతుంటాయి. భారతీయ సంఘంలో ప్రధా నంగా వర్తకులు, చేతిపనివారు మాత్రమే ఉన్నారు. వారివృత్తికి సంబంధించి నంతకుమించిన విజ్ఞానంవారికిలేదు. కొందరికి అదీలేదు. అలాంటప్పుడు తమ హక్కులకు భంగం కలిగించే శాసనాలసంగతి వారు తెలుసుకొని, వాటిని రాణీగారి ప్రభుత్వముయొక్క దృష్టిలోకి తేవడం అసంభవం.

స్థానికాధికారులవల్ల ఏవిధంగానైనా న్యాయం మాకు కలుగు తుందని ఆశించే స్థితి దాటిపోయింది. ఈ విషయంలో లాగుననే, బ్రిటిష్ రాజ్యాంగంయొక్క మూల సూత్రాలను గుర్తించని పొరబాటువల్ల జరుగుతున్న అన్యాయాన్ని, వారి దృష్టికి తెచ్చినా లాభంలేకుండా ఉన్నది.

ఒక క్రౌన్ కాలనీలో, రాణీగారి పౌరులైన కొందరకు స్థిరాస్థిని సంపాదించుకునే హక్కు నిరాకరింపబడినట్లయితే, ద. ఆఫ్రికా రిపబ్లిక్ న్నూ, ఆరెంజిఫ్రీస్టేటున్నూ ఆపనిచేయడంలో బేసబబేమిలేదు. అంతకన్న ఇంకా ముందుకెళ్లినా ఏమనడానికీ వీలుండదు. 'ఇషోవీ' నిబంధనలలో ఇటువంటి రంగుభేదాలుండడం, నాన్ ద్వేనీలోకూడా ఉండడానికి కారణాలు కాజాల వని మనవి చేస్తున్నాం. 'ఇషోవీ' నిబంధనలు చెడువైనప్పుడు, బ్రిటిష్ ఇండియన్ పౌరులహక్కులకు భంగంలేకుండా ఉండేవిధంగా రెండుచోట్లా నిబంధనలను మార్పుచేయాలనీ సవరించాలనీ మా విన్నపం.

మహారాణీగారి భారతీయ పౌరుల హక్కులకు భంగంకలిగించే జాతి భేద శాసనాలవలన, ద. ఆఫ్రికాలోని భారతీయ సంఘానికి చాలా ఆత్రత కలుగుతోంది. అంతేకాకుండా అటువంటి శాసనాలను మార్పుచేయించు

కోవడానికి విజ్ఞప్తులు వగైరాలను పంపాలంటే హానీ హానీగా జీవిస్తుండే భారతీయులు చాలా ధనవ్యయానికి లోనుకావలసివస్తున్నది. అంతేకాదు. నిరంతరం అసందిగ్ధ పరిస్థితులలోనూ, ఆందోళితస్థితిలోనూ ఉంటూఉండడం వల్ల, మొత్తం భారతీయుల వ్యాపారానికి భంగం కలుగుతున్నది.

దక్షిణాఫ్రికాలోని భారతీయుల పరిస్థితులనూ, వారిస్థాయినీ సమగ్రంగా విచారణచేసి, బ్రిటిష్ పౌరులందరితోపాటు భారతీయులనుకూడా సమానంగాచూడవలెనని ద. ఆఫ్రికాలోని అధికారులందరికీ ఆజ్ఞాపిస్తూ ప్రకటన జరిగితేకాని, చట్టబద్ధంగానూ రాజభక్తి పరాయణులుగానూ ఉండే రాణీగారి భారతీయ పౌరుల సాంఘిక, పౌరసత్త్వాల వినాశం ఆపుచేయడానికి మార్గంలేదని మేము విన్నవించుకుంటున్నాము.

కనుక, రాణీగారి పాలనలోఉన్న భారతీయులమీద ప్రస్తుతమున్న నిషేధాలను తొలగిస్తూ, 'ఇషోవీ,' 'నాన్ద్వేనీ' శాసనుషిప్ నిబంధనలను మార్పుచేసి సవరించవలసినదిగా ఉత్తరువులు దయచేయించవలెనని, రాణీగారి ప్రభుత్వాన్ని సవినయంగా ప్రార్థిస్తున్నాం. అంతేకాకుండా భారతీయులకు వర్తించే జాతిభేద శాసనాలను ఇక ముందుచేయకుండా, ఉత్తరువులను దయచేయించమని కూడా ప్రార్థిస్తున్నాము. ఈ విధమైన న్యాయాన్ని దయచేయించినందులకు మేము కృతజ్ఞులము వగైరా...........

సం. అబ్దుల్ కరీం హాజీ ఆదాం
మొదలైనవారు

[స్వదస్తూరీతో వ్రాసిన ప్రతినుండి.]

# 77. భారతీయుల వోటింగుహక్కు

డర్బాన్,
ఏప్రిల్ 4, 1896.

నేటాల్ విట్‌నెస్ పత్రిక సంపాదకులకు—

11 వ మార్చి తేదీని మీ పత్రికలో, జి.డబ్ల్యు.డబ్ల్యు. అనే ఆయన, నేను భారతీయుల వోటింగుహక్కునుగురించి ప్రకటించిన కరపత్రాన్ని విమర్శించి నన్ను గౌరవించినాడు. ఆ విమర్శకు జవాబుగా నేను వ్రాసే, ఈ సంగతులకు తమ పత్రికలో చోటిచ్చినచో నేను మిక్కిలి కృతజ్ఞుడను.

జి. డబ్ల్యు. డబ్ల్యు. నా కరపత్రాన్ని సమీక్షించేటప్పుడు నా యెడల వ్యక్తిగతంగా చూపిన మర్యాదకు నేను కృతజ్ఞుడను. అలాగే ఆయన ఆ 'హెచ్చరిక'లోని సంగతులపట్లకూడా కొంత సబబుగా ఉంటే బాగుండేది. ఆయన దానిని నిష్పాక్షికమైన మనస్సుతో పరిశీలించి ఉంటే, అందులో వెలువరచిన అభిప్రాయాలతో ఆయన ఏకీభవించకుండా ఉండలేడని నేననుకుంటాను. ఆ విషయాన్నంతటినీ, యూరోపియను కాలనిష్టులు, నిస్సంకోచంగా భారతీయులకు సోదరభావంతో చేయూతనిచ్చేటట్లు చేయాలనే దృక్పథంతో నేను విశదీకరించాను. అలాచేయడంవల్ల వారిస్థితికేమీభంగం కలుగకుండా ఉండేటట్లు వివరించాను. ఏ విధమైన ఆందోళనకూ కారణం లేదని ఇప్పటికీ నా అభిప్రాయం. యూరోపియను కాలనిష్టులు, ఆందోళన పడకుండా, ఉన్నస్థితినట్లే ఉంచేటట్లయితే, వారి వోటును భారతీయులు ముంచెయ్యలేరు. అలాంటి ప్రమాదం వచ్చేటట్లుంటే, ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూకూడా రంగుభేదాన్ని తీసుకురాకుండానే, ముందుగానే దానిని వారించవచ్చును. వోటర్లకు నిజమైన విద్యార్హత పెట్టినట్లయితే బహుశా ఇండియన్‌వోటు యూరోపియనువోటును మించిపోయే ప్రమాదం (అసలు ఉంటే) ఎన్నటికీరాదు. అంతేకాకుండా యూరోపియను వోటర్లలోకూడా ఉండకూడని వారుంటే వారుకూడా ఓటర్ల జాబితానుండి తొలగింపబడతారు.

నిజమైన వోటర్ల సంఖ్యనుబట్టి ఉభయుల బలాబలములను చర్చించడం 'జి.డబ్ల్యు.డబ్ల్యు.' కిష్టంలేదు. "ముందు సంవత్సరం జాబితాలో ఏముంటుందో చూడాలి" అని బహుపరాక్ చెప్పుతున్నారు. భారతీయులకు, నిరుడు ముందు ఏడుకూడా వోటర్ల జాబితాను బాగా పెంచడానికి సావకాశముండినది. ఇప్పుడు ఉపసంహరించుకోవడానికి ప్రయత్నిస్తున్న వోటింగుహక్కుల చట్టం గురించి అనేక విధాలుగా భయభ్రాంతులైనారు. అయినప్పటికీ భారతీయ వోటరుల జాబితా పెరుగలేదు. కొత్తవారు చేరలేదు. అందుకు కారణం అసాధారణమైన విముఖత్వమైనా అయి ఉండాలి. లేకపోతే, వోటర్లుగాచేరే అర్హతలైనా లేకపోవాలి. విముఖత్వం కారణమనుకోవడానికి వీలులేదు. ఏమనగా, గత రెండేండ్లనుంచీ, ఈ 'ఆందోళన' సాగుతూనే ఉంది.

ఏమైనా. 'జి. డబ్ల్యు. డబ్ల్యు.' లేఖను నేను విపులంగా చర్చింప దలచుకోలేదు. దానికి నాకు సమయమూ చాలదు, చోటూలేదు. ఆయన అడిగిన భోగట్టామాత్రం ఇచ్చి, దానిని వచ్చే అసెంబ్లీ సమావేశంలో ప్రవేశపెట్టబోయేబిల్లుకు వర్తింప చేయమంటాను.

అప్పట్లో ఇండియా ఉపమంత్రి (అన్డర్ సెక్రటరీ ఆఫ్ స్టేటు) గానుండిన మిస్టర్ కర్జన్ 1861 సం. రం. ఇండియా కౌన్సిల్సు ఆక్టు రెండవసారి చర్చింపబడేటప్పుడు, అనేక ఇతర సంగతులతోపాటు ఈ విధముగా చెప్పేడు :

> ఈ బిల్లుయొక్క ఉద్దేశ్యమేమిటో చెప్పవలసిన విధి నాకున్నది. ఇండియా ప్రభుత్వ నిర్మాణముయొక్క పునాదులను, దాని ధర్మములను విస్తృతంచేసి, అనుద్యోగులైన భారతీయులు రాజ్య నిర్వహణంలో ఇప్పటికన్న ఎక్కువగా పాల్గొనేటట్లు చేయడం ఈ బిల్లుఉద్దేశ్యం. 1858 స. రం.లో ఇండియా ప్రభుత్వమును రాణీగారు స్వయంగా చేపట్టినప్పటినుంచీ, భారతీయవర్గాలలో ఉత్తమశ్రేణికి చెందినవారిలో ద్యోతకమైన అద్భుత రాజకీయశక్తిని అధికారపూర్వకంగా గుర్తించడానికే ఈ బిల్లు ఉద్దేశింపబడినది. 1861 సంవత్సరం ఇండియా కౌన్సిల్సుచట్టాన్ని ఈ బిల్లు సవరణ చేస్తున్నది. చాలాకాలంనుండి కొన్ని శాసనాధికారాలు ఇండియాలోఉన్నవి. కాని అవికొంత గంద్రగోళంగానూ, పరస్పర విరుద్ధం

గానూ ఉన్నాయి. ట్యూడర్ స్టూఆర్టు రాజులకాలంనుంచీ, ఈస్టు ఇండియా కంపెనీ పరిపాలనతోపాటు, అవీ ఉంటున్నాయి. కాని ఇండియాలో ఇప్పుడున్న నవీనశాసన విధానాన్ని ప్రవేశపెట్టడానికి రాజప్రతినిధియైన కానింగు ప్రభువు, ఇండియామంత్రియైన సర్ సి. వుడ్‌గార్లు కారకులు (సర్ సి. ఉడ్ తర్వాత ప్రభువైనాడు). సర్ సి. ఉడ్ 1861 సం.రం. లో ఇండియా కౌన్సిలు ఆక్టును ఆమోదింపచేశాడు. ....1861 సం. రం. ఆక్టు ననుసరించి భారత దేశంలో మూడు శాసనసభలు నిర్మాణం చేయబడ్డాయి—వైస్రాయి సుప్రీం కౌన్సిలు, మద్రాసు, బొంబాయి రాష్ట్రీయ శాసనసభలు. సుప్రీం కౌన్సిలులో, వైస్రాయి, ఆయన కార్యనిర్వాహకవర్గం సభ్యులుగా ఉంటారు. వారితోపాటు కనీసం 6 గురు మొదలు 12గురి వరకు అదనపు సభ్యులుంటారు. వారందరినీ గవర్నరుజనరలే నియమిస్తాడు. వారిలో అధమం సగంమంది ఉద్యోగేతరులుగా ఉండాలి. వారు యూరోపియనులైనా కావచ్చును, దేశీయులైనా కావచ్చును. మద్రాసు బొంబాయి లెజిస్లేటివ్ కౌన్సిళ్లలో, కనీసం 4 గురు మొదలు 8 గురికిమించకుండా రాష్ట్రీయ గవర్నరుచేత అదనపు మెంబర్లు నియమింపబడతారు. వారిలోసగం ఉద్యోగేతరులై ఉండాలి. ఈ చట్టం ఆమోదింపబడిన పిమ్మట, బెంగాలులోనూ, పశ్చిమోత్తర రాష్ట్రంలోనూకూడా లెజిస్లేటివ్ కౌన్సిళ్ళు నిర్మాణం చేయబడినాయి. బెంగాలు కౌన్సిలులో లెఫ్టినెంట్ గవర్నరూ 12 గురు నామినేటెడ్ సభ్యులూ ఉంటారు. పశ్చిమోత్తర రాష్ట్రం కౌన్సిలులో ఆ రాష్ట్రం గవర్నరూ, 9 గురు నామినేటెడ్ సభ్యులూ ఉంటారు. వీరిలో మూడవవంతు మాత్రమే ఉద్యోగేతర (నానఫీషియల్) సభ్యులు....బుద్ధిశాలురు, సమర్థులు, ప్రజాసేవాసక్తులు అయిన నేటివ్ పెద్దమనుష్యులను ముందుకొచ్చి ప్రభుత్వ నిర్వహణంలో పాల్గొనేటట్లు ప్రోత్సహించాము. ఈ లెజిస్లేటివ్ కౌన్సిళ్ళయొక్క సమర్థత, అంతస్థు, చాలా ఉన్నతిలో నున్నదనుట కేమీ సందేహములేదు.

ఈ సవరణచట్టము బడ్జెటును (ఆదాయవ్యయ అంచనాలను) చర్చించే అధికారాన్ని, ప్రశ్నలువేసే అధికారాన్ని ప్రసాదిస్తున్నది (ఇదివరకులేవు). కౌన్సిలులో సభ్యులసంఖ్యనుకూడా హెచ్చు చేస్తున్నది. ఒకవిధమైన

ఎన్నిక విధానాన్నికూడా ప్రవేశపెడుతోంది. అయితే ఇది కేవలం అనుమతినిచ్చే చట్టం మాత్రమే.

పై చట్టాన్ని అనుసరించి చేయబడిన నిబంధనలప్రకారం, బొంబాయి కౌన్సిలులోని 18 స్థానాలకూ, 8 స్థానాలకు ఎన్నిక జరుగుతుంది. బొంబాయి కార్పొరేషన్ (అదీఎన్నికసంస్థే), బొంబాయి కార్పొరేషను మినహాయించి గవర్నరు ఇన్ కౌన్సిలువారు ఎప్పటికప్పుడు నిర్ణయించిన ప్రకారం ఇతర మ్యునిసిపల్ సంస్థలు, పై విధంగానే ఏర్పాటు చేయబడిన స్థానికసంస్థల గ్రూపులు, దక్కన్ సర్దారులు, ఇతరులైన పెద్ద భూస్వాములు, వ్యాపారస్థుల సంఘాలు, బొంబాయి విశ్వవిద్యాలయం, మెజారిటీ వోట్లతో ప్రతినిధులను ఎన్నుకుంటారు. లెజిస్లేటివ్ కౌన్సిళ్ళున్న ఇతర రాష్ట్రాలలో కూడా, ఎన్నికకు లేక శిఫార్సుపైన నామినేషను చేయడానికి, నిబంధనలు ప్రకటితమైనాయి.

వోటింగుహక్కుల విషయంలోకాని, ఎన్నికైన ప్రతినిధుల విషయంలోకాని జాతి రంగుభేదాలు లేవు. సుప్రీంలెజిస్లేటివ్ కౌన్సిలుకు బొంబాయి కౌన్సిలు ప్రతినిధి (భారతీయుడు) రాజీనామా నిచ్చినందున, ఆస్థానానికి భారతీయులు, ఒక యూరోపియను, అభ్యర్థులుగా నిలబడి పోటీచేస్తున్నారు. వచ్చేవారం టపాలో ఫలితాలు తెలుస్తాయి.

దీనినిగురించీ, మ్యునిసిపల్ ప్రాతినిధ్యాన్నిగురించీ, బాగా తెలిసి మాట్లాడగలిగిన ప్రముఖులైన ప్రామాణికులు చెప్పిన ఒక విషయాన్ని ఉల్లేఖిస్తున్నాను. సర్ విలియం విల్సన్‌హంటరు, 15-2-1895 తేదీని సొసైటీ ఆఫ్ ఆర్ట్సువారి సభలో మాట్లాడుతూ ఈ విధంగా చెప్పేడు :

> మన అధ్యక్షుడు రిప్పన్ ప్రభువు అధికంగా ప్రోత్సహించిన భారతీయ పురపాలకసంఘాలు, 1891 సం.రం. నాటికి 1,50,00,000 (కోటీ యాభైలక్షలు) జనాభాను పరిపాలిస్తున్నాయి. ఆబోర్డుల్లోనూ కౌన్సిళ్లలోనూ సభ్యులుగానున్న 10,585 మందిలోనూ సగానికిపైగా పన్నులిచ్చేవారివల్ల ఎన్నుకోబడినవారు. 1892 సం.రం. క్రాస్ ప్రభువు చట్టంప్రకారం, ప్రజాప్రాతినిధ్య సిద్ధాంతాన్ని నెమ్మదిగా రాష్ట్రీయ శాసనసభలకూ, సుప్రీంలెజిస్లేటివ్ కౌన్సిలుకూ, కూడా వర్తింప చేస్తున్నారు.

1758 సం. రం. రాణీగారి ప్రకటనలో ఈవిధంగా ఉన్నది:

> మా సామ్రాజ్యంలోని ఇతర ప్రజలపట్ల మేమేవిధులను, ధర్మములను పరిపాలించవలసియున్నదో, ఆ ధర్మములను విధులను మా భారతదేశంలోఉండే నేటివ్ ప్రజలయడలకూడా పాటించడం మా అనివార్యమైనధర్మం... వీలైనంతవరకు మా పౌరులను జాతి మతభేదములతో నిమిత్తంలేకుండా, ధారాళంగానూ నిష్పక్షపాతంగానూ, ప్రభుత్వోద్యోగులుగా తీసుకోవలెననికూడా మా ఆజ్ఞ. ఆ ఉద్యోగ ధర్మములను నిర్వహించడానికి వారికి తగినవిద్య, సమర్థత, నిజాయితీ ఉంటే చాలును.

ఈ సంగతులన్నిటినీ దృష్టిలోనుంచుకుని చూస్తే, క్రొత్త ఎన్నిక హక్కులబిల్లును అర్థంచేసుకోవడం చాలాకష్టం. కాలనిస్టుల నెదుర్కొంటున్న సమస్య చాలాచిన్నది. భారతీయులకు వోటులేకుండా చేయడం అవసరమా? అవసరమైతే, భారతదేశంలో వారు ప్రజాప్రాతినిధ్యాన్ని అనుభవిస్తున్నారన్న ప్రస్తావనతో నిమిత్తమేలేదు. అవసరంలేకపోతే, అస్పష్టమైన శాసనాలనుచేసి భారతీయులను బాధించడం ఎందుకు? భారత దేశంలో భారతీయులు, ప్రజాప్రాతినిధ్యాన్ని అనుభవిస్తున్నారా లేదా అనే విషయాన్నిబట్టి ఇక్కడ ఎన్నికహక్కునుగూర్చిన నిర్ణయం జరుగుతుందంటే, ఆ విషయంలో కాలనిస్టులకు అంతగా తెలియని విషయాలేమీ లేవని నా మనవి. అందువలన, ఈ సమస్యను శాశ్వతంగా పరిష్కరించకుండా, వృథావ్యయానికి కారణమైన (కోర్టు) న్యాయస్థాన నిర్ణయానికి వదలనక్కరలేదు.

భవదీయుడు
మో. క. గాంధీ.

[నేటాల్ విట్‌నెస్, 17-4-1896]

# 78. నేటాలు అసెంబ్లీకి విజ్ఞప్తి

డర్బాన్
ఏప్రిల్ 27, 1896.

పార్లమెంటులో సమావేశమైయున్న గౌరవనీయులైన నేటాల్ లెజిస్లేటివ్ అసెంబ్లీ స్పీకరుగారికి, సభ్యులకు——

పీటర్ మారిజ్‌బర్గు కాలనీలో నివసిస్తున్న ఈ దిగువ సంతకములుచేసిన భారతీయుల విజ్ఞప్తి.

దివ్యాచిత్తమునకు తెచ్చేది :

నేటాలు భారతీయుల ప్రతినిధులైన ఈ విజ్ఞప్తిదారులు, తమ ఎదుట చర్చకు రాబోతున్న వోటింగుహక్కుల సవరణబిల్లును గురించి సగౌరవంగా మీ కీవిజ్ఞప్తిని చేసుకుంటున్నారు.

1894 సం. రం. 25వ నెంబరుబిల్లును రద్దుచేసి, దానిస్థానే కాలనీలో ఉన్న భారతీయులకు వోటింగుహక్కు లేకుండాచేసే ఈ బిల్లును ప్రవేశపెట్టడంలో, పూర్తిగా కాకపోయినా, చాలావరకు భారతీయులకు నష్టం కలిగించడమే ఉద్దేశమని మేము భావిస్తున్నాము.

1894 సం. రం. 25వ నెంబరు ఆక్టు చర్చలో ఉన్నప్పుడు ఆ విషయాన్నిగురించి భారతీయులతరఫున సమర్పింపబడిన విజ్ఞప్తిలో, భారతదేశంలో, భారతీయులకు ప్రజాప్రతినిధి సంస్థలున్నాయని చెప్పబడింది.

ఈ బిల్లు, యూరోపియను దేశాలుమినహా, తదితరదేశాలలో ఎక్కడ ప్రజాప్రతినిధి సంస్థలులేవో ఆ దేశాలనుండివచ్చిన నేటివ్‌లకు వోటింగు హక్కు లేకుండా చేయడానికి ఉద్దేశింపబడినది.

కనుక, ఈ బిల్లును ప్రతిఘటించడంలో మేము చాలా బాధాకర మైన ఇరుకులో పడినాము.

అయినప్పటికీ, ఈ బిల్లు వక్రమార్గంగా, లేక పరోక్షంగా భార తీయుల వోటింగుహక్కుల విషయంలో కలుగచేసుకుంటూ ఉన్నదని గ్రహించి, దానిని గురించి మా అభిప్రాయాలను తెలుపడం మా ధర్మమని భావిస్తున్నాం. అంతేకాకుండా భారతదేశంలో భారతీయులకు ప్రజా ప్రతినిధి సంస్థలున్నాయని ఎందుకు విశ్వసిస్తున్నామో నిరూపించడంకూడా మావిధియని నమ్ముతున్నాం.

పార్లమెంటు కామన్సుసభలో, 28-3-1892 తేదిని 1861 సం. రం. ఇండియా కౌన్సిల్సు ఆక్టు సవరణబిల్లును రెండవసారిచర్చను ప్రారంభిస్తూ అప్పట్లో ఇండియా ఉపమంత్రి ఈవిధంగా చెప్పేడు :

> ఈ బిల్లుయొక్క ఉద్దేశ్యమేమిటో చెప్పవలసిన విధి నాకున్నది. ఇండియా ప్రభుత్వ నిర్మాణముయొక్క పునాదులను, దాని ధర్మములను విస్తృతంచేసి, అనుద్యోగులైన భారతీయులు రాజ్య నిర్వహణంలో ఇప్పటికన్న ఎక్కువగా పాల్గొనేటట్లు చేయడం ఈ బిల్లు ఉద్దేశ్యం. 1858 సం. రం. లో ఇండియా ప్రభుత్వమును రాణీగారు స్వయంగా చేపట్టినప్పటినుంచీ, భార తీయ వర్గాల్లో ఉత్తమశ్రేణికి చెందినవారిలో ద్యోతకమైన అద్భుత రాజకీయశక్తిని అధికారపూర్వకంగా గుర్తించడానికే ఈ బిల్లు ఉద్దేశింపబడినది. 1861 సం. రం. ఇండియా కౌన్సిల్సు చట్టాన్ని ఈ బిల్లు సవరణ చేస్తున్నది. చాలా కాలంనుండి కొన్ని శాసనాధికారాలు ఇండియాలో ఉన్నవి. కాని అవి కొంత గంద్రగోళంగానూ, పరస్పరవిరుద్ధంగానూ ఉన్నాయి. ట్యూడర్ స్టూఆర్టు రాజులకాలంనుంచీ ఈస్టు ఇండియా కంపెనీతో పాటు, అవీ ఉంటున్నాయి. కాని ఇండియాలో ఇప్పుడున్న నవీన శాసన విధానాన్ని ప్రవేశపెట్టడానికి, రాజప్రతినిధి యైన కేనింగు ప్రభువు, ఇండియా మంత్రియైన సర్ సి. ఉడ్ గార్లు, (సర్ సి. ఉడ్ తర్వాత ప్రభువైనాడు) కారకులు. సర్ సి. ఉడ్ 1861 సం. రం. లో ఇండియా కౌన్సిలు ఆక్టును ఆమోదింప చేశాడు....

1861 సం. రం. ఆక్టు ననుసరించి భారతదేశంలో మూడు శాసన సభలు నిర్మాణం చేయబడ్డాయి—వైస్రాయి సుప్రీంకౌన్సిల్, మద్రాసు, బొంబాయి రాష్ట్రీయ శాసనసభలు. సుప్రీం కౌన్సిలులో వైస్రాయి, ఆయన కార్యనిర్వాహకవర్గం సభ్యులుగా ఉంటారు. వారితోపాటు కనీసం 6 గురు మొదలు 12 గురివరకు అదనపు సభ్యులుంటారు. వారందరినీ గవర్నరు జనరలే నియమిస్తాడు. వారిలో అధమం సగంమంది ఉద్యోగేతరులుగా ఉండాలి. వారు యూరోపియనులైనా కావచ్చును నేటివులైనా కావచ్చును. మద్రాసు బొంబాయి లెజిస్లేటివ్ కౌన్సిల్లలో, కనీసం 4 గురు మొదలు 8 గురికి మించకుండా రాష్ట్రీయ గవర్నరుచేత అదనపు మెంబర్లు నియమింపబడతారు. వారిలో అధమం సగం మంది ఉద్యోగేతరులై ఉండాలి. ఈ చట్టం ఆమోదింపబడిన పిమ్మట, బెంగాలులోనూ, పశ్చిమోత్తర రాష్ట్రంలోనూకూడా లెజిస్లేటివ్ కౌన్సిళ్ళు నిర్మాణం చేయబడినాయి. బెంగాలు కౌన్సిలులో లెఫ్టినెంట్ గవర్నరూ 12 గురు నామినేటెడ్ సభ్యులూ ఉంటారు. పశ్చిమోత్తర రాష్ట్రం కౌన్సిలులో లె. గవర్నరూ, 9 గురు నామినేటెడ్ సభ్యులూ ఉంటారు. వీరిలో మూడవవంతు మాత్రమే ఉద్యోగేతర (నానఫీషియల్) సభ్యులు. ........బుద్ధిశాలురు, సమర్థులు, ప్రజా సేవాసక్తులు అయిన నేటివ్ పెద్దమనుష్యులను ముందుకొచ్చి ప్రభుత్వ నిర్వహణములో పాల్గొనేటట్లు ప్రోత్సహించాము. ఈ లెజిస్లేటివ్ కౌన్సిళ్ళయొక్క సమర్థత, అంతస్థు, చాలా ఉన్నతిలో నున్నదనుట కేమీ సందేహము లేదు.

సవరణచట్టము, ప్రతిశాసనసభలోనూ నామినేటెడ్ సభ్యుల సంఖ్యను హెచ్చించడమేకాకుండా, ప్రతిసంవత్సరమూ బడ్జెటును చర్చించే అధికారాన్ని, ప్రశ్నలువేసే అధికారాన్నికూడా ప్రసాదించింది. అందులో ఎన్నిక సిద్ధాంతం ప్రవేశపెట్టబడింది. ఆదినుంచీకూడా లెజిస్లేటివ్ కౌన్సిళ్ళలో ప్రాతినిధ్యపు లక్షణాలు ఉంటూనే ఉన్నాయి. రెండవసారి చర్చను ప్రారంభించిన గౌరవనీయ ప్రతిపాదకుడు, నామినేటెడ్ సభ్యుల సంఖ్యను హెచ్చుచేయడంగురించి ఈ విధంగా చెప్పేడు :

ఈ సంఖ్యను హెచ్చించడంలోగల అభిప్రాయాన్ని చెప్పడం తేలికే. సభవారు దానిని సులువుగానే గ్రహిస్తారనుకుంటాను. ఎన్నుకోవలసిన పరియాను విస్తీర్ణంచేసినట్లయితే, కౌన్సిళ్లయొక్క ప్రాతినిధ్యబలం ఎక్కువవుతుంది.

ఇప్పుడు ఈ కౌన్సిళ్ళు ఎన్నికసూత్రంమీద ప్రాతినిధ్యాన్ని అనుభవిస్తున్నాయని మేము మనవిచేయడానికి సాహసిస్తున్నాము. "ఎన్నిక సిద్ధాంతంమీద ఆధారపడని కౌన్సిలు సంస్కరణము సంతృప్తికరము కాదు." అని పార్లమెంటు సభ్యుడు మిస్టర్ స్వాన్ ప్రతిపాదించిన సవరణ మీద మాట్లాడుతూ మిస్టర్ కర్జన్ ఇలా అన్నాడు :

> మా బిల్లు అటువంటి సిద్ధాంతాన్ని, సెలెక్షన్, ఎలెక్షన్, డెలిగేషన్ విధానాలను వేటినీ కాదనడంలేదని ఆయనకు మనవి చేస్తున్నాను. సభవారి అనుజ్ఞతో 1 వ క్లాజులోని సబ్‌సెక్షనును చదువుతాను. అది ఈవిధంగా ఉన్నది :
>
> > 'ఇండియామంత్రి అనుజ్ఞనుపొంది, గవర్నరు జనరల్ ఇన్-కౌన్సిల్, ఎప్పటికప్పుడు, గవర్నర్ జనరల్, గవర్నర్, లె. గవర్నర్లు, వరుసగా ఏ సందర్భాల్లో అటువంటి నామినేషనులు చేయాలో విశదీకరిస్తూ నిబంధనలను చేయవచ్చును. ఆ నిబంధనలను అమలుజరిపే విధానంకూడా ఆయన నిర్ణయించగలడు.'

కింబర్లీ ప్రభువు ఆక్లాజునుగురించి ఈవిధంగా అభిప్రాయం వెలిబుచ్చాడు :

> ఈ ఎన్నిక సిద్ధాంతంతో నేను పూర్తిగా సంతృప్తి పడినానని చెప్పక తప్పదు.

ఈ చట్టం విషయంలో కింబర్లీ ప్రభువు వెలిబుచ్చిన అభిప్రాయాలతో ఇండియామంత్రి ఏకీభవించాడు :

> భారతదేశంలో ఎన్నికపద్ధతిగా నిర్మాణంచేయబడి ఉన్న సంస్థలను, ఈ కౌన్సిళ్ళలో సభ్యులుగా ఉండడానికి తమ ప్రతినిధులను ఎన్నుకొనిగాని, నియామకం చేసిగాని, నామినేటుచేసిగాని, పంపమని ఆహ్వానించడానికి, వైస్రాయి కధికారమున్నది.

ది రైట్ ఆనరబుల్ మిస్టర్ గ్లాడ్‌స్టన్, ఈ విషయమై ప్రస్తావనచేస్తూ, బిల్లు రెండవసారి చర్చకు తెచ్చిన ప్రతిపాదకుని ఉపన్యాసాన్ని, దాని సవరణనూ విశదీకరించి ఇలా చెప్పేడు :

> ఎన్నిక సిద్ధాంతాన్ని ఏవిధంగా చొప్పించాలని మనము అనుకోవచ్చునో ఆవిధంగానే అది ప్రవేశ పెట్టబడినదని, ఉపమంత్రి ఉపన్యాసంవల్ల నా కవగాహనైందని చెప్పగలను. సభవారి ఎదుటనున్న మహత్తరసమస్య—నిస్సందేహంగా ఇదొక అగాధమైన మహత్తర విషయం—ఏమనగా, భారతప్రభుత్వంలో ఎన్నిక పద్ధతిని ప్రవేశపెట్టడం. అందుకు మొదటిమెట్టు చాలా పరిశుభ్రంగా ఉండాలని నా కోరిక. ఎన్నిక సిద్ధాంతానికి ఎంత సావకాశమిచ్చినా, ఇచ్చినంతవరకది నిజంగానే ఇవ్వాలి. సిద్ధాంతంలో ఏమీ తేడాలేదు. గౌరవనీయసభ్యుడైన మిస్టర్ కర్జన్ కొంచెం తటపటాయిస్తూ ఆమోదించినా, మొత్తంమీద ఎన్నిక సిద్ధాంతాన్ని స్పష్టంగా ఆమోదించినట్లేనని నా అభిప్రాయం.

పై చట్టాన్ని అనుసరించి తయారుచేయబడి ప్రకటింపబడిన నిబంధనలు, మేము పైన వెలిబుచ్చిన అభిప్రాయాలను సమర్థిస్తున్నాయని మనవి చేస్తున్నాము. ఉదాహరణకు, బొంబాయి లెజిస్లేటివ్ కౌన్సిలును ఎత్తుకుందాం. నామినేటు చేయబడిన 18 గురు సభ్యులలోనూ 8 మంది ఎన్నుకోబడ్డవారు. అనగా రెగ్యులేషనులలో ఉన్నట్లుగా, లెజిస్లేటివ్ కౌన్సిళ్లనిమిత్తం ఓటింగు అధికారా లొసంగబడిన ప్రతినిధిసంస్థల 'శిఫార్సు మీద నామినేటు చేయబడినవారు. బొంబాయి కార్పొరేషన్, (ఎన్నికల వల్ల ఏర్పడినసంస్థ) బొంబాయి రాజధానిలో బొంబాయి మినహాగా గవర్నరు ఇన్ కౌన్సిలు సూచించిన నగర మ్యునిసిపల్ సంఘాలు, పై విధంగానే సూచింపబడిన జిల్లా బోర్డులు, డక్కన్ సర్దారులు, భూస్వాములు, వర్తకసంఘాలు, బొంబాయి విశ్వవిద్యాలయం సెనేటు, మెజారిటీ ఓటింగుతో ఈ ఎనమండుగురు సభ్యులను ఎన్నుకుని శిఫార్సు చేస్తారు. చట్టప్రకారం నిర్మాణం కాబడని సంఘముల విషయంలో సదరు సంఘాలు తమ తీర్మానాల నామోదించడానికి, తమ నిర్ణయాలను నమోదుచేయడానికి ఏ పద్ధతి నవలంబిస్తారో ఆ పద్ధతినే ఈ విషయంలో కూడా అవలంబిస్తారు.

ఢక్కన్ సర్దారులలో కొందరు, కౌన్సిలు ఎన్నికల్లో సరాసరి వోటర్లుగా ఉన్నారనికూడా తాము తెలుసుకోగలరు.

ఇతర శాసనసభలకు సంబంధించిన నిబంధనలుకూడా దాదాపు ఈ విధంగానే ఉన్నాయి. భారతదేశంలో రాజకీయంగా ఎన్నికలహక్కులు, లెజిస్లేటివ్ కౌన్సిళ్ళు, ఈవిధంగా ఉన్నాయి. కనుక తేడా స్వభావంలోలేదు. అంతస్థులోనే ఉన్నది. ఇందుకు కారణం భారతీయులకు ప్రజా ప్రాతినిధ్య సిద్ధాంతం తెలియకకాదు. అర్థంకాకనూకాదు. కొంతవరకు పైన ఉల్లేఖించిన రైటానరబుల్ మిస్టర్ గ్లాడ్‌స్టన్ ఉపన్యాసమును పొందు పరచడంకన్న మేమధిక మేమీ చేయజాలం :

> ఎన్నికసిద్ధాంతంమీద ఈ అపారశక్తివంతమైన గవర్నమెంటు యంత్రాన్ని నడిపిస్తామని హామీల నిచ్చినతర్వాత, అందువల్ల అనుకున్న ఫలితాలు కొంతవరకైనా కనుబడకపోతేమాత్రం చాలా ఆశాభంగం కలుగుతుందని రాణీగారి ప్రభుత్వం తెలుసుకోవాలి. ఆ ఫలితాలు ఎంతనికాదు. వాటి నాణ్యాన్నిగురించే నేను మాట్లాడుతున్నాను. పురాతనమైన నాగరికత, ప్రత్యేకమైనసంస్థలు, వివిధములైనజాతులు, మతాలు, వృత్తులు, అపారమైన విస్తీర్ణమూకలిగి, ఒకచైనా మినహాగా ఒకేరాజ్యంలో ఇంతజనాభాగల భారతదేశంలో, మనం సాధించదలచుకున్న వాటినన్నిటినీ సిద్ధింపచేయడంలో కష్టాలు చాలా ఉన్నాయని నేనెరుగుదును. కష్టాలెంత ఎక్కువగా ఉన్నా, చేయదలచుకున్నపని చాలా ఉదారమైనది. దానిని జయప్రదంగా తుద నెగ్గించాలంటే, చాలా వివేకంతోనూ జాగ్రత్తతోనూ నడిపించాలి. ఇవన్నీచూస్తుంటే భారతదేశంయొక్క గొప్ప భవిష్యత్తుకొరకు సంతోషంతో ఎదురుచూడాలనిపిస్తోంది. అపారమైన విస్తీర్ణంకలిగిన భారతదేశంయొక్క ప్రభుత్వంలో, ఎంతపరిమితంగానైనా, ఎన్నిక సిద్ధాంతమును సద్భావంతో ప్రవేశ పెడుతున్నప్పుడు, తప్పకుండా నిజమైన విజయం కలుగుతుందని ఆశిస్తున్నాను.

భారతసమస్యలమీద మాట్లాడడానికి అర్హతలు గలవారందరూ, ఇండియన్ కౌన్సిల్సుయొక్క ప్రాతినిధ్య స్వభావం విషయంలో ఏకాభిప్రాయులై ఉన్నారు.

భారతీయసమస్యలమీద బ్రతికున్నవారిలోకల్లా గొప్ప ప్రామాణికుడైన సర్ విలియం విల్సన్ హంటర్ ఇలా అన్నాడు :

> 1892 సం. రం. క్రాస్ ప్రభువు చట్టప్రకారం, సుప్రీమ్ లెజిస్లేటివ్ కౌన్సిలులోనూ, రాష్ట్రీయ ప్రభుత్వ లెజిస్లేటివ్ కౌన్సిలులోనూ, ప్రాతినిధ్య సిద్ధాంతాన్ని, ఇప్పుడు జాగ్రత్తగా అమలు పరుస్తున్నారు.

నేటాలులో భారతీయుల వోటింగుహక్కును గురించి 'టైమ్సు' పత్రిక ఇలా వ్రాసింది :

> నేటాలులోని భారతీయుడు ఇండియాలో తాననుభవిస్తుండిన హక్కులకన్న విశేషమైన హక్కులను కోరకూడదనీ, ఇండియాలో అతనికి వోటింగుహక్కు లేదనీ వాదించడం సత్యావిరుద్ధం. భారత దేశంలో ఇంగ్లీషువారు ఏ వోటింగుహక్కుల ననుభవిస్తున్నారో, ఆ వోటింగుహక్కులనే భారతీయులు అనుభవిస్తున్నారు.

మ్యునిసిపల్ ఎన్నిక హక్కులను గురించి విశదీకరించిన పిమ్మట ఆ వ్యాసంలోనే ఈ విధంగా వ్రాసింది :

> మన భారత ప్రభుత్వ విధానంలో జరిగిన మార్పులవలన, (హైయ్యర్ ఎలక్టరేటు) హెచ్చుస్థాయీ ఎన్నికదారులు, అని పిలువదగిన, సిద్ధాంతమే వర్తిస్తుంది. 221 మిలియనులు అనగా 22 కోట్ల 1 లక్షమంది బ్రిటిష్ పౌరులను పరిపాలించే సుప్రీం కౌన్సిలు మెంబర్లు, లెజిస్లేటివ్ కౌన్సిలు మెంబర్లు, ప్రధానంగా దేశీయసంస్థల వలన ఎన్నుకోబడినవారు. సుప్రీం కౌన్సిల్లోనూ రాష్ట్రీయ కౌన్సిళ్లలోనూ ఉన్న ఉద్యోగసభ్యులు కాక తక్కినవారిలో సగంమంది సభ్యులు (నేటివ్‌లు) దేశీయులు. ఈ పోలికను చివరంటా సాగదీయడం సరికాదు. ఇండియాలో వోటులేదన్న కారణం చెప్పి, బ్రిటిష్ కాలనీలలో ఉన్న బ్రిటిష్ ఇండియన్ పౌరులకు వోటులేకుండా చేయాలనే వాదనకు మాత్రం ఇది జవాబు చెపుతుంది. ఇండియాలో ఎన్నిక విధానంద్వారా ప్రభుత్వం ఎంతవరకూ ఉంటే అంతవరకూ, మ్యునిసిపల్ కౌన్సిళ్లలోనూ రాష్ట్రీయ కౌన్సిళ్లలోనూ, సుప్రీం కౌన్సిలులోనూ భారతీయులూ, ఇంగ్లీషువారూ ఒకేస్థాయిలో ఉన్నారు. దేశీయ వర్గాల వారికి బలమైన ప్రాతినిధ్యం ఉన్నది.

భారతదేశంలో మ్యునిసిపల్ వోటింగుహక్కులు చాలా విస్తృతంగా ఉన్నాయి. దాదాపు బ్రిటిష్ ఇండియా అంతటిలోనూ మ్యునిసిపల్ సంఘాలు, లోకల్ బోర్డులు, ఏర్పడే ఉన్నాయి.

నేటాల్‌లో ఇప్పటికే ఓటర్ల జాబితాలో నమోదైన భారతీయుల తరహాను గురించి పైన చెప్పబడిన 'టైమ్సు' వ్యాసంలో ఈ విధంగా చెప్పింది :

> భారతదేశంలో మ్యునిసిపల్ ఎన్నికదారులలోనూ, తదితర ఎన్నికదారులలోనూ ఎవరు చాలా ఉపయుక్తమైన వారిగానూ, అమూల్యమైన వారిగానూ పరిగణింపబడుతున్నారో, సరిగా ఆ తరహాకు చెందినవారే వీరు. ఇండియాలో ఉన్న మొత్తం 750 మ్యునిసిపాలిటీల్లోనూ, బ్రిటిష్‌వారూ నేటివ్‌లూ సమానమైన హక్కుల ననుభవిస్తున్నారు. 1891 వ సంవత్సరంలో మ్యునిసిపల్ కౌన్సిలర్లలో యూరోపియనులు 839 మంది మాత్రముంటే, భారతీయులు 9,790 మంది ఉన్నారు. అనగా, భారత మ్యునిసిపల్ సంఘాల్లో యూరోపియనుల ఓటు ఇండియనుల వోటుకు 1 : 8 నిష్పత్తిలో ఉన్నదన్న మాట. నేటాలు ఎన్నికదారులలో 37 మంది యూరోపియను వోటర్లకు ఒక బ్రిటిష్ ఇండియన్ వోటరున్నాడు............ భారతీయ మ్యునిసిపల్ సంఘాలు, ఒకకోటీ ఏభై లక్షుల ప్రజలను పరిపాలిస్తున్నవనీ, 5 కోట్ల రూపాయలను ఖర్చుచేస్తున్నాయనీ మరచిపోకూడదు.

భారతీయులకు ప్రజాప్రతినిధి సంస్థల స్వభావం, బాధ్యతలు తెలుసునన్న విషయం గురించి ఆ వ్యాసం ఇలా వ్రాసింది :

> ప్రజా ప్రతినిధి సంస్థలు, ప్రజలజీవితంలో ఇంత దృఢంగా నాటుకున్న దేశం ప్రపంచంలో బహుశా మరొకటిలేదని చెప్పాలి. భారతదేశంలో ప్రతికులానికీ, ప్రతివృత్తికీ, ప్రతిగ్రామానికీ అనాది నుండీ ఒక పంచాయతీ ఉండేది. తాను ప్రాతినిధ్యం వహించిన చిన్న సంఘంకోసం, ఆ పంచాయితీ అవసరమైన శాసనాలుచేసి, పరిపాలన సాగించేది. గత సంవత్సరం ప్యారిష్ కౌన్సిల్సు ఆక్టును ప్రవేశపెట్టేవరకూ, ఇంగ్లండులోకూడా అటువంటి గ్రామీణ స్వపరిపాలన లేదు.

ఆ విషయాన్ని గురించి మిస్టర్ ష్వాన్, యం.పి., ఈవిధంగా చెప్పేడు :

> ఎన్నికల విధానం ఇండియాకు కొత్త అనుకోకండి........ ఎన్నికలకన్న భారతీయమైన దింకొకటి లేదు. మన నాగరికత చాలావరకు భారతదేశంనుంచేవచ్చింది. ప్రాక్సిద్ధాంతమైన ఎన్నిక విధానంయొక్క విశేషరూపాన్నే మనం అవలంబిస్తున్నా మనే టందు కేమీ సందేహంలేదు.
>
> ఇటువంటి పరిస్థితులలో, ఈ బిల్లు వర్తించే భారతీయ సంఘానికి, దాని నవగాహన చేసుకోవడం చాలా కష్టంగాఉన్నది.

బిల్లులోని అనిర్దిష్టత, సందిగ్ధత యూరోపియనులకూ భారతీయులకూ కూడా గౌరవప్రదంకాదని మేము మనవి చేస్తున్నాం. అందువల్ల ఉభయులూ సందిగ్ధావస్థలోనే ఉంటున్నారు. మాకు మాత్రం అది చాలా బాధాకరం.

ప్రస్తుతం వోటర్లజాబితా ప్రకారం ఒక భారతీయునికి 38 మంది యూరోపియనులున్నారనే సత్యాన్ని, గౌరవనీయ సభవారు గుర్తించాలని మేము కోరుతున్నాం. భారతీయులలో అత్యంత గౌరవప్రదమైన వారే ఆ జాబితాలో ఉన్నారనీ, చిరకాలంనుంచి కాలనీలో ఉంటూ ఇక్కడ ఆస్థిపాస్థులను సంపాదించుకున్నవారనీ తాము గమనించవలెనని ప్రార్థిస్తున్నాం.

కాని, భవిష్యత్తులో భారతీయవోట్లు ఏవిధంగా పెరిగిపోతాయో తెలుసుకోవడానికి ఈ జాబితా సూచిక కాదని చెప్పబడుతోంది. కాని రెండేళ్లనుంచి భారతీయ వోటర్లను ఓటులేకుండా చేస్తారనే బెదరింపులు సాగుతున్నప్పటికీ, వోటర్ల జాబితాలో పేర్లను నమోదుచేయించుకోవడానికి కొత్తగా భారతీయులు ముందుకురాకపోవడమే ఆ వాదాన్ని త్రోసి వేస్తున్నదని మా మనవి.

స్వానుభవంవల్ల మేము చేప్పేమాటేమిటంటే, వాస్తవానికి కాలనీలో చట్టప్రకారం ఆస్థి అర్హతలు—ఎంతతక్కువైనా—కలవారు లేరు.

తమ ఎదుట చర్చింపబడనున్న బిల్లుకు అనేకమైన అభ్యంతరాలు న్నాయని మేము మనవిచేస్తున్నాం. మా అభిప్రాయంలో, అది ప్రక్క దారులగుండా రంగుభేదాన్ని ప్రవేశపెడుతోంది. ప్రాతినిధ్య సంస్థలను అనుభవించడంలేని దేశాలనుండివచ్చిన నేటివ్‌లు వోటర్లుకాకూడదు. కాని యూరోపియను రాజ్యాలనుండివచ్చిన నేటివ్‌లు వారిదేశాలలో అటువంటి హక్కులననుభవించక పోయినప్పటికీ, కాలనీలోని సాధారణ వోటింగు హక్కుల చట్టాన్ని అనుసరించి వోటర్లుకావచ్చును.

తండ్రి యూరోపియనైతే, యూరోపియను జాతికిచెందని స్త్రీయొక్క శీలం ఎంత సంశయాస్పదమైనా ఆమెకొడుకులు వోటర్లుకా వచ్చును. కాని ఉన్నతకుటుంబంలో జన్మించిన యూరోపియనుస్త్రీ, యూరోపియనుజాతికి చెందని ఉత్తమ పురుషుని పెండ్లిచేసుకుంటే, ఆమె కొడుకు కాలనీలో అమలులోఉన్న చట్టం ప్రకారం, వోటరుకావడానికి వీలులేదు.

భారతీయులకు ఈ బిల్లు వర్తిస్తుందని భావిద్దాం. వారు వోటర్ల జాబితాలో నమోదుకావడానికి అవలంబించవలసినపద్ధతి, భారత సంఘా నికి నిరంతరం చికాకు కలిగిస్తుంది. అభిమాన దురభిమానాలకు కారణ మవుతుంది. భారతీయులలో తీవ్రమైన కలతలను కలిగిస్తాయి.

పైగా, ఈ బిల్లువల్ల భారతీయులు తమ హక్కులను రక్షించుకో డానికి తెంపులేని లావాదేవిల్లో ఇరుక్కోవడం జరుగుతుంది. కాలనీలోని లా కోర్టులకెక్కకుండానే వాటిని విశదీకరించ వచ్చునని మా అభిప్రాయం.

ఇప్పుడు భారతీయులకు వోటింగుహక్కులను తీసివేయించడానికి యూరోపియనులు ఆందోళన చేస్తున్నారు. ఈ ఆందోళనభారం వారినుండి భారతీయుల మీద పడుతుందనే విషయం అన్నిటికన్న ముఖ్యమైనది. అప్పుడీ ఆందోళన శాశ్వతంగా ఉంటుందని మేము భయపడుతున్నాం.

ఇటువంటిపరిస్థితులేర్పడడం, కాలనీలో నివసిస్తున్న అన్నివర్గాలవారి క్షేమానికీ అనర్థదాయకమని మేము సవినయంగా విజ్ఞప్తి చేసుకుంటు న్నాము.

దాదాపు సంవత్సరంనుండి యోచనచేసిన పిమ్మట, భారతీయుల వోటు, యూరోపియను వోటును ముంచెత్తుతుందన్న మాట కేవలం ఊహా మాత్రమేనని మేము నిశ్చయాని కొచ్చాం. కనుక, భారతీయవోటును ప్రత్యేకంగా పరిమితంచేసే బిల్లునుగాని, ప్రత్యక్షంగానో పరోక్షంగానో రంగు భేదాన్ని ప్రవేశపెట్టే బిల్లునుగాని, గౌరవనీయ సభవారు ఆమోదించడానికి ముందుగా, వోటర్ల లిష్టులోచేరడానికి చట్టప్రకారం కావలసిన ఆస్థి హక్కులు గల భారతీయ నివాసులెందరున్నారో, నిజపరిస్థితులను తెలుసుకునేందుకు సమగ్రమైన విచారణ జరిపించవలెనని కోరుతున్నాం.

ఈ విధంగా న్యాయం జరిపించిన దయకు మేము సర్వధా కృతజ్ఞులం. వగైరా.

(సం.) అబ్దుల్ కరీం హాజీ ఆదాం, తదితరులు.

[అచ్చుకాగితానికి నకలు.]

---

# 79. దాదాభాయ్ నౌరోజీకి పంపిన టెలిగ్రాం

*[దాదాభాయ్ నౌరోజీ, సర్ విలియం హంటర్, మిస్టర్ చాంబర్లేన్‌లకు పంపిన టెలిగ్రాం సారాంశం.]*

డర్బాన్,
7 మే, 1896.

నేటాల్ ఓటింగుహక్కుకు చెందిన బిల్లునుగాని, దానికి మంత్రివర్గం గతరాత్రి ప్రతిపాదించిన సవరణలనుగాని, ఆమోదించవలదని భారతీయులు కోరుతున్నారు—వినతిపత్రం తయారుచేయబడుచున్నది.

[కలోనియల్ ఆఫీసు రికార్డ్సు నం. 179 వ్యాలూం 196 నుంచి]



# 80. నేటాల్ ఇండియన్ కాంగ్రెస్

డర్బాన్
14 మే, 1896.

గౌరవనీయులైన ప్రధాన మంత్రికి—
పీటర్ మారిజ్ బర్గ్.
అయ్యా,

ఓటింగుహక్కు బిల్లుపై రెండవసారి చర్చజరిగిన సందర్భంలో, తమరు నేటాల్ ఇండియన్ కాంగ్రెసునుగురించి, యీవిధంగా అన్నట్లు ప్రకటించబడింది.

> "ఈ దేశంలో బలవత్తరమైన, సుసంఘటితమైన, రహస్య సంఘం ఒకటి ఉన్నట్లు బహుశా సభ్యులకు తెలిసియుండకపోవచ్చు-ఆయన ఇండియన్ కాంగ్రెసునుద్దేశించి యీ మాట అన్నాడు."

మీ ఉపన్యాసంలోని యీ భాగం సరిగా ప్రకటింపబడినదా ? ఐనట్లయితే కాంగ్రెస్ రహస్యసంఘం అనే మీ నమ్మకానికి ఆధారం ఉన్నదా ? అని అడగటానికి సాహసిస్తున్నాను. ఈ సందర్భంలో మీకు ఒక్కవిషయం జ్ఞాపకానికి తెస్తున్నాను. ఇటువంటిసంస్థ స్థాపించబడుతున్న విషయం పత్రికలలో ప్రకటించబడింది. అది స్థాపించబడ్డవార్త విట్‌నెస్ పత్రికలో పడింది. ఈ సంస్థతాలూకు సాంవత్సరిక నివేదిక, సభ్యుల జాబితా, నిబంధనావళీ పత్రికలకు అందచేయ బడినాయి. ఆ పత్రికలు వాటిపై విమర్శించటంకూడా జరిగింది. కాంగ్రెసు గౌరవకార్యదర్శి హోదాలో, పై జాబితాలను, ప్రభుత్వానికి కూడా నేను అందజేశాను.

తమ విధేయుడు
(సం) యం. కె. గాంధీ
గౌరవ కార్యదర్శి
నేటాల్ ఇండియన్ కాంగ్రెస్

[సబర్మతీ సంగ్రహాలయంలోని కాపీనుంచి]

# 81. నేటాల్ ఇండియన్ కాంగ్రెస్

డర్బాన్,
18 మే, 1896.

సి. బర్డ్,
ప్రధాన అండర్ సెక్రటరీ,
కలోనియల్ ఆఫీస్,
పీటర్ మారిజ్ బర్గ్.

అయ్యా,

మీరు 16వ తేదీన వ్రాసిన, 2837/96 నెంబరుగల జాబు చేరినది. నేటాల్ ఇండియన్ కాంగ్రెస్ విషయంలో, ప్రధానమంత్రికి, నేను వ్రాసిన జాబుకు యిది సమాధానం.

ఈ సందర్భంలో, కాంగ్రెసు సమావేశాలు, ఎప్పుడూ బహిరంగంగానే జరుపబడుతున్నాయనీ, పత్రికలకూ ప్రజానీకానికీ, అవి అందుబాటులోనే ఉన్నాయనీ చెపుతున్నాను. కాంగ్రెసు సభ్యులదృష్టిలో, యీ సమావేశాలపట్ల ఆసక్తి ఉన్నదనుకునే యూరోపియన్లుకూడా, వీటికి ప్రత్యేకంగా ఆహ్వానించబడినారు. వారిలో ఒకాయన ఆహ్వానాన్ని అంగీకరించి, ఒక కాంగ్రెసు సమావేశానికి హాజరుకూడా అయినారు. ఒకటి రెండుసార్లు, ఆహ్వానింపబడని యూరోపియన్లుకూడా, కాంగ్రెసు సమావేశాలకు హాజరైనారు.

యూరోపియన్లను ఉపాధ్యక్షులుగా ఉండవలసినదిగా, ఆహ్వానించాలన్నది, యీ కాంగ్రెసుసంస్థ నిబంధనలలో ఒకటి. దీనిననుసరించి యిద్దరు పెద్దమనుష్యులను ఆహ్వానించడం జరిగింది. కాని వారు యీ ఆహ్వానాన్ని అంగీకరించలేకపోయారు. సమావేశాలలో, జరిగిన విషయాలన్నీ రికార్డురూపంలో ఉంచబడుతున్నాయి.

తమ విధేయుడు,
(సం.) యం. కె. గాంధీ
గౌరవకార్యదర్శి
నేటాల్ ఇండియన్ కాంగ్రెస్.

[సబర్మతీ సంగ్రహాలయంలోని కాపీనుంచి]

# 82. పరీక్షకోసం దాఖలు చేయబడిన కేసుకు ఖర్చులు

ప్రిటోరియా
మే 18, 1896

గౌరవనీయులైన బ్రిటిష్ ప్రతినిధికి — ప్రిటోరియా.

అయ్యా,

ఈ రిపబ్లిక్‌లో నివసిస్తున్న బ్రిటిష్ ఇండియనుల విషయంగా మీ దర్శనంచేశాను. ఆ సందర్భంలో 1885 సంవత్సరం మూడవ నెంబరు చట్టానికి అన్వయ మేమిటో తేల్చడానికి, భారతీయులు పరీక్షకోసం, న్యాయ స్థానంలో దావా దాఖలు చేసినట్లయితే, అందుకయ్యే ఖర్చులను రాణీగారి ప్రభుత్వం భరించవలసి ఉంటుందని మనవిచేసుకున్నాను. గౌరవనీయులైన కాలనీల శక్రటరీగారికి తంతినిచ్చి, రాణీగారి ప్రభుత్వం సదరు దావాకయ్యే ఖర్చులను భరిస్తుందేమో తెలుసుకోవలెనని, రాయబారవర్గంవారి తరఫున నేను మిమ్ములను ప్రార్థిస్తున్నాను. ఆలాకోరడానికి కారణాలు ఇవి :

1. ఫ్రీస్టేటుయొక్క ప్రధాన న్యాయమూర్తి ఇచ్చిన మధ్యవర్తి పరిష్కారంవలన, ఈ దావా దాఖలు చేయవలసిన అవసరమేర్పడింది. ఈ మధ్యవర్తి పరిష్కారానికి రాణీగారి ప్రభుత్వం, ట్రాన్సువాలులోని భారతీయుల అభిప్రాయమేమిటో తెలుసుకోకుండానే అంగీకరించింది. ఈ విషయం, ప్రధానంగా ట్రాన్సువాల్ భారతీయుల హక్కులకు సంబంధించినదే. ఈ మధ్యవర్తి పరిష్కారానికీ, మధ్యవర్తివరణానికీ కూడా వారు తమ అసమ్మతిని తెలిపినప్పటికీ కూడా రాణీగారి ప్రభుత్వం ఈ మధ్యవర్తిత్వానికి అనుమతించింది. (1895 సంవత్సరం తాలూకు సి 7911 నెంబరు బ్లూబుక్ 35 వ పేజీ 3 వ పేరా చూడండి).

2. పైన ఉదహరింపబడిన బ్లూబుక్ 34 పేజీ, (నెంబరు 9) 46 వ పేజీ (12 నెంబరులో జతపరుపబడినది) లలో ప్రచురింపబడిన టెలిగ్రాములనుబట్టి రాణీగారి ప్రభుత్వం పరీక్షార్థం దావా దాఖలుచేయ దలచుకున్నట్లు స్పష్టమవుతోంది. భారతీయ సంఘానికిచెందిన

ఒకని పేరిట దావా దాఖలు చేయబడినప్పటికీ, రాణీగారి ప్రభుత్వమే అందులకయ్యే ఖర్చులను భరిస్తుందనుకోవడం సబబే.

3. ట్రాన్సువాలులోని భారతీయులకు అనర్హతలను కలిగించి, న్యూనత పరచడానికి చేయబడుతున్న ప్రయత్నాలను ప్రతిఘటించడానికి, వారుచాలా ఖర్చుపడుతున్నారు. 1884 సంవత్సరం కన్వెన్షను, 14 వ ఆర్టికిల్, అలాంటి అనర్హతలనుండీ న్యూనతనుండీ వారిని కాపాడడానికిచేసిన రక్షణలు లెక్క చేయబడడంలేదు. ఈ విషయంగా ధనవ్యయం చేయడానికి వారికెంత మాత్రమూ స్తోమతులేదు. కనుక ఖర్చుల విషయమైన కోరికను మీరు టెలిగ్రాం ద్వారా తెలియ చేసేటప్పుడు, కారణాలను కూడా తెలియచేస్తారని ఆశిస్తున్నాను.

మీరు ఈ రోజున మా రాయబార వర్గానికి దర్శనమిచ్చినందుకూ, మర్యాదగా ఆదరించినందుకూ, సానుభూతితోనూ, సావధానంగానూ విన్నందుకూ, మీకు నాతరఫునా, రాయబారవర్గం వారితరఫునా మరొక్కసారి వందనముల నర్పిస్తున్నాను.

రాయబార వర్గంతరఫున,

ఇట్లు విధేయుడు
(సం.) మో. క. గాంధీ

[కేపుటౌన్‌లోని రాణీగారి హైకమీషనరు, కాలనీల సెక్రటరీ ఆఫ్ స్టేటుకు 1897 సంవత్సరం మే 25 వ తేదీని పంపినలేఖకు అనుబంధం.]

# 83. మిస్టర్ ఛాంబర్లేన్‌కు విన్నపం

డర్బాన్,
22 మే, 1896.

రైట్ ఆనరబుల్, జోసఫ్ చాంబర్లేన్‌కు—
ప్రభుత్వ కాలనీల ప్రధాన కార్యదర్శి,
లండన్.

నేటాల్ కాలనీలో నివసిస్తున్న, బ్రిటిష్ పౌరులైన దిగువ సంతకములుచేసిన భారతీయులు సమర్పించుకున్న, విన్నపములు.

ఓటింగుహక్కు చట్టపు సవరణబిల్లు విషయంలో, యీ దిగువ చెప్పిన సంగతులను, మీరు పరిశీలించవలసిందిగా విన్నపందారులు కోరుతున్నారు. నేటాల్ అసెంబ్లీలో, యీ బిల్లు నేటాల్ ప్రభుత్వంచే ప్రవేశపెట్టబడి, 13 మే 1896న కొన్ని సవరణలతో, మూడవపర్యాయం చర్చింపబడింది.

3 మార్చి 1896 తీదీగల *నేటాల్ గెజెట్‌లో* యీ బిల్లు ఈ విధంగా ప్రకటించబడింది :

ఓటింగుహక్కుకు, చెందినచట్టాన్ని సవరించే నిమిత్తం :

ఈ సవరణ అత్యవసరమని భావించటంవల్లనూ, నేటాల్ లెజిస్లేటివ్ కౌన్సిల్, లెజిస్లేటివ్ అసెంబ్లీల అనుమతి అంగీకారాలతో ఘనత వహించిన మహారాణి, యీ చట్టాన్ని ప్రకటించుచున్నది :

(1) చట్టం నంబరు 25, 1894, యిందుమూలముగా రద్దు పరచడమైనది.

(2) ఈ చట్టం 3వ సెక్షను క్రిందకు వచ్చువారు తప్ప తదితరులెవ్వరూ, గవర్నర్—ఇన్—కౌన్సిలు వద్ద నుంచి ముందుగా ఆర్డరుపొందితేనేతప్ప, ఏ ఎన్నికల జాబితాలోకూడా తమ పేరు ఓటరుగా నమోదుచేయించుకొన నర్హులుకారు. 1893 వ సంవత్సరపు రాజ్యాంగచట్టం 22వ సెక్షను ననుసరించిగాని, లెజిస్లేటివ్

అసెంబ్లీకి ప్రతినిధుల నెన్నుకొనే తదితర ఏ చట్టం రీత్యాగాని, ఓటుచేయటానికి అర్హులుకారు. ఇది (యూరోపియన్లుకాని) స్వదేశస్థులకూ, ఎన్నుకొనబడిన ప్రతినిధి సంస్థలులేని దేశాలకు చెందిన ప్రజల మగసంతతి వారికీ వర్తిస్తుంది. కాని ఈ చట్టము వర్తించకూడదని ముందుగా గవర్నర్-ఇన్-కౌన్సిలువద్దనుండి అనుమతిపొందినవారి కిది వర్తించదు.

(3) ఈ చట్టంలోని రెండవ సెక్షనులో పేర్కొనబడి, యీ చట్టం జారీచేయబడుతున్న సమయానికి, ఏ ఓటర్ల జాబితాలోనైనా, సక్రమంగా, పేరునమోదై, తదితరంగా ఓటర్లుగా ఉండదగిన యోగ్యతార్హతలుగల్గిన వ్యక్తులకు, యీ చట్టపు రెండవసెక్షను లోని, నిబంధనలు వర్తించవు.

పై బిల్లు 1 వ సెక్షనుద్వారా రద్దుకాబడినచట్టం యీ దిగువ విధంగా ఉంది :

ఓటింగుహక్కు-చట్టాన్ని సవరించటం అవసరమైనందువల్లనూ, పార్లమెంటరీ సంస్థలకు ప్రతినిధుల నెన్నుకొనే ఓటు హక్కును వినియోగించుకునే విధానానికి అలవాటుపడని ఆసియా జాతుల వారిని మినహాయించే నిమిత్తమున్నూ, నేటాల్ లెజిస్లేటివ్ కౌన్సిల్, లెజిస్లేటివ్ అసెంబ్లీల, అనుమతిఅంగీకారాలతో, ఘనత వహించిన మహారాణి ఈ దిగువ చట్టమును ప్రకటించుచున్నది :

1. ఈ చట్టపు రెండవసెక్షనుద్వారా మినహాయింపబడితేనే తప్ప, ఆసియా జాతులకుచెందిన వారెవ్వరైనా, తమ పేర్లను, ఏ ఓటర్లజాబితాలోగాని, తదితర ఎన్నికదారుల జాబితాలలోగాని, నమోదు చేయించుకొనుటకుగాని, లేక 1893వ సంవత్సరపు రాజ్యాంగచట్టపు 22 వ సెక్షను ననుసరించిగాని, లెజిస్లేటివ్ అసెంబ్లీ ఎన్నికకు చెందిన మరే చట్టరీత్యాగాని, ప్రతినిధుల నెన్నుకొనటానికి అర్హులుకారు.

2. ఈ చట్టం జారీచేయబడుతున్న సమయానికి, ఏ ఓటర్ల జాబితాలోనైనా, సక్రమంగా పేర్లు నమోదై, తదితరంగా ఓటర్లుగా ఉండదగిన యోగ్యతార్హతలు కల్గియున్న వారికి, ఈ చట్టం 1 వ సెక్షనులోని నిబంధనలు వర్తించవు.

> 3. ఘనతవహించిన మహారాణిగారు యీ చట్టాన్ని ఆమోదించినారని గవర్నరు, నేటాల్ గెజెట్ ద్వారా ప్రకటించిన మీదట గాని, గెజెట్ ద్వారాగాని ఈ చట్టం అమలులోనికి రాదు. మరేవిధంగానైనాగాని, ప్రకటన జరిగినమీదట గవర్నరు నిర్ణయించిన తేదీనుంచి యిది అమలులోనికి వస్తుంది.

ప్రస్తుతం చర్చించబడుతున్న యీ బిల్లు విషయంలో, భారతీయుల అభిప్రాయాలను తెలియచేసేవిన్నపం ఒకటి 28 ఏప్రియల్ 1896 తేదీన లెజిస్లేటివ్ అసెంబ్లీకి సమర్పించబడింది. దాని కాపీ ఒకటి యిందుతో జతపరచబడింది.

6 మే 1896 తేదీన యీ బిల్లు రెండవపర్యాయం చర్చించబడింది. ఈ సందర్భంలో, గౌరవనీయులైన ప్రధానమంత్రి సర్ జాన్ రాబిన్సన్, ఈ బిల్లులో "ఎన్నుకొనబడిన ప్రతినిధిసంస్థలు" అన్న పదాలకుముందు, "ఓటింగు హక్కు వినిమయంద్వారా" అనుమాటలచేర్పుకు, మీకు అంగీకారమవునా కాదా అని అడగడానికి మంత్రులు చర్య తీసుకున్నట్లున్నూ, దానికి మీరు అంగీకారం తెలియపరచినట్లుగాను, తమ ఉపన్యాసంలో తెలియ చేశారు.

దీనిపై 7 మే 1896న, యీ విన్నపందారులు ఒక కేబుల్ యీ విధంగా తమకు పంపుకున్నారు :

> 'నేటాల్ ఓటింగుహక్కుకు చెందిన బిల్లునుగాని, దానికి మంత్రులు ప్రతిపాదించిన సవరణలనుగాని, ఆమోదించవలదని భారతీయులు కోరుతున్నారు. విన్నపం తయారు చేయబడుతున్నది'.

కాని, 11 మే 1896న, తమరు 'పార్లమెంటరీ' అనేపదం అదనంగా 'ఓటింగుహక్కు' అనుదానికి, ముందుచేర్చుటకు అంగీకరించినట్లుగా, గౌరవనీయులైన సర్ జాన్ రాబిన్సన్, కమిటీలో తెలియచేశారు.

కనుక, 'ప్రతినిధిసంస్థలు' అనునది, "పార్లమెంటరీ ఓటింగుహక్కు వినిమయంద్వారా ఎన్నుకొనబడిన ప్రతినిధిసంస్థలు"గా, బిల్లులో మార్పు వస్తుంది.

ప్రస్తుతపు యీ బిల్లు, భారతీయులకు సంబంధించినంతవరకు, నిజం చెప్పాలంటే, తదితర వర్గీయుల విషయంలోకూడా, రద్దు పరచబడుతున్న చట్టంకంటెకూడా, అతిఘోరమైనదని, విన్నపందారులమైన మేము చెప్పడానికి సాహసిస్తున్నాం.

ఈ బిల్లును మీరు ఆమోదించినారని, తెలిసి చాలా బాధపడినాము. కాని మా విన్నపంద్వారా తెలియపరచిన నిజస్థితిగతులను, వాదనలను, పునః పరిశీలనచేసి మీరు మీ అభిప్రాయాన్ని మార్చుకుంటారని ఆశిస్తున్నాం.

ఇండియాలో "ఎన్నుకొనబడిన ప్రతినిధిసంస్థలు" ఉన్నాయనీ, భారతీయులకు అవి పరిచితమైనవనీ, యీ విన్నపందారులమైన మేము మొదటి నుంచీ వాదిస్తూనేయున్నాం. కాని ఈ ఎన్నికల వ్యవహారానికి సంబంధించి ఇంతవరకు ప్రచురించబడిన పత్రాలు, భారతీయులకు యిటువంటి సంస్థలతో పరిచయం ఉందని తమరు భావించనట్లుగా తెలియపరుస్తున్నాయి. మీ అభిప్రాయం సరికాదని తెలియచేసేందుకుగాను, కొన్ని గ్రంథాల నుంచి ఆధారాలు, దీనికి జతపరచబడిన అనుబంధంలో ఉదహరించబడినవి. వాటిని తమరు దయతోపరిశీలించవలసిందిగా కోరుతున్నాం.

ఇండియాలోని, ఎన్నుకొనబడిన ప్రతినిధి సంస్థల విషయంలో తమ అభిప్రాయం, దానికితోడు తమరు బిల్లుకు అంగీకారం యివ్వడం, యీ రెండూ నేటాల్‌లోని భారతీయులను చాలా బాధాయుతమైన సందిగ్ధావస్థలో పెట్టినాయి.

అందువల్ల మేము యీ విధంగా విన్నవించుకుంటున్నాం :

(1) నేటాల్‌లోని భారతీయుల ఓటింగుహక్కును అరికట్టే శాసనం చేయడం అనవసరం.

(2) ఈ విషయంలో ఏమన్నా సందేహముంటే, యీ శాసనం అవసరమవునా కాదా అన్న విషయాన్ని నిర్ణయించే విషయంలో ప్రథమంగా దర్యాప్తు జరపాలి.

(3) ఓటింగుహక్కును అరికట్టవలసిన అవసరం ఉందని భావించినప్పటికీ, ప్రస్తుతపు బిల్లు సరియైన మార్గంలో, న్యాయంగా, యీ సమస్యను పరిష్కరించలేదు.

(4) ఇటువంటి అవసరం ఉందనీ, మొత్తం వర్గవిభేద కారకమైన యీ శాసనంచేయటం తప్ప మరేయితర బిల్లుద్వారా ఈ సమస్య పరిష్కారంకాదని రాణీగారి ప్రభుత్వం భావిస్తున్నట్లయితే, ఓటింగుహక్కుకు సంబంధించిన ప్రతిబిల్లులోనూ భారతీయులను ప్రత్యేకంగా పేర్కొనటం చాలా మంచిది.

(5) ఈ బిల్లులోని సందిగ్ధత, లావాదేవీలకు తప్పక దారి తీస్తుంది.

(6) దీనివల్ల భారతీయులకు, తలకుమించిన ఖర్చులు తగులు తాయి.

(7) ఈ బిల్లువల్ల భారతీయులందరికీ దెబ్బ తగులుతుందని అంగీ కరించిననాడు, దీనిలోని నిబంధనలు వర్తించకుండా చేయడానికి పెట్టిన షరతులు, నిరంకుశమైనవిగానూ, అసహజంగానూ, భారతీయులలో వైషమ్యాలు పెంపొందించేవిగానూ ఉన్నాయని యీ విన్నపందారులమైన మేము తెలియపరచుకుంటున్నాం.

(8) ఈ బిల్లు, రద్దుచేయబడిన చట్టం మాదిరిగానే, యూరోపి యన్లకూ, తదితరులకూ మధ్య భేదభావాన్నీ పక్షపాతాన్నీ ప్రదర్శిస్తోంది.

నేటాల్‌లోని ప్రస్తుతపు ఓటర్ల జాబితాలను, చూస్తే భారతీయుల ఓటింగుహక్కును అరికట్టే శాసనంచేయటం అనవసరమని తెలుస్తుంది. రాణీగారి పౌరులలో చాలా మందికి హానికలిగించే యీచర్య తీసుకొన డంలో, అనవసరమైన తొందరపాటు కనుపడుతోంది. 9309 యూరోపి యను ఓటర్లకు, 251 మంది భారతీయ ఓటర్లున్నారన్న విషయం నిర్వివాదాంశం. 201 మంది వ్యాపారులు, గుమాస్తాలు, అసిస్టెంట్లు, ఉపాధ్యాయులు, మొదలైనవారు. మిగిలిన 50 మంది తోటమాలీలు, తదితరులు. ఈ ఓటర్లలో చాలా మంది ఏనాడో, యిక్కడ స్థిరపడి పోయినవారు. ఈ అంకెలవల్ల, హక్కులను నిర్బంధ పరచే శాసనం చేయవలసిన అవసరంలేనట్లుగా స్పష్టమవుతున్నదని, యీ విన్నపం దారులం తెలియ పరచుకుంటున్నాం. ఎప్పుడో, ఎన్నడో కలుగబోయే ప్రమా దాన్ని ఎదుర్కొనడానికి యీ బిల్లు ఉద్దేశించబడింది. కేవలం అపోహతో

ఈ ప్రమాదం ఉందని అనుకుంటున్నారు. భారతీయుల ఓట్లు, యూరోపియన్ ఓట్లను, ముంచెత్తుతాయనే భయంవల్లనే సర్ జాన్ రాబిన్సన్, యీ బిల్లును రెండవసారి చర్చకు ప్రవేశబెట్టేరు. ఆయన భయానికి కారణాలు, యివి :

(1) ఎన్నికలహక్కు-చట్టం యీ బిల్లుద్వారా రద్దుచేసే విషయంలో ప్రభుత్వానికి పంపిన అర్జీమీద 9000 మంది భారతీయులు సంతకాలు చేయడం.

(2) ఈ కాలనీలో జరుగబోయే జనరల్ ఎలక్షను.

(3) నేటాల్ ఇండియన్ కాంగ్రెస్ ఉనికి.

మొదటి కారణం విషయంలో, దీనిపై జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలనుబట్టి అర్జీమీద సంతకాలు చేసిన 9000 మందీ ఓటర్ల జాబితాలలో చేర్చబడాలని కోరినట్లుగా, నేటాల్ ప్రభుత్వం వాదిస్తోంది. ఈ వాదనకు ఆ అర్జీలోని మొదటి పేరా సమాధానం చెపుతుంది. ఆ అర్జీదారులు ఆ విధంగా కోరలేదని, యీ విన్నపందారులమైన మేము చెపుతున్నాం. భారతీయులకు ఒక్కుమ్మడిగా ఓటింగుహక్కు తీసేసే విషయంలో వారు అసమ్మతి తెలిపేరు. ఆస్థికి చెందిన యోగ్యత ఉన్నా లేకపోయినా, యీ బిల్లువల్ల ప్రతి భారతీయునికీ కష్టం కలుగుతుందని మేముచెప్పడానికి సాహసిస్తున్నాం. ఈ బిల్లు ప్రవేశపెట్టిన వ్యక్తి, భారతీయులలో సంఘటిత శక్తి ఉందని చెప్పారు. దీనికి మేము కొంతవరకు అంగీకరిస్తున్నాం. కాని యీ శక్తిఎంత బలిష్టమైనదైనప్పటికీ, స్వాభావికమైన అడ్డంకులను దాటలేదని మనవి చేసుకుంటున్నాం. సంతకాలుచేసిన 9000 మందిలో, ఇప్పటికే ఓటర్ల జాబితాలలో ఉన్నవారుకాక, మరి 100 మందికి కూడా, ఆస్థికి సంబంధించిన యోగ్యతలు లేవని తెలియచేస్తున్నాం.

ఇక రెండవ కారణం విషయంలో యీ బిల్లు ప్రతిపాదించిన వ్యక్తి యిలా అన్నారు :

> 'త్వరలోనే సాధారణపు ఎన్నికలు జరుగనున్నాయి. ఈ ఎన్నికలు ఏ జాబితా మీద ఆధారపడి జరుగాలి అన్న విషయం నిర్ణయించుకోవాలి. తయారు కాబోయే ఓటర్ల జాబితాలలో ఎంత మంది భారతీయులు ఓటర్లుగా ఉంటారో, ఎంత మంది ఉండరో చెప్ప

వలసింది నేనుకాదు. కాని యీ సమస్యను, ఇంకా ఆలస్యం చేయకుండా ప్రథమంలోనే త్రుంచి వేయవలసిన అవసరం ఏర్పడి నట్లుగా, ప్రభుత్వం భావిస్తున్నది.

ఈ విజ్ఞప్తిదారులకు, యీ బిల్లు ప్రతిపాదించిన వ్యక్తిపట్ల చాలా గౌరవాదరాలున్నాయి. కాని నిజానికి యీ భయానికి ఆధారంలేదని చెపుతున్నాం. 1895 వ సంవత్సరపు, ప్రొటెక్టర్ ఆఫ్ ఇమిగ్రెంట్సు రిపోర్టు ననుసరించి, కాలనీలోని 46343 భారతీయులలో 30,303 మంది మాత్రమే స్వతంత్రం కలవారని తెలుస్తుంది. దీనికి వర్తక వ్యాపారాలు చేసుకునే 5000 మంది భారతీయులను చేర్చుకొనవచ్చును. ఆ విధంగా 45,000 యూరోపియన్లకు, 35,000 మంది భారతీయులుంటారు. వీరే యూరో పియన్లతో పోటీచేసేది. ఒడంబడిక రీత్యా ఉన్న భారతీయులు 16,000. ఈ పద్ధతిగా నున్నంతకాలం వీరు ఓటర్లుగా పోటీచేయలేరని తెలుస్తోంది. పైగా 30,303 భారతీయులలో చాలా మంది స్థితి, యీ ఒడంబడిక ప్రకారం వచ్చిన భారతీయులస్థితికంటె, కొంచెంగానే మెరుగ్గా ఉంది. సాలీనా 10 పౌనులకంటె ఎక్కువ అద్దె యివ్వని భారతీయులు వేలాది మంది ఉన్నా రని మేము ధైర్యంగా చెప్పగలం. వేలకొలది మంది యీ మొత్తంలోనే తమజీవితాన్ని అతి భారంగా వెళ్ళబుచ్చుతున్నారు. ఇటువంటి పరిస్థితులలో, వచ్చే సంవత్సరం భారతీయులు, యూరోపియన్లను, ఎలక్షన్లలో, అధిగమించే అవకాశం ఎక్కడుంది?

గత రెండు సంవత్సరాలనుంచీ, ఓటింగు హక్కు లేకుండా పోతుందనే బెదరింపు ఉండనే ఉంది. ఈలోగా ఓటర్ల జాబితాలు రెండుసార్లు సవరించ బడ్డాయి. భారతీయులు ఓటర్ల జాబితాలలో నమోదుకావటానికి సర్వ విధాలా ప్రయత్నించటం సహజమే. లేకపోతే, చాలా మందికి అందులో ప్రవేశార్హత లేకుండాపోతుంది. ఐనప్పటికీ, భారతీయులలో, ఏ ఒక్కరూ కూడా ఓటర్ల జాబితాలలో అదనంగా చేర్చబడలేదు.

ఐనప్పటికీ యీ బిల్లును ప్రవేశపెట్టిన పెద్దమనిషి యింకా యిలా చెప్పేరు :

"ఈ దేశంలో బలవత్తరమైన, సుసంఘటితమైన రహస్య సంఘం ఒకటి ఉన్నట్లు బహుశా సభ్యులకు తెలిసి యుండక పోవచ్చును. 'ఇండియన్ కాంగ్రెసునుద్దేశించి అన్నమాటయిది.' ఈ

సంఘానికిబాగా ధనసంపత్తి ఉన్నది. దీనికి సమర్థులు, మేధావులు నాయకత్వం వహించినారు. ఈ కాలనీలో రాజకీయంగా ప్రముఖపాత్ర వహించటం, యీసంఘం ప్రధానోద్దేశ్యం.”

కాంగ్రెసు విషయంలో యీ ఊహాగానం నిజంకాదని, విజ్ఞప్తిదారుల మైన మేము, ధైర్యంగా చెపుతున్నాం. ఇందుకేమీ ఆధారాలులేవు. గౌరవనీయులైన ప్రధాన మంత్రికీ, కాంగ్రెసు గౌరవ కార్యదర్శికీ జరిగిన ఉత్తరప్రత్యుత్తరాలు చూస్తే, కాంగ్రెసు రహస్య సంఘం అని అభిప్రాయపడటం తప్పు అని వ్యక్తమవుతుంది. ఆ విధంగానే, 20 వ తేదీన లెజిస్లేటివ్ అసెంబ్లీలో కూడా, ఆయన ఒక ప్రకటనచేశారు.

ఏవిధంగానూ రాజకీయమైన అధికారం చెలాయించడం కాంగ్రెసు ఉద్దేశ్యం ఎంతమాత్రంకాదు. ఆ విధంగా ఎన్నడూ ప్రయత్నించనూ లేదు. కాంగ్రెసు ఆశయాలు యీదిగువ యివ్వబడుతున్నాయి. ఇవి దక్షిణాఫ్రికాలోని ప్రతి వార్తాపత్రికలోనూ ప్రచురింపబడినాయి.

(1) కాలనీలో నివసిస్తున్న యూరోపియన్లు, భారతీయుల మధ్య సుహృద్భావం, పెంపొందింప చేయడం.

(2) పత్రికలద్వారానూ, కరపత్రాలు, ఉపన్యాసాలు మొదలైన వాటి వల్లనూ, ఇండియాను గురించీ, భారతీయులను గురించీ సమాచారం వ్యాపింపచేయడం.

(3) కాలనీలో పుట్టి పెరిగిన భారతీయులకు, ఇండియా చరిత్రను తెలియచేయడం, వారిలో భారతీయ గ్రంథాలు చదివే ఆసక్తి కలుగచేయడం.

(4) భారతీయుల కష్టనష్టాలను తెలుసుకొని, వాటి నివారణ కొరకు, శాసన బద్ధమైన ఆందోళనద్వారా ప్రయత్నించడం.

(5) ఒడంబడిక ననుసరించి వచ్చిన భారతీయుల స్థితిగతులు తెలుసుకుని వారికి కష్టదశలో సహాయపడడం.

(6) పేద సాదలకు వీలైనన్ని విధాలుగా సహాయపడడం.

(7) నైతికంగా, సాంఘికంగా, వైజ్ఞానికంగా, రాజకీయంగా, భారతీయులను, మంచి స్థితిలో పెట్టడం.

దీనివల్ల కాంగ్రెసు ఉద్దేశ్యం, నైతిక పతనాన్ని అరికట్టడమేకాని, రాజకీయంగా అధికారం పొందడం కాదని తెలుస్తోంది. ఇక కాంగ్రెసు అర్థిక స్థితి. ఈ వినతి పత్రం వ్రాసేరోజుకు కాంగ్రెసు ఆస్థి విలువ పౌ. 1,080. బ్యాంక్‌లో పౌ. 147 షి. 7 పె.8 ఉన్నాయ్. ఈ ధనం విరాళాలకూ, వినతి పత్రాలు అచ్చువేయించడానికీ, రోజువారీ ఖర్చులకు ఉపయోగించ బడుతోంది. ఈ విజ్ఞప్తిదారుల దృష్టిలో, కాంగ్రెసు ఆశయాల సిద్ధికి యిది చాలా తక్కువ మొత్తం. డబ్బు లేకపోవటం వల్లనే విద్యకు సంబంధించిన పని చాలా వెనుకపడిపోయింది. కనుక ప్రస్తుతపు యీ బిల్లు ఉద్దేశించిన ప్రమాదం అసలు లేనేలేదని, మేము విన్నవించు కుంటున్నాం.

పైన చెప్పిన విషయాలు నిజమైనవని, ఏ దర్యాప్తూలేకుండా, ప్రభుత్వం అంగీకరించాలని మేము కోరడంలేదు. వాటివిషయంలో ఏమన్నా సందేహముంటే, కాలనీలో నివసిస్తున్న భారతీయులలో ఎంత మందికి 50 పౌ. విలువగల స్థిరాస్థియున్నదీ, ఎంతమంది సాలీనా 10 పౌ. అద్దె చెల్లిస్తున్నదీ మొదలైన వివరాలు సేకరించవలసిందిగా కోరుతున్నాం. అది ప్రభుత్వం ముఖ్య విధి కూడాను. పై యోగ్యతలు కలవారే ఓటు చేసే అర్హతను కలిగి ఉంటారు. ఈ యోగ్యతలు వేలకొలది భారతీయులకు లేనేలేవని మేము చెపుతున్నాం. భారతీయుల ఆస్థి పాస్థులు, ఓటు చేయడానికి తగిన అర్హత ఉందా లేదా అన్న వివరాలు సేకరించటానికి ఎక్కువ సమయంకాని, పెద్ద ఖర్చుకాని అవసరంలేదు. ఓటింగుహక్కు నిర్ణయించటానికి యీ వివరాల సేకరణ బాగా ఉపయోగ పడుతుంది. అంతేకాని, తొందరపాటుతో తీసికొనే ఈ చర్య కాలనీ కంతకూ మొత్తం ఒక పెద్ద దెబ్బగా పరిణమిస్తుంది. ఈ విజ్ఞప్తిదారులమైన మేము, భారతీయుల ప్రతినిధులుగా ఏ సంఘంలో సభ్యులుగా ఉన్నామో దాని తరఫున, ప్రభుత్వానికి యీ వాగ్దానం యిస్తున్నాము. వచ్చే సంవత్సరం జరిగే సాధారణపు ఎన్నికలకుగాను, ఓటర్ల జాబితాలలో ఏ ఒక్క భారతీయుని చేర్చటం మా అభిమతం గాదనీ ఆ విధంగా చేర్చము అన్నదే మా వాగ్దానం.

ప్రస్తుతపు ఈ బిల్లునుగురించి ప్రస్తావిస్తూ, ప్రభుత్వపత్రిక బహుశా వారి ప్రోద్బలంమీదనో వ్రాసిన ఒక వ్యాసంలో, ప్రమాదమని భయపడుతున్నది ఊహాగానమేననే అభిప్రాయాన్ని వ్యక్తపరచింది. ఆ పత్రిక యిలా వ్రాసింది :

"ఈ కాలనీలోని యూరోపియన్ల పరిపాలనకు ఆసియా దేశస్థులఓట్లు ప్రమాదం తెచ్చిపెడతాయనే మనం నమ్మినప్పటికీ, ఆ సమస్యను ఎదుర్కొనటానికి సామ్రాజ్య ప్రభుత్వం తప్పకుండా మార్గం కనుక్కుంటుంది. యూరోపియన్ జాతులకు చెందనివారు, ఓటింగు హక్కునుపొందే విషయంలో, ఈ కొత్త బిల్లు కొన్ని అడ్డంకులను ఏర్పరుస్తోంది. ప్రస్తుతపు చట్టరీత్యా, స్వదేశీయుల చట్టం ప్రకారం మినహాయింపబడిన స్వదేశీయులుతప్ప, తక్కినవారు ఏ జాతికిచెందినప్పటికీ బ్రిటిష్‌పౌరులైతే, ఓటింగుహక్కును కలిగి యున్నారు. దీని ప్రకారంచూసినా రిజిస్టరయిన 9560 మంది లోనూ, భారతీయులు 250 మంది మాత్రమే ఓటర్ల జాబితాలలో నమోదై ఉన్నారు. అంటే ఓటుచేసే హక్కు ఉన్న ప్రతి 38 మంది యూరోపియన్లకు, ఒక భారతీయుడు ఆ హక్కును కలిగి యున్నాడన్న మాట.

అందువల్ల యీ కొత్త బిల్లు శాశ్వతంగా కాకపోయినా, వచ్చే పెక్కు సంవత్సరాల వరకు, యీ సమస్యను ఎదుర్కొన కలుగుతుందని అనుకుంటున్నాం. ఉదాహరణకు దక్షిణ కెరొలినాలో, 21 సంవత్సరాల వయస్సుదాటిన నీగ్రోలు 132,949 మంది ఉన్నారు. 21 సంవత్సరాల వయస్సుకు మించిన యూరోపియన్ల సంఖ్య 102,567. మైనారిటీగా ఉన్నప్పటికీ, యూరోపియన్లే అధికారంలో ఉన్నారు. దీనివల్ల అధిక సంఖ్యాబలం ఉన్నంత మాత్రాన ప్రయోజనంలేదనీ, ఆధిక్యతగల జాతి ప్రభుత్వాధికారం చేపడుతుందనీ వ్యక్తమవుతోంది. కనుక ఆసియా దేశస్థుల ఓట్లు యూరోపియన్ల అధికారాన్ని తుడిచి వేస్తాయన్న భయం ఊహాగాన మని మేము నమ్ముతున్నాము. మాకు తెలిసినంతవరకు, ఇండియాకు ఎన్నికల ప్రాతినిధ్య సంఘాలతో పరిచయం ఉన్నట్లుగా కనపడుతోంది. ఇండియాకు అటువంటి సంస్థలతో పరిచయంలేదనే వాదనకు ఆధారం లేనట్లుగా,

తోస్తున్నది. ఎందుకంటే ఇండియాలో 750 మునిసిపాలిటీలు ఉన్నాయి. వీనిలో బ్రిటిష్‌వారికి, భారతీయులకు సమానహక్కులున్నాయి. 1891 సం. రం. లో, 9790 మంది స్వదేశీయ మునిసిపల్ కమీషనర్లు (కౌన్సిలర్లు), 839 మంది యూరోపియన్ కౌన్సిలర్లు ఉన్నారు. ఎన్నికల ప్రాతినిధ్య సంఘాలతో పరిచయమున్న దేశాన్నుంచి వచ్చినారని భారతదేశీయుల విషయంలో మనం అంగీకరించినా, వారు యూరోపియన్లను అధికారంలో నుంచి నెట్టివేస్తారన్నది అసంభవం. గతంలో అనుభవం దీనిని బలపరుస్తున్నది. ఇక్కడికి వచ్చే భారతీయులు ఓటింగుహక్కు విషయం పట్టించుకొనే రకపు వ్యక్తులుకారు. పైగా ఆస్థికి చెందిన యోగ్యత వారికి లేనేలేదు. అదీగాక మనం ఏ సామ్రాజ్యంలో భాగంగా ఉంటున్నామో ఆ సామ్రాజ్యం, భారతీయులను, భారతీయులైన కారణంచేత, ఓటుచేసే ప్రాథమిక హక్కులేని వారినిగా చేయడానికంగీకరించదు. అది సామ్రాజ్య ప్రభుత్వ ధర్మం కూడా కాదు. కనుక మనకు సంబంధించినంతవరకు అటువంటి దృక్పథంతో ఉండడం అనవసరం. దానిని వదలివేయడం మంచిది. మనకు యిష్టంలేని వారిని యీ కొత్త బిల్లు ఓటర్లు కాకుండా అరికట్టలేకపోతే, ఎన్నికల హక్కు పొందటానికి కావలసిన యోగ్యతలను పెంచడానికి మనకు ఆటంకమేముంది? ప్రస్తుతంలో వోటింగు యోగ్యత చాలా తక్కువగా ఉన్నది. కనుక ఆస్థికిచెందిన యోగ్యతను పెంచి రెండింతలు చేయవచ్చును. పైగా విద్యార్హత ప్రవేశపెట్టినట్లయితే, యూరోపియన్లందరూ దానిలో ఉత్తీర్ణులై యోగ్యతగలవారవుతారు. దానివల్ల భారతీయఓటర్లు నామరూపాలు లేకుండా పోతారు. పౌ. 100 విలువగల స్థిరాస్థి ఉన్నవారూ, సాలీనా పౌ. 10/- అద్దె చెల్లిస్తూ, ఇంగ్లీషు చదివి వ్రాయగలిగినవారు భారతీయులు చాలా తక్కువమంది ఉంటారు. ఇదికూడా యీ సమస్యను ఎదుర్కొనలేకపోతే మిసిసిపీ ప్లానునుగాని, ప్రస్తుత స్థితికి అనుగుణ్యంగా దానిని మార్చిగాని అమలుపరచడానికి మనకు ఆటంకమేమీ ఉండదు. (5 మార్చి 1896).

ప్రభుత్వ పత్రిక దృష్ట్యా, ఆస్థిపాస్థులకు చెందిన హక్కుల నిబంధనలు అధికమైనవేననీ, దీనివల్ల ఓటర్లజాబితాలలో, అధికంగా భారతీయులు

ఓటర్లుగా నమోదయే అవకాశాలులేవనీ తెలుస్తోంది. ప్రస్తుతపు బిల్లు ప్రవేశపెట్టడంలో ఉద్దేశ్యం, భారతీయులను చికాకు పరచడమేనని వ్యక్తమవుతోంది. అంటే వారిని డబ్బు ఖర్చుకు కారణమైన లావా దేవీలలోకి దించడమన్నమాట.

*'మారిషస్ అల్‌మనక్ 1895'* ననుసరించి ఆ దీవిలో 1894 సం.లో జనాభా యిలా ఉంది. 'సాధారణపు జనాభా' క్రింద 259,224 మంది భారతీయులూ 106,995 మంది యూరోపియన్లూ ఉన్నారు. అక్కడ ఎన్నికల హక్కు పొందటానికి కావలసిన యోగ్యతలు యీ విధంగా ఉన్నాయి :

> ఎలక్టరల్ జిల్లాలో, ఏ సంవత్సరంలో నైనాసరే, యీ దిగువ యోగ్యతలు కల్గిన ప్రతిపురుషుడు ఓటరుగా నమోదు కావచ్చును. ఆ విధంగా నమోదయిన తర్వాత కౌన్సిలుకు జరిగే సభ్యుల ఎన్నికలలో అతను ఓటుచేయవచ్చును :
>
> (1) 21 సంవత్సరాల వయస్సు ఉండాలి.
>
> (2) చట్టరీత్యా, ఏ అనర్హతా ఉండరాదు.
>
> (3) జన్మవల్లగాని, పౌరసత్త్వంవల్లగాని బ్రిటిష్ పౌరుడుగా ఉండాలి.
>
> (4) ఓటరుగా నమోదయే సరికి, కాలనీలో మూడు సంవత్సరాల నుంచి నివసిస్తూ, యీదిగువ యోగ్యతలలో ఏదో ఒకటుండాలి.
>
> **(a)** ప్రతి సంవత్సరం జనవరి 1 వ తేదీనాటికి, అంతకు ముందు ఆరు మాసాలనుంచి, తను నివసిస్తున్న జిల్లాలో, 300 రూపాయల విలువగల స్థిరాస్థినిగాని, 25 రూపాయల నెలసరి నికరాదాయంగాని కలిగిన వాడై ఉండాలి.
>
> **(b)** నమోదయే రోజునాటికి, ఆ సంవత్సరం జనవరి 1 వ తేదీకి ఆరు నెలల ముందునుంచి, తను నివసిస్తున్న జిల్లాలో, తన స్థిరాస్థి మీద నెలకు 25 రూ. పన్నును చెల్లించేవాడై యుండాలి.

(c) తను నివసిస్తున్న జిల్లాలోగాని, వర్తకంగాని, ఉద్యోగంగాని చేస్తున్న ప్రాంతంలోగాని, ఓటరుగా నమోదయే సంవత్సరం జనవరి 1 వ తేదీనాటికి 3 నెలల క్రితం నుంచి, కాలనీలో రూ. 3,000/- లు విలువగల చరాస్థికలవాడై ఉండాలి.

(d) పై యోగ్యతలలో ఏదైనా ఒకటి కలిగినవ్యక్తి యొక్క భర్తగాని, విధవరాలి పెద్ద కుమారుడు గాని అయి ఉండాలి.

(e) నమోదు సంవత్సరం జనవరి 1 వ తేదీ నాటికి మూడు నెలల ముందునుంచి ఆ ప్రాంతంలో నివసిస్తూగాని వ్యాపారం లేక ఉద్యోగం చేస్తూగాని సాలీనా రు. 600/- లు లేక నెలకు రు. 50/- లు జీతం తెచ్చుకుంటూ ఉండాలి.

(f) నమోదు సంవత్సరం జనవరి 1 వ తేదీ నాటికి మూడు నెలల ముందునుంచి, ఆ ప్రాంతంలో నివసిస్తూ వ్యాపారంగాని, ఉద్యోగంగాని చేస్తూ, సాలీనా రు. 50/- లు లైసెన్సు చెల్లిస్తూ ఉండాలి.

పై యోగ్యతలుగాక, యీ దిగువ ఉదహరించిన అనర్హత లను కలిగియుండరాదు.

(1) వలసరాజ్యాలలోని ఏ కోర్టులోగాని, కూటసాక్ష్యం చెప్పిన, నేరానికి శిక్షింపబడినా, మరణదండనకుగాని, 12 మాసము లకు మించిన కఠిన వరకానికిగాని గురియై, ఆ శిక్షనుగాని దానికి ప్రత్యామ్నాయంగా విధింపబడిన మరొక శిక్షనుగాని అనుభవించక పోయినా. సదరు శిక్షను ప్రభుత్వంవల్ల మాఫీపొందకపోయినా, అటువంటివారు వోటర్లుగా నమోదై, కౌన్సిలు మెంబర్ల ఎన్నికలో వోటుచేయడానికి అర్హులుకారు.

(2) ఏ సంవత్సరంలోనైనా జనవరి 1 వ తేదీకి పన్నెండు నెలల ముందుకాలంలో ప్రజలవద్దనుంచిగాని ప్రత్యేక మతసంఘం నుంచిగాని దానం పొందియున్నట్లయితే, ఆ వ్యక్తి ఓటరుగా నమోదు కావడానికి అర్హుడుకాడు.

(3) ఏ సంవత్సరంలోనైనాకాని, ఓటరుగా నమోదు చేయించుకోదలచుకున్న వ్యక్తి, తన స్వదస్తూరీలో తన హక్కును తెలియపరుస్తూ నమోదు చేయవలసిందిగా, రిజిస్టరింగు ఆఫీసరు ఎదుటకాని, మేజిస్ట్రేటు ఎదుటకాని కోరితేనేతప్ప, ఓటరుగా నమోదు అవడానికి అర్హుడుకాడు. ఆ విధంగా రిజిస్టరు చేయించుకొనేటప్పుడు, అప్పటి తేదీతోసహా తనకుగల యోగ్యతలనుకూడా రికార్డు చేయించుకోవాలి.

(4) యోగ్యతలు c, d, e, f ననుసరించి తను నివసిస్తున్న జిల్లాలో తన పేరు నమోదుకావాలని కోరుకున్న వ్యక్తి, అదే యోగ్యతలక్రింద తను వ్యాపారంగాని, ఉద్యోగంగాని చేస్తున్న జిల్లాలో పేరు నమోదు చేయించుకొన నర్హుడుకాడు. దీనిని తిరుగవేసినప్పుడు కూడా యిదే నిబంధన వర్తిస్తుంది.

మారిషస్ దీవులలో భారతీయుల జనాభా, సాధారణపు జనాభా కంటె రెండింతలున్నప్పటికీ, పై యోగ్యతలు ఉండాలనే నిబంధనలుండడంవల్ల, ఏమీ యిబ్బంది లేకుండా పోయింది. మారిషస్ దీవులలోని భారతీయులూ, నేటాల్‌లోని భారతీయులూ ఒకే తరగతికి చెందినవారు. కాని నేటాల్‌లోని తమ సోదరులకంటె వారు మంచిస్థితిలో మాత్రం ఉన్నారు.

భారతీయుల ఓటింగుహక్కు విషయంలో చర్య తీసుకొనవలసిన అవసరం ఉందని మాటవరుసకు అంగీకరించినప్పటికీ, యీ విజ్ఞప్తిదారులమైన, మేము, యీ బిల్లు యీ సమస్యలను, సూటిగా బహిరంగమైన పద్ధతిలో పరిష్కరించజాలదని మనవిచేస్తున్నాం. గౌరవ నీయులైన నేటాల్ అటార్నీ జనరల్, యీ బిల్లుపై రెండవసారి జరిగిన చర్చ సందర్భములో, ప్రస్తుతపు చట్టాన్ని, కొంతవరకు మార్పుచేయాలని చేయబడిన సూచనను గురించి ప్రస్తావిస్తూ, యిలా అన్నట్లు ప్రకటింపబడింది :

"ఈ విధంగా చేయడంవల్ల వక్రమార్గంగా, గుప్తంగా చేసినట్లవుతుంది. కాని ప్రభుత్వం దీనిని బాహాటంగా చేయదలచుకోవడమే యీ విధంగా చేయకపోవటానికి కారణం."

ప్రస్తుతపు బిల్లును చట్టంగా అంగీకరించడంకంటె వక్రమైనదీ గుప్తమైనదీ మరొకమార్గాన్ని ఊహించడం కష్టం. ఈ బిల్లువల్ల అందరూ అంధకారంలో ముంచబడ్డారు. 8 మే 1896 తేదినాటి 'నేటాల్ ఎడ్వర్టైజర్' యిలా చెపుతోంది :

> "ప్రస్తుతపు బిల్లు వక్రమార్గంకాక మరింకేమిటి? గత సమావేశంలో చేయజాలని దానిని యిప్పుడు గుట్టుగా చేయ ప్రయత్నించడమే దీని ప్రధానోద్దేశ్యంగా కనబడుతుంది. ఈ చర్య అతి మొరటుతనాన్ని వ్యక్తపరుస్తున్నదని మిస్టర్ ఎకోంబె అంగీకరించారు. అందుకనే దీనికి సామ్రాజ్య ప్రభుత్వంయొక్క అంగీకారం లభించలేదనికూడా చెప్పేరు. వెనుకటి 'అతిక్రూరమైన బిల్లు' ఉద్దేశాలే యీ బిల్లులోకూడా ఉన్నాయనీ, దీనిఉద్దేశ్యం అదేననీ" కూడా అన్నారు. "ఈ బిల్లుమాత్రం తన ఆశయాన్ని సూటిగా ఉదారస్వభావంతో వ్యక్తం చేయలేకపోయింది. ఇంకొకలా చెప్పాలంటే, సాధారణ పరిస్థితులలో సూటిగా గమ్యస్థానాన్ని చేరలేక, గుట్టుగా డొంక తిరుగుడు దారిలో చేరాలని ప్రయత్నిస్తున్నది."

నేటాల్‌లోని భారతీయుల ఓటింగుహక్కును అరికట్టడానికి శాసనం చేయవలసిన అగత్యం ఏర్పడిందనీ, ఇదితప్ప వేరేమార్గం లేదనీ, మొత్తం వర్గంవారందరికీ వర్తించే శాసనం చేయవలసినదేననీ, 1858 నాటి ప్రకటనను కాదని, బ్రిటిష్ పౌరుల మాదిరిగా భారతీయులను చూడ తగదనీ, వలసరాజ్యాలపట్లగల దృక్పథాన్ని, ప్రభుత్వం అంగీకరించినట్లయితే, ఏయే హక్కులను భారతీయులు అనుభవించరాదని ప్రభుత్వం అనుకుంటున్నదో, వాటిని వారు పొందతగనివారని స్పష్టంగా ప్రభుత్వం వెల్లడిచేయటం మంచిది. అంతేగాని అసందిగ్ధ శాసనంచేసి, లావాదేవీలకు తావివ్వటం మంచిపనికాదు. ఇదే ఈ విన్నపందారులు చెప్పేవిషయం.

ఈ బిల్లులోని అవకతవకలు, అసందిగ్ధత కారణంగా లావాదేవీలు ఉత్పన్నమవుతాయన్నది, నిర్వివాదాంశం. గౌరవనీయమైన నేటాల్ ప్రధానమంత్రి మాటలప్రకారం, భారతీయుల ఓటింగు హక్కుకుచెందిన సమస్యను, తుదిసారిగా పరిష్కరించవలసినదేననీ, యిది ముఖ్యమైనపననీ కూడా అంగీకరించవలసిందే. కాని నేటాల్‌లోని తదితర మెజారిటీ నాయకుల అభిప్రాయం వేరుగా ఉంది. ఈ బిల్లువల్ల యీ సమస్య శాశ్వతంగా పరిష్కారం కాజాలదని వారు అభిప్రాయ పడుతున్నారు.

నేటాల్ అసెంబ్లీలోని ప్రతిపక్ష నాయకుడు మిస్టర్ బిన్స్, పార్లమెంటరీ పద్ధతిలో ఎన్నికలద్వారా ఏర్పడే ప్రాతినిధ్య సంఘాలతో భారతీయులకు, వారి మాతృదేశమైన ఇండియాలో పరిచయముందని నిరూపించటానికి ఎన్నో దృష్టాంతాలు చూపించారు. ఆయన యీ విధంగా అన్నట్లుగా తెలియవచ్చింది :

> ఈ బిల్లు ఒక తప్పటడుగని ఆయన నిరూపించినట్లుగా భావించారు. ఇండియాలో ప్రతినిధి సంస్థలున్నాయి. వారికి ప్రతినిధులద్వారా పరిపాలన కొనసాగించే పద్ధతి తెలుసును. వారికి పార్లమెంటరీ ఓటింగు పద్ధతి ఉంది. స్థానికస్వపరిపాలన విషయంలో మ్యునిసిపల్ ఎన్నిక వ్యవస్థ ఉంది. పరిస్థితులు యిలా ఉన్నపుడు యీబిల్లును ప్రవేశబెట్టడంలో అర్థమేమిటి ? ఆయనకు దొరికినంతవరకు ప్రముఖ గ్రంథాలనుంచి, యీ వాదనకు ఆధారాలను చూపేరు. వాటివల్ల యిటువంటి ఎన్నికల ప్రతినిధి సంస్థలున్నట్లుగా నిస్సంకోచంగా ఋజువయింది. ఇటువంటి బిల్లును అమలులో పెట్టడంవల్ల, లావాదేవీలకు, యిబ్బందులకు, తగవులకు దారి ఏర్పడుతుందనడంలో సందేహంలేదు. ఈ బిల్లుసుస్పష్టంగాను, నిర్ధారణగాను లేదు. వారు యింతకంటె స్పష్టమైనది, కావాలని కోరుకున్నారు. ఈ సమస్య పరిష్కారం కావాలని ఆయన కోరేరు. అందుకుగాను, దీని విషయంలో ఒక రాజీకి రావడానికి తాను ప్రయత్నంచేసి సాయపడతామన్నారు. ఈ బిల్లు లోపభూయిష్టంగా తయారయినదనీ, సత్యంకాని విషయాలిందులో ఉన్నాయనీ, దీనివల్ల అంతూపంతూలేని లావాదేవీలు, యిబ్బందులు కల్గుతాయనీ ఆయన అభిప్రాయపడ్డాడు. అందువల్ల తాను ఈ బిల్లుపై జరిగిన రెండవ చర్చ సందర్భంలో, ఓటు చేయజాలననికూడా స్పష్టంచేశారు.

నేటాల్‌అసెంబ్లీ ప్రముఖసభ్యుడు, న్యాయవాదైన మిస్టర్ బేల్, మిస్టర్ బిన్స్, అభిప్రాయంతో, ఏకీభవించారు. కాలనీలోని సాధారణపు చట్టరీత్యా భారతీయులకు ఓటింగుహక్కు ఉండటానికి యీయన వ్యతిరేకులు. ఐనప్పటికీ కాలనీతరఫునా, భారతీయుల తరఫునా శాసనసభనుద్దేశించి, ఆయన బిల్లును అంగీకరించవద్దని కోరేరు.

దీనివల్ల పేచీలు కలగటమేకాక, భారతీయులలోనే వైషమ్యాలు పర్పడడానికి సావకాశమేర్పడుతుంది. ప్రీవీ కౌన్సిల్ అపీళ్ళకు దారితీసి శాసనసభా సభ్యుల ఎన్నికకే హానికరంగా పరిణమిస్తుంది. ఈ చర్యవల్ల కలుగబోయే ఫలితాల దృష్ట్యా, యీ బిల్లును రెండవ పర్యాయం ఆమోదించ వద్దని కోరేరు.

'నేటాల్ విట్నెస్' తన 8 మే నాటి పత్రికలో పరిస్థితిని ఇలా క్లుప్తీకరించి చెప్పింది:

"ఈ బిల్లు చట్టంగా చేయబడడంవల్ల, కాలనీ లావాదేవీలకు లోనవుతున్నదన్నమా వాదనకు మిస్టర్ బిన్స్, మిస్టర్ బేల్‌ల పూర్తి అంగీకారం ఉన్నది. అసలు లేనిదానికంటె సగం రొట్టె లభించడం మేలంటూరు, మిస్టర్ స్మిత్. అయితే దాని ఖరీదు చాలా హెచ్చు. ఈ బిల్లు అతిసున్నితమైన వ్యవహారాలకు సంబంధించినది. దీనిని ప్రభుత్వపు న్యాయవాదులు క్షుణ్ణంగా పరిశీలించినట్లు కనబడదు. న్యాయశాస్త్రరీత్యా, యీ బిల్లును కోర్టులలో ప్రతిఘటించడానికి తగిన సావకాశాలు ఎక్కువగా కనబడుతున్నాయి. ఇటువంటి అవకాశాలు కలుగకుండా యీ బిల్లులోనివదజాలాన్ని మార్పుచేయడం తప్ప వేరుమార్గం లేదు. ఈ బిల్లు మూలకంగా వివాదగ్రస్తంగా పరిణమించే విషయాలు కొన్ని యిక్కడ ఉదహరిస్తున్నాము. ఇంగ్లాండులోని "నేచురలైజేషన్ చట్టానికి" విరుద్ధంగా, కాలనీ చట్టాన్ని చేయవచ్చునా? బ్రిటిష్ సామ్రాజ్యస్థులైన భారతీయులు బ్రిటిష్ పౌరులవుతారా? కారా? ఇంకా చెప్పాలంటే, ఈ బిల్లువల్ల బ్రిటిష్ మహా సామ్రాజ్యంలో, ఇండియా స్థితేమిటనే సమస్యే ఉత్పన్నమవుతోంది. 1858 సంవత్సరపు రాణీగారి ప్రకటనద్వారా కలుగజేసిన సదుపాయాలను రద్దుచేసే ప్రత్యేక శాసనాలను నేటాల్‌లో చేయవచ్చునా?

ఈ బిల్లు చాలా అస్పష్టంగానూ, అసందిగ్ధంగానూ ఉన్నదని విమర్శిస్తూ, 'నేటాల్ ఎడ్వర్టైజర్' మే 8 తేదీన ఇలా సంపాదకీయం వ్రాసింది:

నిజంచెప్పాలంటే యీ బిల్లులోని ప్రతివాక్యమూ తగవుల పుట్ట. ఇవన్నీ ఒకానొక రోజున బయటికి వచ్చి చిరకాలంగా

ఉండిపోతాయి. ఈ కాలనీలో ఓటింగు హక్కు విషయమై యూరోపియన్లకూ భారతీయులకూమధ్య తీవ్ర వైషమ్యాలను పోరాటాలను కలుగచేస్తాయి.

ఇటువంటి విషాదపరిస్థితినుంచీ, నిరంతర ఆందోళననుంచీ, కాలనీ క్షేమంకోసమే కాకపోయినా, భారతీయుల క్షేమాన్ని దృష్టిలో పెట్టుకునైనా భారతీయులను రక్షించవలసిందిగా యీ విన్నపందారులమైన మేము, ప్రభుత్వాన్ని అర్థిస్తున్నాం. ఈ చర్యలన్నీ, అసలు లేనేలేని ప్రమాదంనుంచి తప్పుకొనడానికేనని వేరే చెప్పనక్కరలేదని తెలుస్తోంది.

ఇటువంటి పోరాటానికిగాను, భారత జాతీయులకయ్యే ఖర్చు వారి స్తోమతుకు మించినదని చెప్పడానికేమీ ఋజువు అక్కరలేదు. ఈ పోరాటమంతా సమఉజ్జీలమధ్య కాదనికూడా మనవి.

అత్యున్నత న్యాయస్థానం, పార్లమెంటరీ ఎన్నికలపద్ధతి ప్రకారం ఏర్పడే ప్రతినిధి సంస్థలు భారతీయులకు లేవనీ, వారికి వాటితో పరిచయం లేదనీ, తన అభిప్రాయంగా చెప్పిందని అనుకుందాం. అప్పుడు యీ బిల్లురీత్యా ఓటర్ల జాబితాలలో భారతీయులను చేర్చటానికి చేయబడిన నిబంధనలు, ఏ విధంగాకూడా సంతృప్తికరంగాలేవని యీ విన్నపం దారులు అభిప్రాయపడుతున్నారు.

గవర్నర్లకు అధికారాలను ఇస్తున్న, యీ బిల్లులోని భాగములకు యూరోపియనులుకూడా తీవ్రంగానే తమ అసమ్మతిని తెలియచేస్తున్నారు. ఈ విషయమై ప్రస్తావిస్తూ 'నేటాల్ విట్‌నెస్' యిలా వ్రాసింది :

> విశిష్టమైన రాజ్యాంగసిద్ధాంతాలను ప్రతిఘటించడమే కాక, ఎన్నడూ ఎరుగని విషయాలను, నేటాల్‌లోని ప్రతినిధి సంస్థల కార్యక్రమాలలోనికి యిది తెచ్చిపెడుతున్నది. 3 వ క్లాజు ప్రకారం, ఆసియా దేశస్థులను ఓటర్ల జాబితాలలో చేర్చుకునేటందుకు, తగినవారిని నిర్ణయించడానికి ఆరుగురు సభ్యులుకల సంఘం కావాలని నిర్ణయించబడింది. దీనిఫలితం వారికీ తగుల్తుంది. ప్రతినిధులద్వారా పరోక్ష ఎన్నిక అనే ఉద్దేశానికి మంత్రివర్గం

అంటిపెట్టుకున్నట్లు కనబడుతోంది. కాని తామూ, గవర్నరూ పరోక్ష ఎన్నిక వర్గంగా ఏర్పడడంవల్ల అసభ్యమైన పనిని చేయటమే కాక, చాలా అక్రమం చేస్తునవారవుతున్నారు.

ఈ విషయాన్నిగురించే ప్రస్తావిస్తూ యింకా యిలా వ్రాసింది :

ప్రజాభిమతానికి విరుద్ధమైన యీ బిల్లును అంగీకరించడం ద్వారా అసెంబ్లీ, ప్రజల మన్ననలను కోల్పోయింది. ఇది ఒక రాజీ చర్యగా పరిణమించి, పెక్కుమంది శాసనసభ్యుల అపోహకు గురైంది. దీనివల్ల ప్రయోజన మున్నట్లు కనపడదు. ఈ బిల్లు ప్రకటింపబడినప్పుడే యిది అసెంబ్లీ యొక్క హక్కులమీద దండెత్తడానికి చేసినచర్యనీ, రాజ్యాంగ సిద్ధాంతాలకే పూర్తిగా వ్యతిరేకమనీ చెప్పేం. ఈ సిద్ధాంతాలను తూచా తప్పకుండా అనుసరించవలసిన బాధ్యత సభ్యులమీద ఉన్నది. చివరి ఆక్షేపణ విషయంలో సభ్యులను మరల హెచ్చరించవలసిన అవసరంలేదను కుంటున్నాం. ఎన్నికహక్కు గవర్నరుకు, మంత్రివర్గానికి ఉండ తగిందికాదనీ, అది ప్రజలకే ఉండి వారు ప్రతినిధులద్వారా దానిని వినియోగించుకునేటట్లుగా ఉండాలనీ, మిష్టర్ బేల్ అన్నారు. కాని పత్రికలు ఆలోచిస్తున్నదల్లా, ప్రస్తుతపు పార్లమెంటునుగురించి కాదు. భవిష్యత్తులో ఉండేవాటినిగురించి. ఎంతస్వల్పంగా అయినప్పటికీ, గొప్పదైన రాజ్యాంగ సిద్ధాంతమునకు ఒకసారి అతిక్రమణ జరిగినప్పుడు, దురాశాపూరితమైన ప్రభుత్వంవల్ల ఆ అతిక్రమణము ఎక్కువైపోయే అవకాశమెంతైనా ఉంది. యూరోపియనుల దృష్ట్యా ఉన్న ఆక్షేపణ అది.

ఈ విన్నవందారులు దానితో ఏకీభవిస్తున్నారు. ఈ ఆక్షేపణే గాక, యీ క్లాజులోని సిద్ధాంతంపట్ల వీరికి మరొక పెద్ద ఆక్షేపణ ఉంది. వోటర్ల జాబితాలో అధిక సంఖ్యాకులుగా భారతీయులు చేరేటట్లు చూడాలనే విషయంలో వారికంతగా పట్టింపులేదు. బ్రిటిష్ పౌరులుగా వారికుండే హక్కులను సంరక్షించుకోవాలనే వారి పూనిక. ఘనత వహించిన మహారాణీ, అనేకసార్లు తన యూరోపియన్ పౌరులతోపాటు భారతీయులైన బ్రిటిష్ పౌరులకు సమాన ప్రతిపత్తినిస్తూ ప్రకటనచేసింది. ఆ విషయాన్నే కాలనీల మాజీ ప్రధానకార్యదర్శి ధృవపరుస్తూ నేటాలు

భారతీయ సంఘానికి లేఖను పంపేడు. కొన్ని యోగ్యతలుగల ఇతర బ్రిటిష్ పౌరులు వోటింగుహక్కుకు సహజంగా అర్హులైననాడు, భారతీయు లైన బ్రిటిష్‌పౌరులు మాత్రం ఆ హక్కునెందుకు కోరకూడదనే, విన్నపం దారులమైన మేము అడుగుతున్నాం.

ఇప్పుడు అవలంబించిన పద్ధతి చాలా తికమకలుగా ఉంది. దీనివల్ల వోటింగుహక్కు విషయమైన ఆందోళన చిరకాలం జరిగేట్లుంది. యూరోపి యన్లనుంచి యీ ఆందోళన భారతీయులకు బదిలీఅయేటట్లు కనబడుతోంది. బిల్లుపై రెండవసారి జరిగినచర్చ సందర్భములో, అసెంబ్లీలోని ప్రసంగాలు చూస్తే, గవర్నరు-ఇన్ కౌన్సిల్ తన అధికారాన్ని ఉపయోగించడ మంటూ ఉంటే, చాలా అరుదుగా ఉపయోగించేటట్లు వ్యక్తమవుతోంది.

భారతీయులలో యిద్దరికీ సమానార్హతలుండి అందులో ఒకనికి ఓటరుగా నమోదయే అవకాశం లభించి మరొకనికి దొరకనప్పుడు, ఆ రెండవ వ్యక్తికి మొదటివానిపై యీర్ష్య జనిస్తుంది. ఈ విధంగా యీ బిల్లువల్ల భారతీయులలో వైషమ్యం పెరగడానికి సావకాశాలున్నాయి.

ఎన్నికల హక్కుకుచెందిన మీ జాబులో విద్య, తెలివితేటలు, ఆస్థిపాస్తులు, భారతీయుల ఓటింగుహక్కు నిర్ణయానికి అర్హతలని చెప్పేరు. కొంతవరకు విద్య, తెలివితేటలు, ఆస్థిపాస్తులు ఓటరుకావటానికి అర్హతలని మీరు నిర్ణయిస్తే, గవర్నరుచేతికి ఆ అధికారం యివ్వడానికి బదులు, వాటినే అర్హతలుగా నిర్ణయించ వలసినదని యీ విన్నపం దారులమైన మేము కోరుతున్నాం. ఇంతకుముందు ప్రస్తావించిన నేటాల్ మెర్క్యురీలోని సంపాదకీయంలోని భాగాన్ని యీ సందర్భంలో చూడవలసిందిగా కోరు తున్నాం. ఈ బిల్లు వర్తించే వారికి, ఓటర్లు అవడానికి కావలసిన అర్హతలు ఏవో చెప్పబడినట్లయితే, బిల్లులో వివాద గ్రస్తమైనభాగం తొలగించ బడినట్లవుతుంది. దీనిప్రకారం యీ బిల్లు వర్తించే వ్యక్తులు ఏ యోగ్యతల వల్ల తాము ఓటర్లు అవడానికి అర్హులయేదీ తెలుసుకొనగల్గుతారు. మే 8వ తేదీ '*నేటాల్ ఎడ్వర్టైజర్*' లో యీ విషయం విపులంగా చెప్పబడింది:

> గవర్నరు-ఇన్-కౌన్సిలుకు, కొంతమంది భారతీయులను ఓటర్ల జాబితాలలో చేర్చే హక్కును కలుగచేయడమనేదే, యీ బిల్లులోని కపటాన్ని ఋజువు పరుస్తున్నది. ఈ అధికారం ఎన్నడూ వినియోగించబడదనీ ఒకవేళ వినియోగించబడినా అది

చాలా అరుదనే అభిప్రాయం సామ్రాజ్య ప్రభుత్వానికి కలుగ చేసినట్లుగా తోస్తున్నది. ఏమైనా యీ అధికారం ఉపయోగించే అవకాశం ఉన్నట్లు తేలుతున్నది. అయినప్పటికీ అటార్నీ జనరల్ యిలాచెప్పేరు: "ఈ బిల్లుద్వారా, ఇండియన్లను ఓటర్లుగా నామినేట్ చేసే అధికారం కౌన్సిలులోని గవర్నరుద్వారానే తప్ప ఉపయోగించబడే అవకాశంలేదు. మంత్రుల బాధ్యత యొక్క ఆంతర్యమేమిటో సంఘంలోని ప్రతివారికీ పూర్తిగా తెలిసివస్తున్నది. భారతీయ ఓటర్లను విరివిగా చేర్చి, నియోజకవర్గాలను వారితో నింపే బాధ్యతను పెట్టుకున్న ఏ మంత్రికూడా, పధ్నాలుగు రోజుల పాటైనా, ఆ మంత్రి పదవిలో ఉండజాలడని ప్రతివారికీ తెలుసు." అటార్నీ జనరల్ యింకా యిలా అన్నారు: "ఓటర్ల జాబితాలలో యూరోపియన్లు తక్క యితర జాతులవారు ఉండకూడదనే, ధ్వని దక్షిణాఫ్రికా అంతటా ప్రతిధ్వనిస్తుంది. వారందరూ ఆదినుంచి అంతంవరకూ ఈ ఉద్దేశ్యంతోనే ఉన్నారు. ఈ మంత్రివర్గ ప్రకటనలకు, అర్థమంటూ ఉందా అంటే, అది, ప్రభుత్వం తనకున్న మినహాయింపులుచేసే హక్కును వినియోగించక పోవటమే నన్న మాట..................ఐతే ఇది బిల్లులో ఎందుకు ప్రవేశపెట్టబడింది? ఇటువంటి దానిని ఒక బిల్లులో ప్రవేశపెట్టి, దానిని నిర్జీవంగా చేసిపెట్టే ఉద్దేశ్యం కలిగిఉండడం, దగాకోరు చర్యగా కనిపించడం లేదా ?"

ఈ బిల్లులోని నిబంధనలు వర్తించకుండా తనను మినహాయించవలసిందిగా కోరుతూ, ధనికుడైన ఒక భారతీయ వర్తకుడు పర్మిట్‌కోసం దరఖాస్తు పెట్టడం, అది నిరాకరింపబడే పరిస్థితికి లోనుకావడం, ఆతడికి బాధాకరంగా ఉంటుంది. ఇంతవరకు పార్లమెంటరీ పద్ధతి ననుసరించి, ఎన్నికలద్వారా ఏర్పడిన, ప్రతినిధి సంఘాలంటేనే ఎరుగని దేశాలనుంచి వచ్చిన యూరోపియన్లు ఓటు చేసే హక్కును కలిగియుండడం, అదే పరిస్థితులలో ఉన్న యూరోపియనేతరులకు కాలనీలోని సాధారణపుచట్టం క్రింద ఆ హక్కు లేకుండా పోవడంలో గల ఆంతర్యమేమిటో అర్థం కాకుండా ఉంది.

ప్రభుత్వం దృష్టిలో యీ బిల్లు ఒక ప్రయోగాత్మక చర్యవంటిది. ఈ బిల్లుపై జరిగిన రెండవసారి చర్చసందర్భంలో, అటార్నీ జనరల్ యిలా అన్నారు : "ఉద్దేశించినట్లుగా కాక, యీ బిల్లు, సంపూర్ణఫలితాన్ని చేకూర్చలేకపోయినట్లయితే, కాలనీలో ప్రశాంతత అంటూ ఉండనే ఉండదు." కనుక యీ బిల్లు చివరిది కాదన్న మాట. ఇటువంటి పరిస్థితులలో, (భారతీయుల ఓట్లు, యూరోపియను ఓట్లను అధిగమించే ప్రమాదం ఉందని మాట వరసకు అంగీకరించినా) మొత్తం కొన్నివర్గాల వారికందరికీ వర్తించే శాసనాలు చేయనక్కరలేకుండా, తదితర విధానాలన్నీ ఉపయోగించిన తర్వాత, అవి విఫలమైతే తప్ప, యిటువంటి బిల్లును ప్రవేశపెట్టడం మంచిది కాదు. ఇది ఏ కొద్దిమంది బ్రిటిష్ సామ్రాజ్య పౌరులనో కష్టపెట్టే చర్య మాత్రమే కాదు. దీనివల్ల 300,000,000 మంది రాజ భక్తి పరాయణులైన సామ్రాజ్యపు పౌరులు కష్టాలకు పాలవుతారు. దీనివల్ల ఎంత మంది భారతీయులకు ఓటుచేసే అర్హత కలుగుతుంది? ఎంత మందికి కల్గదు? అనేది మనము ఆలోచించవలసిన సమస్య కాదు. బ్రిటిష్ సామ్రాజ్యపు పౌరులైన భారతీయుల హోదా, ఇండియాకు వెలుపలి దేశాలలో, కాలనీలలో, మిత్రరాజ్యాలలో ఎలా ఉంటుందన్నదే, సమస్య. గౌరవం కల ఏ భారతీయుడైనా, వ్యాపారానికని గాని మరెందుకైనాగాని, తనకొక గౌరవప్రదమైన స్థానమున్నదనే విశ్వాసంతో ఇండియాను వదలి మరొక దేశానికి వెళ్ళడానికి సాహసించగలడా? రాజకీయంగా దక్షిణాఫ్రికా భవిష్యత్తును తీర్చిదిద్దే అవకాశం తమకు కావాలని, భారతీయులు కోరుకోనడం లేదు. అవమానకర పరిస్థితికి గురికాకుండా వ్యాపారం, తదితర వృత్తులు కొనసాగించుకునే అవకాశం ఉంటే చాలునని అభిప్రాయపడుతున్నారు. కనుక మా విన్నపమల్లా యిదే. భారతీయుల ఓట్లు, యూరోపియన్ ఓట్లను అధిగమిస్తాయనే భయం మీకు ఉంటే, విద్యా విషయకమైన అర్హతను అందరికీ సమానంగా పెట్టండి. ఆస్థికి సంబంధించిన యోగ్యత ఉండాలన్నది, ఉన్నదున్నట్లుగాగాని పెంచిగాని, పై అర్హతకు జోడించినాసరే, లేక పోయినాసరే. దీనివల్ల మీ భయం తొలగిపోతుంది. ప్రభుత్వ పత్రిక అభిప్రాయం కూడా ఇదే. ఇటువంటి పరీక్షవల్లకూడా ప్రయోజనం కలుగనపుడు, యూరోపియను ఓటుకు నష్టంకలుగని తీవ్రచర్యను, భారతీయులపై తీసుకోనండి. భారతీయులను పూర్తిగా ఓటింగుహక్కు

లేనివారినిగా చేసే పథకం తప్ప వేరొకటి, నేటాల్ ప్రభుత్వానికి ఆమోదకరం కాని పరిస్థితిలో, అటువంటి చర్యను బ్రిటిష్ ప్రభుత్వం సమర్థించదలచుకున్నపుడు, ప్రత్యేకించి భారతీయులను పేర్కొని, వారిని మినహాయింపు చేయటంతప్ప, మరి ఏయితర చర్యవల్లా, యీ సమస్య పరిష్కరింపబడదని మేము విన్నవిస్తున్నాం.

కాని ఒక్క విషయాన్ని గమనించవలసిందిగా యీ విజ్ఞప్తిదారులం కోరుతున్నాం. యూరోపియన్ వలసదార్లు అందరూ యిటువంటి చర్యతీసుకొనవలసినదిగా ఎన్నడూ కోరడంలేదు. వారు యీవిషయంలో ఏమీ పట్టించుకోనట్లుగానే ఉన్నది. ఈ ముఖావ వైఖరిని నేటాల్ ఎడ్వర్టైజర్ యీ విధంగా మందలించింది :

> పార్లమెంటు యీ ముఖ్యమైన సమస్యను పరిగణించిన విధానాన్నిబట్టి, నాలుగవ విషయ మొకటి వెలుగులోకి వచ్చింది. అదేమంటే, తన రాజకీయాలపట్ల కాలనీ శ్రద్ధచూపకపోవటం. కనీసం, ప్రస్తుతపు యీ బిల్లును ఎంతమంది కాలనీవారు చదివేరన్నది తెలుసుకుంటే ఆశ్చర్యపడవలసివస్తుంది. బహుశా చదవనివారి సంఖ్య చాలా ఎక్కువగా ఉండవచ్చును. కాలనీలోని ప్రతి కేంద్రంలోనూ, మూలమూలలా సమావేశాలు జరిపి, యీవిషయంలో తమ కష్టాలను తెలియచేస్తూ, యీసమస్య విషయంలో వాదోపవాదాలకు తావులేకుండా చేసే శాసనాన్ని పార్లమెంటు చేయాలనే కోర్కెను కాలనిస్టులు తెలియచేయకపోవటంవల్ల, యీ విషయంలో వారి అశ్రద్ధ వ్యక్తమవుతోంది. ఈ సమస్య తీవ్రతను కాలనీ గుర్తించి ఉన్నట్లయితే, పత్రికలు కూడా యీ విషయమై, పాఠకుల ఉత్తర ప్రత్యుత్తరాలను ప్రకటించి ఉండేవి. వీటిల్లో ఏపనీ జరుగలేదు. అందువల్ల, యీ సమస్యను ఇలాంటిచర్యలవల్ల పూర్తిగా పరిష్కరించ గలమని భావించి, ప్రభుత్వం యీ చర్యను తీసుకుంది. నిజానికి దీనివల్ల సమస్యా పరిష్కారం కాకపోవటమే కాకుండా, పరిస్థితి యిదివరకటికంటె కూడా విషమస్థితికి తెచ్చింది.

పైన ఉదహరించబడిన సంగతులవల్ల, ఏ ఒక్క పక్షానికీ యీ బిల్లు సంతృప్తికరంగాలేనట్లు వ్యక్తమవుతోంది. నేటాల్ మంత్రివర్గంపట్లనూ, రెండు శాసనసభలపట్లనూ ఆదర గౌరవాలను తెలియచేస్తూ, యీ విన్నపం

దారులు, యీ బిల్లు అంగీకరింపబడడమనేది ఒక గొప్ప విషయంగా, తాము పరిగణించటంలేదని మనవిచేస్తున్నారు. 'నేటాల్ విట్‌నెస్' చెప్పినట్లుగా, యీ బిల్లును కొంతమంది సభ్యులు తీవ్రంగా వ్యతిరేకించకుండా ఊరుకొనడం, అది వారికి దానియందుగల అపనమ్మకం వల్లనేనని తేలుతోంది.

ఈ విన్నపందారులమైన మేము, ప్రమాదమనిచెప్పబడేది ఊహాజనితమేనని, మీకు తృప్తికరంగా ఋజువు పరిచామని అనుకుంటున్నాం. భారతీయులకు పూర్తిగా ఓటింగుహక్కు లేకుండా చేయాలనుకున్న వారికీ, భారతీయులకూ కూడా, యీ బిల్లు అసంతృప్తికరంగా పరిణమించింది. ఏమైనా ఈ విషయాన్ని తొందరపడి ఏదోవిధంగా తేల్చివేయటం తగనిపనని మేము తగినన్ని ఆధారాలతో మీకు తెలియచేశామని అనుకుంటున్నాం. ఆ విధంగా తొందరపడి చర్య తీసుకొనవలసిన అవసరంకూడా లేదు. ఈ బిల్లును తొందరపడి అంగీకరింపచేయాలనే ఆత్రతకు కారణాలు —సంతృప్తికరమైనవి—చెప్పబడలేదని 'నేటాల్ విట్‌నెస్' పత్రిక భావిస్తున్నది. నేటాల్ ఎడ్వర్టైజర్ యిలా అభిప్రాయ పడుతున్నది: "భారతీయుల ఓటింగు హక్కుకు సంబంధించిన సమస్య అతిముఖ్యమైనది. తొందరపడి దీనిని శాశ్వతంగా పరిష్కరించడం తగనిపని. యీ బిల్లును ప్రస్తుతానికి నిలిపివేసి, సరియైన సమాచారం సేకరించిన తర్వాత, యీ విషయాన్ని నియోజకవర్గాల పరిశీలనకు పంపటం సరియైన మార్గం." (28—3—1896).

భారతీయవర్గాల వైఖరి, వారి ఉద్దేశ్యం, లండన్ టైమ్సులోని యీ ప్రకటనవల్ల తెలుసుకొనవచ్చును. టైమ్సు (వారపత్రిక 20 మార్చి, 1896) యిలా వ్రాసింది:

> విదేశాలకూ, బ్రిటిష్ కాలనీలకూ పని పాటులు నిమిత్తం వెళ్లే భారతీయులను, బ్రిటిష్ సామ్రాజ్యపు పౌరులుగా వారికిగల ఆ హోదాను, ఆయా దేశాలలో నిలబెట్టుకొననిస్తే, ఆఫ్రికా దేశంలో భారతీయ కార్మికవర్గాలకు కొత్త సావకాశాలు లభిస్తాయి. పౌరులుగా తమకుగల హక్కుల నిర్ణయం, దక్షిణాఫ్రికాలోనే జరుగాలని, ఇండియా ప్రభుత్వమూ, భారతీయులూ కూడా

కోరుకుంటున్నారు. దక్షిణాఫ్రికాలో, బ్రిటిష్ సామ్రాజ్యపు పౌరులుగా భారతీయులు హక్కును పొందగలిగినట్లయితే, యితరచోట్ల వారికి యీ హక్కును నిరాకరించడం అసంభవ మవుతుంది. దక్షిణాఫ్రికాలో దీనిని వీరు సంపాదించ లేకపోయారా, యితరచోట్ల దీనిని వారు పొందడం కష్టసాధ్యమవుతుంది. కొన్ని సంవత్సరాలవరకు పనిచేస్తామనే కంట్రాక్టు పద్ధతిమీద వచ్చిన భారతీయ కూలీలు, వలసరావడానికి కావలసిన సహాయాన్ని పొందేరు. దానివల్ల వారి హక్కులకు చాలావరకు భంగం కలిగినప్పటికీ, వారు కంట్రాక్టుకు లోబడి పనిచేయవలసి ఉంటుందని భారతీయులుకూడా అంగీకరిస్తున్నారు. కాని కాంట్రాక్టు పూర్తయిన తర్వాత, యీకూలీలు ఏ కాలనీ లేక దేశంలో స్థిరనివాసం ఏర్పరచుకుంటారో అక్కడ వారికి బ్రిటిష్ సామ్రాజ్యపు పౌరులుగా పౌరసత్వపు హక్కులు యివ్వవలసి ఉంటుందని వారు వాదిస్తున్నారు. భారతీయ కూలీలు దక్షిణాఫ్రికాకు, తమ జీవితంలో ముఖ్యభాగాన్ని అంకితంచేసిన తరువాత, వారికి బ్రిటిష్ సామ్రాజ్యపు పౌరులుగాగల హక్కులను స్థిరనివాసం ఏర్పరచుకున్నచోట నిరాకరించి, తిరిగి వారిని ఇండియాకు పంపడం న్యాయంకాదని ఇండియా ప్రభుత్వమనడం లోకూడా బేసబబు ఏమీలేదు. తుదినిర్ణయం ఏదైనా, అది ఇండియానుంచి జరిగే వలసకు, అభివృద్ధినిరోధకంగా పరిణమిస్తుంది.

నేటాల్ గవర్నమెంటు గెజెట్‌లో యివ్వబడిన జనాభా సంఖ్యలు సరైనవని అంగీకరిస్తూ, వాటి ఆధారంగా, ఓటింగుహక్కు సమస్యను గురించి ప్రస్తావిస్తూ, టైమ్సు పత్రిక, తన 31 జనవరి 1896 తేదీ (వారపత్రిక) సంచికలో యిలా వ్రాసింది :

ఈ లెఖ్ఖల ననుసరించి, కాలనీలో 9309 రిజిష్టర్డు యూరోపియన్ ఓటర్లకు, 251 మంది రిజిస్టర్డు బ్రిటిష్ ఇండియన్ ఓటర్లు ఉన్నారు............మిస్టర్ గాంధీ ప్రకటనలు సరియైనవని

అంగీకరించినా, ఎన్నటికైనా భారతీయ ఓట్లు యూరోపియను ఓట్లను మించిపోయే రాజకీయసావకాశం ఎక్కడైనా ఉందా? కాంట్రాక్టు పద్ధతిని కూలీలుగా వచ్చినవారు దీనినుంచి మినహాయింపబడటమే కాకుండా తక్కిన భారతీయులుకూడా ఎవరో కొద్దిమందితప్ప, అందరూ, మినహాయింపబడినవారే. ఈ కొద్ది మందైనా, బుద్ధిబలంవల్లనూ, పరిశ్రమవల్లనూ, ఉన్నతస్థితికొచ్చిన పౌరులైయున్నారు.

ఈ లెఖ్ఖలవల్ల, ప్రస్తుతం అమలులో ఉన్న చట్టం రీత్యా, బ్రిటిష్ పౌరుడైన భారతీయునికి నేటాల్‌లో ఓటింగుహక్కు పొందడానికి చాలాకాలం పట్టేటట్లు స్పష్టమవుతోంది. 251 మంది భారతీయ ఓటర్లలో, 63 మంది మాత్రం పెట్టుబడిపెట్టి వ్యాపారం ప్రారంభించినవారు. వీరు కాలనీలో నివసిస్తున్న కాలపరిమితి పది సంవత్సరాలు ఉంటుంది. మిగిలిన ఓటర్లందరూ పది సంవత్సరాలపైనుంచి యీ కాలనీలో నివసిస్తున్నవారే. వారిలో మెజారిటీ 14 సంవత్సరాలుపైగా యిక్కడ నివసిస్తున్నారు. వృత్తులవారీగా తయారుకాబడిన భారతీయ ఓటర్ల జాబితాలు పరిశీలించినా, యిదేవిషయం తెలుస్తుంది. ఈ సమస్య పరిష్కారం కావాలని కోరేవారికి అది సహాయపడ గలదు.

ఇండియాలోని మునిసిపల్ ఎన్నికలలోనూ, తదితర ఎన్నికల లోనూ, యీ తరగతికి చెందినవారే, ప్రముఖపాత్ర వహిస్తుంటారు. ఇండియాలో అనుభవిస్తున్న హక్కులకంటె భారతీయుడు నేటాల్‌లో ఎక్కువ హక్కులను కోరరాదనీ, ఇండియాలో వారికి ఓటింగుహక్కు లేదనీ చేసే వాదనలలో సత్యం లేదు. ఇండియాలో ఎన్నికల పద్ధతిమీద ప్రభుత్వమేర్పడి నంతమేరకు, అక్కడ ఆంగ్లేయుడూ, భారతీయుడూకూడా సమాన హోదాలోనే ఉంటారు. మునిసిపల్, రాష్ట్రీయ, సుప్రీం కౌన్సిళ్ళ విషయంలో కూడా స్వదేశస్తుల హక్కులు వారి ప్రతినిధులచే కట్టుదిట్టంగా కాపాడబడుతున్నాయి. భారతీయులకు, ప్రాతినిధ్య ప్రభుత్వ

విధానంతో పరిచయం లేదనీ, అటువంటి సంస్థల బాధ్యతలు వారికి తెలియవనే వాదనను పాటించవలసిన అవసరం లేదు. ప్రజా జీవితంలో ప్రాతినిధ్య సంస్థలు యింత గాఢంగా చొచ్చుకొని పోయిన దేశం, ప్రపంచంలో యింకొకటిలేదు.... ......

మిష్టర్ చాంబర్లేన్ ఎదుట ఉన్న ప్రస్తుత సమస్య శాస్త్ర *సంబంధమైనది కాదు. అది వాదనార్హమైన విషయంకూడాకాదు. పూర్తిగా జాత్యాభిమానానికి చెందినది. 1858 నాటి మహారాణి ప్రకటన, భారతీయులకు, బ్రిటిష్ పౌరులకుగల సంపూర్ణ హక్కులను ప్రసాదించింది. దీని ననుసరించి ఇంగ్లాండులో భారతీయులు ఓటుచేసి, ఆంగ్లేయునితో సమానంగా, పార్లమెంటులో కూర్చొనగల్గుతున్నారు.* తరహాతరహాల ప్రజలుగల పెద్దసామ్రాజ్యంలో యిటువంటి సమస్యలు ఉత్పన్నమవడం సహజం. బ్రిటన్‌కుచెందిన అనేక రకాల జనాభాలను పొగడలు దగ్గరకు తీసుకుని రావడంతో, ఈ సమస్యలు మరీ తీవ్రస్వరూపంలో ఉత్పన్నమవుతాయి. కాని రెండు విషయాలుమాత్రం, తేట తెల్లంగా కనబడుతాయి. ఇటువంటి సమస్యలను ఎవ్వరూ పట్టించుకోకుండా ఊరుకుంటే, వాటంతట అవి సర్దుకుపోయేవి కావు. బలిష్ఠమైన సామ్రాజ్య ప్రభుత్వమే, యీ విషయాలలో తీర్పుచెప్పతగిన ఉన్నతన్యాయస్థానం. మన *పౌరులలో, నిత్యం పోరాడేజాతులు ఉండడం మంచిదికాదు.* ఒక్కసారిగా వలసను నిరోధించి నేటాల్ అభివృద్ధిని అరికట్టడం, భారత ప్రభుత్వానికి మంచిపనికాదు. అదేవిధంగా సంవత్సరాలతరబడి కాలనీలో పరిశ్రమచేసి, దాని మంచికిగాను ఎంతో పొదుపుతో పాటుబడి ఉన్నతస్థితికొచ్చిన భారతీయులకు, బ్రిటిష్ సామ్రాజ్య పౌరసత్త్వపు హక్కులను నిరాకరించటం, నేటాల్‌కు తగిన పనికాదు. (ఇటాలిక్సు వాక్యాలు విజ్ఞప్తిదారులవి)

ఈ విన్నపందారులు తమ సమస్యను మీ నిర్ణయానికి వదలివేస్తున్నారు. బిల్లుకు రాజాంగీకారం యివ్వబడదని ఆశిస్తున్నారు. భారతీయుల ఓట్లు, యూరోపియన్ల ఓట్లను మించిపోతాయన్న భయం ఉన్నట్లు

యితే, ప్రస్తుతపు చట్టంక్రింద అటువంటి ప్రమాదం కలుగడానికి ఆస్కారమున్నదా అన్న విషయంలో దర్యాప్తు జరిపించవలసిందిగా కోరుతున్నారు. న్యాయాన్ని ప్రసాదించే ఇతర చర్య నైనా తీసుకొనవలసినదిగా మా కోరిక.

ఇటువంటి న్యాయచర్యకు, యీ విజ్ఞప్తిదారులు ఎల్లప్పుడూ కృతజ్ఞులై ఉంటారు.

(సం.) అబ్దుల్ కరీం హాజీఆదం,
తదితరులు.

[అచ్చుకాపీ ఫోటోస్టాట్ నుంచి]

---

# 84. ఇండియాకు వెళ్ళేముందు జరిగిన ఇంటర్వ్యూ

[4 జూన్ 1896]

*గాంధీజీ ఇండియాకు బయలుదేరి వెళ్ళేముందు, నేటాల్ ఎడ్వర్టైజర్ పత్రికా ప్రతినిధి ఆయనను కలుసుకుని, అప్పట్లో కాలనీలోగల పరిస్థితుల విషయంలో, ఆయన అభిప్రాయాలను తెలుసుకున్నాడు. ఈ దిగువ ఇంటర్వ్యూకు చెందిన రిపోర్టు ఆపత్రికలో ప్రచురించబడింది.*

పెక్కు ప్రశ్నలకు సమాధానంగా, గాంధీజీ కాంగ్రెసులో ప్రస్తుతపు సభ్యులసంఖ్య 300 అని చెప్పేరు. సాలీనా చందా 3 పౌండ్లు. అది ముందుగానే చెల్లించబడాలి. విరాళం యివ్వడమేకాకుండా కాంగ్రెసు ఆశయసిద్ధికోసం పనిచేసేవారిని మాత్రమే, సభ్యులుగా చేర్చుకోవాలన్నది కాంగ్రెసు ఆశయం. పెద్దమొత్తాన్ని విరాళాల రూపంగా ప్రోగుచేసి, దానిద్వారా ఆస్థిని సంపాదించి, శాశ్వతఆదాయం వచ్చే ఏర్పాటు చేసుకోవాలనీ, తద్వారా కాంగ్రెసు ఆశయసిద్ధికోసం పాటుబడాలనీ అనుకున్నారు.

"ఆ ఆశయాలు ఏవి ?" అని అడిగాడు ప్రశ్నచేసిన వ్యక్తి.

"అవి రాజకీయం, విద్య అనే రెండు భాగాలు" అని సమాధానం. "విద్యకు సంబంధించినంత వరకు, యీ కాలనీలో జన్మించిన భారతీయులను స్కాలరుషిప్పులద్వారా ప్రోత్సాహపరచి, సాంఘికంగా తమ సంక్షేమానికి అవసరమైన విషయాలనూ, భారతదేశ చరిత్రనూ, కాలనీల చరిత్రలనూ, మితపానము వగైరాలను గురించీ బోధించడం.

"ఇదిగాక కాంగ్రెసులో సభ్యునిగా చేరడానికి కావలసిన యోగ్యతలు యింకా ఏమైనా ఉన్నాయా ?

"ఉన్నాయి. సభ్యులు, ఇంగ్లీషు చదవటం, వ్రాయటం, మాట్లాడటం తెలిసినవారై ఉండాలి అనేదొకటి. కాని ఇటీవల, యీ నిబంధనను పూర్తిగా అమలులో పెట్టడం లేదు."

"ఆర్థికంగా కాంగ్రెసు పరిస్థితి ఎలావుంది ?"

"దగ్గరున్న రొఖం పౌ. 194. ఉమ్‌గేనీరోడ్డులో కొంతఆస్థి ఉంది. నేను యిక్కడ లేనికాలంలో యీ మొత్తాన్ని పౌ. 1000 వరకు అభివృద్ధి చేయవలసిందిగా సభ్యులను కోరేను. అది జరుగుతుందనే నమ్మకం ఉంది. అందువల్ల యిది శాశ్వతమైన సంస్థగా మార్పుచెందే అవకాశం కలుగుతుంది".

"రాజకీయంగా కాంగ్రెసు దృక్పథం ఏమిటి ?"

"తీవ్రరూపంలో రాజకీయ ప్రభావాన్ని ప్రసరింపచేయాలనే ఉద్దేశ్యంలేదు. 1858 వ సంవత్సరపు ప్రకటనలోని వాగ్దానాలు అమలు జరిగేటట్లు చూడడమే ప్రస్తుతపు ఆశయం. ఇండియాలో భారతీయులు ఏ హోదాను అనుభవిస్తున్నారో ఆహోదాను వారు యిక్కడ పొందకలిగితే, రాజకీయంగా కాంగ్రెసు తన ఆశయాన్ని నెరవేర్చుకున్నదౌతుంది. రాజకీయంగా బలం సంపాదించి, ఏ యితర పార్టీనైనా తుడిచిపెట్టాలన్న ఉద్దేశ్యం లేదు.

"కాలనీలో భారతీయ ఓటర్ల సంఖ్య ఎంత ?"

"ఓటర్ల జాబితాలననుసరించి, 9309 యూరోపియన్లకూ, 251 మంది భారతీయులు మాత్రమే ఉన్నారు. వీరిలో 143 మంది డర్బాన్‌లో ఉన్నారు. ఎంతగా ప్రయత్నించినప్పటికీ 200 మందికంటె ఎక్కువ మందిని కాంగ్రెసు ముందుకు తీసుకురాలేకపోయింది. యూరోపియన్లతో సమానంగా హోదాను పొందడమే మా ఆశయానికి చరమస్థితి. దీనికిగాను ఏవైనా యోగ్యతలు ఉండాలని నిర్ణయించబడినా, మేము అభ్యంతరం చెప్పం. ఆస్థికి సంబంధించిన యోగ్యతను పెంపుదల చేయటం మాకు అంగీకారమే. కాని అది ఉభయులకూ సమానంగా వర్తించాలి."

"మీ భవిష్యత్కార్యక్రమం ఏమిటి ?"

"ఎప్పుడూ ఉన్నదే. భారతీయుల కష్టనిష్ఠూరాలను పత్రాలద్వారా కాలనీలోను ఇండియాలోను, ఇంగ్లాండులోను కాంగ్రెస్ తెలియపరుస్తూ ఉంటుంది. వాటిని ప్రజలదృష్టిలోకి తేవడానికి, భారతీయ సమస్యలపై పత్రికలలో వ్రాయడం, దాని ప్రచారంనిమిత్తం విరాళాలను సేకరించడం.

ఇంతవరకు కాంగ్రెసు తన సమావేశాలకు పత్రికలవారిని ఆహ్వానించి యుండలేదు. ఇకనుంచి వారిని అప్పుడప్పుడు ఆహ్వానించడం జరుగుతుంది. తన కార్యక్రమానికి చెందిన సమాచారం వారికి యివ్వడం జరుగుతుంది. తన సమావేశాలకు పత్రికలను ఆహ్వానించడానికిముందు, శాశ్వత ఉనికి విషయంలో, స్థిరత్వాన్ని కాంగ్రెసు వాంఛించింది. నేను ఒక విషయాన్ని సరిదిద్ద దలచుకున్నాను. నాకు సమర్పించిన వీడ్కోలు పత్రంలో, కాంగ్రెసు ఆశయాలు చాలావరకు నెరవేరినాయని చెప్పబడింది. అది నిజంకాదు. అందు నిమిత్తం యింకా ప్రయత్నాలుజరుగుతూనే ఉన్నాయి. వాటి సిద్ధికోసం, చట్టానికి లోబడి కాంగ్రెసు పనిచేస్తుంది. భారతజాతికి సంబంధించి నంతవరకు, శాసనరీత్యా రంగుభేదాన్ని అమలుజరుపబోయే చర్యలను కాంగ్రెసు ప్రతిఘటిస్తుంది. ఇది కనుక యిక్కడ ప్రవేశపెట్టబడినట్లయితే, యితర కాలనీలలోనూ, ప్రపంచంలో యితరచోట్లా యిది అమలులో పెట్ట బడుతుంది.''

---

# 85. ఒక భారతీయ సమావేశం

4 జూన్, 1896

*4 జూన్ 1896 తేదీన, అనగా గాంధీజీ ఇండియాకు బయలు దేరివెళ్ళేరోజుకు ముందురోజున, డర్బాన్‌లోని తమిళ, గుజరాతీయులు, తదితర జాతీయులతోపాటు, గౌరవ కార్యదర్శిగా ఆయన కాంగ్రెసుకు చేసిన సేవను గుర్తించడానికి, ఇండియన్ కాంగ్రెసు భవనంలో సమావేశమైనారు. పెక్కుమంది ఉత్సాహంతో హాజరైనారు. శ్రీ దాదా అబ్దుల్లా అధ్యక్షత వహించారు. తమిళులకు, శ్రీ లారెన్స్ దుబాషీగా పనిచేశారు. ఈ దిగువ రిపోర్టు* నేటాల్ ఎడ్వర్టైజర్ *నుండి గ్రహింపబడినది.*

స్వాగత పత్రం సమర్పింపబడిన తర్వాత, గాంధీజీ తన కృతజ్ఞతను తెలియ చేస్తూ, నేటాల్‌లోని భారతీయులు ఏ కులానికిచెందిన వారైనప్పటికీ అందరూకలిసి కట్టుగా ఉండాలని వాంఛిస్తున్నట్లుగా, యీ సమావేశం తెలియ చేస్తున్నదన్నారు. కాంగ్రెసు ఆశయాల విషయంలో, భేదాభిప్రాయాలు ఉన్నాయని తాననుకోవడం లేదనీ, అలా ఉండి ఉన్నట్లయితే, కార్యదర్శిని సన్మానించడానికి అందరూ యీ విధంగా సమావేశం అయి ఉండేవారుకాదనీ కూడా చెప్పేరు. తన యీ అభిప్రాయం సరియైనదైతే కాంగ్రెసుకు మద్రాసీయులు హాజరుకావాలని, నిన్నటిరోజు సాయం కాలం తానుచేసిన అభ్యర్థనను పునరుద్ఘాటిస్తున్నాననికూడా అన్నారు. ఇంతవరకు వారి హాజరు సంతృప్తికరంగాలేదనీ, ఇకనుంచీ ఎక్కువమంది హాజరవుతారని ఆశిస్తున్నట్లుగానూ చెప్పేరు. తమిళంలో మాట్లాడజాల నందుకు విచారంతెలియచేస్తూ, మద్రాసీయులు దూరంగా ఉంటున్నారని తానన్నమాట వారిని గురించిగాని, తదితర భారతీయ వర్గముల గురించిగాని అన్నట్లుగా భావించరని ఆశిస్తున్నాననికూడా చెప్పేరు. కాంగ్రెసు ఆశయాలు అందరికీ తెలిసినవే. మాటలతో యీ ఆశయాలను

సాధించలేము. అందువల్ల మాటలతోగాక చేతలవల్ల తమ ఆసక్తిని ప్రదర్శించి వాటిని సాధించవలసిందిగా కోరేరు. మారిట్జ్‌బర్గ్, లేడీస్మిత్, తదితర కేంద్రాలలో భారతీయులలో అన్నివర్గాలవారు నివసిస్తున్నారనీ, కాంగ్రెసులో వారికి యింతవరకు ప్రాతినిధ్యం లేదనీ, అక్కడికి డెలిగేట్లనుపంపి, వారు సభ్యులుగా చేరునట్లుగా చూడవలసిందిగా, సభికులను కోరేరు.

[*నేటాల్ ఎడ్వర్టైజర్*, 5–6–1896]



# ఈ సంకలనానికి తోడ్పడిన ఆధారాలు

*కలోనియల్ ఆఫీసు రికార్డులు :* లండన్‌లోని కలోనియల్ ఆఫీసు గ్రంథాలయంలో ఉండే రికార్డులు. అనగా, కలోనియల్ శక్రటరీ, నేటాలు గవర్నరూ, కేపుటౌనులోని బ్రిటిష్ హైకమీషనరూ, కాలనీల కార్యదర్శికి వ్రాసిన లేఖలు; నేటాలు శాసనసభచర్చలు వగైరా నివేదికలు, వారందుకున్న అర్జీలు, వారి ఉత్తరువు ప్రకారం ప్రకటితమైన ఉత్తర ప్రత్యుత్తరాలు, దక్షిణాఫ్రికా వ్యవహారాలనుగురించి లండన్‌లోనూ ద. ఆఫ్రికాలోనూ ప్రచురింపబడిన ప్రభుత్వ ప్రచురణలు వగైరాలు.

*దాదాభాయి నౌరోజీ :* 1939 సంవత్సరం లో లండన్‌లోని ఆలెన్ అండ్ అన్విన్ వారు ప్రచురించిన, 'భారత పితామహుడు' అనే పేరుతో ఆర్. పి. మసానీ వ్రాసిన గ్రంథం.

*గాంధీ స్మారక సంగ్రహాలయం :* గాంధీ స్మారకనిధివారు న్యూఢిల్లీలో కేంద్రీయ మ్యూజియమును, గాంధీ సాహిత్యాన్ని, రచనలను భద్రపరచేచోటు. ఫోటో ఉత్తరాలు, మైక్రోఫిల్ముు, అసలు ఉత్తరాలు డాక్యుమెంట్లు ఇక్కడ లభ్యమవుతాయి.

*కథియావార్ టైమ్సు :* రాజకోటనుండి ప్రచురణమయ్యే ఆంగ్ల—గుజరాతీ వార పత్రిక.

*మహాత్మా :* టెండుల్కర్ వ్రాసిన గాంధీజీ జీవితచరిత్ర 8 సంపుటములు. ప్రచురణ 'ఝవేరీ అండ్ టెండుల్కరు' బొంబాయి (1951—54)

*ది నేటాల్ అడ్వర్టయిజరు :* డర్బాన్‌నుండి వెలువడే దినపత్రిక.

*ది నేటాల్ మెర్క్యూరీ :* డర్బాన్‌నుండి వెలువడే దినపత్రిక (1852)

*ది నేటాల్ విట్‌నెస్ :* పీటర్‌మారిజ్‌బర్గునుండి వెలువడే స్వతంత్ర దినపత్రిక.

*సబర్మతీ సంగ్రహాలయం, అహమ్మదాబాదు* : సబర్మతీ ఆశ్రమంవారిచే నిర్వహింపబడుచున్నది. ఇక్కడ గాంధీజీ రచించిన గ్రంథాలూ, ఆయననుగురించి రచింపబడిన గ్రంథాలూ, 1893—1901 వరకూ ద. ఆఫ్రికాలోని డజను పత్రికల నుండి కత్తిరింపులూ, ప్రభుత్వ ప్రచురణలూ, 1893—1933 వరకూ గాంధీగారి తాలూకు రికార్డులూ భద్రపరుపబడినాయి. కాంగ్రెసుకు సంబంధించిన కొన్ని కాగితాలుకూడా ఉన్నాయి.

*శ్రీమద్ రాజచంద్ర* : గుజరాతీలో రాజచంద్ర రచనల సంకలనము. (1914). సంపాదకుడు ప్రచురణకర్త; శ్రీ మన్‌శుక్‌లాల్ ఆర్. మెహతా.

*ఆత్మకథ* : మహాత్మాగాంధీ రచన. 1956 సం. రం. లో అహమ్మదాబాదునుండి నవజీవన్ ప్రచురణాలయంవారు ప్రకటించారు. గుజరాతీలో మహాత్మాగాంధీ వ్రాసినదానికి మహదేవదేశాయి ఇంగ్లీషు తర్జుమా. రెండు సంపుటాలు : మొదటిది 1927 లోనూ, రెండవది 1929 లోనూ ప్రచురింపబడ్డాయి. ఆదిలో 'యంగిండియా' పత్రికలో వారం వారం ప్రకటింపబడ్డాయి.

*ది టైమ్సు ఆఫ్ నేటాల్* : (1851—1927) పీటర్‌మారిజ్‌బర్గు నుండి వెలువడుతుండిన దినపత్రిక.

*ది వెజిటేరియన్ (1888)* : మొదట్లో స్వతంత్ర పత్రికగా ప్రారంభింపబడింది. పిమ్మట లండన్ వెజిటేరియను సొసైటీవారి వార పత్రికగా రూపొందింది.

*ది వెజిటేరియన్ మెస్సెంజర్* : మాంచెస్టరులోని వెజిటేరియన్ సొసైటీ వారి పక్షాన ప్రచురింపబడిన పత్రిక.

---

# కాలక్రమణిక

## ( 1869-96 )

ఈ కాలంలో గాంధీజీ జీవితంలోని ప్రధానాంశములు క్లుప్తముగా ఉదహరింపబడినవి.

## 1869

*అక్టోబరు 2 :* పోర్బందరులో మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ జననం.

## 1876

12 ఏండ్లు వయస్సువరకు రాజకోటలోని ప్రాథమిక పాఠశాలలో విద్యాభ్యాసం.

కస్తూర్బాతో వివాహ నిర్ణయం.

## 1881

ఆల్‌ఫ్రెడ్ హైస్కూలులో ప్రవేశం. కస్తుర్బాయ్‌తో పరిణయం.

## 1884-85

మాంసాహారమును చవిచూడడం. పెద్దలను మోసం చేయకూడదనే కారణంచేత దానిని పరిత్యజించడం. 63 సంవత్సరాల వయస్సువాడైన తండ్రిమరణించాడు.

## 1887

*నవంబరు :* మెట్రిక్యులేషన్ ప్యాసయి, భవనగర్‌లోని శ్యామలదాస్ కాలేజీలో చేరేడు.

## 1888

*ఏప్రిల్, మే :* చదువు విషయంలో సంకోచం. ఇంగ్లండుకుపోయి లా చదువవలసినదని సలహాపొందడం. మద్యపదార్థాలను, పరస్త్రీని, మాంసాన్ని ముట్టనని శపథంచేసి తల్లి అనుమతిని పొందడం.

*ఆగష్టు* **10 :** రాజకోట నుండి బయలుదేరి బొంబాయి చేరడం. అక్కడ కులపెద్దలు సమావేశమై పరదేశాలకు వెళ్ళవద్దని బలవంతంచేశారు.

*సెప్టెంబరు* **4 :** విదేశాలకు చదువు నిమిత్తం వెళ్ళవద్దని కులపెద్దలు చాలా బలవంత పరచినా ఓడమీద లండన్ ప్రయాణమైనాడు.

*అక్టోబరు* **28 :** లండన్ చేరేడు.

*నవంబరు* **6 :** ఇన్నర్ టెంపుల్‌లో ప్రవేశించాడు.

## 1889

శాకాహార భోజననియమానికి పరిహారంగా ఇంగ్లీషు దొరగారి అలవాట్లను నేర్చుకున్నాడు. ఉపన్యాసాలు చేయడం, ఫ్రెంచిభాష, పాశ్చాత్య నృత్య సంగీతాలు నేర్చుకున్నాడు. కాని ఆ అవివేకాన్ని వెంటనే గుర్తించాడు.

*సెప్టెంబరు :* లండన్ డాక్ స్ట్రైక్‌ను ముగింపు చేయడానికి కార్డినల్ మేనింగు చేసిన కృషికి ఆయన నభినందించడానికి నెలాఖరున ఆయనను సందర్శించాడు.

*మే- అక్టోబరుల మధ్య :* ప్యారిస్ ప్రదర్శనాన్ని సందర్శించాడు.

*నవంబరు :* బ్లావెట్‌స్కీ, ఆనిబిసెంట్లతో పరిచయం; కాని థియసాఫికల్ సొసైటీలో యథావిధిగా సభ్యుడు కావడానికి ఇష్టపడలేదు.

*డిసెంబరు :* లండన్ మెట్రిక్యులేషన్ పరీక్షకు వెళ్ళేడు. కాని ఉత్తీర్ణుడు కాలేదు. థియసాఫికల్ సొసైటీవారి పరిచయ ఫలితంగా, వారి సాహిత్యాన్నీ ఇతర మతసాహిత్యాలనూ కూడా చదివేడు. ఎడ్విన్ ఆర్నాల్డు వ్రాసిన 'సాంగ్ సెలెస్టియల్' 'లైట్ ఆఫ్ ఏషియా' 'భగవద్గీత' సంస్కృత మూలం, బైబిలు మొదలైనవన్నీ చదివేడు. చర్చి సర్వీసులకెళ్ళి డాక్టర్ జోసెఫ్ పార్కర్‌వంటి ప్రసిద్ధ మత బోధకుల బోధలను విన్నాడు.

## 1890

వెజిటేరియన్ మెస్సెంజరు (మాంచెస్టరు), వెజిటేరియన్ (లండన్) పత్రికలున్నాయనీ, అక్కడ శాకాహార సంఘాలున్నా

యనీ సంవత్సరం ప్రారంభంలోనే తెలుసుకున్నాడు. అంతర్జాతీయ శాకాహార సభలకు జోసియా ఓల్డుఫీల్డుతోపాటు హాజరైనాడు. నిరాడంబరంగా జీవించడం మొదలుపెట్టేడు. భోజనం విషయంలో పరిశోధనలు చేయడం మొదలెట్టేడు. జోసియా ఓల్డుఫీల్డు అధ్యక్షుడుగా కొంతకాలం శాకాహార క్లబ్‌ను నిర్వహించాడు. దానికి ఎడ్విన్ ఆర్నాల్డు ఉపాధ్యక్షుడు, తాను కార్యదర్శి.

*జూన్ :* మెట్రిక్యులేషన్ ప్యాసయినాడు.

*సెప్టెంబరు 19 :* వెజిటేరియన్ సొసైటీలో సభ్యుడై, కార్యనిర్వాహక సంఘ సభ్యుడైనాడు.

## 1891

*జనవరి 30 :* ఛార్లెస్ బ్రాడ్లా అంత్యక్రియలకు హాజరైనాడు. ఆయన నిరీశ్వరవాదం నచ్చలేదు. 'నేను దివ్యజ్ఞాన సమాజవాది నెట్లా అయ్యాను ?' అని బిసెంటు వ్రాసిన పుస్తకం చదువడంవల్ల నిరీశ్వర వాదం పట్ల విముఖత్వం మరింత హెచ్చయింది.

*ఫిబ్రవరి 20 :* వెజిటేరియన్ సొసైటీలో ప్రప్రథమంగా ఉపన్యసించాడు. సంతాన నిరోధం విషయంలో డాక్టర్ ఆలిన్‌సన్ అభిప్రాయాలు ఛాందసుల అభిప్రాయాలకు విరుద్ధంగా ఉన్నా, వాటితో గాంధీజీ ఏకీభవించకపోయినా, ఆయన వెజిటేరియన్ సొసైటీలో సభ్యుడుగా ఉండడాన్ని సమర్థించాడు.

*ఫిబ్రవరి 21 :* వెజిటేరియన్ పత్రికలో సారానుగురించి, 'మానవకోటికి శత్రువు, నాగరికత పాలిటిశాపం' అని వర్ణించాడు.

*మార్చి 26 :* లండన్ దివ్యజ్ఞాన సమాజం (థియసాఫికల్ సొసైటీ)లో (అసోసియేట్ మెంబరు) సహాయసభ్యుడుగా చేర్చుకోబడినాడు.

*మే 1 :* శాకాహార సంఘాల సమాఖ్యకు లండన్ సంఘ ప్రతినిధిగా నియమింప బడినాడు.

*జూన్ 10 :* బారిష్టరైనాడు.

న్యాయశాస్త్రం చదివేటప్పుడు దాదాబాయి నౌరోజీ ఉపన్యాసాలకు హాజరైనాడు. న్యాయవాదికి నిజాయితీ, కష్టపడి

పనిచేయడం ముఖ్యంగా ఉండాలని ఫ్రెడెరిక్ పిన్కట్ ఇచ్చిన సలహా ఆయన భవిష్యత్తుకెంతో ఆశాజనకమైనది.

*జూన్ 11 :* హైకోర్టులో పట్టాతీసుకున్నాడు.

*జూన్ 12 :* భారతదేశానికి ఓడమీద ప్రయాణమైనాడు.

*జూలై 5-9 :* బొంబాయి చేరేడు. తల్లి స్వర్గస్థురాలైన సంగతి విని చాలా విచారించాడు.

నగల వ్యాపారస్థుడు, కవియైన రాజచంద్రా (రాయిచంద్ భాయీ)ని కలుసుకున్నాడు. కొంతకాలమైన పిమ్మట, మత విషయంలో టాల్స్టాయికన్న ఆయన గొప్పవాడని గాంధీజీ భావించేవాడు. ఆయన జీవితానికి మార్గదర్శకులైన మూర్తి త్రయంలో ఆయనొకడు. విదేశ యాత్రలుచేసి కులకట్టుబాట్ల నతిక్రమించినందుకు నాసిక్లో ప్రాయశ్చిత్తం చేసుకున్నాడు.

రాజకోటచేరి సోదరుడైన లక్ష్మీదాసింట్లో ఉన్నాడు.

*జూలై 20 :* కొందరింకా తికమకలు పెట్టినా, కులంలో చేర్చుకో బడ్డాడు.

*నవంబర్ 16 :* బొంబాయి హైకోర్టులో న్యాయవాదిగా ప్రవేశించ డానికి దరఖాస్తు పెట్టుకున్నాడు.

## 1892

*మార్చి-ఏప్రిల్ :* కుటుంబంలోని పిల్లలకు నవీన పద్ధతులమీద చదువు చెప్పడం మొదలు పెట్టేడు. వేషభాషల్లో, భోజన పద్ధతులలో, పాశ్చాత్య పద్ధతినవలంబించాడు.

*మే 14 :* కథియావాడ్ ఏజన్సీ కోర్టులలో న్యాయవాదిగా పనిచేయడానికి అనుజ్ఞనిస్తూ గెజెటు ప్రకటన జరిగింది.

రాజ్కోటలో న్యాయవాద వృత్తిని సాగించడంలో ఉండే కొన్ని ఇబ్బందులను తెలుసుకుని, అనుభవం సంపాదించడంకోసం బొంబాయి వెళ్లేడు. ఒక స్నేహితునితో కలసి భోజనం విషయంలో కొన్ని ప్రయోగాలుచేశాడు. సభాపిరికితనంవల్ల చేతికొచ్చిన మొదటి దావాను వదలిపెట్టేసి, అర్జీలు వ్రాయడం మేలను కున్నాడు. ఉపాధ్యాయ వృత్తిలో చేరాలనుకున్నాడు కాని, పట్టభద్రుడు (గ్రాడ్యుయేటు) కాకపోవడంవల్ల పనిదొరుకలేదు.

6 నెలలైన తర్వాత బొంబాయిలో సరంజామంతా కట్టిపెట్టి రాజకోటలో అన్నగారి దగ్గరచేరేడు. ఆయనతో కలసి పనిచేస్తూ, అర్జీలను, విన్నపాలను వ్రాస్తూ నెలకొక మూడు వందల రూపాయలు సంపాదించడం మొదలెట్టాడు.

## 1893

ఏప్రిల్ : దక్షిణాఫ్రికాలో దాదా అబ్దుల్లా కంపెనీ వారిచ్చిన కోర్టుపనిని అంగీకరించి, డర్బాన్ ప్రయాణమైనాడు. ఒక సంవత్సరంలో తిరిగి రావాలనే ఉద్దేశంతో భార్యనూ బిడ్డనూ రాజకోటలోనే ఉంచాడు.

మే : నెలాఖరుకు నేటాలు రేవుకు చేరేడు. భారతీయులపట్ల జరిగే అవమానానికి చకితుడై నాడు.

మే-జూన్ : చేరిన రెండో రోజునో మూడో రోజునో డర్బాన్ కోర్టుచేరేడు. తలపాగా తీసెయ్యమనగానే కోర్టు ఆవరణను వదలివెళ్ళి పోయాడు. ఆ సంఘటనగురించి పత్రికలకు వ్రాశాడు. 'సత్కరించదగని ప్రేక్షకుడు'గా నామకరణం చేయబడ్డాడు. కాని తగినంతగా పత్రికల్లో పేరు మ్రోగేడు.

7, 8 రోజుల అనంతరం క్లయింటుపనిమీద ప్రిటోరియా వెళ్లేడు. రైలుబండిలోనూ, గుర్రపు బండిలోనూ కూడా రంగు ద్వేషాన్ని కావలసినంత చవిచూచాడు.

ఎన్ని కష్టాలపాలైనాసరే, ఈ రంగు విద్వేషాన్ని అంత మొందించడానికి పోరాడాలని నిశ్చయించుకున్నాడు. న్యాయవాదీ మత ప్రచారకుడూ అయిన బేకర్, రంగు విద్వేషం ప్రబలంగా ఉన్న సంగతి ఆయనకు తెలియచేసి, ఒక పేదరాలి వసతిగృహంలో వసతి కలిగించాడు.

బేకర్ ప్రార్థన సభల్లో పాల్గొంటూ ఉండడంవల్ల, క్వేకరైన మిస్టర్ కోట్సు, మిసెస్ హారిస్, గేబ్ వగైరా క్రైస్తవులతో స్నేహ మేర్పడింది.

ప్రిటోరియాలోనున్న మొదటి వారంలోనే సేట్ త్యాబ్ హాజీఖాన్‌తో పరిచయం లభించింది. ట్రాన్స్‌వాల్ లోని భారతీ

యుల స్థితిగతులను గురించి భారతీయ మెమన్ వర్తకులకు ఉపన్యసించాడు. భారతీయ నివాసుల కష్టములను నివారించడానికి, ఒక సంఘాన్నేర్పాటు చేయడం అవసరమనీ దానికవసరమైన సహాయం చేస్తాననీ అన్నాడు. ప్రిటోరియాలో ఉండడంవల్ల ట్రాన్సువాల్‌లోనూ, ఆరెంజి ఫ్రీస్టేటులోనూ ఉండే భారతీయుల సాంఘిక, ఆర్థిక రాజకీయ స్థితిగతులు బాగా అవగాహన, అయాయి.

కాలి బాటల ఉపయోగం విషయంలో ఉండే నిషేధాలు అనుభవానికొచ్చాయి. ప్రెసిడెంటు క్రూగర్ ఇంటిదగ్గర కాలి బాటను నడుస్తుంటే ఆయనను తన్ని తగిలేశారు. ఆ దౌర్జన్యం చేసిన శ్వేతముఖునిమీద వ్యాజ్యంవేయమని చాలా మంది బలవంత పెట్టినా స్వంత విషయంలో కోర్టుకెళ్లకూడదనే నియమప్రకారం కోర్టుకెళ్లలేదు.

ఆగష్టు 22 – సెప్టెంబరు 2: ప్రాణాధారములైన ఆహారపదార్థాల విషయంలో ప్రయోగాలు చేశాడు. తరుచుగా మిస్టర్ కోట్సు వగైరా క్రైస్తవ స్నేహితులతో కలిసి తిరుగుతుండడంవల్ల క్రైస్తవ గ్రంథాలుచదవడం, వాటిని చర్చించడం జరుగుతుండేది. కాని బైబిల్ గురించీ క్రీస్తు మతంగురించీ వారు చెప్పేఅర్థం ఆయనకు నచ్చలేదు.

## 1894

ఏప్రిల్: తనక్లయింటైన దాదా అబ్దుల్లా కేసు తయారుచేస్తుండగా న్యాయవాదికి సత్యం చాలా ప్రధానధర్మమని గుర్తించాడు. కోర్టుల్లో లావాదేవీలవల్ల ఉపయోగంలేదని నమ్మి, మధ్యవర్తుల పరిష్కారంద్వారా వ్యవహారాన్ని ముగించాడు. కేసుపనిపూర్తి కావడంతో నే డర్బాన్ తిరిగి వచ్చేశాడు.

వీడ్కోలు విందు జరుగుతుండగా నేటాలు మెర్క్యూరీ పత్రికలో భారతీయులకు వోటింగుహక్కులను తీసివేస్తూ చట్టం చేయబోతున్నట్లు చూచాడు. భారతీయవర్తకులను దానినెదుర్కొనవలసిందని హెచ్చరించాడు. ఆ పోరాటానికి నాయకుడుగా ఉండమని వారు ఆయనను కోరినందున ఒక నెల ఉండిపోవడానికి అంగీకరించాడు. అదొక విధివశమైన మహత్తర నిర్ణయం.

ఈ కాలంలో చాలా శ్రద్ధతో మతగ్రంథాలను చదివేడు. 'భగవంతుని రాజ్యం నీలోనే ఉన్నది' (The kingdom of God is within you) అని టాల్‌స్టాయి వ్రాసిన గ్రంథం ఆయనను పరవశంచేసింది. ఇంగ్లండులోని క్రైస్తవ మిత్రులతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపేడు. ఇండియాలో రాయచంద్‌భాయ్ లాంటి మతతత్వరులతో కూడా ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపేడు. తన ప్రశ్నలకు ఆయనిచ్చిన సమాధానాలు హిందూ మతం విషయంలో ఆయనను సంతృప్తిపరచినాయి.

మే *22* : ప్రముఖులైన భారతీయ వర్తకులందరూ సమావేశమై భారతీయులకు (రంగు జాతులవారికి) ప్రతికూలంగా చేసే శాసనాలను నిరోధించే నిమిత్తం ఆందోళనచేయ డానికొక కమిటీ నేర్పాటుచేశారు.

జూన్ *27* : ఓటింగు హక్కుల సవరణచట్టంమీద చర్చను భారతీయుల అర్జీదాఖలయ్యేవరకూ ఆపుచేయమని, నేటాలు శాసనసభ స్పీకరుకూ, ప్రధాన మంత్రి రాబిన్‌సన్‌కూ, అటార్నీ జనరల్ యస్కోంబేకూ టెలిగ్రాములు పంపేరు. బిల్లుమీద చర్చ 2 రోజులు వాయిదా పడింది.

జూన్ *28* : బిల్లును ప్రతికూలిస్తూ, ఒక విచారణ సంఘాన్ని నియమించమని కోరుతూ 500 మంది భారతీయుల సంతకములతో ఒక విజ్ఞప్తిని లెజిస్లేటివ్ అసెంబ్లీకి దాఖలుచేశాడు.

జూన్ *29* : ప్రధాన మంత్రి దగ్గరకు రాయభారం వెళ్లేడు. భారతీయుల అభిప్రాయాలను పూర్తిగా ఎరుక పరచడానికి ఒక్కవారంరోజులు గడువిమ్మని కోరేడు.

జూలై *1* : ఫీల్డు వీధిలో భారతీయుల సమావేశానికి హాజరై ఉపన్యసించాడు.

జూలై *3* : అసెంబ్లీలో మూడవసారి చర్చింపబడి ఆమోదింపబడిన వోటింగుహక్కుల చట్టాన్ని అంగీకరించ వద్దని, నేటాల్ గవర్నరు దగ్గరకు రాయబార వర్గాన్ని తీసుకెళ్లేడు.

జూలై *5 :* దక్షిణాఫ్రికా భారతీయుల విషయంలో, ఇంగ్లండులో జోక్యం కలిగించుకోవలసినదని దాదాభాయినౌరోజీతో ఉత్తర ప్రత్యుత్తరాలను జరుపడం ప్రారంభించాడు.

జూలై *6 :* వోటింగు హక్కుల బిల్లును నిరాకరించవలసినదని లెజిస్లేటివ్ కౌన్సిలు వారికి భారతీయులు అర్జీదాఖలుచేసుకున్నారు.

జూలై *7 :* కౌన్సిలులో బిల్లు మూడవసారి చర్చ ముగిసింది.

జూలై *10 :* భారతీయుల పిటీషన్ చేరేవరకూ, సామ్రాజ్య ప్రభుత్వం వారికి (లండన్‌లోని రాణీగారి ప్రభుత్వం వారికి) బిల్లును రాణీగారి అంగీకారానికి పంపవద్దని గవర్నరుకు విజ్ఞప్తి దాఖలు చేయబడింది.

జూలై *20 :* నేటాలు గవర్నరుకు పదివేలమంది భారతీయుల సంతకాలతో సుదీర్ఘమైన మహజరును, కాలనీల కార్యదర్శియైన రిప్పన్ ప్రభువుకు పంపేనిమిత్తం అందచేయబడింది.

ప్రజాసేవ నిమిత్తం నేటాలులో స్థిరనివాస మేర్పరచుకున్నారు గాంధీజీ.

ఆగష్టు *22 :* రంగు భేదాలను పాటిస్తూ చేయబడే చట్టాలను నిరోధించేనిమిత్తం ఆందోళన సాగించడానికి నేటాల్ ఇండియన్ కాంగ్రెసును స్థాపించి దానికి గాంధీ ప్రథమ కార్యదర్శియైనాడు. కాలనీలో జన్మించిన భారతీయుల సంఘాన్నికూడా స్థాపించాడు.

సెప్టెంబరు *3 :* నేటాలు లా సొసైటీవారు వద్దన్నా, నేటాలుకోర్టుల్లో న్యాయవాదిగా పనిచేసుకోవడానికి గాంధీజీకి సుప్రీంకోర్టు అనుజ్ఞనిచ్చింది. కోర్టువారు తలపాగాను తీసెయ్యమంటే పెద్దవిషయాలను గురించి పోరాడడానికి తగినంత శక్తిని కూడతీసుకోవడం నిమిత్తం, ఆ ఉత్తరువు నంగీకరించాడు.

సెప్టెంబరు *19 :* బహుశా దక్షిణాఫ్రికాలో ఆయన మొదటి కేసైన గోపీ మహారాజ్ కేసులో వాదించి నెగ్గేడు................కాని ప్రజాసేవలోపడి న్యాయవాదవృత్తి నంతగా లక్ష్యపెట్టలేదు.

*నవంబరు* ***26 :*** ఇసాట్రిక్ క్రిస్టియన్ సొసైటీ వ్యవహారాల్లో ఎక్కువ శ్రద్ధవహించడం మొదలెట్టి ఆ సంఘం తాలూకు ప్రచురణలను అమ్మే ప్రతినిధిగా ఉండడానికి అంగీకరించాడు.

*డిసెంబరు* ***19 :*** (లోపుగా) నేటాలు శాసనసభ్యులకు సవిస్తరంగా ఆధారపూర్వకమైన బహిరంగలేఖను వ్రాశాడు.

*డిసెంబరు* ***19 :*** భారతీయ నివాసుల విషయంలో సానుభూతితో వ్యవహరించమని యూరోపియనులకు హెచ్చరికలు పంపేడు.

## 1895

*ఏప్రిల్ :* దర్బాన్ సమీపముననున్న ట్రాపిస్టు మఠాన్ని సందర్శించాడు. ఆధ్యాత్మిక దృష్ట్యా అక్కడివారు శాకాహార భోజనంచేయడం ఆయనకెంతో ఆనందం కలిగించింది.

*ఏప్రిల్* ***6 :*** బ్రిటిష్ ఇండియన్ వర్తకులద్వారా, ఇండియన్ ఆర్బిట్రేషన్ కేసులో ఇవ్వబడిన తీర్పునుగురించి హైకమీషనరుకు అర్జీదాఖలు చేశాడు.

*మే* ***5 :*** (లోపున) ఇండియన్ ఇమిగ్రేషన్ బిల్లులో, రెండవసారి కంట్రాక్టుకూలికి సంబంధించిన క్లాజును గురించి, నేటాల్ అసెంబ్లీకి విజ్ఞప్తిచేశాడు.

*మే* ***14 :*** (తరువాత) భారతీయుల స్వేచ్ఛా వ్యాపారపు హక్కులను లాకోర్టుల దయాధర్మముల ఖారిచేసిన మధ్యవర్తి పరిష్కారము గురించి, మరొక్కసారి రిప్పన్ ప్రభువుకు విన్నపం దాఖలుచేశాడు.

భారత రాజప్రతినిధియైన ఎల్గిన్ ప్రభువును, భారతీయులకు కలిగించబడుతున్న ప్రతిబంధకాల విషయంలో జోక్యంకలిగించుకోమని కోరేడు.

*జూన్* ***17 :*** కంట్రాక్టు కూలీయైన బాలసుందరం తరఫున వాదించి ఆతనిని విడుదల చేయించాడు. ఈ కేసు మూలంగా ఆయన కంట్రాక్టుకూలీలకు సన్నిహితుడైనాడు.

*జూన్* ***26 :*** ఇమిగ్రేషన్ బిల్లులో కంట్రాక్టు కూలీలకు సంబంధించిన క్లాజులను వ్యతిరేకిస్తూ లెజిస్లేటివ్ కౌన్సిలుకు పిటీషన్‌దాఖలుచేశారు.

ఆగష్టు *11 :* కంట్రాక్టు కూలీ పరిమితి ముగిసిన భారతీయుల మీద 3 పౌనులు లైసెన్సు ఫీజును విధించడం గురించి, ఛేంబర్లేనుకు దీర్ఘమైన విజ్ఞప్తిని పంపేడు. ఈ విషయంలో జోక్యం కలిగించుకోవాలనీ, లేక పూర్తిగా భారతీయుల వలసను ఆపుచేయాలనీ ఎల్గిన్ ప్రభువును కోరేడు.

ఆగష్టు *29 :* దక్షిణాఫ్రికాలోని భారతీయ బ్రిటిష్ పౌరుల కష్టములను గురించి లండన్‌లో ఛేంబర్లేను దగ్గరకు, దాదాభాయి నౌరోజీ ఒక రాయబారవర్గాన్ని తీసుకెళ్లేడు.

సెప్టెంబరు *12 :* ఉన్న విధంగా ఓటింగుహక్కుల బిల్లుకు రాణీగారి ప్రభుత్వం అంగీకరించడం లేదని నేటాలు గవర్నరుకు ఛేంబర్లేను తెలియచేశాడు.

సెప్టెంబరు *25 – 30 :* నేటాల్ ఇండియన్ కాంగ్రెస్ రహస్య సంస్థ కాదనీ, తాను అందులో జీతం పుచ్చుకునే నౌఖరు కాదనీ పత్రికలకు తెలియచేశాడు. దాని నిబంధనలు వగైరా తయారు చేసిన బాధ్యతను అంగీకరించాడు.

అక్టోబరు *22 :* కమాండో ఒడంబడికలో, నిర్బంధసైనిక సేవనుండి మినహాయింపబడిన వారిలో, బ్రిటిష్‌పౌరులంటే తెల్లవారుమాత్ర మేనని నిర్వచనంచేయబడింది. దాని విషయమై అసమ్మతిని తెలియచేస్తూ బ్రిటిష్ ఇండియన్ డిఫెన్సు కమిటీవారున్నూ, జోహాన్సుబర్గు భారతీయులున్నూ, ఛేంబర్లేనుకు టెలిగ్రాములు పంపేరు.

నవంబరు *18 :* నేటాలు ప్రభుత్వం మరొక వోటింగుహక్కుల బిల్లు ముసాయిదాను కాలనీల కార్యదర్శికి పంపుకున్నారు. ఏషియాటిక్ శాసనాలను సమర్థిస్తూ యూరోపియనులు లేడీస్మిత్, శాలిస్‌బరీ, బెల్లార్ మొదలైన పట్టణాల్లో సభలు జరిపేరు.

నవంబరు *26 :* కమాండో ఒడంబడికలో రంగుభేదాలను పాటిస్తున్న విషయంలో గాంధీజీ ఛేంబర్లేనుకు అర్జీదాఖలుచేశాడు.

డిసెంబరు *16 :* 'భారతీయుల వోటింగుహక్కులు : దక్షిణాఫ్రికాలోని బ్రిటిష్‌వారికి విజ్ఞప్తి' అనే కరపత్రాన్ని గాంధీజీ ప్రచురించాడు.

ఆ సంవత్సరమే టాల్‌స్టాయి రచించిన 'గాస్పెల్సు ఇన్‌బ్రీఫ్'. 'వాట్‌టుడూ' (ఏమిచేయాలి) అనే పుస్తకాలున్నూ, తదితర గ్రంథాలున్నూ గాంధీజీని చాలా ఆకర్షించాయి. 'విశ్వప్రేమ యొక్క అనంతశక్తి'ని ఆయనకు తెలియచేశాయి.

## 1896

*జనవరి 23 :* నేటాలు కోర్టులో గుజరాతీ తర్జుమాదారుగా తన్ను నియమించవలసినదని గాంధీజీ దరఖాస్తుచేశాడు.

*జనవరి 27 :* 'దక్షిణాఫ్రికాలో మనతోటి పౌరులైన భారతీయుల విషయంలో ఆయనచేస్తున్న కృషివలన, ఆయన మన మన్ననలకు పాత్రుడు, అని గాంధీజీని గురించి లండన్ టైమ్సు పత్రిక వ్రాసింది.

*ఫిబ్రవరి 26 :* టౌన్‌షిప్ నిబంధనలపట్ల అసమ్మతిని తెలుపుతూ జూలూ లాండ్ గవర్నరుకు గాంధీజీ అర్జీలు పంపేడు.

*మార్చి 3 :* శాసనసభలో ప్రవేశపెట్టదలచుకున్న కొత్త వోటింగు హక్కుల బిల్లు ముసాయిదా నేటాలు గవర్నమెంటు గెజెట్‌లో ప్రచురింపబడింది.

*మార్చి 5 :* టౌన్‌షిప్ నిబంధనలను ప్రతిఘటిస్తూ పంపిన అర్జీని ప్రభుత్వం నిరాకరించింది.

*మార్చి 11 :* టౌన్‌షిప్ నిబంధనలకు ప్రతికూలంగా గాంధీజీ ఛేంబర్లేనుకు విన్నవించాడు.

*ఏప్రిల్ 27 :* సవరణచేయబడిన కొత్త వోటింగు హక్కుల బిల్లు ప్రకారం, ఏదేశంలో ప్రజలు ప్రాతినిధ్యపు హక్కులు లేకుండా ఉన్నారో, ఆ దేశాలనుండి వచ్చినవారికి వోటింగుహక్కు నిరాకరింపబడింది. ఆ బిల్లు నేటాలు పార్లమెంటులో ప్రవేశపెట్టబడింది. దానిని వ్యతిరేకిస్తూ నేటాలు భారతీయులు పీటర్‌మారిజ్ బర్గులోని లెజిస్లేటివ్ అసెంబ్లీ వారికి మహజరు దాఖలుచేశారు.

*మే 6 :* వోటింగు హక్కుల చట్టం రెండవసారి ఆమోదింపబడింది.

మే *7* : వోటింగు హక్కుల బిల్లునుగాని, దానిసవరణలనుగాని, వేటినీ కూడా, భారతీయులతరఫున దాఖలుచేయబడే విజ్ఞప్తి చేరేవరకూ ఆమోదించవద్దని ఛేంబర్లేనుకూ, ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ యొక్క బ్రిటిష్ కమిటీ వారికీ, గాంధీజీ టెలిగ్రాములు పంపేరు.

మే *13* : లెజిస్లేటివ్ అసెంబ్లీ, వోటింగు హక్కుల బిల్లును మూడవ సారి ఆమోదించింది.

మే *18* : 1886 సం. రం. 3 వ నవంబరు చట్టాన్ని గురించి భారతీయులు దాఖలుచేయనున్న (టెస్టు) మచ్చువ్యాజ్యం తాలూకు ఖర్చులను ప్రభుత్వం భరించవలసి ఉంటుందని ప్రెటోరియాలో రాణీగారి ప్రతినిధిదగ్గరకు గాంధీజీ రాయబారం వెళ్లేడు. ఉత్తరం వ్రాశాడు.

మే *26* : "దక్షిణాఫ్రికాలో భారతీయులు పడుతున్న కష్టములను గురించి ఇండియాలోని ప్రభుత్వానికి, ప్రజలకు, ప్రజాసంస్థలకు తెలియచేయవలసినదని డర్బాన్‌లోని భారతీయ ప్రతినిధులు గాంధీజీకి అధికారమిచ్చారు.

జూన్ *4* : డర్బాన్‌లోని కాంగ్రెస్ హాలులో భారతీయులు గాంధీజీకి వీడ్కోలిచ్చారు.

జూన్ *5* : గాంధీజీ ఇండియాకు వెళ్లేరు.

---

# దక్షిణాఫ్రికా రాజ్యాంగ విధానం

## ( 1890-1914 )

### కేపు కాలనీ

1853 సంవత్సరం రాజ్యాంగముయొక్క ఆర్డినెన్సు ప్రకారం, కేపు కాలనీ ప్రభుత్వం, సర్వకార్య నిర్వహణాధికారాలుగల గవర్నరూ, లెజిస్లేటివ్ అసెంబ్లీ, లెజిస్లేటివ్ కౌన్సిలుతోకూడి ఉన్నాయి. అయితే శాసన సభలు ఎన్నుకో బడినవైనా, గవర్నరు వాటికి బాధ్యుడుకాడు. తర్వాత 1872 సంవత్సరంలో, కాలనీని ఏడుభాగాలుగా విభజించి ప్రతిభాగానికీ ప్రాతినిధ్యమిచ్చి శాసనసభలు పునర్నిర్మాణంచేయబడ్డాయి. శాసనసభలు కొంచెమించు మించుగా కెనడా ఆస్ట్రేలియా మొదలైన కాలనీలలో ఉన్నట్లుగానే ఉంటాయి. స్థానిక అవసరాల కనుగుణ్యంగా మార్పులు చేయబడ్డాయి.

ఎగువసభ ఎన్నిక హక్కులు చాలా పరిమితం. ఎక్కువ ఆస్తి పాస్తులున్నవారికి మాత్రమే వోటింగు హక్కు ఉన్నది. 1892 ఫ్రాంచైజ్ మరియు బ్యాలట్ చట్టం ప్రకారం, ప్రతివోటరుకు 50 పౌనుల సంవత్సరాదాయంగాని, 75 పౌనుల స్థిరాస్థిగాని ఉండాలి. వ్రాతకూడా ఒక అర్హతే. ఈ నిబంధన అందరికీ ఒకటేకాని, ఆచరణలో మాత్రం శ్వేతేతరుల సంఖ్య తగ్గించడానికే ఉపయోగపడుతుంది. వారి సంఖ్యకన్న, తెల్లవోటర్ల సంఖ్య చాలా హెచ్చు.

రాజ్యాంగ విధానం లిబరల్ కలోనియల్ విధానమే. దేశీయ విషయాలపై సంపూర్ణాధికారము వారికున్నది. కాని ఆచరణలో 'మాతృదేశ' (బ్రిటన్) విధానాలకు అనుగుణ్యంగా ఉండాలి. ఆ విధమైన రాజ్యాంగం 1910 సంవత్సరం దాకా అనగా కేప్ కాలనీ, యూనియన్‌లో ఒక రాష్ట్రమయేవరకూ అమలులో ఉండినది.

1894 సంవత్సరం గ్లెన్-గ్రే చట్టం, జనరల్ కౌన్సిల్‌కు లోబడిన గ్రామజిల్లా కౌన్సిళ్ళద్వారా, కొంతవరకు స్వపరిపాలనను ప్రవేశపెట్టింది. ఈ కౌన్సిళ్ళలో ఆరుగురు సభ్యులుంటారు. అందులో నలుగురు ఎన్నుకో

బడ్డవారు. ఇద్దరు నామినేటెడ్ సభ్యులు. దాని అధ్యక్షుడు యూరోపియను మేజస్ట్రేటు. జనరల్ కౌన్సిలుకు ప్రతిజిల్లా కౌన్సిలునుంచీ ఇద్దరు ఎన్నిక సభ్యులూ ఒక నామినేటెడ్ సభ్యుడూ సభ్యులుగా ఉంటారు. స్వపరిపాలనాధికారాలు విశేషంగాగలిగిన ఈ జనరల్ కౌన్సిలుకు ఆదాయం, ప్రధానంగా రెండు విధాలుగా వస్తుంది. ఒకటి క్విట్ రెంటు, రెండవది గుడిసెల పన్ను (ఇంటి పన్ను). జిల్లా కౌన్సిలుకు స్వంతంగా పన్నులు వేసే అధికారం లేదు. 1899-1903 సంవత్సరాల్లో ఈ గ్లెన్-గ్రే చట్టం కాలనీలోని 'కెంటనీ' వగైరా ఇతర జిల్లాలకు కూడా విస్తరింపబడింది.

యూనియను దేనిమూలంగా నిర్మాణంచేయబడిందో, ఆ 1909 నాటి ద. ఆఫ్రికా చట్టం, రంగు విద్వేషం ఎన్నిక విధానంలో జొరకుండా కట్టుబాట్లు చేసింది. కేప్ రాష్ట్రంలోని మనుష్యులకు కేవలం రంగును బట్టీ జాతినిబట్టీ వోటింగుహక్కును తగ్గించదలచుకున్నట్లయితే, అలాంటి మార్పు, యూనియను పార్లమెంటుయొక్క రెండు సభల సంయుక్త సమావేశంలో మూడింట రెండుభాగాలు వోటుతోతప్ప జరుగకూడదని ఒక నిబంధనను చేసింది.

1901 సంవత్సరం వరకూ, కేప్ టౌన్ బ్రిటిష్ హైకమీషనరుకు నివాసస్థానము. నిజమైన రాజ్యాధికారం 1910 సంవత్సరంలో ద. ఆఫ్రికా మంత్రివర్గం చేతుల్లో కొచ్చేవరకూ, అక్కడి రాజకీయాలన్నిటికీ హైకమీషనరే మూలవిరాట్టు. అటువంటి కేప్ టౌన్, యూనియను శాసనసభలకు స్థావరమైనది.

## నేటాల్

1893 సంవత్సరంలో నేటాలుకు బాధ్యతాయుత ప్రభుత్వం సిద్ధించింది. ముందుగా లెజిస్లేటివ్ కౌన్సిల్ ఆమోదించిన ఆబిల్లును, సామ్రాజ్య ప్రభుత్వం అంగీకరించింది. దాని ప్రకారం రెండు శాసనసభ లేర్పడినాయి. పది సంవత్సరాలపాటు నామినేట్ చేయబడిన, 11 గురు సభ్యులుగల ఒక లెజిస్లేటివ్ కౌన్సిలు. 37 మంది ఎన్నిక సభ్యులుగల లెజిస్లేటివ్ అసెంబ్లీ. దానికాల పరిమితి 4 సంవత్సరాలు. గవర్నరు, ఆతని మంత్రి మండలి, కార్య నిర్వాహకులు. నేటాలు ప్రథమ ప్రధాన మంత్రియైన సర్ జాన్ రాబిన్సన్, ఆసియావారి కందరికీ నష్టం కలిగించిన వోటింగుహక్కుల

నిరాకరణ శాసనానికి కారకుడు. స్వతంత్రులైన భారతీయులు కాలనీలో లేకుండా చేసిన ఇమిగ్రేషన్ ఆక్టును చేయించినదికూడా ఆతడే. 1906 సంవత్సరంలో ఒక రాజ్యాంగ ప్రతిష్టంబన సంభవించింది. నేటాల్ గవర్నమెంటు కొందరు నేటివ్‌లను ఉరిదీయడానికి ఉత్తరువు చేసింది. సామ్రాజ్య ప్రభుత్వం ఆ ఉత్తరువును ఆపేసింది. అందుమీద అసమ్మతి సూచకంగా నేటాల్ ప్రభుత్వం రాజీనామా ఇచ్చింది. కాని కాలనీలోని బాధ్యతాయుత ప్రభుత్వంలో జోక్యం కలిగించుకోవడం తమ అభిప్రాయం కాదని, రాణీగారి ప్రభుత్వంయొక్క కాలనీల ప్రధాన కార్యదర్శి చెప్పిన మీదట మరల రాజ్యాన్ని స్వీకరించారు.

## ఆరెంజి రివర్ కాలనీ

ఆరెంజి రివర్ కాలనీలో 1890 వరకూ, 1858-60 సంవత్సరంనాటి రస్టెన్‌బర్గు-గ్రాండ్‌వెట్ రాజ్యాంగమే అమలులోవుండినది. ఆ రాజ్యాంగం ప్రకారం ఒక అధ్యక్షుడు, కార్యనిర్వాహక వర్గమూ ప్రభుత్వాన్ని వహిస్తారు, కార్యనిర్వాహక వర్గంలో కొంతమందిని ప్రెసిడెంటు నియమిస్తాడు. వయోజనులైన పౌరులచేత ఎన్నుకోబడిన వాల్కుసరాద్ (నేషనల్ లెజిస్లేటివ్ అసెంబ్లీ) మిగిలిన వారిని నియమిస్తుంది. సాయుధదళాల ప్రధాన సేనాని (కమాండెంటు జనరల్) కార్య నిర్వాహక సభలో ముఖ్యసభ్యుడు. ప్రజాస్వామికాన్ని శిరసావహించిన ఆరాజ్యాంగం, చర్చిలోనూ ప్రభుత్వంలోనూ కూడా, రంగుజాతులవారికి శ్వేతజాతులతో సమానమైన హక్కులుండ గూడదని నిర్ణయించింది. 1897 లోనూ తరువాత రెండు సంవత్సరాల్లోనూ, బ్లామ్ ఫాన్‌టీన్ ఒడంబడిక, ట్రాన్సువాల్‌కూ ఆరెంజి రివర్ కాలనీకి సయోధ్యను పెంపొందించింది. ఉభయ రాష్ట్రాల ప్రతినిధులూ, బ్లామ్ ఫాన్‌టీన్, ప్రిటోరియాలలో సంయుక్త సమావేశాలు జరుపుకుంటూ ఉండేవారు. ఫెడరల్ సమాఖ్యను దృష్టిలోనుంచుకొని, విద్య, న్యాయ పరిపాలన, నేటివ్ సమస్య మొదలైన విషయాలలో ఒకే విధానాన్ని అమలు జరుపుకునేవారు.

బోయర్ యుద్ధానంతరం, కాలనీ బ్రిటిష్‌వారి ఆధీనంలోకొచ్చిన వెంటనే సైనిక రాజ్యం అమలులో కొచ్చింది. కాని వెరీనిగింగ్ ఒడంబడిక వలన అది రద్దుచేయబడింది. దానిస్థానే 1902 సంవత్సరంలో లెఫ్టినెంట్ గవర్నరు కొక కార్యనిర్వాహక వర్గమున్నూ, ప్రధానోద్యో

గులున్నూ నియమింపబడ్డారు. 1903 లో అల్ప సంఖ్యాకులైన అనుద్యోగ నియమిత సభ్యులతో స్థానికులకు ప్రాతినిధ్యం కలిగించే ఒక లెజిస్లేటివ్ కౌన్సిలు ఏర్పాటు చేయబడింది. తర్వాత రెండు ప్రజాస్వామికాల క్షేమం దృష్ట్యా, ఇంటర్ కలోనియల్ కౌన్సిలు స్థాపించబడింది. అందులో 14 గురు ఉద్యోగ సభ్యులు. 4 గురు ఉద్యోగేతర నామినేటెడ్ సభ్యులు. 1907 లో కాలనీకి స్వపరిపాలనా స్థాయి సిద్ధించింది. ఆరాజ్యాంగం కేవలం శ్వేతజాతీయులైన మగవారికి మాత్రమే వోటింగు హక్కుల నిచ్చింది. రంగుభేదం పాటించడంలో పాత రిపబ్లిక్ లక్షణాలు పూర్తిగా పట్టేయి. లెజిస్లేటివ్ కౌన్సిలులో నామినేటెడ్ నియమిత సభ్యులే ఉండాలనీ, వారిని ముందుగా గవర్నరు నియమించాలనీ పిమ్మట కౌన్సిలు సమేతుడైన గవర్నరు ఆమోదించాలనీ కూడా తీర్మానించింది.

## ట్రాన్సువాలు

క్రౌన్ కాలనీ రాజ్యాంగం, అనగా శాసనసభ, నామినేటెడ్ కార్య నిర్వాహకవర్గంగల విధానం 1879 సం. రం. లో ట్రాన్సువాలులో ప్రవేశ పెట్టబడింది. బ్రిటిష్ సామ్రాజ్యమునకు లోబడి, పూర్ణ స్వాతంత్ర్యమునకు హామీఇస్తూ, దానిని ప్రిటోరియా (కన్వెన్షను) సమావేశం మార్పుచేసింది. అంతకుముందు జరిగిన కన్వెన్షనులోని ఉపోద్ఘాతాన్ని మరల లండన్ సమావేశము త్రోసిపుచ్చింది. 1897 సం. రం. లో ట్రాన్సువాలు ఆరెంజిరివర్ కాలనీతోచేరి, ఉభయులకూ సంబంధించిన విషయాలనుగురించి సలహాచెప్పటానికిగాను, ఒకే శాశ్వతమైన కౌన్సిలు నేర్పాటుచేసుకుంది.

1900 స. రంలో బ్రిటిష్‌వారు ట్రాన్సువాలును స్వాధీనపర్చుకున్న ప్పుడు మిల్నర్ పరిపాలకుడుగా (అడ్మినిస్ట్రేటరు) నియమింపబడినారు. పూర్వపు చట్టాలన్నీ పూర్తిగా సవరింపబడి, సాలమన్‌కమీషన్ శిఫార్సుల ననుసరించి కేపుపద్ధతులమీదనే అనేకచట్టాలు ప్రకటన మూలంగా ఆమోదింప బడినాయి. 1901 సం. రం. లో జోహాన్సుబర్గుకు, ఆ తరువాత సం. రం. లో ప్రిటోరియాకు, మ్యునిసిపల్ పరిపాలన ప్రసాదింపబడినది. 'విరీనిగింగు' ఒడంబడిక ఫలితంగా వానికి క్రౌన్‌కాలనీ స్థాయి ఇవ్వబడింది. అనగా క్రమక్రమంగా బాధ్యతాయుత ప్రభుత్వమన్నమాట. 1902 సం. లో ట్రాన్సువాలుకు కార్యనిర్వాహకవర్గమున్నూ, శాసనసభయున్నూ లభ్య మైనాయి. రెండూ నామినేటెడ్ సభ్యులతో కూడినవే. వివిధ

పరిపాలనా శాఖల అధిపతులున్నూ, లెఫ్టినెంటు గవర్నరున్నూ అందు సభ్యులు. 1903 లో లెజిస్లేటివ్ కౌన్సిలు నిర్మాణం చేయబడింది. ఆ సంవత్సరమే కొంత కాలానికి ఇంటర్ కలోనియల్ కౌన్సిలు ఏర్పడింది. 1905 సం. రం. లో లిట్టిల్ టన్ రాజ్యాంగం అమలులోకొచ్చింది. దాని ప్రకారం ఎన్నికల పద్ధతిని శాసనసభ ఏర్పాటుచేయబడింది. కాని రాజ్యాధికారం గవర్నరుకు బాధ్యులైన ఉద్యోగస్థుల చేతుల్లోనే ఉంచబడింది. శాసన సభ మొత్తంసంఖ్య 44. అందులో రాణీగారిచేత నియమితులయ్యే కార్య నిర్వాహక ఉద్యోగులుకాక మిగిలినవారందరూ ఎన్నుకోబడినవారే.

లిట్టిల్ టన్ రాజ్యాంగవిధానం లెటర్సు పేటెంటు వల్ల రద్దుకావడంతోనే 1906 సం. రం. లో స్వపరిపాలన ప్రాప్తించింది. పాతకాలపు రిపబ్లిక్ పద్ధతిగానే ట్రాన్సువాల్ తెల్లవారైన పురుషులందరకూ వోటు అధికారాన్నిచ్చింది. అయితే రంగుజాతుల వారందరికీ చట్టబద్ధమైన హక్కులనిచ్చింది. ప్రజాప్రాతినిధ్యపు సంస్థల నేర్పరచి, పరిపాలనలో తెల్లవారికి అధికమైన సంఖ్యాబలం చేకూరేవరకూ నేటివ్‌ల ఓటింగు విషయం నిలుపుచేయబడింది. ఆరెంజిరివర్ కాలనీ పద్ధతిగానే, ఎగువ సభ పూర్తిగా నామినేటెడు సభ్యులతోనే నింపబడింది. 1908 సం. రం. జనరల్ ఎన్నికలైన పిమ్మట ప్రభుత్వం నిషేధచట్టాలను చాలావాటిని చేసింది.

## యూనియన్ సమాఖ్య

1910 సం. రం. లో ద. ఆఫ్రికాలోని నాల్గు రాష్ట్రాలు ఒక సమాఖ్యగా కలుపబడినాయి. యూనియన్ గవర్నమెంటుకు అధిపతి గవర్నరు జనరల్ ఇన్ కౌన్సిల్. ఆయనకు ఎక్జిక్యూటివ్ కౌన్సిలర్లూ రాష్ట్రీయ శాఖల పరిపాలకులైన మంత్రులూ మొత్తం పది మందికి మించని సహాయకులు.

మొత్తం యూనియనుకంతకూ సర్వాధిపత్యం వహించెడిది యూనియను పార్లమెంటు. రాజు, యూనియన్ సెనేటు, (లేక శిష్టసభ) హౌస్ ఆఫ్ అసెంబ్లీకలసి యూనియను పార్లమెంటు అవుతుంది. ఒక ఆర్థిక విషయాల్లో తప్ప, శాసనాలు చేయడంలో రెండు శాసనసభలకూ హక్కులు సమానమే. అన్ని బిల్లులనూ రెండు శాసనసభలూ ఆమోదించాలి. తగాదావస్తే జాయింటు సమావేశంలో పరిష్కరింపబడుతుంది.

రాజ్యాంగాన్ని అనగా ద. ఆఫ్రికా చట్టాన్ని సవరించుకోవడానికి పార్లమెంటుకు అధికారం ఉన్నది. కాని ఈ క్రింది మూడు క్లాజులను మార్చాలంటే మాత్రం, ఉభయ శాసనసభల సంయుక్త సమావేశంలో మూడింట రెండువంతుల మెజారిటీతో ఆమోదింపబడాలి. అవేవనగా (1) ఇంగ్లీషు డచ్చిభాషలు ప్రభుత్వ వ్యవహార భాషలుగా ఆమోదింపబడిన క్లాజు, (2) కేప్ రాష్ట్రంలో కేవలం జాతికారణంవల్లనూ, రంగు కారణంవల్లనూ ఎవరికైనా వోటింగుహక్కులు తగ్గిస్తూ ఎన్నికహక్కులను మార్పుచేయ దలచినపుడు, (3) పై రెండు క్లాజుల విషయంలోనూ ఈ మూడవ క్లాజు విషయంలో తప్ప మామూలుగా ఉభయ శాసనసభల ఆమోదంద్వారా రాజ్యాంగ చట్టాన్ని సవరించటానికి అధికారమివ్వడం.

ప్రజల వోట్లతో ఎన్నుకోబడిన హౌస్ ఆఫ్ అసెంబ్లీలో 159 గురు సభ్యులు 5 సంవత్సరాలపాటు ఉంటారు. వారంతా యూరోపియనులే. అందులో 150 మందిని యూనియనులోని నాలుగు రాష్ట్రాలనుండి వోటరులు ఎన్నుకుంటారు. S. W. ఆఫ్రికాలోని యూరోపియను వోటర్లు 6 గురిని ఎన్నుకుంటారు. కేపులోని ఆఫ్రికను వోటర్లు ముగ్గురిని ఎన్నుకుంటారు. ఆ వోటర్లు ఎవరనగా: (1) 21 సంవత్సరాల వయస్సు దాటిన యూరోపియనులు, వలసవచ్చినవారైతే 6 సంవత్సరములపాటు కాపురమున్నవారై ఉండాలి. బ్రిటిష్ పౌరులు 5 సంవత్సరాలుంటే పౌరసత్త్వపు హక్కును కోరవచ్చును. స్వదేశాంగమంత్రి ఇష్టపడితే దాని నివ్వవచ్చును. (2) కేపులోను, నేటాల్‌లోనూ నల్లజాతులకు చెందిన పురుషులలో వ్రాయడం చదువడంనేర్చి, సాలుకు 75 పౌనులు సంపాదించుకునే వారైనా లేక 50 పౌనుల స్థిరాస్థిగల వారైనా ఉండాలి; కేపులోమాత్రం చదవను వ్రాయనునేర్చిన ఆఫ్రికనులలో 750 పౌనులు సాలుసరి సంపాద్యంగలవారుగాని, 50 పౌనుల స్థిరాస్థిగలవారు కాని ఎన్నికలపట్టీలో చేరడానికి అర్హులు. వారు ప్రత్యేకంగా ముగ్గురిని ఎన్నుకుంటారు. నియోజిక వర్గాలన్నిటిలోనూ వోటర్లసంఖ్య పదిహేనుశాతం ఇంచుమించుగా సమానంగానే ఉంటుంది.

సెనేటు (శిష్టసభ) లేక ఎగువసభలో 48 గురు సభ్యులుంటారు. వారి సభ్యత్వ పరిమితి 10 ఏండ్లు. అంతా యూరోపియను స్థిరాస్థిదారులే. రాష్ట్రానికి 8 గురు చొప్పున, ప్రతి రాష్ట్రంలోని పార్లమెంటు సభ్యులూ

కౌన్సిలు సభ్యులూకలసి వారిని ఎన్నుకుంటారు. S. W. ఆఫ్రికాలోని పార్లమెంటు సభ్యులూ కౌన్సిలు సభ్యులూ ఇద్దరిని ఎన్నుకుంటారు. పది మందిని గవర్నమెంటు నియమిస్తారు. మిగిలిన నలుగురిని 5 ఏండ్ల కొకసారి ఆఫ్రికనులు పరోక్ష ఎన్నికలో, అనగా ముఠాదారులు నేటివ్ కౌన్సిల్సు, నేటివ్ అడ్వయిజరీ బోర్డులు, ద్వారా ఎన్నుకుంటారు.

## రాష్ట్ర ప్రభుత్వాలు

వీటి నిర్మాణం ఈ విధంగా ఉన్నది: (1) యూనియను ప్రభుత్వం 5 సంవత్సరాల కొకసారి నియమించిన అడ్మినిస్ట్రేటరు అనగా పరిపాలకుడు. ఆతనిని తొలిగించాలంటే, సభాయుతుడైన గవర్నరు జనరలు, పార్లమెంటుకు తెలియజేసి పిమ్మట తొలగించాలి. (2) మూడు సంవత్సరాల కొకసారి దామాషాయి వోటింగు ప్రకారం (ప్రపోర్షనల్ వోటింగు) రాష్ట్రశాసనసభలు ఎన్నుకున్న కార్యనిర్వాహకులు నలుగురు. (3) యూనియన్ హౌస్ ఆఫ్ అసెంబ్లీ ఎన్నికదారుల వల్లనే ఎన్నుకోబడిన, రాష్ట్రీయ శాసనసభలు. ఈ ఎన్నికలు 3 ఏండ్ల కొకసారి జరుగుతుంటాయి.

ఈ అడ్మినిస్ట్రేటరు ద్వంద్వపాత్రను ధరించాలి. కార్య నిర్వాహక వర్గానికి అధ్యక్షుడుగా ఆయన అందులో పాల్గొంటాడు. ఆర్థిక సంబంధమైన పద్దుల జమా ఖర్చులను ఆయన సిఫార్సు చేస్తాడు. కాని వోటు చేయడు. యూనియను ప్రభుత్వ ప్రతినిధిగా, రాష్ట్రపరిపాలన కతీతమైన విషయాలను పాలిస్తుంటాడు.

రెసిడ్యుయరీ అధికారాలు రాష్ట్రకార్య నిర్వాహకవర్గాల చేతుల్లోనే ఉంటాయి. ప్రావిన్షియల్ కౌన్సిళ్ళకు అన్ని విధాలా శాసనసభ అధికారాలే ఉన్నాయి. సభాయుతుడైన గవర్నరు జనరల్ అంగీకారానికి లోబడి, పార్లమెంటు అధికారాలకు ప్రతిబంధకం కాని అన్ని విషయాల మీదా ఆర్డినెన్సులను ప్యాసుచేసే అధికారంకూడా వారికుంది. విద్య, (ఉన్నతవిద్య మినహా) వైద్యసహాయం, మునిసిపల్ పరిపాలన, రైల్వేలు మినహా నిర్మాణములు, వగైరాలన్నీ రాష్ట్రీయ కౌన్సిళ్ళ పరిపాలనలోని శాఖలే. కేంద్రప్రభుత్వాన్ని బలహీనం చేయకుండా పార్లమెంటరీ సంస్థలను, మ్యునిసిపల్ సంస్థలను కలుపడం అనే ఒక అపురూపమైన విషయానికి

కారణం, సమాఖ్య యడల వారికుండే ఆదరమే. యూనియను పార్ల మెంటుకు వీటిపైని సర్వాధికారాలూ ఉన్నాయి.

ద. ఆఫ్రికా సుప్రీంకోర్టుకు రాష్ట్రీయ శాఖలున్నాయి. బ్లాంఫాన్‌టీన్‌లో అప్పీలు డివిజనున్నది. రాష్ట్రప్రభుత్వాలు చేసిన ఆర్డినెన్సుల మంచి చెడ్డలను విచారించి నిర్ణయించే అధికారం సుప్రీంకోర్టు కున్నది.

రాష్ట్ర ప్రభుత్వాల ఆదాయంలో సుమారు 40 వంతులు రాష్ట్రీయ పన్నులద్వారానే లభిస్తుంది. మిగిలినది కేంద్రప్రభుత్వ ఆదాయంనుంచి లభిస్తుంది. వివిధ రాష్ట్రాల అర్థిక వ్యవహారాలన్నీ, 1913 సం. ద. ఆ. ఆర్థిక సంబంధాలచట్టం ప్రకారం నడుస్తుంటాయి.



# దక్షిణాఫ్రికాలోని సంఘటనల కాలక్రమణిక

ఈ కాలక్రమణిక సంపూర్ణమైనదికాదు. పాఠకులకు కొంత చారిత్రక విషయాలను పరిచయం చేయడానికీ, ద. ఆఫ్రికాలో గాంధీజీ జీవితాన్నిగురించీ, ఆయన చర్యలనుగురించీ తెలుసుకోవడానికి అవసరమైన విషయాలు మాత్రమే ఇందులో చేర్చబడ్డాయి.]

1795 కేప్, ఇండియాకు రావడానికి దారిలో అనువైనచోటున ఉండడం చేత, బ్రిటిష్ సైన్యాలు డచ్చివారితో ఒడంబడికను కుదుర్చుకుని కేపును ఆక్రమించుకున్నారు. అప్పట్లో అక్కడ 16,000 మంది శ్వేతముఖులు స్థావరం ఏర్పరచుకున్నారు.

1802 ఏమియన్సు ఒడంబడిక ప్రకారం, కేపుకాలనీ తిరిగి డచ్చివారి వశం చేయబడింది.

1806 బ్రిటన్ తిరిగి 'కేపు' ను జయించింది.

1815 వియన్నా కాంగ్రెస్, కేపును బ్రిటన్‌కిచ్చి · వేయడాన్ని ఆమోదించింది.

1820 కేపుకాలనీలో వలసనిమిత్తం బ్రిటిష్ మొదటిజట్టు వారు దిగేరు.

1823 కేపు వ్యవహారముల పరిశీలనకు కమీషన్ నియామకం.

1834 కేపు కాలనీలో లెజిస్లేటివ్ కౌన్సిలు స్థాపించబడినది. ఎన్నిక పద్ధతిమీద మ్యునిసిపల్ కౌన్సిళ్ళు స్థాపించబడ్డాయి. బానిసత్వం రద్దుచేయబడింది.

1836 భారీగా వలస ప్రారంభమైనది.

1838 నేటాలులో రిపబ్లికన్‌స్టేటు స్థాపింపబడింది.

1841 కేపుకాలనీ పౌరులు లెజిస్లేటివ్ అసెంబ్లీకొరకు విజ్ఞప్తి పంపుకున్నారు.

1843 నేటాలును బ్రిటిష్‌వారు కేపుకాలనీలో కలిపేశారు.

1845 ఇంతవరకు కేపుకాలనీ గవర్నరు జనరల్, శాసనసభల, అధికారంలో ఉంటూవచ్చిన నేటాలులో న్యాయస్థానాలను స్థాపించారు.

1846 కేపుకాలనీ గవర్నరును హైకమీషనరుగా నియమించారు.

1847 నేటాలులోని పట్టణాల్లో ఎన్నిక పద్ధతిని మ్యునిసిపల్ బోర్డులు స్థాపించబడ్డాయి.

1848 నేటాలుకు నామినేటెడ్ లెజిస్లేటివ్ కౌన్సిలు ఏర్పాటుచేయబడింది. ఆరెంజిరివర్ యొక్క సర్వాధికారాన్ని, ఫ్రీస్టేటు ప్రకటించింది.

1852 శాండ్ రివర్ సమావేశం, ట్రాన్సువాలులోని బోయర్ల స్వాతంత్ర్యాన్ని గుర్తించింది.

1853 కేపుకాలనీ రాజ్యాంగం ఆర్డినెన్సు ప్రకటింపబడింది.

1854 బ్లామ్‌ఫాన్‌టీన్ సమావేశానంతరం ఆరెంజిఫ్రీస్టేటున్నూ ట్రాన్సువాలున్నూ స్వతంత్ర రాష్ట్రాలైనాయి.

1855 ఖైదీలను కూలీలుగా పంపమని నేటాలు, సీమరాణిగారికి విజ్ఞప్తి పంపింది. కాని లాభం లేక పోయింది.

1856 నేటాలులో ప్రజాప్రభుత్వం స్థాపించబడింది. పార్లమెంటరీ ఎన్నిక హక్కు ఇవ్వబడింది. ఎన్నిక సభ్యుల మెజారిటీగల శాసనసభను స్థాపించి, క్రౌన్‌కాలనీ స్థాయిని కలిగించారు. ఎక్కువైన స్థిరాస్తి ఉంటేతప్ప వోటుచేయడానికి అర్హత లేకపోవడంవలన నేటివులు వోటర్లు కాలేకపోయారు.

1857 నేటాల్ సుప్రీంకోర్టు పునర్నిర్మాణం జరిగింది. పెద్దనేరాలకు జ్యూరీ విచారణా విధానం నెలకొల్పబడింది. పీటర్ మారిట్జ్‌బర్గులో ప్రప్రథమంగా లెజిస్లేటివ్ కౌన్సిలు సమావేశమైంది.

1858 అమటాంగా ముతాజాతివారిచేత కూలిపనులు చేయించాలని నేటాలులో జరిగిన ప్రయత్నం విఫలమైంది. జావానుంచి తీసుకురాబడిన చైనీయులను, మలయావారినీ కూలిపనుల్లో పెట్టేరు. ఈ విషయమై ఇండియా ప్రభుత్వంవారి నర్థించగా వారంగీకరించారు.

1859 భారతీయ కూలీలను దిగుమతి చేయడానికి నేటాలు ప్రభుత్వం చట్టంచేసింది.

1860 నేటాలులో చెరుకుతోటల్లో పనిచేయడానికి భారతదేశంనుంచి రప్పింపబడిన కంట్రాక్టు కూలీల మొదటిజట్టు దక్షిణాఫ్రికాలో అడుగెట్టింది.

1866 నేటాలులో భారతీయ కంట్రాక్టు కూలీలసంఖ్య 5 వేలయింది.

1868 బసొటోలాండ్ బ్రిటిష్ సామ్రాజ్యంలో చేరిపోయింది.

1869 ఫ్రీస్టేటులో వజ్రపుగనులు కనిపెట్టబడ్డాయి.

1870 కెంబర్లీలో వజ్రాలుదొరికేయి. కంట్రాక్టు కూలీపరిమితి ఆఖరైన వారికి భూమినివ్వడానికి అంగీకరిస్తూ 1870 సం. రం. రెండవ నంబరుచట్టం ఆమోదింపబడింది. బసొటోలాండు, చక్రవర్తికీ ఫ్రీస్టేటుకూ మధ్య పంపకమైంది.

1872 కేపుకాలనీలో పరిపూర్ణమైన బాధ్యతాయుత ప్రభుత్వం స్థాపించబడింది.

1876 నేటివ్ వ్యవహారాల కమీషన్, కార్యనిర్వాహకులకు నేటివ్‌లమీద ఎక్కువ అధికారాలను చలాయించడానికి, అధికారాలనిచ్చింది.

ప్రిటోరియా స్థాపింపబడింది. హార్బరు అభివృద్ధికోసమూ, రైల్వేల నిర్మాణంకోసమూ, భారతీయ కూలీలను మరల రప్పించడం జరిగింది.

1877 ట్రాన్సువాలును స్వాధీనం చేసుకోవడమైంది.

1878 ట్రాన్సువాలును, బ్రిటిష్‌వారు స్వాధీనం చేసుకోకుండా ఆపుచేయడానికి, క్రూగర్ ఇంగ్లండు వెళ్లేడు.

1879 ట్రాన్సువాలులో లెజిస్లేటివ్ అసెంబ్లీ నెలకొల్పబడింది. నామినేటెడు కార్యనిర్వాహకులు నియమింపబడ్డారు. క్రౌన్‌కాలనీ స్థాయి ఇవ్వబడింది.

1880—81 ట్రాన్సువాలు స్వాతంత్ర్య సమరం, లేక బోయర్ యుద్ధం.

1881 రాణీగారి సామ్రాజ్యానికిలోబడి పూర్తియైన స్వపరిపాలనను ట్రాన్సువాలుకు లభింపచేయడానికి ప్రిటోరియా సమావేశములో హామీ ఇవ్వబడింది.

నేటాలునుండి ట్రాన్సువాలుకు భారతీయ వర్తకులు తరలి వెళ్లేరు.

1882 ట్రాన్సువాలులో స్థావరాల నిర్ణయంకొరకు ఒక కమీషన్ ఏర్పాటు చేయబడింది. నేటివ్‌లను కొన్ని ప్రత్యేక స్థానాలకు పంపివేయడానికి నిర్ణయంచేయబడింది. కాని అమలుజరుపలేదు.

1883 ట్రాన్సువాలుకు అధ్యక్షుడుగా ఎన్నుకోబడిన క్రూగర్, ప్రిటోరియా సమావేశపు నిర్ణయాలను తిరుగ తోడడానికి లండన్ వెళ్ళేడు.

1884 బ్రిటన్‌కూ ద. ఆఫ్రికా రిపబ్లిక్‌కూ మధ్య జరిగిన లండన్ సమావేశం ఫలితంగా, నేటివ్‌లకు తప్ప మిగిలినవారందరికీ రిపబ్లిక్‌లో ప్రవేశం, ప్రయాణం, నివాసం మొదలైన హక్కులన్నీ లభించాయి. వ్యాపార స్వాతంత్ర్యం సిద్ధించింది. ఒక్కర్నుమీద విధింపబడని పన్నులుకూడా తొలగింపబడ్డాయి.

ఆఫ్రికాండర్ పార్టీనాయకుడుగా 32 సభ్యులతో హాఫ్‌మియర్ ఎన్నుకోబడ్డాడు.

కాలనీలో ఉన్న ఆసియాజాతులవారి నందరినీ సరియైన అదుపు ఆజ్ఞలలో నుంచడానికి తగిన విధానాన్ని తయారు చేసేటందుకు నేటాలు లెజిస్లేటివ్ కౌన్సిలు ఒక కమీషనును నియమించడానికి నిశ్చయించింది.

నిషేధ శాసనాలను చేయాలని ట్రాన్సువాలు ప్రజలు కోరినకోరికలు సామ్రాజ్య ప్రభుత్వానికి నివేదింపబడ్డాయి.

1885 ఆసియావాసులను ప్రత్యేకస్థలాలలో ఉంచమని యూరోపియనులు కోరినందున సామ్రాజ్య ప్రభుత్వం ఆజ్ఞనుపొంది, ట్రాన్సువాలులోని ఆసియావాసుల హక్కులమీద నిషేధాలను కలిగిస్తూ 1885 సం. రం. 3 వ నెంబరుచట్టం చేయబడింది.

నేటాలు ప్రభుత్వం, జస్టిస్ రాగ్ అధ్యక్షతను ఇండియన్ ఇమిగ్రేషన్ కమీషను నేర్పాటు చేసింది. 'వ్యవసాయ రంగంలోనూ, వ్యాపారరంగంలోనూ భారతీయులపోటీ చాలా హెచ్చుగానున్నదని' అధిక సంఖ్యాకులైన యూరోపియనుల అభిప్రాయమని ఆ కమీషన్ నివేదికవల్ల తేలింది.

బిషూనాలాండ్ క్రౌన్ కాలనీగా ప్రకటింపబడింది.

దక్షిణభాగం కొంత క్రౌనుకాలనీగా ఏర్పరుపబడింది.

1886 బిషునాలాండ్‌లోని కొంత భాగం కేపుకాలనీకి చేర్చబడింది.

ట్రాన్సువాలులో బంగారుగనులు కనుగొనబడ్డాయి.

నేటాలులోని యూరోపియనులు అచటి భారతీయుల మీద చేసిన ఆరోపణలను విచారించడానికి కమిషన్ నియమింపబడింది. 1885 సం. రం. 3 నెంబరు చట్టాన్ని, అనగా ఆసియావాసులకు ప్రతికూలంగా తలపెట్టబడిన శాసనాలను సామ్రాజ్య ప్రభుత్వం వ్యతిరేకించదలచుకోలేదు. కాని వర్తకం నిమిత్తం ట్రాన్సువాలులో స్థిరనివాసమేర్పరచుకోడానికి భారతీయులకు హక్కున్నదనిమాత్రం గుర్తించింది.

1887 : 1885 సం. రం. 3 నెంబరు చట్టం సవరింపబడింది. జూలూలాండులోని కొంత భాగంమీద బ్రిటిష్ సామ్రాజ్యాధికారం ప్రకటింపబడింది. కేపుకాలనీలో పార్లమెంటు వోటర్లనమోదు చట్టం ఆమోదింపబడింది.

ఎక్కువగా రాజకీయ సన్నిహితత్వం ఏర్పడడానికి తగిన విధానాలను ఆలోచించడానికి, ప్రప్రథమంగా సమావేశమైన కలోనియల్ కాన్ఫరెన్సు నిరాకరించింది.

జోహాన్సుబర్గు స్థాపింపబడింది.

1888 భారతీయులను ఆఫ్రికాలోని ఆదిమవాసులైన కాఫిర్లతో సమానంగా వర్గీకరణం చేసినందుకూ, రాత్రి 9 గంటల అనంతరం

భారతీయులు వీధుల్లో తిరుగకుండా నిషేధపుటుత్తరువు చేసి నందుకూ అసమ్మతి తెలియచేస్తూ, భారతీయులు పంపుకున్న అర్జీ నిరాకరింపబడింది.

ఇస్మాయిల్ సులేమాన్ కేసులో, ఆసియావాసులు కొన్ని ప్రత్యేక స్థలాల్లో తప్ప వ్యాపారం సాగించకూడదని తీర్పు ఇవ్వబడింది. ఆ తగాదా ఆరెంజిఫ్రీస్టేటు ప్రధాన న్యాయమూర్తి మధ్యవర్తి పరిష్కారానికి పంపబడింది. ఆయన పరిష్కారంలో 1885 సం. రం. 3 నెంబరు చట్టాన్ని అమలు జరుపడానికి గవర్నమెంటుకుగల అధికారం గుర్తింపబడింది. కాని ఆ అమలు కోర్టుల నిర్వచనానికి లోబడాలి.

1889 మాటాబెల్ నుండి రోడ్సు గనులు త్రవ్వుకునే హక్కును సంపాదించాడు. మాటాబెల్ యుద్ధం, విప్లవం ముగిసింది. రొడీషియా జయింపబడింది.

రాణీగారి ఫర్మానా ప్రకారం బ్రిటిష్ సౌత్ ఆఫ్రికా కంపెనీ స్థాపించబడింది.

1890 కేపు దగ్గర, రోడ్సు తన ప్రథమ మంత్రివర్గాన్ని స్థాపించాడు.

బ్రిటిష్ సౌ. ఆఫ్రికా కంపెనీ, మషోనాలాండును ఆక్రమించుకున్నది.

1892 కేపు కాలనీలో వోటింగు హక్కుల చట్టము, వోటింగు చట్టము. ఆమోదింపబడినాయి.

ట్రాన్సువాలులో ఉయిట్‌లాండర్సు నేషనల్ యూనియను స్థాపింపబడింది.

1893 వాల్కసరాద్ (ద. ఆఫ్రికా అసెంబ్లీ) భారతీయుల మీద 1883 సం. రం. 3 నెంబరు చట్టాన్ని అమలు పరచడానికి మార్గాల నన్వేషించాలని తీర్మానాన్ని చేసింది.

నేటాలుకు బాధ్యతాయుత ప్రభుత్వం సిద్ధించింది. సర్ జాన్ రాబిన్‌సన్ నేటాలులో మొదటి మంత్రి వర్గాన్ని ఏర్పాటుచేశాడు.

కేపు కాలనీలో నేటివ్ లేబరు కమీషన్, ప్రతి నేటివ్ (ఆదిమవాసి) మీదా ప్రత్యేకమైన పన్ను విధించాలనీ, ఆసంవత్సరంలో ఇంట్లో లేకుండా ఎక్కడైనా పనిలో ఉన్నట్లు ఋజువైతే ఆ పన్నును రద్దుచేయాలనీ శిఫార్సుచేసింది.

ట్రాన్సువాలులో గనుల యజమానుల సంఘం, నేటివ్ లేబర్ కమీషన్ ఆధ్వర్యాన ఒక ప్రత్యేక కార్మిక సంస్థ నేర్పాటు చేసింది.

1894 నేటాలు బాధ్యతాయుత ప్రభుత్వంలో, ప్రప్రథమంగా ఏర్పడిన పాలకవర్గం, ఇండియన్ ఇమ్మిగ్రేషన్‌కు ఇచ్చేగ్రాంటును రద్దుచేయడానికి పార్లమెంటు అనుమతిని పొందింది. నేటాలులో వోటింగు హక్కుల సవరణ చట్టం మొలకెత్తింది. కేపు కాలనీలో నేటివ్ పురుషుల మీద పన్ను విధించడానికి గ్లెన్‌గ్రే చట్టం అధికారం కలిగించింది.

ట్రాన్సువాలుతో నేటాలు ఒడంబడిక చేసుకుంది.

విట్ వాటర్సురాండ్‌లో బంగారుగనులను, వజ్రాలగనులను కనిపెట్టేరు.

పొండోలాండును కేపుకు కలిపేశారు.

నేటివుల హక్కులకు కొన్ని రక్షణలు కలిగించి, స్వాజీలాండును ద. ఆఫ్రికా రిపబ్లిక్‌లో చేర్చారు.

ఈస్టు లండన్ టౌన్‌లోని రోడ్ల ప్రక్కనున్న బాటలమీద భారతీయులను నడవకుండా చేయడానికి కేపు పార్లమెంటు, మ్యునిసిపాలిటీ వారికి అధికారమిచ్చింది.

1895 స్వాజీలాండ్ మీద ట్రాన్సువాలు రక్షణాధికారాన్ని స్వీకరించింది.

బ్రిటిష్ బెకూనాలాండ్ కేపు కాలనీకి కలుపబడింది.

గవర్నరు జనరల్ యాజమాన్యం క్రింద కేపులో జనరల్ కౌన్సిలు స్థాపింపబడింది.

నేటాల్, 1895 సంవత్సరం 17 వ నంబరు చట్టాన్ని ఆమోదించింది.

1885 సంవత్సరము 3 వ నెంబరు చట్టాన్ని అమలుజరిపే విషయాన్ని పరిశీలించటానికిగాను ట్రాన్సువాలులో కమీషన్ నియమింపబడింది.

ఉయిట్‌లాండర్సు సంస్కరణసంఘాన్ని ఏర్పాటు చేసుకున్నారు.

జోహాన్స్‌బర్గు మీద జేమ్సన్ దాడి. బ్రిటిష్ హైకమీషనరు దానిని ఖండించాడు.

396 నేటాలులో 1896 సంవత్సరం 8 నెంబరు వోటింగుహక్కుల రద్దు చట్టం ప్రవేశపెట్టబడింది.

కేపు ప్రధానమంత్రిత్వానికి రోడ్సురాజీనామా ఇచ్చాడు.

పోర్చుగీసు ఈస్టు ఆఫ్రికాలో కూలీలను రిక్రూటుచేసే డిపోను స్థాపించడానికి, సర్వాధికారాలను ట్రాన్సువాలు నేటివ్ లేబరు కమీషన్ సంపాదించుకుంది.

ట్రాన్సువాలులో 1885 సం. రం. 3 నంబరు చట్టాన్ని గురించిన నివేదికను శాసనసభ (వాల్కసరాద్) ఆమోదించింది.

97 3 వ నెంబరు చట్టం, తెల్లవారికీ నల్లవారికీ మధ్య పెళ్ళిళ్లను నిషేధించింది. నేటాలులో ఎన్నికలు జరిగేయి. ఎస్కోంబే స్థానే బిన్సు అధికారంలోని కొచ్చాడు.

1897 సం. రం. ఇమిగ్రేషన్ రిస్ట్రిక్షన్ ఆక్టు 1 నేటాలులో అమలుజరుపబడింది.

1897 సం. రం. 18 నెంబరు వ్యాపారస్థుల లైసన్సు చట్టం ఆమోదింపబడింది.

ట్రాన్సువాలుకు ఆరెంజిఫ్రీస్టేటుకూ మధ్య, బ్లాంఫాన్‌టీన్ ఒడంబడిక జరిగింది.

కేపు హైకమీషనరుగా మిల్నరు నియామకం.

రాణీగారి వజ్రోత్సవం.

లండన్‌లో బ్రిటిష్ ప్రధానమంత్రితో ఇతరకాలనీల ప్రధాన మంత్రుల ప్రథమ సమావేశం.

1898 బ్లూమ్‌ఫాన్‌టీన్‌లో బ్రిటిష్, ట్రాన్స్‌వాలు ప్రతినిధుల సమావేశం.

నేటాల్, కస్టమ్సు యూనియను (రేవుసుంకాల సంఘం)లో చేరింది.

బాండ్ పార్టీకి నాయకుడుగా ష్రీనర్, కేపు ప్రధానమంత్రియైనాడు; క్రూగర్ తిరిగి అధ్యక్షుడుగా ఎన్నికైనాడు.

ట్రాన్సువాల్ ఆరెంజి ఫ్రీస్టేటుల ఫెడరల్ రాండ్ ప్రప్రథమంగా సమావేశమైంది.

1899 బోయరు యుద్ధం ప్రారంభం. భారతీయుల పట్ల చూపుతున్న నిరాదరణ కూడా ఆయుద్ధానికొక కారణమని బ్రిటిష్ ప్రతినిధులు అభిప్రాయపడ్డారు.

భారతదేశం నుంచి డర్బాన్‌కు బ్రిటిష్ సైన్యాలు దిగేయి.

1900 ఆరెంజి ఫ్రీస్టేటులోని బ్రిటిష్ భూభాగం, ఆరెంజిరివర్ కాలనీగా ప్రకటింపబడింది. ట్రాన్సువాలు జయింప బడింది. 20 వేల మంది నిరాశ్రయులైన బోయర్ స్త్రీలు, పిల్లలు, బ్రిటిష్ నిర్బంధంలో మరణించారు. లాండు సెటిల్ మెంటు కమీషన్ నివేదిక ప్రచురింప బడింది.

1901 జోహాన్సుబర్గులో మ్యునిసిపల్ పరిపాలన స్థాపించబడింది.

1902 వెరినిగింగ్ ఒడంబడికతో బోయర్ యుద్ధం ముగిసింది.

రోడ్సు మరణించాడు.

ప్రిటోరియాలో మ్యునిసిపల్ ప్రభుత్వం స్థాపింపబడింది.

పోర్చుగీసు ఈస్టు ఆఫ్రికా ప్రభుత్వం, తన భూభాగంలో నుంచి దక్షిణాఫ్రికాలో కూలి పనిచేయడానికి రిక్రూటు చేయబడిన ప్రతి నేటివ్ కూలీకీ, 13 షిల్లింగులు భృతినిస్తామన్నారు.

ట్రాన్సువాలులోనూ, ఆరెంజిరివర్ కాలనీలోనూ కొత్త ప్రభుత్వాలు ప్రకటింపబడినాయి.

చేంబర్లేను ద. ఆఫ్రికాను దర్శించాడు. ప్రిటోరియాలోనూ, బ్లూమ్ ఫాన్‌టీన్‌లోనూ, ఒడంబడికలోని కొన్ని షరతులను తొలగించవలెనని బోయరులుకోరిన కోరిక నిరాకరింపబడినది.

1903 శాంతి రక్షణ ఆర్డినెన్సు మూలంగా, ట్రాన్సువాలులోకి భారతీయులకు ధారాళంగా ప్రవేశంలేకుండా చేయబడింది.

ట్రాన్సువాలు బ్రిటిష్ ఇండియన్ సంఘం స్థాపించబడింది. ఏషియాటిక్ కార్యాలయం వారి కార్యక్రమానికి ప్రతికూలంగా వారొక విజ్ఞప్తిని దాఖలు చేసుకున్నారు.

బ్లూమ్‌ఫాన్‌టీన్‌లో కస్టమ్సు యూనియను స్థాపింపబడింది.

ట్రాన్సువాలులోనుంచీ, ఆరెంజి రివర్ కాలనీనుంచీ, ఉద్యోగేతర ప్రతినిధులతో ఇంటర్ కలోనియల్ కౌన్సిల్ ఏర్పాటు చేయబడింది. వారుభయులకు సంబంధించిన విషయాలను గురించి హైకమీషనరుకు సలహా లివ్వడం వారిపని.

బ్లూమ్‌ఫాన్‌టీన్ కన్వెన్షను నేటివ్ వ్యవహారాల విచారణ సంఘాన్ని ఏర్పాటుచేసింది.

రంగుజాతి కూలీలను కంట్రాక్టు పద్ధతిమీద రావించడానికి ట్రాన్సువాల్ లెజిస్లేటివ్ కౌన్సిలు తీర్మానాన్ని అంగీకరించింది.

ట్రాన్సువాలులో 16 ఏండ్ల పైబడిన పురుషులమీదనూ, 13 ఏండ్ల పైబడిన స్త్రీలమీదనూ, సంవత్సరానికి 3 పౌనులచొప్పున పన్ను విధింపబడింది.

1904 క్రూగర్ మరణించాడు. జోహాన్సుబర్గులో ప్లేగు వ్యాపించింది.

ట్రాన్సువాలుకు భారతీయ కూలీలను పంపడానికి ఇండియాలో ఉత్సాహం లేదనీ, అందుకు కారణం నేటాలులో జరిగిన దుస్సంఘటనలనీ కర్జన్ ప్రభువు ఉత్తరం వ్రాశాడు.

చైనా కూలీలను దిగుమతి చేయడానికి చేయబడిన ఆర్డినెన్సును కలోనియల్ ఆఫీసు ఆమోదించింది.

1905 ద. ఆఫ్రికాకు స్వపరిపాలన నొసంగమని కోరడానికి స్మట్సు బ్రిటన్ వెళ్ళేడు. బ్రిటిష్ ప్రధాన మంత్రి కేంప్‌బెల్ బేనర్‌మన్‌వల్ల వాగ్దానం పొందేడు.

'హెట్‌వోక్' (ప్రజాపక్షము) ట్రాన్సువాలులో ఏర్పడింది.
లిటిల్‌టన్ రాజ్యాంగం ప్రకటింపబడింది.

1906 లిట్టిల్‌టన్ రాజ్యాంగ విధానం ట్రాన్సువాలులో రద్దు చేయబడింది. దీనిస్థానే బాధ్యతాయుత పరిపాలన ఒసంగబడింది. ద. ఆఫ్రికా రాజ్యాలనన్నిటినీ కలుపడానికి ఆలోచించమని కేపు ప్రభుత్వం సెల్‌బోరన్ ప్రభువును కోరింది. ఆసియా వాసుల నమోదు చట్టం ప్రకటింపబడింది. భవిష్యత్తులో ఆసియావాసులను వెలిబెట్టే చట్టాలను ఆమోదించారు.

1906 సంవత్సరం ఇమిగ్రేషన్ చట్టం కేపు కాలనీలో ఆమోదింపబడింది.

1907 జూలూ విప్లవం.

ఆరెంజి రివర్ కాలనీకి బాధ్యతాయుత ప్రభుత్వం ఇవ్వబడింది.

భారతీయ కూలీలను గురించి విచారించడానికి ఏర్పాటు చేయబడిన విచారణ సంఘం, వారిని దిగుమతి చేయడానికే శిఫార్సు చేసింది.

ట్రాన్సువాలు జనరల్ ఎన్నికలలో ప్రజాపక్షం (హెట్‌వోక్) అధికారంలో కొచ్చింది. బోథా ప్రధానియైనాడు. చైనీస్ కూలీలచట్టం అంతమైపోయింది.

దక్షిణాఫ్రికాలో రాజకీయ ఐక్యతగురించి సెల్‌బోరన్ ప్రభువు నివేదిక ప్రకటింపబడింది.

లండన్‌లో ప్రధాన మంత్రుల సమావేశం.

1908 మెర్రిమన్ నాయకత్వాన, కేపు జనరల్ ఎన్నికలలో, ద. ఆఫ్రికా పార్టీ అధికారంలో కొచ్చింది.

డర్బాన్‌లో జరిగిన నేషనల్ కన్వెన్షనులో సమాఖ్యకన్న యూనియను రాజ్యాంగ విధానంలోని షరతులే ఎక్కువగా అంగీకరింపబడ్డాయి.

ఐచ్ఛికంగా నమోదు చేసుకున్నవారి రిజిస్ట్రేషను క్రమబద్ధంగాచేస్తూ 36 నెంబరు చట్టంజేయబడింది. రిజిస్ట్రేషన్ చట్టం రద్దుకానందున శాంతియుత శాసనధిక్కారం చేయడానికిభారతీయ నాయకులు నిర్ణయించుకున్నారు.

ఇంటర్ కలోనియల్ కౌన్సిలు రద్దుచేయబడింది.

ట్రాన్సువాలులో ఇంగ్లీషును దచ్చిని ఉపయోగించాలని హెర్టుజాగ్ నిర్బంధశాసనం చేశాడు.

జూలూలాండు విప్లవం అణచివేయబడింది.

1909 యూనియను నిర్మాణమునుగురించి ఒక చిత్తుచట్టాన్ని నేషనల్ కన్వెన్షను నివేదికగా తయారుచేసింది. లండన్‌లోని పార్లమెంటు దానిని ద. ఆఫ్రికా చట్టంగా ఆమోదించింది.

1910 ద. ఆఫ్రికా యూనియను ప్రభవించింది. దక్షిణాఫ్రికా పార్టీ నాయకుడైన జనరల్ బోథా నాయకత్వాన ప్రథమంగా యూనియన్ మంత్రివర్గం ఏర్పడింది. హెర్టుజాగ్, స్మట్సు అందులో మంత్రులుగా ఉన్నారు.

భారతీయులు 1908 సంవత్సరం ఇమిగ్రేషన్‌ను చట్టాన్ని శాంతియుతంగా ఉల్లంఘించారు.

1911 ద. ఆఫ్రికా ప్రభుత్వం ధారాళంగా ఇమిగ్రేషన్‌ను (వలసను) నిషేధించింది.

జనరల్ బోథానాయకత్వాన సంయుక్త దక్షిణాఫ్రికా రాజ్య ప్రతినిధులు మొదటిసారి ఇంపీరియల్ కాన్ఫరెన్సుకు హాజరైనారు.

ఇండియాలో కంట్రాక్టు కూలిపద్ధతి రద్దుచేయబడింది.

1912 బోథానుండి హెర్టుజాగ్ విడిపోయాడు. 'సామ్రాజ్యంకన్న ద. ఆఫ్రికాముందు' అనే నినాదంతో ఒక జాతీయ పక్షాన్ని కూడగట్టేడు. ఆర్థిక వ్యవహారాల విచారణ సంఘం నియమింపబడింది.

1913 భూమి చట్టం ఆమోదింపబడింది. నేటాలులో శాంతియుతమైన చట్టధిక్కారోద్యమం.

నేటాలు సరిహద్దుల గుండా ట్రాన్సువాలులోకి మహాప్రస్థానం. దేశవ్యాప్తంగా సమ్మె.

ఇమిగ్రెంట్సు రెగ్యులేషన్ ఆక్టు 22, 1913, ఇండియన్ రిలీఫ్ ఆక్టుప్రకారం మూడు పౌనుల పన్ను రద్దుచేయబడింది. ద. ఆఫ్రికా ప్రభుత్వం నియమించిన సోలమన్ విచారణ సంఘాన్ని భారతీయులు బహిష్కరించారు.

స్మట్సు-గాంధీ ఉత్తర ప్రత్యుత్తరాలు ; కోరికలు అంగీకరింప బడడంచేత ఉద్యమం విరమింపబడింది.

ఆర్థిక సంబంధముల చట్టం (1913 సంవత్సరం 10 నెం. చట్టం) ఇమిగ్రేషను ఆక్టు (1913 సంవత్సరం 13 నెం. చట్టం) ఆమోదింపబడ్డాయి.

1914 సమ్మె-సిండికేలిస్టు నాయకులను ప్రవాసానికి పంపి స్మట్సు అక్రమం చేశాడు. సమ్మె నీరుగారిపోయింది.

స్మట్సు - గాంధీ ఒడంబడిక—గాంధీజీ ద. ఆఫ్రికావదలి ఇండియా చేరుకున్నాడు.

---

# కొన్ని వివరాలు

*అబ్దుల్లా దాదా :* దర్బాన్‌లోని ప్రముఖ భారతీయ వ్యాపార సంస్థ, దాదా అబ్దుల్లా అండు కంపెనీ యజమాని. ఆయన కేసులో పనిచేయడానికే గాంధీజీ మొదట్లో ద. ఆఫ్రికా వెళ్ళేరు.

*ఆదామ్ అబ్దుల్ కరింహాజీ :* దాదాఅబ్దుల్లా అండు కంపెనీ మేనేజింగు భాగస్వామి. 1898 సంవత్సరం ఇండియన్ ఫ్రాంచైజ్ బిల్లును ప్రతిఘటించడానికి ఏర్పరుప బడిన మొదటి సంఘానికి అధ్యక్షుడు.

*ఆలిన్‌సన్, డాక్టర్ టి. ఆర్ :* ఆరోగ్యంమీదా పారిశుద్ధ్యంమీద అనేక పుస్తకాలు వ్రాసిన గ్రంథకర్త. గాంధీజీకి అవెంతో ఉపయోగపడ్డాయి. లండన్ వెజిటేరియన్ సొసైటీలో కొంతకాలం సభ్యుడు. సంతాన నిరోధం విషయంలో ఆయనకుండిన తీవ్ర అభిప్రాయముల వలన సొసైటీ నుండి తప్పుకున్నాడు. 1914 సం. రం. లో గాంధీజీ ఊపిరితిత్తులలో నీరుపట్టి జబ్బుపడినప్పుడు ఆయనకు చికిత్సచేశాడు.

*అన్‌స్టే, థామస్ ఛిషోమ్, (1816–1873) :* న్యాయవాది, రాజకీయవేత్త; పార్లమెంటు సభ్యుడు (1847–52).

*బెల్, సర్ హెన్రీ :* ప్రముఖ న్యాయవాది. నేటాల్ శాసనసభ సభ్యుడు. 1904 మొ. 1909 వరకూ నేటాల్ అడ్మినిస్ట్రేటరు.

*బెనర్జీ, సర్ సురేంద్రనాథ్ (1848–1925) :* ప్రముఖుడైన మితవాద రాజకీయవేత్త. 1890 సం. రం. లో ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ రాయబార వర్గంలో సభ్యుడుగా బ్రిటన్ వెళ్ళేడు. 1893 మొ. 1901 వరకూ బెంగాల్ లెజిస్లేటివ్ కౌన్సిలులో సభ్యుడు. కలకత్తానుండి వెలువడే 'బెంగాలీ' అనే ప్రముఖ పత్రికకు యజమాని, సంపాదకుడు. మాంట్ ఫర్డు సంస్కరణల క్రింద వైస్రాయి కార్యనిర్వాహక వర్గంలో సభ్యుడై నాడు. 1895, 1902 సంవత్సరాలలో కాంగ్రెస్ అధ్యక్షుడు.

*బార్బర్‌టన్ :* ట్రాన్సువాలులో ఒక పట్టణం. ప్రిటోరియాకు 288 మైళ్ళు ఉన్నది.

*భావనగర్ :* కథియావాడ్‌లోని ఒక స్వదేశ సంస్థానం. ఇప్పుడు బొంబాయి రాష్ట్రంలో కలిసిపోయింది.

*బిన్సనర్ హెన్రీ* (*1837–1899*) : 1894 సం. రం. లో నేటాలు ప్రభుత్వం ఇండియా ప్రభుత్వంతో కంట్రాక్టు కూలీ పద్ధతిని సవరించే విషయంలో సంప్రదించడానికి పంపిన ఇద్దరు సభ్యుల సంఘంలో ఒకడు. నేటాలు అసెంబ్లీలో ప్రతికూలపక్ష నాయకుడు. ఎస్కోంబీ తర్వాత నేటాల్ ప్రధాన మంత్రి.

*బర్డ్‌వుడ్, సర్ జార్జి క్రిస్టోఫర్ మోల్సువర్తు* (*1832–1917*) : ఇండియాలో జన్మించి, బొంబాయి మెడికల్ సర్వీసులో 1854 వరకూ పనిచేశాడు. తర్వాత 30 ఏండ్లపాటు లండన్‌లో ఇండియా ఆఫీసులో పనిచేశాడు. 'ఇండియా' ఆఫీసులోని 'పాతదస్తరాల నివేదిక,' 'ఇండియాలోని పారిశ్రామిక కళలు' అనే రెండు గ్రంథాలను రచించాడు.

*బ్లూం ఫాన్‌టీన్* : ఆరెంజి ఫ్రీస్టేటు ముఖ్యపట్టణం, 1910 సంవత్సరం. అనంతరం ద. ఆ. యూనియన్ ప్రధాన న్యాయస్థానం. జోహాన్సుబర్గుకు 254 మైళ్ళల్లో ఉన్నది.

*బూత్, డాక్టర్* : డర్బాన్‌లోని సెయింట్, అయిదాన్సు మిషన్ ప్రధాని, భారతీయులు నిర్మాణం చేసిన చిన్న ఆస్పత్రికి పర్యవేక్షకుడు. 1899 సం. రం. బోయరు యుద్ధంలో భారతీయ అంబ్యులెన్సుకోరును తరిఫీదు చేయడంలో సహాయపడ్డాడు.

*బరన్స్, జాన్,* (*1858–1943*) : బ్రిటిష్ పార్లమెంటులో ప్రముఖ కార్మిక పక్ష సభ్యుడు (1897–1918). 1889 లో లండన్‌లో డాక్ పనివారల సమ్మె జరిగినపుడు ప్రముఖ పాత్ర వహించాడు.

కెయిన్, *విలియం స్ప్రాస్టన్* (*1842–1903*) : నాల్గుసార్లు బ్రిటిష్ పార్లమెంటు కెన్నుకోబడ్డాడు. కాంగ్రెస్‌యొక్క బ్రిటిష్ శాఖలో, పార్లమెంటరీ ఉపసంఘములో సభ్యుడు. భారత స్వపరిపాలనా వాంఛను బలపరిచాడు. దక్షిణాఫ్రికాలోని భారతీయుల విషయంలో చాల శ్రద్ధ వహించేవాడు.

*కేంబెల్, హెన్రీ* : న్యాయవాది, ట్రాన్సువాలులోని భారతీయ వర్తకులకు ముఖ్య ప్రతినిధి. వారితరఫున అర్జీలు వ్రాసి దాఖలు చేసేవాడు.

*కమరుద్దీన్, మహమ్మద్ కాశిం* : జోహాన్సు బర్గులో ఉండే భారతీయ వర్తకుడు నేటాల్ ఇండియన్ కాంగ్రెసులో చురుకుగా పనిచేసేసభ్యుడు.

*కేప్ టౌన్* : ద. ఆఫ్రికాలోకల్లా ఆదినగరం (మదర్ సిటీ) కేపు ప్రావిన్సుకు రాజధాని. యూనియను శాసనసభలకు ఉనికిపట్టు.

*చేంబర్లేన్, జోసెఫ్ (1836–1914 :)* కాలనీల సెక్రటరీ ఆఫ్ స్టేట్. 1902 సంవత్సరములో ద. ఆఫ్రికాను సందర్శించాడు. ఆయన హయాంలోనే క్రూగర్‌తో రాజీప్రయత్నాలు విఫలమై బోయరుయుద్ధం సంభవించింది. ఆ తర్వాత వెరీనిగింగు ఒడంబడిక జరిగింది. ట్రాన్సువాలు, నేటాలులలో యుద్ధానంతర పునర్నిర్మాణానికి మిల్నర్ ప్రభువుకు తోడ్పడ్డాడు. 1903 సంవత్సరంలో రాజీనామా ఇచ్చాడు.

*ఛార్లెస్ టౌన్ :* డర్బానుకు 318 మైళ్లలో నేటాలు అంచున ఉన్న పట్టణం.

*చార్టర్ అక్టు 1833 :* పార్లమెంటరీ విచారణ సంఘంయొక్క నివేదిక ఫలితంగా, భారతదేశంలో ఈస్టిండియా కంపెనీవారికి వ్యాపారం చేసుకునే హక్కులను రద్దుచేసినచట్టం. వ్యాపారానికి బదులు అక్కడ సంపాదించుకున్న భూమిని పాలించే హక్కివ్వబడింది. 1853 సంవత్సరంలో ఆ చట్టమే పునరుద్ఘాటింప బడింది. ఈ అక్టు, మతం, రంగు, జన్మస్థలం, తలితండ్రులు కారణంగా, భారతీయులను ఈస్టిండియా కంపెనీలో ఉద్యోగాలకు అనర్హులను చేయకూడదని హామీ ఇచ్చింది.

*క్రానికన్ పాశ్చాలె :* ఆదం మొదలు 629 క్రీ. శ. వరకూ జరిగిన సంఘటనల క్రమణిక. 7 వ శతాబ్దంలో అది సంకలనం చేయబడిందని అంటారు.

*దాదా, హజీమహ్మద్ హాజీ :* ప్రముఖ వర్తకుడు, భారతీయులకు నాయకుడు. వోటింగు హక్కుల చట్టాన్ని ప్రతిఘటించేటందుకు 1893 సంవత్సరంలో జరిగిన ప్రథమ సభకు అధ్యక్షుడు. నేటాల్ ఇండియన్ కాంగ్రెసుకు ఉపాధ్యక్షుడు 1894–9.

*డెల్గోవాబే :* రేవు పట్టణం. వ్యాపార కేంద్రం. డర్బాన్‌కు ఉత్తరాన 296 మైళ్లలో ఉన్నది. పోర్చుగీస్ తూర్పు ఆఫ్రికాకు ముఖ్యపట్టణం: 'లొరెన్కో మార్కెస్' అనికూడా అంటారు.

*ధంధూకా :* కథియావాడ్‌లో ఒక చిన్న పట్టణం.

*ధోలా :* కథియావాడ్ (సౌరాష్ట్ర) లో రైల్వే జంక్షన్.

*డండీ :* డర్బానుకు 250 మైళ్లలో ఉన్న చిన్న పట్టణం.

*డర్బాన్ :* రేవు పట్టణం. వాణిజ్యానికి ముఖ్యకేంద్రం, నేటాలుకు ప్రవేశద్వారం. జోహాన్సు బర్గుకు 484 మైళ్లలో ఉంది.

*ఈస్టు లండన్ :* కేపుకాలనీకి రేవుపట్టణం. ముఖ్యమైన కోస్తా పట్టణం.

*ఎల్గిన్, లార్డు (1849–1917) :* భారతదేశ రాజప్రతినిధి 1894–9; దక్షిణాఫ్రికా యుద్ధాన్నిగురించి విచారించడానికి నియమింపబడిన సంఘానికి అధ్యక్షుడు. 1905 మొ 1908 వరకూ కాలనీలకు సెక్రటరీ ఆఫ్ స్టేట్.

*ఎస్కోంబె, సర్ హేరీ* (**1838–99**)**:** నేటాల్ సుప్రీంకోర్టులో ప్రముఖ న్యాయవాది. నేటాల్ సుప్రీంకోర్టులో వకీలు పనిచేయడానికి గాంధీజీకి అనుమతి ఇవ్వవలెనని వాదించాడు. 1897 సంవత్సరంలో నేటాల్‌కు ముఖ్యమంత్రి.

*ఎషవ్వీ* **:** జూలూలాండ్ రిజర్వుకు పరిపాలనా కేంద్రం.

*ఎసాట్రిక్ క్రిస్టియన్ యూనియన్* **:** 1891 సంవత్సరంలో ఎడ్వర్డు మెయిట్‌లాండు స్థాపించిన ఈ సంఘానికి గాంధీజీ 1894 సంవత్సరంలో ప్రతినిధి (ఏజంటు) అయినాడు. ఎసాట్రిక్ అనే మాటలో ఒక విధమైన తాంత్రిక వ్యవహారం స్ఫురిస్తుంది. దివ్యజ్ఞాన రహస్య సిద్ధాంతము నంగీకరించిన వారికొరకిది ఉద్దేశింపబడింది.

*ఎస్టుకోర్టు* **:** డర్బానుకు 150 మైళ్లలోనున్న ఒక పట్టణం.

*ఫాసెట్, హెన్రీ* (**1833–1884**) **:** కేంబ్రిడ్జిలో రాజకీయ ఆర్థికశాస్త్రాచార్యుడు. రాజకీయవేత్త. పార్లమెంటులో భారత ఆర్థిక రాజకీయ విషయాలను గురించి ప్రత్యేక కృషిచేశాడు.

*గనీ, అబ్దుల్* **:** ట్రాన్సువాలులో నివసిస్తుండే వారందరిలోకి ప్రథముడు. జోహాన్సుబర్గులోని మహమ్మద్ కాశిం కమరుద్దీన్ కంపెనీలో భాగస్వామి. మేనేజరు. దక్షిణాఫ్రికాలో గాంధీజీ ముందుగా పరిచయం చేసుకున్న వారిలో ఒకరు. 1903 లో స్థాపింపబడిన ట్రాన్సువాల్ బ్రిటిష్ ఇండియన్ అసోసియేషన్‌కు అధ్యక్షుడు.

*జర్మిస్టన్* **:** ట్రాన్సువాల్‌లోని ముఖ్యమైన రైల్వేస్టేషను.

*హెబర్, బిషప్ రెజినాల్డ్* (**1783–1826**)**:** కలకత్తా బిషప్. కలకత్తాలో బిషప్‌కాలేజీ స్థాపకుడు. భారత దేశంలో బాగా సంచారం చేసినవాడు.

*హంటర్, సర్ విలియం విల్సన్* (**1840–1900**)**:** 25 సంవత్సరాలు ఇండియాలో పనిచేశాడు. 'ఇండియన్ ఎంపైర్' మొదలైన గ్రంథాలనెన్నిటినో రచించాడు. 14 సంపుటాలలో 'ఇంపీరియల్ గెజెటీర్ ఆఫ్ ఇండియా'ను సంకలనం చేశాడు. 1881 మొ. 1887 వరకూ వైస్రాయి లెజిస్లేటివ్ కౌన్సిలులో సభ్యుడు. ఉద్యోగంనుండి విరమించిన పిమ్మట బ్రిటన్‌లోని కాంగ్రెస్ కమిటీలో సభ్యుడైనాడు. 1890 మొదలు టైమ్సు పత్రికకు భారత సమస్యలమీద ప్రత్యేక వ్యాసాలు వ్రాస్తూ ఉండేవాడు.

*ఐరిష్ హోం రూలు బిల్లు* : 1886 సంవత్సరం లో బ్రిటిష్ పార్లమెంటులో గ్లాడ్‌స్టన్ ఈ బిల్లును ప్రవేశపెట్టేడు. ఐరిష్ పరిపాలనను ఐరిష్ పార్లమెంటుచే నియమింపబడిన కార్య నిర్వాహకులకు వప్పచెప్పే చాలా సాధారణమైన బిల్లు. కాని పన్నులను విధించే అధికారంమాత్రం చాలావరకు బ్రిటిష్ గవర్నమెంటులోనే ఉన్నది. ఇంగ్లండులోనూ, అల్‌స్టరు లోనూకూడా ఆ బిల్లుకు చాలా తీవ్రమైన ప్రతిఘటన కలిగింది. కామన్సు సభలో అది నిరాకరింపబడింది. మరల 1893 సం. రం. లో గ్లాడ్‌స్టన్ అధికారంలో కొచ్చినపుడు హోం రూలు బిల్లును ప్రవేశపెట్టాడు. దానిని కామన్సు సభ అంగీకరించింది. కాని ప్రభువుల సభలో అత్యధిక సంఖ్యాకుల చేత నిరాకరింపబడింది.

*ఇస్మాయిల్ సులేమాన్ కేసు* : 1888 సంవత్సరంలో భారతీయ ముస్లిం వ్యాపారస్థుడైన ఇస్మాయిల్‌సులేమాన్‌కు, ప్రత్యేకింపబడిన చోట తప్ప ఇతర చోట్ల వ్యాపారం చేసుకునేందుకు లైసెన్సు నిరాకరింపబడింది. ఆరెంజి ఫ్రీస్టేటు ప్రధాన న్యాయమూర్తి మధ్యవర్తి పరిష్కారంలో దక్షిణ ఆఫ్రికా రిపబ్లిక్‌కు అందుకు సంబంధించిన 1885 సంవత్సరం 3 వ నెంబరు చట్టాన్ని అమలుజరిపే అధికారముందన్నారు. అయితే దేశం లోని న్యాయ స్థానాల అన్వయానికి లోబడాలన్నారు. ట్రాన్సువాలు సుప్రీం కోర్టువారు, ఆ తీర్పును నిరాకరించి, ఆసియావాసులకు లైసన్సు లను నిరాకరించడానికి ప్రభుత్వాని కధికారం లేదన్నారు.

*జెట్‌పూర్* : సౌరాష్ట్రలో ఒక రైలుస్టేషన్.

*జోహాన్సుబర్గు* : విట్‌వాటర్సురాండ్‌లోని నగరం. ట్రాన్సువాలులోకల్లా ధనవంతమైన బంగారు గని.

*జునాగడ్* : సౌరాష్ట్రలో పూర్వమొక స్వదేశస్థానం. ఇప్పుడు బొంబాయి రాష్ట్రంలో లీనమై పోయింది.

*కథియావాడ్* : ఇప్పుడు సౌరాష్ట్రమని అంటున్నారు. చిన్న చిన్న సంస్థానాధీశుల కూటం.

*కెన్సింగ్‌టన్* : లండనుకుచేరి ఉన్న ఒకపేట.

*కింగ్సుఫర్డు, డాక్టర్ అన్నా* : వైద్యుడు శాకాహారి. 'భోజన విధానంలో నిర్దుష్టమైన మార్గం' అనే పేరుతో ఆయన అభిప్రాయాలు ప్రచురితమైనాయి. తర్వాత ఎడ్వర్డు మెయిట్‌లాండుతోకలసి 'శాకాహారమును గురించి ఉపన్యాస ములు' మొదలైన పుస్తకాలను రచించాడు.

*లౌటన్ యఫ్. ఏ.* : డర్బాన్‌లో లాయరు. భారతీయులకు వకీలుగానూ, సలహాదారుగానూ పనిచేసేవాడు. గాంధీజీతోపాటు కోర్టుల్లో పని చేసేవాడు.

లా ***3, 1885*** : ఒక ట్రాన్సువాలు చట్టము. 'కూలీ' అని పిలువబడే అరబ్, మలేలకూ టర్కిష్ సామ్రాజ్యంలోని మహమ్మదీయులకూ వర్తిస్తుంది. రిపబ్లిక్‌లో స్థిరాస్తి సంపాదించుకోవడానికీ, విస్తృత పరుపబడిన పౌరసత్త్వపు హక్కులను పొందడానికీ ఈ చట్టం వారిని అనర్హులనుచేసింది. పిమ్మట, పారిశుద్ధ్య కారణాలవల్ల ప్రత్యేకింపబడిన కొన్ని ప్రత్యేక పేటలలోనూ, వీధుల్లోనూ స్థిరాస్తి సంపాదించుకున్న కూలీలను మినహాఇస్తూ శాసనసభ తీర్మానించింది. మరల 1893 సంవత్సరంలో ఆసియావాసులందరూ కొన్ని పేటల్లో మాత్రమే కాపురముండి కొన్ని ప్రాంతాల్లో మాత్రమే వ్యాపారం చేసుకోవాలని నిర్బంధంచేస్తూ శాసనసభ తీర్మానించింది. 3 పౌనులు రుసుము చెల్లించి రిజిస్ట్రేషను చేసుకున్నవారే వ్యాపారం చేసుకోవాలని ఈ చట్టంలో తీర్మానించబడింది. ఈ చట్టము లండన్ కన్వెన్షన్ నిర్ణయాలకు భిన్నమని భావించబడింది.

*లండన్ కన్వెన్షన్* : బ్రిటిష్‌వారికీ బోయర్లకూ 1884 సంవత్సరం ఫిబ్రవరి 27 వ తేదీని జరిగిన ఒడంబడిక 14 వ నెంబరు షరతుప్రకారం, (నేటివ్‌లు) ఆదిమ వాసులుతప్ప మిగిలిన వారందరూ దక్షిణాఫ్రికాలో (ట్రాన్సువాలులో గాని) ప్రవేశించి ఆస్తిపాస్తులు సంపాదించుకోడానికీ, వ్యాపారం చేసుకోవడానికీ, స్వేచ్ఛగా సంచారం చేయడానికీ ఎట్టి అభ్యంతరంలేకుండా చేయబడింది. బోయరు ప్రభుత్వం 'నేటివ్' అంటే భారతీయులు కూడానని అర్థం చెప్పడానికి ప్రయత్నించింది. కాని బ్రిటిష్ ప్రభుత్వం ఆ వాదాన్ని నిరాకరించింది.

*మెయిన్, సర్ హెన్రీసూనర్* ***(1822–1888)*** : గొప్ప న్యాయశాస్త్ర వేత్త. 'పురాతన ధర్మశాస్త్రం', 'ప్రాక్ పశ్చిమ ఖండాల్లో పాతకాలంనాటి గ్రామీణ సంస్థల చరిత్ర', మొదలైన గ్రంథాలను రచించాడు. 1862 మొ. 69 వరకూ, మరల 1871 సంవత్సరంలోనూ ఇండియా కౌన్సిలులో మెంబరు.

*మెయిట్‌లాండ్, ఎడ్వర్డు* ***(1824–1897)*** : తాంత్రిక విజ్ఞానాన్ని గురించిన రచయిత. శాఖాహార దీక్షగలవాడు. 1891 సంవత్సరంలో ఇసాట్రిక్ క్రిస్టియన్ కమిషన్‌ను స్థాపించాడు. గాంధీజీ ఆయనతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి చాలావరకు ఆయన గ్రంథాల ప్రభావానికిలోనైనాడు.

*మెహతా, సర్ ఫిరోజ్‌షా (1845–1915)* : భారతీయ నాయకుడు. చాలా కాలం బొంబాయిలోని ప్రజాహిత జీవితానికి నాయకత్వం వహించాడు. బొంబాయి ప్రెసిడెన్సీ అసోసియేషన్ స్థాపకులలో ఒకరు. బొంబాయి మ్యునిసిపల్ కార్పొరేషన్‌కు ముమ్మారు చెయిర్‌మన్‌గా ఎన్నికైనాడు. కొంతకాలం బొంబాయి లెజిస్లేటివ్ కౌన్సిలులో సభ్యుడు. పిమ్మట వైస్రాయి కార్యనిర్వాహక కౌన్సిల్‌లో సభ్యుడు. 1885 సంవత్సరంలో కాంగ్రెస్ నిర్మాతలలోనొకరు. 1890 లోనూ 1906 లో నూ రెండుసార్లు కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు.

*మెల్‌మోత్* : జూలూలాండులో టౌన్‌షిప్.

*మైసూర్* : దక్షిణ భారతదేశంలో పూర్వమొక స్వదేశ సంస్థానము.

*నౌరోజీ, దాదాభాయి (1825–1917)* : భారతరాజకీయ వేత్తలలో ఆది పురుషుడు. 'భారత పితామహుడు' అని చెప్పుకుంటారు. 1886 లోనూ, 1893–1906 లోనూ మూడుసారులు కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. కాంగ్రెస్ పరమావధి స్వరాజ్యమని లేక స్వాతంత్ర్యమని ప్రప్రథమంగా చాటేడు. 1893 సంవత్సరంలో పార్లమెంటు మెంబరుగానూ, లండన్‌లోని బ్రిటిష్ కాంగ్రెస్ కమిటీ ప్రముఖ సభ్యుడుగానూ, భారతీయులకూ, దక్షిణాఫ్రికాలోని భారతీయులకూ అపారమైన సేవచేశాడు.

*నాజర్, మన్‌సుక్‌లాల్ హీరాలాల్ (1862–1906)* : 1896 సంవత్సరం డిసెంబరు నెలలో దక్షిణాఫ్రికాకు తరలివెళ్లిన బుద్ధిశాలియైన విద్యార్థి. 1897 సంవత్సరంలో దక్షిణాఫ్రికాలోని భారతీయుల తరఫున ఇంగ్లండులో ప్రచారం చేయడానికి నియమింపబడ్డాడు. ప్రజాహిత జీవితంలోనూ, నేటాలులో భారతీయ ఉద్యమంలోనూ ప్రముఖ పాత్రనువహించాడు.

*న్యూకేసిల్* : నేటాలులో ఒక పట్టణం. రాతిసిబొగ్గు, మొక్కజొన్న, ఉన్ని, పుగాకులకు ప్రసిద్ధి.

*నాన్‌ద్వేని* : జూలూలాండులో భాగం. టౌన్‌షిప్.

*ఉస్మాన్, దాదా* : నేటాలులో ప్రముఖుడైన భారతీయ వ్యాపారస్థుడు. నేటాల్ ఇండియన్ కాంగ్రెసుకు కార్యదర్శిగా ఉండేవాడు. సాత్విక నిరోధోద్యమంలో పాల్గొన్నాడు.

*పీటర్ మారిజ్‌బర్గ్* : నేటాలుకు ముఖ్య పట్టణం. పి. యం. బర్గ్ లేక మారిజ్‌బర్గ్ అని కూడా అంటారు. డర్బాన్‌కు 71 మైళ్లల్లో ఉన్నది. కలోనియల్ ఆఫీసు అక్కడే ఉన్నది.

*పైన్‌టౌన్* : డర్బాన్‌కు 17 మైళ్లల్లో ఉండే చిన్న టౌన్‌షిప్పు.

*పోర్టు ఎలిజబెత్ :* కేపుకాలనీలో రెండవనగరం. రేవుపట్టణం.

*ప్రిటోరియా :* యూనియన్ పరిపాలనకు రాజధాని. డర్బాన్‌కు 511 మైళ్లలో ఉన్నది.

*రాజకోట :* సౌరాష్ట్రంలోని ఒక స్వదేశ సంస్థానం. గాంధీ వంశీకుల స్వస్థానం.

*రిచ్‌మండ్ :* పీటర్‌మారిజ్‌బర్గు సమీపంలో ఉండే ఒక పట్టణం.

*రిప్పన్, లార్డు (1827–1909) :* 1880–1884 వరకూ భారతదేశంలో రాజ ప్రతినిధి. 1892 నుంచి 1895 వరకూ కాలనీలకు సెక్రటరీ ఆఫ్ స్టేటు. ఆయన తర్వాత ఛాంబర్లేన్ వచ్చాడు.

*రాబిన్‌సన్ సర్ జాన్ (1839–1903) :* 1887 సంవత్సరంలో లండన్‌లో జరిగిన వలసరాజ్యాల మహాసభలో నేటాల్ ప్రతినిధి. నేటాలుకు ప్రథమ ప్రధాని, కలోనియల్ సెక్రటరీ (1893–1897).

*రుస్తుంజీ, పార్సీ :* దానధర్మాసక్తుడూ, ప్రజాహిత జీవితాభిలాషీ అయిన భారతీయవర్తకుడు. గాంధీజీకి మొదట సహచరుడు. మిత్రుడు. తర్వాత క్లయింటు. నేటాల్ ఇండియన్ కాంగ్రెసుకూ దాని కార్యక్రమాలకూ బాగా మద్దతు చేసేవాడు.

*శాలిస్‌బరీ :* దక్షిణ రొడీషియా రాజధాని.

*శాక్సన్ విటన్ :* విటనాజిమోట్ అనేమాటనుండి పుట్టింది. అనగా ఆంగ్లో శాక్సన్ రాజులకు సలహాఇచ్చే కౌన్సిలు. రాజులు కోరినప్పుడు వారికి సలహా ఇచ్చేవారు.

*శకుంతల :* భారతకవి, నాటకకర్త అయిన కాళిదాసుని నాటకము. (400 క్రీ. అనంతరము).

*సోరత్ :* సౌరాష్ట్రలో ఒక జిల్లా.

*స్టేంగర్ :* డర్బాన్‌కు ఉత్తరాన ఉన్న ఒక చరిత్రాత్మకమైన గ్రామం.

*సిడెన్‌హాం :* డర్బాన్‌లో ఒక పేట.

*ట్యూటానిక్‌మార్క్ :* ఉత్తర యూరోపు ప్రజలలో ఉంటూ ఉండిన ఒక సమావేశ విధానం. వారందరూ ఒకరికొకరికి బంధువులు. వారి భూములను సమిష్టి వ్యవసాయం చేసుకుంటూ తమ సమావేశంలో న్యాయాన్యాయాలు పరిష్కరించుకుంటూ ఉండేవారు.

***త్యాబ్జీ, బదురుద్దీన్ (1844–1906)*** : బొంబాయి ప్రెసిడెన్సీ అసోసియేషన్‌లో ప్రముఖ సభ్యుడు. పేరు కధ్యక్షుడెవరైనా నిజానికి దాని కాయనే అధ్యక్షుడు. 1887 సంవత్సరంలో మద్రాసులో జరిగిన కాంగ్రెస్ మహాసభ కధ్యక్షుడు. 1895 సంవత్సరంలో బొంబాయి హైకోర్టులో న్యాయమూర్తి. దక్షిణ ఆఫ్రికాలోని భారతీయులను బాధ పెడుతున్నందుకు అసమ్మతి సూచకంగా కొనసాగింపబడిన ఉద్యమాన్ని గట్టిగా బలపరిచాడు. 1882 సంవత్సరంలో బొంబాయి లెజిస్లేటివ్ కౌన్సిలుకు నియమితుడైనాడు. మ్యునిసిపల్ వోటింగు హక్కులకు సంబంధించిన బిల్లును ప్రవేశపెట్టడానికి కారకుడు.

***ఉమ్తాలీ*** : దక్షిణ రొడీషియాలో ఒక జిల్లా. ఆ పేరుగల పట్టణంకూడా ఉన్నది. యూరోపియనులకు పెద్ద ఉనికిపట్టు.

***వెరులాం*** : డర్బాన్‌కు 19 మైళ్ళల్లోనున్న చరిత్రాత్మకమైన ఒక టౌన్‌షిప్. స్వతంత్రులైన భారతీయులక్కడ స్థావరమేర్పరచుకున్నారు.

***వాల్కుగ్రస్టు*** : డర్బాన్‌కు 308 మైళ్ళ దూరంలో ఉన్న నేటాలుపట్టణం.

***వెబ్, ఆల్‌ఫ్రెడ్*** : పార్లమెంటు మెంబరు. తరచు *ఇండియా* మొదలైన పత్రికలకు దక్షిణ ఆఫ్రికా భారతీయ సమస్యలమీద వ్యాసాలు వ్రాస్తుండేవాడు. 1894 మద్రాసు కాంగ్రెసుకు అధ్యక్షుడు. బ్రిటిష్ కమిటీలో సభ్యుడు.

***వెడర్‌బరన్, విలియం*** : ఇండియాలో బొంబాయి సివిల్ సర్వీసులో 25 సంవత్సరాలు ఉద్యోగం చేశాడు. పింఛను పుచ్చుకున్నాక 1900 సంవత్సరం వరకూ పార్లమెంటు మెంబరుగా ఉండేవాడు. 1893 సంవత్సరంలో కాంగ్రెస్‌యొక్క బ్రిటిష్ కమిటీకి అధ్యక్షుడు. 1910 సంవత్సరంలో జరిగిన కాంగ్రెస్‌కు అధ్యక్షుడు.

***వెల్లింగ్‌టన్*** : కేపుకాలనీలో ఒక పట్టణం.

---

Printed by the DIRECTOR, Andhra Pradesh Govt. Text Book Press,
Mint Compound, HYDERABAD-22, A. P., INDIA
1963

